

# భర్తృహరిసుభాషితము



సంస్కృతవ్యాఖ్యానాంధ్రపద్యటీకాతాత్పర్య

సహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1949

# పీఠిక

"ఓం నమః పరమార్థైకరూపాయ పరమాత్మనే.
స్వేచ్ఛావభాసితాసత్యభేదభిన్నాయ శంభవే."

"సుభాషిత త్రిశతి" కర్త యగు భర్తృహరి విఖ్యాత సంస్కృత భాషా ప్రాచీనకవులలో నొకఁడు. అతనిని అతనిగ్రంథములనుగూర్చి విశ్వసనీయములగు చారిత్రికాధారములు కానరావు. అతని జీవితము లోని కొన్నిసంభవములు మాత్రము కథారూపమున అనుశ్రుతముగా సంప్రదాయబద్ధమై లోకమున వ్యాపించియున్నను నవి యొండొంటికి పొందిపొసఁగి యుండకపోవుటచే నానావిధగాథలకును సామరస్య మేర్పఱుచుట దుస్సాధ్యమే యగును. భర్తృహరి ఉజ్జయినీ రాజ వంశ్యుఁ డనియు తనకు రాజ్యపరిపాలనార్హత యున్నను తనభార్య దుశ్శీలముచే సంసారమునకు రోసి రాజ్యమును తనతమ్ముఁడగు విక్ర మార్కున కప్పగించి తాను వానప్రస్థుఁ డయ్యె ననియు నొకప్రతీతి గలదు. ఈవిక్రమార్కుఁడే విక్రమశకాబ్దమునకు మూలపురుషుఁడు. అది యటుండ నిండు. భర్తృహరివిరచితము లగు శతకములనుండి యత నికి జీవితమున నాశాభంగము మిక్కిలిగ నేర్పడె ననియు, స్వకుటుంబ మునో యిరుగుపొరుగులనో సూక్ష్మదృష్టితోఁ బరిశీలించుటవలన స్త్రీల శీలమున నతనికి సంశయము బలపడె ననియు విస్పష్ట మగును. అతనిని గూర్చి గ్రంథస్థమైన విషయములలోఁ గొన్నింటి నిట పేర్కొందము.

1. పూర్వోక్త సంఘటనను వివరించుచో నొకానొక గ్రంథమున భర్తృహరి భార్యపేరు అనంగసేన అని యున్నది. 2. ఇంకొక గ్రంథ మున భర్తృహరితండ్రి వీరసేనుఁ డను గంధర్వుఁ డనియు నీతనికి భర్తృహరి విక్రమాదిత్యుఁడు సుభటవీర్యుఁ డను ముగ్గురుకుమారులును మైనావతి యను కుమార్తెయును గా నలుగురు సంతానమనియుఁ దెలియు

వచ్చును. 3. భర్తృహరిభార్య పద్మాక్షి యని యింకొక కథ. 4. భర్తృహరితల్లి సుశీల; ఆమెమూలమున నితఁడు మాతామహుని రాజ్యమున కధికారియై దానిని తనసోదరుఁడు విక్రమాదిత్యున కొసఁగె నని యింకొక గాథ. 5. చంద్రగుప్తుఁ డను బ్రాహ్మణునకు నాల్గువర్ణములనుండియు నల్గురుభార్య లనియు వారికి యథాక్రమమున వరరుచి, విక్రమార్కుఁడు, భట్టి, భర్తృహరి యను కుమారులు జనించి రని మఱియు నొకగాథ. 6. మఱియొకగాథ ననుసరించి విక్రమాదిత్యునకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కాంతలు నలువురుభార్య లనియు వారియందు వరుసగా వరరుచి, విక్రమార్క, భట్టి, భర్తృహరులు జనించి రని తెలిసెడిని. ఇట్టి గాథల పరంపరనుండి కవిచరిత్రమును నిర్ధారించు టెంతకష్టమో చదువరు లూహింప వచ్చును. కాని వానిమూలమున మనకవి "రాజన్యుఁడు, ఇహమును రోసి విరాగియై సన్యసించి యడవులఁ బట్టినవాఁడు, గొప్పవిద్వాంసుఁడు, కవి, యోగి"—యను నంశము లూహింపఁ దగి యున్నవి.

## శ త క ర చ న ము

సుభాషితత్రిశతి యనఁబడు నీకృతి నీతి శృంగార వైరాగ్యములను మూఁడుభాగములను నొప్పుచు నన్వర్థముగాఁ గ్రమమున నీతి శృంగార వైరాగ్యముల నుద్బోధించును. భర్తృహరియే యీత్రిశతికిఁ గర్త యనుట సార్వజనీనకమగు నభిప్రాయము. ఆశతకత్రయమును లఘువుగాఁ బఠించువారికి అందలిశ్లోకములు పరస్పరాకాంక్షలేని కూర్పులుగఁ దోఁచును. ఈసందర్భమును పురస్కరించుకొనియు ఇందలి శ్లోకములు కొన్ని యితర కావ్యములఁ గనఁబడుటచేతను ఇవి స్వతంత్ర రచనములు కాక బహుకావ్యములనుండి సంగ్రహించిన శ్లోకముల కూర్పని యొక సిద్ధాంతము బయలుదేఱినది. అనామధేయుఁ డెవఁడో యొకకవి యీశతకములను రచించి భర్తృహరి కంటఁ గట్టె నని వేఱొక సిద్ధాంతముపుట్టినా దానికిఁ బండితాదరణము కలుగ లేదు. మొదటి

సిద్ధాంతమును విపులముగాఁ బరిశీలించినచోఁ గావ్యేతరములలోఁ గన్పట్టు నిందలి శ్లోకసంఖ్య యత్యల్పము; ఆకావ్యములు సైతము భర్తృహరి యనంతరము రచితమైనవి; అట్టే ప్రశస్తములు కానివి. మన కవి వానిని స్వతంత్రముగా రచింపక యేర్చికూర్చియే యుండిన తన గ్రంథమునకు నామాంతర మొసఁగ కుండునా? శ్లోకములా మన మనుకొనునంత విశ్లిష్టములు కావు; వివిధవర్గములుగ విభజింపఁదగిన లక్షణములు నిండుగాఁ గలవు. సూక్ష్మదృష్టితోఁ బరించువారికి అవి యిహమును రోసిన హృదయమునుండి పొంగిపొరలు భావపరంపర లని, లోకవృత్తమును గని అతివ్యాకులముపాలైన హృదయముయొక్క యావేగమును అణఁపఁజాలక వెలువరించిన యావేదనముగ స్ఫురింపక మానదు. ఆయాసందర్భముల వేదనపాలైనపుడు తనహృదయగతి యెట్టిదో వెలువరించినందున తెంపులేని కథనమున గోచరమగు పద్యముల పరస్పరాన్వయము కన్పట్టదు. దీనిని పురస్కరించుకొని అనీతిపరులు స్వీయరచనములకు గౌరవమాపాదించుకొను తలంపుతో వానిని భర్తృహరికి అంటఁగట్టి ప్రక్షిప్తములసంఖ్య హెచ్చించిరి. ఆప్రక్షిప్తములను అసలు రచనలనుండి బహిష్కరించుట కాలగతిమూలమున క్లిష్టతమమైనది.

## కవి కాలము

ఈ కవి తనగ్రంథమునఁ దన్నుఁగూర్చియో తనకాలమును గూర్చియో లేశమాత్రమును ప్రస్తావించియుండలేదు. కనుక పండితప్రతీతిని, గ్రంథస్థప్రమాణములను, ఇతరకవుల వ్రాఁతలను సాధనములుగాఁ గొని నిర్ధారింపవలసియున్నది.

భర్తృహరి శకపురుషుఁడగు విక్రమార్కునిభ్రాత యని పండితప్రతీతి. ప్రాచీనచరిత్రాన్వేషకులీయంశము నాక్షేపించినట్లు కానరాదు. విక్రమశకము క్రీస్తుపూర్వము 56-వ సం॥న నారంభ మనుట శిష్టుల కంగీకృతమైన విషయము,

ఇఁక గ్రంథస్థనిదర్శనము లంతగా కవికాలనిర్ణయమున కుపక రింపకపోవుటయే గాక సందిగ్ధములుగూడ నై యున్నవి. ఆశతకములు వేదాంతపరిభాషాజటిలములు. అయినను వేదాంతసిద్ధాంతములు వందల కొలఁదిసంవత్సరములుగా చర్చితములై పూర్వపక్షసిద్ధాంతీకరణముల నిష్పత్తినొందినవి గావున కేవలము వానియాధారమున కాలనిర్ణయ మసాధ్యము. ఈ సిద్ధాంతములను లోకసామాన్యమునకు ప్రప్రథమ మున వెల్లడించినవారు కుమారిలభట్టులు; వీ రెనిమిదవశతాబ్దమువారు. తర్వాతివారు ఆదిశంకరులు; వీరు తొమ్మిదవశతాబ్దమువా రని కొందఱును, కా రని కొందఱును వాదింతురు. కావున వేదాంతము తొమ్మిదవశతాబ్ద మాదిగా వ్యాప్తినందినా దానియుద్భవమంతకు బహుకాలము పూర్వమే యనుట సువిదితముగదా! కనుక వేదాంతపరిభాష నాశ్ర యించి మనము కవికాల మూహింప నెంచుట సమంజసముకాదు.

ఈశతకములలోఁ బురాణప్రసక్తియుఁ గలదు. పాశ్చాత్య పండితులదృష్టిలో పురాణము లిటీవల వేయిసంవత్సరముల క్రిందటివే గాని యంతకు పూర్వమైనవి కావు. వారిలోఁ గొందఱిమతమున నివి క్రీ. శ॥ పండ్రెండవ పదుమూఁడవ శతాబ్దములనాఁటివి. కావున పాశ్చాత్యవిమర్శకుల యభిప్రాయము లీపట్టున మన కప్రయోజకములు. మఱియు పురాణములలోని ప్రక్షిప్తభాగములవిషయమున నేలాటి భేదాభిప్రాయములు ప్రబలియున్నను ఆ పురాణముల మూలభాగ ములకుఁ గర్త వేదవ్యాసమహర్షియే యని భారతీయసంప్రదాయము; దీనిని త్రోసిరా జనుట అవివేకము. వ్యాసమహర్షి క్రీస్తుశకమునకు వేలకొలఁదియేండ్ల మునుపటివాఁ డనుట నిశ్చయము. అందువలన క్రీ. శ॥ ప్రథమశతాబ్దమునాఁటికే పురాణములు ప్రాచీనతమము లయి యుండె నన్నవిషయము నిర్వివాదముగదా? కనుక కేవల పురాణ ప్రసక్తిపై నాధారపడి యొకగ్రంథ మర్వాచీన మనరాదు. ఇఁక బాహ్య ప్రమాణములఁ బరిశీలింతము.

భర్తృహరిశతకములను వ్యాఖ్యానించినవారు మహాబలుఁడు, ఆవంచ రామచంద్రబుధేంద్రుఁడు, ధనసారుఁడు, రామర్షి, గుణవినయుఁడు, మీననాథుఁడు, ఇంద్రజిత్తుఁడు అను వారలని సంస్కృత వాఙ్మయ చరిత్రకారులు శ్రీయుత కావ్యవినోదులు కృష్ణమాచార్యుల వారు పేర్కొనియున్నారు. వారిలో నొక్కరైనను కవికాలనిర్ణాయక విషయమై శ్రద్ధవూనినట్లు కానరాదు. కాని వారిలో రామచంద్రబుధేంద్రుఁడు రచించినవ్యాఖ్య ఆంధ్రదేశముననే గాదు; యావద్భారతమునను వ్యాప్తి నందియున్నది. ఆయన పీఠికలో

"విప్రేణా భూతపూర్వం ఫలమధి తపసాఽలంబి సూర్యప్రసాదా
ల్లబ్ధ్వా తస్మాత్ స్వయం తత్ప్రచురతరజరా పఙ్ఛితా కఞ్చనాథ్యమ్,
హిత్వా మోహం స్వకాన్తా స్వతివిమలధియా తం నిషే వ్యాక్తభవ్యో
యోగీన్ద్రో భర్తృహర్యాహ్వయ ఇహ కురుతేఽద్యాపి విద్యావిలాసమ్."

అను నీ శ్లోకమున "ఒకానొక బ్రాహ్మణుఁడు తనకు సూర్యప్రసాదముచే లభించినఫలమును తనప్రభువగు భర్తృహరికి నొసఁగఁగా దాని నతఁడు తనప్రియభార్య కిచ్చెను. ఆమె దానిని తాను భుజింపక తనజారునకును, అతఁడు తనప్రియేతరకును అర్పించె ననియు, నీసంగతి ప్రత్యక్షమైనంతనే రాజు లోకవృత్తముపై నేవగొని విరాగియై కాననములఁ జేరెను." అన్న జన*ప్రతీతి నిట తడవియున్నాఁడు గాని దాని సత్యాసత్యముల విమర్శించినట్లు స్ఫురింపదు. సాధారణముగా ప్రసిద్ధపురుషులంగూర్చి అవినీతులు తమబుద్ధిబలముకొలఁది గాథల నెన్నిటినో కల్పించుటయు, వాని నట్టే సత్యము లని పామరజనము విశ్వసించుటయు మనకు నేఁటికిని అనుభవమే. ఇదయొక గుడ్డిఛాందసవృత్తము. వ్యాఖ్యాతలెల్లరు

* ఈప్రతీతికి మూలము
యాం చిన్తయామి సతతం మయి సా విరక్తా
సా ప్యన్య మిచ్ఛతి జనం సజనోఽ న్యసక్తః,
అస్మత్కృతేచ పరితుష్యతికాచి దన్యా
ధిక్తాం చ తం చ మదనం చ ఇమాం చ మాం చ.

"రత్నము రత్నమే కదా! అది యేనాఁటిదన్న ప్రశ్న మన కేల?" అన్నను డికి దాసానుదాసులై తలయొగ్గిరే కాని సత్యాన్వేషణయత్నమున దృష్టిమార్చినవారే లేరు. ఇతరకవు లెవరుగాని తమకవిస్తుత్యాదిక ములలో అతనికాలమును నిర్ణయించుటకు తగినంతవిశదముగా నతనిని ప్రశంసించినవారును కారు.

ఇట్లుండినను ప్రబలమైన ఆధారాంతరముచే దీనిని కొంతవఱకు నిశ్చయింపవచ్చును. పారసీకభాషలో 'కలిల-ఉ-దిమ్నా' అనుగ్రంథము కలదు. ఇది క్రీ. శ. 531-579 ప్రాంతముల పారసీకదేశమును పాలించిన యొకానొక ఫాదుషా ప్రోత్సాహమున రచియింపఁబడినగ్రంథము. దీనికి మూలము మనసంస్కృతపంచతంత్ర మనుట సర్వాంగీకారముఁ బడసిన విషయము. కనుక పంచతంత్రము అథమపక్షము క్రీ. శ. ఆఱవశతాబ్దారంభము నాఁటికే ప్రాచుర్యమందియుండె ననుట కేలాటిసంశయమును గన్పట్టదు. పంచతంత్ర మామూలాగ్రము స్వతంత్ర మైనరచనము కాదు. నాఁటికి ప్రశస్తములైయుండిన గ్రంథరాజము లనేకములనుండి బహుశముగా నుదాహరణములఁ గైకొనియున్నది. దాని కాధారము లగు గ్రంథములలో నీ నీతిశతక మొకటి. అందుండి యొకశ్లోకము, "గజభుజఙ్గవిహఙ్గమబంధనం శశిదివాకరయోర్గ్రహపీడనమ్; మతి మతాంచ విలోక్య దరిద్రతాం విధిరహో బలవానితి మేమతిః." (చూ. 85 నీతిశతక.) అనుశ్లోకము

ఈ యుదాహరణమే పారసీకగ్రంథమునందును గలదు. కనుక నీతిశతకకర్త క్రీ. శ. 500-కు పూర్వమే యుండె ననుటస్థిరము. అనఁగా కవికాలమును అయిదవశతాబ్ది కీవలికి లాగుటకు వీలు లేదు.

మఱొకమతము భర్తృహరి క్రీ. శ॥ 7-వ శతాబ్దమువాఁ డనుట. దానికి భర్తృహరి కాళిదాసీయ మగు నొక శ్లోకమును — "భవన్తి నమ్రాస్తరవః ఫలోద్గమైర్నవాంబుభిర్దూరవిలంబినో ఘనాః, అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః స్వభావ ఏవైష పరోపకారిణామ్." (శాకుం. 5 అం.

శ్లో. 12.) అనుదానిని (చూ. శ్లో. 61 భర్తృ) స్వగ్రంథమున నుదాహరించుటయు, కాళిదాసు 6-వ శతాబ్దివాఁడనుమతమునే యాధారములు. దీని కాక్షేపణ మిది. కాళిదాసుకాలము చాలవివాదగ్రస్తమై యుండినది; కాని చాలినన్ని ప్రమాణములనుగొని అతఁడు క్రీ. శ॥ ప్రథమశతాబ్దమువాఁడని పండితులు నిశ్చయించియున్నారు. కావున నీవాదము నిలువఁజాలదు. ఇంక నొకవిషయము. ఇత్సింగను చైనాయాత్రికుఁడు యాత్రమెయి నీదేశమునకు 7-వ శతాబ్దాంతమున వచ్చియుండి భర్తృహరి తాను వచ్చుటకు పూర్వము నలువదియేండ్లక్రితము గతించినట్లు వ్రాసియున్నాఁడు. ఈభర్తృహరి వైయాకరణి. ఆధునిక విద్వాంసుల మతమున శతకకవియు వైయాకరణియు భిన్నులు. ఈమతమును నేఁటిదనుక నాక్షేపించినవా రొక్కరును లేరు. కనుక నేడవశతాబ్దసిద్ధాంత మడుగంటుచున్నది. భర్తృహరి తనగ్రంథమున నెచటను సమకాలిక కవులనో, సమకాలిక సంభవములనో తడవియుండని కారణముచేతను, ఇతరులెవరు నాతసివే రుదాహరింపని కారణమునను సాంప్రదాయికాభిప్రాయమునకు విరుద్ధముగా నేలాటి ప్రబలప్రమాణములును గన్పట్టనందువలనను పండితప్రతీతినే యనుసరింపవచ్చును.

పైవిషయపర్యాలోచనఫలితముగా భర్తృహరి విక్రమార్కుని కాలమున, అనఁగా క్రీ. పూ. ప్రథమశతాబ్దిమధ్యమున వెలసె నని నిశ్చయింపవచ్చును.

## భర్తృహరి ద్వితయము.

సుభాషితత్రిశతికర్త భర్తృహరి యొకఁడును, వాక్యపదీయకర్త భర్తృహరి యొకఁడునుగా భర్తృహరు లిరువు రని కోల్బ్రూకు మహాశయుఁడు పేర్కొనియున్నాఁడు. ఈయభిప్రాయమును ప్రకాశమొనర్చుచు భట్టికావ్యప్రశంసయందద్దానికర్త భర్తృహరి యనియు, ఆ భర్తృహరిని విక్రమార్కుని సోదరుఁడుగా శతకకర్తగా భ్రమింపరాదనియు హెచ్చరికయు కావించియున్నాఁడు. ఈభర్తృహరు లిరువురు

"నొక్కరా? భిన్నులా?" అను విషయమై శ్రీపథక్ అను పండితుఁడు సప్రమాణముగ నిట్లు నిరూపించియున్నాఁడు:

"క్రీ. శ. ఏడవశతాబ్దాంతమున భారతదేశమునకు వచ్చియుండిన చైనాయాత్రికుఁడు ఇత్సింగను నతఁడు తా నాదేశమునకు వచ్చుటకు నలువదేండ్లక్రిందట వైయాకరణియు వాక్యపదీయకారుఁడు నగు భర్తృహరి మరణించియుండె నని వ్రాయుచు, "అతఁడు బౌద్ధుఁడు; రత్నత్రయమునందును ద్వివిధశూన్యమందును దృఢభక్తి విశ్వాసములు కలవాఁడు." అని వేర్కొనియున్నాఁడు. పదునొకండవశతాబ్దాంతమున నుండిన వాచస్పతిమిశ్రుఁడు వాక్యపదీయకర్తను వేదబాహ్యుఁ డని పలికియున్నాఁడు. ఆకాలమున బౌద్ధులను వేదబాహ్యులుగా వ్యవహరించుట మనపండితసంప్రదాయము. ఇత్సింగు పేర్కొన్న భర్తృహరి వైయాకరణి బౌద్ధుఁ డనుట కిది యుపబలముగా నున్నది. కుమారిలభట్టు వాక్యపదీయకారుని నిరసించినవిధముచూడ నతఁడు కేవల బౌద్ధుఁడై యుండె ననుట కేసంశయమును లేదు.

"సుభాషితత్రిశతికర్త యన్ననో వేదాంతవిషయతత్పరుఁడైన శివభక్తుఁ డగుట నా గ్రంథమే యుద్ఘోషించుచున్నది. వేయేల? "దిక్కాలాద్యనవచ్ఛిన్న" యను నీతిశతక ప్రథమశ్లోకము ఈ కవి వేదాంతతత్పరతను రూఢికెక్కించును. దీని నాధారముగాఁగొని భర్తృహరి క్రీ. పూ. ప్రథమశతాబ్దివాఁడుకాఁడను శ్రీతెలంగుగారి వాదమింతటితో గోడ చాటగుచున్నది." అని.

## భర్తృహరియు, భట్టియు

భట్టికావ్యరచయిత యగు భట్టియే భర్తృహరి యని యొక ప్రతీతి గలదు. ఈభట్టి శతకకర్త యగు భర్తృహరియా, కాక వాక్యపదీయకర్త భర్తృహరియా యను శంక పుట్టుచున్నది.

భట్టి విష్ణుభక్తుఁడు; వాక్యపదీయకర్త బౌద్ధుఁడు. కనుక భట్టి వైయాకరణిభర్తృహరి గాఁడు. ఇఁక శతకకారుఁ డగు భర్తృహరి

యగునేమో విచారింపవలసియున్నది. జనశ్రుతిని విడిచి యిరువురి చరిత్రములను జక్కఁగాఁ బరిశీలించిన నిద్దఱు నొక్కరే యనుట పొసఁగకున్నది. భర్తృహరి క్షత్త్రియుఁడు, భట్టి బ్రాహ్మణుఁడు. భర్తృహరిది మధ్యభారతదేశము; భట్టిది యతనికావ్యప్రమాణములనుబట్టియే వలభీరాజాస్థానము. ఈయిరువురి భాషాశైలియందును భేదములు కలవని పండితులు ప్రమాణీకరించియున్నారు. భట్టి రచనపదప్రయోజన మెఱింగినదై వ్యాకరణదోషలేశమేదియు లేక ప్రౌఢమై యర్థనిబిడమై యుండును. భర్తృహరి రచనంగూర్చి యిట్లు రూఢిగాఁ బలుకఁజాలము. కొన్నియెడల అన్వయక్లిష్టత, అసంగతాన్వయము, దుష్టపదవేళల పద ప్రయోజనము నందందు గోచరించును. మఱియు భట్టి విష్ణుభక్తుఁడు; శతకకర్త శివకేశవులయందభేదప్రతిపత్తిగల యద్వైతవేదాంతి; ఐనను శివపక్షపాతము తెల్పియున్నాఁడు. పూర్వగ్రంథకర్తలీ యిరువుర కావ్యములనుండియు నుదాహరించునపుడు వానిని భిన్నకవికృతులుగా వ్యవహరించిరిగాని యేకకవికృతములుగాఁ జూపరైరి. ఇంతకన్నను బలీయము లగు ప్రమాణములుగాని వాదోపపత్తులుగాని లభించునంత వఱకు నీయిరువురును భిన్నవ్యక్తులే యని నిశ్చయించుటయే యుక్తము.

## బౌద్ధధర్మసూచనలు

శతకములందు బౌద్ధమతసిద్ధాంత సూచనలు కలవని కొందఱి యభిప్రాయము. బౌద్ధధర్మములను నీతులను ఉపదేశించుగ్రంథముల నుండఁ దగు విశేషలక్షణము లిందేవియుఁ గానరావు. బౌద్ధము లని యనుమానింపఁదగు పట్టులునైతము రూఢియైనవి కావు. బౌద్ధమత పరిభాష యత్యల్పముగఁ గనఁబడును. బౌద్ధమతము దేశమంతట ప్రబలియుండినవిషయము నాలోచించిన దానిప్రభావము కొద్దిగానో గొప్పగానో సార్వత్రికమై యుండకతప్ప దనుట స్ఫురించును. కనుక వాని చిన్నె లటనటఁ గనఁబడుట యొకవింత గాదు. మఱి వేదాంతదర్శన ప్రదర్శకములకు శతకత్రయమున మితిలేదు. "త్రిభువన మపి బ్రహ్మ

మనుతే," "లీయే పరబ్రహ్మణి," "పాణిఃపాత్రం," "ఏకాకీ నిస్పృహః," "మాతర్మేదిని," (చూ. వై రా. శ్లో. 89, 99, 100) మున్నగు శ్లోకములు వేదాంతదర్శన ప్రశంసచేయునవి; "విపది ధైర్య," "కరేశ్లాఘ్యస్త్యాగః," "శ్రోత్రం శ్రుతేనైవ" (చూ. నీ. శ్లో. 52, 53, 62) మున్నగునవి వేదాభ్యాసమునందుఁ గవికిఁ గల గౌరవమును సూచించును. కవి పరామర్శించు యోగప్రక్రియయు, దశావతారములును, గంగానదియు, హిమాలయములును అతఁడు బౌద్ధేతరుఁ డనుటనే చాటును.

## రచన

కావ్యమూలమున నీత్యుపదేశ మీ భరతఖండమున ననాది సిద్ధమైన యాచారము. మహాభారతరచనమునకు సైతము పూర్వ మిట్టిది కల దనుట కందలి సూత్రప్రాయము లగు నీతివాక్యములే ప్రమాణములు. ఇట్టిరచనల కెల్లను ఆశయము ఐహికసౌఖ్యము లస్థిరము లనియు, నీతి శాంతి విరక్తులు అపేక్షణీయము లనియు ప్రబోధించుటయే. అట్టి రచనములలో నొకటి యీ సుభాషితరత్నావళి. ఈ రత్నావళి నీతి శృంగారవైరాగ్యములను మూఁడుశతకముల సంపుటము. దీనిని లఘువుగా నొకపర్యాయము పఠించువారి కిందు దైవాయత్తసూత్ర ముద్బోధిత మనితోఁచును. అనాదిగా పునర్జన్మసిద్ధాంతము నాశ్రయించిన యీదేశమున నీతిబోధనమునందుఁగూడ భాగ్యాయత్తత చొరవచేసి కొనుట యొక వింతకాదు. కనుక భర్తృహరిరచనలందును ఆ సిద్ధాంతము తలయెత్తుకొనియున్నది. కాని సర్వమును దైవాధీన మని నమ్మి పురుషకారమును సడ్డసేయని కొందఱి మతమువంటిది కా దితనిమతము. సమస్తమును దైవాధీనమయ్యును నాదైవముసైతము కర్మానుగుణమైన ఫలమునే యిచ్చును. గావున పౌరుషమును సత్కర్మాచరణమును అత్యంతావశ్యకము లని కవి పదేపదే విస్మరింప వీలుకానివిధమున ఉద్ఘోషించి యున్నాఁడు. మఱియు కార్యారంభ మొనర్చుచో కార్యసిద్ధి యగునంత వఱకు విరమింపరా దనుట యీతని సిద్ధోపదేశము.

## భర్తృహరి చాటిన సిద్ధాంతము లేవి ?

వేదములందును వేదాంతసిద్ధాంతములందును ధర్మపరులకు విశ్వాస మత్యవసరము. పరబ్రహ్మమందు లయించుటయే యానంద మునకు పరమావధి. తత్సిద్ధికై ఆశాత్యాగము, వైరాగ్యానుభవము, కర్మోన్మూలమును సాధనములు. ఇవియ ముఖ్యవేదాంతసిద్ధాంతములు. కనుక భర్తృహరి వేదాంత మతావలంబకుఁ డనుట విస్పష్టము. అచ్చ టచ్చట యోగమును, దశావతారములను, గంగను, హిమాలయమును ప్రశంసించియుండుటఁ జూడ మానవులు తమదైనఁ దినచర్యలలో నెట్టి దృష్టితో వ్యవహరింపవలె నని కవి యుద్దేశించెనో తెలియును.

పురుషుఁ డీలోకమున వాంఛింపఁదగినవానిలో నతిముఖ్యమైనది ఆత్మగౌరవము. తన్నెన్నిసంకటములు పైకొన్నను ఆత్మగౌరవమునకును స్వాతంత్ర్యమునకును లోటుపాటు కలుగనీయరా దని యెంతో మృదుల మగుభాషలో నెన్నోపట్టుల కవి వివరించెను. మానవదృష్టి లక్షింపఁ దగిన రెండవగుణము పట్టుదల, దృఢప్రవృత్తి; అభినివేశమును వ్యవసా యమును కొఱఁతవడిన నేకార్యమును సిద్ధింపదు; ధీరులు తాము పూనిన కార్యము సిద్ధినందువఱకు వదల రని రూఢిగాఁ బలికెను. కవి మన కుద్బోధింప నెంచిన మూఁడవనీతి ధర్మానుష్ఠానము, సాంఘికసేవ, పరోపకా రాదిమహిమముల వర్ణించుశ్లోకము లతిసుందరములు, భావగంభీరములు నైయున్నవి. భర్తృహరిరచనలు ధైర్యమునందు సచ్ఛీలమునందు వాస్తవాభినివేశమును పురికొల్పును. సద్గుణము లన్నిటిలో సచ్ఛీలము ఉత్తమోత్తమస్థాన మధిష్ఠించు ననుట కవిమతము. తన్మూలమున సాధింపఁ దగిన శ్రేయములను పలురీతుల వివరించియున్నాఁడు కవి.

శృంగారశతకమున సామాన్యప్రసక్తములు కామాదికములు వెన్నెల, మందమారుతము, సౌభాగ్యసంపద మున్నగునవి తరుణ వయస్కుల మనముల నెట్టిభావముల నుద్రేకింపఁజేయునో, అవి యెట్లు మనస్సును కలఁచివైచి శాంతిదూరముచేయునో, ఆభావముల వశీకరణ

మొనర్చుకొని జితేంద్రియు లగుట కేది యుపాయమో కవి బహు హృద్యముగా మనసు నొప్పింపనిరీతిన వర్ణించెను.

వైరాగ్యశతకము వేదాంతసిద్ధాంతమును ప్రతిఫలింపఁజేయు చుండును. తృష్ణాచ్ఛేదన మావశ్యకము. ఐహికబంధనమునకు మూలము లోభము. వానిమూలమున ధనవంతులు మదాంధు లగుదురు; కావున వానివిషయమున జాగ్రత్తవహించుట శ్రేయము; ఇహలోకసుఖము లందు తగుల్కొని శాశ్వతపరలోకమును విస్మరించి మనశ్శాంతిని కోల్పోవుటకన్న నడవులఁజేరి శాంతమనస్కు లగుటయే పరమోత్కృష్ట మనుట కవియాశయము. వైరాగ్యతత్పరుఁడై సర్వశక్తియగు భగవం తునియందు మనస్సును లీనము గావింపఁగల్గిన సన్యాసి దేశపాలనము చేయు నెపమున భోగలాలసుఁ డగు రాజునకన్నను ఉత్తముఁడు; ఆత్మైక్యముచే సన్యాసి శాశ్వతానంద మనుభవించు ననుట యతని యుపదేశము.

శ్రీ రమేశచంద్రదత్తుగారు తాము వ్రాసిన "ప్రాచీన భారతేతి హాసము" అనుగ్రంథమున నిట్లు లిఖించియున్నారు:

"ప్రొఫెసరు లాసనుగారు భర్తృహరి శతకములంగూర్చి ప్రకటిం చిన యభిప్రాయముతో పాఠకులెల్లరు నేకీభవింతురు. భర్తృహరి శ్లోకములు సంక్షిప్తములు, సూత్రప్రాయములు ; కనుకనే యవి సర్వ జనాదరణీయములైనవి. అతనికృతులు భారతీయసారస్వతమున నుత్తమ స్థాన మలంకరించుననుట నిస్సంశయము." అని నుడివియున్నారు. శైలి సగటున సులభమైనను కొన్నియెడల సంక్షేపకార్యప్రయత్నము విస్పష్ట తను అడ్డుతగఁలును. చిన్నచిన్న శ్లోకము లన్ననో భావగంభీరములును లలితపదయుక్తములునుగ చిత్రింపఁబడుటచే నొకపరి చదివినంతనే మన మున నాటుకొనఁదగియుండును. ఈశ్లోకములను వ్యవహరింపనివా రరుదు. పెద్దవృత్తములందు సైతము దీర్ఘసమాసములు కానరావు. కొన్నిపట్టులమాత్రము శ్లోకము తుదిపాద మొక్కటే దీర్ఘసమాస

ప్రాయమైనను, దానిమూలమున శ్లోకభావము కుంటువడక గాంభీర్య యు క్తమగును; వేళలముగ ముగించుచో నంతహృద్యము కాకపో వచ్చును. దానివలన మాధుర్యమున కొక్కింత లోటు చేకూరినను ఉద్దిష్టార్థము నిరాడంబరము సునిశితమునై మనోహర మగును. శైలి నీతి మతబోధనలకు సహజముగ నున్నది. శతకములన్నిటియందును అలంకారములు సహజములు, అక్లిష్టములు, విషయస్ఫూర్తికి సహకారములు. భర్తృహరి తనభావములను సహృదయాహ్లాదకముగ దృష్టాంతముల నొసఁగుటలో మేలుచేయి; అతనివర్ణనలు చిత్రములు, చిత్తాకర్షకములు. అతఁడు ప్రకృతిపరిశీలనము సూక్ష్మతరదృష్టితో చేసినవాఁ డనుట నిస్సంశయము. ఇయ్యది యతనికి నీతిగర్భితరచనమునకు మిక్కిలి తోడ్పడెను. స్వోద్దిష్టకృతిని అనుపమానముగా రచించుటలో నతని దండెవేసినచేయి. దీని కతనిగ్రంథము పరమజనాదరణీయమగుటయే నిదర్శనము; అతనికి సంస్కృతసారస్వతమున నుత్తమస్థానము కలిగెను".

పాశ్చాత్యపండితులలో మేక్డొనెల్ పండితుఁడు సుభాషితత్రిశతిం గూర్చి యిట్లు పలికియున్నాఁరు.

"Scattered throughout the various departments of Sanskrit literature, are innumerable apophthegms in which wise and noble, striking and original thoughts often appear in a highly finished and poctical garb. Owing to universality of this mode of expression in Sanskrit literature, there are but few works consisting exclusively of poetical aphorisms. The most important are the two collections by the highly-gifted *Bhartrihari* entitled respectively, *Nitisataka* or century of conduct, and *Vairagya Sataka* or century of renunciation."

మోనియర్ విలియమ్సు పండితుఁ డిట్లు ప్రకటించెను.

"Numbers of wise sayings have from time immemorial, been constantly quoted in conversation. Many, thus orally

current, were of such antiquity that to settle their authorship was impossible. But occasional attempts were made to give permanence to the floating wisdom of the day, by stringing together in stanzas, the most celebrated maxims and sayings, like heads on a necklace, representing a separate topic, and the authorship of a whole series being naturally ascribed to men of known wisdom like *Bhartrihari*, *Chanakya*, much in the same way as the authorship of the Puranas and the *Mahabharata* was referred to the sage *Vyasa*."

## పాఠములు

ఇంతటి ప్రశంసాపాత్రమైన యీ గ్రంథరాజము పాఠభేదములచే నొప్పుట యెంతయు శోచనీయము. దాక్షిణాత్యపాఠ మని ఉదీచ్యపాఠ మని రెండుతెగలు ప్రసిద్ధమై యున్నవి. దాక్షిణాత్యపాఠమునకు మూలము ఆవంచి రామచంద్రబుద్ధేంద్రునిచే వ్యాఖ్యాతమైనది. ఉదీచ్యపాఠము రామర్షిపండితుని వ్యాఖ్య కాధారమైనది. దీనింగూర్చి ఆంగ్లవ్యాఖ్యకర్త శ్రీ వ. వి. గోపాలాచార్లు, యం. వ., బి. యల్., గా రిట్లు వ్రాసియున్నారు:

"రామచంద్రబుధేంద్రుఁడు సకల విద్యాసముద్రుఁడు; బహుశాస్త్రనిష్ణాత. ఇతని వ్యాఖ్య కవిహృదయమును విప్పి చూపును. ఈశతకత్రయమును పద్ధతి విభాగముచేసి ప్రతిపద్ధతికి శీర్షిక నిర్ణయించినవాఁడీతఁడే; విభజనము విషయసహజమైనది. ఇట్టి పద్ధతివిభాగము బహుప్రశస్తమైన దని తమజీవితమును భర్తృహరిగ్రంథ పరిశీలనమునకు వినియోగించిన ప్రొఫెసరు కోశాంబిగారు స్తుతించియున్నారు. 'దిక్కాలాద్యనవచ్ఛిన్న'యను శ్లోకము శతకత్రయమునకును నాంది యగును. శ్రీ వేదాంతదేశికులవారును తమ "సుభాషితనీతి" రచనమున నిట్టి పద్ధతినే యవలంబించి పండ్రెండేసి శ్లోకములవంతున పద్ధతులేర్పఱిచినారు. శ్రీ దేశికులవారు క్రీ. శ|| 13, 14 శతాబ్దమువారుగదా! వారు బుధేంద్రుని

భర్తృహరి శతకవ్యాఖ్యను చూచి యుండఁబోలును,'' అని వివరించిరి. దీనింబట్టి చూడ రామచంద్రబుధేంద్రుఁడు 12 వ శతాబ్దమువాఁడై యుండవచ్చు నని తోఁచును.

ఈ రామచంద్రబుధేంద్రుఁడు గోదావరీనదిశాఖ యగు ఆత్రేయి తీరమున నుండు కంజలూరు గ్రామవాసి; శాండిల్యగోత్రుఁడు. వ్యాఖ్యా నాంత గద్యయందు ఇట్లు వివరించియున్నాఁడు: "ఇతి శ్రీమత్పరమ యోగీంద్ర బృన్దమానస మిళన్మిళిన్ద సందోహామన్దానన్ద లాభాభినందిత రఘునందన చరణారవింద మకరందా స్వాదన కందళిత సారసారస్వతేన అఖండతపః ప్రచండమండలేశ్వర శాండిల్య మహాముని గోత్రావతంసస్య వంచాన్వయసుధా పారావారపారి జాతస్యధన్వన్తర్యా వతారా న్తర స్యాయుర్వేదప్రముఖ నిఖలవిద్యానవద్య గద్యపద్య నిర్మాణ చాతురీ ధురీణ సకలకవికులసార్వ భౌమస్యకొణ్డోజీ పండితవర్యస్య తనూజేన గం గాంబికాగర్భరత్నాకరసుధాకరేణ రామచంద్రబుధేన్ద్రేణవిరచితాయాం సుభాషితత్రిశతీవ్యాఖ్యాయాం సహృదయానన్ది న్యాఖ్యాయాం వ్యాఖ్యానం సంపూర్ణమ్." ఇతఁడు చంపూరామాయణమును వ్యాఖ్యానించియున్నాఁడు. ఇతనికి మోహనబిల్వమంగళుఁ డను నామాంతరము కలదు.

ఇటీవల సుభాషితత్రిశతి ముద్రణములు ఆంగ్లవ్యాఖ్యాభాషాంతరీ కరణములతో నెన్నో వెలువడినవి. వానిలో ముఖ్యమైనవి గోపీనాథుఁడు, అళసింగరాచార్యులు, కాశీపండితుఁడు, తెలంగు అనువారి వ్యాఖ్యలు. బోలక పండితుఁడు, టానీపండితుఁడు, బి. హెచ్. వార్తాంపండితుఁడు, పీటర్సన్ అనువారు విదేశీయులు. అన్నియు నాంగ్లభాషలోనివి. వీనియన్నిటికన్నను మిన్నయై కవిహృదయమును వ్యాఖ్యాతృ భావమును చక్కని పరిశీలనవిమర్శనములకు గుఱిచేసి రచించినట్టిది శ్రీ గోపాలాచార్ల ఆంగ్లానువాదవ్యాఖ్యలు. ఇప్పటి వావిళ్లవారి ప్రచు

రణము చాలమిన్నయైనది. ఆంధ్రానువాదకులలో ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరితిమ్మన, ఏనుఁగులక్ష్మణకవి యనువారు ముఖ్యులు. క్రీ. శ॥ 1651-వ సం॥ నాటికే ఆబ్రహామురోజరు దీనిని డచ్చిభాషలోనికి పరివర్తనము కావించెను.

ఈ పీఠికవ్రాయుతరుణమును నాకుఁ గల్పించిన, భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి నే నెంతయు కృతజ్ఞుఁడను.

వేదము లక్ష్మీనారాయణశాస్త్రి.

# శ్లోకసూచిక



శ్రీరస్తు.

# భర్తృహరిసుభాషితము

## నీతిశతకము

### వ్యాఖ్యాన పీఠిక.

వన్దేఽహం రఘునన్దనాఙ్ఘ్రిసరసీజాతద్వయీమద్వయా
మన్దానన్దమరన్దబిన్దులహరీసన్దోహనిష్యన్దినీమ్,
యత్రేన్దిన్దిరజాతవన్మునిమనోబృన్దం కృతస్వాశ్రయం
కాఙ్క్షత్తున్దిలతా మవిన్దత పరానన్దావబోధోదయాత్.

శ్రీమాం స్త్రైలిఙ్గదేశే స జయతి విబుధశ్రేణికోటీరకోటీ
కోటీమాణిక్యభూతాగణితగుణగణోఽఖణ్డపాణ్డిత్యశౌణ్డః,
ధీరః శాణ్డిల్యగోత్రః సకలకవికులాహ్లాదిసూక్తిప్రవీణో
వీణోదాహార్యవిద్యావివరణనిపుణో రామచన్ద్రో బుధేన్ద్రః.

వేదాన్తోదన్త చిన్తా మతనుత చతురేణాన్తరేణాకుతర్కం
తర్కం చాతర్కయద్యః ఫణిపతివచసాం సారమాదత్త యోగే,
యో గేయః సాంఖ్యసంఖ్యాగమసమయవిధావప్యలం తన్త్రవిద్యా
విద్యో యామిన్యధీశః స్ఫురతి నిరుపమో వఙ్క్షువంశామ్బురాశౌ.

విప్రేణాభూతపూర్వం ఫలమధితపసాఽలమ్భి సూర్యప్రసాదా,
ల్లబ్ధ్వా తస్మాత్ స్వయం తత్ ప్రచురతరజరాపఙ్చతాకుఙ్చనాఢ్యమ్,
హిత్వా మోహం స్వకాన్తాస్వతివిమలధియా తం నిషేవ్యాత్తభావో,
యోగీన్ద్రో భర్తృహర్యాహ్వయ ఇహ కురుతేఽద్యాపి విద్యావిలాసమ్.

సోఽహమేతత్ప్రణీతాయాః సుభాషితకృతేః కృతీ,
కుర్వే సహృదయానన్దివ్యాఖ్యాం వ్యాఖ్యా సతాం ముదే.

వ్యాకుర్వన్తి నిబద్ధగౌరవభయాన్నైవ స్ఫుటం యుక్తిభి
ర్యే తేఽధ్యేతృజనప్రతారణపరాః కా నైపుణీ వా తతః?
వైఖర్యా వచసాం కవీశహృదయం ప్రఖ్యాపయన్నన్వయ
ద్వారైవాహమిహాఖిలం ప్రవివృణోమ్యుక్తిప్రజోజ్జృమ్భితమ్

ఇహ ఖలు తత్రభవా నశేషవిశేషపారపారదృశ్వా విశ్వాతిశాయిగుణగరిమావతారో భర్తృహరినామా మహాయోగీశ్వరో నిజయోగమహిమానుసారేణ కరతలామలకీకృతాఖిల విరిఞ్చిప్రపఞ్చ స్తృణకణమివ జగజ్జాల మాలోకయన్ పరమకారుణికో లోకవ్యవహారపరిజ్ఞానఖిన్నాన్తఃకరణః లోకానుజిఘృక్షయా నీతి శృఙ్గార వైరాగ్య వర్ణనప్రఖ్యం సుభాషితత్రిశత్యాఖ్యం కంచిత్ ప్రబన్ధం ప్రారంభమాణ స్తత్పరిపన్థినిర్మథన ద్వారా పరిసమాప్తిప్రచయగమనలక్షణం ఫలమాశాసానః శిష్టాచారపరిప్రాప్తి విశిష్ట పరజ్యోతీరూపేష్టదేవతానమస్కారాకారం మఙ్గళమాదౌ నిబధ్నాతి.

## మంగళాచరణము

అవతారిక. గ్రంథాదిని మంగళాచరణము జేయుట కవిసంప్రదాయ మయినందున, ‘భర్తృహరి’ యనుకవి ‘భర్తృహరిసుభాషితము’ అనుగ్రంథమును రచింపఁబూని మొదట జ్ఞానానందమయుఁడగు సర్వేశ్వరునకు నమస్కరించుచున్నాఁడు:—

శ్లో. దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్తచిన్మాత్రమూర్తయే,
స్వానుభూత్యేకమానాయ నమః శాన్తాయ తేజసే. 1

వ్యా.—దిగితి.—దిశః. ప్రాచ్యాది దిక్ప్రదేశాః - కాలాః భూతభవిష్యద్వర్తమానరూపాః - ఆదిశబ్దసంగృహీతాని వస్తూని - తథా చ దిక్కాలా ఆదయో యేషాం తాని దిక్కాలాదీని - తద్గుణసంవిజ్ఞానబహువ్రీహిః - అన్యథా తేషామప్రాధాన్యేన వినాభావే శాస్త్రవిరోధః స్యాత్ - తై రనవచ్ఛిన్నా అపరిక్లృప్తా - విభుత్వాన్నిత్యత్వాదేకత్వాచ్చ దేశతః కాలతో వస్తుతశ్చాపరిచ్ఛిన్నేత్యర్థః - అత ఏ వానన్తాఽపరిమితా త్రివిధపరిచ్ఛేదశూన్యత్వా దఖణ్డాదణ్డాయమానే త్యర్థః - ఏతేన సజాతీయ విజాతీయ స్వగత భేదత్రయ రాహిత్య మర్థాత్ సూచిత మితి విజ్ఞేయమ్ - ఆనన్దేతి పాఠే ఆనన్దచిచ్ఛబ్దయో ర్ద్వన్ద్వాన్తే శ్రూయమాణో మాత్రశబ్దః ప్రత్యేకం సంబధ్యతే - తథా చానన్దమాత్రా ఆనన్దమయీ చిన్మాత్రా జ్ఞానఘనా చ - చిదేకరసేతి యావత్ - తాదృశీ మూర్తి స్త స్యై తద్రూపాయేత్యర్థః, ‘సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ.’ ‘ఏకమేవాద్వితీయం బ్రహ్మ.’ ‘విజ్ఞానమానన్దం బ్రహ్మ.’ ‘ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్.’ ‘ఆనన్దమయోఽభ్యాసాత్.’ ‘సత్యం జ్ఞానమనన్తం యత్ సానన్దం బ్రహ్మ కేవల మి’ త్యాది శ్రుతిస్మృతికదమ్బక మత్ర ప్రమాణ మితి భావః. నాత్ర బహువ్రీహి రాశ్రయణీయః. అన్యథా, ‘ఇకోఽచి విభక్తా’ వితి నుమి ‘మూర్తినే’ ఇతి స్యాత్; న చ ‘తృతీయాదిషు భాషితపుంస్కం పుంవ ద్గాలవస్యే’తి

పుంవద్భావ ఇతి వాచ్యమ్, మూర్తిశబ్దస్య నియతస్త్రీలిఙ్గత్వే నాభాషితపుంస్కత్వాత్; తస్మా దృథాశ్రుత మేవ సాధు మన్తవ్యమ్; భాషితపుంస్కత్వే స్యానిత్యత్వవివక్షాయాన్తు బహువ్రీహివిహితే తదా న కాఽ ప్యనుపపత్తి 'రితి సర్వం సుస్థమ్; తథా స్వానుభూతి రాత్మానుభవ - ఏవ ఏకం ముఖ్య మద్వితీయం వా - మానం స్వప్రకాశసాధనం - యస్య తస్మై; స్వయంప్రకాశసంవిద్రూపత్వా దస్య ప్రదీపవత్ స్వపరప్రకాశకతయా స్వసాక్షాత్కారే స్వానుభవ ఏవ ప్రమాణం, న ఘటాదేరివ చక్షురాది ప్రామాణికత్వమితి భావః. ఏతేన వృత్తివిషయత్వమేవ న తు ఫలవిషయత్వమిత్యవధేయమ్; తదుక్త మాచార్యైః —

'స్వబోధేనాన్యబోధేచ్ఛా బోధరూపతయాత్మనః.
న దీపస్యాన్యదీపేచ్ఛా యథా స్వాత్మప్రకాశనే.' ఇతి;

తథా శాన్తాయ అవిద్యాతత్కార్యసమ్బన్ధశూన్యత్వాత్. ప్రసన్నాయ—'నిష్కళం నిష్క్రియం శాన్త మి' త్యాదిశ్రుతేః, తేజసే జ్యోతిరూపాయ, బ్రహ్మణే, నమః ప్రహ్వీభావః, 'నమః స్వస్తీ' త్యాదినా చతుర్థీ.

అత్ర మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే, వీరపురుషకాణ్యాయుష్మత్పురుషకాణి చ భవన్తి, అధ్యేతారశ్చ ప్రవక్తారో భవన్తీ'తి భగవద్భాష్యకారవచనప్రామాణ్యాత్, 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖ' మిత్యాది దణ్డివచనా చ్చాదౌ నమస్కారరూప, మన్తే పరబ్రహ్మస్మరణలక్షణం చ, మధ్యే తదుభయాత్మకం చ, మఙ్గళ మాచరిత మిత్యవగన్తవ్యమ్; 'అథ శబ్దానుశాసన మి'త్యాదౌ సర్వత్ర శాస్త్రారమ్భే మఙ్గళార్థత్వేనాథశబ్దప్రయోగదర్శనాత్, తస్య తదర్థకత్వం చ; ని. 'మఙ్గళానన్తరారమ్భ ప్రశ్న కార్త్స్న్యేష్వథో అథే' త్యభిధానాత్;

'ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా,
కణ్ఠం భిత్త్వా వినిర్యాతౌ; తేన మాఙ్గళికా వుభౌ.'

ఇతి స్మరణాచ్చ; తచ్చ నిర్విఘ్నం ప్రారిప్సితపరిసమాప్తికామే నావశ్యం కర్తవ్యమ్; 'పరిసమాప్తికామో మఙ్గళ మాచరే ది' త్యనుమితశ్రుతిబోధిత కర్తవ్యతాకత్వాత్, అనుమానం చ:—మఙ్గళం వేదబోధితకర్తవ్యతాక మలౌకికావిగీతశిష్టాచారవిషయత్వాత్, దర్శాద్యాచారవ, దిత్యన్వయవ్యతిరేకాభ్యామ్. తస్య కారణత్వానిశ్చయాత్ కథ మవశ్యకర్తవ్యతాకత్వమ్? తథా హి, శబరభాష్యాదౌ కృతేఽపి మఙ్గళే సమాప్తే రజాత

త్వాత్, కిరణావళ్యాదావకృతేఽపి జాతత్వా, దితి చేత్, సత్యం, క్వచిద్విఘ్నబాహు ళ్యేన తత్సమసంఖ్యాకమఙ్గళాభావాత్, క్వచిత్ ప్రాచీనమఙ్గళ బాహుళ్యాచ్చ, వ్యత్యయః ఇత్యలమతిప్రసక్తేన.

అత్ర చారుత్వేన యథావద్వస్తువర్ణనాత్ స్వభావోక్తి రలంకారః - 'స్వభావోక్తి రసౌ చారు యథావద్వస్తువర్ణన' మితి లక్షణాత్. శ్లోకాఖ్య మేతదానుష్టుభం వృత్తమ్.

'పఞ్చమం లఘు సర్వేషు, సప్తమం ద్విచతుర్థయోః,
గురుషట్కం చ సర్వేషా, మేతచ్ఛ్లోకస్య లక్షణమ్.' ఇది వచనాత్.

టీక. దిక్కా... ర్తయే - దిక్ = దిక్కు, కాల = కాలము, ఆది = మొదలగు వానిచే, అనవచ్ఛిన్న = నియమింపఁబడని, (అనఁగా: సర్వకాలములందు నంతట వ్యాపించి యున్న అనుట.) అనంత = అంతములేని, చిన్మాత్ర = జ్ఞానమే, మూర్తయే = స్వరూప ముగాఁ గలదియు (లేక, చిన్మాత్ర = జ్ఞానమే అయిన, మూర్తయే = స్వరూపమును,) స్వా...మానాయ - స్వ = తనయొక్క, అనుభూతి = అనుభవమే, ఏక = ముఖ్యమయిన, మానాయ = ప్రమాణముగాఁ గలదియు, శాంతాయ = ప్రసన్నమైనదియును (అగు), తేజసే=జ్యోతికి (అనఁగా: స్వయంప్రకాశమగు పరబ్రహ్మమునకు), నమః=నమస్కారము.

తా. దేశకాలాది పరిమితిలేక జ్ఞానమాత్రస్వరూపమై అనుభవము చేతనే యెఱుంగఁదగినదై శాంతమయిన జ్యోతిస్స్వరూప మగుపరబ్రహ్మ మునకు నమస్కారము

క. అచ్ఛము దిక్కాలాద్యన
వచ్ఛిన్నానంతచిద్ఘనవపునంబు నిజ
స్వచ్ఛానుభూతిమానము
సచ్ఛాంతము తేజ మే నశేజస్రముఁ దలఁతున్.

---

## మూ ర్ఖ ప ద్ధ తి

అవ. గ్రంథకర్త నీతిశతకమున మూర్ఖపద్ధతి నారంభించుచు, ముందు "మంచి మాటచెప్పిన వినువారు అరుదు" అనుచున్నాఁడు:—

శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతాశ్చాన్యే జీర్ణ మఙ్గే సుభాషితమ్. 1

వ్యా.—ప్రబన్ధస్యాస్య వివిధస్వరూపపరిజ్ఞానార్థం తత్తత్పద్ధతి నిబన్ధనతయా చికీర్షితత్వాత్, తత్ర మూర్ఖవిద్వత్పద్ధత్యో ర్వ్యావర్తకభావస్యావిశిష్టేనోభయత్వే నిరూపణే సంప్రాప్తే, ప్రాథమ్యే ముఖ్యప్రసఙ్గసఙ్గత్యో రన్యతరస్యాభావా, దశోకవని కాన్యాయప్రాయత్వా, చ్చాదౌ మూర్ఖపద్ధతిం వర్ణయితు మారభతే. తత్ర ప్రథమం సహృదయాభావాత్ సుభాషితస్య వక్తు మనవకాశ ఇత్యాహ—బోద్ధార ఇతి.— బోద్ధారః పరిజ్ఞాతారః * 'బుధ అవగమన' ఇత్యస్మాద్ధాతో స్తృచ్, మత్సరే ణాసూయయా పరోత్కర్షాసహనేన - గ్రస్తాః సమాక్రాన్తాః - తే న హృదయాళవః అతో నానుమోదన్త ఇతి భావః, ప్రభవో రాజానః, స్మయదూషితాః గర్వదుర్వినీతాః - న తు వినయప్రహ్వాః - అతో న శృణ్వన్తీతి భావః, అన్యే ఉక్తోభయవ్యతిరిక్త జనాః. అబోధే నాజ్ఞానేన - ఉపహతా నష్టాత్మాన - స్తే న త్వధికారిణః - అత స్తేషా మాకర్ణనయోగ్యతాఽపి నాస్తీతి భావః, తస్మాత్ సుభాషితం సాధుభాషణం - ప్రియ వచనమితి యావత్ - నపుంసకే భావే క్తః, అఙ్గేఽన్తరఙ్గే జీర్ణమన్తర్హితం - న త్వద్యాపి బహిః ప్రవృత్తమ్—తథాఽపి వక్ష్యామీతి వాక్యశేషః. వృత్తం పూర్వవత్.

టీ. బోద్ధారః = తెలిసినవారు, మత్సరగ్రస్తాః = (వీఁడును మహాపండితుఁడువలెఁ బ్రసిద్ధినిబొందనా ? యని) అసూయచే నాక్రమింపఁబడినవారు; ప్రభవః = దొరలు, స్మ...తాః = స్మయ = (మాకొకఁడు చెప్పువాఁడును మేము వినువారలమునా ? మాకుఁ దెలియదా ? యను) గర్వముచే, దూషితాః = చెడఁగొట్టఁబడినవారు, అన్యేచ = మఱి తక్కిన వారలో, అబో...తాః-అబోధ = అజ్ఞానముచే, ఉపహతాః = అణఁగఁగొట్టఁ బడిన వారలు; సుభాషితం = మంచిమాట, అంగే = అంతరంగము (భావము) నందే, జీర్ణం = క్షయించినది.

తా. తెలిసినవారలు అసూయతో నున్నారు. ప్రభువులు గర్వాంధులు. సామాన్యులకు వినునంతటి తెలివి లేదు. కావున నేను చెప్పఁదలఁచిన సుభాషితము నాయందే అణఁగిపోయినది.

తే. బోద్ధ లగువారు మత్సరపూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువు లెన్న
నితరమనుజు లబోధోపహతులు గాన
భావమున జీర్ణ మయ్యె సుభాషితంబు.

అవ. "తెలిసీ తెలియనివాని రంజింపఁజేయుట అశక్యము" అనుచున్నాఁడు:—

శ్లో. అజ్ఞః సుఖమారాధ్యస్సుఖతరమారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి. 2

వ్యా.—నను కీదృశో మూర్ఖః? యతస్తత్స్వరూపం నిరూప్యతే, తత్రాహ.—అజ్ఞ ఇతి.—న జానాతీత్యజ్ఞః అకించిత్ జ్ఞః మూఢ ఇతి యావత్, సుఖ మక్లేశేన, ఆరాధ్యః సమాధేయః - తస్యోపదేశమాత్రేణైవ విస్రమ్భసమ్భవాదితి భావః, విశేషం జానాతీతి విశేషజ్ఞః తత్త్వవేత్తా, సుఖతర మత్యన్తానాయాసే నేత్యర్థః - 'ద్వివచన విభజ్యే' త్యాదినా తరప్ప్రత్యయః, ఆరాధ్యతే సమాధీయతే - తద్బుద్ధేః సర్వదా విశేష గ్రహణమాత్రపర్యవసానా దితి భావః, కిం తు, జ్ఞానం శాస్త్రజన్యసంవిత్ తస్య లవేన దుర్విదగ్ధం పణ్డితమానినం, నరం, మూర్ఖజన మిత్యర్థః. బ్రహ్మాఽపి కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థ శ్చతుర్ముఖోఽపి - కిము తాన్య ఇతి భావః, న రఞ్జయతి రఞ్జయితుం న - శక్నోతి - తన్మనసః సూక్తిసహస్రైరపి సమాధానాసంభవాదితి భావః, ఉక్తోభయ మధ్యస్థో మూర్ఖ ఇతి ఫలితార్థః.

రఞ్జనసంబన్ధే ఽ ప్యసంబన్ధాభిధానా దతిశయోక్తిభేదః. 'అజ్ఞో' 'విశేషజ్ఞ' ఇత్యత్ర చ 'ఆతోఽనుపసర్గే క' ఇతి కప్రత్యయో, న 'ఇగుపధజ్ఞే' త్యాదినా కప్రత్యయః; అత ఏవాహ భగవాన్ కాత్యాయనః 'అకారా దనుపసర్గాత్ కర్మోప పదో భవతి విప్రతిషేధే నే' తి వార్తికవ్యాఖ్యానే భాష్యకారే ణార్థజ్ఞ శబ్ద ముదాహృత్యాస్యార్థస్య సమర్థనాత్; ఏతచ్చాసకృదుక్తం మదీయశృఙ్గారశృఙ్గాటకేఽపి - 'రుక్మిణీరసమయం సమయజ్ఞః' ఇత్యాదిషు; ఏవముత్తరత్రాపి ద్రష్టవ్యమ్. ఆర్యావృత్త భేదోఽయమున్నేయః; ఉత్తరత్రాపి భేదాన్తరాణ్యున్నేయాని.

టీ. అజ్ఞః = తెలియనివాఁడు, సుఖం = సులువుగా, ఆరాధ్యః = సేవింప (బోధింప) శక్యమైనవాఁడు, విశేషజ్ఞః = విశేషము నెఱింగినవాఁడు, సుఖతరం = మిక్కిలి సులువుగా, ఆరాధ్యతే = సేవింప (బోధింప)ఁ బడుచున్నాఁడు, జ్ఞాన...దగ్ధం - జ్ఞాన = తెలివియొక్క లవ= లేశముచేత(ఇంచుక తెలివిచేత ననుట), దుర్విదగ్ధం=(నేనే పండితుఁడ నని)గర్వించిన, నరం=మనుష్యుని, బ్రహ్మా అపి=బ్రహ్మయు, న రంజయతి=రంజింపఁ (ఒప్పింప)ఁ జేయలేఁడు.

తా. తెలియనివానికి సులభముగఁ దెలుపవచ్చును, చక్కఁగఁ దెలిసినవానికి సమాధానము చెప్పుట మఱింత సులభము. స్వల్పజ్ఞానము కలిగి సర్వజ్ఞుఁడ నని గర్వపడువానిని సృష్టికర్తయగు బ్రహ్మయు రంజింపఁ జేయ నేరఁడు.

క. తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపం దగు సుఖతరముగఁ దెలుపఁగ వచ్చున్
దెలిసినవానిం దెలిసియుఁ
దెలియనినరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే?

అవ. "మూర్ఖుని మెప్పించుట యశక్యము" అనుచున్నాఁడు:—

శ్లో. ప్రసహ్య మణిముద్ధరేన్మకరవక్త్రదంష్ట్రాన్తరా
త్సముద్రమపి సంతరేత్ప్రచలదూర్మిమాలాకులమ్,
భుజఙ్గమపి కోపితం శిరసి పుష్పవద్ధారయే
న్నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్తమారాధయేత్. 3

వ్యా.—అథ ద్వాభ్యాం మూర్ఖజనచిత్తస్య దురారాధ్యతా మాహ — ప్రసహ్యేతి—మకరః శింశుమారాఖ్యో జలగ్రాహవిశేషః - తస్య వక్త్రే వదనగహ్వరే - దంష్ట్రాణాం నిశితాగ్రదశనవిశేషాణామ్ - అన్తరాత్ అన్తరాళాత్ - అతిసంకటాదిత్యర్థః, ప్రసహ్య బలాత్కారేణ, మణిం రత్నం - దురుద్ధర మపీతి భావః, ఉద్ధరేదుద్ధర్తుం శక్నుయాత్, జన ఇతి శేషః, కేనచి దవధానే నానయే దిత్యర్థః, తథా ప్రచలన్తో దోలాయమానాః - యే ఊర్మయ స్తేషాం - మాలాభిః పరమ్పరాభిరాకులమ్ ఉల్లోలోజ్జృమ్భిత మిత్యర్థః, సముద్రమపి - దుస్తరమ పీతి భావః, సంతరేత్ సమ్య క్తరితుం శక్నుయాత్ - కేనచిత్ప్లవనసాధనేనేతి భావః, లఙ్ఘయే దితి పాఠే హనుమానివ కేనచిచ్ఛక్తివిశేషేణ లఙ్ఘితుం శక్నుయా దిత్యర్థః, తథా కోపితం సంజాతకోపం - కోపవశాత్ సఫూత్కారం జిహ్వయా సృక్వప్రాన్తౌ లేలిహాన మిత్యర్థః - 'తదస్య సంజాతం - తారకాదిభ్య ఇత జి' తీతచ్ప్రత్యయః - తారకాదిరాకృతిగణః, భుజఙ్గం సర్పమపి - దుర్ధరమపీతి భావః. శిరసి కేశపాశే, పుష్పేణ తుల్యం పుష్పవత్ - పుష్పవ్రజ 'మివేత్యర్థః - 'తేన తుల్యం క్రియా చేద్వతి' రితి వతిప్రత్యయః, ధారయేత్ ధారయితుం శక్నుయాత్ - మణిమన్త్రాదిసాధనే వేతి భావః, కిం తు ప్రతినివిష్ట మభినివేశాక్రాన్తం - దురాగ్రహావిష్టమితి యావత్ - మూర్ఖజనస్య దుర్విదగ్ధస్య - చిత్తం, నారాధయేత్ ఆరాధయితుం సమాధాతుం న శక్నుయాత్ - ఉపాయాలాభాదితి భావః, మకరదంష్ట్రాన్తరస్థమణ్యుద్ధరణాది ప్రాయం మూర్ఖజనచిత్తసమారాధన మితి శ్లోకార్థః.

టీ. మకర...తరాత్ - మకర = మొసలియొక్క, వక్త్ర = నోటిలోని, దంష్ట్రా = కోఱలయొక్క, అంతరాత్ = నడుమనుండి, ప్రసహ్య = బలాత్కారముగా (అడ్డఁగా

మిగుల నొప్పించి యనుట), మణిం = ముత్యమును, ఉద్ధరేత్ = పెకలించినను పెక లించును. ప్రచ...కులం-ప్రచలత్ = మిక్కిలి కదలుచున్న, ఊర్మి = తరంగములయొక్క, మాలా = పంక్తులచే, ఆకులం = కలఁతనొందిన (అనఁగా: ఎట్టి యీఁతగానికిని ప్రవేశింప నశక్య మనుట), సముద్రమపి=సముద్రమునైనను, సంతరేత్=దాఁటినను దాఁటవచ్చును. కోపితం = (కఱచి చంపునట్లు) కోపము గలిగింపఁబడిన, భుజంగమపి = పామునుసైతము, శిరసి=తలయందు, పుష్పవత్=పువ్వువలె, ధారయేత్=ధరించినను ధరింపవచ్చును (కాని) ప్రతి...చిత్తం - ప్రతినివిష్ట = మొండిపట్టుపట్టిన, మూర్ఖజన = మొఱకు మానిసియొక్క, చిత్తం = మనస్సును, న ఆరాధయేత్ = సేవింపఁ (ఒప్పింపఁ) జాలఁడు.

తా. మొసలినోటిలోని కోఱలనడుమ నుండు రత్నము (ముత్యము)నైనను ప్రయత్నించి బయటికిఁ దీయవచ్చును. పెద్దయలలు గల సముద్రమునైనను దాఁటవచ్చును. కోపముచేత బుసవెట్టు పామునైనను పూలదండవలె శిరమునఁ దాల్పవచ్చును; కాని దురాగ్రహము చేత మూఢుఁ డయినవానిమనమును సమాధానపెట్టుట సాధ్యము కాదు.

చ. మకరముఖాంతరస్థ మగురమానికముఁ బెకలింప వచ్చుఁ బా
యక చలదూర్మికానికర యైనమహోదధి దాఁట వచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె సర్పమునైన ధరింప వచ్చు మ
చ్చిక ఘటియించి మూర్ఖజనచిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.

అవ. పై విషయమునే ప్రకారాంతరముగ వివరించుచున్నాఁడు:—

శ్లో. లభేత సికతాసు తైలమపి యత్నతః పీడయన్
పిబేచ్చ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః,
కదాచిదపి పర్యటన్ శశవిషాణమాసాదయే
న్నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్తమారాధయేత్. 4

వ్యా. ఏవం దుర్లభవస్తుసాధనే దుష్కరకార్యకరణే చ సంభావనయా శక్తి రుక్తా, న మూర్ఖచిత్తప్రసాధనే, ఇదానీ మత్యన్తదుర్లభవస్త్వపి ప్రసాధయే న్నతు తచ్చిత్త మి త్యాహ.—లభేతేతి.—యత్నతః కుతశ్చిత్ప్రయత్నాత్ - పశ్చాద్వ్యాప్త పిల్, పీడయన్ కేనచి ద్యన్త్రేణ సమ్మర్దయన్, సికతాసు వాలుకాస్వపి - కాల త్రయేఽప్య స్నేహాధికరణభూతా స్వపీతి భావః, తైలం స్నేహం, లభేత లబ్ధుం శక్నుయాత్ - 'స్నేహనే తైల' మిత్యనుశాసనా న్నాత్ర తిలసంబన్ధిత్వాశఙ్కా-కళ

జ్ఞావతార ఇతి ద్రష్టవ్యమ్, తథా పాతుమిచ్ఛా పిపాసా - 'పా పానే' ఇత్యస్మాద్ధాతోః సన్నన్తాత్ స్త్రియా మప్రత్యయే టాప్ - తయా అర్దితః పీడితః తృష్ణాతురః సన్నిత్యర్థ, మృగతృష్ణికాసు చ మరుమరీచికాస్వపి వా - జలభ్రమమాత్రదాయినీ ష్వపీతి భావః—మృగతృష్ణాశబ్దాత్ స్వార్థే కప్రత్యయే - 'ప్రత్యయస్థాత్ కాత్ పూర్వ స్యాత ఇ దా ప్యసుపః' ఇ తీ కారః, సలిలం జలం, పిబేత్ పాతుం శక్నుయాత్ "పాఘ్రా" ద్యే - త్యాదినా పిబతేః పిబాదేశః, తథా పర్యటన్ తత్ర తత్ర వనాన్తరే సంచరన్, కదాచిత్ కస్మింశ్చిత్ సమయే, శశస్య మృగవిశేషస్య - విషాణం శృఙ్గమపి - వాఙ్మాత్రగోచరమపీతి భావః, ఆసాదయే దధిగన్తుం శక్నుయాత్. (న తు ప్రతినివిష్టేత్యాది పూర్వవత్). సికతాత్తైలలాభాదివదత్యన్తదుర్ఘటం మూర్ఖచిత్త సమాధానమితి భావః; మృగతృష్ణికాజలశశవిషాణయోర్గగనారవిన్దవద్వన్ధ్యాపుత్త్రవదత్యన్తాసంగతత్వముక్తం సురేశ్వరవార్తికే—

'మృగతృష్ణామ్భసి స్నాతః ఖపుష్ప కృతశేఖరః,
ఏష వన్ధ్యాసుతో యాతి శశశృఙ్గధనుర్ధరః. ఇతి.

పద్యద్వయేఽప్యస్మిన్ మణిముద్ధరేదిత్యాదౌ 'శకి లిఙ్చే' తి శక్యార్థే విధిలిఙ్; తథా అపిశబ్దః సముచ్చయే, 'సంభావనాయాం చేత్' తదనువాద ఇతి వివేకః; ఉభయథాఽప్యనుశాసనసంభవాత్, ప్రకృతార్థోపపత్తేశ్చ; యథాహామరసింహః—'గర్హాసముచ్చయప్రశ్నశఙ్కాసంభావనాస్వపీ' తి; అత్ర 'సముద్రమపి లఙ్ఘయే' దిత్యుదాజహార స్వామీ.

అత్ర మణ్యుద్ధరణాద్యసంబన్ధేఽపి తత్సంబన్ధాభిధానా దతిశయోక్తిః.

శ్లోకద్వయమేతత్ పృథ్వీవృత్తమ్; తదుక్తం కేదారేణ వృత్తరత్నాకరే—'జసౌ జసయలావసుగ్రహయతిశ్చ పృథ్వీ గురు' రితి. అత ఏవ 'సికతాసు తైల' మిత్యత్ర, 'మృగతృష్ణికాసు సలిల' మిత్యత్ర 'మూర్ఖజనచిత్త' మిత్యత్ర చ, అష్టమవర్ణే విహితస్య విచ్ఛేదస్యాభావా ద్యతిభ్రష్టం నామ దోషః. ఇమమేవ కేచి దపస్థయతిం వదన్తి; తదుక్తం విద్యానాథేన—'యత్రస్థానే యతి భ్రంశ స్తద్యతిభ్రష్టముచ్యతే' ఇతి.

'క్వచిత్పదమధ్యే తు యతిమిచ్ఛన్తి సూరయః,
యత్ర పూర్వాపరౌ భాగౌ స్యాతామేకైకవర్ణగౌ.'

ఇతి దత్తిలవచనమపి సమాధాతుం న శక్నోతి; పూర్వాపరభాగయో రేకవర్ణగతత్వాభావాత్; నిరఙ్కుశాః ఖలు కవయో భవన్తి సర్వపథీనాః ఇత్యలమతిప్రసక్తేన.

టీ. యత్నతః = ప్రయత్నమువలన (అనఁగా: యంత్రములో వేసియేనియు). సికతాసుఅపి = ఇసుకయందు సైతము, తైలం = నూనెను, లభేత = పొందిననుపొందును,

(కించ = మఱియు), పిపాసార్దితః = దప్పిచేఁ బీడింపఁబడినవాఁడు, మృగతృష్ణికాసు = ఎండమావులలో, సలిలం=నీటిని, పిబేత్ = త్రాగినను త్రాగును. పర్యటన్ = తెగతిరుగుచు, కదాచిదపి = ఒకానొకవేళ, శశవిషాణం = కుందేటికొమ్మును, ఆసాదయేత్ = పొందినను పొందును. (కింతు = కాని), ప్రతినివిష్టమూర్ఖజనచిత్తం = మొండిపట్టుపట్టిన మోఱకు మానిసి మనస్సును, న ఆరాధయేత్ = మెప్పింపఁజాలఁడు.

తా. ప్రయత్నపడి ఇసుకనుండి కూడ చమురు తీయవచ్చును. ఎండమావులందు సైతము నీరును సంపాదించి త్రాగవచ్చును. తిరిగి తిరిగి కుందేటికొమ్మునైనను సాధింపవచ్చును. కాని దురాగ్రహము గల మూర్ఖునిమనస్సును మాత్రము సమాధానపెట్టుటకు సాధ్యము గాదు.

తే. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖులమనసు రంజింపరాదు.

అవ. "మూర్ఖుని సమాధానపఱుప నెంచుటయే యవివేకము" అనుచున్నాఁడు—

శ్లో. వ్యాళం బాలమృణాళతన్తుభిరసౌ రోద్ధుం సముజ్జృమ్భతే
ఛేత్తుం వజ్రమణిం శిరీషకుసుమప్రాన్తేన సన్నహ్యతి,
మాధుర్యం మధుబిన్దునా రచయితుం క్షారామ్బుధేరీహతే
మూర్ఖాన్యః ప్రతినేతుమిచ్ఛతి బలాత్సూక్తైః సుధాస్యన్దిభిః. 5

వ్యా—అథ మూర్ఖానునయేచ్ఛాయాః అత్యన్తావివేకితామాహ—వ్యాళమితి. అసౌ పుమాన్, వ్యాళం దుష్టగజం - న తు సాధారణజన్తుమిత్యర్థః - ని. వ్యాళో దుష్టగజే సర్పే' ఇతి విశ్వః, బాలమృణాళతన్తుభిః కోమలబిసతన్తుమాత్రైః - ఈష న్నిరోధస్యాప్యనుపయుక్తైరితి భావః, రోద్ధుం నియన్తుం, సముజ్జృమ్భతే కృతప్రయత్నో భవతీత్యర్థః, తథా వజ్రమణిం హీరాఖ్యమణివిశేషమ్ - అలోహలేఖ్యమపీతి భావః. ని. 'హీరో వజ్రశ్చ కథ్యతే' ఇతి హలాయుధః, శిరీషకుసుమస్యాతికోమల పుష్పవిశేషస్య - ప్రాన్తేన ఇచ్ఛలేన, ఛేత్తుం విదారయితుం, సన్నహ్యతి ఉద్యుఙ్క్తే ఇత్యర్థః, తథా క్షారామ్బుధేః లవణార్ణవస్య - న తు స్వల్పజలాశయస్య, మధుబిన్దునా క్షౌద్రవిప్రుషా - న త్వవిచ్ఛిన్నమధుధారాసంపాతేనేత్యర్థః, మాధుర్యం మధురగుణం, రచయితుం సంపాదయితు మీహతే కాఙ్క్షతి; కోఽసావి త్యత ఆహ; యః పుమాన్,

బలాద్వాక్ప్రాటవాత్, సుధాస్యన్దిభి రమృతస్వాదుభి రతిమధురై రిత్యర్థః, సూక్తైః ప్రియోక్తిభిః-నపుంసకే భావే క్తః, మూర్ఖాన్ ప్రతినేతుం సమాధాతు, మిచ్ఛతి సోఽసావితి సంబన్ధః; మృణాలతన్తుభిర్వ్యాళనిరోధనాదితత్పర ఇవ మూర్ఖానునయపరోఽ ప్యత్యన్తావివేకీతి భావః. అత్యన్త దుష్కరం మూర్ఖప్రసాదనమితి ఫలితార్థః.

అత్ర, యః ప్రతినేతుమిచ్ఛతి వాఞ్ఛతి అసౌ సముజ్జృమ్భత ఇత్యాది విశిష్టాను నయేచ్ఛా విజృమ్భమాణాది వాక్యార్థయో ర్భిన్నై కత్వాసంభవాత్ సాదృశ్యలక్షణాయా మసంభవద్వస్తుసంబన్ధో వాక్యార్థవృత్తి ర్నిదర్శనాభేదః; న చాయం దృష్టాన్తః, వాక్యభేదేన ప్రతిబిమ్బకరణాక్షేపే తస్యోత్థానాత్, అత్ర తు వాక్యార్థే వాక్యార్థ సమారోపాద్వాక్యైకవాక్యతాయాం తదభావ, ఇత్యలంకారసర్వస్వకారః.

శార్దూలవిక్రీడితమ్ = 'సూర్యాశ్వై ర్మసజస్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్' ఇతి లక్షణాత్.

టీ. యః = ఎవఁడు, సుధాస్యందిభిః = అమృతమును స్రవించుచున్న (అనఁగా, వినుట కింపుగానున్న), సూక్తిభిః=మంచిమాటలచేత, మూర్ఖాన్=మూఢులను, బలాత్ = బలాత్కారముగా, ప్రతినేతుం=(మంచిత్రోవకు) మరలించుటకొఱకు, ఇచ్ఛతి=కోరునో, అసౌ = ఆ యితఁడు, వ్యాళం = మదపుటేనుఁగును, బాలమృణాలతంతుభిః = లేఁత తామరతూఁటిలోని దారములతో, రోద్ధుం = కట్టుటకు, సముజ్జృంభతే = ప్రయత్నించును. శిరీష... స్తేన-శిరీషకుసుమ = దిరిసెనపువ్వుయొక్క, ప్రాంతేన=అంచుతోడ, వజ్రమణిం = వజ్రమనురత్నమును, భేత్తుం = పగులఁగొట్టుటకు, సన్నహ్యతి=పూనుకొనును. క్షారాంబుధేః=ఉప్పుసముద్రమునకు, మధుబిందునా=(ఒక) తేనెబొట్టుతో, మాధుర్యం= తీపును, రచయితుం = చేయుటకు, ఈహతే = పాటుపడును.

తా. మదపుటేనుఁగును తామరతూఁటిదారముతో బంధింపఁ జూచువాఁడును, దిరిసెనపువ్వుకొనచేత వజ్రమును గోయఁజూచువాఁడును, లవణసముద్రమునందలి నీటిని తియ్యగాఁ జేయుటకు నం దొక తేనెబొట్టును విడుచువాఁడును, మంచిమాటలతో మూర్ఖులను సమాధానపెట్టఁదలఁచువాఁడును సమానులు.

మ. కరిరాజున్ బిసతంతుసంతతులచేఁ గట్టన్ విజృంభించువాఁ
డురువజ్రంబు శిరీషపుష్పములచేఁ గూహించు భేదింపఁ దీ
పు రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణంబుం జిందు యత్నించు ని
ద్ధరణిన్ మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారను కారోక్తులన్.

అవ. "మూర్ఖులకు మౌనమే భూషణము" అనుచున్నాఁడు.—

శ్లో. స్వాయత్తమేకాన్తహితం విధాత్రా
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః,
విశేషతః సర్వవిదాం సమాజే
విభూషణం మౌనమపణ్డితానామ్. 6

వ్యా.—అత్రైషాం గతిమాహ—స్వాయత్తమితి.—విధాత్రా బ్రహ్మణా కర్త్రా స్వాయత్త మాత్మాధీనం - న తు పరోపదేశసాపేక్షమ్ - ని. 'అధీనో నిఘ్న ఆయత్త' ఇ త్యమరః, ఏకాన్తహితమత్యన్తహితకారి - స్వావగుణాచ్ఛాదకత్వాదితి భావః, తథా విశేషతో విశేషాకారేణ - సార్వవిభక్తికస్తసిః, సర్వవిదాం సమాజే సర్వజ్ఞసభాయాం, విభూషణముపస్కారహేతుభూతత్వాద్భూషణప్రాయం, మౌనం తూష్ణీమ్భావః, కర్మణి 'ఇగన్తాచ్చ లఘుపూర్వాదిత్' త్యణ్, అపణ్డితానా మవిదుషాం సంబన్ధినః, అజ్ఞతాయాః మౌఢ్యస్య, చ్ఛాదన మాచ్ఛాదకం, సత్, వినిర్మితం రచితమ్, అతోఽపణ్డితైర్నిజమౌఢ్యసఙ్గోపనార్థం మౌనేనైవ వర్తితవ్య మిదమేవైతేషాం గతిః - అన్యథా హాస్యాస్పదతా స్యాదితి భావః, 'ఏకాన్తకృత' మితి పాఠే తు, కృతం కర్మ - భావే క్తః - ఏకాన్తకృతం రహస్యనుష్ఠితం కర్మ - అజ్ఞతాయాః ఛాదనం సద్వినిర్మిత మపణ్డితానాం మౌనం భూషణం సద్వినిర్మిత-మితి ప్రత్యేక మన్వయో ద్రష్టవ్యః, అజ్ఞతాచ్ఛాదనార్థ మేకాన్త ఏవ కర్మ కర్తవ్య-మపణ్డితైర్మౌనిభిరేవ స్థాతవ్య-మన్యథా స్వరూపప్రకాశనేనాపహాస్యాస్పదతా స్యాదితి భావః.

ఉపజాతివృత్తమ్ - 'ఇన్ద్రోపేన్ద్ర వజ్ర'మితి లక్షణాత్: తా ద్వా కీదృగ్విధా?

'స్యాదిన్ద్రవజ్రా యది తౌ జగౌ గః, ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ,

అనన్తరోదీరితలక్ష్మభాజః పాదా యదీయా ఉపజాతయ స్తాః.'

ఇతి వృత్తరత్నాకరే ఉక్తత్వాత్.

టీ. విధాత్రా = బ్రహ్మచేత, అపండితానాం = మూర్ఖులకు, స్వాయత్తం=స్వాధీనమయినదియు, అజ్ఞతాయాః (తమ) తెలివిలేమికి, ఛాదనం=మూఁతయు, విశేషతః= ముఖ్యముగా, సర్వవిదాం = సమస్తమును దెలిసినవారియొక్క, సమాజే = సభయందు, భూషణం = ఆభరణమైన, మౌనం = పలుకకుండుట, వినిర్మితం = ఏర్పఱుపఁబడినది.

తా. బ్రహ్మ మూఢులు తమమూఢత్వమును దాఁచుకొనుటకుఁగాఁ దమకు స్వాధీనమై యుండునట్లు మౌనమును సృజించెను. పండితుల యెదుట మౌనముగా నుండుటయే మూఢుల కలంకారము.

తే. స్వవశము హితంబు మూఢతాచ్ఛాదనంబు
గాఁగ నీగతి నిర్మించె గమలభవుఁడు
సర్వవిదు లగుసుజనుల సభలలోన
మౌనమె విభూషణము మూఢమానవులకు.

అవ. ఒకపండితుఁడు పరులనుగూర్చి "తెలివిలేనప్పుడు గర్వము గలుగును. తెలివి గలిగిన పిమ్మట గర్వము పోయి వినయము గలుగును" అని స్వానుభవమును బ్రకటించుచున్నాఁడు:—

శ్లో. యదా కించిజ్జ్ఞోఽహం గజ ఇవ మదాన్ధః సమభవం
తదా సర్వజ్ఞోఽస్మీత్యభవదవలిప్తం మమ మనః,
యదా కించిత్కించిద్బుధజనసకాశాదవగతం
తదా మూర్ఖోఽస్మీతి జ్వర ఇవ మదో మే వ్యపగతః. 7

వ్యా.—అథ కశ్చిదనుభవినః పరాన్ ప్రతి స్వానుభవప్రకార మాహ.— యదేతి.—అకించిజ్జ్ఞః అల్పజ్ఞః సన్, యదా యస్మిన్ సమయే, గజ ఇవ, మదేన దర్పేణాన్ధః కర్తవ్యాకర్తవ్యవివేకశూన్యః, సమభవం జాతోఽస్మి, తదా తస్మిన్ సమయే, సర్వజ్ఞః అశేషజ్ఞో ఽస్మీతి మమ మనో, ఽవలిప్తం గర్వితమభవత్-'అల్పవిద్యో మహాగర్వీ'తి న్యాయాదల్పజ్ఞత్వస్యైవ గర్వహేతుత్వాదితి భావః, ని॰ 'అవలేపస్తు గర్వే స్యా ల్లేపనే దూషణేఽపి చే' తి విశ్వప్రకాశః, యదా బుధజనసకాశాద్విద్వజ్జనముఖాదిత్యర్థః - 'ఆఖ్యాతోపయోగే' ఇత్యపాదానత్వాత్ పఞ్చమీ, కించిత్కించిత్ స్వల్పం స్వల్పం - శాస్త్రబోధితాచారాదికమితి శేషః, అవగతం జ్ఞాతం, తదా, మూర్ఖో మూఢోఽస్మీతి, మే మమ, మదో జ్వర ఇవ, వ్యపగతో నిర్గతః, అభూదితి శేషః, జ్వరవద్వికారకారిత్వా దస్యైతత్సామ్యమిత్యవగన్తవ్యమ్, 'ఆచార్యవాన్పురుషో వేదే'తి శ్రవణా దాచార్యాదవగతవిద్యస్యైవ వివేకసంభవా దితి భావః; అల్పజ్ఞోఽపి సన్ య స్సర్వజ్ఞ మాత్మానం మనుతే స ఏవ మూర్ఖః, యస్తు సర్వజ్ఞోఽపి మూఢమానీ భవతి స ఏవ విద్వానితి వివేకః. మదో గర్వహేతు, ర్గురుశుశ్రూషాదిర్వినయహేతురితి ఫలితార్థః, యద్వా ఏతావన్తం కాలం మదవశా న్మూర్ఖోఽస్మి, ఇదానీం గురుశిక్షావశాద్వివేకావగతిరితి వా యోజనీయమ్.

శిఖరిణీవృత్తం-'రసై రుద్రైశ్ఛిన్నా యమన సభలా గః శిఖరిణీ' తి లక్షణాత్.

టీ. అహం=నేను, యదా=ఎప్పుడు, కించిద్జ్ఞః(సన్)=కొంచెము తెలిసినవాఁడనై, గజఇవ=ఏనుఁగువలె, మదఅంధః=గర్వముచే కన్ను తెలియనివాఁడను (అనఁగా: జ్ఞానహీనుఁ

డను)గా, సమభవం= ఉంటినో, తదా=అప్పుడు, సర్వజ్ఞః=సర్వము తెలిసినవాఁడను, అస్మి ఇతి=అయితినని, మమ=నాయొక్క, మనః=మనస్సు, అవలిప్తం=గర్వించినది, అభవత్= ఆయెను. యదా=ఎప్పుడు, కించిత్ కించిత్=కొంచెముకొంచెము, బుధ...శాత్-బుధజన= పండితజనులయొక్క, సకాశాత్ = సమీపమునుండి, అవగతం = తెలిసినదో, (తదా = అప్పుడు)మూర్ఖః అస్మి ఇతి=మూర్ఖుఁడను అయితినని,(తెలిసికొని)జ్వరః ఇవ=జ్వరమువలె, మే=నాయొక్క, మదః=గర్వము, వ్యపగతః=పోయినది.

తా. నేను కొంచెముగఁ దెలిసికొనియుండుకాలమున మదగజమువలె మదించి నేనే సర్వజ్ఞుఁడ నని తలంచితిని. పిదప పెద్దలవలన కొద్దికొద్దిగ ఎప్పుడు తెలిసికొంటినో అప్పుడు నేనుచు మూర్ఖుఁడ ననియు నాకేమియుఁ దెలియ దనియు తలంచి జ్వరమును వదలి సుఖపడినట్లు నన్నుఁ బట్టియున్న గర్వమును విడిచి సుఖపడితిని.

చ. తెలివి యొకింత లేనియెడఁ దృప్తుఁడ నై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి యిప్పుడు
జ్జ్వలమతు లైనపండితుల సన్నిధి నించుక బోధశాలి నై
తెలియనివాఁడ నై మెలఁగితిం గతమయ్యె నితాంతగర్వమున్.

అవ. "నీచుఁడు నీచవిషయములందే సిగ్గైనను లేక ప్రవర్తించు" నని దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. క్రిమికులచితం లాలాక్లిన్నం విగన్ధి జుగుప్సితం
నిరుపమరస ప్రీత్యా ఖాద న్నరాస్థి నిరామిషమ్,
సురపతిమపి శ్వా పార్శ్వస్థం విలోక్య న శఙ్కతే
నహి గణయతి క్షుద్రో జన్తుః పరిగ్రహఫల్గుతామ్. 8

వ్యా.—మూర్ఖస్యాతినైచ్యం దృష్టాన్తముఖేనాహ.—క్రిమికులమితి — శ్వా శునకః, క్రిమిభిరమేధ్యమధ్యోత్పత్తిమదపాదజన్తుసంతతిభిః, చితం వ్యాప్తం, లాలాక్లిన్నం వసాపూరార్ద్రం - యద్వా - లాలా సృణీకా దన్తాన్తర్జలమితి యావత్ - ని. 'సృణీకా స్యన్దినీ లాలే' త్యమరః - తయా క్లిన్నం ఖాదనసమయే తస్యాస్తత్ర స్రవణాదితి భావః, విగన్ధి దుర్గన్ధి-అత్ర విశబ్దస్య పూతిపర్యాయత్వవివక్షాయాం, గన్ధస్యే

త్యాదినా సమాసాన్త ఇకారోఽన్తాదేశః - యద్వా - విగన్ధ ఆమగన్ధోఽస్యాస్తీతి విగన్ధి. అత ఏవ, జుగుప్సితం హేయం, తదపి, నిరామిషం మాంసలేశశూన్యం, తదపి, ఖరాస్థి రాసభకీకసం, నిరుపమః - ఉపమానరహితో - యో రసః స్వాదః - తత్రయా - ప్రీతిః ప్రేమా తయా, ఖాదన్భక్షయన్, పార్శ్వస్థమన్తికస్థం-'సుపిస్థ' ఇతి క ప్రత్యయః, సురపతి మిన్ద్ర మపి - కిముతాన్యమితి భావః, విలోక్య, న శఙ్కతే న లజ్జతే, తథాహి—క్షుద్రో జన్తుః - నీచజన్తుః - పరిగ్రహే స్వీకృతవస్తుని-ఫల్గుతాం తుచ్ఛత్వం. న గణయతి న మనుత ఇత్యర్థః, జుగుప్సితకర్మాచరణతత్పరో మూర్ఖోఽప్యేవం న మహాద్విగర్హణా ద్బిభేతీతి భావః, ని. 'పత్నీపరిజనాదానమూలశాపాః పరిగ్రహాః' ఇత్యమరః ఫల్గు తుచ్ఛ మసారం చే' తి యాదవశ్చ.

అత్రాప్రస్తుతవృత్తాన్తకథనాత్ ప్రస్తుతమూర్ఖజనవృత్తప్రతీతే రప్రస్తుతప్రశంసాలంకారః

'అప్రస్తుతస్య కథనాత్ ప్రస్తుతం యత్ర గమ్యతే,
అప్రస్తుతప్రశంసేయం సారూప్యాదినియన్త్రితా.' ఇతి లక్షణాత్.

హరిణీవృత్తం - 'భవతి హరిణీ న్సౌ మ్రౌ స్లౌ గో రసామ్బుధివిష్టపైః' ఇతి లక్షణాత్.

టీ. శ్వా = కుక్క, క్రిమికులచితం = పురుగులగుంపుచే బొదువుకొనఁబడినదియు, లాలాక్లిన్నం = జొల్లుచేఁ దడిసినదియు, విగంధి = దుర్వాసనగలదియు, జుగుప్సితం = రోఁతఁ బుట్టించునదియు, నిరామిషం = మాంసములేనిదియు నగు, ఖర అస్థి = గాడిద యెముకను, నిరుపమరసప్రీత్యా = సాటిలేనిరుచియందలి ప్రేమతో (అనఁగా: మంచిరుచిగల పదార్థమునం దుండఁదగిన ప్రీతితో ననుట), ఖాదన్ = కొఱుకుచు, పార్శ్వస్థం = ప్రక్క నున్న, సురపతిం అపి = దేవేంద్రు నయినను, విలోక్య = చూచి, న శంకతే = సంశయింపదు (సిగ్గుపడదు.) (ఏల యనః) క్షుద్రః జంతుః = నీచప్రాణి, పరిగ్రహఫల్గుతాం = (తాను) కైకొనిన దానియందలి తుచ్ఛత్వమును, న గణయతి హి = లెక్కింపదు గదా.

తా. కుక్క పురుగులు గలిగినదియు జొల్లుచేత తడిసినదియుఁ గంపుకొట్టుటచే రోఁతపుట్టించునదియు మాంసము లేనిదియు నగు గాడిద యెముకను అతి ప్రీతితో కొఱుకుచు తనసమీపమునకు దేవేంద్రుండు వచ్చి నిలిచినను చూచి సిగ్గుపడదు. నీచప్రాణి తాను గ్రహించినవస్తువు తుచ్ఛమా కాదా యనువిషయమును లెక్క చేయదుగదా !

చ. క్రిమిసముదాయసంకులము గేవలనింద్యము పూతిగంధహే
యమును నిరామిషంబును ఖరాంగభవం బగునెమ్ముఁ గుక్క దా
నమలుచుఁ జెంత నున్న సురనాథునిఁ గన్గొని సిగ్గుఁ జెంద ద
ల్ప మని నిజస్వభావముఁ దొలంపదు నీచపుఁబ్రాణి యెయ్యెడన్.

అవ. "తెలివిలేనివారికి వచ్చునదంతయు ననర్థపరంపరయే" యని సదృష్టాంతముగ నిరూపించుచున్నాఁడు:—

శ్లో. శిరశ్శార్వం స్వర్గాత్పశుపతిశిర స్తః క్షితిధరం
మహీధ్రాదుత్తుఙ్గాదవనిమవనేశ్చాపి జలధిమ్,
అధో గఙ్గా సేయం పదముపగతా స్తోక మథవా
వివేకభ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః. 9

వ్యా.—అథావివేకస్యానర్థాదికథనద్వారా వివేకస్యావశ్యకత్వం ప్రదర్శ యతి—శిర ఇతి.—అత్రోత్తరవాక్యే తచ్ఛబ్దస్య విద్యమానత్వా ద్యచ్ఛబ్దోఽధ్యా హర్తవ్యః - యత్తదోర్నిత్యసంబన్ధాత్ - ఉత్తరవాక్యస్థయచ్ఛబ్దస్యైవ పూర్వవాక్య తచ్ఛబ్దానపేక్షితత్వనియమాత్; తథా చ యా గఙ్గా స్వర్లోకాత్, శర్వస్యేదం శార్వ మైశ్వరం - ని. 'ఈశ్వర శ్శర్వ ఈశాన' ఇత్యమరః - తస్యేదమి త్యణ్ప్రత్యయః. శిరశ్శిర ముపగతేతి సర్వత్రానుషజ్యతే, ప్రథమత ఇతి శేషః, తదను, పశుపతేశ్శర్వస్య - శిరస్తశ్శిరసాత్ - పఞ్చమ్యాస్తసిల్, ధరతీతి ధరః - పచాద్యచ్ - క్షిత్యాః ధరః క్షితిధరః - తం హిమవన్త, ముపగతా, మహీం ధరతీతి మహీధ్రః - మూలవిభు జాదిత్వా త్కప్రత్యయః - యథాహ వామనః—'మహీధ్రాదయో మూలవిభుజాదిదర్శ నాది' తి-అత ఏవ-ని. 'మహీధ్రే శిఖరి క్ష్మాభృది' త్యాద్యమరః, ఉత్తుఙ్గాదున్నతా, న్మ హీధ్రాద్ధిమవదాఖ్యక్షితిధరా, దవనిం భువ, ముపగతా, అవనేశ్చాపి, జలధిం సముద్ర ముపగతా - 'నదీనాం సాగరో గతి రి'తి 'గఙ్గా సాగరపూర' ణీతి వచనాదితి భావః, అథో అనన్తరం - ని. 'మఙ్గ లానన్తరారమ్భప్రశ్నకార్త్స్న్యేష్వథో అథే' త్య మరః - సేయం పరిదృశ్యమానా గఙ్గా మన్దాకినీ, స్తోక మల్పం పరిమిత మితి యావత్, పదం స్థానమ్, ఉపగతా ప్రాప్తా, యద్వా - అధః ఉక్తప్రకారేణాధః ప్రదేశే పాతాళే వా - పదమితి యోజనా - అథ వా తథా హీత్యర్థః—పక్షాన్తరే వా - వివేకభ్రష్టానాం వివేకశూన్యానాం - స్థానభ్రష్టానాం చ, శతముఖో బహుప్రకార నిపాతో భఙ్గః - అధోఽధః పతనం చ, భవతి, వివేకయుక్తానాం తు నైవమ్, అతో,

వివేకా న్న భ్రంశితవ్యమితి భావః. యత స్సకలలోకమహితాయా అపి గఙ్గాయా భ్రంశవశా దీదృగవస్థాపత్తిః, కిముతా న్యేషామితి వివేకస్యాత్యన్తావశ్యకత్వ మిత్యవగన్తవ్యమ్. పురా కిల తత్రభవాన్ భగీరథోఽశ్వమేధీయాశ్వాన్వేషణతత్పరతయా పాతాళ ముపగతానాం కపిలవిలోచనానలభస్మీకృతానాం సగరకుమారాణా మూర్ధ్వలోకప్రాప్త్యర్థం స్వర్లోకాత్ సురసరిత మవతారయామాసేతి పౌరాణికీకథాఽత్రానుసంధేయా.

అత్రానేకస్మి న్నాధారే క్రమేణైకస్యా ఆధేయభూతాయాః గఙ్గాయాః స్థితికథనాత్ పర్యాయాఖ్యోఽలంకారః; తదుక్తం విద్యానాథేన:—

'క్రమేణైకమనేకస్మి న్నాధారే వర్తతే యది
ఏకస్మి న్నథవాఽనేకే పర్యాయాలంకృతిర్మతా.' ఇతి

శిఖరిణీవృత్తం-లక్షణం తూక్తమ్.

టీ. సా ఇయం గంగా=ప్రసిద్ధియగు యీగంగానది, స్వర్గాత్ = స్వర్గమునుండి, శార్వం = శివునిదగు, శిరః = శిరస్సును, పశుపతిశిరస్తః = శివునిశిరస్సునుండి, క్షితిధరం= (హిమాలయ)పర్వతమును, ఉత్తుంగాత్ = ఎత్తైన, మహీధ్రాత్ =(ఆ) కొండనుండి, అవనిం = భూమిని, అవనేః చ అపి=భూమినుండియు, జలధిం=సముద్రమును, అధః=క్రింద (పాతాళమునందు), స్తోకం=కొంచెము, పదం=చోటును, ఉపగతా=పొందినది. అథవా = అట్లనఁగా నేల? వివేకభ్రష్టానాం = తెలివిమాలినవారికి, శతముఖః = నూఱుత్రోవలుగల, వినిపాతః = అధోగతి, భవతి = కలుగుచున్నది.

తా. గంగానది ప్రథమమున నాకాశమునుండి ఈశ్వరునితల మీఁదను, అచ్చటినుండి హిమవత్పర్వతముమీఁదను, ఆపర్వతమునుండి భూమిమీఁదను, భూమినుండి సముద్రమునకును, అచ్చటినుండి పాతాళమునకును వచ్చెను. గొప్పస్థితినుండి తొలఁగినవారి కిదేవిధంబుగ బలువిధంబు లగుపాట్లు సంభవించును.

శా. ఆకాశంబుననుండి శంభునిశిరం బందుండి శీతాద్రి సు
శ్లోకంబైనహిమాద్రినుండి భువి భూలోకంబునందుండి య
స్తోకాంభోధిఁ బయోధినుండి పవనాంధోలోకముం జేరె గం
గాకూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్.

అవ. "మూర్ఖుని మూర్ఖత్వమును దొలఁగించుటకు శాస్త్రము లేదు. ఉపాయము లేదు." అని చెప్పుచున్నాఁడు:—

శ్లో. శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేన్ద్రో నిశితాఙ్కుశేన సమదో దణ్డేన గోగర్దభః,
వ్యాధిర్భేషజసఙ్గ్రహైశ్చ వివిధైర్మన్త్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్. 10

వా.—అథాగ్న్యాదీనాం వినివారణే శాస్త్రప్రతిపాదితజలాదిరూపహేతూన్ ప్రతిపాద్య మౌర్ఖ్యస్య నివారణే శాస్త్రాభావం హేత్వభావం చ స్ఫుటీకుర్వన్నాహ—శక్య ఇతి.—హుతభుక్ - హుతం హోమద్రవ్యం హవిః పురోడాశపశ్వాది భునక్తీతి హుతభుక్ వైదికాగ్నిః - అత్ర తు గృహాదిదాహకృత్ లౌకికోఽగ్నిరితి మన్తవ్యం, జలేన ఉదకేన, వారయితుం నివారయితుం, శక్యః, ఏవం రీత్యా, సూర్యాతప - సూర్యస్య రవేరాతపః, ఛత్రేణ వారయితుం శక్య ఇతి పదద్వయస్యోత్తరత్రాప్యనుషఙ్గ ఇతి మన్తవ్యం, సమదః మదసహితః, నాగేన్ద్రః గజశ్రేష్ఠః, నిశితాఙ్కుశేన తీక్ష్ణాఙ్కుశేన, గౌః వృషభః గర్దభో రాసభశ్చ, దణ్డేన, వ్యాధిః కుష్ఠాదిరోగః, భేషజసఙ్గ్రహైః ఔషధసఙ్గ్రహణైశ్చ, అత్ర చకారాత్ మహామన్త్రజప హోమ సురార్చన దానాదికమపి గృహ్యతే - 'తచ్ఛాన్తిరౌషధైర్దానైర్జపహోమ సురార్చనైరి'తి స్మరణాత్, విషం కాలకూటాది, వివిధైర్నానావిధైః, మన్త్రైః మన్తారం త్రాయన్తే రక్షన్తీతి మన్త్రాః - తైర్మన్త్రైః ప్రణవాదిభిః - వివిధైః ప్రయోగైశ్చ, నివారయితుం శక్యమిత్యర్థః, తస్మాత్ సర్వస్య ప్రాణిహింసాకారణీభూతదుష్టజన్తుజాతస్య, శాస్త్రవిహితం శాస్త్రవిధిచోదిత, మౌషధం జలాదిరూపభేషజమ్, అస్తి, మూర్ఖస్య తు, ఔషధం సుభాషితాదిరూపంనాస్తి శాస్త్రవిహితం న వర్తతే.

టీ. హుతభుక్=నిప్పు, జలేన=నీటిచేత, వారయితుం=అడ్డగించుటకు, శక్యః=అలవియగునది; సూర్యఆతపః=సూర్యునియెండ. ఛత్రేణ=గొడుగుచేత, వారయితుం...శక్యః-సమదః = మదములోఁగూడిన, నాగేంద్రః = గజోత్తమము, నిశిత...శేన - నిశిత = వాఁడియగు, అంకుశేన = అంకుశముచేత, వారయితుం...శక్యః. గౌః = ఎద్దు, గర్దభః= గాడిద, దండేన=కఱ్ఱచేత, వారయితుం...శక్యౌ = అలవియగునవి. వ్యాధిః = రోగము, భేషజసంగ్రహైః చ = మందులసంగ్రహించుటలచేతను, వారయితుం...శక్యః. విషం= విషము, వివిధైః=అనేకవిధములయిన, మంత్రప్రయోగైః=మంత్రముల ప్రయోగించుట చేత, వారయితుం...శక్యః, (ఇట్లు) సర్వస్య = సమస్తమునకును, శాస్త్రవిహితం = శాస్త్రమునందు విధింపఁబడిన. ఔషధం = మందు, అస్తి = కలదు. మూర్ఖస్య=మొండివానికి, నాస్తి = లేదు.

తా. అగ్నికి జలంబును, ఎండకు గొడుగును, మదగజంబునకు అంకుశంబును, ఎద్దు గాడిద మొదలగుజంతువులకుఁ గఱ్ఱయు, రోగంబునకు వివిధంబులగు మందులును, సర్పవిషంబునకుఁ బలువిధంబులగు మంత్రంబులును శాస్త్రములందు నివారకములుగ చెప్పఁబడియున్నవి. కాని మూర్ఖునిమూర్ఖత్వమును పోఁగొట్టునట్టియౌషధ మేశాస్త్రమునందును చెప్పఁబడలేదు.

చ. జలముల నగ్ని ఛత్రమునఁ జండమయూఖుని దండతాడనం
బుల వృషగర్దభంబులను బొల్పగుమత్తకరీంద్రము౯ సృణిం
జెలఁగెడురోగ మౌషధముఁ చే విషముం దగుమంత్రయుక్తి ని
మ్ములఁ దగఁ జక్కఁజేయ నగు మూర్ఖునిమూర్ఖత మాన్పవచ్చునే.

ఇది నీతిశతకమునందు మూర్ఖపద్ధతి వర్ణనమను
ఒకటవదశకము

---

## విద్వత్పద్ధతి

అవ. మూర్ఖపద్ధతిని నిరూపించినపిదప విద్వత్పద్ధతిని ఆరంభించుచున్నాఁడు:—

శ్లో. శాస్త్రోపస్కృతశబ్దసున్దరగిరః శిష్యప్రదేయాగమా
విఖ్యాతాః కవయో వసన్తి విషయే యస్య ప్రభోర్నిర్ధనాః,
తజ్జాడ్యం వసుధాధిపస్య సుధియ స్త్వర్థం వినాఽపీశ్వరాః
కుత్స్యాః స్యుః కుపరీక్షకైర్న మణయో యైరర్ఘతః పాతితాః. 11

వ్యా.—అథ మూర్ఖపద్ధతివైలక్షణ్యేన విద్వత్పద్ధతిం వర్ణయతి: యద్వా, యదుక్తం వివేకస్యాత్యన్తావశ్యకత్వం, తస్య శాస్త్రపరిజ్ఞాన సాధ్యత్వాత్, తస్య చ, విద్వదధీనత్వాత్, తత్పద్ధతివర్ణన మిదానీ మారభతే.—శాస్త్రేతి.—శాస్త్రైః కాణాద గౌతమీయాదిభి-రుపస్కృతాః అలంకృతా-స్తథా శబ్దేన వ్యాకరణేన-సున్దరాః=గిరో వాచో - యేషాం తే తథోక్తాః - అత్ర యద్యపి శాస్త్రపదగ్రహణేనైవ సర్వేషాం శాస్త్రాణాం సంగ్రహాత్ పార్థక్యేన శబ్దశాస్త్రగ్రహణే పౌనరుక్త్యం దూషణం స్యాత్ - తథాఽపి గోబలీవర్దన్యాయేన సమాధేయం - యద్వా 'సర్వశాస్త్రముఖం వ్యాకరణమ్' ఇతి తస్య ప్రాధాన్యాత్ పార్థక్యేన నిర్దేశః - అథ వా ఇతరేషాం

శాస్త్రాణాముపస్కారహేతుభూతత్వమాత్రమేవ - అస్య తు 'వాణీ వ్యాకరణేన' ఇతి స్వేనైవోత్తరత్ర వక్ష్యమాణత్వాత్ తదేకాన్తసౌందర్యావహత్వేన పృథగ్గ్రహణ మితి మన్తవ్యమ్, తథా శిష్యేభ్యో ఽన్తేవాసిభ్యః - ప్రదేయాః వ్యాఖ్యానరూపేణ ప్రదాతుం యోగ్యాః - ఆగమాః శాస్త్రాణి యేషాం తే తథోక్తాః - సమ్యక్ శిక్షాపాటవాత్ ప్రబుద్ధాఖిలశాస్త్రసిద్ధాన్తత్వేన శిష్యద్వారా వ్యాఖ్యాతనిఖిలాగమా ఇత్యర్థః- యద్వా శిష్యేభ్యః ప్రదేయాః వినియోగార్హాః న తు కుహాకతయా గర్భ ఏవ జీర్ణీ కృతా ఇత్యర్థః - తథా భూతా ఆగమా యేషాం తే తథోక్తాః - ని. 'ఆగమః శాస్త్ర ఆయతౌ' ఇతి విశ్వః. అత ఏవ విఖ్యాతాః, సర్వత్ర ప్రసిద్ధాః, కవయో విద్వాంసః, నిర్ధనాః ధనహీనాః సన్తః, యస్య ప్రభోః రాజ్ఞః, విషయే దేశే సన్నిధౌ వా, సన్తి తిష్ఠన్తి, తన్నిర్ధనత్వే నావస్థానం, తస్య వసుధాధిపస్య ప్రభోరేవ, జాడ్యం మాన్ద్యం హైన్యమితి యావత్ * 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణిచే' తి ష్యఙ్ప్రత్యయః, సుధియో విద్వాంసస్తు, అర్థం ధనం, వినాఽపి - 'పృథగ్వినే' త్యాదినా వికల్పాద్ద్వితీయా, ఈశ్వరాః సమర్థాః పూజ్యా ఇత్యర్థః - విద్యయా ఏవ తేషాం మహాధనత్వా దితి భావః కిం తు, యైః కుపరీక్షకైః రత్నశాస్త్రపరిజ్ఞానాభావాత్ కుత్సితపరిజ్ఞానిభిః,మణయః అమూల్యా అపీతి భావః, అర్ఘతః మూల్యతః, పాతితాః యది బహుమూల్యా మణయో ఽల్పమూల్యాః కృతా ఇత్యర్థః, కుత్స్యాః స్యుః కిం, న స్యురేవేత్యర్థః. అయ మర్థః - విద్వద్భిః ప్రభుసమాశ్రయేణైవ స్థాతవ్యం, 'సదాశ్రయేణ శోభన్తే పణ్డితా వనితా లతా' ఇతి న్యాయాత్; తత్ర న తే యది విద్వన్మనోరథం పూరయేయుస్తత్తేషామేవ కుత్సితత్వం, విద్వాంసస్తు కుపరీక్షకోపహతమణయ ఇవ న కుత్స్యా ఇతి; అతః శ్రేయఃకామైః ప్రభుభిః తన్మనోరథపూరకైరేవ భవితవ్యమితి తాత్పర్యమ్. శార్దూలవిక్రీడితం వృత్తం—లక్షణం తూక్తమ్.

టీ. శాస్త్ర...గిరం-శాస్త్ర=(తర్కము వ్యాకరణము మొదలుగాఁ గల) శాస్త్రములచే, ఉపస్కృత=సంస్కరింపఁబడిన. శబ్ద=శబ్దములచే, సుందర=అందమైన, గిరః=వాక్కులు గలవారును, శిష్య ..గమాః-శిష్య=శిష్యులకు, ప్రదేయ=ఈయఁదగిన (నేర్పఁదగిన), ఆగమాః=శాస్త్రములు గలవారును, విఖ్యాతాః=(అంతట) ప్రసిద్ధులు నగు, కవయః=పండితులు, నిర్ధనాః=ధన హీనులై, యస్య=ఏ, ప్రభోః=రాజుయొక్క, విషయే=దేశమునందు, వసన్తి=ఉందురో, తత్=అది (అట్లు పండితులు ధనహీనులై యుండుట),వసుధాధిపస్య=(ఆ)రాజుయొక్క, జాడ్యం=మాంద్యము; సుధియస్తు=బుద్ధిమంతులన్ననో, అర్థం వినా అపి=డబ్బులేకయే, ఈశ్వరాః = సమర్థులు; మణయః = రత్నములు, యైః=ఏ

కుపరీక్షకైః=మదింపు తెలియనివారిచే, అర్ఘతః = వెలనుండి, పాతితాః = తగ్గింపఁబడినవో, తే=వారు (అనఁగా: మదింపుగాండ్రు), కుత్స్యాః = నిందింపఁదగినవారు, మణయః=రత్నములు, న = కావు.

తా. వ్యాకరణాదిశాస్త్రపఠనముచేత నిర్దుష్టముగను మనోహరంబుగను పలుకుచు విద్యార్థులకు శాస్త్రంబుల బోధించుచు సుప్రసిద్ధులయిన పండితులు ఏప్రభువు నొద్దనైనను ధనవిహీనులయియుండిరేని అది ఆప్రభువుయొక్క తెలివిలేమినే తెలుపును. రత్నపరిజ్ఞానము లేనివర్తకుఁడమూల్యమణులను తక్కువవెల గలవానినిగా చెప్పినంతమాత్రముచేతనే ఆరత్నంబులకు లోపము రాదుగదా !

చ. సకలకలావిభూషితులు శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రులే నృపతి పజ్జను నిర్ధనులై చరింతు రా
వికృతప్రజాడ్య మాదొరది విత్తము లేకయ వారు పూజ్యు లం
ధకజనదూషితంబులు ఘనంబులు గావె యమూల్యరత్నముల్.

అవ. "ధనవంతులకన్నను బండితులే రాజులచే నాదరింపఁదగినవా" రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. హర్తుర్యాతి న గోచరం కిమపి శం పుష్ణాతి యత్సర్వదాఽ
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమానమనిశం ప్రాప్నోతి వృద్ధిం పరామ్,
కల్పాన్తేష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్యమన్తర్ధనం
యేషాం తాన్ప్రతి మానముజ్ఝత నృపాః కస్తైస్సహ స్పర్ధతే? 12

వ్యా.—అథ విద్యాధనస్య ప్రసిద్ధధనవైలక్షణ్య వర్ణనద్వారా విదుషాముత్కర్షమాపాదయన్నేతేషు గౌరవేణ విశ్వాసోత్పాదనార్థం నృపాన్ సంబోధయతి; హర్తురితి.—యద్విద్యాఖ్యం ధనం, హర్తుశ్చోరాదేః-'హర్తుమితి' తుమున్నన్తపాఠే అపహర్తు మిత్యర్థః; గోచరం న యాతి విషయతాం న ప్రాప్నోతీతి-భావప్రధానో నిర్దేశః - తస్యాత్యన్తదుర్గ్రహత్వాదితి భావః, తథా సర్వదా కాలత్రయేఽపి, కిమప్యనిర్వాచ్యం, శం సుఖం, పుష్ణాతి వర్ధయతి - 'అర్థానా మార్జనే దుఃఖ మి'తి స్మరణాత్ - ప్రసిద్ధం తు నైవమితి భావః, అనిశం సర్వదా, అర్థిభ్యో విద్యార్థిభ్యః యాచకేభ్యశ్చ, ప్రతిపాద్యమానం వ్యాఖ్యాయమానం దీయమానమపి చ, పరా మత్యుత్కృష్టాం-వృద్ధి మభ్యుచ్ఛ్రయం, ప్రాప్నోతి విద్యాయా వ్యాఖ్యానే సాభివృద్ధి సంభవాదితి భావః, తథా కల్పాన్తేషు ప్రళయేష్వపి, నిధనం నాశం - న ప్రయాతి న నశ్యతీత్యర్థః,

కల్పాన్తేష్వపీతి బహువచనగ్రహణం విద్యాధనస్యాత్యన్తవినాశాభావ ప్రకాశనార్థం, ప్రసిద్ధం తూక్తవిపరీతమితి భావః - తదుక్తం —

'న భోగహార్యా, న చ బన్ధుహార్యా, న భ్రాతృహార్యా, న చ రాజహార్యాః

స్వదేశమిత్రం, పరదేశబన్ధు, ర్విద్యాసుధాం యే పురుషాః పిబన్తి.' ఇతి, తద్విద్యాఖ్యం విద్యాభిధానం. య త్తదో ర్నిత్యసంబన్ధా త్తశ్చబ్దస్యాధ్యాహారః, అన్తర్ధన మభ్యన్తరస్థవిత్తం, యేషాం పురుషాణా మస్తీతి శేషః, అత స్తా న్విద్యాధనా న్ప్రతి, హే నృపాః రాజానో, మానం కోపం దురాగ్రహమితి యావత్, ఉజ్ఝత, తైర్విద్వద్భి స్సహ, కః పుమాన్ - స్పర్ధతే నిగృహ్ణాతి-న కోపీత్యర్థః, తత స్తే సర్వదా గౌరవేణ బహు మాననీయా ఇతి భావః.

అత్రోపమానాత్ ప్రసిద్ధ ధనా దుపమేయస్య విద్యాధనస్యాధిక్యకథనాద్వ్యతిరేకాలంకారః—'ఉపమానాద్యదన్యస్య వ్యతిరేకస్స ఏవ స'ఇతి కావ్యప్రకాశకారలక్షణాత్. వృత్తం పూర్వవత్.

టీ. యత్ =ఏది (అనఁగా: విద్యాధనము), హర్తుః=అపహరించినవానికి, గోచరం=వశమును, నయాతి=పొందదో (అనఁగా విద్యాధనము నపహరించువాని చేతికిదొరకదనుట. అట్లే), సర్వదా = ఎల్లప్పుడు, కిమపి=చెప్పనలవి కాని, శం=సుఖమును, పుష్ణాతి=పెంచునో; అనిశం=ఎల్లపుడు, అర్థిభ్యః=యాచకులకు, ప్రతిపాద్యమానమపి = ఈయఁబడుచున్నప్పటికిని, పరాం=అతిశయమగు, వృద్ధిం=పెంపును, ప్రాప్నోతి=పొందుచున్నదో, కల్పాంతేషు అపి = ప్రళయకాలములయందు సైతము, నిధనం=నాశమును, నప్రయాతి = పొందదో, (తత్ = ఆ,) విద్యాఖ్యం = విద్యయను పేరుగల, అంతర్ధనం = లోపలనున్నద్రవ్యము, యేషాం = ఎవరికి. (అస్తి = కలదో,) తాన్ ప్రతి = (విద్యాధనముగల) వారియెడల, హేనృపాః = ఓదొరలారా! మానం=గర్వమును, ఉజ్ఝత=విడువుఁడు. కః=ఎవఁడు, తైః సహ = వారితోడ, స్పర్ధతే = మచ్చరించును.

తా. విద్యాధనమును దొంగలు హరింపలేరు. అది (ధనమువలెగాక) ఎల్లప్పుడు సుఖమునే కలుగఁజేయును.; కోరినవారి కెల్లప్పు డిచ్చుచుండినను మఱింత వృద్ధినందును. ప్రళయకాలమప్పుడును నశింపదు. ఇట్టివిద్యాధనముగలవారియెడ సామాన్యధనము గలరాజులు దురాగ్రహ ముడుగవలయును. వారి నెదుర్కొనుట కెవ్వరును జాలరు.

ఉ. హర్తకుఁ గాదు గోచర మశేషార్ని శమున్ సుఖపుష్టిసేయు స
ల్కీర్తి ఘటించు పద్య యను కి దివ్యధనం బఖిలార్థికోటికిం

బూర్తిగ నిచ్చినన్ బెరుఁగుఁ గాని బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు తద్ధనాధికుల గాపట్టున గర్వము మాను టొప్పగున్.

అవ. "పండితులు సంపదకు కట్టుపడరు" అనుచున్నాఁడు:—

శ్లో. పరిగతపరమార్థాన్ పణ్డితాన్ మాఽవమంస్థా
స్తృణమివ లఘు లక్ష్మీర్నైవ తాన్ సంరుణద్ధి,
అభినవమదరేఖాశ్యామగణ్డస్థలానాం
న భవతి బిసతన్తుర్వారణం వారణానామ్. 13

వ్యా. అథ త్వదీయలక్ష్మీర్న తేషాం ప్రతిబన్ధికా, అతస్తేషు బహుమానాచరణ తత్పరేణైవ భవితవ్యమితి సదృష్టాన్తం రాజానం సంబోధయతి; పరీతి— హే నృప, పరిగత పరమార్థాన్ విజ్ఞాతతత్త్వార్థాన్ - 'సర్వే గత్యర్థాః జ్ఞానార్థా' ఇతి న్యాయాత్ అథవా ప్రాప్తపురుషార్థాన్, పణ్డితాన్ విదుషః, మావమంస్థాః మావమానయ - మన్యతే రవపూర్వా ల్లుజి థాసి 'న మాఙ్యోగే' ఇ త్యట్ప్రతిషేధః. కుత స్తృణ మివ లఘు నిస్సారా-లక్ష్మీ స్త్వదీయసంపత్తిః- ని. 'శోభా సంపత్తి పద్మాసు లక్ష్మీః శ్రీరివ గీయతే' ఇతి విశ్వః, తాన్ పణ్డితాన్, నైవ సంరుణద్ధి ఈష దపి సంరోద్ధుం న శక్నో తీత్యర్థః; తత్ర దృష్టాన్తః. అభినవ - మదరేఖాభిః దానధారాభిః - శ్యామాని గణ్డస్థలాని యేషాం తేషాం, వారణానాం మత్తేభానాం, బిసతన్తు మృణాళసూత్రం, వారణం ప్రతిబన్ధక భూతం, న భవతి; అతః పణ్డితేషు బహుమానాచరణతత్పరత్వేనైవ వర్తితవ్యమిత్యర్థః.

అత్ర దృష్టాన్తాలంకారః—

యత్ర వాక్యద్వయే బిమ్బ ప్రతిబిమ్బతయోచ్యతే,
సామాన్యధర్మో వాక్యజ్ఞైః స దృష్టాన్తో నిగద్యతే.'

ఇతి లక్షణాత్; స చోక్తోపమయాఽఙ్గేన సంకీర్యతే.

మాలినీవృత్తం-'ననమయయయుతేఽయం మాలినీ భోగిలోకై 'రితి లక్షణాత్.

టీ. పరి...ర్థాన్-పరిగత = పొందఁబడిన, పరమ=శ్రేష్ఠమైన, అర్థాన్ =పదార్థము గల (అనఁగా: తత్త్వవేత్తలయిన), పండితాన్ = విద్వాంసులను, మాఅవమంస్థాః = అవమానము చేయకుము. ఏల యనఁగా:) తృణమివ = గడ్డిపోఁచవలె, లఘు = అల్పమైన, లక్ష్మీః=(నీ)సంపద, న ఏవ సంరుణద్ధి = అడ్డగింపనే అడ్డగింపదు. (ఎట్లనః) అభి...స్థలానాం-అభినవ = మిక్కిలి క్రొత్తలైన, మదరేఖా = మదపుచాఱలచే, శ్యామ=నల్లనైన

గండస్థలానాం = చెక్కిళ్ళప్రదేశములుగల, వారణానాం = ఏనుఁగులకు, బిసతంతుః = తామర తూఁటిలోనిపోఁగు, వారణం = అడ్డగించునది, న భవతి = కాదు.

తా. ఓయీ! యథార్థ మెఱిఁగినపండితుల నవమానింపకుము. నీసంపదను చూచి నీమాటల భరింతు రని తలఁచెదవేమొ కాని వారు నీ సంపదను గడ్డిపోఁచవలె చూతురు. నూతనముఁగ మదధారకారుటచేత నలువెక్కిన చెక్కిళ్లుగల మదగజంబుల తామరతూటిచేతఁ గట్టి వేయుట సాధ్యమగునా?

తే. ప్రభులు పండితు లగువారిఁవలన గర్వ
కలన మానుఁడు వారు మీఁకలిమి తృణము
లీలఁ బోలింప లేమి, మృణాళగుణము
భూరిమదవారణములకు న్ వారణంబె. 13

అవ. "రాజు ఒకవేళఁ గోపించునేని పండితులను దన యాస్థానమునుండి పొమ్మనఁగలఁడే కాని వారిపాండిత్యమును గీర్తిని బోఁగొట్టలేఁడు" అని చెప్పు చున్నాఁడు:—

శ్లో. అమ్భోజినీవనవిహారవిలాసమేవ
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా,
న త్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తిమపహర్తుమసౌ సమర్థః. 14

వ్యా.—కిం బహునా బ్రహ్మాఽపి తదీయవైదగ్ధ్యాపహరణే న శక్త ఇతి దృష్టాన్త ముఖేనాహ—అమ్భోజినీతి.—విధాతా బ్రహ్మా, కుపితః కేనచిద్ధేతునా క్రుద్ధ స్సన్, హంసస్య నిజయానమరాళస్య, అమ్భోజినీవనే పద్మినీవనే - యో విహారః క్రీడా - స ఏవ విలాసః లీలా - తమేవ న త్వన్యత్, నితరామ్ అతిశయేన, హన్తు నాశ యతు, 'విలాస మేక' మితి పాఠే - ఏకం కేవలం విలాసమిత్యన్వయః, అమ్భోజా కరసంశోషణేన తత్ర విహారభఙ్గమాత్ర మేవ కర్తుం శక్నోతీత్యర్థః, కిం త్వసౌ విధాతా, అస్య హంసస్య, దుగ్ధజలయోః క్షీరనీరయో - ర్భేదవిధౌ విభాగకరణే విషయే, ప్రసిద్ధాం ప్రఖ్యాతాం, వైదగ్ధ్యకీర్తిం వైదగ్ధ్యేన 'కృత్యవస్తుషు చాతుర్యం వైదగ్ధ్యం పరికీర్త్యతే' ఇత్యుక్తలక్షణనైపుణ్యేన - ప్రయుక్తా యా కీర్తి స్తాం, అప హర్తుం న శక్నోతి. హంసో హి క్షీరమిశ్రితే నీరే నీరం విహాయ క్షీరం గృహ్ణాతీతి ప్ర

సిద్ధిః. ఏవం కుపితో రాజా స్వవిషయవాసాదిభఙ్గమాత్రమేవ కర్తుం శక్నోతి, న తు తేషామశేషవిద్యాపరిశీలనజనితచాతుర్యభఙ్గ, మతో నిష్కోపేన భవితవ్యం విద్వత్సు రాజ్ఞేతి తాత్పర్యమ్.

అత్రాప్రకృత విధాతృవృత్తాన్త కథనాత్ ప్రస్తుత రాజవిద్వజ్జన వృత్త ప్రతీతే రప్రస్తుతప్రశంసాలంకారః - లక్షణం తూక్తమ్.

వసన్తతిలకావృత్తమ్—'ఉక్తా వసన్తతిలకా తభజా జగౌ గ' ఇతి లక్షణాత్.

టీ. విధాతా = బ్రహ్మ, కుపితః = కోపించినవాఁడై, హంసస్య = (తనవాహనమగు) హంసయొక్క, అంభో...లాసం ఏవ - అంభోజినీవన = తామరతంపరలయందలి, విహార= విహరించుటలయొక్క, విలాసం ఏవ = సొంపునుమాత్రమే, హన్తు = పాడుచేయును గాక. (కిం)తు = అంతయేకాని, అసౌ = ఈఁడు (బ్రహ్మ), అస్య = దీనియొక్క (హంస యొక్క), దుగ్ధ...విధా-దుగ్ధ = పాలయొక్కయు, జల = నీటియొక్కయు, భేదవిధా = వేఱుచేయుటయందు, ప్రసిద్ధాం = పేరొందిన, వైదగ్ధ్యకీర్తిం = నేర్పుయొక్క కీర్తిని, అపహర్తుం = అపహరించుటకు, సమర్థః న = నేర్పరి గాఁడు.

తా. బ్రహ్మకు హంసమీఁద కోపమువచ్చునేని పద్మసరోవరము లందు విహరింపకుండునటుల చేయఁగలఁడుగాని నీరక్షీరంబుల వేఱు పఱుచుటయందుఁ గలనేర్పును తీసివేయఁజాలఁడుగదా!

చ. వనజభవుండు కోపమున వాహనమైనమరాళభర్తకుఁ
వనజవనీవిహారకలనంబు దొలంగఁగఁ జేయుఁగాని గుం
భనమున దుగ్ధజీవనవిభాగవిధాననిరూఢనైపుణీ
జనితమహాయశోవిభవసారము హంసకు మాన్పఁ జాలునే.

అవ. "పురుషునకు విద్యయే యాభరణముగాని వేఱుగాదు" అనుచున్నాఁడు:—

శ్లో. కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం నాలఙ్కృతా మూర్ధజాః
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తేఽఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్. 15

వ్యా. అథ విదుషాం తావద్విద్యైవ భూషణరూపసంపత్తిరిత్యాహ ద్వాభ్యాం—కేయూరాణీతి—కేయూరాణ్యఙ్గదాని - యద్యపి కేయూరయోర్నిజ భుజశిరోభూషణత్వేన ద్విత్వమేవ వక్తవ్యం - తథాఽపి తద్విశేషవివక్షాయాం బహు

వచన ప్రయోగ ఇతి మన్తవ్యం, పురుషం జనం, న భూషయన్తి నాలంకుర్వన్తీతి యథాయోగం సంబధ్యతే, చన్ద్రివ దుజ్జ్వలా ధవళతరాః, హారా ముక్తాహారాశ్చ, న భూషయన్తి, స్నాన మభిషేకోఽపి, న భూషయతి, విలేపనం ఘనసార కస్తూరీ గన్ధసార చర్చాఽపి. న భూషయతి కుసుమం మల్లికా మాలతీ చమ్పకాది పుష్పమపి - జాతా వేకవచనం, న భూషయతి అలంకృతా అభ్యఙ్గపుష్పమాల్యాదినా సమ్యక్ప్రసాదితా, మూర్ధజాః శిరోరుహాః, అపి న భూషయన్తి పురుషమితి సర్వత్రానుషఙ్గః కిం త్వేకా కేవలా, వాణీ, పురుషం, సమలంకరోతి సమ్యగ్భూషయతి, కేయం వాణీ త్యత ఆహ—యా సంస్కృతా వ్యాకరణాదిపరిశుద్ధా, ధార్యతే స్వాయత్తీక్రియతే, సేత్యధ్యాహృతతచ్ఛబ్దేన సంబన్ధః; నను కేయూరాదీనాం విభూషణత్వేన ప్రసిద్ధత్వాత్తన్నిషేధే ప్రత్యక్షాపలాపః స్యాదిత్యాశఙ్క్య తేషాం క్షయిష్ణుత్వా న్న తథాత్వ మిత్యాహ—అఖిలభూషణాని కేయూరాద్యుక్తాశేషభూషణాని, క్షీయన్తే కాలక్రమేణ నశ్యన్తి-'క్షీయన్తే ఖ ల్వి' తి పాఠే ఖలుశబ్దో వాక్యాలంకారే, వాగ్భూషణం సంస్కృతవాగ్రూపభూషణం తు, సతతం, భూషణం నిత్యభూషణం - కదాఽపి న నశ్యతీ త్యర్థః.

వ్యతిరేకాలంకారః - లక్షణం తూక్తమ్.

ఏత దాదిశ్లోకచతుష్టయం శార్దూలవిక్రీడితం వృత్తమ్.

టీ. పురుషం = మనుష్యుని, కేయూరాణి = భుజకీర్తులు, న భూషయంతి = అలంకరింపవు; చంద్రఉజ్జ్వలాః = చంద్రునివలెఁ బ్రకాశించునట్టి, హారాః = ముత్యాల హారములు, న భూషయంతి; స్నానం = జలకము, న భూషయతి = అలంకరింపదు. విలేపనం= (పచ్చకర్పూరము కస్తూరి కుంకుమపువ్వు మొదలగువాని వాసనచే గమగమలాడు) మైపూఁత, న భూషయతి; కుసుమం = పుష్పము, న భూషయతి; అలంకృతాః = ఉంచుకొనఁబడిన, మూర్ధజాః = వెండ్రుకలు, న భూషయంతి; (ఇఁక నేమనిన;) యా = ఏది, సంస్కృతా = (వ్యాకరణము మొదలగు శాస్త్రములచే) చక్కఁజేయఁబడినదై, ధార్యతే = ధరింపఁబడుచున్నదో, (సా=ఆ,) ఏకావాణీ = ఒకవాక్కుమాత్రమే, పురుషం=మనుష్యుని, సమలంకరోతి = బాగుగ నలంకరించుచున్నది. అఖిలభూషణాని = (తక్కిన) అభరణము లన్నియు, క్షీయంతే = క్షయించును. వాగ్భూషణం (తు) వాక్కనెడు నాభరణ మన్ననో, సతతం = ఎల్లప్పుడు, అభరణము. (నిత్యమైన అభరణ మనుట.)

తా. పురుషునకు భుజకీర్తులు,సూర్యహారములు,చంద్రహారములు, మొదలగునొమ్ములుగాని, స్నానము, చందనము పూసికొనుట, పూలు

ముడుచుకొనుట, కురులుదువ్వుకొనుట మొదలగువానిలో నేదియుఁగాని యలంకారము నియ్యఁజాలదు. శాస్త్రసంస్కారము గలవాక్కు ఒకటియే అలంకారమును కలుగఁజేయును. సువర్ణమయాదిభూషణములన్నియు నశించును. వాగ్భూషణ మొక్కటియే నశించనిభూషణము

ఉ. భూషలు గావు మర్త్యులకు ? భూరిమయాంగదతారహారముల్
భూషితకేశపాశమృదుసుపుష్పసుగంధజలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని ? భూషితుఁ జేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

అవ. "విద్యయనునదియే సర్వోత్తమమనియు, విద్యరానివాఁడు పశుప్రాయుఁ" డనియుఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. విద్యా నామ నరస్య రూపమధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం.
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః,
విద్యా బన్ధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా
విద్యా రాజసు పూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః. 16

వ్యా.—విద్యా నామేతి.—రూపం నామ కుణ్డలహారనూపురాఙ్గదాదిచతుర్విధభూషణాభావేఽపి విభూషితవ ద్భాసమాన ఆకారవిశేషః - తదుక్తం భావప్రకాశే—

'అవేధ్యారోప్యవిక్షేప్యబన్ధనీయైరభూషితమ్,
యద్భూషితమివాభాతి తద్రూపమితి కథ్యతే.' ఇతి.—

విద్యా నామ వేదశాస్త్రాద్యాత్మికా విద్యైవ, నరస్య పుంసో ఽధికం భూయిష్ఠం, రూప ముక్తలక్షణాకారవిశేషః - తద్వల్లోకరఞ్జకత్వాదితి భావః, తథా ప్రచ్ఛన్నం నిగూఢం యథా తథా - గుప్తం రక్షితం, ధనం విద్యైవేతి సంబన్ధః - తద్వత్కాలాన్తరే మహోపకారకత్వాదితి భావః, విద్యా భోగాన్ కరోతీతి భోగకరీ స్రక్చన్దనాదిభోగ్యవస్తులాభహేతుః తథా యశస్సమాఖ్యా-సుఖ మిన్ద్రియతర్పణమ్ - వితత్కరీ విశద్ధేతుశ్చ - ఉభయత్రాపి * 'కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యేష్వి'తి టప్రత్యయే టిత్త్వాత్ ఙీప్, తథా విద్యా, గృణ న్త్యుపదిశ న్తీతి గురవస్తేషాం హితాహితోపదేష్టౄణా మాచార్యాణామపి - గురు రుపదేష్టృభూతా - తథా పరమార్థబోధకత్వాదితి భావః, విదేశగమనే ప్రవాసే, బన్ధుజనః సుహృజ్జనః - తద్వద్విశేషోపచారసంపాదకత్వాదితి భావః - తదుక్తం—'స్వదేశమిత్రం పరదేశబన్ధుం విద్యాసుధాం యే పురుషాః పిబన్తి', విద్యా, పరా దేవతా పరమాత్మభూతా - మోక్షదాయ

కత్వాదితి భావః - యద్వా పరా దేవతా స్వాభీష్టదేవతా - తథా ఐహికాముష్మికఫలదత్వాదితి భావః - విద్యా, రాజసు రాజమధ్యే, పూజ్యతే ప్రశస్యతే - గౌరవసంపన్నత్వా ద్రాజపూజ్యా భవతీత్యర్థః - యద్వా విద్యాశబ్దేన విద్యావాన్ లక్ష్యతే రాజశబ్దేన చ తత్సభాః లక్ష్యన్తే తథా చ విద్యావాన్ రాజసభాసు పూజ్యతే పురస్క్రియతే సంభావ్యత ఇతి యావత్, ధనం ద్రవ్యం తు న హ్యుక్తప్రకారం న భవతీత్యర్థః, తస్మాద్విద్యయా ఉక్తరూపయా - విహీన శ్శూన్యః జనః, పశుః పశుప్రాయః - కర్తవ్యాకర్తవ్య వివేకరాహిత్యాదితి భావః, తతో బహూపకారకత్వా ద్విశిష్టవిద్యైవ ప్రధానం న త్వన్యదితి తాత్పర్యమ్.

అత్ర విద్యాయాః రూపధనాద్యాకారేణ బహుధా నిరూపణా న్నిరవయవ మాలారూపకాలంకారః.

టీ. విద్యా నామ = విద్యయనునది, నరస్య = పురుషునకు, అధికం=అతిశయమైన రూపం = అందము; ప్రచ్ఛన్నగుప్తం = చాటుగా దాఁచిపెట్టఁబడిన, ధనం=ద్రవ్యము విద్యా = విద్య, భోగకరీ=భోగములను గలిగించునది; సుఖకరీ=సుఖములను గలిగించునది; విద్యా = విద్య, గురూణాంగురుః=గురువులనుగురువు; విద్యా=విద్య, విదేశగమనే=పరదేశమునకుఁ బోవునపుడు, బంధుజనః = చుట్టము, విద్యా=విద్య, పరా = ఉత్కృష్టమైన, దేవతా=దేవత; విద్యా=విద్య, రాజసు=రాజులనడుమ, పూజ్యతే=పూజింపఁబడుచున్నది. ధనం = ధనము నహి = కాదుగదా? (పూజింపఁబడదు అనుట.) విద్యావిహీనః=విద్యలేని వాఁడు, పశుః=పసరము, (నీచుఁ డనుట.)

తా. పురుషునకు విద్యయే రూపము. విద్యయే రహస్యముగ దాఁచి పెట్టఁబడినధనము. విద్యయే సకలభోగములను కీర్తిని సుఖమును కలుగఁ జేయును. విద్యయే గురువువలె అన్నియుబోధించును. పరదేశమునందు జుట్టమువలె సహాయ మొనర్చును. విద్యయే పరమాత్మ. విద్యయే రాజపూజితము. ధన మిట్టిది కాదు. ఇట్టి విద్యలేనివాఁడు పశుతుల్యుఁడు.

ఉ. విద్య నిగూఢగుప్త మగువిత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటి ధనంబు లే దిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే

అవ. (విద్య యుండిన సర్వ ముండినట్లే" యనుచున్నాఁడు:—

శ్లో. క్షాన్తిశ్చేత్కవచేన కిం కిమరిభిః క్రోధోఽస్తి చేద్దేహినాం
జ్ఞాతిశ్చే దనలేన కిం యది సుహృద్దివ్యౌషధైః కిం ఫలమ్,

కిం సర్పై ర్యది దుర్జనాః కిము ధనై ర్విద్యాఽనవద్యా యది
వ్రీడా చేత్కిము భూషణై స్సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్. 17

వ్యా.—అథ లోకహితాహిత వర్ణన ప్రసంగాత్తస్యా ఏవ ప్రకృతై్యర్యభావశ మాహ.—క్షాన్తిరితి.—దేహినాం ప్రాణినాం - క్షాన్తిః తితిక్షా-పరిభవాదిషూత్పద్య మానేషు క్రోధప్రతిబన్ధక ఇతి యావత్, అస్తి చే త్తర్హి, కవచేన వర్మణా, కిం ఫల మితి సర్వత్రానుషజ్యతే న కించిదపీత్యర్థః - తస్యా ఏవాయుధదానా మనవకాశ ప్రదత్వాదితి భావః. క్రోధ శ్చిత్తక్షోభో, ఽస్తిచేత్, అరిభిః శత్రుభిః కిం, తస్యైవా న్తశ్శత్రుత్వా దుపద్రవహేతుత్వాచ్చేతి భావః, జ్ఞాతిర్దాయాదోఽస్తి చే, దనలేనా గ్నినా కిం, తస్యైవ సర్వార్థనిర్మూలననిదానత్వాదితి భావః, సుహృత్ సన్మిత్ర మస్తి యది * 'సుహృ ద్దుర్హృదౌ మిత్రామిత్రయో రి'తి నిపాతనాత్సాధుః, దివ్యౌషధైః సిద్ధౌషధైః, కిం ఫలం న కించిదపి-త స్యైవారోగ్యకరత్వాదితి భావః, దుర్జనాః ఖలా, స్సన్తి యది, సర్పై రాశీవిషైః కిం, తేషా మేవ ప్రాణాపహారిత్వాదితి భావః, అనవద్యా నిర్దుష్టా * అవద్య ప ణ్యేత్యాదినా నిపాతనా త్సాధుః, తతో నఞ్ సమాసః - 'తస్మా న్ను డచీ'తి నుడాగమః, విద్యా వేదవేదాఙ్గాద్యాత్మికా, అస్తి యది, ధనైః కిం తస్యా ఏవాఖిలభోగసాధకత్వాదితి భావః, వ్రీడా అకార్యప్రవృత్తౌ మనస్సంకోచ లక్షణలజ్జాఽస్తిచే, ద్భూషణైః కిము హారనూపురాద్యలంకరణైః కిం-తస్యా ఏవ లోకో త్తరభూషణత్వాదితి భావః, సుకవితా సత్కావ్యకర్తృత్వం- ని. 'సంఖ్యావా న్పణ్డితః కవి'రిత్య మరః-యద్వా కవయతి వర్ణయతి రసోల్లసితశబ్దార్థసంఘటనాం కరోతీతి కవి-స్తస్యభావ స్తత్తా-యది, రాజ్యేన భూమణ్డలాధిపత్యేన కిం - తస్యా ఏవ సకలలోక వశీకరత్వాదితి భావః - రాజ్ఞో భావః కర్మ వా రాజ్యం ప్రజాపరిపాలనాత్మకం = పురోహితాదిత్వా ద్యక్ప్రత్యయః.

టీ. దేహినాం = ప్రాణులకు, క్షాంతిః=ఓర్పు (అనఁగా: ఇతరులు తన్ను బాధించు చున్నను కోపింపక సహించియుండుట), అస్తిచేత్ = కలదేని, కవచేన = కవచముచేత కింఫలం=ఏమిలాభము ? ('ఫలమ్' అనుపదము 'కిం' పదములన్నిటితోడను అన్వయించు చున్నది) క్రోధః = చిత్తక్షోభము, అస్తిచేత్, అరిభిః=శత్రువులచే, కింఫలమ్; జ్ఞాతిః = దాయాది, అస్తిచేత్, అనలేన=నిప్పుచే, కింఫలమ్; సుహృత్=మిత్రుఁడు, అస్తి యది = కలఁడేని, దివ్యౌషధైః=సిద్ధౌషధములచే, కింఫలం, దుర్జనాః - దుర్మార్గులు, సంతిచేత్ = కలరేని, సర్పైః = పాములచే, కింఫలం; అనవద్యా = దోషరహితమైన, విద్యా = విద్య, అస్తి యది, ధనైః = ద్రవ్యములచే, కింఫలం; వ్రీడా = సిగ్గు, అస్తిచేత్, భూషణైః =

నగలచే, కింఫలం; సుకవితా = మంచికవిత్వము, అస్తియది, రాజ్యేన = ప్రభుత్వముచేత, కిం ఫలమ్.

తా. ఓరుపున్నయెడల కవచము లక్కఱ లేదు. కోపమున్నయెడల (ఉపద్రవము గలుగఁజేయుటకు) శత్రువు లక్కఱ లేదు. దాయాది యున్నయెడల వేఱె నిప్పు అక్కఱ లేదు. మిత్రముండెనేని సిద్ధౌషధము లక్కఱ లేదు. దుర్జనులుండి రేని సర్పము లక్కఱ లేదు.

చ. క్షమ కవచంబు క్రోధ మది శత్రువు జ్ఞాతి హుతాశనుండు మి
త్రము దగుమందు దుర్జనులు దారుణపన్నగముల్ సువిద్య వి
త్త ముచితలజ్జ భూషణ ముదా త్తకవిత్వము రాజ్య మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగుపట్టునఁ దక్కవచాదు లేటికిన్?

అవ. "విద్వాంసులవల్ల నే లోకము చక్కఁగ నిలిచియున్న"దనిచెప్పుచున్నాఁడు:-

శ్లో. దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే
ప్రీతిః సాధుజనే నయో నృపజనే విద్వజ్జనే చార్జవమ్,
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాన్తాజనే ధృష్టతా
యే చైవం పురుషాః కలాసు కుశలా స్తేష్వేవ లోకస్థితిః. 18

వ్యా.—అథవిదుషాం గుణవర్ణనపూర్వకం లోకవ్యవస్థాపకత్వమాహ—దాక్షిణ్య మితి—స్వజనే బన్ధుజనేష్విత్యర్థః జాతా వేకవచనమ్ - ఏవ ముత్తర త్రాపి - దాక్షిణ్యం ఛన్దానువర్తనమ్ - అన్యథా వినిందేయురితి భావః - ని. 'దక్షిణ స్సరళా వామపరచ్ఛన్దానువర్తిష్వి'తి, పరిజనే భృత్యజనేషు విషయే, దయా దారిద్ర్యాదితద్దుఃఖ ప్రహాణేచ్ఛా - అన్యథా విజహ్యురితి భావః, దుర్జనే ఖలజనేషు విషయే, సదా శాఠ్యం విప్రియకారిత్వమ్ - అన్యథా అధిక్షిపేర న్నితి భావః, సాధుజనే సజ్జనేషు విషయే, ప్రీతిః స్నేహః-ఆదర ఇతి యావత్-అన్యథాఽనుత పేయురితి భావః. నృప జనే రాజసు విషయే, నయో నీతిః - అనువర్తనతాత్పర్యమితి యావత్ - అన్యథా దణ్డ యేరన్నితి భావః, విద్వజ్జనే పణ్డితజనేషు విషయే, ఆర్జవ మవక్రతా-అన్యథా నిషి ధ్యేయు రితి భావః, శత్రుజనే శత్రుజనేషు విషయే, శౌర్యం విక్రాన్తత్వం - అన్యథా నిపాతయేర న్నితి భావః, గురుజనే పిత్రాదిషు విషయే, క్షమా సహిష్ణుత్వం - అన్యథా శపేరన్నితి భావః, కాన్తాజనే నారీజనేషు విషయే, ధృష్టతా ప్రాగల్భ్యంచ - అన్యథా వశీకుర్యురితి భావః; ఇత్యేవముక్త విధాసు, కలాసు శిల్పేషు - ని. 'కళా శిల్పే

కాలభేదే చన్ద్రాంశే కలనా క' శేతి వైజయన్తీ. యే చ పురుషాః, కుశలాః నిపుణాః, తేషు పురుషేష్వేవ, లోకస్థితిః లోకమర్యాదా, అస్తీతి శేషః, త ఏవ లోకవ్యవస్థా సంస్థాపకాః న తూక్తగుణరహితా ఇత్యర్థః. ఏవం భూతాస్తు విద్వాంస ఏవ న త్వన్య ఇతి హృదయమ్.

టీ. స్వజనే = తనవారియందు, (ఇచ్చట: జనే = జాత్యేకవచనము) దాక్షిణ్యం= మోమోటము, పరిజనే = సేవకజనమునందు, దయా = కనికరము, దుర్జనే = దుష్టుని యందు, శాఠ్యం = రహస్యముగా నప్రియముచేయుట, సాధుజనే = మంచివారియందు, ప్రీతిః = ప్రేమ, నృపజనే = రాజులయెడ, నయః=నీతియు, విద్వజ్జనే=పండితులయెడ, ఆర్జవం = తిన్నదనము, శత్రుజనే=శత్రువులయెడ, శౌర్యం=పరాక్రమము, గురుజనే= గురువులయెడ, క్షమా = ఓర్పు, కాంతాజనే=స్త్రీలయెడ, ధృష్టతా=దిట్టతనము, ఏవం= ఇట్లు, కలాసు = విద్యలయందు, యేచపురుషాః=ఏపురుషులు, కుశలాః=నేర్పరులో, తేషు ఏవ=వారియందే, లోకస్థితిః = లోకమర్యాద, (అస్తి = ఉన్నది.)

తా. బంధువులయందు దాక్షిణ్యముతో నుండుటయు (దాక్షిణ్య మనఁగా వారియిష్టానుసారము నడచుట), సేవకులయందు దయ, దుర్జనులయందు కఠినముగ నుండుట, సజ్జనులయందుఁ బ్రీతియు, రాజులయందు అనుసరణమును, విద్వాంసులయందుఁ గ్రమప్రవర్తనమును, శత్రువులయందుఁ బరాక్రమమును, పెద్దలయందు ఓర్పును, స్త్రీలయందు దిట్టతనమును ఏపురుషులు గనఁబడుదురో అట్టివారలే లోకస్థితికిఁ గారణభూతులు.

చ. వరకృప భృత్యులందు నిజవర్గమునం దనుకూలవృత్తి కా
పురుషులయందు శాఠ్యము సుబుద్ధులయం దనురక్తి దాల్మిస
ద్గురువులయందు గౌరవము కోవిదులందు నయంబు రాజులం
దరిజనులందు శౌర్యము మృగాక్షులయందుఁ బ్రగల్భభావ మీ
వరుసఁ గళాప్రవీణు లగువారలయందు వసించు లోకముల్.

అవ. "సజ్జనసాంగత్యము మిక్కిలి గొప్పది" యనుచున్నాఁడు:—

శ్లో. జాడ్యం ధియో హరతి సిఞ్చతి వాచి సత్యం
మానోన్నతిం దిశతి పాప మపాకరోతి,
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సఙ్గతిః కథయ కిం న కరోతి పుంసామ్, 19

వ్యా. ఇత్థం విద్వజ్జనా నమవర్ణ్య సంప్రతి సత్సంగతే శ్శ్రేయస్కరత్వ మాహ.—జాడ్యమితి.—ధియః బుద్ధేః, జాడ్యం మాన్ద్యం, హరతి నిరస్యతి, వాచి వచనే, సత్యం సూనృతభావం, సిఞ్చత్యాప్లావయతి, మానోన్నతిం బహుమానాతిశయం, దిశతి ప్రయచ్ఛతి, పాపం కిల్బిషం, మపాకరోతి నాశయతి - ధర్మోపదేశాదినేతి భావః, తథా చేతః, ప్రసాదయతి నిర్మలయతి - జ్ఞానోపదేశాదినేతి భావః, దిక్షు దశసు కీర్తిం, తనోతి విస్తారయతి, అత స్సత్సంగతి స్సుజనసమాగమః, పుంసాం కిం శ్రేయో న కరోతి కథయేతి పృష్టజనసంబోధనమ్ - సర్వమపి శ్రేయః కరోత్యేవేత్యర్థః. అత స్తైరేవ సంగతిః కర్తవ్యా న తు దుర్జనైరితి తాత్పర్యమ్.

అత్ర క్రియాణాం బహూనాం "సముచ్చితత్వాత్సముచ్చయాలంకారః— 'గుణక్రియాయౌగపద్యం సముచ్చయ ఉదాహృతః' ఇతి లక్షణాత్.

వసంతతిలకావృత్తం - లక్షణం తూక్తమ్.

టీ. సత్సంగతిః = మంచివారితోడి సహవాసము, పుంసాం=పురుషులకు, ధియః= బుద్ధియొక్క, జాడ్యం = మాంద్యమును, హరతి = పోఁగొట్టును. వాచి = వాక్కునందు, సత్యం=నిజమును, సించతి=చల్లును (అనఁగా: సత్యవాదిని జేయు ననుట.) మానఉన్నతిం= గౌరవముయొక్క యాధిక్యమును (మిక్కిలిగౌరవమును), దిశతి = ఇచ్చును. పాపం = పాపమును, అపాకరోతి = పోఁగొట్టును. చేతః = మనస్సును, ప్రసాదయతి=నిర్మలము చేయును. దిక్షు-దిక్కులయందు; కీర్తిం=యశస్సును, తనోతి=విస్తరింపఁజేయును, కిం= దేనిని, న కరోతి = చేయదు, కథయ = చెప్పుము.

తా. సత్సహవాసము బుద్ధిమాంద్యమును బోఁగొట్టును. సత్యవాక్యములనే పలుకఁజేయును. మంచిగౌరవము నిచ్చును. పాపములఁ బోఁగొట్టును. మనస్సు బాగుచేయును. దిక్కులయందుఁగీర్తిని వ్యాపింపఁ జేయును. వేయేల? అది చేయఁజాలని మంచి యీలోకమున లేదు.

తే. సత్యసూక్తిఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవిశుద్ధిఁ జేయు
సాధుసంగంబు సకలార్థసాధనంబు

అవ. "మహాకవులు మృతులయినను కీర్తిశరీరు లయి బ్రదికియే యుందు" రను చున్నాడు:—

శ్లో. జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్. 20

వ్యా.—అథై తేషామసాధారణమహిమాస్పదత్వాల్లోకోత్తరత్వం వర్ణయన్నిగమయతి—జయన్తీతి.—సుకృతినో ధన్యాః—ని. 'సుకృతీ పుణ్యవాన్ ధన్య' ఇత్యమరః, రససిద్ధాః సిద్ధశృఙ్గారాదిరసాః సిద్ధపారదఘుటికాశ్చ * 'వాఽఽహితాగ్న్యాదిష్వి'తి నిష్ఠాయాః పరనిపాతః, తే ప్రసిద్ధాః పూర్వోపవర్ణితా వా, కవీశ్వరాః కవిసార్వభౌమాః పణ్డితోత్తమా ఇతి వా, జయన్తి సర్వోత్కర్షేణ వర్తన్తే-అద్యాఽపీతి శేషః, యద్వా - రససిద్ధాః సిద్ధరసాః - బ్రహ్మసాక్షాత్కారవన్త ఇత్యర్థః - 'రసో వై స' ఇతి శ్రుతేః,

'శృఙ్గారాదౌ విషే వీర్యే పారదే బ్రహ్మవర్చసే,
వేతస్యాస్వాదనే హేమ్ని నిర్యాసేఽమృతశబ్దయోః—రసః.'

ఇత్యభిధానాచ్చ, కవీశ్వరాః కవయః క్రాన్తదర్శిన స్తేషామీశ్వరాః కాలత్రయాభిజ్ఞా బ్రహ్మవిద్యావిశారదా ఇత్యర్థః, జయన్తి. కుత స్తేషాం కవీశ్వరాణాం, యశఃకాయే కీర్తిశరీరే, జరామరణాభ్యాం జాతమ్ - ఇతి తథోక్తం, భయం నాస్తి; రససిద్ధానాం భౌతికశరీర ఏవ జరామరణభయం నాస్తి, యశశ్శరీరే తు కిం వక్తవ్యం? తస్య కల్పాన్తస్థాయిత్వాదితి భావః.

అత్ర రససిద్ధపదార్థస్య విశేషణగత్యా భయాభావపదార్థం ప్రతి హేతుత్వాత్కావ్యలిఙ్గభేదః. వృత్తముక్తమ్.

టీ. సుకృతినః = మంచిగ్రంథములను రచించినవారును (పుణ్యవంతులును అని యర్థాంతరము), రససిద్ధాః = సిద్ధించిన శృంగారాదిరసములుగలవారును (సిద్ధించిన పాదరసములుగలవారును), (అయిన), తే = ప్రసిద్ధులగు, కవీశ్వరాః = కవీంద్రులు (కాలత్రయ వేదులగు యోగులు), జయన్తి = సర్వోత్కృష్టులై యున్నారు. తేషాం = వారి (కవీశ్వరుల యోగుల) యొక్క, యశఃకాయే = కీర్తి యనెడు శరీరమునందు, జరామరణజం = ముదిమిచేతను చావుచేతను పుట్టిన, భయం = దిగులు, న అస్తి = లేదు

తా. తత్తద్రసానుగుణముగ వర్ణించు నైపుణ్యముండుటచేత ధన్యాత్ములగు కవీశ్వరులు జరామరణములు లేని తమకీర్తిశరీరములచేత సిద్ధౌషధసేవచే జరామరణముల నతిక్రమించిన యోగులవలె సర్వదా ప్రకాశించుచుందురు.

క. సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు ♦ సుమ్ము తదీయా
ధికకీర్తిశరీరంబులు
ప్రకటజరామరణజన్మ ♦ భయరహితంబుల్.

ఇతి నీతిశతకమునందు విద్వత్పద్ధతివర్ణన మను రెండవదశకము.

---

## మానశౌర్యపద్ధతి

అవ. విద్వత్పద్ధతిని నిరూపించినపిదప విద్వాంసులకు సైతము మానశౌర్యము లావశ్యకము లగుటవలన, నీమానశౌర్యపద్ధతి నారంభించుచున్నాఁడు:—

శ్లో. క్షుత్క్షామోఽపి జరాకృశోఽపి శిథిలప్రాయోఽపి కష్టాం దశా
మాపన్నోఽపి విపన్నదీధితిరపి ప్రాణేషు నశ్యత్స్వపి,
మత్తేభేన్ద్రవిభిన్నకుమ్భపిశితగ్రాసైక బద్ధస్పృహః
కిం జీర్ణం తృణమత్తి మానమహతామగ్రేసరః కేసరీ. 21

వ్యా.—అథవిదుషామపి మానశౌర్యయోరపేక్షితత్వాద్విద్వత్పద్ధతినిరూపణానన్తరం మానశౌర్యపద్ధతిం నిరూపయతి—క్షుత్క్షామ ఇతి—క్షుధా క్షామః క్షీణోఽపి * 'క్షామో మ'ఇతి మత్వం, జరయా విస్రసయా-కృశో జీర్ణోఽపి-ని. 'విస్రసా జరే'త్యమరః, శిథిలప్రాయః విశ్లథాఙ్గతయా బలహీనస్సన్నపీత్యర్థః, కష్టాందశా మాహారాలాభాదతికృచ్ఛ్రావస్థా, మాపన్నః ప్రాప్తోఽపి, ని. 'దశావస్థా వవస్థాయామి'తి విశ్వః. అత ఏవవిపన్నదీధితి ర్నష్టకాంతిరపి, కిం బహునా? ప్రాణేషు పఞ్చసు, నశ్యత్సూత్క్రామాణేషు సత్స్వపి-ప్రాణప్రయాసే సంప్రాప్తే సత్యపీత్యర్థః, మత్తేభేన్ద్రస్య మత్తగజపుఙ్గవస్య - విభిన్నో విదారితో - యఃకుమ్భః కుమ్భస్థలం - తత్ర యత్పిశితం మేదో మాంసం-తద్గ్రాసే తత్కబళనే-ఏకం ముఖ్యం యథా తథా - బద్ధా సన్దానితా-స్పృహా వాఞ్ఛా యస్య స, ఇతి శౌర్యాతిశయోక్తిః, తథా మానమహతామభిమానోన్నతానామగ్రేసరోఽగ్రగణ్యః * 'పురోఽగ్రతోఽగ్రేషు సర్తే రి'తి టప్రత్యయః, కేసరీ సింహః జీర్ణ తృణం ఘాసమ్, అత్తి కిమ్ అభ్యవహరతి కిం? నాత్త్యేవేత్యర్థః ఇతి మానాతిశయోక్తిః; నీచజన్తుస్తు నైవమితిభావః.

అత్ర యద్యపి సర్వత్రాపిశబ్దస్తావదేకైకవిశేషణవిశిష్టస్యైవాత్యన్తనీచవృత్తిప్రవృత్తిం ద్యోతయతి తథాఽప్యుక్తాఖిలవిశేషణవిశిష్టోఽపి గజేన్ద్రమేదఃకబళనవిహిత

ప్రతిజ్ఞః కేసరీ న నీచవస్తుని ప్రవర్తత ఇతి మహతీ మానశౌర్యపరకాష్ఠోక్తిరితి మన్తవ్యమ్.

'ప్రాణానపి పరిత్యజ్య మానమేవాభిరక్షయేత్,
ప్రాణాస్తరజ్గచపలా మానమాచన్ద్రతారకమ్.'

ఇతి వచనాన్మానశౌర్యసంపన్నేన భవితవ్యం యశస్కామేనేతి భావః.

అత్ర ప్రకరణే కుత్రచిన్మానస్య కుత్రచిచ్ఛౌర్యస్య కుత్రచిదుభయస్య చ ప్రాధాన్యకథనమపి ద్రష్టవ్యమ్. కులక్రమాగతోత్తమశీలపరిపాలనం మానం - సహాయమనపేక్ష్య శత్రుసంహరణసామర్థ్యం శౌర్యమితి వివేకః.

అత్ర ప్రాయేణాప్రస్తుతప్రశంసాలంకారోఽనుసంధేయః.

శార్దూలవిక్రీడితం వృత్తం-లక్షణం తూక్తమ్.

టీ. మత్తే...స్పృహః - మత్త=మదించిన, ఇభఇంద్ర=మంచియేనుఁగులయొక్క, విభిన్న = బాగుగచీల్పఁబడిన, కుంభ కుంభస్థలమునందలి, పిశిత = మాంసముయొక్క, గ్రాస = తిండియందు, ఏక=ముఖ్యముగా, బద్ధ=కూర్పఁబడిన, స్పృహః=కోరికగలదియు (దీనిచే శౌర్యము తెలుపఁబడెను), మానమహతాం=మానముచే నధికులగువారిలో (అతి మానవంతులలో), అగ్రేసరః = మొదటిదైన, కేసరీ=సింహము, క్షుత్ క్షామః అపి=ఆఁకలిచే బక్కచిక్కినదైనను, జరాకృశః అపి=ముదిమిచే కృశించినదైనను, శిథిలప్రాయః అపి = ఇంచుమించుగా కీళ్లుసడలినదైనను, కష్టాం=కఠినమైన, దశాం=అవస్థను, ఆపన్నః అపి = పొందినదైనను, (అందువలన) విపన్నదీధితిః అపి = చెడినకాంతిగలదైనను, ప్రాణేషు = ప్రాణములు, నశ్యత్సుఅపి = పోవుచున్నవైనను, జీర్ణ = చీఁకిన, తృణం= గడ్డిపోఁచను, అత్తి కిం = తినునాయేమి? (దీనిచే మానము తెలుపఁబడినది.)

తా. శూరాగ్రణియగుసింగము ఆఁకలిచే డస్సినను, ముదిమిచేఁ జిక్కినను, కష్టస్థితిని బొందినను, కాంతివిహీన మయినను, ప్రాణములు పోవుచున్నను మదించిన యేనుఁగుయొక్కకుంభస్థలమును పగులఁగొట్టి యందలిమాంసమును భుజింపఁ దలఁచునే కాని యెండుగడ్డిని తినునా యేమి ?

ఉ. గ్రాసము లేక స్రుక్కిన జరాకృశమైన విశీర్ణమైన సా
యాసము నైన నష్టరుచి యైనను బ్రాణభయార్తమైన ని
స్త్రాసమదేభకుంభపిశి తగ్రహలాలసశీలసాగ్రహా
గ్రేసరభాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే ?

అవ. "అందఱును వారివారి శక్తికిఁ దగిన ఫలమునే కోరుదు" రను చున్నాఁడు:—

శ్లో. స్వల్పస్నాయువసావసేకమలినం నిర్మాంసమప్యస్థి గోః
శ్వా లబ్ధ్వా పరితోషమేతి న చ తత్తస్య క్షుధాశాన్తయే,
సింహో జమ్బుకమఙ్కమాగతమపి త్యక్త్వా నిహన్తి ద్విపం
సర్వః కృచ్ఛ్రగతోఽపి వాఞ్ఛతి జనః సత్త్వానురూపం ఫలమ్. 22

వ్యా. క్షుద్రజన్తుస్తు నైవమితి ఉక్తమేవార్థం భఙ్గ్యన్తరేణాహ—స్వల్పేతి.— శ్వా శునకః, స్వల్పయోః లేశమాత్రయోః - స్నాయు - వసయోః-స్నాయుర్వస్న సాఖ్యనాడీభేదః - వసా మేదః - తయో - రవసేకేన మేళనేన - మలినం మల దూషితమపి - ని. 'వస్నసా - స్నాయుః స్త్రియాం' హృన్మేదస్తు వపావసే' త్యమరః, నిర్మాంసం మాంసలేశశూన్యమపి, గోః పశోః,

ని. 'స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే,
లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః' ఇత్యమరః.

అస్థి కీకసం, లబ్ధ్వా, పరితోషమేతి సంతుష్యతి, తచ్చ గవాస్థి తు, తస్య శునః క్షుధా * ఆపం చైవ హలన్తానా మి'తి వచనా ట్టాప్ - తస్యాః శాన్తయే క్షున్నివార ణాయ, న పర్యాప్తం న భవతీత్యర్థః - అస్తిర్భవన్తీపరోఽప్రయుజ్యమానోఽప్య స్తీతి భాష్యకారవచనాత్ - భవన్తీతి లటః పూర్వాచార్యాణాం సంజ్ఞా - నీచజన్తు రితి భావః, సింహస్తు, అఙ్కం సమీప - మాగతమపి - సమీపవర్తినమపీత్యర్థః - ని. 'అఙ్కస్సమీప ఉత్సఙ్గే చిహ్నే స్థానాపవాదయో రి'తి విశ్వః, జమ్బుకం క్రోష్టారం' త్యక్త్వా అనాదృత్యాలక్ష్యీకృత్యేతి యావత్. ద్విపం గజమేవ దూరస్థ మపీతి భావః. నిహన్తి విదారయతి; తథా హి—కృచ్ఛ్రగతోఽప్యతిసంకటస్థోఽపి, సర్వోఽశేషో జనః, సత్త్వానురూపం స్వశక్త్యనుగుణం, ఫలం లాభం, వాఞ్ఛతి; న తు దుర్బలః ప్రకృష్టఫలకాఙ్క్షీ ప్రబలో నికృష్టలాభకాఙ్క్షీ చ భవతి; అతః శ్వసింహ దృష్టాన్తేన నీచానీచవస్తుపరిహారపరిగ్రహతత్పరేణ భవితవ్యమాయుష్మతేతి భావః.

వృత్తం పూర్వవత్.

టీ. శ్వా = కుక్క, స్వల్పస్నాయు = కొంచెపాటిసన్ననరముగలదియు, వసా... మలినం - వసా = క్రొవ్వుయొక్క, అవసేక=తడుపుటచేత, మలినం=మురికిదైనదియు నిర్మాంసం = మాంసము లేనిదియు, అపి = అయినను, గోః=ఎద్దుయొక్క, అస్థి=ఎముకను, లబ్ధ్వా=లంకించుకొని, పరితోషం=సంతోషమును, ఏతి=పొందును; తత్ చ=అది (ఎముక)

యో, తస్య = ఆ కుక్కయొక్క, క్షుధాశాంతయే = ఆఁకలినిజల్లార్చుట కొఱకు, న = కాదు; సింహః = సింహము, అంకం = ఒడిని, గతంఅపి = పొందినదానినైనను, జంబుకం = నక్కను, త్యక్త్వా = వదలి, ద్విపం = ఏనుఁగును, హంతి = చంపును; కృచ్ఛ్రగతః అపి = కష్టమును పొందినదైనను, సర్వః జనః = ఎల్లజనము, సత్త్వ అనురూపం = (తన) సత్త్వకుఁ దగిన, ఫలం = లాభమును, వాంఛతి = కోరును.

తా. కుక్క మాంసహీనమై సన్నని నరములు క్రొవ్వు స్వల్పముగ నుండిన మలినమైనయెముక దొరకినంతనే సంతోషము నొందునుగాని అయ్యది దానియాఁకలిని దీర్పదు. సింగము తనయెదుట జంబుకములు చరించుచుండినను వాని వదలి వనంబంతయుఁ గ్రుమ్మరి గజరాజమును చంపును. కావున జనులు కష్టకాలమునందును తమశక్తికిఁ దగినలాభ మునే కోరుదురుగాని ఎచ్చుతక్కువలుగఁ గోరరు.

ఉ. స్నాయువసావసేకమలినమ్మగునెమ్ము గ్రహించి జాగిలం
బాయతమోదమందుఁ జనదాఁకలి దానికిఁ జెంత నున్నగో
మాయువు దానిఁ జూచి పరిమార్పక సింగము దంతిఁ గూల్చు నే
చాయల నెల్లవారు నిజసత్త్వసమానఫలార్థులే కదా.

అవ. నీచులయొక్కయు నుత్తములయొక్కయు నడవడిలోని తారతమ్యములు సూచించుచున్నాఁడు:—

శ్లో. లాఙ్గూలచాలనమధశ్చరణావఘాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనం చ,
శ్వా పిణ్డదస్య కురుతే గజపుఙ్గవస్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుఙ్క్తే. 23

వ్యా.—అథ క్షుద్రజన్తోశ్చేష్టావిశేషమాహ—లాఙ్గూలేతి.—శ్వా సారమేయః, లాఙ్గూలచాలనం పుచ్ఛవివర్తనమ్, అధః భూతలే చరణావఘాతం పాదేన విదారణం చ, భూమౌ, నిపత్య స్వయమేవ పతిత్వా, వదనోదరదర్శనం వక్త్రకుక్షిప్రదర్శనం చ, పిణ్డదస్య పురస్తాదితి శేషః, కురుతే నిజనీచ చేష్టామావిష్కరుత ఇత్యర్థః, పుమాన్ గౌః పుంగవో వృషభః - విశేషణసమాసః * 'గోరతద్ధితలుకీ' తి సమాసాన్త ష్టచ్ - స ఏవ పుంగవః శ్రేష్ఠ ఇత్యర్థః - ని. 'శ్రేష్ఠార్థాణౌ తు పుంగవా' వితి వైజయన్తీ - గజపుంగవో గజేన్ద్రస్తు, ధీరం గమ్భీరం, విలోకయతి పశ్యతి - పిణ్డద సన్నిధావితి భావః అథ చాటుశతైరనేకప్రియోక్తిభిః - అనూనవాక్యైశ్చ వా,

భుఙ్క్తే అభ్యవహరతి - గుడతణ్డులాదికమితి శేషః * 'భుజోఽనవనే' ఇత్యాత్మనే పదమ్, ఇమావేవ నీచానీచజనయోః దృష్టాన్తావితి భావః.

వసన్తతిలకావృత్తం - లక్షణం తూక్తమ్.

టీ. శ్వా = కుక్క, పిండదస్య = కూటిముద్ద వేయువానియెదుట, లాంగూలచాలనం = తోఁకనాడించుటను, అధః = క్రింద, చరణఅవఘాతం = కాళ్లతోఁగొట్టుటను, భూమౌ = నేలయందు, నిపత్య = (వెల్లకిల)పడి, వదన ఉదరదర్శనంచ = నోటినికడుపును జూపుటను, కురుతే = చేయును; గజపుంగవః తు = మంచియేనుఁగు అన్ననో, (పిండదుని), ధీరం = బెట్టుగా, విలోకయతి = చూచును; చాటుశతైః = మంచి మాటలయొక్క వందలచేత, భుఙ్క్తే = తినును.

తా. కుక్క తనకు పిడికెడు నన్నము పెట్టువానియెదుట తోఁక నాడించుట కాలితోనే భూమియందుఁ బడి నోరు కడుపుఁ జూపించుట మొదలగునీచకృత్యము లెన్నియో చేయును. గజశ్రేష్ఠము ధైర్యముతోఁ జూచుచు మావటివానిచేత ప్రియవాక్యములచేత లాలింపఁ బడుచు నాహారమును గ్రహించును.

ఉ. వాలముఁ ద్రిప్పి నేలఁ బడి వక్త్రముఁ గుక్షియుఁ జూపుఁ గ్రిందటం
గాలిడుఁ ద్రవ్వుఁ బిండదునికట్టెదుటన్ శునకంబు భద్రకుం
డాలము శాలితండులగుడంబులు చాటువచశ్శతంబుచే
నోలి భుజించు ధైర్యగుణయుక్తిగఁ జూచు మహోన్నతస్థితిన్.

అవ. "శౌర్యమానాదులు గల వంశోద్ధారకుఁడే సఫలజీవితుఁడు" అనుచున్నాఁడు.—

శ్లో. పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే,
స జాతో యేన జాతేన యాతి వంశస్సముమన్నతిమ్. 24

వ్యా.—అథ మానశౌర్యసంపన్నతయా వంశవర్ధనస్యైవ జనస్య సత్తా లాభో స త్వన్యస్యేత్యాహ—పరివర్తినీతి.— పరివర్తిని ధర్మాధర్మవశాత్పునః పున్యే వా వర్తమానే, సంసారే జరామరణరూపే సంసారచక్రే, కో వా పుమాన్, మృతః ప్రేతః, న జాయతే న భవతీతి ఉత్పన్నో వా న భవతీతి శేషః - యద్వా - కో వా న మృతః కో వా న జాయతే నోత్పద్యతే - సర్వోఽప్యుత్పన్నో మృతశ్చ భవత్యేవేత్యర్థః - జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చే తి భగవద్వచనాదితి భావః, తతః కిమత ఆహ—స పుమాన్, జాత ఉత్పన్నో జన్మలాభవా

నితి యావత్, కోఽసావిత్యత ఆహ—యేన జాతేనోత్పన్నేన పుంసా, వంశోఽన్వవాయః, సమున్నతిం మహత్వాన్నత్యం, యాతి ప్రాప్నోతి; వంశోద్ధారకో యః పుమాన్ స ఏవ జన్మలాభవాన్, నేవం భూతత్వం చ మానశౌర్యసంపన్నస్యైవ న త్వన్యస్య, అతః కిమన్యైరజాగళస్తనవదుత్పన్నైర్ధర్మశకవద్వినష్టైశ్చేతి భావః.

అనుష్టుభం వృత్తమ్.

టీ. పరివర్తిని = తిరుగుచుండు, సంసారే = చావు పుట్టుకలవరుసలో, మృతః = చచ్చినవాఁడు, కః వా = ఎవ్వఁడు, న జాయతే = పుట్టఁడు ? యేన జాతేన=ఏపుట్టిన వానిచేత (ఎవఁడు పుట్టుటచేత), వంశః = కులము, సమున్నతిం=గొప్పతనమును, యాతి= పొందునో, సః = వాఁడు, జాతః = పుట్టినవాఁడు.

తా. చావు పుట్టుక లనునవి యెప్పుడును గల యీసంసారచక్రమునఁ జచ్చినవారందఱును బుట్టువారే. అట్లు పుట్టినవారిలో నశింపనివారెవరు? ఎవనిపుట్టుకవలన వంశము కీర్త్యాదులచేత వాసిగాంచునో వాఁడే జన్మించినవాఁడు. వానిజన్మయే గణనీయము.

తే. ప్రాణిలోకంబు సంసారపతిత మగుట
వసుధపైఁ గిట్టి పుట్టనివాఁడు గలఁడె
వానిజన్మంబు సఫల మెవ్వానివలన
వంశమధికోన్నతి వహించి వన్నెకెక్కు.

అవ. మానవంతుని వర్తనమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. కుసుమస్తబకస్యేవ ద్వయీ వృత్తిర్మనస్వినః,
మూర్ధ్ని వా సర్వలోకస్య శీర్యతే వన ఏవ వా. 25

వ్యా.— ఇత్థంభూతస్య పురుషస్య వ్యాపారమాహ— కుసుమేతి.—కుసుమస్తబకస్యేవ పుష్పగుచ్ఛస్యేవేత్యేకం పదం, మనస్వినో ధీరస్య - మాన శౌర్యశాలినః పుంస ఇత్యర్థః, ద్వయీ ద్వివిధా, వృత్తిర్వ్యాపారః, 'ద్వే గతీ హి' తిపాఠే స్పష్టోఽర్థః - తృతీయా తు నసంభవతీత్యర్థః, కిం తద్వృత్తిద్వయమిత్యత ఆహ:—సర్వలోకస్య సర్వేషాం జనానామిత్యర్థః, మూర్ధ్ని శిరస్యున్నతస్థానే చ. స్థీయత ఏవేతి శేషః, అథవా వన ఏవారణ్యే, శీర్యతే వా జీర్యతే వా - భావే లట్, ఏవముభయీ వృత్తిః - శౌర్యాదున్నతస్థానస్థితిస్తదలాభే మానాదరణ్యే జీర్ణతా వా ఇతి వివేకః, ఇయమేవ పుంసాం శ్రేయస్కరీ వృత్తిరితి భావః.

కుసుమస్తబకస్యేవేత్యత్ర సమాసః—శ్రౌతీ పూర్ణోపమాలంకారః, ఇవశబ్దేన సహ సమాసస్య సంభవాత్ - తథా చ వార్తికమ్ *'ఇవేన సహ నిత్యసమాసో విభక్త్యలోపః, పూర్వపదప్రకృతిస్వరత్వం చే'తి. వృత్తం పూర్వవత్.

టీ. కుసుమస్తబకస్య ఇవ = పూలగుత్తివలె, మనస్వినః = గొప్పబుద్ధిగలవానికి (మానము శౌర్యముగలవానికి) వృత్తిః=నడవడి, ద్వయీ = రెండువిధములయినది: (ఎట్లనఁగా:) సర్వలోకస్య = సమస్తజనముయొక్క, మూర్ధ్ని = శిరస్సునందు (అనఁగా సిగయందని స్తబకపరము. అందఱకన్నను పైవాఁడై అని మనస్విపరము.) (స్థీయతే = ఉండుట) వా = అట్లుకాదేని, వనేఏవ=అరణ్యమందే, శీర్యతే వా = జీర్ణించుటయో.

తా. మాననీయుఁడగు విద్వాంసునకు పుష్పగుచ్ఛమునకుఁ బోలె ఎల్లరచేత శిరసావహింపఁబడుటయో, లేక అరణ్యముననే మ్రగ్గుటయో ఈరెండుగతులే తక్క వేఱువిధము లేదు.

తే. కుసుమగుచ్ఛంబునకుఁ బోలెఁ గొ బొనఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజనమస్తకప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణభావంబుఁ గనుట.

అవ. మానశౌర్యవంతుఁడు శక్తియుఁడిగియు గొప్పకార్యములనే చేయఁ బూనుకొనును :—

శ్లో. సన్త్యన్యేఽపి బృహస్పతిప్రభృతయస్సమ్భావితాః పఞ్చషా
స్తాన్ప్రత్యేష విశేషవిక్రమరుచీ రాహుర్న వైరాయతే,
ద్వావేవ గ్రసతే దివాకరనిశాప్రాణేశ్వరౌ భాస్వరౌ
భ్రాతః పర్వణి పశ్య దానవపతిశ్శీర్షావశేషాకృతిః. 26

వ్యా.—పునరప్యుక్తోభయగుణ వైశిష్ట్యస్యైవోత్కృష్టతామాహ.— సన్తీతి.—అన్యే వక్ష్యమాణసూర్యచన్ద్రాపేక్షయా ఇతరే, బృహస్పతిప్రభృతయః బృహస్పతిప్రముఖాః - ప్రభృతిశబ్దేన బుధశుక్రాదయోఽపి గృహ్యన్తే, పఞ్చ షడ్వా పఞ్చషాః గ్రహాః * 'సంఖ్యావ్యయే' త్యాదినా బహువ్రీహిః*'బహువ్రీహౌ సంఖ్యేయే డ జబహుగణా' దితి సమాసాన్తో డచ్ప్రత్యయః, సంభావితాః గ్రాహ్యత్వేనోపస్థితాః బహుమతా వా, సన్తి వర్తన్తే, తాన్ ప్రతి బృహస్పతిప్రభృతీన్ లక్ష్యీకృత్యేత్యర్థః, విశేషేషు విశిష్టేషు తేజోమహత్స్వితి యావత్ - విక్రమే పరాక్రమణే - రుచిః ప్రీతిర్యస్య స తథోక్తః - తేజస్విభిస్సహైవ కలహాచరణతత్పర ఇత్యర్థః,

ఏషః ఉపరాగకర్తృత్వేన ప్రసిద్ధో, రాహుః సైంహికేయః. న వైరాయతే వైరం న కరోతి - అలక్ష్యత్వాత్తత్కార్యకరణతత్పరో న భవతీత్యర్థః * 'శబ్దవైరకలహాభ్ర కణ్వమేఘేభ్యః కరణే' ఇతి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘః, ఇతి దీర్ఘః-విక్రమరుచి రాహురిత్యత్ర * 'రో రి'తి రేఫలోపే*'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' ఇతి దీర్ఘః. కిం తు, భాస్వరౌ తేజస్వినౌ * 'స్థేశ భాస' ఇత్యాదినా వ రచ్ప్రత్యయః, ద్వావుభౌ, దివాకరనిశాప్రాణేశ్వరౌ సూర్యాచన్ద్రమసావేవ - అన్య యోగవ్యవచ్ఛేదార్థకోఽయమేవకారః, శీర్షమేవావశేషో యస్యాస్సా శీర్షావ శేషా ఆకృతిర్యస్య శిరోమాత్రావశిష్టగాత్ర ఇత్యర్థః - 'శీర్షావశేషీకృత' ఇతి పాఠేఽ ప్యయమేవార్థః పరిణమయితవ్యః, దానవపతిర్దానవేశ్వరః పూర్వోక్తో రాహుః, పర్వణి దర్శపౌర్ణమాసీప్రతిపత్సంధౌ, గ్రసతి గిళతి, హే భ్రాతరిత్యాదరేణ ప్రశ్నస్య సంబోధనం, పశ్యేత్యత్ర వాక్యార్థః కర్మ.—యతశ్శిరోమాత్రావశిష్ట ఏవాయమీదృ క్కార్యాచరణతత్పరోఽభూత్సంపూర్ణాఙ్గశ్చేత్కిం కరిష్యతి న జానామీతి భావః, ఏవం మానశౌర్యశాలినో హి నిజాఙ్గవైకల్యం న పరిగణయేయురితి కిం తు మహ త్కార్యమేవ కర్తుం వ్యవస్యన్తీతి తాత్పర్యమ్—పురా కిల దేవానామమృతప్రదాన సమయే విష్ణుచక్రేణ చ్ఛిన్నశీర్షత్వాచ్ఛిరోమాత్రావశిష్టగాత్రోఽభూత్సైంహికేయ ఇతి పౌరాణికీ కథాఽత్రానుసంధేయా. శార్దూలవిక్రీడితం వృత్తమ్.

టీక. అన్యే = ఇతరులు, బృహస్పతి ప్రభృతయః = బృహస్పతి (బృహస్పతి శుక్రుఁడు, శని, అంగారకుఁడు, బుధుఁడు) మొదలయినవారు, పంచషాః = అయిదాఱు గురు, సంభావితాః = పూజితులై (అనఁగా: గ్రహింపఁదగినవారలై.] సంతి = ఉన్నారు. తాన్ ప్రతి=వారినిగుఱించి, విశేష...రుచిః—విశేష=గొప్పవారిమీఁద, విక్రమ = పరా క్రమమందు, రుచిః = ప్రేమగల (అనఁగా: గొప్పవారితో ఢీకొనుటకు నిశ్చయించు), ఏషః = ఈ, రాహుః = రాహుగ్రహము, న వైరాయతే = పగఁబెట్టుకొనఁడు. భాస్వరౌ=ప్రకాశించు, దివాకరనిశాప్రాణేశ్వరౌ=సూర్యచంద్రులను, ద్వావేవ = ఇద్దఱి యందుమాత్రమే, శీర్షావశేషాకృతిః—శీర్ష = తల మాత్రము, అవశేష = మిగతగాఁగల, ఆకృతిః = ఆకారముగలవాఁడు (అయినను), దానవపతిః = రాక్షసరాజు (రాహువు), పర్వణి = పర్వమునందు (అనఁగా: సూర్యుని అమావాస్యయందు, చంద్రుని పూర్ణిమ యందు), గ్రసతే=మ్రింగును. (హే)భ్రాతః = (ఓ) అన్నా ! పశ్య = చూడుము.

తా. బృహస్పతిమొదలగు గణనీయములైనఆయిదాఱుగ్రహము లున్నను పరాక్రమశీలుఁ డగురాహువు వారిజోలికి పోక శీర్షా

వశిష్టుఁడై యుండియు తేజోవంతు లగుదివాకరనిశాకరు (సూర్యచంద్రు) లనుమాత్రమే పర్వకాలములందుఁ బీడించుచున్నాఁడు.

మ. గురుముఖ్యుల్ గల రేవు రాఱ్వురు శుభాంగుల్ ఖేచరుల్ వారిలో
వరవిక్రాంతవిహారి రాహు వెపుడుం గోవైరంబు సేయండు భా
స్వరులన్ భాస్కరయామినీచరులనే బాధించుచున్నాఁడు ద
త్పరతన్ మస్తకశేషమూర్తి యగునా దైత్యుండు గర్వంబునన్.

అవ. "మహాత్ములమహిమ యనంత" మని చెప్పుచున్నాఁడు.—

శ్లో. వహతి భువనశ్రేణిం శేషః ఫణాఫలకస్థితాం
కమఠపతినా మధ్యేపృష్ఠం సదా సచ ధార్యతే,
తమపి కురుతే క్రోడాధీనం పయోధిరనాదరా
దహహ! మహతాం నిస్సీమానశ్చరిత్రవిభూతయః. 27

వ్యా.—అథ మహతాం మాహాత్మ్యమాహ—వహతీతి.—శేషః, ఫణాః సహస్రసంఖ్యాకాః స్ఫటాః ఫలకానీవ తేషు - స్థితాం, భువనశ్రేణిం పాతాళాది చతుర్దశవిష్టపపఙ్క్తిం; వహతి ధారయతి - ని. 'స్ఫటాయాం తు ఫణా ద్వయో' రిత్యమరః, స చ శేషః కమఠపతినా ఆదికూర్మేణ *పతి స్సమాస ఏవే'తి ఘిసంజ్ఞాయా 'మాఙో నాఽస్త్రియా మి'త్యాఙో నాభావః. పృష్ఠస్య మధ్యే మధ్యేపృష్ఠం, నిజఖర్పరోపరిప్రదేశ ఇత్యర్థః *'పారే మధ్యే షష్ఠ్యా వే' త్యవ్యయీభావః - తత్సన్నియోగాదేదన్తత్వం చ మధ్యశబ్దస్య, సదా నిరన్తరం, ధార్యతే, ఉహ్యతే, తమపి కమఠపతిమపి, పయోధిః ప్రళయార్ణవః. అనాదరాత్ అనాయాసాత్, క్రోడాధీనమ్ ఆదివరాహాయత్తం కురుతే - ప్రళయకాలే పాతాళగతభూమణ్డలస్యాదివరాహావతారేణ విష్ణునా నిజదంష్ట్రయా సముద్ధృతత్వాదితి భావః, అతో మహతాం మానశౌర్యశాలినాం మహానుభావానాం సంబన్ధిన్యః, శ్చరిత్రవిభూతయో మాహాత్మ్యశ్రీసంపదో, నిస్సీమానో నిర్మర్యాదా - అవాఙ్మానసగోచరా ఇతి యావత్, అహాహేత్యాశ్చర్యే - ని. 'అహాహేత్యద్భుతే ఖేద' ఇత్యమరః.

అత్ర పూర్వపూర్వస్యోత్తరోత్తరగుణోత్కర్షావహత్వాన్మాలాదీపకాఖ్యోఽలంకారః - తదుక్తం విద్యానాథేన.—

యదా తు పూర్వపూర్వస్య సంభవేదుత్తరోత్తరమ్,
ప్రత్యుత్కర్షావహత్వం తన్మాలాదీపకముచ్యతే.' ఇతి.

హరిణీవృత్తం - లక్షణం తూక్తమ్.

టీ. శేషః = ఆదిశేషువు, ఫణాఫలకస్థితాం = పలకలవంటి (వేయి) పడగలమీఁద ఉన్నదానినిగా (ఉంచుకొని), భువనశ్రేణిం-భువన = లోకములయొక్క, శ్రేణిం = వరుసను, వహతి= మోచుచున్నాఁడు; సః చ = అతఁడు (ఆదిశేషుఁడు)ను, కమఠపతినా= తాఁబేటిరాయునిచే, మధ్యేపృష్ఠం = వీఁపునడుమ, సదా= ఎల్లపుడు, ధార్యతే= మోయఁబడుచున్నాఁడు; తం అపి= అతనిని (కూర్మరాజును) గూడ, పయోధిః = సముద్రము, అనాదరాత్ = అనాయాసముగా, క్రోడ = ఆదివరాహమునకు, ఆయత్తం = అధీనునిగా, కురుతే = చేయుచున్నది. అహహ= ఔరౌరా ! మహతాం= గొప్పవారియొక్క, చరిత్రవిభూతయః = నడవడియొక్క వైభవములు, నిస్సీమానః = మేరలేనివి.

తా. ఆదిశేషుఁడు పదునాలుగులోకములను తనపడగలచేత మ్రోయుచున్నాఁడు. అతనిని ఆదికూర్మమూర్తి మూఁపున వహించుచున్నాఁడు. ప్రళయకాలసముద్రుఁ డట్టియాదికూర్మమును ఆదివరాహునికి లోఁబడినవానినిగాఁ జేయుచున్నాఁడు. కావున మహాత్ముల మహిమకు మేర లేదు.

మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణాభోగంబుపై సంతతం
బవలీలన్ ధరియించుఁ బృష్ఠమునఁ గూర్మాధీశ్వరుం డాతనిన్
ధవళక్రోడవశాత్ముఁ జేయు నతనిన్ వారాశి యశ్రాంతిచే
నవురా! ధీరచరిత్రసంపద లసంఖ్యాతప్రభావోన్నతుల్.

అవ:—"మానశౌర్యములుగలవాఁడే గొప్పవాఁడుగాని యవిలేనివాఁడు గాఁ". డని మైనాకుని దృష్టాంతముగఁ గైకొని చెప్పుచున్నాఁడు:—

శ్లో. వరం ప్రాణోచ్ఛేదః సమదమఘవన్ముక్తకులిశ
ప్రహారైరుద్గచ్ఛద్బహులదహనోద్గారగురుభిః,
తుషారాద్రేః సూనోరహహ! పితరి క్లేశవివశే
న చాసౌ సంపాతః పయసి పయసాం పత్యురుచితః. 28

వ్యా.— మానశౌర్యశాలిన ఏవోక్తవిధమహత్త్వం న తు తద్విహీనస్యేతి మైనాకం దృష్టాన్తీకృత్యాహ— వరమితి.— తుషారాద్రేస్సూనో ర్హిమవత్పుత్రస్య మైనాకస్య, ఉద్గచ్ఛన్నుజ్జృమ్భమాణో - బహులో భూయిష్ఠశ్చ - యో దహన శ్శిలాసంఘర్షణజనితవహ్ని - స్తస్యోద్గారై ర్నిస్సరణైః - గురుభిః దుస్సహైః, సమదేన సదర్పేణ - మఘవతా దేవేన్ద్రేణ - ముక్తస్య ప్రయుక్తస్య - కులిశస్య వజ్రా

యుధస్య - ప్రహారైర్విదారకైః, ప్రాణోచ్ఛేదో మరణమిత్యర్థః, వరం మనాక్ప్రియం- ని. 'దైవాద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ప్రియ,' ఇత్యమరః, కుతః ? అహహేతి ఖేదాతిశయద్యోతనార్థోఽనుకరణశబ్దః. పితరి హిమవతి, క్లేశేన వజ్రప్రహారజనితదుఃఖేన - వివశే విహ్వలే సతి, అసావద్యాఽప్యుపలభ్యమానః, పయసాం పత్యుస్సముద్రస్య - అత్రాసమాసత్వేన ఘిసంజ్ఞాభావాత్ * 'ఖ్యత్యాత్పరస్యే'తి కృతయణాదేశాత్తిశబ్దాత్పరస్య జసోఽకారస్య ఉకారాదేశః, పయసి సలిలే సంపాతః ప్రవేశః - నిజప్రాణసంరక్షణార్థం నిమజ్జ్యావస్థానమిత్యర్థః, ఉచితో న్యాయ్యో, స చ న భవతి హి, అస్యైవేతి శేషః, యతో మానశౌర్యసంపన్నస్య పుంసః స్వప్రాణమాత్రపరిత్రాణతత్పరతయా క్వచిన్నిలీయావస్థానమేవాత్యన్తాయశస్కరమ్, కిముత పితరి క్లేశవివశే; అతః ప్రాణపరిత్యాగేనాపి మానశౌర్యే ఏవ ప్రతిష్ఠాపనీయే, అన్యథా మహానపవాదస్స్యాదితి భావః. అత్రోదారశబ్దస్య గౌణత్వాన్న గ్రామ్యతాదోషః, ప్రత్యుత సౌన్దర్యాతిశయమేవాపాదయతి, తదుక్తం దణ్డ్యాచార్యైః—

'నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్,
అతిసున్దరమన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.' ఇతి.

పురా కిల భూమణ్డలోపద్రవకారిణాం పర్వతానాం కోపవశాత్పక్షచ్ఛేదోద్యతే శక్రే భియవిహ్వలో మైనాకః సముద్రమధ్యే నిమజ్జ్యాతిష్ఠదితి పౌరాణికీ కథాఽత్రానుసంధేయా. శిఖరిణీ వృత్తమ్.

టీ. తుషారఅద్రేః = మంచుకొండ (హిమవంతము) యొక్క, సూనోఽపి=పుత్త్రునికి (అనఁగా: మైనాకునికి), ఉద్గ...రుభిః - ఉద్గచ్ఛత్ = పైకి వెడలుచున్న, బహుళ= అతిశయమైన, దహన = నిప్పులయొక్క, ఉద్గార = క్రక్కుటవలన, గురుభిః = ఓర్వరాని, సమద...రైః-సమద = గర్వముగల, మఘవత్ = ఇంద్రునిచేత, ముక్త=విడువఁబడిన, కులిశ = వజ్రాయుధముయొక్క, ప్రహారైః = దెబ్బలచేత, ప్రాణఉచ్ఛేదః = ప్రాణముపోవుట, వరం = కొంతమేలు. అహహా! = అయ్యయ్యో, పితరి = తండ్రి, క్లేశవివశే-క్లేశ = (వజ్రాయుధపు దెబ్బల) నొప్పిచే, వివశే = మైమఱచియుండఁగా, పయసాంపత్యుః = సముద్రుని (సీళ్లదొర) యొక్క, పయసి = నీటియందు, సంపాతః = పడియుండుట, ఉచితః = తగినది, న = కాదు.

తా. హిమవంతుని కుమారుఁడగు మైనాకునికి, దేవేంద్రుఁడు తనబలిమికొలఁది వేయ నిప్పులు గ్రక్కుచు నోర్వరాక మీఁదఁబడు

కులిశము యొక్క ధారాహతిచేఁ జచ్చుటే కొంచెము మంచిదిగాని, ఆపాటుచే మూర్ఛనొందిన తనతండ్రిని వదలి తనప్రాణముల రక్షించుకొన సముద్రముఁ జొచ్చి దాగియుండుట తగునా?

చ. సమధికభీషణజ్వలనసజ్జాలవినిర్గమదుస్సహాంబుచే
సమదసురేంద్రముక్తకులిశక్షతిచే నుచితంబు ప్రాణఘా
తము హిమవత్కుమారునకుఁ దండ్రి నిశాతశితారపాతభే
దమున మునుంగుచున్నతఱిఁ దా జలరాశిఁ జొరంగ నర్హమే.

అవ. మానవంతులు పరులతిరస్కారము నోర్వరని సదృష్టాంతముగ చెప్పుచున్నాఁడు:—

శ్లో. యదచేతనోఽపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితురినకాన్తః,
తత్తేజస్వీ పురుషః పరకృతనికృతిం కథం సహతే?

వ్యా.—అథ మానినాం పరనికారాసహనం సదృష్టాంతమాహ—యదితి—యద్యస్మాత్కారణాత్; దచేతనః చేతనరహితః నిర్జీవోఽపీతి యావత్ - పాషాణత్వాదితి భావః, ఇనకాన్తస్సూర్యకాన్తమణిః, స్సవితుస్సూర్యస్య, పాదైః రశ్మిభి - రఙ్ఘ్రిభిశ్చ, స్పృష్టః సంవళితస్తాడితశ్చేతి ధ్వన్యతే, ప్రజ్వలతి జాజ్వల్యమానో భవతి - కోపోద్రిక్తశ్చేతి గమ్యతే, తత్తస్మాత్కారణాత్, తేజస్వీ తేజశ్శాలీ మానశౌర్యసంపన్నః పురుషః సచేతనః ఇతి శేషః, పరైశ్శత్రుభిః, కృతనికృతిం విహితాపకారం, కథం సహతే క్షమతే న కథంచిదిత్యర్థః; మైనాకస్తు నైవమితి భావః- ని. 'పాదారశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః' ఇత్యమరః ఆర్యావృత్తభేదః.

టీ. యత్ = ఎందువలన, అచేతనః అపి = ప్రాణములేనిదయ్యును, ఇనకాంతః = సూర్యకాంతము, సవితుః = సూర్యునియొక్క, పాదైః = కిరణములచేత, (కాళ్లచేతనని యర్థాంతరము), స్పృష్టః = తాఁకఁబడినదై, (తన్నఁబడినదై అనియు,) ప్రజ్వలతి = మండునో (కోపించునో) అనియు, తత్ = అందువలన, తేజస్వీ = తేజస్సుగల (అనఁగా మానశౌర్యములుగల), పురుషః = పురుషుఁడు, పర...కృతిం - పర = ఇతరులచే, కృత = చేయఁబడిన, నికృతిం = ధిక్కారమును, కథం సహతే = ఎట్లు సహించును?

తా. సూర్యకాంతమణి అచేతనమయినను సూర్యునిపాదములు (కిరణములు) తనకు సోఁకినంత మాత్రనే మం(డిప)డును. కావున తేజోవంతులు పరులు చేయుపరిభవమును సహించి యూరకుండరు.

తే. అర్కకాంత మచేతనం బయ్యు సవితృ
పాదములు సోఁకినంతనె ప్రజ్వరిల్లుఁ
గాన నభిమానవంతుఁ డెం దైన శత్రు
కృతతిరస్కార మెట్లు సహింప నేర్చు.

అవ. "తేజస్వంతుల పరాక్రమమునకు వయస్సు కారణముగా" దనుచున్నాఁడు:-

శ్లో. సింహః శిశురపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు,
ప్రకృతిరియం సత్త్వవతాం న ఖలు వయస్తేజసాం హేతుః. 30

వ్యా—విక్రాన్తత్వే వయోఽపి న హేతురితి వినిగమయతి—సింహ ఇతి.—శిశుర్బాలోఽపి విక్రాన్తత్వయోగ్యతారహితావస్థోఽపీత్యర్థః, సింహః, మదమలినాః దానపయఃపఙ్కిలాః-కపోలాః భిత్తయ ఇవ యేషాం తేషు గజేషు-మాతఙ్గేషు, నిపతతి, కుంభస్థలవిదారణార్థమితి భావః, ఇయం బాల్యేఽపి విక్రాన్తతా, సత్త్వవతాం బలాఢ్యానాం, ప్రకృతిః స్వభావః, కుతః? వయో బాల్యాది, తేజసాం ప్రతాపశాలినామితి - తేజస్తద్వతోరభేదాధ్యవసాయోఽత్యన్తతేజస్విత్వప్రకాశనార్థకః, హేతుః కారణం - న భవతి ఖలు - 'తేజసాం హి న వయః సమీక్ష్యతే' ఇతి న్యాయాదితి భావః - 'వయః పక్షిణి బాల్యాదౌ' ఇత్యమరః, అయమప్యార్యావృత్తభేదః.

టీ. సింహః = సింహము, శిశుఃఅపి = పిల్ల అయినను, మద...త్తిషు-మద = మద (జల)ముచే, మలిన = మురికియైన, కపోలభిత్తిషు = గోడమొత్తలవంటి చెక్కిళ్లుగల, గజేషు = ఏనుఁగులమీఁదికి, నిపతతి = దూఁకును. ఇయం = ఇది (ఇట్లు పరాక్రమించుట) సత్వవతాం = బలముగలవారికి, ప్రకృతిః = స్వభావము; వయః = వయస్సు, తేజసాం = (ఇచట తేజశ్శబ్దమునకు తేజస్సు గలవా రని యర్థము. తేజస్సునకును తేజస్సుగలవారికిని అభేదముగ చెప్పుటవలన మిక్కిలి తేజస్వులు (తేజూరూపులే) అని తోఁచుచున్నది.) తేజముగలవారికి, హేతుః = కారణము, న = కాదు.

తా. సింగము బాల్యదశయందుండినను మదధారలు స్రవించుటచే మలినములయిన గోడలవంటి చెక్కిళ్లుగల మదగజంబులమీఁద కుఱుకును. ఇది బలవంతుల స్వాభావము. పరాక్రమప్రకటనమునకు వయసు మొదలగునవి పనిలేదు.

క. విదలింప నుఱుకు సింగపుఁ
గొదమయు మదమలినగండ కుంజరములపై
నిది బలశాలికి నైజము
గద తేజోనిధికి వయసు కారణ మగునే.

ఇతి నీతిశతకమునందు మానశౌర్యపద్ధతివర్ణన మను
మూఁడవదశకము.

---

## అ ర్థ ప ద్ధ తి

---

అవ. ఇట్లు మానశౌర్యపద్ధతిని నిరూపించినపిదప, ఆమానశౌర్యములకు నర్థమే మూల మగుటవలన, అర్థపద్ధతిని ఆరంభించుచు మొదట ద్రవ్యతత్పరులచరిత్రమును దలఁచుకొని చెప్పుచున్నాఁడు:—

శ్లో. జాతిర్యాతు రసాతలం గుణగణ స్తత్రాప్యధో గచ్ఛతాత్
శీలం శైలతటాత్పతత్వభిజనస్సన్దహ్యతాం వహ్నినా,
శౌర్యే వైరిణి వజ్రమాశు నిపతత్వర్థోఽస్తు నః కేవలం
యేనైకేన వినా గుణా స్తృణలవప్రాయాస్సమస్తా ఇమే. 51

వ్యా.—మానశౌర్యయోరప్యర్థమూలత్వాత్ తన్నిరూపణానన్తరమర్థపద్ధతిం నిరూపయతి—తత్ర ప్రథమమర్థైకతత్పరాణాం మతమభిసంధాయ తమాహ—జాతిరితి.—జాతిః బ్రాహ్మణత్వాదిః, రసాతలం నామాధోలోకం, యాతు గచ్ఛతు భ్రశ్యత్విత్యర్థః, గుణగణో ధైర్యౌదార్యగామ్భీర్యాదిగుణసమూహః, తత్రాపి రసాతలాపేక్షయాఽ పృథః పాతాళలోకం, గచ్ఛతాత్ ప్రాప్నుయాత్, శీలం సత్స్వభావః శైలతటాత్, పతతు విశీర్ణం భవత్విత్యర్థః; అభిజనో వంశః - ని. 'అభిజనాన్వయౌ వంశ' ఇత్యమరః. వహ్నినా, సందహ్యతాం భస్మీక్రియతాం, వైరిణి సంక్షోభకారిత్వాచ్ఛత్రుభూతే, శౌర్యే శూరత్వమూర్ధ్నీత్యర్థః, ఆశు శీఘ్రం, వజ్రమశని - ర్నిపతతు - అశనినిపాతేన తదపి విధ్వస్తం భవత్విత్యర్థః, ఏవం పూర్వోక్తజాతికులోచితాభిమానశౌర్యాదినాశేఽప్యస్మాకం న కించిదపి ఛిన్నమితి భావః, తథాఽపి కిం యుష్మదభిలషితమిత్యత ఆహుః, నోఽస్మాకమ్, అర్థః కేవలం విత్తమేవాస్తు సంభవ - త్వయమేవాస్మాకం పరమార్థ ఇతి భావః, ననూత్కర్షావహత్వేన, ప్రసిద్ధానాముక్తగుణానాంవిధ్వంసమఙ్గీకృత్య ఏకేన

విత్తేన కిం కరిష్యామితి నాశఙ్కనీయం - యతస్తద్వినా తేషామప్యత్యన్తాకించిత్కరత్వ మేవేత్యాహుః, ఏకేన కేవలేన - ని. 'ఏకే ముఖ్యాన్య కేవలా' ఇత్యమరః, యేన అర్థేన వినా - * 'పృథగ్వినే' త్యాదినా వికల్పాత్తృతీయా, ఇమే పూర్వోక్తాః, సమస్తా అపి గుణాఃజాతికులశీలాభిమానాదయ, స్తృణకణకల్పాస్తద్వన్నిస్సారా ఇత్యర్థః, అతోగుణ- మహత్త్వాయా అప్యేతన్మూలకత్వాదయ మేవ సంపాదనీయ ఇతి భావః.

'ధనమార్జయ కాకుత్స్థ ధనమూలమిదం జగత్,
అన్తరం నాభిజానామి నిర్ధనస్య మృతస్య చ.'

ఇతి లక్ష్మణవాక్యమేవ సిద్ధాన్తీకర్తుః;

'అర్థానామర్జనే దుఃఖమర్జితానాం చ రక్షణే,
రక్షితానాం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్.'

ఇతి మనుస్మరణం త్వశక్తవిషయం మన్యామహ ఇతి తాత్పర్యమ్.

శార్దూలవిక్రీడితం - లక్షణం తూక్తమ్.

టీ. జాతిః = (బ్రహ్మక్షత్రియాది) జాతి, రసాతలం = పాతాళమునకు, యాతు = పోవునుగాక. గుణగణః = (శౌర్యౌదార్యాది) గుణముల సమూహము, అధః గచ్ఛతాత్ = అడుగంటునుగాక ? శీలం = మంచి నడవడి, శైలతటాత్ = కొండదరి నుండి, పతతు = పడునుగాక ! అభిజనః = వంశము, వహ్నినా = అగ్నిచే, సంద హ్యతాం = బాగుగ దగులఁ బెట్టఁబడునుగాక ! వైరిణి = (డబ్బుసంపాదించుటకు) విరోధియయిన, శౌర్యే = శూరత్వముపై, ఆశు = తటాలున, వజ్రం = పిడుగు, పతతు = పడుఁగాక. యేనఏకేన వినా = ఏదియొకటి లేక, ఇమే = ఈ (పైనచెప్పఁ బడిన), సమస్తాః = అన్నిగుణములు, తృణలవప్రాయాః = గడ్డిపోఁచవంటివో, (అట్టి), అర్థఃకేవలం = ద్రవ్యముమాత్రమే, నః = మాకు, అస్తు = కలుగుఁగాక !

తా. జాతి పాతాళమునకుఁ బోయినను, సద్గుణము లంతకంతెుఁ గ్రిందువడినను, శీలము కొండమీఁదనుండి క్రిందపడినను, వంశము తగలఁబడినను, శౌర్యమునందుఁ బిడుగుపడినను, మాకేమియు లోపము లేదు. మాకు ద్రవ్యమొక్కటి యున్నఁ జాలును. ఈద్రవ్యము లేక పోవునేని పైనచెప్పినవి యుండియు గడ్డిపోఁచకైనను కొఱగావు.

ఉ. జాతి దొలంగుఁ గాత గుణ ౕ శక్తి రసాతలసీమకుం జనుం
గాత కులంబు బూది యగుఁ ౕ గాత నగంబుననుండి శీలముం
బాతముఁ జెందుఁ గాత బహుభంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాతగుణంబు లెల్లఁ దృణ ౕ కల్పము లొక్కధనంబు లేవడిన్.

అవ. "గుణములన్నియు నాబంగారమునుబట్టియే యుండు" ననుచున్నాఁడు.—

శ్లో. యస్యాస్తి విత్తం స నరః కులీనః స పణ్డిత స్స శ్రుతవాన్ గుణజ్ఞః,
స ఏవ వక్తా స చ దర్శనీయః సర్వే గుణాః కాఞ్చన మాశ్రయన్తి.

వ్యా. నను తథాఽపి గుణాభావేఽపి కేవలవిత్తస్యాకించిత్కరత్వమేవేత్యాశఙ్క్య తస్యైవాశేషగుణావహత్వం తావదాహ—యస్యేతి.—యస్య నరస్య, విత్తమస్తి సంభవతి, స నరః, కులే జాతః కులీనః మహాకులప్రసూతః * 'కులాత్ఖః' ఇతి ఖప్రత్యయః, స ఏవ పణ్డితో విద్వాన్, స ఏవ శ్రుతవాన్ శాస్త్రజ్ఞః-యద్వా-శ్రుతం శ్రవణం నపుంసకే భావే క్తః - తదస్యాస్తీతి శ్రుతవాన్ ధర్మశాస్త్రాద్యాకర్ణనచతురోఽపీత్యర్థః, స ఏవ గుణజ్ఞో గుణగ్రాహీ-అత్ర * 'ఆతోఽనుపసర్గే కః' ఇత్యాదివ్యాఖ్యాతం ప్రాక్, స ఏవ, వక్తా వాగ్మీ, స చ స ఏవ, దర్శనీయస్సున్దరశ్చ - ఉక్తగుణరాహిత్యేఽపీతి భావః, నన్వేవం చేత్పురుషస్యైకేన విత్తేన ఈదృగ్గుణసాకల్యసంపన్నత్వం కుత ఇత్యాశఙ్క్యాహ—సర్వే గుణాః పూర్వోక్తకులీనత్వాదయః, కాఞ్చనం విత్త, మాశ్రయన్తి, అతోఽనేనైవ సకల గుణసంపత్తిసంభవే కిమన్యైః ప్రత్యేకప్రయాససాధ్యైరితి భావః.

అత్ర విత్తస్యైతావద్గుణసంపాదకత్వాసంబన్ధేఽపి తత్సంబన్ధాభిధానాదసంబన్ధే సంబన్ధరూపాతిశయోక్తిః. వృత్తముపజాతిః.

టీ. యస్య = ఎవనికి, విత్తం=ధనము, అస్తి = కలదో, సః=ఆ, నరః=మనుష్యుఁడు, కులీనః = గొప్పకులమునఁ బుట్టినవాఁడు, సః = అతఁడు, పండితః = విద్వాంసుఁడు, సః, శ్రుతవాన్ = శాస్త్రము దెలిసినవాఁడు (లేక, ధర్మాధర్మములవినికి గలవాఁడు), గుణజ్ఞః = గుణముల నెఱింగినవాఁడు, సః ఏవ = అతఁడే, వక్తా = వాగ్మి, సః, దర్శనీయః చ = చూడఁదగినవాఁడును (అందగాఁ డనుట), సర్వే = అన్ని, గుణాః=గుణములు, కాంచనం = బంగారమును, ఆశ్రయన్తి = ఆశ్రయించును.

తా. లోకమునందు ధనముగలవాఁడే కులీనుఁ డనియు, పండితుఁ డనియు, శాస్త్రజ్ఞుఁ డనియు, గుణావగుణముల నెఱింగినవాఁ డనియు, చక్కని వాగ్ధోరణికలవాఁ డనియు, చూడఁదగినవాఁ డనియు, రూపవంతుఁ డనియుఁ జెప్పఁబడును. ధన మొకటుండునేని పైగుణములు లేకపోయినను వానియం దీగుణము లున్న వని జనులు తలంతురు.

క. ఏనరునకు విత్తము గల, దానరుఁడు కులీనుఁ డధికుఁ డార్యుఁడతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి, నానాగుణగణము కాంచనంబుననిలుచున్.

అవ. ద్రవ్యనాశనమునకుఁ గారణములను నిరూపించుచున్నాఁడు:—

శ్లో. దౌర్మన్త్ర్యాన్నృపతి ర్వినశ్యతి యతిస్సఙ్గా త్సుతో లాలనా
ద్విప్రోఽనధ్యయనా త్కులం కుతనయా చ్ఛీలం ఖలోపాసనాత్,
హ్రీర్మద్యా దనవేక్షణా దపి కృషిః స్నేహః ప్రవాసాశ్రయా
న్మైత్రీ చాప్రణయా త్సమృద్ధి రనయా త్త్యాగాత్ప్రమాదా ద్ధనమ్.

వ్యా.—అథ ద్వాభ్యామర్థస్య వినాశప్రకారమాహ—దౌర్మన్త్ర్యాదితి.— నృపతిః రాజా, దుష్టః న సులక్షణప్రయుక్తో మన్త్రః షాడ్గుణ్యచిన్తనం యస్య తస్య దుర్మన్త్రస్య భావో దౌర్మన్త్ర్యం తస్మాద్ధేతోః, ర్నశ్యతి వినష్టో భవతి - మన్త్ర వైకల్యే పరేషామవకాశసంభవాత్ రాజ్యాపహరణాదితి భావః - యద్వా - దుష్టా మన్త్రిణః ప్రధానాని యస్య తస్య భావస్తస్మాన్నశ్యతి - అదణ్డ్యదణ్డనాద్యుపదేశే లక్ష్మ్యాది రహితో భవతీత్యర్థః—

'సన్మన్త్రిణా వర్ధయతే నృపాణాం లక్ష్మీర్మహీధర్మయశస్సమూహాః
దుర్మన్త్రిణా నాశయతే తథైవ లక్ష్మీర్మహీధర్మ యశస్సమూహాః.'

ఇతి గీతావచనాదితి భావః; యతి ర్యోగీ, సఙ్గాత్సమాగమాన్నశ్యతి - సఙ్గస్య కామ క్రోధాదిహేతుత్వాత్ - తదుత్పత్త్యా భ్రష్టయోగో భవతీత్యర్థః-

'సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః.'

ఇతి గీతావచనాదితి భావః; సుతో లాలనా, న్నశ్యతి గుణహీనో భవతి-

'లాలనాద్బహవో దోషాస్తాడనాద్బహవో గుణాః,
తస్మాత్పుత్త్రం చ శిష్యం చ తాడయేన్న తు లాలయేత్.'

ఇతి న్యాయాదితి భావః, విప్రో బ్రాహ్మణో, ఽనధ్యయనాత్ వేదశాస్త్రాధ్యయనా భావాత్, నశ్యతి నీచో భవతి-

'వేదవేదాఙ్గతత్త్వజ్ఞో విప్రస్సర్వత్ర పూజ్యతే,
అనధీతశ్రుతిర్విప్రః సభామధ్యే న శోభతే.' ఇతి;

కులం వంశః, కుతనయాత్కుపుత్త్రాన్నశ్యతి-

'కోటరాన్తర్భవో వహ్ని స్తరుమేకం దహిష్యతి,
కుపుత్త్రస్తు కులే జాతః స్వకులం నాశయేత్పరమ్.'

ఇతి న్యాయాత్, శీలం సత్స్వభావః, ఖలోపాసనాద్దుర్జనసమాగమా, న్నశ్యతి - తేషా మత్యన్తానర్థమూలకత్వాదితి భావః-

ఛాదయిత్వాఽఽత్మభావం హి చరన్తి శఠబుద్ధయః,
ప్రహరన్తి చ రన్ధ్రేషు సోఽనర్థస్సుమహాన్భవేత్.'

ఇతి వాక్యాత్; హ్రీర్జుగుప్సితకర్మాచరణాన్నివృత్తిః, మద్యాత్ మద్యపానా, న్నశ్యతి-

'అయుక్తం బహు భాషన్తే యత్ర కుత్రాపి శేరతే;
నగ్నా విక్షిప్య గాత్రాణి తే జాల్మా ఇవ మద్యపాః.'

ఇత్యుక్తత్వాత్, కృషిస్స్వయమనవేక్షణాన్నశ్యతి - నిత్యమపరామర్శాన్నశ్యతి-

'కృషిం చ పత్నీమనవేక్ష్య యః పుమానన్యాని కార్యాణి సమాచరేచ్చ,
తే త్వేవమేవం చ సమాకులే ద్వే తథేతి బాధానిచయం చ యాతః,'

ఇతి స్మరణాత్; స్నేహః పుత్రదారాదిషూత్పన్నో మోహః, ప్రవాసాశ్రయాద్దేశాన్తర సంచార సమాశ్రయణాన్నశ్యతి-

'సుతాఙ్గనాబన్ధుషు సోదరేషు నృపేషు భృత్యేషు చ జాతమోహః,
ప్రవాసమాత్రేణ హి నశ్యతేఽఖిలం, చిరం ప్రవాసేనహరత్యశేషమ్.

ఇతి వచనాత్; మైత్రీ మిత్రభావః, అప్రణయాదననురాగా, న్నశ్యతి-

'మృద్ఘట ఇవ సుఖభేద్యో దుస్సంధానశ్చ దుర్జనో భవతి,
సుజనస్తు కనకఘట ఇవ దుర్భేద్యశ్చాశు సంధేయః.'

ఇతి వచనాత్, సమృద్ధిస్సంపత్తి, రనయాన్నీతిరాహిత్యా, న్నశ్యతి.

'రక్షాయాం స్వమతిక్షిపత్యధికరం శిక్షాగుణైర్లభ్యతే
విద్వేష్టి స్వజనం త్యజత్యవనతిం మృద్నాతి మార్గస్థితాన్,
భూతిం నేచ్ఛతి యోజనాత్ప్రతిభయం దుర్వర్త్మనా గచ్ఛతి
క్రూరాగ్రం వినయాఙ్కుశం న సహతే భూపాలమత్తద్విపః.'

ధనం తు త్యాగాదస్థిసాత్కరణాత్ - 'ద్యూతా ది' తి పాఠే - ద్యూతా దక్ష క్రీడాయాః - ప్రమాదా దనవధానతయా వా-నశ్యతి 'శ్రుతినిష్పీడనాచ్చైవ చా ర్థాసక్తధియాన్నృణామ్' ఇతి - ప్రమాదాన్నాశస్త్వనుభవసిద్ధ ఏవ - దానాన్నాశ స్సమనన్తరశ్లోక ఏవ వక్ష్యతే - 'శిష్టానాం గర్హణాన్నాశః సదాచారవివర్జనాత్.' శార్దూలవిక్రీడితమ్.

టీ. నృపతిః=రాజు, దౌర్మంత్ర్యాత్ = చెడుమంత్రులుగలవాఁ డగుటవలన, వినశ్యతి = చెడును. యతిః = యోగి, సంగాత్ =(స్త్రీలు మున్నగువారి) సాంగత్యమువలన, వినశ్యతి; సుతః = కుమారుఁడు, లాలనాత్ =బుజ్జగించుటవలన, వినశ్యతి; విప్రః=బ్రాహ్మణుఁడు, అనధ్యయనాత్ = వేదము చదువకపోవుటవలన, వినశ్యతి; కులం=వంశము, కుత్సి

నయాత్ = దుష్పుత్త్రునివలన, వినశ్యతి; శీలం=మంచినడత, ఖలఉపాసనాత్ =చెడ్డవారి యొక్క సేవవలన (దుర్మార్గులకు గొలుచుటవలన), వినశ్యతి; హ్రీః = లజ్జ, మద్యాత్ = కల్లు, లేక సారాయివలన, వినశ్యతి; కృషిః = సేద్యము, అనవేక్షణాత్ = పైవిచారణ లేకుండుటవలన, వినశ్యతి; స్నేహః=కూర్మి, ప్రవాసాశ్రయాత్ =ఎడఁబాటు నొందుట వలన (అనఁగా: స్వదేశము విడుచుటవలన), మైత్రీ = చెలిమి, అప్రణయాత్ = నమ్మకము లేకపోవుటవలన, వినశ్యతి; సమృద్ధిః = సంపద, అనయాత్ = అన్యాయమువలన, వినశ్యతి; ధనం = ద్రవ్యము, త్యాగాత్ =(అతి) దానమువలన, ప్రమాదాత్ = పరాకు వలనను, వినశ్యతి.

తా. దుర్మంత్రివలన రాజును, సంగమువలన యతియు, లాలించుటచేఁబుత్త్రుండును, వేదాధ్యయనము లేమిచేత బ్రాహ్మణుఁడును, కుపుత్త్రుని వలన వంశమును, దుర్మార్గులసేవవలన సదాచారమును, మద్యపానము వలన లజ్జయు, వ్యవసాయము తఱుచుగఁ జూడకపోవుటచేతను, దేశాంతరసంచారముచేత స్నేహమును, అనురాగము లేమిచేత మైత్రియు, నీతిలేమిచేత సంపదయు, అపాత్రదానముచేత ధనంబును నశించును.

మ. యతిసంగంబున బాలుఁ డాదరముచే సౌ జ్యాభర్త దుర్మంత్రిచే
శ్రుతిహానిన్ ద్విజుఁ డన్వయంబు ఖలుచేఁ గ్రూరాప్తిచే శీల ము
ద్ధతిచే మిత్రత చూపులేమిఁ గృషి మద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలున్ నశించుఁ జెడు నర్థంబుల్ ప్రమాదంబునన్.

అవ. "డబ్బుకు మూఁడుపోకడ లున్న" వనుచున్నాఁడు:—

శ్లో. దానం భోగో నాశ స్తిస్రో గతయో భవన్తి విత్తస్య,
యన్న దదాతి న భుఙ్క్తే తస్య తృతీయా గతిర్భవతి. 34

వ్యా.—అథ విత్తస్యోత్తమాదిభేదేన త్రైవిధ్యమాహ—దానమితి.— దానం సత్పాత్రత్యాగః, భోగం స్రక్చన్దనాదిద్వారాఽనుభవః, నాశః దానధర్మాద్యభావే చోరాదినా విలయశ్చ - తదుక్తమ్—

'చత్వారో ధనదాయాదా ధర్మాగ్నినృపతస్కరాః,
తేషాం జ్యేష్ఠావమానేన త్రయః కుప్యన్తి సోదరాః,. ఇతి

ఏవముత్తమమధ్యమాధమభేదేన విత్తస్య, గతయః గమనోపాయాః, భవన్తి తత్ర యః పుమాన్ న దదాతి అర్థిభ్యో న ప్రయచ్ఛతి విత్తమితి శేషః, అథ

వా న భుఙ్క్తే నానుభవతి, తస్య దానభోగాభ్యాం విత్తవ్యయమకుర్వతః పురుషస్య సంబన్ధినో విత్తస్యేతి శేషః, తృతీయా గతిర్నాశావస్థా భవతి - సా త్వత్యన్తకష్టేత్యర్థః. అయమత్ర నిష్కృష్టోఽర్థః - విత్తస్య దానేన గతిరుత్తమా, ఆత్మభోగేన మధ్యమా, చోరాదినా నాశగతిరధమేతి: అతో దానశౌణ్డేనైవ భవితవ్యం ధనాఢ్యేనేతి భావః. ఆర్యాభేదః.

టీ. దానం=ఇచ్చుట, భోగః=అనుభవించుట, నాశః=పోవుట (పరాధీన మగుట), (అని) విత్తస్య = ధనమునకు, తిస్రః = మూఁడు, గతయః = పోకడలు, భవంతి=కలవు. యత్ =దేనిని (ఏధనమును), న దదాతి=ఈయఁడో, న భుఙ్క్తే=అనుభవింపఁడో, తస్య= దానికి (ఆధనమునకు), తృతీయా = మూఁడవదగు, గతిః=పోకడ, (అనఁగా: నాశము), భవతి = కలుగును.

తా. ధనవ్యయమునకు సత్పాత్రదానము, తా ననుభవించుట, దొంగలు మొదలగువారలు హరించుట, అని మూఁడుదారులు గనంబడు చున్నవి. ఎవఁడు సత్పాత్రమున కియ్యక తా ననుభవింపకయుండునో వానిధనమునకు మూఁడవదారియే (అనఁగా చోరులు మొదలగువారు హరించుట) అగును.

క. దానము భోగము నాశము
వూనికతో మూఁడుగతులు ౘ భువి ధనమునకుఁ
దానము భోగము నెఱుఁగని
దీనునిధనమునకు గతి తృతీయమె పొసఁగున్.

అవ. "దానమువలన నొకవేళ పేదఱికము గలిగినను, అయ్యది దాతకు గౌరవ మునే కలిగించు" ననుచున్నాఁడు:—

శ్లో. మణిశ్శాణోల్లీఢః సమరవిజయీ హేతిదలితో
మదక్షీణో నాగః శరది సరిదాశ్శ్యానపులినా,
కలాశేషశ్చన్ద్రః సురతమృదితా బాలవనితా
తనిమ్నా శోభన్తే గలితవిభవా శ్చార్థిషు నరాః. 35

వ్యా.—అథ దానశీలస్య విత్తవ్యయజనితతనుత్వమపి శోభావహమేవేత్యాహ— మణిశ్శాణ ఇతి—శాణశ్శస్త్రోత్తేజనసాధనోపలవిశేషః - తేనోల్లీఢః సంఘృష్టః, మణిశ్చ, హేతిదళితః శస్త్రక్షతః, సమరవిజయీ రణశూరశ్చ * 'జిదృక్షి' త్యాదినా ఇనిః - ని. హేతిశ్శస్త్రే తు నృస్త్రియో'రితి కేశవః, మదేన దానవర్షేణ పరిక్షీణః, కృశో, నాగశ్చ-

వి. 'గ్రాహగ్రాహిగజా నాగా' ఇతి వైజయన్తీ, శరది శరత్కాలే, ఆశ్యానాని ఈషచ్ఛు ష్కాణి-పులినాని సైకతాని-యస్యాస్సా, సరిత్ నదీ చ, *'సంయోగాదేరాతో ధాతో ర్యణ్వతో' నిష్ఠానత్వం, కళాశేషః షోడశాంశమాత్రావశిష్ట, శ్చన్ద్రశ్చ-వి. 'కళా తు షో డశో భాగ' ఇత్యమరః - 'ప్రథమాం పిబతే వహ్ని' రిత్యాదీతిహాసక్రమేణేతరకళానా మగ్న్యాదిదేవైర్గ్రిళితత్వాదితి భావః, సురతేన రతిరణేన - మృదితా విహ్వలీకృతా, బాల వనితా ముగ్ధాఙ్గనా చ - జారవనితేతి పాఠే వేశ్యా చోచ్యతే, తథా, అర్థిషు విషయే- గళితవిభవా వ్యపగతార్థసంపదః - నిశ్శేషమర్థిసాత్కృతధనా ఇత్యర్థః - వి. 'అర్థరై విభవా అపీ' త్యమరః, నరా దాతృజనాశ్చ, తనిమ్నా తనుత్వేనైవ * పృథ్వాదిత్వాదిమనిచ్, శోభన్తే - ఏవంభూతతనుత్వస్యైవ శోభాహేతుత్వాదితి భావః.

అత్ర ప్రస్తుతానాం నరాణాం చ సామస్త్యేన శోభారూపతుల్యధర్మేణౌపమ్యస్య గమ్యమానత్వాద్దీపకాలంకారః-

'ప్రస్తుతానాం తథాఽన్యేషాం సామస్త్యే తుల్యధర్మతః,
ఔపమ్యం గమ్యతే యత్ర దీపకం తన్నిగద్యతే.'

ఇతి లక్షణాత్ - శిఖరిణీవృత్తమ్.

టీ. శాణ ఉల్లీఢః = సానచే ఒరయఁబడిన (సానఁబెట్టఁబడిన,) మణిః=రత్నము, హేతిదళితః=ఆయుధములచేఁ జీల్పఁబడిన (ఆయుధములదెబ్బలు తినిన), సమరవిజయీ= యుద్ధమున గెలుపుగలవాఁడును, మదక్షీణః = మద (జల)ము (కాఱుట)చేత చిక్కిన, నాగః = ఏనుఁగు, శరది=శరదృతువునందు, ఆశ్యానపులినా=కొంచెముగ నెండిన యిసుక దిబ్బలుగల, సరిత్=నది, కళాశేషః=(ఒక) కళమిగిలిన, చంద్రః=చంద్రుఁడును, సురత... తా-సురత=సంభోగమునందు,మృదితా=నలిపివేయఁబడిన,బాలవనితా=లేఁతప్రాయపుయువ తియు, అర్థిషు=యాచకులయందు (యాచకులకిచ్చి), గళితవిభవాః=పోయినయైశ్వర్యము గల (ఉన్నధనమునంతయు నర్థులకిచ్చివేసిన), నరాః చ=జనులును, తనిమ్నా=కృశత్వము చేత, శోభంతే = ప్రకాశించుచున్నారు.

తా. సానబెట్టఁబడినమణియు, ఆయుధక్షతములు గలిగియున్న శూరుఁడును, మదజలస్రావముచేతఁ జిక్కినగజంబును, శరత్కాలమున నెండిన యిసుకతిన్నెలుగల నదియు, కలామాత్రావశిష్టుఁ డగుచంద్రుఁ డును, రతిక్రీడచే డస్సిన నవయౌవన యగుబాలయు, సత్పాత్ర దానముచేత నైశ్వర్యమును గోలుపోయిననరాజులును విశేషముగఁ బ్రకాశింతురు.

ఉ. శాణవిఘృష్టరత్నమును శస్త్రహతుం డగుశూరుఁడున్ మద
క్షీణగజంబు సైకతవిశిష్టశరన్నదియున్ నవక్షపా
ప్రాణవిభుండు చండసురతాలస బాలికయున్ ధనైకవి
శ్రాణనశూరులుం గడుఁ గృశత్వమునం బ్రభఁ గాంతు రిద్ధరన్.

అవ. "ఒకవస్తువు నాదరించుటయు ననాదరించుటయుఁ గలిమిలేములనుబట్టియే యుండు" ననుచున్నాఁడు:—

శ్లో. పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే
స పశ్చాత్సంపూర్ణః కలయతి ధరిత్రీం తృణసమామ్,
అత శ్చానైకాన్తా గురులఘుతయాఽర్థేషు ధనినా
మవస్థా వస్తూని ప్రథయతి చ సంకోచయతి చ. 36

వ్యా.—అథ పుంసాం ధనాభావతత్సద్భావసమయావస్థామాహ—పరిక్షీణ ఇతి.—కశ్చిద్ధనికః పుమాన్, యవానాం శితశూకాఖ్యధాన్యానాం ప్రసృతయే స్పృహయతి ప్రసృతి మాత్రయవాన్ గురుతయా కాఙ్క్షత ఇత్యర్థః, * స్పృహేరీప్సిత ఇతి సంప్రదానత్వాచ్చతుర్థీ - ని. 'శిత శూకయవౌ సమా'విత్యమరః, స పరిక్షీణః పుమాన్, పశ్చాదనన్తరం - కాలాన్తర ఇత్యర్థః, సంపూర్ణో దైవవశాద్ధనసంపన్న స్సన్, ధరిత్రీం భువం, తృణసమాం తృణకల్పాం తద్వల్లఘ్వీమిత్యర్థః; కలయతి మనుతే - ధనమదేన తథాఽఽలోకయతీత్యర్థః. - కవీనాం కలిః, కామధేనుః, అత శ్చాత ఏవ హేతోః, రర్థేషు, యవధరిత్ర్యాదిషు వస్తుషు విషయే, గురులఘుతయా మహత్త్వాల్పత్వభావేన, అనేకాన్తాఽప్రతినియతా - సర్వథా గురుణి గురుత్వమేవ లఘుని లఘుత్వమేవేతి నియమాభావవతీత్యర్థః, ధనినాం సంబన్ధి, అవస్థా వ్యాపారః, వస్తూని యవధరిత్ర్యాద్యల్పమహత్తర వస్తూని, ప్రథయతి చ ధనాభావదశాయాం నీచ మపి వస్తు గురూకరోతీత్యర్థః, తథా సంకోచయతి చ తత్సద్భావదశాయాం మహదపి వస్తు నిరాకరోతీత్యర్థః. నిర్ధన ధనికయోరిత్థంభూతాఽవస్థా ప్రత్యక్ష సిద్ధా ; అతో వివేకినా నైవం విపర్యస్తబుద్ధినా భవితవ్యమితి భావః. శిఖరిణీవృత్తం - లక్షణం తూక్తమ్.

టీ. (యః=ఏ) కశ్చిత్ = ఒకానొకఁడు, పరిక్షీణః=మిక్కిలి పేదవడినవాఁడై, యవానాం = బియ్యముయొక్క, ప్రసృతయే = చేరెఁటికొఱకు (అనఁగా: చేరెఁడు బియ్యముకొఱకు), స్పృహయతి=ఆశపడుచున్నాఁడో, సః = వాఁడు, పశ్చాత్ =పిదప, సంపూర్ణః = సమృద్ధిగలవాఁడై (ధనవంతుఁడై), ధరిత్రీం=భూమిని, తృణసమాం=గఱిక

పోఁచవంటిదానినిగా, కలయతి=తలఁచును. అతః చ = అందువలననే, అర్థేషు = ధనముల యందు, గురులఘుతయా = హెచ్చుతగ్గులు అగుటచేత (కలిమిలేములచే ననుట), అనే కాంతా=నానావిధములుగల, ధనినాం = ధనవంతులయొక్క, అవస్థా=దశ, వస్తూని = పదార్థములను, ప్రథయతి చ = గొప్పవానినిఁగాఁ జేయును. సంకోచయతిచ = తక్కువ వానినిగాను చేయును.

తా. దారిద్ర్యము ననుభవించునప్పుడొక గుప్పెడుధాన్యము నపేక్షించునతఁడే కాలాంతరమున ఐశ్వర్యమునందునేని భూమండలము నంతయు గడ్డిపరకవలెఁ గాంచును. కాఁబట్టి సమయము ననుసరించి వస్తువులు అధికము లనియు నల్పము లనియుఁ జెప్పఁబడును. ఒకప్పుడు అల్పమైనది మఱొకప్పు డధికముగను, అదియే మరల నల్పమైనదిగను తోఁచును.

ఉ. చేరి యొకండు నెవ్వఁ బడి ౹ చిక్కుచుఁ జేరెఁడుశాలిధాన్యమే
కోరు నతండు పిమ్మట నఁకుంఠధనోన్నతుఁ డై వసుంధరం
బూరికి సాటిగాఁ దలఁచు ౹ భూరిధనాఢ్యులచొ ప్పనేకమై
గౌరవముఁ లఘుత్వమును ౹ గైకొనువస్తువులందు నెల్లెడన్.

అవ. రాజులకు ధనము వృద్ధినొందుమార్గములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. రాజన్ దుధుక్షసి యది క్షితిధేను మేతాం
తే నాద్య వత్స మివ లోకమముం పుషాణ,
తస్మిం శ్చ సమ్యగనిశం పరిపుష్యమాణే
నానాఫలం ఫలతి కల్పలతేవ భూమిః. 37

వ్యా.—అథ రాజానం సంబోధయం స్తస్యార్థసాధనోపాయమతిదిశతి— రాజన్నితి—హే రాజన్ త్వమితి శేషః - అన్యథా* 'శేషే ప్రథమ' ఇతి ప్రథమ పురుషః స్యాత్. ఏనామేతాం త్వద్ధస్తగతామిత్యర్థః *అత్రాన్వాదేశాభావాదేనా దేశశ్చిన్త్యః, క్షితిర్ధేను రివేత్యుపమితిసమాసః - న తు క్షితిరేవ ధేనురితి రూప కం - వత్సమివేతి స్పష్టోపమాలిఙ్గాత్, తాం క్షితిధేనుం, దుధుక్షసి యది దోగ్ధు మిచ్ఛసి చేత్ - అర్థమితి శేషః *దుహేస్సన్నన్తాత్ సిచ్ *దుహ్యాదేర్ద్వికర్మకత్వ నియమాత్, తర్హి తేన దుధుక్షాహేతునా, అద్యేదానీముపలభ్యమానం, లోకం జనం, వత్సం తర్ణకమివ. ని. 'వత్సో నా కుటజే వక్షే తర్ణకే తనయాదికే' ఇతి వైజయన్తీ - పుషాణ పోషయ - ని. 'లోక స్తు భువనే జనే' ఇత్యమరః - వత్సనాశే క్షీరస్యేవ

లోకనాశేఽర్థస్యాసంభవాదితి భావః, పోషణఫలమాహ—తస్మిన్ లోకే, చానిశం సర్వదా, సమ్యగసంబాధం, పరిపుష్యమాణే పరిపాల్యమానే సతి, భూమిః క్షితిః, కల్పలతేవ కల్పవృక్షశాఖేవ ని. - 'సమే శాఖాలతే' ఇత్యమరః - యద్వా కల్పయత్యభీప్సితానీతి కల్పా - సా చ సా లతా చ * 'స్త్రియాః పుంవ' దిత్యాదినా పుంవద్భావః - సేవ కల్పవల్లీవ, నానావిధఫలం ధనధాన్యాది బహురూపఫలం, ఫలతి నిష్పాదయతి - 'ఫలనిష్పత్తౌ' వితి ధాతోర్లట్. యతో లోకపరిపాలనవ్యతిరేకేణ న కేఽర్థః సంభవిష్యతి - తద్ద్వారైవ భూమేరప్యఖిలఫలదోగ్ధృత్వాత్ - తస్మాదశేషలాభార్థం తత్పరిపోషణమావశ్యకమితి భావః.

అత్ర పూర్వవాక్యస్థోపమయా నిర్వ్యూఢోత్తరవాక్యస్థోపమేత్యనయోరఙ్గాఙ్గిభావేన సంకరః, వసంతతిలకావృత్తమ్.

టీ. రాజన్ = ఓరాజా ! ఏతాం=ఈ, క్షితిధేనుం=ఆవువంటిభూమిని, దుధుక్షసి యది = పిదుకఁ గోరుదువేని, తేన = దానికై, అద్య=ఇప్పుడు, అముం=ఈ, లోకం=జనమును, వత్సమివ = దూడనువలె, పుషాణ = పాలించుము, (కిం చ=మఱియు), తస్మిన్= ఆజనము, అనిశం = ఎల్లపుడు, సమ్యక్ = బాగుగా, పరిపుష్యమాణే = పోషింపఁబడుచుండఁగా, భూమిః = భూమి, కల్పలతేవ = కల్పవృక్షముయొక్క కొమ్మవలె, నానాఫలం= అనేకవిధములయినఫలమును, ఫలతి = ఫలించును.

తా. రాజా ! భూమి యను గోవునుండి ధనమును పితుకఁదలఁచితివేని ఆవుదూడను పోషించినవిధంబుగ జనులఁ బోషింపుము. ఆ జనులఁ జక్కఁగ నీవు పోషించితివేని భూమి కల్పవల్లివలెఁ గోరినవాని నన్నింటిని ఫలింపఁజేయును.

తే. ధరణిధేనువుఁ బిదుకంగఁ ౯ దలఁచితేని
జనులఁ బోషింపు మధిప వత్సములమాడ్కి
జనులు పోషింపఁబడుచుండ ౯ జగతి కల్ప
లత తెఱంగున సకలఫలంబు లొసఁగు.

అవ. "రాజనీతి యనేకరీతుల నున్నది" యనుచున్నాఁడు:—

శ్లో. సత్యాఽనృతా చ పరుషా ప్రియభాషిణీ చ
హింస్రా దయాళురపి చార్థపరా వదాన్యా,
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమా చ
వారాఙ్గనేవ నృపనీతిరనేకరీతిః. 38

వ్యా.—యతో రాజానం సంబోధితవా, నపి తన్నీతిః కీదృశీత్యాశఙ్కాయాం తస్యా బహువిధత్వమిత్యాహ—సత్యేతి—సత్యా యథార్థభాషిణీ, అనృతా అసత్యవాదినీ చ, తథా పరుషా కఠోరభాషిణీ, ప్రియభాషిణీ మధురాలాపినీ చ, తథా హింస్రా ఘాతకా - ని. 'శరారు ర్ఘాతుకో హింస్ర' ఇత్యమరః, * 'నమి కమ్పి' త్యాదినా రప్రత్యయః దయాళురపి కారుణికా చ - ని. 'స్యాద్దయాళుః కారుణిక' ఇత్యమరః*'స్పృహి గృహీ' త్యాదినా ఆళుచ్ప్రత్యయః, తథా అర్థపరా ధనలుబ్ధా, వదాన్యా దానశౌణ్డా చ, కుత్రచిద్విషయ ఇతి సర్వత్రాప్యధ్యాహార్యం - ని. 'స్యుర్వదాన్య స్థూలలక్ష దానశౌణ్డా బహుప్రద' ఇత్యమరః. తథా నిత్యం ప్రతిదినం - వ్యయో ధనత్యాగో యస్యాస్సా తథోక్తా, ప్రచురనిత్యధనాగమా - ప్రచురం ప్రభూతం యథాతథా - నిత్యం - ధనస్య - ఆగమః ప్రాప్తిర్యస్యాస్సా తథోక్తా చ, అతో వారాఙ్గనా వేశ్యేవ - ని, 'వారస్త్రీ గణికా వేశ్యే' త్యమరః. నృపనీతిః రాజవృత్తిః, అనేకరూపా బహుప్రకారా - న త్వేకాన్తికీత్యర్థః; వారాఙ్గనాయామపి విశేషణాని సమాని.

అత్ర సత్యానృతేత్యాది పదశ్రవణమాత్రేణ ఝుడితి విరోధః స్ఫురతి, తస్య స్వాభావ్యేనాభాసీకరణాదలంకారస్సః, వారాఙ్గనేవే త్యుపమయాఽఙ్గాఙ్గిభావేన సంకీర్యతే.

టీ. నృపనీతిః = రాజనీతి, వారాంగనా ఇవ = బోగముపడుచువలె, (అయావేళకుఁ దగినట్లు,) సత్యా=సత్యములు గలదియు, అసత్యా=అబద్ధముగలదియు, పరుషా=నిష్ఠురత్వముగలదియు, ప్రియభాషిణీచ = ఇచ్చకములఁ బలుకునదియు, హింస్రా = చంపునదియు, దయాళుః = కనికరముగలదియు, అపిచ = మఱియు, అర్థపరా = ధనమునందు ఆసక్తిగలదియు, వదాన్యా = ఈవిగలదియు, నిత్యవ్యయా=ఎల్లపుడు వ్యయముగలదియు, ప్రచుర.. గమాచ=ప్రచుర=మిక్కిలి, నిత్య=ఎల్లపుడు, ధన=ద్రవ్యముయొక్క, ఆగమః = రాబడిగలదియు, (ఐ, ఇట్లు) అనేకరీతిః = పెక్కువిధములుగలది.

తా. రాజనీతి, కొన్ని తావుల సమయోచితముగ సత్యమిశ్రముగను, కొన్ని తావుల నసత్యయుతముగను, ఒకచోట నిష్ఠురముగను, ఒకతావున చెవుల కింపుగను నుండుచు, ఒకచోట బాధించుచు, మఱొకతావున దయను గనంబఱుచుచు, ఒకతావున పిసినతనమునొందుచు, మఱొకచోట దానము నొనర్చుచు, నొకచోట నెప్పుడు వ్యయపెట్టుచు, మఱొకవిధంబుగ నెల్లపుడు సంపాదించుచు, వారాంగనవలె నానాప్రకారముల నుండును.

తే. సత్య మనృతంబు పరుషోక్తి । సరసభాష
ప్రాణిహింసయు దయయు లోభంబు నీఁగి
కనకసంగ్రహావ్యయములు । గలుగు వార
రమణికైవడి బహురీతి । రాజనీతి.

అవ. "గుణవంతుఁడగురాజు నాశ్రయింపవలయునే కాని గుణహీను నాశ్రయించినఁ బ్రయోజనము లే" దనుచున్నాఁడు:—

శ్లో. ఆజ్ఞా కీర్తిః పాలనం బ్రాహ్మణానాం
దానం భోగో మిత్రసంరక్షణం చ,
యేషామేతే షడ్గుణా న ప్రవృత్తాః
కోఽర్థస్తేషాం పార్థివోపాశ్రయేణ ? 39

వ్యా.—సోఽపి గుణాఢ్య ఏవ సమాశ్రయణీయో న తు నిర్గుణ ఇతి రాజాన మేవ సంబోధయతి — ఆజ్ఞేతి.—ఆజ్ఞా మర్యాదా పరిపాలనాత్మకశాసనం, కీర్తిర్దాన శౌర్యోద్భవా సత్సమాఖ్యా, బ్రాహ్మణానాం పాలనం నిరుపద్రవం బ్రాహ్మణసంతర్పణం, దానం సత్పాత్రే త్యాగః, భోగః స్రక్చన్దనాదిజనిత సుఖానుభవః, మిత్రసంరక్షణం, సుహృత్సముద్ధరణం, చేత్యేతే షడ్గుణా, యేషాం రాజ్ఞాం, న ప్రవృత్తాః న ప్రవర్తనే- కర్తరి క్తః, పృథివ్యా ఈశ్వరః పార్థివః తస్య సంబుద్ధిః - హే పార్థివ రాజన్ - *'తస్యేశ్వరః' 'సర్వభూమి పృథివీభ్యామణ్'ఇత్యణ్ప్రత్యయః - తేషాముపాశ్రయేణ సమాశ్రయేణ, కోఽర్థః కో లాభః న కోఽపీత్యర్థః; తస్మాదుక్తగుణసంపన్న ఏవ రాజా సమాశ్రయణీయః, న తు కుక్షిమ్భరిరితి భావః.

శాలినీవృత్తం-'శాలిన్యుక్తా మ్తౌ తగౌ గోఽబ్ధిలోకైరి'తి లక్షణాత్.

టీ. పార్థివ = (ఓ)రాజా!, ఆజ్ఞా = ఆనతి, కీర్తి = యశస్సు, బ్రాహ్మణానాం = బ్రాహ్మణులయొక్క, పాలనం = రక్షించుట, దానం = ఈవియు, భోగః = అనుభవించుట, మిత్రసంరక్షణంచ = స్నేహితులను గాపాడుటయు, ఏతే = ఈ, షట్ గుణాః = ఆఱుగుణములు, యేషాం = ఎవరికి, నప్రవృత్తాః = కలుగవో, తేషాం = వారియొక్క (రాజుల యొక్క,) ఉపాశ్రయం = ఆశ్రయించుటచేత, కః అర్థః = ఏమి ప్రయోజనము?

తా. దుర్జనశిక్షణము, సత్కీర్తి, బ్రాహ్మణపరిపాలనము, సత్పాత్రదానము, స్రక్చందనవిహారాదిభోగములు, ఆపన్నులగు మిత్రాదుల రక్షించుట, అను సద్గుణషట్కము లేనిరాజుల సేవించుటవలన లాభమేమియు లేదు.

తే. ఆజ్ఞయును గీర్తియును భూసురావనంబు
దానమును భోగ మిత్రసంత్రాణనములు
షడ్గుణంబులు గలుగ వే జనులయందు
వారిఁ గొల్చిన ఫల మేమి వసుమతీశ.

అవ. ధనముపైఁ బేరాసపడరాదు; ధనలాభాలాభములు దైవాధీనములు.

శ్లో. యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌ చ నాతోఽధికమ్,
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః
కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్.

వ్యా.—అథాతికార్పణ్యం మా కురు, లాభాలాభయోర్దైవాయత్తమూలః
మిత్యాహ—యదితి.—ధాత్రా బ్రహ్మణా, స్తోకమల్పం, మహద్బహుళం వా, యద్ధ
నిజఫాలం నిజనిటలతటమేవ పట్టం తత్ర - లిఖితం లేఖనేన నిర్దిష్టం, తద్బ్రహ్మలిఖి
ధనం, మరుస్థలే ఊషరదేశేఽపి - కిముతాన్యత్రేతి భావః, నితరామతిశయేన, ప్రాప
లభతే - అన్యూనమితి శేషః - ని. 'సమానౌ మరుధన్వానౌ' ఇత్యమరః, మేరౌ కన
చలే, ఉప్యతో బ్రహ్మలిఖితా, దధికం, న ప్రాప్నోతి. తత్తస్మాత్కారణా, ద్ధీర స్థిరచి
భవ, విత్తవత్సు ధనాఢ్యేషు విషయే, కృపణాం దీనాం, వృత్తిం వ్యాపారం, వృ
వ్యర్థం, మాకృథాః మాకార్షీః, స్తేన కార్పణ్యజనితనిద్రామాత్రాశ్రయత్వమేవ నత్వ
ధనప్రాప్తిరితి భావః. * కృఞో లుఙి థాస్ - తనాదిత్వేఽపి సిచో నిత్యలోపవిధా
న్నసిచ్-'న మాఙ్యోగ, ఇత్యప్రతిషేధః. తత్ర దృష్టాన్తమాహ—కూపేఽల్పజలాధా
గర్తేఽపి, పయోనిధౌ సముద్రేఽపి, ఘటః కలశ, స్తుల్యమాత్మపరిమితం, జలం గృ
స్వీకురుతే - పశ్యేతి కృపణసంబోధనం - న తు కూపేఽల్పం పయోనిధావధిక;
ఏతద్దృష్టాన్తేన సమాహితచిత్తేన భవితవ్యం, న తు కార్పణ్యపర్యాకులేనేతి తాత్పర్యమ్

టీ. (మనుష్యుఁడు) ధాతా = బ్రహ్మచేత, స్తోకం = కొంచెమైనను, మహ
వా = గొప్పదయినను, యత్ = ఏది (ధనము), నిజ...లిఖితం - నిజ = తనదై
ఫాలపట్ట = నొసలనియెడి పలకయందు, లిఖితం = వ్రాయఁబడినదో, తత్ = దా
మరుస్థలేఽపి = ఎడారిప్రదేశములయందు సైతము, నితరాం = తప్పక, ప్రాప్నో
పొందును. మేరౌచ = బంగారు కొండయందుసైతము, అతః = అంత (లిఖితము) క
అధికం = ఎక్కువను, న ప్రాప్నోతి=పొందఁడు; తత్ = కావున, ధీరః = ది

దీరినవాఁడవు, భవ = కమ్ము. విత్తవత్సు=ధనవంతులయెడ, కృపణాం=దీనమైన, వృత్తిం= వ్యాపారమును, వృథా = వ్యర్థముగా, మాకృథాః = చేయకుము. ఘటం = కుండ, కూపే=నూతియందును, పయోనిధౌ అపి = సముద్రమునందును, తుల్యం=సమానమైన, జలం=నీటిని, గృహ్ణాతి = గ్రహించుచున్నది. పశ్య = చూడుము.

తా. తననొసట వ్రాసినంతధనము కొద్దియైనను గొప్పదైనను మరుస్థలమునందున్నను తప్పక పొందును. మేరువునందైనను అంతకంటె నధికముగఁ బొందఁడు. కావున ధనవంతులను జూచి దీనత్వమును, గనం బఱుపకుము. కుండను తీసుకవెళ్లి బావియందు ముంచినను సముద్రమున ముంచినను ఒకేవిధంబుగ జలమును గైకొనును.

చ. వనజభవుండు నెన్నొసట వ్రాసినసొమ్ము ఘనంబొ కొంచెమో
వినుమరుభూమి కేఁగిన లభించును మేరువుఁ జేరఁ బోయినన్
ధన మధికంబు రాదు కదు దైన్యము మాను ధనాఢ్యులందు న
వ్వననిధి నూతఁ దుల్యముగ వారి గ్రహించు ఘటంబు సూడుమా.

ఇది నీతిశతకమునందు అర్థపద్ధతివర్ణన మను
నాలుగవ దశకము.

---

## దు ర్జ న ప ద్ధ తి

---

అవ. అర్థపద్ధతిని నిరూపించినపిదప, అట్లు అర్థవంతుఁడయ్యును దుర్జనుఁడయ్యే నేని వానితోఁ జేరఁదగ దని చెప్పఁబోవుచు దుర్జనపద్ధతి నారంభించుచున్నాఁడు:—

శ్లో. అకరుణత్వమకారణవిగ్రహః పరధనే పరయోషితి చ స్పృహా,
సుజనబన్ధుజనేష్వసహిష్ణుతా ప్రకృతిసిద్ధమిదం హి దురాత్మనామ్.

వ్యా.—అథార్థాదిసంపన్నోఽపి దుర్జనో నోపాదేయ ఇవేత్యాశయేనార్థపద్ధతి నిరూపణానన్తరం దుర్జనపద్ధతిం నిరూపయతి—తత్ర తేషామవగుణం గణయతి-అకరుణత్వ మితి.—పరదుఃఖప్రహాణేచ్ఛాకరుణా-తద్రాహిత్యమకరుణత్వం-దయాహీనత్వం చ, అకా రణవిగ్రహో నిష్కారణకలహశ్చ - ని. 'అస్త్రియాం సమరానీక రణాః కలహవిగ్రహౌ' ఇత్యమరః, పరధనే పరద్రవ్యే, పరయోషితి పరదారేషు, స్పృహా చ-ఏకత్రాపహార ణేచ్ఛా - అన్యత్ర సంభోగాభిలాషశ్చ, సుజనేషు బన్ధుజనేషు, చ, అసహిష్ణుతా అసహన

శీలత్వం చే, తీదం సర్వం * 'నపుంసక మనపుంసకే నే'త్యాదినా నపుంసకైకశేషః, దురాత్మనాం దుర్జనానాం, ప్రకృతిసిద్ధం స్వభావసిద్ధం హి, అతస్తే నో పాదేయా ఇతి భావః-
ని. 'ప్రకృతిః ప్రపఞ్చభూతే ప్రధానే మూలకారణే, స్వభావ' ఇతి విశ్వః.

ద్రుతవిలమ్బితవృత్తం - 'ద్రుతవిలమ్బితమాహ నభౌ భరా వి'తి లక్షణాత్.

టీ. అకరుణత్వం = కనికరములేకుండుట, అకారణవిగ్రహః = కారణములేకయే జగడమాడుట, పరధనే = ఇతరుల ధనమునందు, పరయోషితిచ=ఇతరుని భార్యయందును స్పృహా=కోరికయు, సుజన బంధుజనేషు-సుజన సజ్జనులయందును, బంధుజనేషు=చుట్టాలయందును, అసహిష్ణుతా = ఓర్వలేమియు, (అనెడి) ఇదం = ఇది (కనికరములేకుండుట మొదలగునది), దురాత్మనాం=చెడ్డమనస్సుగలవారికి,ప్రకృతిసిద్ధంహి=స్వభావసిద్ధమే కదా!

తా. దయాహీనత, నిష్కారణ మైనకలహము, పరులధనమునందును పరస్త్రీలయందును ఆసక్తి, సజ్జనులయందును, బంధువులయందును ఓర్పులేమియు, ఇవి దుర్జనుల స్వభావసిద్ధగుణములు.

తే. కారణము లేనికలహంబు గరుణలేమి
పరవధూపరధనవాంఛ బంధుసాధు
జనములం దసహిష్ణుత్వ మనఁగ జగతిఁ
బ్రకృతిసిద్ధంబు లివి దుష్ట నికరమునకు.

అవ. 'దుర్జనుఁడు విద్వాంసుఁడైనను వానిని దగ్గరఁజేర్పరాదు' అనుచున్నాఁడు:-

శ్లో. దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽలంకృతోఽపి సన్,
మణినా భూషితస్సర్పః కి మసౌ న భయంకరః ? 42

వ్యా. ఆస్తాం తావత్ దుర్జనమాత్రస్య పరిత్యాజ్యత్వకథనమ్ - అశేషావగుణావమార్జకసంపన్నోఽపి దుర్జనః పరిత్యాజ్య ఏవేతి సదృష్టాన్తమాహ—దుర్జనఇతి—దుర్జనో, విద్యయా వేదవేదాఙ్గాద్యాత్మికయా, ఽలంకృతో భూషితస్సన్నపి - సకలవిద్యాపారీణస్సన్నపీత్యర్థః, పరిహర్తవ్యస్త్యాజ్యః, కుత ఇత్యత ఆహ—సర్పః ఆశీవిషః, మణినా ఫలకస్థమాణిక్యేన, భూషితోఽలంకృతస్సన్నపి, అసౌ సర్పో, న భయంకరః కిం భయంకర ఏవేత్యర్థః, అతో మణిభూషితసర్పప్రాయో విద్యావానపి దుర్జనో దూరతస్త్యాజ్య ఏవ -

'దుర్జనం దూరత స్త్యజే' దితి న్యాయాదితి భావః *'మేఘ ర్తిభయేషు కృఞః' ఇతి ఖశ్-ఖశి 'అరుర్ద్విష' దిత్యాదినా ముమాగమః.

అత్ర బిమ్బ ప్రతిబింబన్యాయేన ధర్మధర్మిణోర్వాక్యద్వయే పృథఙ్నిర్దేశాద్దృష్టాన్తాలంకారః-

'బిమ్బానుబిమ్బన్యాయేన నిర్దేశో ధర్మధర్మిణోః,
దృష్టాన్తాలంకృతిర్జ్ఞేయా భిన్నవాక్యార్థసంశ్రయాః.' ఇతి లక్షణాత్.
వృత్త మానుష్టుభమ్.

టీ- దుర్జనః = దుష్టుఁడు, విద్యయా = విద్యచే, అలంకృతః అపి = అలంకరింపఁబడినవాఁడు అయినను, పరిహర్తవ్యః = వదలఁ దగినవాఁడు ; సర్పః = పాము, మణినా = రత్నముచే, భూషితః అపి = అలంకరింపఁబడినది అయినను, అసౌ = ఇది, భయంకరః=భయమునుగలిగించునది, న కిం = కాదా యేమి ?

తా. పాము శిరమునందు రత్నముకలదైనను భయంకర మగుట చేత దూరముగ నెటుల వదలుచున్నారో, అట్లే దుర్జనుఁడు విద్యావంతుఁడైనను దూరముగ విడువఁదగినవాఁడు.

తే. విద్యచే భూషితుం డయి వెలయుచున్నఁ
దొడరి వర్జింప నగుఁ జుమీ దుర్జనుండు
చారుమాణిక్యభూషిత శస్తమ స్త
కంబయినపన్నగము భయంకరము గాదె.

అవ. 'దుర్జనుఁడు లోకమునంతయు దూషించును' అనుచున్నాఁడు:—

శ్లో. జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతరుచౌ దంభః శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతా మునౌ విమతితా దైన్యం ప్రియాలాపిని,
తేజస్విన్యవలిప్తతా ముఖరతా వక్తర్యశక్తిః స్థిరే
తత్కో నామ గుణో భవేత్సగుణినాం యో దుర్జనైర్నాఙ్కితః.

వ్యా.—అథాస్య సర్వదూషకత్వమాహ—జాడ్యమితి.—హ్రీమతి లజ్జావతిపుంసి జాడ్యం మాన్ద్యం * 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చే తి ష్యఞ్ ప్రత్యయః, గణ్యతే సంఖ్యాయతే - దుర్జనైరితి శేషః - న తు జుగుప్సితకర్మాచరణపరాఙ్ముఖత్వం, వ్రతై స్తపశ్చాన్ద్రాయణాదినియమైః - శుచౌ శుద్ధే, దమ్భో ధర్మధ్వజత్వం, గణ్యతే. న త్వనుష్ఠాతృత్వం, శుచౌ స్వభావాదేవ బాహ్యాన్తరశుద్ధే, కైతవం కపటం, గణ్యతే-న తు పారమార్థికత్వం, శూరే, నిర్ఘృణతా దయారాహిత్యం, గణ్యతే - న తు విక్రాన్తత్వం,

మునౌ మననశీలే విమతితా బుద్ధిహైన్యం, గణ్యతే న త్వాత్మైకాన్యానుసంధానతత్పరత్వం, ప్రియాలాపిని మధురవాదిని, దైన్యం గణ్యతే - న తు శ్రవణానన్దకరత్వం, తేజః ప్రాగల్భ్యం - ప్రభావిశేషో వా తద్వ, త్యవలిప్తతా గర్వగ్రస్తత్వం, గణ్యతే - న తు సంభావః - ని. 'అవలేప స్తు గర్వే స్యా ల్లేపనే దూషణేఽపి చే'తి విశ్వః. 'వక్తవ్యేష్వ ర్థేషు - శక్తిః ప్రతిభాపరపర్యాయసామర్థ్యవిశేషః - తయా స్థిరే, ముఖమస్యాస్తీతి ముఖరో దుర్ముఖః-ని. 'దుర్ముఖే ముఖరా బద్ధముఖా' విత్యమరః * 'ఖముఖకుఞ్జేభ్యశ్చే'తి రప్రత్యయః - తస్య భావ స్తత్తా అసంబద్ధప్రలాపిత్వమిత్యర్థః. గణ్యతే - న తు వాగ్మిత్వం, తస్మాత్కారణాత్, గుణినాం గుణసంపన్నానాం. స కో నామ గుణో భవేత్, యో గుణః, దుర్జనైః, ర్నాఙ్కితః న దూషితః-దుర్జనాదూషితో గుణ స్సుగుణినాం న కోఽప్యస్తీత్యర్థః, 'యో దుర్జనానాం మత' ఇతి పాఠే యో గుణః దుర్జనానాం మతః ఇష్టః స్యాత్ స కో నామభవేదితి సంబన్ధః, దుర్జనాభిమతో గుణ స్తు గుణినాం న కోఽప్యస్తీత్యర్థః.

శార్దూలవిక్రీడితం వృత్తం - లక్షణం తూక్తమ్.

టీ. దుర్జనైః = దుష్టులచేత, హ్రీమతి = సిగ్గుగలవానియందు, జాడ్యం = మాంద్యము, వ్రతశుచౌ = (తపశ్చాంద్రాయణాది) వ్రతములచేఁ బరిశుద్ధుఁ డయిన వానియందు, దంభః = బడాయియు, శుచౌ = ఆచారవంతునియందు, కైతవం = కాప ట్యమును, శూరే = శూరునియందు, నిర్ఘృణతా = దయలేకుండుటయు, మునౌ = మన నముచేయువానియందు (అనఁగా: మాటాడక మౌనమును ధరించి మననముచేయువాఁ డనుట), విమతితా = తెలివిలేమియు, ప్రియాలాపిని=మంచిమాటలఁ బలుకువానియందు, దైన్యం=దేబిరింపును; తేజస్విని=పరాక్రమము గలవానియందు, అవలిప్తతా = పొగరును, వక్త...స్థిరే - వక్తవ్య = చెప్పవలసిన విషయములయందు, శక్తి = నేర్పుచేత, స్థిరే = నిలుకడగలవానియందు (అనఁగా: ఏవిషయమునైనను పొంకముగా నిరూపించి మాటాడ నేర్చినవాఁ డనుట), ముఖరతా = ప్రేలుడుగాయతనమును, గణ్యతే=తలఁపఁబడును. తత్=అందువలన, దుర్జనైః=చెడ్డవారిచేత, యః = ఏది, న అంకితః=మచ్చవేయఁబడలేదో (నిందింపఁబడలేదో), సః = ఆ, గుణినాం = గుణవంతులయొక్క, గుణః = గుణము, కో నామ భవేత్ = ఏదియైయుండునో.

తా. లజ్జగలవాని మందునిగను, తపోవంతుని డంబముగలవాని గను, శుచిగలవానిని వేషధారినిగను, శూరుని దయాహీనునిగను,

మునీశ్వరుని బుద్ధిహీనునిగను, ప్రియముగ మాటాడువానిని దీనుని గను, తేజోవంతుని గర్విగను, యుక్తియుక్తముగఁ బలుకువానిని వాచాలునిగను దుర్జనులు తలంతురు. ఎట్టిగుణవంతునైనను దుర్జనులు ఏదో యొకవంక పెట్టి నిందింతురు.

శా. హ్రీరమ్యుం జడుఁగాఁగ సువ్రతుని మాయింగా శుచిం దంభిఁగా
శూరుఁ నిర్దయుఁగా మునిఁ విమతిఁగా శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిఁగా సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితారూఢంబు జేయుం గదా.

అవ. ఇఁక గుణావగుణప్రణాళికను జూపించుచున్నాఁడు:—

శ్లో. లోభశ్చేదగుణేన కిం పిశునతా యద్యస్తి కిం పాతకైః
సత్యం చేత్తపసా చ కిం శుచి మనో యద్యస్తి తీర్థేన కిం,
సౌజన్యం యది కిం బలేన మహిమా యద్యస్తి కిం మణ్డనైః
సద్విద్యా యది కిం ధనైరపయశో యద్యస్తి కిం మృత్యునా. 44

వ్యా. అథ గుణావగుణప్రణాళికామాహ—లోభ ఇతి.—లోభో ధనాది వాఞ్ఛా, ఽస్తి చే,దగుణేన దుర్గుణేన, కిం న కించిదపీత్యర్థః-తస్యైవాత్యన్తనిన్దావహత్వా దితి భావః, పిశునతా పరోక్షే పరదోషసూచకతా, అస్తి యది, పాతకైర్బ్రహ్మహత్యా దిభిః, కిం తస్యా ఏవ నిరయపాతనదక్షత్వాదితి భావః, సత్యం యథార్థభాషణం సమ దర్శిత్వం వా, ఽస్తి చే, త్తపసా చాన్ద్రాయణాదినా, కిం తస్యైవ పరిశోధకత్వాదితి భావః, శుచి ద్రోహచిన్తాదిరాహిత్యేన శుద్ధం, మనోఽస్తి యది, తీర్థేన ప్రయాగా దినా, కిం తస్యై వాపవర్గమూలకత్వాదితి భావః.

'యస్త్వాత్మతీర్థం భుజతే వినిష్క్రియస్స సర్వవిత్సర్వగతోఽమృతో భవేత్.' ఇతి స్మరణమత్ర మూలం, సౌజన్యం సుజనభావో, ఽస్తి యది, బలేన పరిజనేన, కిం తస్యైవాశేషకార్యనిర్వాహకత్వాదితి భావః, మహిమా మాహాత్మ్య, మస్తి యది, మణ్డ నైః కుణ్డలహారాద్యలంకరణైః, కిం తస్యైవోపస్కారహేతుభూతత్వాదితి భావః. అప యశః అపకీర్తి, రస్తి యది మృత్యునా మరణేన కిం తద్వత్ మృతిప్రాయత్వాదితిభావః; ఏవం విచార్య సద్గుణార్జనతత్పరేణ భవితవ్యం నిపుణేన, అన్యథా దౌర్జన్యమనాయాస సాధ్యమితి వాక్యశేషత్వేనోన్నేయమ్.

టీ. లోభః=పిసినారితనము. (అస్తి) చేత్=ఉండునేని, అగుణేన కిం=దుర్గుణమేల? (అనఁగా: అన్ని దుర్గుణములలో నింద్యమైన దీపిసినారితనమే యనుట) పిశునతా = చాడీ

శోరుతనము, అ స్తియది=ఉండు నేని, పాతకైః కిం=పాపము లేల? సత్యం=నిజము, (అస్తి) చేత్ = ఉండు నేని, తపసాచకిం=తపస్సునైత మేల, శుచి=పరిశుద్ధమైన, మనః=మనస్సు, అ స్తియది = ఉండు నేని, తీర్థేనకిం=(గంగా కావేర్యాది) తీర్థము ఏల? సౌజన్యం=మంచి తనము, (అస్తి) యది = ఉండు నేని, బలేనకిం=బలముఏల, మహిమా=గొప్పతనము, అస్తి యది = ఉండు నేని, మండనైఃకిం = అలంకారము లేల? సద్విద్యా=మంచిచదువు, (అస్తి) యది=ఉండు నేని, ధనైః కిం=ధనము లేల? అపయశః = అపకీర్తి, అ స్తియది=ఉండు నేని, మృత్యునా కిం = మరణ మేల?

తా. అత్యాశయున్న వేరొకదుర్గుణ మక్కఱ లేదు. పిశునత్వము (కొండెములు చెప్పుట) ఉండునేని వేఱుపాపము లక్కఱ లేదు. సత్య మున్న తపస్సుచేయ నక్కఱ లేదు. నిర్మలమగు మనస్సున్న తీర్థసేవ యక్కఱ లేదు. మంచితనముండెనేని స్వకార్యనిర్వాహణమునకు స్వజన మక్కఱ లేదు. గౌరవ ముండు నేని యలంకారము లక్కఱ లేదు. చక్కని విద్యయుండు నేని ధనమక్కఱ లేదు. అపకీర్తియుండు నేని వేఱుగ చావ నక్కఱ లేదు.

చ. పగ గొనులోభముం బిశునభావము సత్యము చిత్తశుద్ధియుం
దగుసుజనత్వముం సుమహితత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన దుర్గుణంబు దురితంబు దపంబును దీర్థసేవ భృ
త్యగణము సొమ్ములుం ధనచయంబును జావును వేఱ యున్న వే.

అవ. ఒకానొక యనుభవరసికుఁడు 'పురుషునకు మనశ్శల్యములు ఏడు' అని పల్కినరీతిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. శశీ దివసధూసరో గళితయౌవనా కామినీ
సరో విగతవారిజం ముఖమనక్షరం స్వాకృతేః,
ప్రభుర్ధనపరాయణః సతతదుర్గతిస్సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో మనసి సప్తశల్యాని మే. 45

వ్యా.—కస్యచిదనుభవినో నిజకష్టాభివేదనమభినీయాహ—శశీతి, దివసే=అహ్ని, ధూసరో ని స్తేజస్కః, శశీ చన్ద్రశ్చ, గళితయౌవనా భ్రష్టనూతనవయస్కా, కామినీ కాన్తా చ, విగతవారిజం పుణ్డరీకషణ్డహీనం, సరః కాసారశ్చ, శోభనా ఆకృతిర్యస్య సున్దరపురుషస్య, అనక్షరం శాస్త్రవిభ్రష్టం ముఖం చ, ధనపరాయణో ధనలుబ్ధః, ప్రభుః రాజా చ, సతతదుర్గతిః నిరన్తరదారిద్ర్యవాన్, సజ్జనశ్చ, నృపాఙ్గణగతో రాజగృహాస్థి

ర్వ_ర్తీ, ఖలో దుర్జనశ్చ=తస్య విఘాతుకత్వాదితి భావః, ఇత్యేవం, సప్త, శల్యాని శూలాని తథా దుస్సహదుఃఖజనకత్వాదితి భావః, ఇదమేవాత్మ న్తకష్టనివేదనవచనమితి తాత్పర్యమ్.

అత్రాప్రకృతానాం ప్రకృతస్య ఖలస్య చ దుఃఖహేతుత్వసామ్యేనౌపమ్యస్య గమ్యమానత్వాద్దీపకాలంకారః - లక్షణం తూక్తమ్. గతమిదం పృథ్వీవృత్తమ్.

టీ. దివసధూసరః - దివస = పగటియందు, ధూసరః = వెలవెలలాడు, శశీ = చంద్రుడు, గళితయౌవనా = జారినయౌవనముగల, కామినీ = ప్రియురాలు, విగత వారిజం = పోయిన తామరపువ్వులుగల (తామరలులేని), సరః = కొలను, సు ఆకృతేః= మంచిరూపముగలవానియొక్క, అనక్షరం = అక్షరములేని (ఒకఅక్కరపు ముక్కయేని తెలియని-చదువురాని), ముఖం = నోరును, ధనపరాయణః=డబ్బుపైమిగుల నాసక్తిగల ప్రభుః = రాజు, సతతదుర్గతిః = ఎప్పుడు పేదఱికముగల, సజ్జనః = మంచివాడును, నృపఅంగణగతః = రాజుముంగిటిని జేరిన, ఖలః = దుర్జనుడును (అనగా: రాజునకు దుర్బోధలచేయువాడనుట), (ఈ) సప్త = ఏడును, మే = నాయొక్క, మనసి = మనస్సునందు, శల్యాని = శూలములు - మేకులు. (మిక్కిలి దుఃఖకరము లనుట).

తా. పగటియందు దేజోహీనుడైన చంద్రుడును, గతయౌవన యగు కామినియు, తామరలులేనికొలనును, చదువులేనిసుందరుడును, కేవలధనాశగలభూపాలుడును, సర్వదా దరిద్రుడగు సజ్జనుడును, ప్రభువులసమీపమున నుండినదుర్జనుడును ఈయేడుగురును శల్యము వలె మనంబునకు దుఃఖమును కలుగ జేయుదు రని నాయభిప్రాయము.

చ. దినములిసాంగు డైనహిమ ? దీప్తియు బ్రాయము దప్పునాతియున్
వనరుహశూన్య మౌకొలను ? వర్ణితరూపు నిరక్షరాస్యమున్
ధనపరు డైనరాజు సతతంబును లేమిని గుందుసాధువున్
జనపతిచెంత దుర్జనుడు ? శల్యము లే డివి నామనంబునన్.

అవ. దుష్టరాజులక్షణమును సదృష్టాంతముగ జెప్పుచున్నాడు:—

శ్లో. న కశ్చిచ్చణ్డకోపానామాత్మీయో నామ భూభుజాం,
హోతారమపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః. 46

వ్యా.—అథ దుష్టరాజలక్షణం సదృష్టాన్తమాహ.—న కశ్చిదితి.—చణ్డకోపానాముగ్రక్రోధానాం, భూభుజాం రాజ్ఞాం, కశ్చిదపి పుమాన్, ఆత్మీయో నామ ఆత్మీ

యత్వేన ప్రసిద్ధః, న భవతి-కిం తు సర్వోఽప్యనాత్మీయ ఏవేత్యర్థః; నను యథా కథం చిద్ధితమాచరన్భవిష్యత్యేవ ఆత్మీయ ఇత్యాశఙ్క్య దృష్టాన్తముఖేన నిరాకుర్వన్నాహ—జుహ్వానమాజ్యపురోడాశాదిదానేనోపచరన్తమపి * 'హు దానాదనయోః' ఇతి ధాతోః కర్తరి శానచ్, హోతారం యజమానం, పావకోఽగ్నిః, స్పృష్టస్సన్, దహతి సంతాపయతీత్యర్థః; అతోఽగ్నిదృష్టాన్తేనేదృశో రాజా న సమాశ్రయణీయ ఇతి భావః.

టీ. చండకోపానాం = తీక్ష్ణమైనకోపముగలవారగు, భూభుజాం = రాజులకు, కశ్చిత్ = ఎవఁడును, ఆత్మీయః = తనవాఁడు (అనఁగా: తనకుఁ బ్రీతిపాత్రమగువాఁడు), న నామ = లేఁడుగదా! జుహ్వానం అపి = (నేయి పురోడాశము మున్నగు వానిని) వ్రేల్చుచున్నవానినైనను, హోతారం = యజమానుని, పావకః = అగ్ని, స్పృష్టః (సన్) = తాఁకఁబడినవాఁడై, దహతి = కాల్చును.

తా. అతికోపులగుభూపాలురను ప్రేమించఁదగినవాఁడు ఒకఁడు నుండఁడు. అగ్నిహోత్రుఁడు తనతృప్తికై హోమముచేయువానిని సైతము తాఁకునేని మొగమోటమి లేక కాల్చును.

క. మనుజులలో నెవ్వఁడు దగఁ
దనవాఁ డనువాఁడు దుష్టధరణీశునకున్
దనకయి వ్రేలిమి వ్రేల్చెడు
జనునితనువుఁ గాల్చు వాయుసఖుఁ డదయుఁడై.

అవ.—రాజసేవ మిగుల కష్ట మనుచున్నాఁడు—

శ్లో. మౌనాన్మూకః ప్రవచనపటుర్వాచకో జల్పకో వా
ధృష్టః పార్శ్వే భవతి చ వసన్ దూరతోఽప్యప్రగల్భః,
క్షాన్త్యా భీరుర్యది న సహతే ప్రాయశో నాభిజాతః
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః. 47

వ్యా.—కథం న సమాశ్రయణీయ ఇత్యాశఙ్క్యతత్సేవాయా దుష్కరత్వాదిత్యాహ—మౌనాదితి.—మౌనాత్తూష్ణీంభావాన్మూకో నిర్వచో-భవతి సేవక ఇతి శేషః, ప్రవచనపటుః ప్రగల్భశ్చాతివక్తా, వాచకో బహుభాషీ, జల్పతీతి జల్పకోఽసంబద్ధప్రలాపీ-భవతి, ఉభయత్రాపి * 'జ్వల్ తృచా వి'తి కర్తరి ణ్వుల్ప్రత్యయః-ణిత్త్వాద్వృద్ధిః - 'జల్పక' ఇతి పాఠే జల్పతీతి జల్పకః - పచాద్యచ్ - స్వార్థే క

ప్రత్యయః-అన్యథా * 'జల్ప భీక్షే' త్యాదినా షాకన్ప్రత్యయే జల్పాక ఇతి స్యాత్ - యదాహామరసింహః—ని. 'స్యాజ్జల్పాకస్తు వాచాల' ఇతి. పార్శ్వే సమీపే చ, వసన్, ధృష్టో నిర్భీకో-భవతి, దూరతో విప్రకృష్టదేశే, వసన్, అప్రగల్భః అప్రౌఢో - భవతి, క్షాన్త్యా పరిభవాదిషూత్పద్యమానేషు క్రోధప్రతిబన్ధలక్షణయోపలక్షితశ్చే, ద్భీరుర్భయ శీలో-భవతి * 'భియః క్రుక్లుకనా వి'తి క్రుప్రత్యయః, న సహతే పరిభవాదికం న క్షమతే, యది తర్హి, ప్రాయశో బాహుళ్యేన, అభిజాతస్సత్కులీనో, న సభవతి, అతః పరమగహనోఽత్యన్తదురవగాహః, సేవాధర్మః పరిచర్యాత్మకం కర్మ, యోగినామపి కాలత్రయజ్ఞానామప్యతీన్ద్రియవస్తుపరిజ్ఞానవతామిత్యర్థః - కిముతాన్యేషామితి భావః, అగమ్యో జ్ఞాతుమశక్యః - సర్వే గత్యర్థాః జ్ఞానార్థా-యతః పరబ్రహ్మాఽపి ధ్యానాదినా సాక్షాత్క్రియతే న త్వయమితి భావః; మౌనాదివ్యతిరిక్తధర్మస్య గగనారవిన్దప్రాయ త్వాత్తస్య బ్రహ్మణోఽపి దుర్విజ్ఞేయతయాఽత్యన్తదుష్కరత్వమితి తాత్పర్యమ్.

అత్ర సేవాధర్మస్య యోగిగమ్యత్వే ఽప్యగమ్యత్వోక్తే స్సంబన్ధే అసంబన్ధ రూపాతిశయోక్తిః. మన్దాక్రాన్తావృత్తమ్ - 'మన్దాక్రాన్తా జలధిషడగైర్మ్భౌ నతౌ తాద్గురూచే'తి లక్షణాత్.

టీ. మౌనాత్ = మాటాడకుండుటవలన, మూకః = మూఁగవాఁడు; ప్రవచన పటుః = బాగుగా మాటాడుటయందు నేర్పుగలవాఁడు, వాచకః = ప్రేలుడుగాఁడు, వా = లేక, జల్పకః = అసంబద్ధప్రలాపి, పార్శ్వే = వెంబడి, వసన్ చ = ఉండువాఁడు, ధృష్టః = దిట్టరి; దూరతః = దూరముగా, వసన్ అపి = ఉండువాఁడు సైతము, అప్రగల్భః = చేతఁగానివాఁడు; క్షాన్త్యా = ఓర్పుచేత, భీరుః=పిఱికివాఁడు; భవతి = అగును. న సహతే యది = (అవమానములను) ఓర్చుకొనఁడేని, ప్రాయశః = తఱుచుగా, అభిజాతః = మంచికులమునఁ బుట్టినవాఁడు, న = కాఁడు; (కాఁబట్టి) పరమగహనః = మిక్కిలి తెలిసికొనరాని, సేవాధర్మః = కొలువుయొక్క స్వరూపము, యోగినాం అపి = (భూత భవిష్య ద్వర్తమానకాలములు మూఁటి నెఱింగి అతీంద్రియములగు పదార్థములుకూడఁ గనిపట్టు) యోగులకు సైతము, అగమ్యః = తెలియరానిది.

తా. సేవకుఁ డగువాఁడు ఏమియుఁ బలుకకయుండునేని వానిని మూగవాఁ డనియు, చక్కఁగ మాటాడునేని వదరుపోతనియు, సమీప మున నున్న భయభక్తులు లేనివాఁ డనియు, దూరముగ నున్న చేతకాని

వాఁ డనియు, సహించువాఁ డగునేని పిఱికి యనియు, ఓర్పులేనియెడల సద్వంశజాతుఁడు కాఁ డనియు ప్రభువులు తలఁతురు. కావున ఇట్టిసేవాధర్మమునందు చక్కఁగఁ జరించుట యోగీశ్వరులకైనను అలవి కాదు.

ఉ. మౌనముచేత మూఁగయు సమంచితవక్త ప్రలాపి చెంగటం
బూని వసింప దిట్ట దమమున్న దవ్వఁగ నుండెనేని శా
లీనుఁడు దాల్మి భీరుఁ డవహిష్ణుఁడు దాలిమి లేనిబంటు భూ
జానులసేవ దుష్కర మసాధ్యము యోగులకైన నిద్ధరన్.

అవ. వే యేల ? దుష్టరాజుముందఱ నెవ్వనికి నుండ రా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉద్భాసితాఖిలఖలస్య విశృఙ్ఖలస్య
ప్రోద్గాఢవిస్మృతనిజాధమకర్మవృత్తేః,
దైవాదవాప్తవిభవస్య గుణద్విషోఽస్య
నీచస్య గోచరగతైః సుఖమాస్యతే కైః? 48

వ్యా.—కిం బహు నాఽస్య పురస్తాన్న కేనచిత్ స్థాతుమపి శక్యత ఇత్యాహ — ఉద్భాసితేతి.—ఉద్భాసితాః ప్రకాశితాః—అఖిలాః ఖలా యేన తస్య అధికారప్రదానేన పురస్కృతాశేష దుర్జనస్యేత్యర్థః - తస్య సుజనవిద్వేషిత్వాదితి భావః, తథా, విశృఙ్ఖల్య విధినిషేధాతీతతయా స్వచ్ఛన్దగతేరిత్యర్థః. తథా, ప్రోద్గాఢమతితరాం - విస్మృతా స్మరణావిషయీకృతా - నిజా స్వకీయా - అధమ కర్మవృత్తిః ప్రాక్తననీచ కృత్యవ్యాపారో - యేన తస్య -'ప్రాగేవ విస్మృతే'తి పాఠే ప్రాక్ ప్రథమమ్ ఆచరణ సమయ ఏవేత్యర్థః - ఏతేన లజ్జాహైన్యముక్తం, తథా, దైవా దదృష్టవశా, దిదానీ, మవాప్తః ప్రాప్తో - విభవః ఐశ్వర్యం సంపత్తి - ర్యస్య, గుణద్విష స్సుగుణనిన్దక, స్యాస్య పూర్వోక్తస్య నీచస్య రాజ్ఞః, గోచరగతైః విషయవాసిభిః, కైర్జనై, స్సుఖమక్లేశేన, ఆస్యతే స్థీయతే, న కైరపీత్యర్థః, అతో న నీచాశ్రయః కర్తవ్య ఇతి భావః. * 'ఆస ఉపవేశనే' - భావే లట్.

అత్రోద్భాసితేత్యాదిపదార్థస్య విశేషణగత్యా సుఖస్థిత్యభావపదార్థ హేతుత్వా త్పదార్థహేతుకం కావ్యలిఙ్గమలంకారః. వసన్తతిలకావృత్తమ్.

టీ. ఉద్భా... ఖలస్య - ఉద్భాసిత = ప్రకాశింపఁజేయఁబడిన, అఖిల = సమస్తలయిన, ఖలస్య = దుర్జనులు గలవాఁడును, (అనఁగా: దుష్టులను గొప్పదశకుఁ దెచ్చినవాఁడనుట), విశృంఖలస్య = (విధినిషేధములు లేనందున) అడ్డులేనివాఁడును, ప్రోద్గాఢ...

వృత్తేః-ప్రోద్గాఢ=బొత్తిగా, విస్మృత=మఱవఁబడిన, నిజ = తనదైన, అధమకర =నీచపుఁ బనులయొక్క, వృత్తేః = బ్రదుకుదెరువుగలవాఁడును, (అనఁగా: మునుపు తాను బ్రదుకు దెరువుకై ఏయేనీచపుఁబనులలోఁ బ్రవేశించి పొట్టగడుపుకొనెనో యాపూర్వవృత్తాంతము నిప్పు డైశ్వర్యమదమత్తుఁడై బొత్తిగా మఱచినాఁ డనుట. దీనిచే సిగ్గులేనివాఁ డని యేర్పడుచున్నది.) దైవాత్ = అదృష్టమువలన, అవాప్తవిభవస్య = (ఇప్పుడు) సంపద గలవాఁడును, గుణద్విషః = గుణములను నిందించువాఁడును, (అగు) అస్య = ఈ, నీచస్య = నీచునియొక్క, గోచరగతైః = కంటఁబడినట్టి, కైః = ఎవరిచే, సుఖం = సుఖము, అస్యతే= పొందఁబడును. (అనఁగా: అట్టి నీచుని కంటఁబడినవారే సుఖము నొంద రనుట.)

తా. దుర్జనులకే సహాయ మొనర్చుచు వారినిఁ జేరఁదీసి స్వేచ్ఛాచారుఁడై తా నింతకుముం దనుభవించిన హీనస్థితిని దైవయోగము చేతఁ బట్టినసంపదచేత మఱచి గుణవంతుల ద్వేషించు నీచునిసమీపమున నుండు వారలకు సుఖ మనునది యుండదు.

చ. ఖలు లగువారి నెల్లనధికారసమర్థులఁ జేసి తా నిర
ర్గళగతియై నికృష్టనిజకర్మము విస్మృతిపా లొనర్చి ని
శ్చలగుణవైరియై విధివశంబున సంపద గాంచి త్రుళ్లుచుఁ
మెలఁగునృపాలుదేశమున మేలు లభించునె యెట్టివారికిన్.

అవ:—దుర్జనులయు సజ్జనులయు స్నేహములరీతినిఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆరమ్భగుర్వీ క్షయిణీ క్రమేణ లఘ్వీ పురావృద్ధిముపైతి పశ్చాత్,
దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్. 49

వ్యా.—అథ దుర్జనసుజనమైత్రీప్రకారమాహ—ఆరమ్భేతి...పూర్వార్ధపరార్ధాభ్యాం పూర్వాహ్ణాపరాహ్ణభేదేన - భిన్నా పృథగ్విధా. ఛాయా అనాతప ఇవ - ని. 'ఛాయా త్వనాతపే కాన్తౌ ప్రతిబిమ్బార్కజాయయో' రితి వైజయన్తీ. ఆరమ్భే ప్రారమ్భసమయే - గుర్వీ గురుః వర్ధిష్ణురిత్యర్థః * 'వోతో గుణవచనా' దితి వికల్పాత్ జీష్, క్రమేణ కాలక్రమేణ, క్షయిణీ క్షయిష్ణుశ్చ-'జిదృక్షి' త్యాదినా ఇనిః, తథా, పురా ప్రారమ్భే, లఘ్వీ లఘుః హ్రస్వేత్యర్థః - పూర్వవత్ జీష్, పశ్చా దనన్తరం, వృద్ధి, ముపైతి ప్రాప్నోతీతి భావః—అయమర్థః—దుర్జనమైత్రీ పూర్వాహ్ణచ్ఛాయేవ ప్రారమ్భగుర్వీ క్రమేణ క్షయిణీ చ భవతి సుజనమైత్రీ తావ దపరాహ్ణచ్ఛాయే వాదౌ

లక్ష్మీ తతో వర్ధిష్ణుశ్చ భవతీతి. అతోఽత్ర యద్యుక్తం తత్కర్తవ్యం ఖళలేసేతి భావః.
అత్ర యథాసంఖ్యసంకీర్ణోపమాలంకారః. ఉపజాతివృత్తముక్తమ్.

టీ. ఖలసజ్జనానాం = దుర్జనులయొక్కయు సజ్జనులయొక్కయు, మైత్రీ = స్నేహము, దినస్య = పగటియొక్క, పూర్వా . . ర్నా-పూర్వార్ధ = మొదటిసగముచేతను, పరార్ధ = తరువాతిసగముచేతను, భిన్నా=మారిన, ఛాయా ఇవ = నీడవలె, ఆరంభగుర్వీ= మొదటపెద్దదియు, క్రమేణ = క్రమముగా, క్షయిణీ = తగ్గునది; పురా = మొదట, లఘ్వీ = చిన్నది, పశ్చాత్ = తరువాత, వృద్ధిం = అతిశయమును, ఉపైతి = పొందును.

తా. దురాత్ములస్నేహము ప్రాతఃకాలపునీడవలె ప్రథమమున విస్తారముగ నుండి క్రమక్రమముగ నశించును. సజ్జనులమైత్రి సాయంకాలపునీడవలె ప్రథమమున చిన్నదై క్రమక్రమముగ వృద్ధినందును.

తే. మొదలఁ జూచినఁ గడు గొప్పదై పిదపఁ గుఱుచ
యాదిఁ గొంచెము తర్వాత నధిక మగుచుఁ
దనరు దినపూర్వపరభాగజనితమైన
చాయపోలికఁ గుజనసజ్జనులమైత్రి.

అవ. ఈపద్ధతి మొదటఁ జెప్పిన "అకరుణత్వ మకారణవిగ్రహః" అను దానిని బ్రకటింపఁ దలఁచి "కొండెగాఁడు సజ్జనులకు నిష్కారణవిరోధి" అని చెప్పుచు నీపద్ధతిని ముగించుచున్నాఁడు:—

శ్లో. మృగమీనసజ్జనానాం తృణజలసన్తోషవిహితవృత్తీనామ్,
లుబ్ధకధీవరపిశునా నిష్కారణమేవ వైరిణో జగతి. 50

వ్యా:—యదుక్తం 'మకరుణత్వమకారణవిగ్రహః' ఇతి తదేవ ప్రకటయన్నుప సంహరతి—మృగేతి—సంతోషా దైవవశాల్లబ్ధేన మనస్సంతుష్టిః - తృణజలసంతోషైః - ర్విహితా కల్పితా-వృత్తి ర్జీవనం-యేషాం తేషాం-న తు పరోపతాపోపజీవినామిత్యర్థః - ని. 'వృత్తిర్వర్తనజీవన' ఇత్యమరః, మృగాణాం హరిణాదీనాం-మీనానాం మత్స్యానాం-సజ్జనానాం సాధూనాం చ, లుబ్ధకో వ్యాధః - ధీవరో దాశః - జాలిక ఇత్యర్థః-పిశున స్సూచకశ్చ - ని. 'వ్యాధో మృగవధాజీవో మృగయు ర్లుబ్ధకశ్చ సః' 'కైవర్తే దాశ ధీవరౌ' ఇతి చామరః, ఏతే, జగతి భువి, నిష్కారణం నిర్హేతుకమేవ, వైరిణో విద్వేషిణః ఘాతుకా ఇత్యర్థః.

తృణేన విహితవృత్తీనాం మృగాణాం లుబ్ధకా నిష్కారణవైరిణ ఇత్యాది యథాక్రమమన్వయాత్క్రమాపరనామా యథాసంఖ్యాలంకారః-తదుక్తం విద్యానాథేన—

'ఉద్దిష్టానాం పదార్థానాం పూర్వం పశ్చాద్యథాక్రమమ్,
అనూద్దేశో భవేద్యత్ర తద్యథాసంఖ్యముచ్యతే.'

ఆర్యావృత్తమ్.

టీ. తృణ...వృత్తీనాం-తృణ = పచ్చికచేతను, జల = నీటిచేతను, సంతోష = ఆనందముచేతను, విహిత = చేయఁబడిన, వృత్తీనాం = దేహయాత్ర (బ్రదుకు) గల, మృగమీనసజ్జనానాం-మృగ = లేళ్లకు, మీన=చేఁపలకు, సజ్జనానాం=సత్పురుషులకును, లుబ్ధ...శునాః—లుబ్ధక = వేఁటగాండ్రును, ధీవర = జాలరులును, పిశునాః = చాడీలు చెప్పువాండ్రును, జగతి = లోకములో, నిష్కారణం ఏవ = కారణములేకయే, వైరిణః= విరోధులు.

తా. పరులఁ బీడింపకయే గడ్డిచేత కాలయాత్రను గడుపుకొను జింకలు మొదలయిన మెకములకు బోయలును, నీటిచేతఁ బ్రదుకు మీనంబులకు జాలర్లును, దొరకినదానితో సంతసించి కాలయాత్ర చేయు సజ్జనులకు కొండెగాండ్లును అకారణవైరులయి లోకమునఁ గనంబడుచున్నారు.

తే. కసవుచే నీటిచే మోద ౹ కలనచేత
బ్రతుకు మృగమీనసజ్జన ౹ ప్రకరమునకు
శబరకైవర్తసూచక ౹ జనులు జగతిఁ
గారణము లేనిపగవారు ౹ గారె తలఁప.

ఇది నీతిశతకమునందు దుర్జనపద్ధతివర్ణన మను
ఐదవ దశకము.

---

## సుజనపద్ధతి

అవ:—దుర్జనపద్ధతిని నిరూపించి తద్వైలక్షణ్యమును దెలుపుటకై సుజనపద్ధతి నారంభించుచు సుజనుల నమస్కరించుచున్నాఁడు:—

శ్లో. వాఞ్ఛా సజ్జనసఙ్గతౌ పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతిర్లోకాపవాదాద్భయమ్,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యేషు వసన్తి నిర్మలగుణాస్తేభ్యో నమః కుర్మహే. 51

వ్యా.—అథైతద్వైలక్షణ్యేన సుజనపద్ధతిం నిరూపయతి - తత్రాదావావరాతి శయాత్తాన్నమస్కరోతి—వాఞ్ఛేతి.—సజ్జనసంగతౌ సాధుసమాగమే, వాఞ్ఛా అభి లాషః - న తు జిహాసా - తస్య మోక్షసాధకత్వాదితి భావః - తదుక్తం జ్ఞాన వాసిష్ఠే—

'మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః,

శమో విచారస్సంతోషశ్చతుర్థస్సాధుసంగమః.' ఇతి-

తథా చోక్తం శ్రీమద్భాగవతే—'మహత్సేవాం ద్వారమాహుర్విముక్తే' రితి - స్వేనా ప్యుక్తమ్-

'చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం,

సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్.' ఇతి,

పరేషాం గుణే - ప్రీతిస్సంతోషః - న తు దోషాపాదనమ్-

'పరగుణపరమాణూన్పర్వతీకృత్య నిత్యం

నిజహృది వికసన్తస్సన్తి సన్తః కియన్తః.'

ఇతి వక్ష్యమాణత్వాదపీతి భావః. గురౌ విద్యోపదేష్టరి, నమ్రతా భక్తిశ్రద్ధాభరేణ ప్రహ్వీభావః - న తు గర్వోద్రిక్తతా-

'యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ,

తస్యైతే నిఖిలా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః.'

'గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో జనార్దనః,

గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః.'

ఇతి శ్రుతిస్మృతీ, విద్యాయాం వేదాన్తాదివిద్యాభ్యాసే. వ్యసన మాసక్తిః-న తు ద్యూత కేళ్యాదౌ-తస్య మోక్షసాధన బ్రహ్మజ్ఞానజనకత్వాదితి భావః, స్వయోషితి నిజదారేషు, రతిస్సంభోగః - న తు పరదారేషు - 'రమ్యం కులస్త్రీరత' మితి భావః, లోకాపవా దాత్ లోకనిన్దాయాః * 'భీతార్తానాం భయహేతు' రిత్యుపాదానత్వాత్పుఞ్చమీ - భయం న తు నిర్లజ్జత్వం * 'లోకాపవాదో బలవానితి సత్యవతీ శ్రుతి' రిత్యాదివచ నాత్తస్య బలిష్ఠత్వాదితి భావః, శూలిని పరదేవతాయాం భగవతి, భక్తిరనురాగః, న తు క్షుద్రదేవతాయాం * 'శివే భక్తిశ్శివే భక్తి' రిత్యాది వచనేష్వావృత్త్యా తస్యాః ప్రాశస్త్యశ్రవణాదితి భావః, ఆత్మదమనే స్వపరిభవే సతి, శక్తిస్సామర్థ్యం పరాక్రమ ఇతి యావత్ - న తూపశమేనౌదాసీన్యమ్-

'అన్యదా భూషణం పుంసాం శమో లజ్జేవ యోషితామ్.

పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ.'

ఇతి వచనాదితి భావః, ఖలైర్దుర్జనైస్సహ సంసర్గముక్తిస్సఙ్గత్యాగః-న తు తత్సహవాసాభిలాషః *'దుర్జనం దూరతస్త్యజే' దితి - 'దుర్జనః పరిహర్తవ్య' ఇత్యాదివచనాదితి భావః, ఇత్యేతే-నిర్మలాః నిష్కళఙ్కాః-గుణాస్సజ్జన సంగతివాఞ్ఛాదయో, యేషు పురుషేషు వసన్తి, తేభ్యో మహద్భ్యో నమః - ఇత్థం భూతగుణవిశిష్టానామేవ నమస్కారార్హత్వా దితి భావః. *'నమస్స్వస్తీ'త్యాదినా చతుర్థీ'త్రైరేవ భూష్యభిషితే'తి పాఠే త్రైర్నిర్మల గుణసంపన్నై రేవభూ రలంకృతా న త్వన్యైస్తేషామేవ చారుత్వాద్యతిశయహేతుత్వా దితి భావః.

శార్దూలవిక్రీడితమ్.

టీ. సజ్జనసంగతౌ=సజ్జనులతోడి సహవాసమునందు, వాంఛా = కోరిక, (ఇయ్యది మోక్షసాధక మని జ్ఞానవాసిష్ఠమునం దిట్లుచెప్పఁబడినది.—"మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః, శమోవిచారస్సంతోషశ్చతుర్థస్సాధుసంగమః." "మోక్షద్వారమునందు 'శాంతి, విచారము, సంతోషము, సజ్జనసాంగత్యము' ; అను నలువురు ద్వారపాలురు గలరు." మఱియు శ్రీభాగవతమందును "మహత్సేవాం ద్వారమాహు ర్విముక్తేః," "ముక్తికి మహత్సేవయే ద్వారము." అని చెప్పఁబడినది. ఇంతియకాక (భర్తృహరియుఁ) తానును "సత్సంగతిః, కథయ కిం న కరోతి పుంసాం" అని చెప్పెను. కావున సత్సాంగత్యముత్కృష్టగుణ మనుట,) పరేషాం=ఇతరులయొక్క,గుణే=గుణమందు, ప్రీతిః = సంతోషము, (అనఁగా: "పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం నిజహృది వికసంత స్సంతి సంతః కియంతః" అని ముందుఁ జెప్పఁబోవురీతి అనియర్థము.) గురౌ=ఆచార్యునియందు, నమ్రతా = అడఁకువ, ("యస్య దేవే పరాభక్తిః యథాదేవే తథాగురౌ" అనఁగా: "దేవునియం దెట్టి యుత్తమభక్తిగలదో యట్టిభక్తియే గురువునందుఁ జేయవలయును." అనునది మొదలగుప్రమాణములచే నాచార్యునియం దత్యంత భక్తియుక్తుఁడై యుండుట.) స్వయోషితి = తనభార్యయందు, రతిః = సంభోగము, లోకాపవాదాత్ = లోకులనిందనుండి, భయం = భయము, శూలిని = శివునియందు, భక్తిః=అనురాగము, ఆత్మదమనే = మనోనిగ్రహమునంను, శక్తిః = సామర్థ్యము, [లేక ఆత్మ = తనయొక్క, దమనే = పరాభవమునందు (తనకు పరాభవము సంభవించినపుడు), శక్తి = సామర్థ్యము (పరాక్రమము). "అన్యదా భూషణం పుంసాం శమో లజ్జేవ యోషితాం, పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ." స్త్రీలకు లజ్జయెట్లో అట్లు పురుషులకు శాంతియే యలంకారము; కాని స్త్రీలకును మఱి సురతములయందు సిగ్గువదలుటవలె,

పురుషులకు పరాభవమందు పరాక్రమ మనునదియే యలంకారము" అనురీతిగ నని భావము.] ఖలైః=దుర్మార్గులతోడ, సంసర్గముక్తిః=చేరికయొక్క(ను) వదలుట, ఏతే=ఈ, నిర్మలగుణాః=మంచిగుణములు, యేషు=ఎవరియందు, వసన్తి=కలవో, తేభ్యః మహద్భ్యః= ఆగొప్పవారికి, నమః కుర్మహే = నమస్కరించుచున్నాము.

తా. సత్సహవాసమునం దాసక్తియు, పరులగుణమునందుఁ బ్రీతియు, గురువులయందు అణఁకువయు, విద్యలయం దాసక్తియు, స్వభార్యయందు సంభోగము, జనాపవాదమునకు వెఱచుట, ఈశ్వరునియందు భక్తియు, అవమానము గలిగిన సామర్థ్యమును చూపుటయు, దుస్సహవాసము ను విడుచుటయు, ఇట్టినిర్మలగుణములు గలవారికి నమస్కారము.

మ. సుకృతిశ్రేష్ఠులగోష్ఠియుం బరగుణస్తోమంబునం బ్రీతి దే
శికసంసేవయు విద్యయందు రుచి స్వస్త్రీకేళి లోకాపవా
దకథాభీతియు శంభుభక్తి దమనోద్యచ్ఛక్తియుఁ సాధుదూ
షకసాంగత్యవిముక్తియుం గలమనీషావంతులం గొల్చెదన్.

అవ. ఇఁక సజ్జనునకు స్వభావసిద్ధమగు గుణములను జెప్పుచున్నాఁడు:—

శ్లో. విపది ధైర్యమథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరతిర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్. 52

వ్యా.—అథైషాం నిసర్గసిద్ధగుణం - గణయతి - విపదీతి.—విపద్యాపత్కాలే, ధైర్యం నిర్వికారచిత్తత్వం - న తు దైన్యం, - 'మనసో నిర్వికారత్వం ధైర్యం సత్స్వపి హేతు'ష్వితి, అథానన్తరం వాక్యారమ్భే వా, అభ్యుదయే సంపది, క్షమా సహిష్ణుత్వం- న తూచ్ఛృఙ్ఖలతా, సదసి రాజవిద్వత్సభాయాం, వాక్పటుతా వాగ్మిత్వం-సరసవచన రచనా చాతుర్యమితి యావత్ - న తు మూకభావః. యుధి రణరఙ్గే, విక్రమః పరాక్రమో - న తు పలాయనం, యశః, స్వభిరతిః సంగ్రహేచ్ఛా - న త్వనాదరః, శ్రుతౌ వేదశాస్త్రాభ్యాసే వ్యసనమాసక్తిర్నతు నిర్వేద, ఇతీదం సర్వం * 'నపుంసక మనపుంసకే నే' త్యాదినా నపుంసకైకశేషః, మహాత్మనాం మహానుభావానాం, ప్రకృతిసిద్ధం స్వభావసిద్ధం హి - ని. 'సంసిద్ధి ప్రకృతీ సమే' 'స్వరూపం చ స్వభావశ్చ నిసర్గశ్చే' త్యమరః. ద్రుతవిలమ్బితవృత్తమ్ - లక్షణం తూక్తమ్.

టీ. విపది = ఆపదయందు, ధైర్యం=కలఁతపడకుండుట, అథ = తరువాత, అభ్యుదయే = కలిమియందు, క్షమా = ఓర్పు, సదసి = సభయందు, వాక్పటుతా = మాటల చాకచక్యము, యుధి = యుద్ధమునందు, విక్రమః = పరాక్రమము, యశసి=కీర్తియందు, అభిరతిః చ = కోరికయు, శ్రుతౌ=వేదమునందు (లేక, వేదశాస్త్రములు వినుటయందు), వ్యసనం = ఆసక్తి, ఇదం=ఇది అంతయు, మహాత్మనాం=గొప్పమనసుగలవారికి, ప్రకృతిసిద్ధం హి = స్వభావ ప్రాప్తము గదా !

తా. ఆపదలు వచ్చినప్పుడు ధైర్యము, ఐశ్వర్యము వచ్చినప్పుడు ఓర్పు, సభయందు వాక్పాటవము, యుద్ధమునందు శౌర్యముచూపుట, కీర్తియందాసక్తి, వేదశాస్త్రాభ్యాసమునందు చింత - ఇవి మహాత్ములకు స్వభావగుణములు.

ఉ. ఆపదలందు ధైర్యగుణ * మంచితసంపదలందుఁ జాల్మియుఁ
భూపసభాంతరాళమునఁ * బుష్కలవాక్చతురత్వ మాజి బా
హాపటుశక్తియుఁ యశముఁనం దనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియుఁ బ్రకృతి * సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

అవ. సజ్జనులగువారి యాభరణములను దెలియజేయుచున్నాఁడు;—

శ్లో. కరే శ్లాఘ్యస్త్యాగః శిరసి గురుపాదప్రణయితా
ముఖే సత్యా వాణీ విజయి భుజయోర్వీర్యమతులమ్,
హృది స్వచ్ఛా వృత్తిః శ్రుతమధిగతం చ శ్రవణయో
ర్వినాప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మణ్డనమిదమ్. 53

వ్యా.—అథైషాం ప్రసిద్ధవిలక్షణమణ్డనసంపత్తిమాహ—కరఇతి.—కరే హస్తే, శ్లాఘ్య స్సకలలోక ప్రశస్తః, త్యాగో దానం, మణ్డనం-న తు కఙ్కణం - 'దానేన పాణిర్న తు కఙ్కణే నే'తి స్వైనైవాగ్రే వక్ష్యమాణత్వాత్, శిరసి గురుపాదయోః, ప్రణయితా అభివాదనతాత్పర్యం, మణ్డనం - నతు మణిహిరణ్మయకోటీరాదిః, ముఖే వక్త్రే, సత్యా వాణీ సూనృతభాషణం, మణ్డనం - నతు తామ్బూలచర్వణాది, భుజయో, రతులం నిరుపమానం, విజయి జయశీలం చ * జి దృక్షీ' త్యాదినా ఇనిః, వీర్యం బలం, మణ్డనం - నతు కేయూరాది, హృది వక్షస్థలే, స్వచ్ఛావృత్తిః నిష్కళఙ్కవ్యాపారో, మణ్డనం - న తు హారరుచకాది - హృచ్ఛబ్దస్య వక్షస్థలవాచకత్వమపి సంభవతీతి కృత్వా అభేదేన నిర్దేశః, శ్రవణయోః, కర్ణయో రధిగతం శ్రుతం శాస్త్రమేవ -

ని. 'శ్రుతం శాస్త్రావధృతయో' రితి విశ్వః, మణ్డనం నతు కుణ్డలే-'శ్రోత్రం శ్రుతే నైవ న కుణ్డలే' నేతి వక్ష్యతి, ఇదం పూర్వోక్తదానాదికం సర్వం, మైశ్వర్యేణ ధనరత్న సంపత్త్యా, వినాపి * 'పృథగ్వినే 'త్యాదినా వికల్పా త్తృతీయా. ప్రకృత్యా స్వభావేన, మహతాం మహాత్మనాం - సౌజన్యసంపన్నానామిత్యర్థః. * ప్రకృత్యాదిభ్య 'స్తృతీయే' తి తృతీయాసమాసః, మణ్డనం భూషణం - తస్యైవ లోకోత్తరరామణీయ కాదిహేతుత్వాదితి భావః. శిఖరిణీవృత్తమ్.

టీ. కరే = చేతియందు, శ్లాఘ్యః=పొగడఁదగిన; త్యాగః = ఈవి; (మండనం= ఆభరణము,) శిరసి = తలయందు, గురుపాద ప్రణయితా—గురు=ఆచార్యునియొక్క, పాద = పాదములయందు, ప్రణయితా = ప్రేమ; ముఖే=మొగమునందు, సత్యా=నిజమైన, వాణీ = వాక్కు; భుజయోః = చేతులయందు, విజయ=జయశీలమై, అతులం = సాటిలేని, వీర్య = బలము; హృది = మనస్సునందు, స్వచ్ఛా = నిర్మలమయిన, వృత్తిః= వ్యాపారము; శ్రవణయోః = చెవులయందు, అధిగతం=నేర్వఁబడిన, శ్రుతం=శాస్త్రము; ఇదం=ఇదియంతయు (త్యాగాదు లనుట), ఐశ్వర్యాదులు లేకున్నను, ప్రకృతిమహతాం= స్వభావముగ గొప్పవారలకు, మండనం = ఆభరణము.

తా. మహాత్ములకు ఐశ్వర్యములేమిచేత బంగారుసొమ్ములు లేక పోయినను ఈ క్రిందఁ జెప్పఁబోవునవి స్వాభావికాలంకారములుగఁ గనం బడుచున్నవి. ఎట్లనః హస్తములకు సత్పాత్రదానము, శిరంబునకు గురు పాదనమస్కృతియు, ముఖంబునకు సత్యవచనమును, భుజంబులకు జయ స్వభావ మగుపరాక్రమమును, హృదయంబునకు అకలంకమయిన ప్రవర్తనయు, చెవులకు శాస్త్రశ్రవణమును ఇవియ అలంకారములు.

చ. కరమున నిత్యదానము ముఖంబున సూనృతవాణి యొందలం
గురుచరణాభివాదన మకుంఠితవీర్యము దోర్యుగంబునన్
వరహృదయంబునన్ విశద వర్తన మంచితవిద్య వీనులన్
సురుచిరభూషణంబు లివి శూరులకున్ సిరి లేనియప్పుడున్.

అవ. మేలు గలుగుటకు మార్గమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రాణాఘాతాన్నివృత్తిః పరధనహరణే సంయమః సత్యవాక్యం
కాలే శక్త్యా ప్రదానం యువతిజనకథామూకభావః పరేషామ్,
తృష్ణాస్రోతోవిభఙ్గో గురుషు చ వినయః సర్వభూతానుకమ్పా
సామాన్యం సర్వశాస్త్రేష్వనుపహతవిధిః శ్రేయసామేష పన్థాః. 54

వ్యా.—గుణాఢ్యత్వే కో లాభ ఇత్యాశఙ్క్య తేషాం శ్రేయోహేతుత్వమాహ—ప్రాణేతి.—ప్రాణాఘాతాత్ప్రాణిహింసాయాః. నివృత్తిర్నివర్తనం చ - 'మా హింస్యాత్సర్వభూతాని', 'అహింసా పరమో ధర్మస్త్వధర్మః ప్రాణినాం వధః' ఇత్యాదినాఽగ్నీషోమీయపశ్వాలమ్భనవ్యతిరిక్తహింసాయా నిషేధశ్రవణాత్, పరధనహరణే సంయమో మనోరోధశ్చ 'పరద్రవ్యాణి లోష్టవ ది' తి న్యాయాదితి భావః కాలే సమయే సత్యవాక్యం యథార్థభాషణం చ - తథా ధర్మోపదేశశ్రవణాదితి భావః- అత్ర 'బ్రాహ్మణార్థే గవామర్థే' ఇత్యాదిష్వసత్యవచనస్యాపి నిషేధాభావశ్రవణాత్కాల ఇత్యుక్తం, శక్త్యా ప్రదానం విత్తానుసారేణ త్యాగశ్చ - 'విత్తశాఠ్యం న కారయే' దితి వచనాదితి భావః. యువతిజనకథాయాం పరస్త్రీవృత్తాన్తకథనే - మూకభావస్తూష్ణీంభావశీలత్వం చ-'స్వప్నేఽప్యన్యవధూకథా మి' తి వచనాత్' పరేషామన్యేషాం-యాచకానామిత్యర్థః, తృష్ణా ధనలిప్సా - తస్యా ఏవ - స్రోతసః ప్రవాహస్య - విభఙ్గో నిరోధః- అభీప్సితదానేన మనోరథపరిపూరణం చేత్యర్థః-

'యాచమానజననసమాసవృత్తేః పూరణాయ బత జన్మ న యస్య,
తేన భూమిరతిభారవతీయం న ద్రుమైర్న గిరిభిర్న సముద్రైః.'

ఇతి శ్రవణాదితి భావః, గురుషు విషయే, నమ్రత్వం చ - 'గురౌ నమ్రతే' త్యుక్తత్వాదితి భావః, సర్వభూతేష్వశేషప్రాణి - ష్వనుకమ్పయా దయయా - సామాన్యం సమదర్శిత్వం చ, సర్వశాస్త్రేషు వేదవేదాన్తాది సకలాగమే, ష్వనుపహతః అవిచ్ఛిన్నః - విధి రధ్యయనవిధానం చ - యద్వా 'సర్వభూతానుకమ్పే' తి పృథక్పదం, తథా సర్వశాస్త్రేషు సామాన్య మవైషమ్యేణ తత్తత్సిద్ధాన్తానువర్తిత్వమ్, అనుపహతవిధిరలుప్తకర్మానుష్ఠానం చే, త్యేష గుణసముదాయః, శ్రేయసాం పన్థా అఖణ్డైశ్వర్యాది శ్రేయః ప్రాప్తిమార్గః-స త్వేతద్వ్యతిరిక్తోఽన్యోఽస్తీత్యర్థః, ఏతాదృశగుణసంపత్తిస్సుజనానామేవేతి కృత్వా త ఏవ శ్లాఘ్యా ఇతి భావః; అథవా శ్రేయసాం ప్రశస్యానాం సుజనానాం సంబన్ధీ, పన్థాః తత్ప్రవృత్తిమార్గ ఇత్యర్థః-ప్రశస్యశబ్దా దీయసుని * 'ప్రశస్యస్య' ఇతి శ్రాదేశః. అత్ర 'వాఞ్ఛాసజ్జనసంగతౌ' విత్యాదిశ్లోకే షూక్తగుణాః ప్రాయేణ దైవసంపత్- అభిజాతానామేవ సంభవతి న త్వన్యేషాం - తదుక్తం భగవద్గీతాసు.—

'అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్,

అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాన్తిరపైశునమ్,
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్.
తేజః క్షమాధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా,
వదన్తి సంపదం దైవీమభిజాతస్య భారత.' ఇతి.

స్రగ్ధరావృత్తం—'మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్.' ఇతి లక్షణాత్.

టీ. ప్రాణ ఆఘాతాత్ = ప్రాణమును దీయుటనుండి, నివృత్తిః = మరలుట, పర ధనహరణే-ఇతరుల డబ్బును గాఁజేయుటయందు, సంయమః=(మనస్సును) కట్టివేయుట, సత్యవాక్యం = నిజమైనమాట (నిజము పలుకుట), కాలే = వలసినప్పుడు, శక్త్యా=శక్తి కొలఁది, ప్రదానం=ఇచ్చుట, పరేషాం=ఇతరులయొక్క, యువ... వః-యువతి=జవరాం డ్రయొక్క, జనం=జనముయొక్క, కథా = ప్రశంసలయందు, మూకభావః = మాటాడ కుండుట (అనఁగా: స్త్రీప్రశంసచేయకుండుట), తృ... భంగః-తృష్ణా = ధనాశయనెడి, స్రోతః=నీటిపోటును, విభంగః=బిగవేయుట (లేక, ఆశయనెడి ప్రవాహమును నశింపఁ జేయుట) గురుషు = ఆచార్యులయెడ, వినయః చ = అడఁకువయు, సర్వభూతాను కంపా = ఎల్లప్రాణములయందు దయ, సర్వశాస్త్రేషు=అన్నిశాస్త్రములయందు, సామా న్యం=సమభావము, అనుపహతవిధిః-అనుపహత = అడ్డగింపఁబడని, విధిః = విధి, (అనఁగా: విధినతిక్రమింపకుండుట) ఏషః = (ప్రాణాఘాతనివృత్తి మున్నగు) ఇది, శ్రేయసాం = శ్రేయస్సులకు, పంథాః = మార్గము. (ఇచట—ఏషః, శ్రేయసాం, సర్వశాస్త్రేషు, సామాన్యం = సమానముగా నుండునదియు, అనుపహతవిధిః = కొట్టఁబడని యాచరణము గలదియు, (నయిన) పంథాః = దారి. అని యొక రన్వయించిరి ; కాని ఆంధ్రపద్యకర్త యీయన్వయమును గైకొననందున నిట్లు వ్రాయఁబడినది. మఱియు సంస్కృత వ్యా ఖ్యాత - సర్వభూతానుకంపా సామాన్యం = సమస్తప్రాణులయందును దయచే సమభా వము, సర్వశాస్త్రేషు, అనుపహతవిధిః = అవిచ్ఛిన్నమగు నధ్యయన విధానమును, అని యన్వయించినాఁడు, యథారుచి గ్రాహ్యము.)

తా. జీవహింసను విడిచి పరుల ద్రవ్యమునందు మనసును బోనీక సత్యము పలుకుచు దేశకాలము లెఱిఁగి శక్తికొలఁది దానముచేయుచుఁ బరస్త్రీలవిషయముగుఱించి ఏమియుఁ బలుకక మౌనము వహించి అత్యాశను నిలిపి గురువులయందు వినయమును గనంబఱచుచు సకల

ప్రాణులందు దయను గనంబఱచుచు సకల శ్రేయములకు మార్గము సకలశాస్త్రములందు సమభావమున నుండుట.

మ. పరహింసాపరకీయవిత్తహరణాభావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితోదంతోక్తి మూకత్వముం
బరతృష్ణాఝరభంజనంబు గురునమ్రత్వంబునుం బ్రాణభృ
త్కరుణాశాస్త్రసమత్వసద్విధులు భద్రప్రాప్తికిన్ మార్గముల్.

అవ. సంపదాపదలయందు సజ్జనుని చిత్తవృత్తిని జెప్పుచున్నాఁడు:—

శ్లో. సంపత్సు మహతాం చిత్తం భవేదుత్పలకోమలమ్,
ఆపత్సు చ మహాశైలశిలాసఙ్ఘాతకర్కశమ్. 55

వ్యా.—అథాపత్సంపదోస్సుజనమనోవృత్తిమాహ—సంపత్స్వితి.—సంపత్సు ధనధాన్యవస్తువాహనాదిసమృద్ధిషు, మహతాం మహాత్మనాం, సజ్జనానాం, చిత్త, ముత్పలవత్కోమలం మృదులం, భవేత్ నతు కఠినమిత్యర్థః, విపత్సు దారిద్ర్యానర్థసంకటేషు, మహాశైలశిలాసంఘాతః పాషాణకూటః - తద్వత్కర్కశం కఠోరం చ భవేత్ - న త్వస్థైర్యవిశ్లథమిత్యర్థః - న కదాఽప్యుక్తవైపరీత్య - మన్యథా మాహాత్మ్యభఙ్గప్రసఙ్గాదితి భావః, వివేకినా మవివేకినాం చాయమేవ పన్థాః ఆదరణీయ ఇతి తాత్పర్యమ్, అత్ర శైలస్య మహత్త్వవిశేషణం తచ్ఛిలాసంఘాతస్యాత్యన్తదుర్భేద్యత్వద్యోతనార్థమ్-ఉక్తంచైతదన్యత్రాపి—

'సౌజన్యామృతసిన్ధవః పరహితప్రారబ్ధవీరవ్రతా
వాచాలాః పరవర్ణనే నిజగుణాలాపే తు మౌనవ్రతాః
ఆపత్స్వప్యవిలుప్తధైర్యనిలయాస్సంపత్స్వనుత్సేకినో
మాభూవన్ ఖలవక్త్రనిర్గతవిషమ్లానాననాస్సజ్జనాః.' ఇతి

ఉపమాలంకారః.

టీ. సంపత్సు = సంపదలయందు, మహతాం=గొప్పవారియొక్క, చిత్తం=మనస్సు ఉత్పలకోమలం = నల్లగలువవలె మెత్తనిది, భవేత్ = అగును. కించ=మఱి, ఆపత్సు=ఆపదలయందు, మహా...ర్కశం-మహాత్ శైల = పెద్దకొండయొక్క, శిలా = రాళ్లయొక్క, సంఘాత = సమూహామువలె, కర్కశం = కఠినమైనది, (భవేత్ = అగును.)

తా. మహాత్ములమనంబు సంపదలు సంభవించునేని కలువకంటె కోమలంబుగ నుండును. ఆపదలు వచ్చునేని పెద్దకొండయందలి రాతి

గుండువలె కఠినముగ నుండును. అనఁగా సంపదలు వచ్చిన గర్వించి కఠినులు కారనియు, ఆపదలు వచ్చిన వెలవెలఁ బో రనియు భావము.

తే. సంపదలు గల్గుతఱి మహాజనులహృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశం బై తనర్చు.

అవ. సుజనజీవితమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రియా న్యాయ్యా వృత్తిర్మలినమసుభఙ్గేఽప్యసుకరం
త్వసన్తో నాభ్యర్థ్యాః సుహృదపి న యాచ్యః కృశధనః,
విపద్యుచ్చైః స్థైర్యం పదమనువిధేయం చ మహతాం
సతాం కేనోద్దిష్టం విషమమసిధారావ్రతమిదమ్. 56

వ్యా.— అథ ద్వాభ్యామేవ తద్వృత్తస్యాసాధారణ్యమాహ—ప్రియేతి. న్యాయాదనపేతా న్యాయ్యా నీతిప్రవణా, వృత్తిర్జీవనం - ని. 'వృత్తిర్వర్తన జీవన, ఇత్యమరః, ప్రీణాతీతి ప్రియా ఇష్టా-న త్వన్యాయ్యా-తస్యా ఏవ శ్రేయస్కరత్వాదితి భావః. * 'ఇగుపధ జ్ఞాప్రీ కిరః క' ఇతి కప్రత్యయః, అసుభఙ్గేఽపి ప్రాణప్రయాసేఽపి కిముతాన్యదేతి భావః, మలినం దుష్కర్మ అసుకర మకర్తవ్యం. న 'త్వాపత్కాలేనాస్తి మర్యాదే'తి న్యాయాత్సుకరం - తస్యైవైహికాముష్మికఫలదత్వాదితి భావః. * ఈషద్దుర్' త్యాదినా ఖల్ ప్రత్యయః - తతో నఞ్ సమాసః. అసన్తః కుమార్గాస్తు, నాభ్యర్థ్యాః కస్మింశ్చిద్విషయేఽపి న ప్రార్థనీయాః - కింతు సన్త ఏవ-తేషాము పేక్ష్యత్వాదితి భావః, యద్యపి*న పదాదౌ ఖల్వాదయ' ఇత్యాహ వామనః - తథాఽపి కవిప్రౌఢ్యా తుశబ్దస్య పాదాదౌ ప్రయోగః, సుహృదపి ప్రాణప్రియబన్ధురపి కిముతాన్య ఇతి భావః. * 'సుహృద్దుర్హృదౌ మిత్త్రామిత్త్రయో' రితి నిపాతనాత్సాధుః, కృశధనః ధనహీనశ్చేత్, న యాచ్యః యాచితుం న యోగ్యః - ధనాదికమితి శేషః - కింతు ధనపరిపూర్ణ ఏవ - తథావిధయాచ్ఞాయా అనుచితత్వాదితి భావః, విపద్యనర్థసంకటేఽ ప్యుచ్చైః స్థైర్యం మహాస్థైర్యం న తు భయవిహ్వలత్వం - 'ఆపత్స్వవ్యవిలుప్తస్థైర్యనిధయః 'విపది' స్థైర్య మథాభ్యుదయే క్షమే' తి చోక్తత్వాదితి భావః, మహతాం పూజ్యానా, మనువిధేయ మనుకూలం, పదం వ్యవసితం చ - న త్వననుకూలం - తథాభూతస్యైవ శ్లాఘ్యత్వాదితి భావః - ని. 'పదం వ్యవసితత్రాణస్థానలక్ష్మాఙ్ఘ్రివస్తు ష్వి' త్యభిధానాత్, ఇతీదమేతత్, విషమమసాధారణతయా దుష్కర మసిధారా వ్రతమవ్యభిచరితవ్రతం సతాం సత్పురు

షాణాం, కేనోద్దిష్టముపదిష్టం-న కేనాపీత్యర్థః - స్వతస్సిద్ధత్వాదితి భావః. అత్రాసిధారా వన్నిశితత్వాదసిధారాసంచారవత్సావధానేనైకాగ్రతయా విధేయత్వాద్వా అసిధారా వ్రతం - యద్వా అసిధారయా వ్యవహారతాం వ్రతం వీరవ్రతమిత్యర్థః - అథవా -

'యువా యువత్యా సార్ధం యన్ముగ్ధభర్తృవదాచరేత్,
అన్తర్నివృత్తసఙ్గస్స్యాదసిధారావ్రతం స్మృతమ్.'

ఇత్యుక్తమిత్యవధేయమ్. శిఖరిణీవృత్తమ్.

టీ. న్యాయ్యా = న్యాయమును దప్పని, వృత్తిః=బ్రదుకు, క్రియా=ఇష్టమైనది; అసుభంగే అపి=ప్రాణముయొక్క పోకడయందును, మలినం=చెడు నని, అసుకరం=చేయఁ దగనిది; అసన్తః తు=దుర్జను లన్ననో, అభ్యర్థ్యాః న=వేఁడఁదగినవారు కారు; సుహృత్ అపి=మిత్రుఁడేనియు, కృశధనః=సన్నగిల్లిన డబ్బుగలవాఁడు(పేదవాఁడు), నయాచ్యః= అడుగఁదగఁడు. విపది = ఆపదయందు, ఉచ్చైః = గొప్పదియగు, స్థైర్యం = ధీరత్వము; మహతాం = పెద్దలకు, అనువిధేయం=అనుసరించిచేయఁదగిన, పదం=పూనిక; ఇదం=ఈ, విషమం = చేయరాని, అసిధారావ్రతం = కత్తివాదర (పై కాలు తెగకుండ నడచుట వంటి) వ్రతము, సతాం = సత్పురుషులకు, కేన=ఎవనిచేత, ఉద్దిష్టం (ఉపదిష్టం) ఉపదేశింపఁబడినది ?

తా. న్యాయమయినవృత్తి నవలంబించుటయు, ప్రాణాపాయము సంభవించినను అకార్యము లొనర్పకుండుటయు, దుర్జనులఁ బ్రార్థింపకుండుటయు, ప్రాణమిత్రుఁడైనను ధనహీనుఁ డగునేని వానిని యాచింపకుండుటయు, ఆపదలయందు ధైర్యము, మహాత్ముల కనుకూలముగ నడచుటయు అను ఈయసిధారావ్రతము సజ్జనులకు స్వభావముగఁ బట్టుపడినదిగాని ఒకరి యుపదేశముచేత రా లేదు.

మ. అసమానప్రియనీతివర్తనము ప్రాణాంతంబునందుఙ్ మలీ
మస మగ్రాహ్య మదుష్టయాచన మసంశ పత్ప్రార్థనాభావముఙ్
వ్యసనావాప్తిని ధైర్యముం బుధజనౌత్సుక్యం బానుకూలత్వ మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహాశీర్యశ్రేణికిం దెల్పెనో.

అవ. మఱియు సుజనజీవితమునే చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రదానం ప్రచ్ఛన్నం గృహముపగతే సంభ్రమవిధిః
ప్రియం కృత్వా మౌనం సదసి కథనం చాప్యుపకృతేః,

అనుత్సేకో లక్ష్మ్యాం నిరభిభవసారాః పరకథాః
సతాం కేనోద్దిష్టం విషమమసిధారావ్రతమిదమ్. 57

వ్యా.—ప్రదానమితి.—ప్రచ్ఛన్నం ప్రదానం గుప్తదానం - న తు ప్రకాశం- తథాభూతదానస్య మహాఫలశ్రవణాదితి భావః, గృహం నిజమన్దిరం, ప్రత్యుపగతే సతి అర్థినీతి శేషః, సంభ్రమవిధిః ప్రత్యుత్థానాభివాదనాది సత్వరవ్యాపారవిధానం చ న తు వైముఖ్యం - తస్యైవ శాస్త్రోదితాచారత్వాదితి భావః, ప్రియం తదభీష్టం, కృత్వా మౌనం తూష్ణీంభావ - శ్చాపరికీర్తనమితి యావత్ - న తు ప్రకటనం - 'కృతస్యాపరికీర్తనం,' 'న దత్త్వా పరికీర్తయే' దితి మనుస్మరణాదితి భావః, సదసి రాజవిద్వత్సభాయాముపకృతేః, కథనం పరోపకారప్రఖ్యాపనం చ - న తు తత్ర తూష్ణీంశీలత్వమ్-అన్యథా కృతఘ్నత్వప్రసఙ్గాదితి భావః, లక్ష్మ్యాం సంపత్త్యా మనుత్సేకో గర్వరాహిత్యం - న తు మదాన్ధత్వం - 'సంపత్స్వనుత్సేకిన' ఇత్యుక్తత్వాదితి భావః, నిరభిభవసారా అనిన్దాపరాః, పరకథాః పురుషాన్తరప్రసఙ్గాశ్చ - న తు గర్హిణపరాః - 'ఆత్మప్రశంసాం పరగర్హామితి చ వర్జయే' దిత్యాది స్మరణాత్, సతామిత్యాది వృత్తం చ పూర్వవత్.

టీ. ప్రచ్ఛన్నం = రహస్యమైన, ప్రదానం = ఈవి, (యాచకుఁడు) గృహం = ఇంటిని, ఉపగతే = పొందినవాఁడుగాఁగా, సంభ్రమవిధిః=ఆదరముసేయుట, ప్రియం = మంచిని, కృత్వా=చేసి; మౌనం=ఊరకుండుట (చెప్పుకొనకుండుట), అపి చ = మఱియు, సదసి=సభలో, ఉపకృతేః = (ఇతరుఁడుచేసిన) ఉపకారముయొక్క, కథనం = చెప్పుట, లక్ష్మ్యాం = సంపదయందు, అనుత్సేకః = గర్వములేకుండుట, నిర...సారాః-నిరభిభవ = తిరస్కారములేకుండుటయె, సారాః = సారముగాఁగల, పరకథాః = ఇతరులఁగూర్చిన ప్రశంసలు, (ఇదం...ఉద్దిష్టం—56-వ శ్లోకము కడపట చూడుము.)

తా. రహస్యముగ దానముసేయుటయు, గృహంబునకు వచ్చిన యర్థికి సంతోషముతోఁ బ్రియముసేయుటయు, చేసినమేలును చెప్పకుండుటయు, తన కితరులుచేసినమేలును సభలయందుఁ బలుకుటయు, సంపదలు వచ్చినప్పుడు గర్వము లేకుండుటయు, ఇతరులను గుఱించి నిందగా మాట్లాడకపోవుటయు అను ఈ అసిధారావ్రతము సజ్జనులకు స్వభావసిద్ధము.

మ. పొసఁగం దానము గుప్త మర్థి భవనంబుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థానవిధానముం బ్రియవిధుల్ గావించి మౌనంబు రా

జనభర్తన్ మిత్రకృతిప్రకాశనముఁ గుశలాస్తకమ్మై ముఖ్యమి
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహాశర్యశ్రేణికిం దెల్పెనో.

అవ. అధముల మధ్యముల ఉత్తముల నాశ్రయించినవారి వృత్తిభేదములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే
ముక్తాకారతయా తదేవ నలినీపత్రస్థితం దృశ్యతే,
అన్తస్సాగరశుక్తిమధ్యపతితం తన్మౌక్తికం జాయతే
ప్రాయేణాధమమధ్యమోత్తమజుషామేవంవిధా వృత్తయః. 58

వ్యా.—అథాధమమధ్యమోత్తమవృత్తిమాహ—సంతప్తాయసీతి.—సంతప్తాయపి సమ్యగగ్నితప్తాయఃపిణ్డే సంస్థితస్య నిక్షిప్తస్యేత్యర్థః, పయసో జలస్య, నామాఽపి నామధేయమాత్రమపి, న శ్రూయతే మూలతో ధ్వస్తమేవ భవతీత్యర్థ - స్వరూప దర్శనం తు కిము వక్తవ్యమితి భావః, తదేవ పయః, నళినీపత్రస్థితం పద్మినీపత్రగతం సత్, ముక్తాకారతయా మౌక్తికరూపేణ, దృశ్యతే న తు మౌక్తికత్వేనేత్యర్థః, తదేవ పయః, అన్తస్సాగరే సాగరాన్తరాళే - అన్తరిత్యవ్యయం - యా శుక్తిః ముక్తాస్ఫోటః-తస్యాః-మధ్యే ఉదరే-పతితం సత్, మౌక్తికం'జాయతే మౌక్తికత్వేన పరిణమతీత్యర్థః*'జ్ఞాజనో ర్జే'తి జాదేశః-ముక్తైవ మౌక్తికమితి విగ్రహః * వినయాదిత్వా త్స్వార్థే ఠక్; అతః ప్రాయేణ భూమ్నా అధమ మధ్యమోత్తమ జుషాం నికృష్ట సాధార ణోత్కృష్టాశయా నాశ్రితవతా, మేవం విధాః నామశ్రవణాదిరూపా, వృత్తయో వ్యాపారా, భవన్తీతి యథాక్రమమన్వయాద్యథాసంఖ్యాలంకారః అతః మహదాశ్రయ ఏవ కర్తవ్యః - 'నీచాశ్రయో న కర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయ' ఇతి వచనాత్. అత్రోత్తమమధ్య మాధమా ఇతి లోకప్రసిద్ధోద్దేశక్రమః కవినా న వివక్షిత ఇతి జ్ఞేయమ్. శార్దూల విక్రీడితమ్.

టీ. సంతప్తఅయసి = బాగుగ కాల్పఁబడిన యినుమునందు, సంస్థితస్య = ఉన్నట్టి (అనఁగా: చల్లినట్టి), పయసః = నీటియొక్క, నామఅపి = పేరునైనను, న శ్రూయతే= వినఁబడదు. తత్ ఏవ=అదియే, నలినీపత్రస్థితంసత్ = తామరాకుమీఁదనుండినదై, ముక్తా ఆకారతయా = ముత్యముయొక్క రూపముగలదిగా, దృశ్యతే = కనఁబడును. తత్ = అది (నీరు), అన్త...పతితం సత్ - అన్తస్సాగర = సముద్రములోపలి, శుక్తి=ముత్యపు చిప్పయొక్క, మధ్య = నడుమ, పతితం సత్ = పడినదై, మౌక్తికం = ముత్యముగా, జాయతే = అగును. ప్రాయేణ = తఱచుగా, అధమమధ్యమఉత్తమజుషాం = అధములను

మధ్యములను ఉత్తములను జేరినవారియొక్క, వృత్తయః = దశలు, ఏవం విధాః = ఇటువంటివిగా నున్నవి.

తా. కాలిన యినుముపైన పడిన నీటిచుక్క ఊరుపేరులేక నశించిపోవును. ఆబిందువే తామరపాకుమీఁద బడునేని ముత్యమువలెఁ గనఁబడును. ఆ బిందువే సముద్రాంతర్గత మగు ముత్తెపుచిప్పయందుఁ బడునేని మౌక్తికమణి యగును. కావున ఆశ్రయము ననుసరించినవారి కాయాశ్రయానుసారము నీచులు, మధ్యములు, ఉత్తములు, అను పేరులు వచ్చును.

ఉ. నీరము తప్తలోహమున ని నిల్చి యనామక మై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁబడి మణిత్వముఁ గాంచు సముచితప్రభం
బౌరుషవృత్తు లిట్లధము ని మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

అవ. మంచివా రగు పుత్త్రులుగాని మిత్త్రులుగాని భార్యలుగాని జన్మాంతర సుకృతములేక లభింప రనుచున్నాఁడు:—

శ్లో. యః ప్రీణయేత్సుచరితైః పితరం స పుత్త్రో
యద్భర్తురేవ హితమిచ్ఛతి తత్కళత్రమ్,
తన్మిత్త్రమాపది సుఖే చ సమక్రియం య
దేతత్ త్రయం జగతి పుణ్యకృతో లభన్తే. 5?

వ్యా.—అథ సత్పుత్త్ర కళత్ర మిత్త్ర సంపత్తిః పుణ్యకృదధీనేత్యాహ—య ఇతి.—యః పుత్త్రస్సుచరితైః వాక్యకరణాదిసదాచారైః, పితరం, ప్రీణయేత్ సంతోష యేత్ * 'ప్రీఞ్ తర్పణే' ఇత్యస్మాద్ధాతోశ్చౌరాదికాణ్ణిచి లిఙ్ * 'ధూఞ్ ప్రీఞో ర్నుగ్వక్తవ్య, ఇతి నుగాగమః' స పుత్రః 'పున్నామ్నో నరకాత్త్రాయత' ఇతివ్యుత్పన్న ఇతి పుత్త్రశబ్దవాచ్యః న తూత్పన్నమాత్రః-

'జీవతోర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్,
గయాయాం పిణ్డదానేన త్రిభిః పుత్త్రస్య పుత్త్రతా.' ఇతి స్మరణాత్,

యం, ద్భర్తుః పత్యుః, హితమిచ్ఛతి భయభక్తిభ్యాం హితాచరణతత్పరం భవతి, తదేవ, కళత్రం భార్యా - న తు యాదృచ్ఛికం - 'పతిభక్తిపరా సాధ్వీ శాన్తా సా సత్య భాషిణీతి పతివ్రతాధర్మత్వాత్ - వి. 'కళత్రం శ్రోణి భార్యయో' రిత్యమరః,

యః, చాపది అనర్థసంకటే, సుఖే సంపది చ, సమక్రియమవిషమాచారమిత్యర్థః - తుల్యవృత్తి, తదేవ, మిత్త్రం సుహృత్-న త్వాపత్సంపదోః త్యాగానువర్తనతత్పరమ్.

'ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే సన్మిత్త్రలక్షణమిదం ప్రవదన్తి సన్తః.' ఇతి వక్ష్యమాణత్వాత్, దేతత్త్రయముక్తసత్పుత్త్రాదిత్రితయం, జగతి భువి, పుణ్యకృతో ధన్యాః, లభన్తే ప్రాప్నువన్తి-న త్వకృతసుకృతా ఇత్యర్థః. ఏవంవిధత్రితయలాభస్య మహాపుణ్యఫలత్వాదితి భావః. వసన్తతిలకావృత్తమ్.

టీ. యః = ఎవ్వఁడు, సుచరితైః = మంచినడవడులచేత, పితరం = తండ్రిని, ప్రీణయేత్ =సంతోషపెట్టునో, సః=వాఁడు, పుత్త్రః=కొడుకు; యత్ =ఏది, భర్తుః ఏవ = మగనికే, హితం=మేలును, ఇచ్ఛతి=కోరునో, తత్ =అది, కళత్రం=భార్య, యత్ =ఎవఁడు ఆపది=కష్టమునందును, సుఖేచ=సుఖమునందును, సమక్రియం=సమానమైన పనిగలవాఁడో (ఒక్కరీతిగనే ప్రేమించియుండునో), తత్ = వాఁడే, మిత్త్రం=స్నేహితుఁడు, ఏతత్ త్రయం = ఈమూఁటిని (ముగ్గురిని), జగతి = లోకములో, పుణ్యకృతః=పుణ్యముచేసినవారు, లభంతే = పొందుదురు.

తా. మంచినడవడిచేతఁ దండ్రిని సంతోషపెట్టువాఁడే పుత్త్రుఁడు. భర్తకు హితముఁ గోరునదియే పెండ్లము. ఆపత్సమయమునందును సంపదలయందును సమానముగ చెలిమిచేయునతఁడే మిత్త్రము. ఇట్టి పుత్త్రుఁడు భార్యయు స్నేహితుఁడును పుణ్యాత్ములకుఁగాని లభింపరు.

చ. జనకునిఁ బూజలం గడుఁ బ్రశస్తునిఁ జేయునతండు పుత్త్రుఁ డే
వనిత మెలంగు భర్తృవశవర్తిని యై యది సత్కళత్ర మె
జనుఁడు విపత్తిసౌఖ్యసదృశక్రియుఁ డాతఁడు మిత్త్రుఁ డీత్రయం
బును జగతిన్ లభించుఁ గడుఁ బుణ్యముఁ జేసినయట్టివారికిన్.

అవ. లోకములో మిగుల గౌరవము నొందు పెద్దలనడవడిని వర్ణించుచున్నాఁడు:—

శ్లో. నమ్రత్వేనోన్నమన్తః పరగుణకథనైః స్వాన్గుణాన్ఖ్యాపయన్తః
స్వార్థాన్సంపాదయన్తో వితతపృథుతరారమ్భయత్నాః పరార్థే,
క్షాన్త్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖాన్దుర్జనాన్దుఃఖయన్తః
సన్తస్సాశ్చర్యచర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్చనీయాః. 60

వ్యా.—అథ సతాం తావదసాధారణగరిమాస్పదత్వేనాశేషోపాదేయత్వమాహ—నమ్రత్వేతి.—నమ్రత్వేన ప్రహ్వత్వేనైవ - ఉన్నమన్త ఔన్నత్యం ప్రాప్నువన్త-

స్తథాభావస్యైవౌన్నత్యహేతుత్వాదితి భావః. పరేషాం - గుణకథనైస్సద్గుణ వర్ణనైః, స్వాన్ స్వకీయాన్, గుణాన్ సౌజన్యాదీన్, ఖ్యాపయన్తః ప్రకటయన్తః - న త్వాత్మప్రశంసయా - తాదృగ్భావస్యైవ నిజగుణప్రకటనహేతుత్వాదితి భావః, పరార్థే పరప్రయోజననిర్వహణే - వితతా విస్తృతా - పృథుతరా - చా రమ్భయత్నా ప్రారమ్భోత్సాహా - యేషాం తే తథోక్తాః, స్వన్త ఏవ, స్వార్థాం త్స్వప్రయోజనాని, సంపాదయన్తో నిష్పాదయన్తః, పరకార్యసాధన పురస్కారేణైవాత్మీయకార్య సాధనతత్పరాః న త్వేకాన్తత ఇత్యర్థః - తథాభూతత్వస్యైవాత్మార్థకత్వాదితి భావః, క్షాన్త్యైవ సహనశీలత్వేనైవ, వాక్షేపేణ నిన్దయా - రూక్షాక్షరాణి పరుష వాక్యాని - తైః ముఖరాణి వాచాలాని - ముఖాని యేషాం తాన్ పరుషభాషిణ ఇత్యర్థః దుర్జనాన్ ఖలాన్, దుఃఖయన్తః - న తూచ్చణ్డతయా - తథావిధత్వస్యైవ తేషాం హృచ్ఛల్యప్రాయత్వాదితి భావః, అత ఏవ సాశ్చర్యచర్యా అత్యన్తాశ్చర్యకర చరిత్రా, స్సన్తస్సత్పురుషాః, జగతి లోకే, బహుమతాః బహుమానితాస్సన్తః, కస్య వా పుంసో, నాభ్యర్చనీయాః న పూజనీయా ఇతి కాకుః; సర్వేషామప్యభ్యర్చనీయా ఏవేత్యర్థః.

టీ. నమ్రత్వేన = వంగినవారగుట (అణఁకువ)చేత, ఉన్నమంతః = ఔన్నత్యమును (గౌరవమును) బొందుచున్నవారును, పరగుణకథనైః = ఇతరుల గుణములను జెప్పుటలచే, స్వాన్ గుణాన్ = తమగుణములను, ఖ్యాపయంతః = వెల్లడించువారును, పరార్థే = ఇతరుల కార్యమందు, వితత...యత్నాః - వితత=విస్తరింపఁజేయఁబడినదై, పృథుతర=మిక్కిలి గొప్పదైన, ఆరంభ=ప్రారంభమును, యత్నాః=ప్రయత్నమునుగలవారై, స్వఅర్థాన్ = తమపనులను, సంపాదయన్తః - నెఱవేర్చుకొనువారును, ఆక్షే...ముఖాన్ - ఆక్షేప=దూషణచేత, రూక్ష = కఠినములైన, అక్షర=అక్షరముల (మాటల) చేత, ముఖర = వాగుచున్న, ముఖాన్=నోరుగల, దుర్జనాన్ = చెడ్డవారిని, క్షాన్త్యైవ = ఓర్పుచేతనే, దుఃఖయంతః = దుఃఖపెట్టువారును, (కావుననే) సాశ్చర్యచర్యాః = ఆశ్చర్యముతోఁగూడిన నడవడిగలవారగు, సంతః = సత్పురుషులు, జగతి= లోకమునందు, బహుమతాః (సంతః)=గౌరవింపఁబడినవా రగుచు, కస్య=ఎవనికి, అభ్యర్చనీయాః = పూజింపఁదగినవారుకారు?

తా. సత్పురుషులు అణఁకువ గలిగియే ఔన్నత్యమును పొందుదురు. పరులగుణములనే శ్లాఘించుటచేత తమసహృదయత్వమును గనంబఱతురు. పరులకార్యసాఫల్యమునకై ఎక్కువ ప్రయత్నించి వారి

కార్యమును సానుకూలము చేయుచు తమకార్యముల నొనర్చుచుందురు. తమ్మును కఠినముగ పరుషముగను నిందించు దుర్జనులయందు ఓర్పును గనంబఱచుచునే వారిని దుఃఖపెట్టుదురు. ఇట్టి ఆశ్చర్యకర మగు నడవడి గలమహాత్ము లెవరికిఁ బూజ్యులు గారు ?

చ. నతులగుచున్ మహోన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచున్ బరజనప్రియకార్యసమర్థతన్ సమం
చితనిజకార్యసంగ్రహముఁ జేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం బరఁగు ధీరులు పుణ్యులు గారె యేరికిన్.

ఇది నీతిశతకమునందు సుజనపద్ధతివర్ణన మను
ఆఱవదశకము.

---

## పరోపకారపద్ధతి

అవ. సుజనపద్ధతిని నిరూపించి సుజనులు పరోపకారులు గాన, ఆపరోపకార పద్ధతిని నిరూపించుచున్నాఁడు:—

శ్లో. భవన్తి నమ్రాస్తరవః ఫలోద్గమై
ర్నవామ్బుభిర్దూరవిలమ్బినో ఘనాః,
అనుద్ధతాస్సత్పురుషాస్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్. 61

వ్యా.— అథ సౌజన్యస్య పరోపకారఫలకత్వాత్తన్నిరూపణానన్తరం పరోపకారపద్ధతిం వర్ణయతి— భవన్తీతి— తరవః పనసరసాలాదివృక్షాః, ఫలోద్గమైః ఫలభారైః, నమ్రాః అవనతా, భవన్తి, ఘనా మేఘాః, నవామ్బుభిర్నూతనోదకైరుపలక్షితాస్సన్తః దూరవిలమ్బినస్సర్వత్ర ప్రవర్షణార్థమన్తరిక్షసంచారిణో భవన్తి - సత్పురుషాస్సమృద్ధిభిరుపలక్షితా అపి, అనుద్ధతా అనుచ్చణ్డా భవన్తి - తీక్ష్ణస్వభావా న భవన్తీత్యర్థః - 'అనర్థితా' ఇతి పాఠే - అయాచితా భవన్తి - యాచ్ఞాం వినైవ పరహితమాచరన్తీత్యర్థః తథా ఏష ఉక్తనిజనమ్రత్వాదివ్యవహారః, పరోపకారిణాం పరహితాచరణతత్పరాణాం, స్వభావో నిసర్గసిద్ధ ఏవ న త్వాహార్యక ఇత్యర్థః, మహాన్తో హి పరోపకారార్థం క్లేశం క్లేశత్వేన న గణయన్తి - తేషాం తస్య స్వాభావ్యాదితి భావః; తదుక్తం—

'పరోపకారాయ ఫలన్తి వృక్షాః పరోపకారాయ వహన్తి నద్యః,
పరోపకారాయ చరన్తి గావః పరోపకారార్థమిదం శరీరమ్.' ఇతి.

అర్థాన్తరన్యాసోఽలంకారః. వంశస్థవృత్తమ్- 'జతౌ తు వంశస్థముదీరితం జరౌ.'

టీ. తరవః = చెట్లులు, ఫలోద్గమైః=పండ్లకాపులచేత, నమ్రాః=వంగునవి, భవంతి= అగును. ఘనాః = మేఘములు, నవఅంబుభిః = క్రొత్తనీళ్లచే, దూరవిలంబినః = (అంతట వర్షించుటకై యాకాశమునందు) దూరముగ వ్రేలాడునవి, భవంతి; సత్పురుషాః = సజ్జనులు, సమృద్ధిభిః=సంపదలచేత, అనుద్ధతాః=గర్వింపనివారు, (భవంతి); పరోపకారిణాం= ఇతరులకు మేలుసేయువారికి, ఏషః=ఇది (నమ్రత్వము మున్నగునవి), స్వభావః ఏవ = సహజమే.

తా. వృక్షములు ఫలకాలమున నమ్రములయి (వంగి)యుండును. నూతనాంబువులుగల మేఘములు క్రిందుగనే వ్రేలాడుచుండును. సత్పురుషులు సంపదలు వచ్చినప్పుడు గర్వము వహింపరు. ఇది పరోపకారపరాయణుల స్వభావము.

తే. తరువు లతిరసఫలభారగురుతఁ గాంచు
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ
డుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

అవ.—దయావంతులకు ముఖ్యములగు నలంకారములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. శ్రోత్రం శ్రుతేనైవ న కుణ్డలేన దానేన పాణిర్న తు కఙ్కణేన,
విభాతి కాయః కరుణాపరాణాం పరోపకారేణ న చన్దనేన. 62

వ్యా.—అథైషాం ముఖ్యమణ్డనసంపత్తిమాహ—శ్రోత్రమితి—కరుణాపరాణాం దయాళూనాం - పరోపకారిణామిత్యర్థః, శ్రోత్రం కర్ణః - ని. 'కర్ణశబ్ద గ్రహౌ శ్రోత్రం' మిత్యమరః, శ్రుతేన ధర్మశాస్త్రశ్రవణేనైవ, విభాతి ప్రకాశతే, కుణ్డలేన సువర్ణమణిమయకర్ణభూషణేన, న తు విభాతి; పాణిర్హస్తః, దానేన సత్పాత్రత్యాగేన, విభాతి, కఙ్కణేన కనకవలయేన న తు విభాతి; కాయో దేహః, పరోపకారేణ పరేషాం హితాచరణేన విభాతి, కస్తూరీ ఘనసారవిమిశ్రితపటీరపఙ్కలేపేనతు న విభాతి; మహాత్మనాం శ్రవణాదికమేవ స్వాభావికమణ్డనం న త్వన్యత్, తస్య నశ్వరత్వాదితి భావః. వృత్తముపజాతిః.

టీ. కరుణాపరాణాం=దయాపరులకు, శ్రోత్రం=చెవి, శ్రుతేనఏవ=(శాస్త్రముల) వినికిచేతనే, విభాతి = ప్రకాశించును. కుండలేన = అంటుపోగుచే, న=కాదు; పాణిః= చేయి, దానేన = ఈవిచేత, విభాతి; కంకణేనతు = మురుగుచేత నన్ననో, న = కాదు;

కాయః = దేహము, పరఉపకారేణ = ఇతరులకు ఉపకారముచేత, విభాతి; చందనేన= గంధముచేత, న = కాదు.

తా. దయావంతులగు సత్పురుషుల చెవులకు శాస్త్రశ్రవణ మలంకారముగాని కుండలములు గావు. హస్తంబులకు అలంకారము సత్పాత్ర దానము గాని కంకణములు గావు. దేహమున కలంకారము పరోపకారము గాని చందనము పూసికొనుట గాదు.

తే. అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండలమునఁ గాదు
వలయమున నొప్ప దీవిచే ♦ వెలయుఁ బాణి
యురుదయాఢ్యుల మేను పరోపకార
కలన రాణించు గందంబు ♦ వలనఁ గాదు.

అవ: సత్పురుషులు యాచింపఁబడకయే దానముచేయుదురు అనివిస్తరించి చెప్పుచున్నాఁడు:—

శ్లో. పద్మాకరం దినకరో వికచం కరోతి
చన్ద్రో వికాసయతి కైరవచక్రవాలమ్,
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః. 63

వ్యా.—యదుక్త 'మనర్థితా స్సత్పురుషా' ఇత్యాది తదేవ ప్రపఞ్చయతి— పద్మాకరమితి.—దినం దివసం కరోతీతి దినకరస్సూర్యః, *'కృఞో హేత్వి' త్యాదినాట ప్రత్యయః, అభ్యర్థితో న భవతీతి నాభ్యర్థితః - అయాచితస్సన్నిత్యర్థః. * న శబ్దస్య సుప్సుపేతి సమాసః, పద్మాకరం పద్మవనం, వికచం వికసితం, కరోతి-ని. 'ప్రఫుల్లోత్ఫుల్ల సంఫుల్ల వ్యాకోచ వికచ స్ఫుటాః - ఫుల్లశ్చైతే వికసిత' ఇత్యమరః, తథా చన్ద్రోఽపి, కైరవచక్రవాళం కుముదషణ్డం - ని. 'సతే కుముదకైరవ' ఇత్యమరః, వికాసయతి వ్యాకోచయతి, తథా జలధరో వారివాహోఽపి * పచాద్యచ్, నాభ్యర్థితస్సన్నేవ, జలం దదాతి ప్రవర్షతి, తథాహి, సన్తస్సత్పురుషాః, స్వయమయాచితా ఏవేత్యర్థః, పరేషాం, హితే హితాచరణే, విహితాభియోగాః కృతాభినివేశాః - న త్వవబోధితా ఇత్యర్థః; అతో యుక్తమేవం హితాచరణమే తేషామితి భావః.

సామాన్యేన విశేషసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః - 'సామాన్యవిశేషకార్యకారణ భావాభ్యాం సదృశప్రకృతకార్యసమర్థనమర్థాన్తరన్యాస' - ఇతి సర్వస్వ సూత్రమ్.

వసన్తతిలకావృత్తమ్.

టీ. దినకరః = సూర్యుఁడు, నఅభ్యర్థితః (ఏకపదము) అపి = అడుగఁబడనివాఁడయ్యును, పద్మాకరం = తామరకొలనును, వికచం = పూచినదానిఁగా, కరోతి = చేయుచున్నాఁడు; చంద్రః = చంద్రుఁడు, అనభ్యర్థితఃఅపి, కైరవచక్రవాళం = తెల్లగలువల గుంపును, వికాసయతి = వికసిల్లఁ జేయుచున్నాఁడు; జలధరః = మేఘుఁడు, అనభ్యర్థితః అపి, జలం = నీటిని, దదాతి = ఇచ్చుచున్నాఁడు; (అగుట). సంతః = సత్పురుషులు స్వయం = తమంతటతామే, పరహితే=ఇతరుల మేలునందు, విహితాభియోగాః = చేయఁ (వహింపఁ) బడిన పూనికగలవారు.

తా. సూర్యుఁడు ప్రార్థింపఁబడకయే తామరకొలనిని వికసింపఁజేయును. చంద్రుఁడు ప్రార్థింపఁబడకయే కలువల వికసింపఁజేయుచున్నాఁడు. మేఘుఁడు యాచింపఁబడకయే నీటిని ఇచ్చుచున్నాఁడు. సత్పురుషు లెప్పుడు పరులకు హితమొనర్చుటయందే ఇష్టపడువారు.

తే. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ
గుముదషండంబు గావించు నమృతసూతి
యర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు.

అవ. ఉత్తమమధ్యమాధముల వర్తనములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏతే సత్పురుషాః పరార్థఘటకాస్స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే. 64

వ్యా.—అథ వ్యాపారతారతమ్యేన పురుషాణాముత్తమాదిభేదమాహ—ఏత ఇతి.—యే పుమాంసః, స్వార్థాన్ స్వప్రయోజనాని - ని. 'అర్థోఽభిధేయ రైవస్తు ప్రయోజన నివృత్తి ష్వి' త్యభిధానాత్, పరిత్యజ్య త్యక్త్వా, పరార్థఘటకాః పరప్రయోజనసంఘటనశీలాః, ఏతే, సత్పురుషాః పురుషోత్తమాః, సత్త్వస్య తేష్వేవాభివ్యక్తత్వాదితి భావః, యే తు స్వార్థస్యావిరోధేనావైషమ్యేణ - స్వార్థనిర్వాహతత్పరత్వేనై వేత్యర్థః, పరార్థం పరప్రయోజననిర్వాహార్థమ్, ఉద్యమభృత ఉద్యోగభాజః, తే సామాన్యాస్సాధారణా-మధ్యమపురుషా ఇత్యర్థః, యే తు, స్వార్థాయ స్వార్థనివృత్త్యర్థం, పరహితం, నిఘ్నన్తి నాశయన్తి, తేఽమీ, మానుషరాక్షసాః మానుష

శబ్దవాచ్యా రాక్షసాః - తథా క్రూరాచారతత్పరత్వాత్పురుషాధమా ఇత్యర్థః, యేతు నిరర్థకం నిష్ఫలం ప్రయోజననివృత్తిరాహిత్యేనాపీతి యావత్, పరహితం ఘ్నన్తి, తే పుమాంసః, కే వా కథంభూతా వా, న జానీమహే ఉక్తత్రివిధపురుషవిలక్షణత్వాత్తాన్ జ్ఞాతుం న శక్నుమ ఇత్యర్థః-అత ఏవ పరమనీచా ఇత్యర్థః; ఉక్తపక్షేషు యః శ్రేయాన్ తత్పక్షాశ్రయణం కర్తవ్యమాయుష్మతేతి భావః. శార్దూలవిక్రీడితమ్.

టీ. యే=ఎవరు, స్వార్థాన్=తమప్రయోజనములను, పరిత్యజ్య=పదలి, పరా... టకాః-పర=ఇతరులయొక్క, అర్థ=ప్రయోజనములను, ఘటకాః = కూర్చువారో, ఏతే= వీరు, సత్పురుషాః=ఉత్తమపురుషులు; యే = ఎవరు, స్వా... ధేన-స్వార్థ=తమప్రయోజనములకు, అవిరోధేన=భంగములేకుండ, పరార్థం=ఇతరులకొఱకు, ఉద్యమభృతః = పూనికగలవారో, (తే) తు =(వారు) అన్ననో, సామాన్యాః = సాధారణులు (అనఁగా: మధ్యములు); యే=ఎవరు, స్వార్థాయ = తమప్రయోజనముకొఱకు, పరహితం = ఇతరుల మేలును, నిఘ్నంతి=పాడుచేయుదురో, తేఅమీ=ఆవీరు,మానుషరాక్షసాః=మనుష్యులగు రాక్షసులు; యేతు=ఎవరన్న, నిరర్థకం=నిష్ప్రయోజనముగా (తమకు లాభము ఏమియు లేకున్నను), పరహితం=ఇతరులమేలును, నిఘ్నంతి=చెఱుపుదురో, తే=వారు, కే= ఎవరో (ఎట్టివారో), న జానీమహే = గుర్తెఱుఁగము.

తా. తమకార్యముల విడిచి పరులకార్యములను చేయువారు సత్పురుషులు. తమకార్యములకు భంగములేకుండ పరులకార్యముల నొనర్చువారు మధ్యములు. తమకార్యము నిమిత్తమై పరులకార్యమును చెడఁగొట్టువారు మనుష్యులలో రాక్షసులు. తమకు నష్టము లేకపోయి నను పరులకు నష్టముచేయువారల కేపేరు పెట్టవచ్చునో నాకు తెలియుట లేదు.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాస్వార్థభం
గము గావించెడువార లెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్.

అవ. సన్మిత్రలక్షణమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. పాపా న్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం నిగూహతి గుణాన్ ప్రకటీకరోతి,

ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణమిదం ప్రవదన్తి సన్తః. 65

వ్యా.—అథసన్మిత్రలక్షణమాహ— పాపాదితి.— పాపాత్పాపాచరణాత్, న్నివారయతి నివర్తయతి - ధర్మోపదేశేన దుష్కర్మప్రవృత్తేః విరమయతీత్యర్థః, * 'జుగుప్సావిరామ' ఇత్యాదినా పఞ్చమీ, హితాయ యోజయతే సత్కర్మాచరణాయ ప్రవర్తయత ఇత్యర్థః-యద్వాశ్రేయస్సంగ్రహార్థం ప్రోత్సాహయతీత్యర్థః, గుహ్యం గోప్యం, నిగూహత్యాచ్ఛాదయతి - న కుత్రాపి ప్రకటయతీత్యర్థః, గుణాన్ సౌశీల్యాదిసద్గుణాన్, ప్రకటీకరోతి ప్రఖ్యాపయతి-న తు నిగూహతీత్యర్థః, ఆపద్గత మతిసంకటస్థ, మపి, న జహాతి న త్యజతి-'తన్మిత్రమాపది సుఖే చ సమక్రియం య'దిత్యుక్తత్వాదితి భావః; కాలే వ్యసనాది సమయే, దదాతి వాఞ్ఛితం దిశతి, తదిదం పాపనివారణాదికం సర్వం, సన్తస్సత్పురుషా, స్సన్మిత్రస్యాకైతవ సుహృదః, లక్షణంస్వరూపం, ప్రవదన్తి వసన్తతిలకావృత్తమ్.

టీ. (మంచిమిత్రుఁడు) పాపాత్ = పాపమునుండి, నివారయతి = తప్పించును; హితాయ=మేలుకై, యోజయతే=ప్రేరేపించును; గుహ్యం=రహస్యమును, నిగూహతి = కప్పివేయును; గుణాన్ = (సౌశీల్యాది) గుణములను, ప్రకటీకరోతి = వెల్లడించును; ఆపద్గతంఅపి=సంకటములో నున్నవానినైనను, న జహాతి=వదలఁడు; కాలే = (వ్యసనము మున్నగునవి) గలిగిన సమయమందు, దదాతి = (కోరినదానిని) ఇచ్చును, ఇదం = దీనిని (పైనఁ జెప్పినదానిని), సన్తః = పెద్దలు, సన్మిత్రలక్షణం = మంచిస్నేహితుని స్వరూపమునుగా, ప్రవదంతి = చెప్పుదురు.

తా. చెడుపనుల వారించుట, మంచిపనులఁ జేయుటకుఁ బ్రోత్సాహించుట, రహస్యసంరక్షణము, సద్గుణములఁ బ్రకటించుట, ఆపత్కాలమున విడువకుండుట, కాలముల కావశ్యక మగుదానిని ఇచ్చుట, ఇవి సన్మిత్రున కుండవలసిన లక్షణములు.

తే. అఘమువలన మరల్చు హితార్థకలితుఁ
జేయు గోప్యంబు దాఁచుఁ బోషించు గుణము
విడువఁ డాపన్ను లేవడివేళ నిచ్చు
మిత్త్రుఁ డీలక్షణంబుల మెలఁగుచుండు.

అవ. మంచిమిత్త్రులు పరస్పరము క్షీరనీర (పాలలోఁ నీరుగలసిన) న్యాయమున నుందు రనుచున్నాఁడు:—

శ్లో. క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తేఽఖిలాః
క్షీరోత్తాపమవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుతః,
గన్తుం పావకమున్మన స్తదభవద్దృష్ట్వా తు మిత్త్రాపదం
యుక్తం తేన జలేన శామ్యతి సతాం మైత్త్రీ పున స్త్వీదృశీ. 66

వ్యా.—పున స్తదేవ క్షీరనీరదృష్టాన్తేన వర్ణయతి—క్షీరేణేతి —క్షీరేణ కర్త్రా, ఆత్మానం-గతముపగతం ప్రాప్తం - యదుదకం జలం - తస్మై స్వాత్మమిశ్రిత జలాయేత్యర్థః, పురా పూర్వం, తే ప్రసిద్ధాః, అఖిలాస్సమస్తా, శ్చ, గుణా నిజమాధుర్యధావళ్యాది గుణా, దత్తా హి వితీర్ణాః ఖలు - స్వగుణప్రదానద్వారా మైత్త్రీసంపాదితేత్యర్థః, అతః క్షీరోత్తాపం-క్షీరస్య శ్రవణార్థ మగ్నౌ నిక్షిప్తస్య దుగ్ధస్య-ఉత్తాపం సంతాప, మవేక్ష్య, తేన క్షీరమిశ్రితేన, పయసా ఉదకేన - ని. 'పయః క్షీరం పయోఽమ్బు చే' త్యమరః, స్వాత్మా స్వశరీరం, కృశానౌ వహ్నౌ, హుతః మిత్త్రసంతాపాసహనాత్సంశోషిత ఇత్యర్థః, తత స్తత్ క్షీరం కర్తృ, మిత్త్రస్య జల, స్యాపదం సంశోషరూపాం విపత్తిం, దృష్ట్వా, పావకం వహ్నిం, గన్తు, మున్మనః ఉద్యుక్త, మభవత్ * 'ఉత్క ఉన్మనా' ఇతి నిపాతనా త్సాధుః - జలసంశోషణే క్షీరాణాం బహి ర్నిర్గమనసంభవాదితి భావః, తదనన్తరం తేన జలేన, యుక్తం మిశ్రితం సత్, శామ్యతి ప్రశాన్తం భవతి * 'శమా మష్టానా మి'తి దీర్ఘః, తథా హి, సతాం మైత్త్రీ సౌహార్దం - మైత్త్రీ వ్యాఖ్యాతా, ఈదృశీ పునః పరస్పరవ్యసనాసహనశీలా ఖలు, అత ఏతద్యుక్తమితి భావః.

అత్ర స్వభావసిద్ధస్య క్షీరనీరవ్యవహారస్య పరస్పరసంతాపదర్శనహేతుకత్వే నోత్ప్రేక్షణాత్క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్షా, సా చోక్తార్థాన్తరన్యాస నిర్వ్యూఢే త్యనయో ర్విజాతీయసంకరః. వృత్తముక్తమ్.

టీ. క్షీరేణ=పాలచేత, ఆత్మ . . . కాయ-ఆత్మ=తమ్మును, గత = పొందిన, (అనఁగా: తమతోఁ గలసియున్న యనుట. తమతో మైత్రిచేసిన, అని వ్యంగ్యము.) ఉదకాయ = నీటికి, పురా = ముందు, తే = (ప్రసిద్ధములగు) ఆ, అఖిలాః = సమస్తములైన, గుణాః = (తమతీపు, తెలుపు మున్నగు) గుణములు, దత్తాః హి = ఈయఁబడినవిగదా! (అందువలన) క్షీరోత్తాపం-క్షీర = పాలయొక్క, ఉత్తాపం=కాఁగుటను, (కష్టమును అని వ్యంగ్యము.) అవేక్ష్య=చూచి, తేన=ఆ, పయసా=నీటిచేత, స్వాత్మా=తన స్వరూపము, కృశానౌ=అగ్ని

యందు, హుతః=వేల్వఁబడినది. (ఆవిరియయ్యె ననుట, మిత్రునికష్టమును జూచి సహింపక యగ్నిప్రవేశము చేసెనని వ్యంగ్యము,) తత్ తు=ఆపాలు సైతము, మిత్రఆపదం=మిత్రము (అగు నీటి)యొక్క (ఆవిరి యగుటయును) ఆపదను, దృష్ట్వా = చూచి, పావకం = అగ్నిని, గంతుం=పొందుటకు (అగ్నిలోఁ బడుటకనుట), ఉన్మనః=ఉద్యుక్తము, అభవత్ = అయ్యెను. తేన=ఆ, జలేన=నీటితో, యుక్తంసత్ =కూడినదై, శామ్యతి=చల్లారుచున్నది. (నీళ్లు చల్లినచో పొంగు తగ్గుననుట. దుఃఖముదీఱ ఆత్మహత్యాప్రయత్నము మానుకొనె నని వ్యంగ్యము.) సతాం=మంచివారియొక్క, మైత్రీ=స్నేహము, ఈదృశీపునః=ఇటువంటిది సుమా !

తా. పాలు తనయందు గలసినజలంబునకు తనగుణంబులన్నియు నిచ్చెను. తన కిట్టిసాయ మొనర్చినక్షీరమునకు గలుగుతపనమును గాంచి జలము అగ్నియందుఁ బడెను. తనకు మిత్రమగుజల మగ్నియందుఁ బడుటను చూచి క్షీరము తానుగూడ అగ్నియందుఁ బడఁబోఁగా దానితో మరల జలము కలియుటచేత శాంతిల్లుచున్నది. సజ్జనసహవాసము ఇంతయే అని యర్థము.

చ. క్షీరము మున్ను నీటి కొసఁగెఁగా స్వగుణంబులు దన్నుఁ జేరుటన్
క్షీరము దప్త మౌట గని చిచ్చుఱికెన్ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁ గని వహ్నిఁ జొరం జనె దుగ్ధ మంతలో
నీరముఁగూడి శాంతమగు నిల్చు మహాత్ముల మైత్రి యీగతిన్.

అవ. సత్పురుషు లెంతెంతవారికో యాశ్రయములుగా నుందు రని సత్పురుషుల మాహాత్మ్యమును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. ఇతః స్వపితి కేశవః కులమిత స్తదీయద్విషా
మితశ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే,
ఇతోఽపి బడబానలః సహ సమస్తసంవర్తకై
రహో వితతమూర్జితం భరసహం చ సిన్ధోర్వపుః. 67

వ్యా.—అథైతన్మాహాత్మ్యమాహ—ఇత ఇతి—ఇతోఽస్మిన్ప్రదేశే, కేశవో విష్ణుః కుక్షిస్థాఖిలభువన ఇతి భావః, స్వపితి యోగానుసంధానేన నిద్రాతి * 'రుదాదిభ్య స్సార్వధాతుకే' ఇతీడాగమః, ఇతోఽస్మిన్ప్రదేశే, తస్య కేశవస్య ఇమే తదీయాః * త్యదాదివృద్ధాచ్ఛః - యే ద్విషో హిరణ్యాక్ష రావణాదయ స్తేషాం, కులం సమూహః

స్తిష్ఠతీతి శేషః, ఇతస్తతోఽన్యస్మిన్ ప్రదేశేఽపి, శరణార్థినో రక్షణాభిలాషిణః - ని. 'శరణం గృహరక్షిత్రో' రిత్యభిధానాత్, తేషాం శిఖరిణాం మైనాకాదిపర్వతానాం గణాశ్చ, శేరతే స్వపన్తి * 'శీఙో రుడి' తి రుడాగమః, ఇతస్తస్మాదప్యన్యస్మిన్ ప్రదేశే సమస్తా యే సంవర్తకాః ప్రళయకాలప్రవర్షి మేఘవిశేషాః - అత ఏవ పుష్కలావర్తక సంజ్ఞయా చ వ్యవహ్రియన్తే - తైస్సహ, బడబానలోఽపి వసతి- తస్మాత్, సిన్ధోస్సము ద్రస్య, వపుశ్శరీరం, వితతం కేశవాద్యాధారత్వేన విస్తృతం, ఊర్జితం బడబానలాశ్రయత్వే ఽప్యతివర్ధిష్ణు, భరసహం పర్వతభరణేన భారోద్వహనక్షమం చ అహో అప్రమేయాను భావత్వేనాత్యన్తాశ్చర్యమిత్యర్థః.

అత్ర లక్షయోజనపరిచ్ఛిన్నస్య సముద్రస్యాపరిచ్ఛిన్న కేశవాద్యాధారత్వకథనా దధిక ప్రభేదోఽలంకారః - 'ఆధారాధేయయోరానురూప్యాభావోఽధికే మత' ఇతి లక్షణాత్. పృథ్వీవృత్తమ్.

టీ. కేశవః=విష్ణువు, ఇతః = ఇచ్చట (ఒకచోట), స్వపితి=నిద్రించుచున్నాఁడు; ఇతః = ఇచ్చట (మఱియొకచోట), తదీయద్విషాం-తదీయ = వస్సంబంధులగు (విష్ణువు యొక్క), ద్విషాం=శత్రువులయొక్క, కులం=సమూహము, (ఉన్నది.) ఇతశ్చ=ఇచ్చటను (మఱియొకచోట), శరణార్థినాం = రక్షకునిఁ గోరిన, శిఖరిణాం = పర్వతములయొక్క, గణాః=సమూహములు, శేరతే = పరుండి యున్నవి. ఇతః అపి = ఇచ్చటను (మఱియొక చోటను). సమస్తసంవర్తకైః సహ - సమస్తమైన ప్రళయకాలమేఘములతోఁగూడ, బడ బానలః-అపి=బడబాగ్నియు, (ఉన్నది.) సింధోః = సముద్రముయొక్క, వపుః=శరీరము, వితతం=విశాలమైనదియు, ఊర్జితం = వృద్ధిఁబొందునదియు, భరసహంచ=బరువును ఓర్చు నదియు, (అయియున్నది). అహో = ఔరా!

తా. సముద్రము, తనయందొకచోట వెన్నుని, ఒకచోట రక్క సులను, ఒకచోటఁ బర్వతసమూహమును, ఒకచోట బడబానలంబును వహించియున్నది. దీనిమహత్వ మెంతగొప్పదైయైనది!

చ. ఒకయెడఁ బవ్వళించు హరి ♦ యొక్కయెడన్ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో నడఁగుఁ ♦ బర్వతసంఘము లొక్కెడన్ బలా
హకములతోడ నుండు బడ♦బాగ్నియు విస్తృత మూర్జితంబునుం
బ్రకటభరక్షమం బగుచు ♦ భాసిలు నౌర సముద్ర మెంతయున్.

శ్లో. జాతః కూర్మః స ఏకః పృథుభువనభరాయార్పితం యేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్విచక్రమ్,

సంజాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టాన్న చాధో
బ్రహ్మాణ్డోదుమ్బరాన్తర్మశకవదపరే జన్తవో జాతనష్టాః. 68

వ్యా.—అథ పరహితాచరణపరాకాష్ఠయా ద్వయోరేవ జన్మసఫలం నత్వన్యేషామిత్యాహ—జాతఇతి.—కిం బహునా, అవతారేష్వపీత్యర్థాద్యాహార్యమ్.—ఏకః కేవల, స్సకూర్మః ఆదికూర్మావతారఏవ, జాతః జన్మలాభవానిత్యర్థః, కుతః? యేన కూర్మేణ,పృథు ర్మహాన్ - యో భువనభరశ్చతుర్దశవిష్టపభార - స్తస్మై తద్వహనార్థమిత్యర్థః - పృథు విపులమితి పృష్ఠస్యపదం వా, పృష్ఠం నిజకర్పరతల, మర్పితం దత్తం - నిరన్తరమధః ప్రదేశే స్థిత్వా దుర్భరభువనభారేణ జనితః క్లేశస్సోఢ ఇత్యర్థః, తథా, ధ్రువస్యోత్తానపాదే, ర్జన్మ శ్లాఘ్యం సకలలోకప్రశస్తం, కుతః? యత్ర యస్మిన్ధ్రువే; తేజస్వినామ్ గ్రహనక్షత్రాదీనాం - చక్రం శింశుమారాఖ్యం గ్రహనక్షత్రమణ్డలం వా, నియమితం నియుక్తం స, ద్భ్రమతి పర్యావర్తతే - తత్రభవాన్భగవదనుగ్రహవశాత్సకలలోకోన్నతమేరుశిఖర శిఖామణీ ర్ధ్రువః స్వాయత్తత్వేన తేజస్విచక్రం ప్రవర్తయతీతి శ్రీవిష్ణుపురాణ భాగవ తాది కథాఽనుసంధేయా; తతః కిమత ఆహ—పరహితకరణే పరోపకారాచరణవిషయే, వ్యర్థో నిరర్థః అప్రయోజక ఇతి యావత్ - యః పక్షః-సంజాతో యేషాం తే సంజాత వ్యర్థపక్షాః-న తు సంజాతపరహితకరణసమర్థపక్షా ఇత్యర్థః, *సాపేక్షత్వేఽపి గమకత్వా త్సమాసః, అపరే ఉక్తాభ్యామన్యే, జన్తవః ప్రాణినః - నైచ్యోద్భావనార్థోఽయం జన్తుశబ్దప్రయోగః, ఉపరిష్టాన్న ధ్రువవ దుపరిభాగే వర్తమానాన భవన్తీత్యర్థః, అధశ్చ న కూర్మవ దధస్తాద్వా వర్తమానా న భవన్తీత్యర్థః, కిం తు ఉదుమ్బరః జన్తుఫలాఖ్య వృక్షవిశేషః - తస్య ఫలముదుమ్బరం - ని. 'ఉదుమ్బరో జన్తుఫలో యజ్ఞాఙ్గో హేమదుగ్ధక' ఇత్యమరః * 'ఫలే లుగి' తి లుక్-బ్రహ్మాణ్డ ముదుమ్బరం తస్యాన్తః అన్త రాళే - అవ్యయ మేతత్, యే మశకా స్తైస్తుల్యం తద్వత్ * తేన తుల్యం క్రియా చే ద్వతి రి' తి వతి ప్రత్యయః, జాతా ఉత్పన్నాశ్చ తే నష్టాశ్చ జాతనష్టా భవన్తీతి శేషః * స్నాతానులిప్తవత్పూర్వకాలసమాసః; యతో న తైః కిమపి సాధిత మతో మశకవ న్నిష్ఫలజన్మభిః కిమన్యైరితి భావః.

రూపకోపమయో స్సంకరః స్రగ్ధరావృత్తమ్.

టీ. యేన = ఎవనిచేత, పృథు...రాయ-పృథు = పెద్దదియగు, భువన=లోకముల యొక్క, భరాయ = బరువుకొఱకు, పృష్ఠం = వీఁపు, అర్పితం = సమర్పింపఁబడినదో, సః = ఆ, కూర్మః = కూర్మరాజు, ఏకః = ఒక్కఁటియే, జాతః = పుట్టినది. (అనఁగా:

ఎల్లపుడు క్రిందనుండి లోకముల మోయుటవలన కలిగిన కష్టమును సహించినందున నితనిజన్మము సార్థక మనుట. యత్ర = ఎవనిచుట్టు, తేజస్విచక్రం-తేజస్వి = తేజముగల వానియొక్క (నక్షత్రతారాగ్రహములయొక్క), చక్రం = మండలము, నియమితం సత్=ఏర్పఱుపఁబడినదై, భ్రమతి=నుడియుచున్నదో, అ, ధ్రువస్య = ధ్రువునియొక్క, జన్మ=బ్రదుకు, శ్లాఘ్యం=కొనియాడఁదగినది. అపరే = ఇతరములగు, జన్తవః = ప్రాణులు. పరహితకరణే = ఇతరులకు మేలుసేయుటయందు. సం...పక్షాః - సంజాత = పుట్టినవారై, వ్యర్థ = నిష్ప్రయోజనమగు, పక్షాః=పక్షముగలవారు, (పుట్టి నిష్ప్రయోజకులలోఁ చేరిన వారు) ఉపరిష్టాత్ న = (ధ్రువునకు) పైనను లేరు. అధశ్చ న=క్రిందను లేరు. (మఱి) ఉదుంబర=అత్తిపండువంటి, బ్రహ్మా...న్తః-బ్రహ్మాండ = బ్రహ్మాండముయొక్క, అంతః = లోపల, మశకవత్ = దోమలవలె, జాతనష్టాః = పుట్టి చచ్చినవారు.

తా. విస్తార మగు భూభారమును భరించిన ఆదికూర్మముయొక్క జన్మము, జ్యోతిశ్చక్రమును భ్రమింపఁజేయుటకు ప్రధానుఁడగు ధ్రువుని యొక్క జన్మము, ఈ రెండే లెక్కింపఁ దగినవి? తక్కిన వారందఱు పరోప కారము చేయఁజాలనివా రగుటచేత ఆదికూర్మమువలెఁ గ్రిందను ధ్రువునివలె ఊర్ధ్వభాగమునను లేక బ్రహ్మాండ మను అత్తిపండులోని పురుగులవలెఁ బుట్టి నశించుచున్నారు.

చ. వితతజగద్భరంబు దన వీఁపునఁ దాల్చినకూర్మనాథుఁడున్
సతతము చంద్రభాస్కరుల చక్రముఁ ద్రిప్పుధ్రువుండు సజ్జనుల్
ప్రతిభ నజాండజంతుఫల రంధ్రవసన్మశకంబులట్లు నిం
దితవిఫలార్థసంగతి జనించి నశించుఁ దదన్యజంతువుల్.

అవ. సత్పురుషుల నడవడినిఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. తృష్ణాం ఛిన్ధి భజ క్షమాం జహి మదం పాపే రతిం మా కృథాః
సత్యం బ్రూహ్యనుయాహి సాధుపదవీం సేవస్వ విద్వజ్జనమ్,
మాన్యాన్మానయ విద్విషోఽప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం
కీర్తిం పాలయ దుఃఖితే కురు దయామేతత్సతాం చేష్టితమ్. 69

వ్యా.—అథ విధేయలోకం సంబోధయం స్సదాచారం శిక్షయతి - తృష్ణా మితి.—హే జనేత్యధ్యాహార్యం సర్వత్రాపి - మధ్యమపురుష ప్రయోగ సంభవాత్, అలభ్యేషు పరధనేషు లాభాభిలాష స్తృష్ణా-తాం ఛిన్ధి వైరాగ్యశస్త్రేణ విదారయ— అన్యథా అనేకాశాపాశనిబద్ధత్వేన క్లేశభాగిత్వం స్యాదితి భావః, పరిభవాదిషూత్పద్య

మానేషు క్రోధప్రతిబన్ధః క్షమా - తాం - భజ సేవస్వ - అన్యథా ఉగ్రభావేన కార్యహానిస్స్యాదితి భావః, మదం విద్యాజనితదర్పం, జహి విజ్ఞానేన వినాశయ-అన్యథా వివేకశూన్యతయా అకార్యకరణప్రవృత్త్యా అనర్థప్రాప్తిస్స్యాదితి భావః, పాపే పాపకర్మాచరణే, రతిం ప్రీతిం, మా కృథాః అజ్ఞానేన మాకార్షీః-కిం తు 'ధర్మం చర' ఇత్యాద్యుపదేశవచనేన సత్కర్మాచరణ ఏవ రతిం కుర్విత్యర్థః - అన్యథా నిరయపాతస్స్యాదితి భావః. * కరోతేర్లుజి థాసి 'న మాఙ్యోగ' ఇత్యట్ ప్రతిషేధః, సత్యం సూనృతం, బ్రూహి 'సత్యం వదే'తి వచనేన యథార్థమేవ వచనం వదేత్యర్థః-అన్యథా 'నానృతాత్పాతకం పర మి'తి న్యాయాదవివేకిత్వప్రసక్తిస్స్యాదితి భావః, సాధుపదవీం సన్మార్గం, మనుయాహి ధర్మశాస్త్రానురోధేనానుసర - అన్యథోత్పథప్రతిపన్నత్వే వచనీయతాది దోషాపత్తిస్స్యాదితి భావః, విద్వజ్జనమ్ ఉపదేశేన కృతార్థీకరణశీలం పణ్డితమణ్డలం, సేవస్వ

'యస్తు పర్యటతే దేశాన్ యస్తు సేవేత పణ్డితాన్,
తస్య విస్తారితా బుద్ధిస్తైలబిన్దురివామ్భసి.'

ఇతి వచనాద్బుద్ధివైశద్యార్థం శుశ్రూషస్వ - అన్యథా బుద్ధ్యవైశద్యాశిక్షితత్వాద్యభియోగస్స్యాదితి భావః, మాన్యాన్ పూజ్యాన్మానయ యథార్హం పూజయ - అన్యథా

'సమాసమాభ్యాం విషమసమే పూజ్యే' ఇతి గౌతమసూత్రాత్,
'అపూజ్యా యత్ర పూజ్యన్తే పూజ్యాశ్చైవావమానితాః,
అయశో మహదాప్నోతి ధనాద్ధర్మాచ్చ హీయతే.'

ఇత్యాది స్మరణాచ్చ కీర్తి సుకృత ధన హీయమానత్వ రూపాశ్రేయఃప్రాప్తిస్స్యాదితి భావః, కిం బహునా, విద్విష శ్శత్రూనపి కిముతాన్యాన్, అనునయ - 'సమశ్శత్రౌ చ మిత్రే చే'తి భగవద్వచనాత్ప్రసాదయ - అన్యథా రన్ధ్రేషు పాతయిష్యన్తీతి భావః, ప్రశ్రయం గుర్వాచార్యాదిషు నమ్రత్వం వినయమితి యావత్, ప్రఖ్యాపయ' గురౌ నమ్రతే' త్యుక్తత్వాత్ప్రకటయ - అన్యథా దుర్వినీతత్వాపవాదప్రసఙ్గస్స్యాదితి భావః; కీర్తిం పాలయ జన్మసాఫల్యార్థం కీర్తినిర్వాహణే ప్రయత్నం కుర్విత్యర్థః - అన్యథా 'క్షితితలే కిం జన్మ కీర్తిం వినే'తి వచనాజ్జీవన్మృతత్వాపత్తిస్స్యాదితి భావః, దుఃఖితే సంజాతదుఃఖేషు భూతేష్విత్యర్థః* తారకాదిత్వా దితచ్-జాతా వేకవచనం, దయాం దుఃఖప్రహాణేచ్ఛాలక్షణాం, కురు 'దుఃఖిషు కరుణే'తి శాస్త్రానురోధాద్విధేహి - అన్యథా చిత్తశుద్ధ్యసంభవాదితి భావః, కుతః? ఏతత్సర్వం తృష్ణాచ్ఛేదాదికం, సతాం సజ్జనానాం చేష్టితం వ్యాపారః, యది సౌజన్య యశఃకామీ తర్హైవం ప్రవర్తస్వ - అన్యథా పురుషార్థలాభాసంభవాదితి భావః.

టీ. తృష్ణాం = ఆశను, ఛిన్ది = కోయుము; క్షమాం = ఓర్పును, భజ=పొందుము; మదం=గర్వమును, జహి=వదలుము; పాపే=దుష్టునియందు, రతిం=ప్రేమను, మాకృథాః= చేయకుము; సత్యం = నిజమును, బ్రూహి = పలుకుము; సాధుపదవీం = పెద్దలమార్గమును, అనుయాహి = అనుసరింపుము, విద్వత్ జనం = పండితలోకమును, సేవస్వ=సేవింపుము. మాన్యాన్ = పూజ్యులను, మానయ = పూజింపుము. విద్విషః అపి = శత్రువులనైనను, అనునయ = ఆదరింపుము; ప్రశ్రయం = అడఁకువను, ప్రఖ్యాపయ = వెల్లడింపుము (చూపుము); కీర్తిం = యశస్సును, పాలయ = కాపాడుకొనుము; దుఃఖితే = దుఃఖముగలవారియందు (జాత్యేకవచనము), దయాం = కనికరమును, కురు = చేయుము (వహింపు మనుట), ఏతత్ = ఇది, సతాం = సత్పురుషులయొక్క, చేష్టితం = నడవడి.

తా. అత్యాశను త్యజించి ఓర్పు కలిగి మదమును విడిచి దుష్కార్యములందు మనసును పోనీయక సత్యమునే పలుకుచు పెద్దలు పోయిన మార్గమున నడచుచు విద్వాంసుల సేవించుటయు, పూజ్యుల మన్నించుచు శత్రువునైనను చక్కఁగఁ జూచుచు పెద్దలయందు అడఁకువ కలిగి కీర్తికి భంగము రానివిధంబుగ చరించుచు దుఃఖితులయందు దయను గనంబఱచుచుండుము. ఇవి సత్పురుషుల లక్షణనులు.

శా. ఆశాసంహరణంబు నోర్మియు మదత్యాగంబు దుర్దోషవాం
ఛాశూన్యత్వము సత్యముక్ బుధమతాచారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మాన్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయున్ శిష్టాలికిన్ ధర్మముల్.

అవ. సత్పురుషులు అరుదుగా నుందు రనుచున్నాఁడు:—

శ్లో. మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః,
పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః. 70

వ్యా.—ఈదృశా విరళా ఏవేతి నిగమయతి—మనసీతి.—మనసి వచసి కాయే మనోవాక్కాయేషు, పుణ్యమేవ-పీయూషమమృతం - తేన పూర్ణాః - కరణత్రితయేనాపి సత్కర్మాచరణతత్పరా ఇత్యర్థః * ని. 'పీయూషమమృతం సుధే' త్యమరః, త్రయాణాం భువనానాం సమాహారస్త్రిభువనం - లక్షణయా త్రిభువనస్థజనానిత్యర్థః*

'తద్ధితార్థే' త్యాదినా సమాసః * పాత్రాదిత్వాన్న స్త్రీత్వమ్, ఉపకారశ్రేణిభిర్హితాచరణ పరమ్పరాభిః, ప్రీణయన్తస్సన్తోషయన్తః. * 'ప్రీఞ్ ప్రీణనే' ఇతిధాతోశ్చౌరాదికాణ్ణిచి శతృప్రత్యయః. * 'ధూఞ్ ప్రీఞోర్నుగ్వక్తవ్య' ఇతి నుగాగమః, పరేషాం గుణపరమాణూ నత్యల్పగుణానపీత్యర్థః. యతో౽ణుర్నాస్తి స పరమాణురిత్యాహుః, పర్వతీకృత్య మహాన్తరాన్ కృత్వా * అభూతతద్భావే చ్విః * 'ఊర్యాది చ్వి డాచ శ్చే'తి గతి సంజ్ఞాయాం *'కుగతిప్రాదయ' ఇతి సమాసః, నిత్యం ఖ్యాపయన్తః నిరన్తరం ప్రశంసన్తః తథా నిజ హృది స్వాన్తఃకరణ ఏవ, వికసన్తః సంతుష్యన్త, స్సన్తః సత్పురుషాః, కియన్తః కతిపయే విరళా ఏవేత్యర్థః, సన్తి-నతు సాన్ద్రాః ఏతాదృశగుణసంపత్తే రసాధారణ్యాదితి భావః, నిజహృది వికసన్తస్సన్తి సన్తః కియన్తః ఇత్యేవపాఠః-తథాచోక్తం-సౌజన్యామృత సిన్ధవ ఇత్యాది. మాలినీవృత్తమ్.

టీ. మనసి = తలఁపులోను, వచసి = మాటలోను, కాయే=చేష్టలోను, పుణ్య... పూర్ణాః - పుణ్య = పుణ్యమనెడి, పీయూషం = అమృతముతో, పూర్ణాః=నిండినవారు, త్రిభువనం = ముల్లోకములను, ఉపకారశ్రేణిభిః = ఉపకారములవరుసలచే, ప్రీణయంతః = సంతోషపెట్టువారును, పర...అణూన్-పర = ఇతరులయొక్క, గుణపరమాణూన్ = మిక్కిలి అల్పములగు గుణములను, పర్వతీకృత్య = కొండలుగాచేసి, నిత్యం= ఎల్లప్పుడును, నిజహృది = తమహృదయమునందు, వికసన్తః = ఆనందించువారును (అగు) సన్తః = పెద్దలు, కియన్తః = కొంతమంది; సన్తి = కలరు.

తా. మనోవాక్కాయములయందును సత్కర్మల నొనర్చుట యను అమృతముచేత పూర్ణులయి ముల్లోకములం దున్నవారికి ఉపకార మొనర్చుచున్నవారలయి పరులయం దుండిన అణువులవంటి సద్గుణముల నైనను కొండంతగా భావించి వికసించుచున్నహృదయములు గలసజ్జనులు కొందఱుమాత్రమే యుందురు.

చ. హృదయవచశ్శరీరముల నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణలవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తు లగుమాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్.

ఇది నీతిశతకమునందు పరోపకారపద్ధతివర్ణన మను

ఏడవదశకము.

# ధై ర్య ప ద్ధ తి

శ్లో. రత్నై ర్మహార్ధే స్తుతుషుర్న దేవా న భేజిరే భీమవిషేణ భీతిమ్,
సుధాం వినా న ప్రయయుర్విరామం న నిశ్చితార్థాద్విరమన్తి ధీరాః.

వ్యా.—రత్నైరితి—దేవా అమరాః, మహోద్ధేః క్షీరార్ణవస్య సంబన్ధిభిః రత్నైః కౌస్తుభాదిమణిభిః-ని. 'రత్నం శ్రేష్ఠే మణావపీ'తి విశ్వః యద్వా - రత్నైః-ని. 'జాతౌ జాతౌ చ యచ్ఛ్రేష్ఠం తద్రత్నమభిధీయత' ఇతి వచనాత్ - ఐరావతోచ్చైశ్శ్రవః కల్ప వృక్షాదిశ్రేష్ఠజాతీయవస్తుభిః హేతుభిః, న తుతుషుస్తుష్టిం న ప్రాపుః - మథనసమయ ఇతి శేషః, తథా, బిభ్యత్యస్మాదితి భీమం * 'భీమాదయోఽపాదాన' ఇత్యపాదానార్థే భియః మక్ప్రత్యయ ఔణాదికః-తథాభూతం యద్విషం కాలకూటాఖ్యం-తేన హేతునా తస్మా దిత్యర్థః, భీతిం, న భేజిరే న ప్రాపురితి ధైర్యాతిశయోక్తిః.*విషేణేత్యత్ర 'భీత్రార్థానాం భయహేతు రి'త్యపాదానే పఞ్చమ్యా భావ్యం - తథాఽపి హేతుత్వమాత్రవివక్షయా ఽయం నిర్దేశఇతి మన్తవ్యం, కిం తు, సుధా మమృతం-వినా * 'పృథగ్వి నే' త్యాదినా ద్వితీయా, విరామ మవసానం, న ప్రయయుః మథనాదితి శేషః-సుధోత్పత్తిం వినా న విరతా ఇత్యర్థః-అనేన శీలసంపత్తిరుక్తా, తథాహి-ధీరా మనస్వినః, నిశ్చితార్థా, న్న విర మన్తి విరామం న ప్రాప్నువన్తి-కిం త్వాఫలోదయం ప్రయతన్త ఏవేత్యర్థః. అతో ధైర్య శీల సంపన్నానాం దేవానామపీదం యుక్త మేవేతి భావః. *'జుగుప్సా విరామే' త్యా దినా పఞ్చమీ. * 'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదమ్.

అర్థాన్తరన్యాసోఽలంకారః. వృత్తముపజాతిః.

టీ. దేవాః=దేవతలు, మహోద్ధేః=గొప్పసముద్రముయొక్క, రత్నైః =(కౌస్తుభము మొదలగు) మణులచేత (లేక, 'రత్న' శబ్దము శ్రేష్ఠవాచకమయినందున ఐరావతము, ఉచ్చైశ్శ్రవము, కల్పవృక్షము మున్నగుశ్రేష్ఠవస్తువులచేత), న తుతుషుః=సంతోషింపరైరి; భీమవిషేణ = భయంకరమగు (కాలకూట) విషముచేత, భీతిం=భయమును, న భేజిరే = పొందరైరి; సుధాం వినా=అమృతములేక (అమృతము లభింపక), విరామం=మానుటను, న ప్రయయుః=పొందకపోయిరి. (అమృతము పుట్టువఱకును చిలుకుచునేయుండిరి అనుట.) ధీరాః=పూనికగలవారు, నిశ్చితఅర్థాత్ = పూనుకొనినప్రయోజనమునుండి, న విరమంతి= విరమింపరు.

తా. అమృతమునకై పాలసంద్రమును మథింపుచున్న దేవతలు అందలి రత్నలాభమునకు సంతోషింపక అందు పుట్టిన కాలకూటవిషంబు

నకు భయపడక అమృతము కలుగునంతదనుక తనుపట్టుం బగలరైరి. ధీరు లెప్పుడు తాము దలంచినకార్య మగునంతవఱకు ప్రయత్నమును వదలరు.

తే. తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత
వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
విడిచిరే యత్న మమృతంబు వొడమునదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

అవ. ఉత్తమాదుల స్థైర్యతారతమ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః,
విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి. 72

వ్యా.—ఉక్తమేవార్థంనీచాదివృత్తికథనద్వారా ద్రఢయతి—ప్రారభ్యతఇతి— నీచైరధమైః, విఘ్నేభ్యోఽన్తరాయేభ్యో - యద్భయం తేన హేతునా, న ప్రారభ్యతే ఖలు-నోపక్రమ్యతే కార్యమితి శేషః-ని. 'విఘ్నోఽన్తరాయః ప్రత్యూహః' ఇత్యమరః, మధ్యాః మధ్యమాస్తు, కార్యం ప్రారభ్యోపక్రమ్య, విఘ్నై - ర్విహతా విహ్వలీకృతా, స్సన్తో, విరమన్తి, విరతా భవన్తీత్యర్థః, ఉత్తమాః ఉత్కృష్టాః - గుణా స్థైర్యశీలాదయో-యేషాం తే తథోక్తాః పురుషశ్రేష్ఠాస్తు విఘ్నై, ర్ముహుర్ముహుః, పౌనఃపున్యేన, ప్రతిహన్యమానాః బమ్భజ్యమానా, అపి, ప్రారబ్ధముపక్రాన్తం కర్మ, న పరిత్యజన్తి; అత్ర కాలకూటబడబానలాదివిఘ్నాద్యుపహతత్వేఽపి ఉక్తగుణసంపన్నతయా దేవానాం సుధోత్పత్తిపర్యన్తం మథనం యుక్తమితి శ్లోకద్వయస్యాపి తాత్పర్యమ్. అత్ర ప్రకరణే క్వచిద్ స్థైర్యస్య క్వచిచ్ఛీలస్య క్వచి దుభయస్యాపి ప్రాధాన్యనిర్దేశ ఇతి ద్రష్టవ్యమ్-'మనసో నిర్వికారత్వం స్థైర్యం సత్స్వపి హేతుష్వి' త్యుక్తలక్షణం స్థైర్యం - శీలం తు నియతకులోచితస్స్వభావ ఇతి వివేకః. 'శీలం స్వభావే సద్వృత్తా' విత్యభిధానాత్.

వసన్తతిలకావృత్తమ్.

టీ. నీచైః = అధములచేత, విఘ్నభయేన = విఘ్నములవలని భయముచే (విఘ్నములు గలుగు ననుభయముచే), న ప్రారభ్యతే = (పని) ఆరంభింపఁబడదు; మధ్యాః = మధ్యములు, ప్రారభ్య = ఆరంభించి, విఘ్నవిహతాస్సన్తః = విఘ్నముచేఁ జెఱుపఁబడిన

వారై, విరమన్తి=(పనిని) మానుదురు. ఉత్తమగుణాః=మంచిగుణములుగలవారు, విఘ్నైః= ఆటంకములచే, ముహుర్ముహుః=మాటిమాటికి, ప్రతిహన్యమానాఃఅపి=మిక్కిలికొట్టఁబడుచున్నవారైనను, ప్రారబ్ధం = ఆరంభింపఁబడినదానిని, న పరిత్యజంతి = వదలరు.

తా. అధములు విఘ్నములు సంభవించు నని కార్యము నారంభింప వెఱతురు. మధ్యములు ఆరంభించి విఘ్నములు వచ్చినప్పుడు వదలెదరు. ధీరు లెన్నిపర్యాయము లెట్టివిఘ్నములు వచ్చినను తాము పట్టినకార్యమును విడువరు.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

అవ. కార్యార్థి సుఖదుఃఖములను బరిగణింపక పని చేయు ననుచున్నాఁడు:—

శ్లో. క్వచిత్పృథ్వీశయ్యః క్వచిదపి చ పర్యఙ్కశయనః
క్వచిచ్ఛాకాహారః క్వచిదపి చ శాల్యోదనరుచిః,
క్వచిత్కన్థాధారీ క్వచిదపి చ దివ్యామ్బరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్. 73

వ్యా.—అథోక్తగుణసంపన్నస్య కృచ్ఛ్రాకృచ్ఛ్రయోర్దుఃఖసుఖాపరిగణనయా కార్యసాధనత్వమాహ—క్వచిదితి.—క్వచిత్కుత్రచిద్దేశే కాలే వా, పృథ్వీశయ్యా యస్య స తథోక్తః - కఠినతరస్థణ్డిలశయనోఽపీత్యర్థః, క్వచిచ్చ, పర్యఙ్కే హంసతూలికాతల్పే - శయనం స్వాపో - యస్య స తథోక్తః - మృదులతరశయ్యోఽపీత్యర్థః - ని. 'శయనం మఞ్చ పర్యఙ్క పల్యఙ్కాః ఖట్వయా సమాః'-'స్యాన్నిద్రా శయనం స్వాప' ఇత్యుభయత్రాఽప్యమరః, క్వచిచ్ఛాక ఏవాహారో యస్య నీరసాహారోఽపీత్యర్థః. క్వచిచ్చ, శాల్యోదనే శాల్యన్నే-రుచిః స్వాదో యస్య స తథోక్తః. షడ్రసోపేత మృష్టాన్నభోజనసంతుష్టోఽపీత్యర్థః, క్వచిత్కన్థాం జీర్ణవస్త్రశకలనిర్మితాచ్ఛాదనం ధారయతీతి కన్థాధార్యపి. క్వచిచ్చ దివ్యామ్బరధరః కనత్కనకపీతామ్బరధరోఽపి, కార్యార్థీ కార్యనిష్పత్త్యభిలాషీ - అర్థః అభిలాషః - తద్వానర్థీతి విగ్రహః. *'కృద్వృత్తే స్తద్ధితవృత్తి ర్బలీయ సీ'తి మహాభాష్యే, మనస్వీ మహామనాః ధీరః *ప్రశంసాయా మినిః, పృథ్వీశయ్యాదినా దుఃఖం చ న గణయతి, పర్యఙ్కశయ

నాదిశా సుఖం చ న గణయతి, కింతు సుఖదుఃఖయోస్సమానావస్థయైవ కార్యసాధన తత్పరో భవతీత్యర్థః.

టీ. క్వచిత్=ఒకచోట (లేక ఒకప్పుడు), పృథ్వీశయ్యః=భూమియే పఱుపుగాఁ గలవాఁడును. క్వచిచ్ చ, పర్యంకశయనః అపి = పట్టెమంచమునఁ బరుండుటగలవాఁడును, క్వచిత్, శాకఆహారః=కూరగాయ లాహారముగాఁ గలవాఁడును, క్వచిత్ చ, శాల్యోదన రుచిః అపి-శాలిఓదన=వరియన్నమునందు, రుచిః=రుచిగలవాఁడును; క్వచిత్, కంథాధారీ=బొంతను వేసికొన్నవాఁడును, క్వచిత్ చ, దివ్యఅంబరధరః అపి=ఉత్తమములగు వస్త్రములను ధరించినవాఁడును; (అగు) కార్యార్థీ=కార్యమును గోరు, మనస్వీ=గొప్పమనస్సుగలవాఁడు, దుఃఖంచ = దుఃఖమును, న గణయతి = లెక్కింపఁడు, సుఖం చ = సుఖమును, న (గణయతి) = లెక్కింపఁడు.

తా. కార్యార్థి యగుధీరుఁడు వీలునుఁబట్టి ఒకచోట భూశయ్యయు, ఒకచోట పఱుపులయందు శయనించుటయు, ఒకతావున కాయకూరల నారగించుటయు, ఒకచోటను శాల్యోదనంబు సేవించుటయు, ఒకతావున బొంతగుడ్డను కట్టుకొనుటయు, ఒక చోట పీతాంబరముల ధరించుటయుఁ గలిగియుండును. కాని కష్టములు వచ్చిన వని దుఃఖమును గాని సుఖము వచ్చిన దని సంతోషముగాని పొందఁడు.

మ. ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్టశాల్యోదనం
బొకచోఁ బొంత ధరించు నొక్కొకతఱిన్ యోగ్యాంబరశ్రేణి లె
క్కకుఁ రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.

అవ. ధీరు లెప్పుడును న్యాయమార్గము వదల రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణమస్తు యుగాన్తరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః. 74

వ్యా.—అథ ధీరాః లోకనిన్దా స్తుతి ప్రాప్తా అపి న్యాయమార్గాన్న భ్రశ్యన్తీత్యాహ—నిన్దన్త్వితి.—నీతినిపుణా నయవిశారదాః, నిన్దన్తు, కథంచిద్దూషయన్తు, వా ఇతి అథవా, స్తువన్తు భూషయన్తు వా, లక్ష్మీ స్సంపత్, సమావిశతు ప్రాప్నోతు, వా

ఉత, యథేష్టం నిరర్గళం, గచ్ఛతు వా, అద్యైవ వేదానీ మేవ; మరణం నిధన, మస్తు వా, ఉత యుగాన్తరే కల్పాన్తరే వాఽస్తు. తథాఽపి, ధీరా ధైర్యశాలినః, న్యాయ్యా న్న్యాయా దనపేతా, త్పథో మార్గాత్, పద మేకపాదవిన్యాసమాత్రమపి, న ప్రవిచలన్తి న భ్రశ్యన్తి, తేషాం న్యాయమార్గాపరిత్యాగ ఏవ పరమార్థో న నిద్రాస్తుత్యాదిరితి భావః

టీ. నీతినిపుణాః = నీతియందు నేర్పరులైనవారు, నిందన్తు = దూషింతురుగాక! యదివా=కాదేని, స్తువన్తు = పొగడుదురుగాక ! లక్ష్మీః = సంపద, సమావిశతు వా=కలుగునుగాక! యథేష్టమ్ = ఇచ్చవచ్చినట్లు, గచ్ఛతు వా = పోవునుగాక ! మరణం=చావు, అద్యఏవ వా=ఇప్పుడేకాని, యుగ అన్తరే వా=వేఱొకయుగమునందు-గాని, అస్తు=కలుగునుగాక ! ధీరాః=దిట్టలు, న్యాయ్యాత్ = న్యాయములేనిదిగాని, పథః=మార్గమునుండి, పదం=అడుగు (మాత్రముదూరమైనను), న ప్రవిచలన్తి = తొలఁగరు.

తా. నీతివేత్తలు నిందించినను భూషించినను సంపదలు వచ్చినను పోయినను మరణ మిప్పుడే కలిగినను కల్పాంతరమునకుఁ గలిగిన ధీరులయినవారు న్యాయమార్గమును దాఁటి ఒక అడుగునైనను పెట్టరు.

శా. నీతిప్రౌఢవిహారులైననిపుణుల్ ॥ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ ॥ గాఢంబుగా సాగనీ
ఘాతం బిప్పుడు పొందనీ నియతిమైఁ ॥ గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరు గదా ॥ నిత్యంబు ధీరోత్తముల్.

అవ. ధీరునిలక్షణమును, ధీరునిమహిమయుఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. కాన్తాకటాక్షవిశిఖా న ఖనన్తి యస్య
చిత్తం న నిర్దహతి కోపకృశానుతాపః,
కర్షన్తి భూరివిషయాశ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్నమిదం స ధీరః. 75

వ్యా.—నను కో ధీరస్స వా కిం సాధయతీత్యాశఙ్క్యాహ—కాన్తేతి—యస్య చిత్తం, కాన్తాకటాక్షాః -

'యద్గతాగతవిశ్రాన్తి వైచిత్ర్యేణ వివర్తనమ్,
తారకాయాః కళాభిజ్ఞా స్తం కటాక్షం ప్రచక్షతే.'

ఇతి భావప్రకాశోక్తలక్షణలక్షిత కామిన్యపాఙ్గాలోకనాని - త ఏవ విశిఖా బాణా, న లునన్తి న భిన్దన్తి న సమ్మోహయన్తీతి యావత్, తథా కోపకృశానుతాపః క్రోధాగ్నిసం

తాపశ్చ న నిర్దహతి న వ్యాకులయతి, తథా భూరయో బలవత్తరా - విషయాః శబ్దాదిస్థిరయార్థాశ్చ, లోభః పరస్వాపహరణే ప్రయత్నః; ఏతేన కామాదయోఽప్యుపలక్ష్యన్తే - తథా చ-లోభా ఏవ పాశా రజ్జవశ్చ - బన్ధనహేతుత్వాత్తేషాం పాశత్వారోపణం, న కర్షన్తి తృష్ణాయుక్తం న కుర్వన్తి - కర్షన్తీతి పాఠే న స్వాయత్తీకుర్వన్తీత్యర్థః, స ధీరః కృత్స్నమశేషం, లోకత్రయం స్వర్గాదిలోకత్రితయమపి, జయత్యాత్మాధీనం కరోతీత్యర్థః, తస్య న కించిదప్యసాధ్యమిత్యర్థః.

టీ. యస్య=ఎవనియొక్క, చిత్తం=మనస్సు, కాన్తా...విశిఖా-కాన్తా = ప్రియురాలియొక్క, కటాక్షవిశిఖాః = క్రేగంటిచూపులనెడి బాణములు, న ఖనంతి = గ్రుచ్చవో, ('లునంతి' అనుపాఠమున-ఛేదింపవో,) కోప...తాపః-కోప = కోపమనెడి, కృశాను = నిప్పుయొక్క, తాపః = సంతాపము, న నిర్దహతి = తగులఁబెట్టదో (కలతఁబెట్టదో), భూరివిషయాః చ-భూరి=అనేకములగు, విషయాః = (శబ్దస్పర్శాది) విషయములు, లోభపాశైః = ఆశలనెడు త్రాళ్లచే; నకర్షన్తి = లాగవో, సః ధీరః=అధీరుఁడు, కృత్స్నం = సమస్తమైన, లోకత్రయం = (స్వర్గము, మర్త్యము, పాతాళము అను) మూఁడులోకములను, జయతి = గెలుచును.

తా. ఎవనిమనస్సు కామినులచూపు లనుబాణములచే క్షతము కాదో, ఎవనిహృదయమును కోపాగ్ని దహింపదో,ఎవనిమనస్సు అత్యాశయనుపాశములచే లాగఁబడదో అట్టిధీరుఁడు ముల్లోకముల జయించును.

ఉ. మానవతీకటాక్షశితమార్గణముల్ విదలింపఁజాల వె
వ్వానిమనంబు కోపమయవహ్ని దహింపదు లోభపాశసం
తానము మాల్యచందనవితానములున్ వెత సేయ నోప కె
వ్వానివశంబునన్ మెలఁగువాఁడు జయించు జగంబు లన్నియున్.

అవ. ఎప్పుడును సహజమగు ధైర్యగుణమును మాన్పలేమని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కదర్థితస్యాపి హి ధైర్యవృత్తేర్నశక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్,
అధోముఖస్యాపి కృతస్య వహ్నే ర్నాధః శిఖాయాతి కదాచి దేవ.

వ్యా.—ధైర్యగుణస్యకాఽరః కథంచిదపి న యుజ్యత ఇతి సదృష్టాన్తమాహ—కదర్థితస్యేతి—తస్మిన్తోఽర్థః కదర్థ * 'కోః కత్తత్పురుషేఽచీ'తి కుశబ్దస్య కదాదేశః. కదర్థీకృతః కదర్థితః - తస్య నీచైః కృతస్యాపి సతః, ధైర్యేణ వృత్తి ర్వర్తనం యస్య తస్య సంబన్ధి ధైర్యమేవ గుణః, ప్రమార్ష్టు మధః కర్తుం, న శక్యతే; తత్ర దృ

ప్తాన్తః - అధోముఖస్య కృతస్యావాఙ్ముఖీకృతస్యాపి సతో, వహ్నేః, శిఖా జ్వాలా, కదాచిదేవ కదాచిద, ప్యధో న యాతి - కింతూర్ధ్వమేవ ప్రసరతీత్యర్థః, తద్వద్ధీర స్యాపి ధైర్యగుణ ఇతి వివేకః. ఉపజాతివృత్తమ్.

టీ. కదర్థితస్య అపి = తక్కువవాఁడుగాఁ జేయఁబడినను, ధైర్యవృత్తేః = ధైర్యము తోడి వర్తనగలవానియొక్క, ధైర్యగుణః = ధైర్యమనుగుణము, ప్రమార్ష్టుమ్ = తుడిచి వేయుటకు, నశక్య తేహి=వలను పడదుసుమా! (ఉదాహరణ మే మన:)—అధోముఖస్య= తలక్రిందు, కృతస్య అపి=చేయఁబడినవాఁడైనను, వహ్నేః=నిప్పుయొక్క, శిఖా=జ్వాల, కదాచిత్ ఏవ = ఒకానొకప్పుడు నైతేను, అధః = (తల) క్రిందుగా, న యాతి = ప్రసరింపదు.

తా. ధైర్యవంతునికి ఎట్టిదుఃఖము సంభవించినను అతని ధైర్యమును పోఁగొట్టుట అసాధ్యము. అగ్నిని తలక్రిందుగా పెట్టినను అగ్నిజ్వాల యూర్ధ్వముగనే ప్రసరించునుగాని అధోముఖముగ ప్రసరింపదు.

తే. నియతిచేతఁ గదర్థితుం డయిన ధైర్య
పరుని ధైర్యగుణంబు మాన్పఁగ దరమె
క్రిందు సేయంగఁ బడినట్టి కృష్ణపథుని
కీల యెందైన మీఁదుగాఁ గెరలుఁ గాదె.

అవ. మంచినడవడిని చెఱుపుకొనుటకంటె మరణమే మేలనుచున్నాఁడు:—

శ్లో. వరం తుఙ్గాచ్ఛృఙ్గాద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వాఽయం కాయః కఠినదృషదన్తే విదలితః,
వరం న్యస్తో హస్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే
వరం వహ్నౌ పాత స్తదపి న కృతః శీలవిలయః. 17

వ్యా.—మరణోద్యోగో వా వరం న తు శీలవిలయ ఇత్యాహ—వరమితి.— అయం కాయో దేహః గురుశిఖరిణోఽ త్యున్నతపర్వతస్య శృఙ్గోత్సఙ్గాచ్ఛృఙ్గోపరి భాగా, త్క్వాపి కస్మింశ్చి, ద్విషమే వికటే, కఠినదృషదన్తే కర్కశపాషాణాన్తరాళే, పతిత్వా, విదళితః శకలితశ్చే, ద్వరం మనాక్ప్రియం, తథా హస్త, స్తీక్ష్ణదశనే విషాన లోగ్రదంష్ట్రే, ఫణిపతేః - ముఖే వక్త్రే, న్యస్తశ్చే ద్వరం, తథా వహ్నౌ పాతోఽగ్ని ప్రవేశోఽపి, వరం, కిం తు శీలవిలయస్సత్స్వభావత్యాగః, కృతశ్చేత్తదపి వర

మసి మనాక్ప్రియ మపి, న భవతీత్యర్థః, ప్రాణప్రయాసేఽపి శీలం న త్యాజ్యమితి తాత్పర్యం - 'ద్వైవా ద్వ్యతే వరః శ్రే ష్ఠేత్రిషు క్లీబం మనాక్ప్రియ' ఇత్యమరః.

టీ. అయంకాయః = ఈశరీరము, గురుశిఖరిణః = పెద్దకొండయొక్క, తుంగాత్ = ఎత్తైన, శృంగాత్ = శిఖరమునుండి, (శృంగోత్సంగాత్ - అనుపాఠమున శిఖరముయొక్క పైభాగమునుండి, అనియర్థము.) క్వఅపి = ఒకానొక, విషమే = హెచ్చుతగ్గులుగల (చదునుగాలేని), కఠినదృషత్ అన్తే = గట్టిఱాతియంచున, పతిత్వా = పడి, విదళితః = నజ్జు నుజ్జయినది (అగుట) వరం = కొంచెము మేలు; హస్తః = చేయి, తీక్ష్ణదశనే = వాఁడికోఱలు గల, ఫణిపతిముఖే = ఆదిశేషుని నోటియందు; న్యస్తః = పెట్టఁబడినది (అగుటయైనను), పరమ్; వహ్నౌ = నిప్పులో, పాతః = పడుట, వరమ్; తత్ అపి = అట్టైనను, శీలవిలయః = మంచినడవడియొక్క నాశము, నవరమ్ = కొంచెమైనను మంచిదిగాదు.

తా. ఎత్తయిన పర్వతశిఖరమునుండి కఠినమయిన ఱాతిమీఁద పడి దేహమును వదలుటయు, భయంకరములగు విషజ్వాలల వెళ్ళగ్రక్కు కోరలుగల ఆదిశేషుని నోటియందు చేయిని పెట్టుటయు, అగ్నియందుఁ బడుటయు ఇవి ఒకపక్షమున మేలనవచ్చును గాని సత్స్వభావమును విడుచుటమాత్రము మేలుగాదు.

చ. ఉరుతరపర్వతాగ్రమునసనుండి దృఢం బగుఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్లి కాయము హతంబుగఁ జేయుట మేలు గాలిమే
పరిదొరవాతఁ గేలిడుట యే బాగు హుతాశనమధ్యపాతముఁ
వర మగుఁ జారుశీలగుణవర్జన మర్హము గాదు చూడఁగన్.

అవ. శీలవంతునకు బాధకములుంగూడ సాధకము లగుచున్న వనుచున్నాఁడు:—

శ్లో. వహ్ని స్తస్య జలాయతే జలనిధిః కుల్యాయతే తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే మృగపతిః సద్యః కురఙ్గాయతే,
వ్యాలో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే,
యస్యాఙ్గేఽఖిలలోక వల్లభతమం శీలం సమున్మీలతి. 78

వ్యా.—నన్వేవం శీల స్యాత్యన్తావశ్యకత్వ ముక్తం, తద్భావే కో లాభ ఇత్యాశఙ్క్యాయామాహ—వహ్నిరితి.—తస్య పుంసః, 'వహ్నిర్దాహకోఽపీతి భావః, జలాయతే జలమివాచరతి - తద్వచ్ఛీతలో భవతీత్యర్థః * 'కర్తుః క్యఙ్సలోప శ్చే'తి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయోరి' తి దీర్ఘః - ఏవం సర్వత్ర యోజ్యం

జలనిధిర్దుస్తరోఽపీతి భావః, కుల్యాయతే అల్పనదీవాచరతి, తస్యేతి సర్వత్రాన్వయోఽవగన్తవ్యః, తత్క్షణాత్తస్మిన్నేవ క్షణే - న తు విలమ్బేనేత్యర్థః, మేరుః స్వల్పశిలాయతే అల్పదృషదివాచరతి, మృగపతిస్సింహః - హింస్రోఽపీతి భావః, సద్యః కురఙ్గాయతే హరిణ ఇవాచరతి, వ్యాళస్సర్పః - విషరోషభీషణోఽపీతి భావః, మాల్యగుణాయతే పుష్పస్రగివాచరతి, విషమేవ -రసో ద్రవః ప్రాణప్రయాసహేతురితి భావః, పీయూషవర్షాయతే అమృతవృష్టిరివాచరతి, కస్యేత్యాకాఙ్క్షాయామాహ—యస్య పుంసోఽఙ్గేఽఖిలలోకానామశేషజనానాం - వల్లభతరమత్యన్తమనోహరం, శీలం సత్స్వభావః, సమున్మీలతి సముల్లసతి, తస్యేతి సంబన్ధః, శీలసంపన్నస్య దుఃఖహేతవోఽపి సుఖహేతవ ఏవ భవన్తి, అయమేవ పరమలాభ ఇతి భావః.

అత్ర వ్యజర్థాదౌపమ్యప్రతీతేరుపమాభేదః-

'ఇవాదిలోపే ద్వివిధే ణముల్ క్యచి చ క్యజి,

తథా వాక్యే సమాసే చ సప్తధైషా ప్రకీర్తితా.' ఇతి.

(ఏషా ఉపమేత్యర్థః.)

టీ. యస్య=ఎవనియొక్క, అంగే=దేహమందు, అఖిల...తమం-అఖిలలోక=సమస్తజనులకును, వల్లభతమం=మిక్కిలి యిష్టమైన, శీలం = మంచియాచారము, సమున్మీలతి=ప్రకాశించునో, తస్య=వానికి, వహ్నిః=అగ్ని, జలాయతే=నీటివలె నగును. జలనిధిః=సముద్రము, కుల్యాయతే=చిన్నకాలువవలె నగును. తత్క్షణాత్=ఆక్షణముననే, మేరుః=మేరుపర్వతము, స్వల్పశిలాయతే = చిన్నఱాయివలె నగును. మృగపతిః = సింహము, (మిగుల క్రూరజంతువైనను) సద్యః = వెంటనే, కురంగాయతే=లేడివలెనగును. వ్యాళః = త్రాచు (మహావిషము గలిగి బుసకొట్టుచున్నదైనను) మాల్యగుణాయతే = పూలదండదారమువలె నగును. విషరసః = విషరూపమయిన ద్రవము, పీయూషవర్షాయతే = అమృతంపు వానవలె నగును.

తా. ఎవఁడు-సత్స్వభావము కలిగియుండునో, అట్టివానికి అగ్ని జలమువలె చల్లగను, మేరుపర్వతము చిన్నఱాతివలెను, సింగము జింకవలెను, సర్పము పూలమాలవలెను, విషము అమృతమువలెను అగును.

చ. అతనికి వార్ధి కుల్య యగు నగ్ని జలం బగు మేరుశైల మం
చితశిలలీల నుండు మదసింహము జింకతెఱంగుఁ దాల్చుఁ గో

పితఫణి పూలదండ యగు ॥ భీష్మవిషంబు సుధారసం బగున్
క్షితి జనసమ్మతం బగుసుశీల మ దెవ్వనియందు శోభిలున్.

అవ. శీలవంతుల కెప్పుడును సంతాపము గలుగ దనుచున్నాఁడు:—

శ్లో. ఛిన్నోఽపి రోహతి తరుః క్షీణోఽప్యుపచీయతే పునశ్చన్ద్రః,
ఇతి విమృశన్తస్సన్తః సన్తప్యన్తే న విప్లుతా లోకే. 79

వ్యా.—అథైషాం కదాఽపి సంతాపో న ప్రవర్తత ఇత్యాహ—ఛిన్నయితి.—తరుః ఛిన్నస్సన్నపి, పురా, రోహ త్యుద్గచ్ఛతి, చన్ద్రః, క్షీణః కృష్ణపక్షే దినక్రమేణ కృశస్సన్నపి, పున,రుపచీయతే ప్రవర్ధతే, ఇత్యేవం, విమృశన్తో మనస్యనుసందధానా స్సన్తః శీలసంపన్నా, లోకేషు బన్ధుజనేషు, విప్లవేషు విప్లవేషు సత్స్వపి, న సంతప్యన్తే కిం తు తరుచన్ద్రదృష్టాన్తే సాభివృద్ధి మాశంసన్త ఏవ సన్తీ త్యర్థః. ఆర్యాభేదః.

టీ. తరుః = చెట్టు, ఛిన్నఃఅపి = నఱకఁబడినదయ్యును, పునః=మరల, రోహతి = ఎదుగును. చంద్రః = చంద్రుఁడు, క్షీణః అపి = సన్నగిల్లినవాఁడయ్యును, పునః=మరల, ఉపచీయతే = పెరుగును. ఇతి = అని, విమృశన్తః=విమర్శించుచు, సంతః=పెద్దలు, (శీలవంతులు), లోకే=లోకమందు, విప్లుతాఃసంతః = కష్టమునొందినవారై, న సంతప్యంతే= సంతాపము (దుఃఖము) నొందరు.

తా. సజ్జనులు, ఛేదింపఁబడిన వృక్షము మరల అంకురించుటయు, క్షీణించిన చంద్రుఁడు మరల వృద్ధినందుటయుఁ గాంచుచున్న వార లయి తమకు దుఃఖము కలిగిన సమయమున సంతాపము నందరు.

తే. ఖండితం బయ్యు భూజంబు ॥ వెండి మొలచు
క్షీణుఁ డయ్యును నభివృద్ధిఁ ॥ జెందు సోముఁ
డివ్విధమున విచారించి ॥ యొడలు దెగిన
జనములకు దాప మొందరు ॥ సాధుజనులు.

అవ. శీలమే సమస్తమునకు భూషణ మనుచున్నాఁడు:—

శ్లో. ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో
జ్ఞానస్యోపశమః శ్రుతస్య వినయో విత్తస్య పాత్రే వ్యయః,
అక్రోధ స్తపసః క్షమా ప్రభవితుర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషామపి సర్వకారణమిదం శీలం పరం భూషణమ్. 80

వ్యా.—శీలమేవాశేషభూషణ మిత్యాహ—ఐశ్వర్యస్యేతి—ఐశ్వర్యస్య స్వామ్యస్య, సుజనతా విభూషణం - న తు దౌర్జన్యం, శౌర్యస్య విక్రాన్తత్వస్య వాక్సంయమో వాఙ్నియమో, భూషణం న త్వసంబద్ధప్రలాపిత్వం, జ్ఞానస్య కర్తవ్యాకర్తవ్యవివేకస్యాత్మ విషయకస్య, వా, ఉపశమో విషయోపరతిః, విభూషణం న తు లోలుపత్వం, శ్రుతస్య శాస్త్రస్య, వినయో విభూషణం - న తు గర్వోద్రిక్తతా, విత్తస్య పాత్రే వ్యయః సత్పాత్రే ప్రతిపత్తిః, విభూషణం - న తు విటనటాదిషు, తపసశ్చాన్ద్రాయణాదే రక్రోధః క్రోధ రాహిత్యం * క్వచిత్ప్రసజ్యప్రతిషేధేఽపి నఞ్ సమాస ఇష్యతే, విభూషణం - న తు కోపశీలత్వం, ప్రభవితుః సమర్థస్య, క్షమా సహిష్ణుత్వం. భూషణం - న తూచ్ఛండతా, ధర్మస్య సత్పాత్రదానస్య, నిర్వ్యాజతా వ్యాజరాహిత్యం, విభూణం - న తు ద్రవ్య నాశదుఃఖం, తథా సర్వకారణమ్ ఐశ్వర్యాది సమస్తనిదాన, మిదం పూర్వోపవర్ణిత మేవ శీలం, సర్వేషా మపి సర్వపుంసాం, పరం సౌజన్యాద్యపేక్షయాఽప్యుత్కృష్టం, భూషణమలంకారః. అతస్సర్వథాఽపి శీలమేవాశ్రయణీమితి తాత్పర్యమ్.

టీ. ఐశ్వర్య = దొరతనమునకు, సుజనతా = మంచితనము, విభూషణం = అలంకారము; శౌర్యస్య=పరాక్రమమునకు, వాక్సంయమః=మాటనియతి (అనఁగా: అసంబద్ధ ప్రలాపములాడకుండుట), విభూషణం; జ్ఞానస్య = తెలివికి, ఉపశమః=శాంతి, విభూషణమ్; శ్రుతస్య=శాస్త్రమునకు (వినికిని). వినయః=అణఁకువ, విభూషణం; విత్తస్య=ద్రవ్యమునకు, పాత్రే = యోగ్యునివిషయమై, వ్యయః = కర్చుపెట్టుట, విభూషణం; తపస=తపస్సునకు, అక్రోధః = క్రోధములేకుండుట, విభూషణమ్; ప్రభవితుః = సమర్థునకు, క్షమా=ఓర్పు, విభూషణమ్; ధర్మస్య = ధర్మమునకు, నిర్వ్యాజతా = డంబములేకుండుట, విభూషణమ్, సర్వకారణం = అన్నిటికిమూలమగు, ఇదంశీలం = ఈమంచినడవడి, సర్వేషాంఅపి = అన్నిటికిని, పరం = ఉత్కృష్టమైన, భూషణం = అలంకారము.

తా. సంపదలు కలిగి సుజనుఁడుగ నుండుటయు, శూరుఁడై మితభాషి యగుటయు, జ్ఞానముండి ఇంద్రియలోలత లేకుండుటయు, విద్యావంతుఁడై వినయముకలిగియుండుటయు, ధనముండి సత్పాత్ర యందు వినియోగించుటయు, తపస్వియై కోపము లేకుండుటయు, సమర్థుఁడై ఓర్పుండుటయు, నెపములేక ధర్మము నొనర్చుటయు ఇవన్నియు వానికి అలంకారముతో సమానము.

ఉ. జానుగ భూతికిం దొడవు సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మౌనము నీతి విద్యకుశ మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము దాల్మి శక్తికిని ధర్మనిరూఢి కదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణభూషణ మెన్నఁగ శీలమే సుమీ.

ఇది నీతిశతకమునందు ధైర్యపద్ధతివర్ణన మను
ఎనిమిదవదశకము.

---

## దైవపద్ధతి

అవ. ధైర్యశీలములు దైవాయత్తము లగుటవలన, నాపద్ధతులు నిరూపించిన పిదప దైవపద్ధతిని నిరూపించుచు "పౌరుషముకన్న దైవమే బల" మని చెప్పుచున్నాఁడు:—

శ్లో. నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురాః సైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలు హరే రైరావణో వారణః,
ఇత్యాశ్చర్యబలాన్వితోఽపి బలభిద్భగ్నః పరైః సఙ్గరే
తద్వ్యక్తం నను దైవమేవ శరణం ధిగ్ ధిగ్ వృథాపౌరుషమ్.

వ్యా.—అథ ధైర్యశీలయోరపి దైవాయత్తత్వాత్తన్నిరూపణానన్తరం దైవపద్ధతిం నిరూపయతి—నేతేతి.—యస్య బలభిదః, నేతా శిక్షకః హితాహితోపదేశకర్తా. బృహతాం వాచాం పతిర్బృహస్పతిః - న తు యః కశ్చిత్ * 'తద్బృహతోః కరపత్యోశ్చోరదేవతయోః స్సుడ్తలోపశ్చే'తి సుడాగమ తలోపౌ, ప్రహరణమ్ ఆయుధం ప్రహారసాధనం తు, వజ్రం వజ్రాయుధం - పర్వతపక్షచ్ఛేదనేఽప్యకుణ్ఠితమితి భావః - న తు యత్కించిదయోమయం, సైనికాస్సురాః - న తు దుర్బలలౌకికాః, దుర్గం గుప్తిస్థానం, స్వర్గః స్వర్గలోకః - న తు మృత్పాషాణాదినిర్మితమ్, అనుగ్రహః పరిపాలనతాత్పర్యం, హరేః ఖలు సకలలోకాధీశ్వరస్య విష్ణోః నను - తస్యావరజభావేనావతీర్ణత్వా దితి భావః. న తు క్షుద్రదేవతాయాః, వారణో గజః, ఐరావణః న తు యః కశ్చిత్కలభః, ఇత్యనేన ప్రకారేణ స బలభిదిన్ద్రః, ఆశ్చర్యబలాన్వితోఽసాధారణత్వాదద్భుతకరశక్తిసహితోఽపి, సంగరే రణే, పరైర్దానవైః, ర్భగ్నో విదారితః, తత్తస్మాత్కారణాత్, వ్యక్తం స్ఫుటం యథా తథా, దైవమేవ, శరణం రక్షకం, నను, పురుషస్య కర్మ పౌరుషం * 'హాయనాన్త యువాది భ్యోఽణి'తి యువాదిత్వాదణ్ - ని. 'పౌరుషం పురుషస్యోక్తే భావే కర్మణి తేజసీ'తి విశ్వః - పౌరుషం పురుషకారం, ధిగ్ధిక్ పౌనఃపున్యేన నిన్ద్యమిత్యర్థః, వృథా

వ్యర్థమప్రయోజకత్వాదితి భావః, ధిగ్ధిగితి * 'నిత్యవీప్సయో' రిత్యాభీక్ష్ణ్యే ద్విరుక్తిః, తద్యోగాత్పౌరుషమితి ద్వితీయా; అతః పౌరుషస్యాకించిత్కరత్వమేవాశ్రయణీయ మితి భావః.

"ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీ
ర్దైవం ప్రధానమితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః?"

ఇత్యాదివచనస్య అయమేవ దత్తజలాఞ్జలిరితి వేదితవ్యమ్.

అత్ర సాభిప్రాయవిశేషణత్వా త్పరికరాలంకారః. తదుక్తం.—'సాభిప్రాయ విశేషణం పరికర' ఇతి.

టీ. యస్య = ఎవనికి, నేతా = (హితాహితముల) నేర్పువాఁడు, బృహస్పతిః = వాచస్పతియో; ప్రహరణం = ఆయుధము, వజ్రం = వజ్రమో; (పర్వతముల ఱెక్కలు నఱకినను మొక్కపోని దని భావము.) సైనికాః = బంట్లు, సురాః = దేవతలో; దుర్గం= కోట, స్వర్గః=స్వర్గమో; (అనఁగా: మట్టిచే రాళ్లచేఁ గట్టఁబడినదిగా దనుట)అనుగ్రహః= అనుగ్రహము (పరిపాలనతాత్పర్యము-ప్రాపు) హరేః ఖలు = విష్ణువుదేకదా ? (అనఁగా: విష్ణువే యతనికి తమ్ముఁడుగా (ఉపేంద్రుఁడుగా) బుట్టినందున ననుట) వారణః=ఏనుఁగు, ఐరావణః = ఐరావతమో (సముద్రునికొడుకో); ఇతి = ఇట్లు, ఆశ్చర్యబలాన్వితఃఅపి= మిక్కిలి విచిత్రమైనబలముతోఁ గూడుకొనినవాఁ డయినను, బలభిత్ = ఇంద్రుఁడు సంగరే = యుద్ధమందు, పరైః = శత్రువులచేత (రాక్షసులచేత), భగ్నః = ఓడింపఁబడెను. తత్ = కాఁబట్టి, వ్యక్తం = స్పష్టముగా, దైవంఏవ=దైవమే, శరణంనను=రక్షకముకదా! వృథా = వ్యర్థమయిన, పౌరుషం = పురుషునికృత్యము, ధిక్ ధిక్ = ఛీఛీ (మిక్కిలి నింద్య మనుట.)

తా. బృహస్పతి గురువై వజ్ర మాయుధమై దేవతలు సేనలోని వారలయి స్వర్గముకోటయై విష్ణుమూర్తియనుగ్రహము గలవాఁడై ఐరావతగజంబుకలిగి ఈవిధంబుగ ఆశ్చర్యమును కలుగఁజేయు శక్తిగల ఇంద్రుఁడే శత్రువులచేత యుద్ధమునం దోడిపోయెను. కావున దైవ బలమే ప్రధానముకాని పౌరుష మెందుకును పనికిరాదు.

చ. గురుఁడు గురుండు వాలు శతకోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు గోట మధుసూదనుఁడుర్క సయిదోడు దంతి ది

క్కరిపతి గాఁగ నొప్పుబలోఘాతియు దాయల కోడె నాజిలో
శరణము దైవమే పురుషశక్తి నిరర్థక మెన్నిభంగులన్.

అవ. బంధమోక్షములకును, హానివృద్ధులకును దైవమే కారణ మను చున్నాఁడు:—

శ్లో. భగ్నాశస్య కరణ్డపిణ్డితతనోర్మ్లానేన్ద్రియస్య క్షుధా
కృత్వాఽఽఖుర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః,
తృప్తస్తత్పిశితేన సత్వరమసౌ తేనైవ యాతః పథా
స్వస్థాస్తిష్ఠత దైవమేవ హి పరం వృద్ధౌ క్షయే కారణమ్. 82

వ్యా.—అథ బన్ధమోక్షయోర్హానివృద్ధ్యోశ్చాపి దైవమేవ కారణమిత్యాహ— భగ్నేతి.—ఆఖుర్మూషకః కర్తా, నక్తం రాత్రౌ, వివరం బిలం, కరణ్డస్యైవేతి భావః, కృత్వా, భగ్నాశస్య భగ్నత్వా ద్భగ్నమనోరథస్య కరణ్డే పిణ్డికాయాం - పిణ్డితా పుఞ్జీకృతా - తనుర్యస్య తథోక్తస్య - విహారప్రసారశూన్యతయాఽతికృచ్ఛ్రదశామాపన్నస్యేత్యర్థః, క్షుధా బుభుక్షావ్యసనేన, మ్లానేన్ద్రియస్య వినష్టేన్ద్రియపాటవ్య, భోగినః సర్పస్య, ముఖే, స్వయమేవదైవవశా, న్నిపతితః తతోఽసౌ భోగీ, తత్పిశితేన మూషకమాంసేన, తృప్తస్సన్, తేనైవ పథా వివరేణ, సత్వరం శీఘ్రం, యాతః బహిర్నిర్గత్య పలాయితః, హే జనా ఇతి శేషః, స్వస్థాః స్థిరచిత్తాస్సన్తః, తిష్ఠత, కుతః? వృద్ధౌ క్షయే చ దైవమేవ, పర ముత్కృష్టం, కారణం, హి, నత్వన్య, దతో మూషకభోగిదృష్టాన్తేన స్వస్థైర్భావ్యం, న తు వృథా పౌరుషైరితి భావః.

టీ. ఆఖుః=ఎలుక, నక్తం=రాత్రిలో, వివరం = (పాముబుట్టలోనికి) బొక్కను, కృత్వా=చేసికొని, భగ్నఆశస్య = భంగమొందిన (తప్పించుకొనిపోదుననెడి) యాశగలది కనుకనే, కరండపిండితతనోః=బుట్టలో చుట్టచుట్టఁబడిన శరీరముగలదై, క్షుధా=ఆఁకలిచేత, మ్లా..స్య - మ్లాన=వాడిన, ఇంద్రియస్య = ఇంద్రియములుగలదై (ఉన్న,) భోగినః = త్రాఁచుఁబాముయొక్క, ముఖే=నోటిలో, స్వయమేవ = తనంతటనే, నిపతితః = పడినది; (పిదప) అసౌ=ఈపాము, తత్పిశితేన=ఆదాని (ఎలుకయొక్క) మాంసముచే, తృప్తఃసన్= కడుపునిండినదై, తేనపథాఏవ = ఆదారినే (అనఁగా: ఎలుక చేసినబొక్కగుండనే); సత్వరం=వడివడిగా, యాతః = పోయినది, స్వస్థాః తిష్ఠత = నెమ్మదిగానుండుఁడు; హి = ఏలనఁగా; వృద్ధౌ=మేలునందును, క్షయే = కీడునందును, దైవంఏవ = అదృష్టమే, పరం = అతిశయమైన, కారణం = కారణము.

తా. ఒకరాత్రియందు ఆహారార్థము యెలుక ఒకపెట్టెకు రంధ్రము చేసి అందులో దూరెను. అంతకుమున్ను ఒకపాము ఆపెట్టె యందుండెను. ఇరకటమువలన దానిదేహము ముద్దయి బయటికివెళ్లుట ఇఁక లేదని నిశ్చయించుకొని ఆఁకలిచేత ఇంద్రియపాటవము దప్పి కృశించుచుండెను. ఆయెలుక లోనికి ప్రవేశింపఁగానే సర్పము దానిని భుజించి ఆయెలుకచేసిన రంధ్రమునుండి బయటికి పాఱిపోయెను. కావున వృద్ధి క్షయములకు దైవమే కారణము. మీరు నెమ్మదిగ నుండుఁడు.

ఉ. రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాస చెడి ◊ పెద్దయు డస్సినపామువాత సం
పాతముఁ జెందె దానిఁ దిని ◊ పాము దొలంగె బిలంబుత్రోవనే
యేతఱి హానివృద్ధులను ◊ నెక్కటి దైవము కారణం బగున్.

అవ. దైవమును నమ్మినవానికిని నమ్మనివానికిని గలుగు దశను వర్ణించుచున్నాడు:—

శ్లో. యథా కన్దుకపాతేనోత్పతత్యార్యః పతన్నపి,
తథా త్వనార్యః పతతి మృత్పిణ్డపతనం యథా. 83

వ్యా.— అథదైవాయత్తికతదన్యయోరవస్థామాహ—యథేతి.—ఆర్యో దైవాయత్తికః, పతన్నపి కుతశ్చిత్కారణాన్నీచైర్భవన్నపి, కన్దుకపాతేన దృష్టాన్తేన, యథోత్పతత్యుచ్ఛ్రియం ప్రాప్నోతి, తథా తద్వదేవ అనార్యః మృత్పిణ్డపతనం యథా సాన్ద్రమృత్కపాల మివ 'ఇవ వద్వా యథాశబ్దా' వితి దణ్డ్యాచార్యానుశాసనాత్, పతతి నిలీనో భవతీత్యర్థః.

టీ. (ఆర్యః=దైవమును నమ్మిన) సత్పురుషుఁడు, పతన్ అపి = (ఏదోకారణము వలన) పడుచు (తగ్గుచు)న్నను, కందుకపాతేన = చెండుపాటుగా, ఉత్ పతతి = పైకి ఎగయును. తథా = అట్లే, అనార్యఃతు (దైవమును నమ్మని) దుష్టుఁడన్ననో, మృత్పిండ పతనం యథా = బంకమట్టిముద్దపాటువలెనే, పతతి = పడును.

తా. చెండు క్రిందఁబడి మరల లేచునట్లు సజ్జనుఁడు హీనస్థితి నందినను వెంటనే ఉన్నతస్థితి నందును. మంటిముద్ద క్రిందఁబడి యట్లే యుండునట్లు దుర్జనుఁడు హీనస్థితినందిన యట్లే యుండును.

క. కందుకమువోలె సుజనుఁడు
క్రిందం బడి మగుడ మీఁది ◊ కిన్నెగయుఁ జుమీ

మందుఁడు మృత్పిండమువలెఁ
గ్రిందం బడి యడఁగి యుండుఁ గీ కృపణత్వమునన్.

అవ. దైవబలము లేనివాని కెక్కడను సుఖము గలుగ దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఖర్వాటో దివసేశ్వరస్య కిరణైః సంతాపితే మస్తకే
వాఞ్ఛన్దేశమనాతపం విధివశాత్తాలస్య మూలం గతః,
తత్రాప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః
ప్రాయో గచ్ఛతి యత్ర దైవహతక స్తత్రైవ యాన్త్యాపదః. 84

వ్యా.—దైవోపహతస్య న కుత్రాపి సుఖప్రాప్తిరిత్యాహ—ఖర్వాట ఇతి.—ఖర్వాటః స్వభావలుప్తలోమశిరస్కః- ఆన్ధ్రభాషాయాం 'బట్టతలవాఁడు.' మస్తకే నిజశిరసి, దివసేశ్వరస్య సూర్యస్య, కిరణైః స్సంతాపితే సతి, అనాతపమాతపశూన్యం దేశం ప్రతి, ద్రుతగతిః శీఘ్రగమనః, గచ్ఛన్, తాలస్య తాళవృక్షస్య, మూలం గతః తాళాధస్తాత్స్థితి, తత్ర తాళమూలేఽపి, పతతా వృన్తాద్గళతా, మహాఫలేన పృథులతరఫలేన. అస్య ఖర్వాటస్య శిరః, స్వశిరశ్శబ్దేన పటపటాయమానేన సహితం, సశబ్దం యథా తథా, భగ్నం విదళితం, నను కుత ఏత దిత్యాశఙ్క్య దైవప్రాతికూల్యా దిత్యాహ—దైవహతకో దైవోపహతః దైవానుగ్రహశూన్య ఇత్యర్థః, యత్ర యస్మిన్ దేశే గచ్ఛతి-యం దేశముద్దిశ్య గచ్ఛతి, తత్ర తముద్దిశ్య, వాపద ఉపద్రవా అపి, ప్రాయో భూమ్నా, యాన్తి; తదేతన్మశకభయాద్గ్రామం విహాయ గచ్ఛతోఽరణ్యే వ్యాఘ్రగ్రహణమభూదిత్యర్థః, శార్దూలవిక్రీడితమ్.

టీ. ఖర్వాటః = బట్టతలవాఁడు, దివసేశ్వరస్య = సూర్యునియొక్క, కిరణైః=కిరణములచేత; మస్తకే = (బట్ట) తల, సంతాపితే = మిక్కిలి కాఁచఁబడఁగా, అనాతపం = ఎండలేని, దేశం = చోటును, వాంఛన్ = కోరుచు, విధివశాత్ = దైవవశమువలన, తాలస్య=తాటిచెట్టుయొక్క,మూలం=మొదటిని, గతః=పొందినవాఁడై,తత్ర అపి=అచ్చటనైతము, పతతా=పడుచున్న, మహాఫలేన = పెద్దపండుచేత, అస్య=వీనియొక్క, శిరః = తల, సశబ్దం = (ఫళ్లని) ధ్వనితోఁగూడునట్లు, భగ్నం = పగులఁగొట్టఁబడినది, దైవహతకః=దైవముచేఁ గొట్టఁబడినవాఁడు, యత్ర=ఎచ్చటికి, గచ్ఛతి=పోవునో, తత్ర ఏవ = అచ్చటికే, ఆపదః = ఆపదలు, ప్రాయః = తఱుచుగా, యాంతి = పోవును.

తా. బట్టతలవాఁ డొకఁడు మధ్యాహ్న కాల సూర్యునివేడిమిచేత తనతల మాఁడుచుండుటకుఁ దాళఁజాలక నీడగలప్రదేశమును

కోరి తాటిచెట్టు క్రిందికిఁ బోయెను. దైవికముగ అప్పు డాచెట్టునుండి యొకపండు వానితలమీఁదఁ బడి వానితల పటపటమని బ్రద్దలయ్యెను. దైవబలముచాలనివాఁ డెచటికిఁ బోయినను అచటికే ఆపదలన్నియుఁ బోవును.

మ. ధర ఖర్వాటుఁ డొకండు సూర్యకరసంతప్తప్రధానాంగుఁ డై
త్వరతో డగ్గ బరువెత్తి చేరి నిలిచెన్ ౯ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ
బొరి దైవోపహతుండు వోవుకడకుం ౯ బోవుంగదా యాపదల్.

అవ. దైవమె యన్నిటికన్న బలీయ మనుచున్నాఁడు:—

శ్లో. గజభుజఙ్గ విహఙ్గమబన్ధనం శశిదివాకరయోర్గ్రహపీడనమ్,
మతిమతాం చ విలోక్య దరిద్రతాం విధిరహో బలవానితి మేమతిః.

వ్యా.—అతో దైవమేవ బలీయ ఇతిమమ మతిః ప్రవర్తత ఇత్యాహ-గజేతి.— అయం స్పష్టార్థః. యతోఽత్యన్త దుర్గ్రహాణాం గజాదీనాం బన్ధనం, జగత్ప్రకాశకయోః సూర్యాచన్ద్రమసోః రాహుగ్రహపీడనం, మతిమతాం ప్రాజ్ఞానాం, దరిద్రతామకించనత్వం చ, విలోక్య దృష్ట్వాఽపి, అహో ఆశ్చర్యమ్; అతస్సర్వస్యాపి దైవబలీయస్త్వం మన్యే, దైవమేవ మూలమితి తాత్పర్యమ్. ద్రుతవిలమ్బితమ్.

టీ. గజ...ధనం-గజ=ఏనుఁగులకు, భుజంగమ=పాములకు, విహంగమ=పక్షులకు, బంధనం = కట్టును, శశిదివాకరయోః = చంద్రసూర్యులకు, గ్రహపీడనం = (చంద్రునకు రాహువు, సూర్యునకు కేతువు) గ్రహపీడయు, మతిమతాం=బుద్ధిమంతులకు, దరిద్రతాం=పేదఱికమును, విలోక్య = చూచి, (చూడఁగా ననుట) అహో=ఔరా; విధిః=దైవము, బలవాన్ = బలీయము, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = తలంపు.

తా. బంధింపశక్యముగాని గజసర్పవిహంగములయొక్క బంధనమును, సూర్యచంద్రాదులకుఁ గల గ్రహపీడయు, బుద్ధిమంతులకు దరిద్రమును చూడ నామనంబునకు దైవప్రభావము బలవత్తర మని నా యభిప్రాయము.

తే. ఫణులు గజములుఁ బక్షులుఁ ౯ బట్టువడుట
రవిసుధాకరులకు నైన ౯ రాహుబాధ

బుద్ధిమంతులలేమియుఁ జూచి
విధి బలాఢ్యుఁడటంచు భావింతు మదిని.

అవ. గుణవంతుల నల్పాయువులను జేయుట బ్రహ్మయొక్క మూఢత్వ మను చున్నాఁడు:—

శ్లో. సృజతి తావద శేషగుణాకరం పురుషరత్నమలఙ్కరణం భువః,
తదపి తత్క్షణభఙ్గి కరోతి చేదహహ కష్టమపణ్డితతా విధేః. ౪౨

వ్యా.—ఏవం చేద్విధేరప్యజ్ఞతా స్యాదిత్యాశయేనాహ—సృజతీతి.—విధి, రశేషగుణాకరం సకల సద్గుణాశ్రయం, భువోఽలంకరణం మణ్డనం, పురుషరత్నం పురుష శ్రేష్ఠం, సృజతి తావన్నిర్మాతి ఖలు, తతః కిమత ఆహ—తదపి తథాఽపి సృజన్నపీత్యర్థః. తత్పురుషరత్నం, క్షణభఙ్గి క్షణమాత్రేణ భఙ్గురం నశ్వరమిత్యర్థః. కరోతి చేత్, విధే, రపణ్డితతా మౌఢ్యం, అహహ కష్ట మతి కృచ్ఛ్రమితి విషాదాతిశయాభిద్యోతకమహహేతి; కరోతి చేత్తత్పాణ్డిత్యమేవేత్యర్థః, తథా తాదృశపురుషరత్నస్య క్షణభఙ్గిత్వేనైవ నిర్మాణాత్తు అపణ్డిత ఏవ విధిరితి పరమరహస్యమ్: ద్రుతవిలమ్బితమ్.

టీ. (విధిః=బ్రహ్మ) అశేష...కరం-అశేష = సమస్తములైన, గుణ=గుణములకు, ఆకరం = గనియును, భువః = భూమికి, అలంకరణం = అలంకారమునగు, పురుషరత్నం = పురుషోత్తముని, సృజతి తావత్ = పుట్టించునుగదా! తత్ అపి = అట్లయినను (అట్లు పుట్టించియు), తత్ = ఆపురుషోత్తముని, క్షణభంగి=క్షణములో చచ్చువానినిగా, కరోతి చేత్ = చేయునేని, విధేః=బ్రహ్మయొక్క, అపండితతా = తెలివిలేమి, ఆహహ = అయ్యయ్యో, కష్టం = దుఃఖకరము.

తా. దైవము సకల సద్గుణ సంపన్నుఁడును భూమికి అలంకారుఁడును అగు పురుషవర్యుని నిర్మించియు వెంటనే వానిని నశింపఁజేయు చున్నది. అయ్యయో దీనికిఁ దెలివిలేదు గదా!

క. గుణమణిఖని యగుపూరుష
మణి ధరణికి రచనముగ నమర్చినవిధి యా
గుణవంతుని వెసఁ దునిమిన
గుణహీనునిఁ గాఁగ నెన్నుకొనరే ధాతన్.

అవ. ఎంతవాఁడైనసరే పాడువిధిని దప్పించుకొనలేఁ డనుచున్నాఁడు:—

శ్లో. అయమమృతనిధానం నాయకో౾ప్యోషధీనాం
శతభిషగనుయాతః శమ్భుమూర్ధ్నో౾వతంసః,
విరహయతి న చైనం రాజయక్ష్మా శశాఙ్కం
హతవిధిపరిపాకః కేన వా లఙ్ఘనీయః. 87

వ్యా—కథంచిదపి దైవయోగో న లఙ్ఘ్య ఇత్యాహ—అయమితి.—అయం పరిదృశ్యమానశ్చన్ద్రః, అమృతస్య నిధానం స్థానమితి, ఓషధీనాం సంజీవిన్యాదీనాం, నాయకో నేతా౾పి; శతభిషజా నక్షత్రేణ - శతేన భిషగ్భిర్వైద్యై - శ్చానుయాతో౾నుసృతో౾పి, కిం బహునా శమ్భోస్సకలలోకక్షేమఙ్కరస్య శంకరస్య, మూర్ధ్నో౾వతంసశ్శిరోభూషణ, మప్యేవముక్తవిశేషణవిశిష్టం శశాఙ్కం, రాజయక్ష్మా క్షయరోగో, న విరహయతి న త్యజతి ఖలు, అతో హతవిధేర్నష్టదైవస్య పరిపాకో నియోగః, కేన వా పుంసా, లఙ్ఘనీయో న కేనా౾పీత్యర్థః; హ తేతి నిర్వేదానుసంధానార్థకః, రాజయక్ష్మేత్యత్ర రాజ్ఞశ్చన్ద్రస్య యక్ష్మా - రాజా చాసౌ యక్ష్మేతి వా విగ్రహః, యథాహ బాహటః—

'అనేకరోగానుగతో బహురోగపురోగమః,
రాజయక్ష్మా క్షయో౾శేషరోగరాడితి చ స్మృతః.' ఇతి.

టీ. అయం = ఇతఁడు (చంద్రుఁడు), అమృతనిదానం = అమృతమునకునిధి, ఓషధీనాం=సంజీవని మొదలగు (మందు) మొక్కలకు, నాయకఃఅపి = ప్రభువుకూడను; శత...యాతః-శతభిషక్ = నూఱుమంది వైద్యులచే, అనుయాతః = అనుసరింపఁబడిన వాఁడు(శతభిషఙ్నక్షత్రముచే వెంబడింపఁబడినవాఁడనివాస్తవికార్థము);శంభుమూర్ధ్నః = శివునితలకు, అవతంసః = భూషణము; కించ = అయినను, ఏవం = ఈ, శశాంకం = చంద్రుని, రాజయక్ష్మా=క్షయరోగము, నవిరహయతి=వదలదు, హత...పాకః-హతవిధి= పాడుదైవముయొక్క, పరిపాకః=పరిపాకము, కేనవా లంఘనీయః = ఎవనిచే దాఁటవల నగును.

తా. ఈకనంబడు చంద్రుఁడు అమృతమునకు స్థానము. సకలౌషధులకు రాజు. నూర్గురు వైద్యులు వెంటనే యుందురు. జగత్పరిపాలకుఁడగు శివునికిఁ దాను స్వయముగ నలంకారము. ఇట్టి చంద్రుని సైతము క్షయరోగము బాధించుచున్నది. దైవవిధి దాఁటుటకు ఎవఁడును సమర్థుఁడు కాఁడు.

చ. శతభిషగాత్ముఁడుగ్ సతతశీతంభువతంసము నయ్యు నోషధీ
తతులకు నాథుఁ డయ్యును సుధారససేవధి యయ్యుఁ దారకా
పతి దనరాజయక్ష్మభవబాధలఁ బాపఁగ నోపఁ డక్కటా
హతవిధికృత్య మెవ్వనికి నైన జగంబున దాఁటవచ్చునే.

అవ. ఆపదలు దైవాధీనము లనుచున్నాఁడు:—

శ్లో. ప్రియసఖ విపద్దణ్డాఘాతప్రపాతపరమ్పరా
పరిచయబలే చిన్తాచక్రే నిధాయ విధిః ఖలః,
మృదమివ బలాత్పిణ్డీకృత్య ప్రగల్భకులాలవ
ద్భ్రమయతి మనో నో జానీమః కిమత్ర విధాస్యతి. 88

వ్యా. —మనోనియన్తాఽప్యయమేవేతి సఖాయం సంబోధయతి—ప్రియ ఇతి.- ప్రియశ్చాసౌ సఖా చ ప్రియసఖః - తస్య సంబుద్ధిః - హే ప్రియసఖ *'రాజాహస్సఖిభ్యష్టచ్' ఖల శ్చాసౌఽయం విధిః. ప్రగల్భకులాలేన తుల్యం ప్రగల్భకులాలవత్ ప్రౌఢకుమ్భకార ఇవేత్యర్థః. * 'తేన తుల్యం క్రియా చేద్వతి రి' తి వతిః, మనో మదీయచిత్తం, మృదం మృత్తికా, మివ, బలాత్సామర్థ్యాత్, పిణ్డీకృత్య కపాలీకృత్య, విపదః ఆపదః - దణ్డాఘాతాః ముద్గరఘట్టనానీవ - తేషాం - ప్రపాతానాం చ-యా పరమ్పరా పౌనఃపున్యేనావృత్తిః - తస్యాః యః పరిచయస్సంస్తరో నిబిడావయవపరస్పరసన్నివేశశ్చ స ఏవ-బలం దార్ఢ్యం యస్య తస్మిన్, చిన్తా చక్రమివ తస్మి, న్నిధాయ భ్రమయతి, అత్ర భ్రమణే, కిం విధాస్యతి కిం కరిష్యతి వా, నో జానీమః, కులాలస్తు ఘటం కరిష్యత్యయం తు కిం విధాస్యతి న జానీమ ఇత్యర్థః.

టీ. ప్రియసఖ=ప్రియమిత్రమా, ఖలఃవిధిః = చెడ్డదైవము, ప్రగల్భకులాలవత్ = నేర్పరియగు కుమ్మరివలె, మనః = (నా) మనస్సును, మృదంఇవ - మట్టినివలె, బలాత్ = బలముతో (చేతికొలఁది), పిండీకృత్య = ముద్దచేసి, విపత్ ...బలే-విపత్ = ఆపదలనెడి, దండ = కఱ్ఱలయొక్క, ఆఘాత = దెబ్బలయొక్క, ప్రపాత = పాటులయొక్క, పరంపరా=వరుసలయొక్క, పరిచయ = అభ్యాసమనెడి, బలే = బలముగలదగు, చింతా చక్రే = చింతయనెడి సారెయందు, నిధాయ = పడవేసి, భ్రమయతి=త్రిప్పుచున్నది. అత్ర=ఇందు (త్రిప్పుటయందు), కింవిధాస్యతి=ఏమిచేయునో, న జానీమః = ఎఱుఁగము.

తా. ఈపాపిష్ఠిదైవము గడితేఱిన కుమ్మరివలె నామనస్సును ముద్ద చేసి విపత్తు లనియెడి కొయ్యలచేత నెల్లప్పుడుఁ గొట్టుచు చింత యను

వక్రమునఁ ద్రిప్పుచున్నాఁడు. ఏమిచేయుట కిట్లు చేయుచున్నాఁడో తెలియుట లేదు.

చ. కలితవిపత్తిదండపద కి ఘుట్టనసేయుచు మన్నుకైవడిన్
ఖలుఁడు విధాత పిండితముగా నొనరించి నితాంతచింతయన్
బలితపుసారెపై నిలిపి పాయక డెంకము ద్రిప్పుచున్నవాఁ
డలమి కులాలురీతిఁ దెలియం గలవారమె యేమిసేయునో.

అవ. దైవము గొప్పవారి కొన్నియాపదల గలిగించినను ధైర్యము నెప్పుడును వదల రనుచున్నాఁడు:—

శ్లో. విరమ విరమాయాసాదస్మాద్దురధ్యవసాయతో
విపది మహతాం ధైర్యధ్వంసం యదీక్షితుమీహసే,
అయి జడవిధే కల్పాపాయేఽప్యపేతనిజక్రమాః
కులశిఖరిణః క్షుద్రా నైతే న వా జలరాశయః. 89

వ్యా. ఏవమాపత్పరమ్పరాచరణే మహద్ధైర్యధ్వంసో భవిష్యతీతి న మన్తవ్యమితి విధిమలక్షీకృత్యోపాలభతే—విరమేతి—అయీతి ప్రశ్నే-ని. 'అయి ప్రశ్నానునయయో రి' తి విశ్వః, జడేతి మాన్ద్యే - విధే హే దైవేతి సంబోధనత్రయమ్, అస్మాద్దురధ్యవసాయతో దురాగ్రహాద్య ఆయాసస్తస్మాద్విరమ విరమ ఆభీక్ష్ణ్యేన విరతో భవ * 'నిత్యవీప్సయో రి' త్యాభీక్ష్ణ్యే ద్విరుక్తిః, కోఽసావాయాస ఇత్యాశఙ్క్యాహ—విపది త్వత్కృతాపది, మహతాం మహాత్మనాం ధైర్యధ్వంసం ధీరత్వప్రాస, మీక్షితు, మీహసే కాఙ్క్షసే, యత్ త్వ, మస్మాదాయాసాదితి సంబన్ధః, తస్యాత్యన్తాసంభావితత్వాత్ త్వదాయాసస్యైవావశిష్టత్వాదితి భావః, కుతో వాఽసంభావితత్వమిత్యాశఙ్క్య దృష్టాన్తముఖేన ద్రఢయతి - కల్పాపాయే కల్పాన్తేఽపి అతిసంకటేఽపి కిముతాన్యదేతి భావః. అపేతాః వినష్టాః-నిజక్రమాః స్వమర్యాదాః యేషాం తే తథోక్తాస్సన్తః, ఏతే కులశిఖరిణో మహేన్ద్రాదిసప్తకులాచలా వా, జలరాశయస్సప్తసముద్రా వా, క్షుద్రానీచాః న ఖలు-కిం త్వత్యక్తమర్యాదా ఏవ వర్తన్తే, అతః దృష్టాన్తేన ధీరధైర్యధ్వంసనస్యాతిదుష్కరత్వాత్ త్వదాయాస ఏవావశిష్టో న తు ఫలలాభ ఇతి భావః.

'మహేన్ద్రో మలయస్సహ్యస్సానుమానృక్షపర్వతః,
విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః,
'లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరజలార్ణవాః.' ఇతి.

టీ. అయిజడవిధే = ఓమూఢదైవమా!, విపది = ఆపదయందు, మహతాం=గొప్పవారియొక్క, ధైర్యధ్వంసం = ధైర్యనాశమును, ఈక్షితుం = చూచుటకు, ఈహసే = కోరుచున్నావు, ఇతియత్ = అనునదియేదో, అయాసాత్ = కష్టమైన, అస్మాత్ = ఈ, దురధ్యవసాయతః = చెడ్డపూనికనుండి, విరమవిరమ = విరమింపుము విరమింపుము. ఏతే= ఈ, కులశిఖరిణః (వా) = కులపర్వతములుగాని (మహేంద్రము, మలయము, సహ్యము, సానుమంతము, ఋక్షపర్వతము, వింధ్యము, పారియాత్రము ఇవి కులపర్వతములు.), జలరాశయః( వా=సముద్రములుగాని, కల్పఅపాయేఅపి = కల్పాంతమునందును, అపే... మాః — అపేత = పోయిన, నిజక్రమాః = తమమర్యాదలుగల; క్షుద్రాః = అల్పములు, న = కావు.

తా. ఓ తెలివిలేని దైవమా! మహాత్ములకు ఆపదలను కలిగించి వారిధైర్యమునకు భంగముకలుగఁజేయఁ జూచుచున్నావుగాని ఇది సాధ్యము గాదు. కల్పాంతమునైనను కులపర్వతములు సప్తసముద్రములును తమమేరలుతప్పునట్టి నీచములు కావుకదా?

చ. దొసఁగులు వచ్చువేళ గుణ శౌధుర్యులధైర్యగుణంబు సర్వముం
బస చెడునంచుఁ జూచెదవు శౌపాపుదైవమ యీదురాగ్రహ
వ్యసనము మాను మాను ప్రళ శౌయంబున వీతనిజక్రమంబు లై
ససి సెడ వించుకంతయును శౌసాగరముల్ గులపర్వతంబులున్.

అవ. అన్నిటికిని దైవమే శరణ మనుచున్నాఁడు:—

శ్లో. దైవేన ప్రభుణా స్వయం జగతి యద్యస్య ప్రమాణీకృతం
తత్తస్యోపనమేన్మనాగపి మహాన్నైవాశ్రయః కారణమ్,
సర్వాశాపరిపూరకే జలధరే వర్షత్యపి ప్రత్యహం
సూక్ష్మా ఏవ పతన్తి చాతకముఖే ద్విత్రాః పయోబిన్దవః. 90

వ్యా.—తథాఽపి దైవమేవ శరణమిత్యాహ—దైవేనేతి.—ప్రభుణా సమర్థేన, దైవేన, జగతి లోకే, యస్య పుంసో యద్వస్తు, ప్రమాణీకృతం నిర్దిష్టం, తద్వస్తు తస్యోపనమేత్ సంగచ్ఛేత, మహానాశ్రయో, మనాగీషదపి, నైవ కారణం న సాధనం హి - బహుఫలప్రాప్తావితి శేషః, తత్ర దృష్టాన్తః—సర్వాశాపరిపూరకే సకలలోకమనోరథపరిపూరకే - సకలదిగన్తవ్యాప్తఫలకే వా, జలధరేఽమ్బువాహే * పచాద్యచ్, అహన్యహని ప్రత్యహమ్*'అవ్యయం విభక్తి'త్యాదినా ఽవ్యయీ

భావః-అహ్నశ్చ 'నపుంసకవదన్యతరస్యా' మితి సమాసాన్తః, వర్షతి సత్యపి, చాతకస్య స్తోకకపక్షిణో, ముఖే చఞ్చూపుటే, సూక్ష్మా అణవ ఏవ, తథాఽపి ద్వౌవా త్రయోవా, ద్విత్రా ఏవ * 'సంఖ్యయావ్యయాసన్నే' త్యాదినా బహువ్రీహిః * 'బహువ్రీహౌ సంఖ్యేయే డజబహుగణా' దితి డచ్ ప్రత్యయః, పయోబిన్దవో జలకణాః, పతన్తి - న త్వాశ్రయమహత్తయా బహుఫలలాభ, స్తత్రాపి దైవస్యైవ నియన్తృత్వాదితి భావః. తస్మాత్సర్వథా దైవమేవ శరణమితి తాత్పర్యమ్. ని. 'స్తోకక శ్చాతకస్సమౌ' ఇత్యమరః.

టీ. ప్రభుణా=సమర్థమగు, దైవేన = దైవముచే, జగతి = లోకములో, యస్య= ఎవనికి, యత్=ఏది, ప్రమాణీకృతం=ఏర్పఱుపఁబడినదో, తస్య = వానికి, తత్ = అది, స్వయం=తనంతట, ఉపనమేత్=దొరకును, మహాన్ = గొప్ప, ఆశ్రయః = ఆధారము, మనాక్ అపి = కొంచెమైనను, కారణం = హేతువు, నైవ = కానేకాదు; (ఎట్లన:) సర్వా . రకే-సర్వ = అందఱియొక్క, ఆశా = కోరికలను, పరిపూరకే = నెరవేర్చునట్టి, (సర్వఆశా=అన్ని దిక్కులను, పరిపూరకే = నిండించునట్టి, అని యర్థాంతరము.) జలధరే = మేఘము, ప్రత్యహం=ప్రతిదినము, వర్షతిసతిఅపి = వర్షించుచున్నను, చాతకస్య=వాన కోయిలయొక్క, ముఖే = నోటియందు, సూక్ష్మాః = చిన్నవి, ద్విత్రాః=రెండుమూఁడు, పయఃబిందవః = నీటిబొట్లు, తపన్తి = పడును.

తా. ఎవని కెంత యని దైవము నిర్ణయించునో అయ్యది వానికి తనంతటనే దొరకును. దీనికై ఒకరి నాశ్రయింప నక్కఱ లేదు. నలు దిక్కుల వ్యాపించి మేఘము ప్రత్యహము వర్షించుచున్నను చాతకము నోటియందు సూక్ష్మబిందువులు రెండో మూఁడో పడునుగాని ఎక్కువ పడవు గదా ?

తే. ఎవ్వనికి నిజ్జగంబున నెంతఫలము
దైవకృత మగునది వొందుఁ దప్ప కతనిఁ
గారణము గాదు వెనుఁబ్రాపు ఘనునిఁ జేరు
చాతకమువాతఁ బడు నల్పజలకణములు.

ఇది నీతిశతకమునందు దైవపద్ధతివర్ణన మను
తొమ్మిదవదశకము.

---

## కర్మపద్ధతి

అవ. సర్వము దైవాధీన మని దైవపద్ధతిని ముగించినపిదప ఆదైవము సైతము కర్మాధీనముగనే యున్న దని నిరూపించుచు దైవముకన్నను కర్మయే గొప్పదనుచున్నాఁడు-

శ్లో. నమస్యామో దేవాన్నను హతవిధే స్తేఽపి వశగా
విధిర్వన్ద్యః సోఽపి ప్రతినియతకర్మైకఫలదః,
ఫలం కర్మాయత్తం కిమమరగణైః కిం చ విధినా
నమ స్తత్కర్మభ్యో విధిరపి న యేభ్యః ప్రభవతి. 91

వ్యా. యదుక్తం దైవేన ప్రభుణేత్యాదిసందర్భేణ దైవస్యైవాత్యన్తావశ్యకత్వం, తస్యాపి కర్మనియమ్యత్వేనాస్వాతన్త్ర్యాదిత్యాశయేన దైవపద్ధతినిరూపణానన్తర్యేణ కర్మపద్ధతిం నిరూపయిష్యం, స్తత్రాపి సర్వదేవనియామకత్వే విధే—స్తన్నియామకత్వేన కర్మణః ప్రాబల్యమితి పరమ్పరామనువిదధాతి—నమస్యామ ఇతి—దేవానిన్ద్రాదీ, న్నమస్యామోఽభివాదయామః, న త్వేకాన్తతయై తేషామేవాభివాద్యత్వ, మేతన్నియామకస్య కస్యచిద్విధేః విద్యమానత్వాత్, సోఽప్యభివాద్య ఏవేత్యాశయేనాహ—తే దేవా అపి హతోయో విధిర్భ్రష్టో తస్య, వశగా నను నియమ్యాః ఖలు-అతో విధిరపి వన్ద్యః న త్వస్యాపి స్వాతన్త్ర్యమిత్యాహ—సోఽపి విధిరపి, ప్రతినియతం యత్కర్మణ ఏకం ఫలం తద్దదాతీతి తథోక్తః-యత్ఫలం కర్మణః ప్రతినియతం తత్ప్రదో న తు స్వతన్త్ర ఇత్యర్థః, తథా చ ఫలం కర్మాయత్తం యది కర్మాధీనం చే, దపరైః దేవైః కిం, విధినా చ కిం న కించిదపీత్యర్థః-తస్యైవ ఫలదానస్వామ్యాదితి భావః, తత్తస్మాత్కర్మభ్యోజ్యోతిష్టోమతపోదానాదిరూపేభ్యోనమః, యతః విధిరపి, యేభ్యః కర్మభ్యో, న ప్రభవతి న సమర్థో భవతి-స్వాతన్త్ర్యేణ ప్రవృత్తేరభావాదితి భావః.

అత్ర పూర్వపూర్వస్యోత్తరోత్తరం ప్రత్యుత్కర్షావహత్వాన్మాలాదీపకాఖ్యోఽలంకారః-తల్లక్షణం తూక్తమ్.

టీ. దేవాన్ = దేవతలను, నమస్యామః = నమస్కరించుచున్నాను. (అయినను) తేఅపి = వారుసైతము, హతవిధేః = పాడుదైవమునకు, వశగాఃనను=స్వాధీనులుసుమా ! (కాబట్టి) విధిః = దైవము, వంద్యః = కొనియాడఁదగినది. (కాని) సఃఅపి = ఆదైవము సైతము, ప్రతి...దః - ప్రతినియత = నిర్ణయింపఁబడిన, కర్మ = కర్మముయొక్క, ఏక= ముఖ్యమయిన, ఫల=ఫలమును, దః=ఇచ్చునది, ఫలం = ఫలము, కర్మఆయత్తం = కర్మకు

అధీనమైనది; (కావున) అమరగణైః కిం = దేవతాసమూహములతో నేమి? విధినాచ కిం = దైవముతోడను (బని) యేమి? తత్ = కాఁబట్టి, యేభ్యః=ఏకర్మములపై, విధిరపి= దైవముకయితము, న ప్రభవతి = చాలదో, కర్మభ్యః = (ఆ) కర్మములకు, నమః = నమస్కారము.

తా. దేవతలకు నమస్కారము. వారు సైతము పాడుదైవమునకు లోఁబడినవారుగాన దైవమునకు మ్రొక్కెదను. ఆదైవము కర్మానుసారముగ ఫలము నిచ్చును గాన కర్మకు నమస్కారము. ఫలము కర్మాధీనము గావున దేవతలతోడను దైవముతోడను మాకేమి దేవతలచేత దాఁట శక్యముగాని కర్మమునకే మ్రొక్కెదను

చ. శిథిలత లేనిభక్తి నతి ৷ సేయుదు వేల్పుల కాసుపర్వులుఁ
విధివశవర్తు లావిధియు ৷ విశ్రుతకర్మఫల ప్రదాత య
య్యధికఫలంబు కర్మవశ ৷ మట్లగుటం బనియేమి వారిచే
విధి కధికంబు గర్మ మని ৷ వేమఱు మ్రొక్కి భజింతుఁ గర్మమున్.

అవ. కర్మముయొక్క ప్రాధాన్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. బ్రహ్మా యేన కులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే
విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసఙ్కటే
రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే. ౯2

వ్యా. యదుక్తం విధిరపి న యేభ్యః ప్రభవతీతి తత్ప్రపఞ్చయతి-బ్రహ్మేతి.— యేన కర్మణా కర్త్రా బ్రహ్మా చతుర్ముఖో, బ్రహ్మాండమేవ భాణ్డం - తస్యోదరే, కులాలేన కుమ్భకారేణ తుల్యం కులాలవ, న్నియమితః వివిధవస్తు నిర్మాణకర్మ ణ్యేవ నియోజితః, యేన విష్ణుః కుక్షిస్థాఖిలభువనోఽపి, మహా సంకటేఽతి కృచ్ఛ్రతరే, దశావతారా ఏవ గహనమరణ్యాని-తత్ర క్షిప్తో నిర్దిష్టః, యేన కర్మణా, రుద్రో మృత్యుఞ్జయోఽపీతి భావః, కపాలం బ్రహ్మశిర ఏవ - పాణిపుటకే కరతలస్థభిక్షాహరణోచితభాజనం తత్ర, భిక్షాటనం సేవతే; కపాలస్థభిక్షాన్నం భుఙ్క్త ఇత్యర్థః, కిం చ యేన సూర్యోఽపి సకలలోకప్రకాశకోఽపీతి భావః, నియమిత ఇతి శేషః, గగనేఽన్తరిక్షే నిత్యమేవ న తు క్షణమాత్రమపి విశ్రమావకాశ, ఇతి భావః, భ్రామ్యతి పరివర్తతే. * 'వా భ్రాశ' త్యాదినా వికల్పాత్ శ్యన్ప్రత్యయః, తస్మై సకలనియన్త్రే కర్మణే నమః - తథాభూతస్యైవాభివాదనాచిత్యా దితి భావః.

టీ. యేన=దేని (కర్మ)చేత, బ్రహ్మా=బ్రహ్మ, బ్రహ్మా...దరే=బ్రహ్మాండ=బ్రహ్మాండము లనెడు, భాండ = కుండలయొక్క, ఉదరే = లోపల, కులాలవత్ = కుమ్మరివలె, నియమితః = ఆజ్ఞాపింపఁబడెనో, యేన, విష్ణుః = విష్ణువు, మహాసంకటే = గొప్పగొప్పయిఱుకటమైన, దశ...గహనే-దశఅవతార = పదియవతారములనెడి, గహనే = అరణ్యములో, క్షిప్తః=త్రోయఁబడెనో, యేన, రుద్రః=శివుఁడు, కపాలపాణిపుటకే = తలపుఱ్ఱె యనెడి పంచపాత్రయందు, భిక్షాటనం = బిచ్చమునకుఁ దిరుగుట, సేవతే=చేయుచున్నాఁడో, (యేన) సూర్యః=సూర్యుఁడు, గగనే=ఆకాశమునందు, నిత్యం=ఎల్లప్పుడును, భ్రామ్యతి=సుడియునో, తస్మై = ఆ, కర్మణే = కర్మమునకు, నమః = మ్రొక్కు.

తా. బ్రహ్మ దేనిచేతఁ గుండవలె నుండు బ్రహ్మాండమధ్యమున నుండ నియోగింపఁబడెనో, దేనిచేత విష్ణువు పదియవతారము లెత్తుట యను కష్టమునకుఁ బాల్పడెనో రుద్రుఁడు దేనిచేత పుఱ్ఱెను పాత్రగా గొని బిచ్చగాఁడై దిరిగెనో, దేనిచేత సూర్యుఁడు ఆకాశమున సర్వదా తిరుగుచుండెనో అట్టికర్మకు నమస్కారము.

చ. నలువ కులాలుభంగి నలి నప్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతారవననిష్ఠితుఁ డయ్యెఁ మురారి దేనిచేఁ
బెలుచఁ గపాలహస్తుఁ డయి భిక్షుకుఁ డయ్యెఁ బురారి దేనిచే
నల రవి దేనిచేఁ దిరుగు నాఘునకర్మము వంద్యమే కదా.

అవ. కర్మము సకలనియామక మగుటవలన దాని నమస్కరించి, సకలశ్రేయములకు నిదాన మగుట నయ్యది యవశ్య మాచరింపఁదగిన దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః
ప్రత్యక్షం కురుతే పరోక్షమమృతం హాలాహలం తత్క్షణాత్,
తామారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాఞ్ఛితం
హేసాధో వ్యసనైర్గుణేషు విపులేష్వాస్థాం వృథా మాకృథాః. 93

వ్యా.—ఏవం శ్లోకద్వయేన సకలనియామకత్వకథన పూర్వకమభివాదనీయతోపయోగాత్కర్మాభివాద్య సంప్రతి బహుశ్రేయోహేతుత్వాత్తస్యోపాదేయతామాహ—యేతి.—యా సత్క్రియా ఖలాంశ్చ దుర్జనానపి, సాధూన్కరోతి, మూర్ఖానజ్ఞానినోఽపి, విదుషః పణ్డితాన్, కరోతి, ద్వేషిణోఽపి, హితాం సుహృదః, కరోతి, పరోక్ష మతీన్ద్రియమపి వస్తు, ప్రత్యక్షమిన్ద్రియగోచరం, కురుతే, తథా, హాలాహలం విషమపి, తత్క్షణాత్సద్య ఏ, వామృతం కరోతి - తాదృశసామర్థ్య

ంభవాదితి భావః, అతః హే సాధో సజ్జన నిపుణేతి వా-'సాధుస్సమర్థో నిపుణో' వే తి
ాళికాయాం, వాఞ్ఛితమభిలషితం, ఫలం భోక్తుమిచ్ఛసి చేదితి శేషః, భగవతీం తాం,
త్క్రియాం సత్కర్మారాధయ-తస్యాః అశేషఫలదాయకత్వాదితి భావః,కిం తు వ్యసనై
ర్విపులేష్వాపద్భూయిష్ఠేషు, గుణేషు, రజస్తమః ప్రభృతిషు వృథాప్యర్థ,మాస్థామాసక్తిం,
ాకృథా మా విధేహి, తస్యాః క్లేశైకఫలకత్వాదితి భావః, కరోతేర్లుఙ్.*నమాఙ్యోగ
త్యట్ ప్రతిషేధః.

అత్ర ఖలాదీనాం సాధుత్వాదికగణాశక్యవస్తుకరణరూపో విశేషాలంకారః.

టీ. యా=ఏది (సత్క్రియ), తత్ క్షణాత్=అనిమిషముననే, ఖలాన్ చ=దుష్టు
ను సైతము, సాధూన్=మంచివారినిఁగా, కరోతి=చేయునో, మూర్ఖాన్ = తెలివిలేని
ారిని, విదుషః=పండితులనుగా, (కరోతి), ద్వేషిణః = శత్రువులను, హితాన్ = స్నేహి
ులనుగా, (కరోతి), పరోక్షం=ఎదుట కనఁబడనిదానిని, ప్రత్యక్షం = ఎదుటఁగనఁబడు
దానిఁగా, (కరోతి), తాం = ఆ, సత్క్రియాం భగవతీం = సత్క్రియ యనెడి దేవతను,
హేసాధో=ఓసజ్జనుఁడా! వాంఛితం = కోరిన, ఫలం = ఫలమును, భోక్తుం = అనుభవించు
ఁటకు, ఆరాధయ=పూజింపుము. వ్యసనైః=ఆపదలచే, విపులేషు-గొప్పవియగు, గుణేషు=
ుణములయందు, ఆస్థాం=ఆసక్తిని, మాకృథాః=చేయకుము.

తా. ఓయినేర్పరీ! నీవు కోరినకోర్కెలను పొందఁ దలఁచితివేని
దుర్జనుల సజ్జనులుగను, మూర్ఖుని విద్వాంసునిగను, శత్రువుల మిత్రులు
గను, ఇంద్రియాగోచరమును గోచరించుదానిగను, విషము నమృతము
గను, జేయఁజాలినసత్కర్మము నారాధింపుము, ఇతర విషయములకయి
పాటుపడకుము.

మ. ఖలునిన్ సజ్జనుఁ గాఁగ మూర్ఖజను సంశ్లాఘ్యవంతునిం గాఁగ దా
యల సన్మిత్రులఁగా నగోచరముఁ బ్రత్యక్షంబుగాఁ బ్రాణహృ
త్కలనం బైనమహావిషం బమృతముం గాఁ జేయు సత్కర్మము
జ్జ్వలనిష్ఠానిధివై భజింపుము వయస్యా వాంఛితార్థాప్తికిన్.

అవ. వృద్ధిక్షయములు గూడ కర్మాధీనములే కాన పుణ్యకర్మను జేసికొను మని
యుపదేశించుచున్నాఁడు:—

శ్లో. శుభ్రం సద్మ సవిభ్రమా యువతయః శ్వేతాతపత్రోజ్జ్వలా
లక్ష్మీరిత్యనుభూయతే చిరమను స్యూతే శుభే కర్మణి,

విచ్ఛిన్నే నితరామనఙ్గకలహక్రీడాత్రుటత్తన్తుకం
ముక్తాజాలమివ ప్రయాతి ఝటితి భ్రశ్యద్దిశోఽదృశ్యతామ్. 94

వ్యా.—వృద్ధిహాన్యోరప్యేతన్మూలకత్వమేవేత్యాహ—శుభ్రమితి.—చిరం చిరకాలమారభ్యానుస్యూతేఽనువర్తమానేఽపి*'షివు తన్తుసంతానే'ఇతి ధాతోః కర్తరి క్తః. *'చ్ఛ్వోశ్శూడనునాసికే చే' తి ఊఠి యణాదేశః, శుభే కర్మణి పురాకృతవిశేషే సంభవతి సతీత్యర్థః, శుభ్రం సద్మ సౌధాదికం, సవిభ్రమాస్సవిలాసా, యువతయస్తరుణ్యః, శ్వేతాతపత్రేణైకశ్వేతచ్ఛత్రేణోజ్జ్వలా,లక్ష్మీరాజ్యశ్రీరిత్యేతదఖిలమిత్యర్థః, అనుభూయతేఽనుభుజ్యతే, జన్మాన్తరీయఫలహేతుత్వాత్తస్యేతి భావః, విచ్ఛిన్నే శుభకర్మణి వినష్టే సతి, నితరామతిశయేన, అనఙ్గకలహో రతిరణస్స ఏవ క్రీడా కేళిస్తయా హేతునా త్రుటన్ ఛిద్యమానస్తన్తుర్యస్య తత్తథోక్తం *శేషే కప్రత్యయః, ముక్తాజాలమివ భ్రశ్యత్సత్, సద్మాదికమితి శేషః, ఝటితి ద్రాగ్దిశో యాతి, 'యత్ర యత్ర స్థితం గేహే తత్ర తత్ర వినశ్యతీ' తి న్యాయాదితి భావః, దృశ్యతాం విలోక్యతామిత్యర్థః. అన్వయవ్యతిరేకాభ్యాం వృద్ధిహాన్యోరస్యైవ కారణత్వం ద్రష్టవ్యమితి భావః.

టీ. శుభేకర్మణి = మంచికర్మము (పూర్వజన్మమునందలి కర్మ ననుసరించిన యదృష్టవిశేషము), చిరం=బహుకాలము, అనుస్యూతేసతి = కూడగ్రుచ్చఁబడినదిగాఁగా (అనఁగా: ఈజన్మమునఁ దన ననుసరించివచ్చునెడల), శుభ్రం = పరిశుభ్రమైన, సద్మ = ఇల్లు, సవిభ్రమాః=విలాసములతోఁ గూడిన, యువతయః = స్త్రీలు, శ్వేతా...జ్జ్వలా - శ్వేత ఆతపత్ర = తెల్లగొడుగుచేత, ఉజ్జ్వలా = ప్రకాశించు, లక్ష్మీః = సంపదయు, (అనఁగా: తెల్లగొడుగు రాజచిహ్నముగను ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలు రాజ్యలక్ష్మి యని భావము.) ఇతి = అనునది, (శుభ్రంసద్మ ఇత్యాదు లనుట) అనుభూయతే = అనుభవింపఁబడుచున్నది. విచ్ఛిన్నేసతి = (ఆశుభకర్మము) తెగిపోఁగా (నశింపఁగా), నితరాం = మిక్కిలి, అనంగ...న్తుకం-అనంగకలహ=మన్మథయుద్ధ (కతినరతి) క్రీడచేత, త్రుటత్ = తెగుచున్న, తంతుకం=దారముగల, ముక్తాజాలమివ = ముత్తెపుముత్తమువలె, (ఆమంచి యిల్లు మొదలగునవి) ఝటితి = వెంటనె, దిశః = దిక్కులకు, భ్రశ్యత్ = చెదరిపోయి, అదృశ్యతాం=కనఁబడకుండుటను, ప్రయాతి=పొందుచున్నది.

తా. మంచికర్మ యుండునేని, మంచిమేడలు, విలాసవతులగు జవ్వనులును, ఏకచ్ఛత్రాధిపత్యముగల రాజ్యలక్ష్మియు నివి మొదలగునవి కలుగును. ఆసత్కర్మతొలఁగునేని మేడలు మొదలగు సకల సంపదలు

ఁతికేళియందు తెగినముత్యాలపేరులోని ముత్యములవలె నలుగడలఁ జెదరిపోవును.

వ. లలితనికేతనప్రియవి ॥ లాసవతీధవళాతపత్రస
ద్విశాలసితవైభవం బనుభ ॥ వింపఁబడుఁ సుకృతానువృత్తిచేఁ
జెలువగుపుణ్యకర్మము న ॥ శించిన నంగజసంగరత్రుట
త్కలితగుణోరుమౌక్తికని ॥ కాయములట్లు దొలంగు సంపదల్.

అవ. ఏపని చేసినను ముందుగా దానిపర్యవసానమును గనుఁగొని చేయవలయును గాని తొందరపడి చేయఁగూడ దనుచున్నాఁడు:—

శ్లో. గుణవదగుణవద్వా కుర్వతా కార్యమాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పణ్డితేన,
అతిరభసకృతానాం కర్మణామావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః. 95

వ్యా.— అథేష్టామాచరణప్రకారమాహ— గుణవదితి.— గుణవద్గుణయుక్తఁగుణవద్గుణరహితం, వా యత్కార్యజాతం త, త్కుర్వతాఽనుతిష్ఠతా, ఽనేన, పణ్డితేన పరిజ్ఞాత్రా, పరిణతిః పరిపాకావస్థా, యత్నతః అతిప్రయత్నేన - సావధానేనేతి యావత్, అవధార్యాఽనుసంధేయా, యత్నత ఏవ కర్మజాతమారబ్ధవ్యం సమాలోచ్య పరిణతిపర్యన్తమిత్యర్థః, అన్యథాఽనర్థమాహ—అతిరభసకృతానాం సహసాఽనుష్ఠితానాం, కర్మణాం గుణవతాం వేతి శేషః, ఆవిపత్తేర్నివృత్తిపర్యన్తం * కల్పాదాజో సమాసః - వి పూర్వాత్పద్యతేర్నివృత్త్యర్థత్వముపసర్గవశా-ద్ధాతూనామనేకార్థత్వాదిత్యవగన్తవ్యం, హృదయదాహీ మనస్సంతాపకారీ, కుత? శ్శల్యతుల్యః శల్యప్రాయో, విపాకః పరిపాకదశా, భవతి; అతస్సావధానేనైవ కర్మజాతమారమ్భణీయం, తథాభూతస్యైవ చిత్తసమాధాయకత్వాదితి భావః.

టీ. గుణవత్ (వా) = గుణముగలది (గాని), అగుణవత్ = గుణములేనిదిగాని, కార్యం = (ఒకానొక)పనిని, కుర్వతా=చేయునట్టి, పండితేన=వివేకిచేత, పరిణతిః = పరిపాకము, ఆదౌ = మొదట, యత్నతః = పూనికతో, అవధార్యా = ఆలోచింపఁదగినది, లేదేని యనర్థము వచ్చు ననుచున్నాఁడు.—)అతి... తానాం - అతిరభస = మిక్కిలి తొందరతో, కృతానాం=చేయఁబడిన, కర్మణాం=పనులకు, ఆవిపత్తేః = (తాను) చచ్చుఁ దనుక, శల్యతుల్యః = ములికితోఁ బోలినదై, హృదయదాహీ = మనస్సును గాల్చునట్టి, విపాకః = విపరీతఫలము, భవతి = కలుగును.

తా. పండితుఁడగువాఁడు మంచిదో చెడ్డదో యగు నొకకార్యము చేయఁ బూనునేని ప్రయత్నముగ నాలోచింపవలయును. అట్లుగాక అతిత్వరగ ఆలోచింపక చేసినకార్యములయొక్క ఫలితము మరణపర్యంతము శల్యమువలె బాధించును.

తే. సగుణనిర్గుణ కార్యముల్ ♦ సలుపు సుమతి
సేత పరిణతిఁ గడుఁ బ్రతీ ♦ క్షింపఁ దగును
బరుషకర్మవిపాకంబు ♦ ఫలముదనుక
హృదయము దహించు శల్యంబు ♦ రీతి జగతి.

అవ. కర్మభూమిని బుట్టియుఁ గర్మ నాచరింపనినరుఁడు పరమమూఢుఁ డను చున్నాఁడు:

శ్లో. స్థాల్యాం వైదూర్యమయ్యాం పచతి తిలఖలం చాన్దనై రిన్ధనౌఘైః
సౌవర్ణైర్లాఙ్గలాగ్రైర్విలిఖతి వసుధామర్కతూలస్య హేతోః,
ఛిత్త్వా కర్పూరఖణ్డాన్ వృతిమిహ కురుతే కోద్రవాణాం సమన్తాత్
ప్రాప్యేమాంకర్మభూమిం న భజతి మనుజో య స్తపో మన్దభాగ్యః.

వ్యా.—అతస్సత్కర్మానుష్ఠాతుః దుర్మేధస్కతామాహ—స్థాల్యామితి.—సమనుజః ఇహ లోకే - విదూరాత్ప్రభవతి వైదూర్యం వాలవాయజమణిః - ని. 'వైదూర్యం వాలవాయజ మి' త్యమరః* 'విదూరాజ్ఞ్యః' ఇతి ఞ్యప్రత్యయః - అత్ర విదూర శబ్దో వాలవాయస్యాదేశః పర్యాయో వాత్రోపచరితో వా - తేన 'వాలవాయాద్గిరే రసౌ ప్రభవతి - న విదూరాన్నగరాత్ - తత్ర సంస్కృతౌ' ఇత్యాక్షేపః ప్రత్యుక్తః-

'వాలవాయో విదూరం చ ప్రకృత్యన్తరమేవ వా,
నవై తత్రేతి చేద్బ్రూయాజ్జిత్వరీవదుపాచరేత్.'

వైదూర్యమయ్యాం వైదూర్యమణివికారాయాం * వికారార్థే మయట్; స్థాల్యాం పాత్రే, చాన్దనైశ్చన్దనతరుసంబన్ధిభి, రిన్ధనౌఘైః కాష్ఠభారైః, తిలఖలం తిలపిష్టం, పచతి, తథా, సౌవర్ణైస్సువర్ణవికారైః, లాఙ్గలాగ్రైః హలముఖైః, రర్కతూలస్య హేతోరర్కాఖ్యవృక్షతూలార్థమిత్యర్థః. *'షష్ఠీ హేతుప్రయోగ' ఇతి షష్ఠీ, వసుధాం భువం, విలిఖతి కర్షతి, తథా కర్పూరఖణ్డాన్ కర్పూరకదళీకాండాం, శ్ఛిత్త్వా, కోద్రవాణాం కోరదూషాఖ్యసస్య విశేషాణాం-ని. 'కోరదూష స్తు కోద్రవ' ఇత్యమరః, సమన్తాత్సర్వతోఽధికమి

త్యర్థః, వృతిమావరణం, కురుతే, కోఽసౌ పీదృశో దుర్భగ ఇత్యాశఙ్కాయామాహ—
ఇమాం కర్మభూమిం కర్మాచరణయోగ్యభూమిం, ప్రాప్య మన్దభాగ్యో మనుజ, స్తప
శ్చాన్ద్రాయణాది, కర్మ, న భజతి న సేవతే, స ఇతి సంబన్ధః; వైదూర్యపాత్రే తిల
పిష్టపచనాదిప్రాయం కర్మ భువ్యస్యాం తపోననుష్ఠాన మిత్యర్థ అతస్సర్వథా సత్కర్మాను
ష్ఠేయం శ్రేయస్కామేనేతి తాత్పర్యమ్.

అత్ర యస్తపో న భజతి స తిలఖలం పచతీత్యాది విశిష్టభజన పచనాద్యో
ర్వాక్యార్థయోర్నిర్దిష్టైకత్వాసంభవాత్సాదృశ్యలక్షణాయామసంభవద్వస్తుసంబన్ధో వాక్యా
ర్థవృత్తిర్నిదర్శనాభేద ఇత్యేతత్సర్వం మూర్ఖపద్ధతౌ వ్యాఖ్యాతమితీహోపరమ్యతే.

టీ. ఇమాం=ఈ, కర్మభూమిం=కర్మలుచేయఁదగిన ప్రదేశమును, ప్రాప్య=పొంది, మందభాగ్యః = అదృష్టహీనుండైన, యః మనుజః = ఏమనుష్యుఁడు, తపః = తపస్సును, న భజతి = చేయఁడో, సః = అతఁడు, వైదూర్యమయ్యాం = వైడూర్యమణులతోఁ జేయఁబడిన, స్థాల్యాం=పాత్రయం, చాందనైః = చందనసంబంధములైన, ఇంధన ఓఘైః= కట్టెలమొత్తముతో, తిలఖలం = తెలికపిండిని, పచతి = వండును; సౌవర్ణైః = బంగారు సంబంధమునైన, లాంగల అగ్రైః=నాఁగేటికఱ్ఱలతో, అర్కతూలస్య హేతోః=జిల్లేడు ప్రత్తినిమిత్తమై, వసుధాం = భూమిని, విలిఖతి=దున్నును; కర్పూరఖండాన్=కర్పూర వృక్షముల బోదెలను, ఛిత్వా=నఱకి, కోద్రవాణాం=అరికపైరుయొక్క, సమంతాత్ = చుట్టును, వృతిం=కంచెను, ఇహ=ఇచట, కురుతే=చేయును.

తా. కర్మభూమి యగు ఈభరతఖండమున జన్మించియు ఎవఁడు తపము నాచరింపఁడో అట్టిభాగ్యహీనుఁడు వైడూర్యమణిచేత నిర్మింపఁబడిన వంటకుండయందు మంచిగంధపుకట్టెలతో తెలికపిండిని వండువానితోడను, జిల్లేడువేరుకొఱకు బంగారునాఁగలితో భూమిని దున్నువానితోడను, కర్పూరపుటరంటుల నఱికి వానితో అళ్లకు కంచెవేయువానితోడను సమానుఁ డగును.

మ. చెలు వారత్నఘటంబునం దతఁడు సు శ్రీఖండఖండంబులం
దిలపిణ్యాకము వండె నారుగల క ర్థిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్ జిల్లెడుదూదికై పుడమి దు న్నెన్ బైఁడినాఁగేళ్ల ని
మ్ములఁ గర్మక్షితిఁ బుట్టి యెవ్వఁడు దపం బుల్ సేయఁ డప్రాజ్ఞతన్.

అవ. పుణ్యకర్మమే సఫలముగాని యన్యముగా దనుచున్నాఁడు:—

శ్లో. నైవాకృతిః ఫలతి నైవ కులం న శీలం
విద్యాపి నైవ నచ యత్నకృతాపి సేవా,
భాగ్యాని పూర్వతపసా ఖలు సఞ్చితాని
కాలే ఫలన్తి పురుషస్య యథైవ వృక్షాః. 97

వ్యా. పుణ్యవిశేష ఏవ సఫలం న త్వన్యదిత్యాహ—నేతి.—ఆకృతిరాకారసంపత్తిరేవ, న ఫలతి ఫలకారణం న భవతీత్యర్థః, కులం సద్వంశో వా, నైవ ఫలతి శీలం సత్స్వభావో వా, న ఫలతి, విద్యాఽపి వేదవేదాఙ్గశాస్త్రికాఽపి, నైవ ఫలతి, యత్నకృతా ప్రయత్నానుష్ఠితా, సేవా రాజాదిపరిచర్యా చ, న ఫలతి, కిం తు పూర్వతపసా పురాకృతసుకృతేన సంచితాని సంపాదితాని, పురుషస్య సమ్బన్ధీని, భాగ్యాని, వృక్షా యథా వృక్షా ఇవేత్యర్థః - 'ఇవవద్వా యథా శబ్దా వి'తి దణ్డ్యాచార్యాను శాసనాత్, కాలే పరిపాకసమయ ఏవ, ఫలన్తి ఖలు, తపోజనితభాగ్యవిశేషవ్యతిరేకేణ ఫలజనకం న కించి దస్తీత్యర్థః.

టీ. ఆకృతిః = రూపము (చక్కఁదనము), న ఏవ ఫలతి = ఫలింపనే ఫలింపదు. కులం = (మంచి)జాతియు, నైవ (ఫలతి), శీలం=(మంచి) నడవడియు, న (ఏవఫలతి), విద్యా అపి=చదువుగూడ, నైవ (ఫలతి), యత్నకృతా = పూనికతోఁ జేయఁబడిన, సేవా అపి=కొలువును, నచ (ఏవఫలతి), (ఇంక నే మన:) పూర్వతపసా=మునుపటి తపస్సుచే, సంచితాని = కూడఁబెట్టఁబడిన, పురుషస్య = మనుజునియొక్క, భాగ్యాని = పుణ్యములు, వృక్షాః యథా=చెట్లువలె, కాలే ఏవ = (పరిపాక)సమయమునందే, ఫలంతి ఖలు=ఫలించుచున్నవి గదా?

తా. పురుషునకు ఆకారముగాని కులముగాని స్వభావముగాని విద్యగాని ప్రయత్నపూర్వకముగ చేసినసేవగాని ఫలము నొసంగవు. పూర్వకృతమయినతపస్సువలనఁ గలిగినభాగ్యమే వృక్షములవలె కాలమునకు ఫలము నొసంగును.

తే. రమ్యరూపంబు విద్యయు ॥ రాజసేవ
కులము శీలంబుఁ జాలవు ॥ ఫల మొసంగఁ
బూర్వపుణ్యసంచితభాగ్య ॥ ములు ఫలించుఁ
గాలమునఁ బనసాదివృ ॥ క్షముల కరణి.

శ్లో. మజ్జత్వమ్భసి యాతు మేరుశిఖరం శత్రూన్ జయత్వాహవే
వాణిజ్యం కృషిసేవనాది సకలా విద్యాః కలాః శిక్షతామ్,
ఆకాశం విపులం ప్రయాతు ఖగవత్కృత్వా ప్రయత్నం పరం
నాభావ్యం భవతీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కుతః?  98

వ్యా.—సర్వథాఽపి భావ్యభావినోరావశ్యకత్వం కర్మవశాదేవేత్యాహ— మజ్జత్వితి. అమ్భసి, మజ్జతు మగ్నో భవతు - జలస్తమ్భాదినేతి భావః; మేరుశిఖరం, యాతు గచ్ఛతు - యోగానుసంధానాదినేతి భావః, ఆహవే యుద్ధే, శత్రూన్ జయతు, వాణిజ్యం క్రయవిక్రయాది, కృషిః కర్షణం - సేవనం - పరిచర్యా-దౌత్యాది నేతి భావః-తే కృషిసేవనే చ-తథా సకలాః సమస్తాః, విద్యాః వేదవేదాఙ్గాదయః-

'అఙ్గాని వేదాశ్చత్వారో మీమాంసాన్యాయవిస్తరః,
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతాశ్చతుర్దశ.'

ఇత్యేతాశ్చతుర్దశవిద్యాః, కలా ఇతిహాసాగమప్రభృతీశ్చతుష్షష్టికలాః శిక్షతామ్ అభ్యస్యతు, తథా, పరముత్కృష్టం, ప్రయత్నం పాదుకాసిద్ధ్యాత్మకం, కృత్వా ఖగవత్పక్షివత్ తుల్యం, విపులమాకాశం ప్రయాతు, తథాఽపి కర్మవశతో ధర్మాధర్మాత్మకకర్మవశాదిహాస్మిన్ లోకే, అభావ్యమభావి, ఫలం న భవతి, తథా భావ్యస్యావశ్యమ్భావినః ఫలస్య, నాశః కుతః? తస్య బ్రహ్మణాఽపి నివారయితుమశక్యత్వాత్ - యద్భావి తద్భవత్యేవ యదభావి న తద్భవే దితి న్యాయాదితి భావః. అత్రామ్భోమజ్జనాదీనాం చతుష్షష్టికలాస్వేవాన్తర్భూతత్వమవగన్తవ్యం, తాశ్చ కలా మదీయ శృఙ్గాటకే సంఖ్యాతాస్తత్రైవ ద్రష్టవ్యా ఇతీహోపరమ్యతే.

టీ. (పురుషుఁడు), అంభసి=నీటియందు, మజ్జతు = మునుఁగునుగాక! మేరుశిఖరం=మేరువుసెత్తమును, యాతు=పోవుఁగాక! ఆహవే=యుద్ధమునందు: శత్రూన్ = శత్రువులను, జయతు=గెలుచునుగాక! వాణిజ్యం = వర్తకమును, కృషిసేవనేచ=సేద్యమును కొలువును, సకలాః=సమస్తములైన, విద్యాః = (వేదమున్నగు) చదువులను, కలాః = (ఇతిహాసాది) చతుష్షష్టికళలను, శిక్షతాం = నేర్చునుగాక! పరం = గొప్ప, ప్రయత్నం=ప్రయత్నమును, కృత్వా=చేసి ఖగవత్=పక్షివలె, విపులం=విశాలమైన, ఆకాశం=ఆకాశమునుగూర్చి, ప్రయాతు = పోవుఁగాక! (ఏపని చేసినను) భాగ్యవశతః= పుణ్యవశమువలన, ఇహ=ఈలోకమందు, అభావ్యం=కలుగఁదగనిది, న భవతి=కలుగదు. భావ్యస్య=కలుగవలసినదానికి, నాశః=నాశము, కుతః=ఎక్కడిది?

తా. వర్తకముచేయుట, పైరుపెట్టుట, కొలువుకొలుచుట మొదలగు పనులెన్ని చేసినను, ఎన్నివిద్యలు నేర్చినను, ఎంతకష్టపడినను

అదృష్టము లేక యేమాత్రఫలమును గలుగదు, మంచి యదృష్టము గలిగినయెడల వానికి ఫలము గలుగనీయక యడ్డపడుటకు నెవరికిని సాధ్యము గాదు.

చ. సలిలముఁ జొచ్చినం గనక । శైలముఁ జేరిన వైరివీరులం
గెలిచిన రాజసేవఁ దిల । కించిన వేదము లభ్యసించినం
గళలెఱుం గెఱింగిన ఖ । గత్వము దాల్చినఁ గర్మనిఘ్నుతా
కలన నభావ్య మైన పని । గాదు వినాశము లేదు భావికిన్.

అవ. ఆపదలయందు సైతము పూర్వపుణ్యమే రక్షించు ననుచున్నాఁడు:—

శ్లో. వనే రణే శత్రుజలాగ్నిమధ్యే మహార్ణవే పర్వతమస్తకే వా,
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా రక్షన్తి పుణ్యాని పురాకృతాని.

వ్యా.—అతిసంకటస్థస్యాపి ప్రాచీనపుణ్యసద్భావే తు న క్షతిరిత్యాహ—వన ఇతి.—అయం తు స్పష్టార్థః.

టీ. వనే=అడవియందు, రణే=యుద్ధమునందు, శత్రు...మధ్యే-శత్రు = పగవారియొక్కయు, జల=నీటియొక్కయు, అగ్ని=నిప్పుయొక్కయు, మధ్యే=నడుమను, మహార్ణవే=పెద్దసముద్రమునను, పర్వత మస్తకేవా=కొండశిఖరమునఁగాని, సుప్తం = నిద్రించువానిని, ప్రమత్తం=ఒడలు దెలియనివానిని, విషమస్థితంవా = ఆపదలయందున్న వానినిగాని, పురాకృతాని = పూర్వమందుఁ జేయఁబడిన, పుణ్యాని = పుణ్యములు, రక్షంతి=రక్షించును.

తా. పురుషుని అడవియందును, యుద్ధమునందును, శత్రువుల మధ్యను, నీళ్లలోను, నిప్పునను, మహాసముద్రమునను, కొండచివరను, నిదురలోను, కైపులోను, అపాయమునను పురాకృతసుకృతములు కాపాడును.

క. కాననమున రణమున సలి, లానలరిపుమధ్యమున మ । హాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తునిద్రితుఁ, బూనికతోఁ బూర్వపుణ్య । ము లరక్షించున్.

అవ. వేయేల? పుణ్యవంతుఁ డెచ్చటనేని సర్వసౌఖ్యముల నొందుచున్నాఁడు.—

శ్లో. భీమం వనం భవతి తస్య పురం ప్రధానం
సర్వో జనః సుజనతాముపయాతి తస్య,
కృత్స్నా చ భూర్భవతి సన్నిధిరత్నపూర్ణా
యస్యాస్తి పూర్వసుకృతం విపులం నరస్య. 100

వ్యా.—కిం బహునా, సుకృతినస్తావత్సర్వమప్యానుకూల్యమేవ ప్రయాస్తీతి నిగమయతి.—భీమమితి.—యస్య పుంసః, భీమం హింస్రాదిప్రాచుర్యేణ భయఙ్కరం, వనమరణ్యానీ కర్తౄ, ప్రధానం నియతం, పురం, భవతి, తద్వదశేషభోగసాధనం భవతీత్యర్థః, తస్య సర్వోఽశేషోఽపి, జనః, స్వజనతాం కింకరతాం, ముపయాతి, తస్య కృత్స్నా చతుస్సముద్రాన్తా, భూః,సన్నిధిభిస్సమీచీనైః రత్నైశ్శర్మశఙ్ఖపద్మాదినవనిధానైర్ని క్షేపైర్వా-రత్నైః శ్రేష్ఠవస్తుభిశ్చ - పూర్ణా భవతి, సమస్తఫలాని ప్రసూత ఇత్యర్థః, కస్యేత్యత ఆహ—యస్య, నరస్య, విపులం బహుళం, పూర్వసుకృతం పురాకృతసత్కర్మ సంజాతం పుణ్యం,మస్తి వర్తతే తస్యేతి సంబన్ధః, అతస్సత్కర్మాచరణతత్పరేణైవ భవితవ్యం శ్రేయస్కామేనేతి సందర్భాభిప్రాయః.

టీ. యస్య=ఏ, నరస్య - పురుషునకు, విపులం = విస్తారమైన, పూర్వసుకృతం = పురాకృతపుణ్యము, అస్తి = కలదో, తస్య = అతనికి, భీమం = భయంకరమైన, వనం = అరణ్యము, ప్రధానంపురం = ప్రధానపట్టణము, భవతి=అగును. తస్య = అతనికి, సర్వః జనః = లోకమంతయు, సుజనతాం = సౌజన్యమును, (పాఠాం - స్వజనతాం = బంధుభావమును.) ఉపయాతి=పొందును. కృత్స్నాచ=సమస్తమైన, భూః చ =భూమియు, సన్ని...పూర్ణా-సన్నిధి=మంచినిధులతోడను, రత్న=మణులతోడను, పూర్ణా=నిండినది, భవతి=అగును.

తా. ఎవనికి తొలుత సంపాదింపఁబడిన యనల్పమైన పుణ్య ముండునో, వానికి భయంకరమైన యడవియును భోగార్హ మగునగర మగును. పెఱవారెల్లరును బంధువు లగుదురు. భూమియంతయు రత్నపు గనులతోడను మంచివస్తువులతోడను నిండినదై యుండును.

తే. భువనమునఁ బూర్వసంభృత • పుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచిన • సుగుణనిధికి
వనము పుర మగుఁ బరు లాత్మ • జనము లగుదు
రవని నిధిరత్నపరిపూర్ణ • యయి ఫలించు.

ఇది నీతిశతకమునందు కర్మపద్ధతివర్ణన మను పదపదశకము.

మ. యమునానీలసరోజసౌరభరసవ్యాసంగిభృంగీకులో
పమకంఠద్యుతిలిప్తశేషభుజగప్రాలంబజాంబూనదా
ద్రిమహాకార్ముకరూఢగాఢపదమౌర్వీసంప్రయుక్తత్రివి
క్రమశాతాంబకపాతితాంబరచరక్రవ్యాత్పురాట్టాలకా.

క. సుమనోనాయక సంభృత
సుమనోర్చిత పదబిసప్రసూన భవానీ
సుమనోహార సురనిర్ఝర
సుమనోదామార్ద్ర జటాజూటోద్దేశా.

నీతిశతకము సమాప్తము.



శ్రీ ర స్తు

# భర్తృహరిసుభాషితము

## శృంగారశతకము

అవతారిక. శ్రీమద్రాజర్షిశ్రేష్ఠుఁ డగుభర్తృహరి శృంగారరసానుభవము గూడ నీతిపూర్వకముగాఁ జేయఁదగినదికాని, దానికి విరుద్ధముగాఁ జేయరా దని తెలియఁ జేయుచు, మొదట నీతిబోధకై నీతిశతకమును రచించి పిదప శృంగారరస మనుభూతమై, యనంతరమున వైరాగ్యము గలిగించుటకు హేతు వగు నని యెంచి, మొదట శృంగార శతకమును వర్ణించి తర్వాత వైరాగ్యశతకమును వర్ణింపఁగల నని మనంబున నెంచి, శృంగారశతకమును బ్రారంభింపఁ గోరినవాఁడై శృంగారరసమునకు మన్మథుఁడు ముఖ్యుఁ డగుటవలన మొదట మన్మథనమస్కారరూప మైనమంగళమును జేయుచున్నాఁడు:—

శ్లో. శమ్భుస్స్వయమ్భుహరయో హరిణేక్షణానాం
యేనాక్రియన్త సతతం గృహకర్మదాసాః,
వాచామగోచరచరిత్రవిచిత్రితాయ
తస్మై నమో భగవతే మకరధ్వజాయ. 1

వ్యా.—శంభ్వితి—అత్ర స్వయంభుశబ్దస్య శమ్భుశబ్దవదౌణాదికడుప్రత్యయా న్తత్వమవగన్తవ్యమ్ - న తు * 'భువస్సంజ్ఞాన్తరయోః క్విబి' తి క్విప్ప్రత్యయాన్తత్వమ్ - అన్యథా 'స్వయంభూదేవోఽసా' విత్యాదావివ దీర్ఘప్రసక్తాత్, తథా చ, యేన మకర ధ్వజేన, శమ్భు స్వయమ్భు హరయః హర విరిఞ్చి మురారయః సంహారసృష్టి స్థితి కర్తృత్వేన సకలభువనాధీశ్వరా అపీతి భావః, హరిణేక్షణానాం హరిణవన్మనోహరలోచనానాం పార్వతీ సరస్వతీ శ్రీ దేవీనాం, సతతమ్*'సమోవా హిత తయో రి తి వచనాత్ సమో మకారస్య లోపః, గృహే కుమ్భదాసాః జలకుమ్భభారవాహక భృత్యాః, అక్రియన్త తాసు తాదృశ్మోహముత్పాద్య తథా విధేయాకృతా ఇత్యర్థః, కిముతాన్య ఇతి భావః.*కృఞః కర్మణి లఙ్ తఙ్ -అర్ధనారీశ్వరత్వాచ్చ మోక్షః, స్వయమ్భువశ్చ సరస్వతీ నికేతనీకృతముఖత్వాత్ః హరేర్వక్షఃస్థలస్థాపితలక్ష్మీకత్వాచ్చైవముక్తమిత్యవగన్తవ్యమ్, అత ఏవ, వాచామగోచరమవాఙ్మానసగోచరం - యచ్చరిత్రం మాహాత్మ్యమ్ - తేన విచి

త్రవత్కృతో విచిత్రితః - తస్మై అత్యన్తాశ్చర్యకారకాయేత్యర్థః. ని. 'విస్మయోఽద్భుత మాశ్చర్యం చిత్ర మి'త్యమరః. * విచిత్రశబ్దా 'త్తత్కరోతీ'తి ణ్యన్తాత్కర్మణి క్తః-ణా విష్ఠవద్భావే విస్మితోర్లుక్, భగవతే సకలలోకారాధ్యాయ-యద్వా-చతుర్వ్యూహమధ్య ప్రవిష్టత్వాత్ప్రద్యుమ్నరూపేణ భగవత్పుత్రత్వాద్వా తద్రూపాయేత్యర్థః.

'ఆత్మావై పుత్రనామాసి.'

'పతిర్జాయాం ప్రవిశతి గర్భో భూత్వా స్వమాతరమ్,

తస్యాం పునర్నవో భూత్వా దశమే మాసి జాయత.'

ఇత్యాది శ్రుతేః, తస్మై మకరధ్వజాయ మకరకేతనాయ కామదేవసార్వభౌమాయ, నమః. *'నమస్స్వస్తీ' త్యాదినా చతుర్థీ వసన్తతిలకావృత్తమ్.

టీ. శమ్భుస్వయంభుహరయః = శివ-బ్రహ్మ-విష్ణువులు, యేన=ఎవని (మన్మథుని) చేత, హరిణ ఈక్షణానాం = లేడికన్నులవంటి కన్నులు గలస్త్రీలకు (పార్వతీసరస్వతీ లక్ష్ములకు), సతతం=ఎల్లపుడు, గృహకర్మదాసాః = ఇంటిపని బానిసవాండ్రుగా, అక్రియంత=చేయఁబడిరో, వాచా... తాయ - వాచాం = వాక్కులకు, అగోచర = అందని, చరిత్ర=పనులచేత, విచిత్రితాయ = చిత్రంపఁబడిన, తస్మై=ఆ, మకరధ్వజాయభగవతే= మన్మథదేవునికొఱకు, నమః=దండము.

తా. ఒకటి చేయుటకును, ఒకటిచేయకుండుటకును, చేసినదానిని మఱియొక్కవిధంబుగాఁ జేయుటకును జాలినవార లయినను, బ్రహ్మవిష్ణు శివులను ఏ మన్మథుఁడు మృగాక్షులగు కాంతలయొక్క పనివాండ్రనుగా నెల్లప్పుడు చేసెనో అట్టి యనిర్వాచ్య మైన వింత యగు చరిత్ర గలవాఁడు గనుక నైశ్వర్యవంతుఁ డగు పూవిల్తునికి నమస్కారము. (అని కృతికర్త మన్మథునికి నమస్కారము గావించెను. ఈశ్వరుఁడు పార్వతిని తనయర్ధాంగమున నుంచుకొని యుండుటచేతను, విష్ణువు లక్ష్మినిఁ దనఱొమ్మునసే దాల్చియున్నఁడు గనుక, బ్రహ్మ సరస్వతిని తన వాక్కునందే యుంచుకొనియుండుటచేతను ఈప్రకారము వర్ణింపఁ బడినది.)

ఉ. శంకరపద్మగర్భమురశాసనులన్ భువనేశులన్ నిరా
తంకధృతిన్ మృగాక్షులకు దాసులఁ జేసినమేటికిం గురం
గాంకవసంతమిత్రునకు నంజలిఁ జేసెద వాగతీతని
శ్శంకచరిత్రచిత్రునకు షడ్గుణహారికి శంబరారికిన్.

## స్త్రీ ప్ర శం స

అవ. ఆలంబనవిభావము లగు స్త్రీపురుషులలో స్త్రీలు ప్రధాన లగుటవలన బందొమ్మిదిశ్లోకములతో స్త్రీప్రశంసను జేయఁబూని మొదట స్త్రీలు చిఱునగవు మొదలగు వానిచేఁ బురుషులను వశపఱచుకొందు రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. స్మితేన భావేన చ లజ్జయా భియా
పరాఙ్ముఖై రర్ధకటాక్షవీక్షణైః,
వచోభిరీర్ష్యాకలహేన లీలయా
సమస్తభావైః ఖలు బన్ధనం స్త్రియః. 2

వ్యా.—తత్ర ఆలమ్బనవిభావయోః స్త్రీపురుషయోర్మధ్యే స్త్రీణాం ప్రశస్తత్వా దేకోనవింశత్యాశ్లోకైః ప్రథమం స్త్రీప్రశంసాం చికీర్షుస్తత్రాదౌ తావత్తాసాం బన్ధనహేతుత్వమాహ— స్మితేనేతి —స్మితేన యౌవనాదిమదవికారజనితాకస్మికమన్దహాసేన- 'ఆకస్మికం తు హసితం యౌవనాదివికారజమి'తి వచనాత్ - బాల్య యౌవన సంధావుత్పన్నః శృఙ్గారవిషయః ప్రథమాన్తఃకరణవికారో భావస్తేన చ - తదుక్తం—

చిత్తస్య వికృతిః సత్త్వం వికృతేః కారణే సతి,
తతోఽల్పా వికృతిర్భావో 'బీజ స్యాదివికారవత్.' ఇతి-

'హావేనే' తి పాఠే 'ఈషద్దృష్టవికారాస్స్యాద్భావో హావః ప్రకీర్తితః' ఇత్యుక్తలక్షణేన చేష్టావిశేషేణ చ, లజ్జయా కుచకుమ్భదోర్మూలాచ్ఛాదనవదనవినమనదరనిమీలితనయనత్వానుభావక మనస్సంకోచనరూప వ్రీడయా చ -'చేతస్సంకోచనం వ్రీడానఙ్గరాగస్తవాదిభి రి' తి లక్షణాత్, భియా, ఆకస్మికభయజనితత్రాసేనేత్యర్థః. తదుక్తమ్— 'ఆకస్మికభయాచ్చిత్తక్షోభస్త్రాసః ప్రకీర్తితః' ఇతి, లజ్జయా గుణైరి'తి పాఠే ఆసామేవాలమ్బనభూతానాం రూపయౌవనాదిగుణైరిత్యర్థః - 'ఆలమ్బనగుణోరూప యౌవనాదిరుదాహృతః' ఇత్యుక్తత్వాత్, పరాఙ్ముఖైః హ్రియార్ధాస్ఫుటప్రాసాదిభి రిత్యర్థః అర్ధకటాక్షవీక్షణైః అసమగ్రాపాఙ్గావలోకనైశ్చ-కటాక్షలక్షణంతు-సంగీతరత్నాకరే—

'యద్గతాగతవిశ్రాన్తవైచిత్ర్యేణ వివర్తనమ్,
తారకాయాః కళాభిజ్ఞాస్తత్ కటాక్షం ప్రచక్షతే.' ఇతి-

వచోభిశ్శుకకోకిలమధురతరమృదులాలాపైశ్చ, ఈర్ష్యయా పరోత్కర్షాసహనరూపాసూయయా,—యః కలహస్తేన చ- పరోత్కర్షాసహిష్ణుత్వ మీర్ష్యాం ప్రాహుర్మనీషి

ణః' ఇతి లక్షణాత్-యద్వా-ఈర్ష్యయా కలహేన ప్రణయకలహేన చేతి ద్వన్ద్వైకవద్భావః.*'సర్వో ద్వన్ద్వో విభాషైకవద్భవతీ' త్యనుశాసనాత్, లీలయా వాగాదిభిః ప్రియానుకరణరూపవిలాసవిశేషేణ చ-'లీలా ప్రియానుకరణం వాగ్భిర్గత్యాఽథచేష్టయే' తి లక్షణాత్, కిం బహునా ? సమస్తభావైః స్తమ్భరోమాఞ్చస్వేదాదిసాత్త్వికభావైః హర్షౌత్సుక్యావహిత్థాదిసఞ్చారిభావైశ్చేత్యర్థః, స్త్రియః బన్ధనం ఖలు, పుంసాం సంసారబన్ధహేతవః ఖల్విత్యర్థః, లిఙ్గవచనవ్యత్యయో నిత్యనపుంసకత్వేన జాత్యభిప్రాయేణ చ-'వేదాః ప్రమాణమ్' ఇతి వద్ద్రష్టవ్యః;

అత్ర స్మితకటాక్షాలాపాః అనుభావాః - 'కార్యభూతోఽనుభావస్స్యాత్కటాక్షాదిశ్శరీరజ' ఇత్యుక్తత్వాత్, లజ్జాభయేర్ష్యాః సంచారిభావాః, భావలీలే శృఙ్గారచేష్టావిశేషా, ఇతి ద్రష్టవ్యమ్ - తదుక్తమ్.—

'భావో హావశ్చ హేలా చ మాధుర్యం ధైర్యమిత్యపి.
లీలా విలాసో విచ్ఛిత్తిర్విభ్రమః కిలకిఞ్చితమ్.
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా,
కుతూహలం చ చకితం విహృతం హాస ఇత్యపి.
ఏవం శృఙ్గారచేష్టాస్స్యురష్టాదశవిధా మతాః.' ఇతి-

ఈదృశాన్సాధనసంపన్నానాం స్త్రీణాం బన్ధహేతుత్వం కిం వక్తవ్యమితి భావః. తథా చైతాసాం శృఙ్గారనాయికానాం మధ్యే భావలజ్జాభయవత్యో ముగ్ధాః, స్మితార్ధకటాక్షమధురాలాపవత్యో మధ్యమాః, ఈర్ష్యాకలహలీలావత్యః ప్రౌఢా, శ్చేతి వివేకః.

'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా,
లజ్జామన్మథమధ్యస్థా మధ్యమోదితయౌవనా
స్మరమన్దీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనే' తి.

వంశస్థవృత్తమ్.

టీ. స్మితేన=(యౌవనాదిమదవికారములచే సాకస్మికముగ జనించిన) చిఱునగవుచేత, భావేన=భావముచేతను, (భావ మనఁగా: బాల్యయౌవన దశలసంధిలో మొట్టమొదట శృంగారవిషయమున జనించినమనోవికారము.) లజ్జయా = (స్తనములను బాహుమూలమును గప్పుకొనుట, తలవంచుట, కొంచెముగ కనులుమూయుట మొదలగు చేష్టలచే మనస్సంకోచము గలిగించు) సిగ్గుచేతను, భియా=(అకస్మికమగు) బెదరుచేతను, పరాఙ్ముఖైః = (సిగ్గుచే) పెడమొగమైన, అర్ధకటాక్షవీక్షణైః=సగముక్రేగంటిచూపులచేతను, వచోభిః=(చిలుక కోయిల మున్నగువాని కలకలపుపలుకులవంటి) పలు

కులచేతను, ఈర్ష్యాకలహైవ-ఈర్ష్యా=ఇతరులగొప్పను సహింపమిచేఁ గలిగిన, కలహేన = పోట్లాటచేతను, లీలయా = (ప్రియుని స్వాధీనముచేసికొను) విలాసముచేతను, (వేయేల?) సమస్తభావైః-సమస్తములగు (సాత్త్వికసంచారి) భావములచేతను, స్త్రియః=ఆఁడువాండ్రు, (పురుషులకు) బంధనం ఖలు=కట్టుగదా!

తా. స్త్రీలు చిఱునవ్వులచేతను, చేతులు మొదలగునవి త్రిప్పుట చేతను, సిగ్గుచూపుటచేతను, భయపడుటచేతను, పెడమోము చూపుట చేతను, కడగన్నులు సగముమూసి తెఱచి చూచుటచేతను, మాటల చేతను, పొలయలుకచేతను, సొగసులచేతను, మఱి యనేకచేష్టలచేతను పురుషులను గట్టివేయుదురు.

చ. చెలువపుఁదేటలేనగవు ♦ చేతను భావముచేత సిగ్గుచే
నలువగులీలచేత సుగు ♦ ణంబులచేఁ గడగంటిచూపుచేఁ
గలహముచేత విందు లగు ♦ కందువమాటలచే నసూయచేఁ
బెలుచన నెంతవారి వల ♦ పింతురు కాంతలు పెక్కుభంగులన్.

అవ. స్త్రీలకు కటాక్షాదులు స్వవిషయమున భూషణములుగను, పురుషుల మీఁదికి ఆయుధములవలె నున్నవి యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. భ్రూచాతుర్యాత్ కుఞ్చితాక్షాః కటాక్షాః
స్నిగ్ధా వాచో లజ్జితాన్తాశ్చ హాసాః,
లీలామన్దం ప్రస్థితం చ స్థితం చ
స్త్రీణా మేతద్భూషణం చాయుధం చ. 3

వ్యా.— ఉక్తమర్థం ప్రకారాన్తరేణాహ. భ్రూచాతుర్యాదితి.— భ్రువోః-శ్చాతుర్యాల్లలితాక్షేపవైచిత్ర్యా, త్కుఞ్చితాని కుణీకృతాన్యక్షీణి యేషాం తే తథోక్తాః* 'బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్షచ్' ఇతి షచ్, కటాక్షాః అపాఙ్గేక్షణాని చ, ఏతేన రేచితభ్రుకుట్యాఖ్యౌ వ్యాపారవిశేషావుక్తౌ, తదుక్తమ్—

'స్యాద్భ్రువోర్లలితాక్షేప ఏకస్యా ఏకరేచితమ్,
ద్వయోర్మూలసమక్షేపకౌటిల్యాద్భ్రుకుటిం విదుః.' ఇతి-

స్నిగ్ధాః స్నేహపరిప్లుతా, వాచశ్చ-స్నేహలక్షణం తు-

'విస్రమ్భే పరమాం కాష్ఠామారుఢే దర్శనాదిభిః,
యేనాన్తరఙ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే.' ఇతి-

లజ్జితమ_న్తం యేషాన్తే లజ్జితాన్తా లజ్జావసానా, హాసాశ్చ - తథాభూతహాసానామేవ మోహనత్వాత్-అన్యథా హాస్యరసాపర్యవసానాదితి భావః, లీలామన్దం లీలామధురం, ప్రస్థితం ప్రస్థానమ్ గమనమితి యావత్, స్థితమవస్థానం చేత్యుభయత్రాపి * భావే క్తః, ఇత్యేతత్సర్వం స్త్రీణాం భూషణం చ చాతుర్యాతిశయహేతుత్వాత్, ఆయుధం శస్త్రం చ యువజనవిషయసాధనత్వాదితి భావః.

అత్ర కటాక్షాదీనాం లక్షణాని ప్రాగేవోక్తాని, సంచారలీలాశ్శృఙ్గారచేష్టా, భ్రుకుట్యాదయోఽన్యే అనుభావా ఇతి జ్ఞేయమ్; తథా లీలామన్థరగమనస్య పద్మినీనియత లక్షణాత్వాత్ప్రియేణ తాసాం లజ్జాతిశయత్వం సూచ్యతే...తదుక్తం రతిరహస్యే—

'వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ
త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషా,
మృదు శుచి లఘు భుఙ్క్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసో వల్లభా పద్మినీ స్యాత్."

అత్ర భ్రుకుట్యాదిసముదాయే భూషణత్వాయుధత్వరూపణాద్రూపకాలంకారః, శాలినీవృత్తమ్.

టీ. భ్రూచాతుర్యాత్-భ్రూ=కనుబొమలయొక్క, చాతుర్యాత్ = నేర్పువలన, కుంచి...క్షాః-కుంచిత=కుదింపఁబడిన,అక్షాః=కన్నులుగల, కటాక్షాః=క్రేగంటిచూపులును, స్నిగ్ధాః=అనురాగముతోఁగూడిన, వాచః=మాటలును; లజ్జితాన్తాః=సిగ్గుచే నందములయిన, హాసాః=నవ్వులును, లీలామందం=విలాసముచే (మురువు) మెల్లనైన, ప్రస్థితం=నడకయు, స్థితం చ=నిలుకడయు, ఏతత్=ఇది, స్త్రీణాం = ఆఁడువారికి, భూషణం = అలంకారము, ఆయుధం చ=శస్త్రమును, (అగును.)

తా. కనుబొమలు నేర్పుతో వంచి యరకన్ను పెట్టి కడగంటితోఁ జూచుటయు, తిన్ననిపలుకులును, సిగ్గుతోఁగూడిన చిఱునగవులును, కులుకునడకయు, ముసిముసినగవును స్త్రీలకు స్వభావసిద్ధములైన భూషణంబులుగను, పురుషులను వశపఱచుకొనుట కాయుధములుగను నగుచున్నవి.

తే. భ్రూలతాక్షేపకుంచిత ॥ స్ఫురణఁదాల్చు
కలికిచూపులు నెయ్యంపుఁ ॥ బలుకుఁ దీపు
సిగ్గునగవులు చెన్నగు ॥ చిన్నినడలు
సొమ్ము లాయుధములు ముద్దు ॥ గుమ్మలకును.

అవ. శృంగారరసమున కాధారమైన యతివను ఐదుశ్లోకములచే వర్ణించుచున్నాఁడు:—

శ్లో. క్వచిత్సభ్రూభఙ్గైః క్వచిదపి చ లజ్జాపరిగతైః
క్వచిద్భీతిత్రస్తైః క్వచిదపి చ లీలావిలసితైః,
కుమారీణామేతైర్మదనసుభగైర్నేత్రవలితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకరపరికీర్ణా ఇవ దిశః. 4

వ్యా—అథ శృఙ్గారానుభావదృగ్విలాసాన్ సపరికరం వర్ణయతి—క్వచిదితి— క్వచిత్ కుత్రచిత్, సభ్రూభఙ్గైః భ్రుకుటిరేచితాఖ్యభ్రూవ్యాపారసహితైః, క్వచిదపి చ, లజ్జయా, పరిగతైః ప్రత్యావృత్తైశ్చ, స్వానుకూల్యప్రకాశకైరిత్యర్థః. తదుక్తమ్— 'సవ్రీడాలోకనేనైవ స్వానుకూల్యప్రకాశన' మితి, క్వచిద్భీతిత్రస్తైః, బహుళభయసమ్భ్రాన్తైః, క్వచిదపి చ, లీలాభిర్గతప్రత్యాగతవిలాసవిశేషైర్హేతుభా-విలసితైఃకమనీయైః ఉజ్జ్వలైర్వా, తథా మదనేన - సుభగైర్మనోహరైః విరక్తస్యాపి చిత్తక్షోభకరైరిత్యర్థః. 'యద్దర్శనాద్విరక్తోఽపి క్షుభ్యతే తత్సమన్మథ' మితి లక్షణాత్, ఏతైరుక్తప్రకారైః, కుమారీణాం తరుణీనామ్, ఉత్పలాక్షీణామితి భావః. * 'వయసి ప్రథమే' ఇతి జీప్, నేత్రవలితైర్నయనవిలాసైః, ర్దిశః, స్ఫురతాం వికసితానాం నీలాబ్జానాం నీలోత్పలానాం-ప్రకరైర్నికురుమ్బైః, పరికీర్ణా ఇవ వ్యాకీర్ణా ఇవ, లక్ష్యన్త ఇతి శేషః. ప్రసిద్ధక్రియాధ్యాహారో న దోష ఇత్యాహ వామనః—'లిఙ్గాధ్యాహారా' విత్యత్ర.

అత్ర నయనవిలాసానాం ప్రియజనాదిరమ్యవస్తుదర్శనచాపలం వినా అసమ్భవాత్కుతూహలం నామ శృఙ్గారచేష్టితం సూచ్యతే—'కుతూహలం రమ్యదృష్టౌ చాపలం పరికీర్తిత' మితి లక్షణాత్. భ్రుకుట్యాదీనాం లక్షణం ప్రాగేవోక్తమ్; తథా నయనవలనక్రియయా వికీర్ణత్వక్రియోత్ప్రేక్షణాత్ క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్షా.

'యత్రాన్యదపి సంబన్ధాదన్యత్వేనోపకీర్తితమ్,
ప్రకృతం హి భవేత్ప్రాజ్ఞాస్తాముత్ప్రేక్షాం ప్రచక్షతే'

ఇతి లక్షణాత్; తయా చ నయనానాం నీలోత్పలసామ్యం గమ్యతే. తేన చోపమా వ్యజ్యత ఇత్యలంకారేణాలంకారధ్వనిః. శిఖరిణీవృత్తమ్.

టీ. క్వచిత్ = ఒకచోట, సభ్రూభంగైః = బొమముడిపాటుతోఁగూడినవియు, క్వచిత్ అపిచ = ఇంక నొకచోట, లజ్జాపరిగతైః = సిగ్గును బొందనవియు, క్వచిత్, భీతిత్రస్తైః=భయముచే బెదరినవియు, క్వచిత్ అపిచ, లీలావిలసితైః=విలాసములచే నంద

మైనవియు, మదనసుభగైః = కాలముచే సుందరములగు, కుమారీణాం = లేజవరాండ్ర యొక్క, నేత్రవల్లైః=కనుత్రిప్పులచేత, దిశః=దిక్కులు, స్ఫుర...బ్జానాం-స్ఫురత్ = ప్రూచుచున్న, నీలఅబ్జానాం=నల్లగలువలయొక్క, ప్రకరపరికీర్ణాః ఇవ = మొత్తములచే వెదచల్లఁబడినవివలె, (ఉండును.)

తా. ముద్దరాండ్రు కొన్నిచోట్లఁ గనుబొమలు ముడివెట్టుకొనియు, కొన్నిచోట్ల సిగ్గుచేఁ దలవంచుకొనియుఁ గొన్నితావులం దులికిపడియు, కొన్నిచోటులందుఁ దమసొగసులఁ జూపియు, కొన్నిచోట్ల కమలములంబోలుమోములం జూపియు, కన్నులఁ ద్రిప్పియు నంతట నల్లకలువలు వికసించియున్నవో యనునట్లు చేయుదురు.

ఉ. భ్రూలతికావిభంగయుతశేముల్ సభయంబులు సత్రపంబు లు
ద్వేలవిలాసముల్ మదనదీపనముల్ రుచిరంబులైనకాం
తాలసమాననేత్రవలికతంబులచే దిశలెల్ల విస్ఫుర
న్నీలసరోజపత్త్రములకే నిండె ననం గనుపట్టె నెంతయున్.

అవ. స్త్రీల స్వభావసిద్ధమైనభూషణములఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. వక్త్రం చన్ద్రవికాసి పఙ్కజపరీహాసక్షమే లోచనే
వర్ణః స్వర్ణమపాకరిష్ణురలినీజిష్ణుః కచానాం చయః,
వక్షోజావిభకుమ్భవిభ్రమహరౌ గుర్వీ నితమ్బస్థలీ
వాచాం హారి చ మార్దవం యువతిషు స్వాభావికం మణ్డనమ్, 5

వ్యా.—అథ యదుక్తముద్దీపనవిభావశ్చతుర్విధ ఇతి, తత్ర ప్రథమోద్దిష్టాలమ్బనగుణకథనముత్తరత్ర కరిష్యతి ఇత్యుపేక్ష్య 'స్మితేన' ఇత్యాదిశ్లోకత్రయేణ కాశ్చిచ్ఛృఙ్గారచేష్టాః కేచిదనుభావాః సంచారిణశ్చ వర్ణితాః. ఇదానీం తు తదలంకరణం వివక్షుస్తస్య నైసర్గికాహార్యభేదేన ద్వైవిధ్యాదాహార్యకమనుపదమేవ లక్ష్యత ఇతి మనసి కృత్వా సంప్రతి నైసర్గికం మణ్డనమాహ—వక్త్రమితి—చన్ద్రవద్వికసతి తాచ్ఛీల్యే నేతి చన్ద్రవికాసి సున్దరమిత్యర్థః. *తాచ్ఛీల్యే ణినిః, వక్త్రం వదనం చ, పఙ్కజానాం పద్మానాం పరిహాసక్షమే అవహేళనసమర్థే తత్సదృశీ ఇతి యావత్, లోచనే నయనే, పరీహాసే త్వత్ర * 'ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహుళ' మితి దీర్ఘః,స్వర్ణం చమ్పకపుష్పం * 'పుష్పమూలేషు బహుళమ్' ఇతి లుక్-త దపాకరిష్ణుః తత్సదృశ ఇత్యర్థః. ఏతేన పద్మి

నీత్వం సూచ్యతే-'కాఽపి చామేస్యయగౌ రీ' తి లక్షణాత్, వర్ణో దేహకాన్తిశ్చ, తథా అలినీనాం భృఙ్గాఙ్గనానాం జిష్ణుర్జయశీలః తత్సన్నిభ ఇత్యర్థః.'*గ్లాజిస్థశ్చక్స్న' ఇతి క్స్న ప్రత్యయః, కచానాం చయః కేశపాశశ్చ, ఇభకుమ్భయోర్విభ్రమహరౌ విలాసహారిణౌ, కరివరశిరఃపిణ్డకల్పావిత్యర్థః.- ని. 'కుమ్భౌ తు శిరస పిణ్డౌ వి'త్యమరః, వక్షోజౌ కుచకుమ్భౌ చ, గుర్వీ-దుర్భరా * 'వోతో గుణవచనా ది'తి ఙీష్-నితమ్బస్థలీ కటిపశ్చాద్భాగశ్చ-ని- 'పశ్చా న్నితమ్బః స్త్రీకట్యా' ఇత్యమరః. *'జానపదే' త్యాదినా అకృత్రిమార్థే ఙీష్' హరతీతి హారి మనోహరం * పూర్వవణ్ణినిః, వాచాం, మార్దవం వాఙ్మాధుర్యం మధుర కోమలాలాపశ్చేత్యర్థః. ఏతత్సర్వం, యువతిషు తరుణీషు, స్వాభావికం స్వభావసిద్ధం* "తత ఆగత' ఇతి ఠక్, మణ్డనం తరుణీనామేతన్నైసర్గికాలంకరణమిత్యర్థః.

అత్ర చన్ద్రవికాసీత్యాదిశబ్దాః ప్రాయశస్సాదృశ్యవాచకాః, అత ఏవోపమాలంకారః. తదుక్తమాచార్యదణ్డినా——

'స్పర్ధతే జయతి ద్వేష్టి హాసతీర్ష్యత్యసూయతి
తదన్వేత్యనుబధ్నాతి తచ్ఛీలతి నిషేధతి
తచ్చ వాఽనుకరోతీతి శబ్దాస్సాదృశ్యవాచకాః.' ఇతి.

టీ. చంద్రవికాసి = చంద్రునివలె ప్రకాశించు, వక్త్రం=ముఖమును, పంక... క్షమే-పంకజ = తామరలను, పరిహాస = ఎగతాళిచేయుటయందు, క్షమే = నేర్పుగల, లోచనే=కన్నులును, స్వర్ణం = బంగారును, అపాకరిష్ణుః = త్రోసివేయునట్టి, వర్ణః = (మేని) చాయయు, అలినీజిష్ణుః = ఆఁడుతుమ్మెదలయొక్క (ను) జయించు, కచానాం చయః=కొప్పును, ఇభ...హరౌ-ఇభ = ఏనుఁగులయొక్క, కుంభ = కుంభస్థలముయొక్క విభ్రమ=విలాసమును, హరౌ = అపహరించు, వక్షోజౌ = చనులును, గుర్వీ=గొప్పదగు, నితంబస్థలీ = పిఱుఁదుకట్టును, వాచాం = మాటలయొక్క, హారి = మనోహరమగు, మార్దవంచ=మృదుత్వమును, యువతిషు=జవరాండ్రకు, స్వాభావికం=సహజమైన, మండనం = అలంకారము.

తా. చంద్రమండలముంబోలు మోమును, కమలములను గేలి సేయఁ గలనేత్రములును, బంగారును మించినమేనిసౌరును, తుమ్మెదలను గెల్వఁజాలు కేశసమూహమును, ఏనుఁగుకుంభముల సొంపుమీఱెడి స్తనములును, లావుపిఱుఁదులును మిక్కిలి తిన్ననైన పలుకులును జవరాండ్రకుఁ బుట్టుకతోడ వచ్చెడి యలంకారములు.

ఉ. తమ్ముల నేలుకన్నులు సుధానిధిఁ బోలు మొగంబు మత్తభృం
గమ్ముల గెల్చుకొప్పు కనకద్యుతి మీఱుమెఱుంగు కుంభికుం
భమ్ముల నవ్వు గుబ్బచనుబంతులు గొప్పపిఱుందు తేనియల్
చిమ్మెడుముద్దుఁబల్కులును శ్రీ జేయనిసొమ్ములు సుందరాంగికిన్.

అవ. ముద్దరాలియొక్క సొగసులు రమ్యము లని వర్ణింపుచున్నాఁడు.—

శ్లో. స్మితం కిఞ్చిన్ముగ్ధం సరళతరళో దృష్టివిభవః
పరిస్పన్దో వాచామభినవవిలాసోక్తిసరసః,
గతానామారమ్భః కిసలయితలీలాపరికరః
స్పృశన్త్యాస్తారుణ్యం కిమివ హి న రమ్యం మృగదృశః. 6

వ్యా.—అథాలమ్బనగుణం యౌవనమాహ—స్మితమితి.—స్మితం మన్దహాసః కించిదీషన్ముగ్ధం సున్దరం భవతీతి యథాయోగమధ్యాహార్యమ్. ని. 'ముగ్ధః సున్దరమూఢయోః' ఇత్యమరః, బాల్యయౌవనమధ్యస్థత్వేన తరుణ్యాః ప్రాగల్భ్యభావాత్ స్మితస్యేషన్ముగ్ధత్వముక్తమిత్యవగన్తవ్యమ్. దృష్టివిభవో విలోకనసంపత్తిః, సరళమ్ అకుటిలం యథా తథా తరళశ్చఞ్చలో భవతి, వాచాం పరిస్పన్దో వాగ్వ్యాపారోఽపి అభినవా నూతనా విలాసా యాసాం తా యా ఉక్తయో వచనాని తాభిః సరసో రసయుక్తః రుచిర ఇతి యావత్, భవతి, గతానాం గతీనామ్ *కర్తరిక్తః, ఆరమ్భ ఉపక్రమః, కిసలయితః పల్లవితః * తారకాదిత్వాదితచ్ - లీలాపరికరో విలాససమృద్ధి ర్యస్య తథోక్తః - విలాససంబన్ధబన్ధురో భవతీత్యర్థః. అత స్తారుణ్యం యౌవనం స్పృశన్త్యా మృగదృశ స్తరుణ్యాః సమ్బన్ధి, కిమివ కిం వా, రమ్యం మనోహారం; న హి భవతి, సర్వమపి రమ్య మేవ భవతీత్యర్థః. ఇయం ముగ్ధానాయికా—'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా' ఇతి లక్షణాత్.

అత్ర శ్లోకద్వయే శ్లాఘ్యవిశేషణయోగాదుదాత్తతా నామ గుణః—'శ్లాఘ్యై ర్విశేషణై ర్యోగో యస్యాశ్చ స్యాదుదాత్తతా' ఇతి లక్షణాత్. శిఖరిణీవృత్తమ్.

టీ. స్మితం=చిఱునవ్వు, కించిత్ = కొంచెమును, ముగ్ధం = చక్కనిదియు, దృష్టివిభవః=చూపులసోయగము, సరళతరళః = వంకరలేక మెఱయునది, వాచాం = మాటలయొక్క, పరిస్పందః = వ్యాపారము, అభి...సరసః-అభినవ=క్రొత్త, విలాస = సొంపుగల, ఉక్తి = మాటలచేత, సరసః = రసవంతమైనది; గతానాం=నడకలయొక్క, ఆరంభః =ప్రారంభము, కిస ..కరః-కిసలయిత = చిగిర్చిన (క్రొత్తగా పుట్టిన), లీలా = విలాసములనెడి, పరికరః=పరివారముగలది; తారుణ్యం=యౌవనమును, స్పృశంత్యాః=అందుకొను

చున్న, మృగదృశః = లేడికన్నులవంటి కన్నులుగలది - సుందరిది, కింఇవ=ఏది, రమ్యం= రమణీయమైనది, న హి=కాదు?

తా. మోమునందలి చిఱునగవు, చక్కనైన చంచలదృష్టి, క్రొత్తలైన సరసంపుఁబలుకులు పలుకుట, ఒయ్యారపుటారంభదశ యగు నడకలతీరు, వీనిలోఁ బ్రాయమున నుండు మృగాక్షి కేది రమ్యముగా నుండదు? అన్నియు రమ్యములుగానే యుండును.

ఉ. ఇంచుకముద్దు లేనగవు కెలింపగునవ్యవిలాసనూక్తు ల
భ్యంచితలోలదృష్టియు నవారుణపల్లవమండలంబు ని
ర్మించు సలీలయానములు కేమెలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించుమృగాక్షిచందము లోలిప్రమదంబు ఘటింపఁజాలవే.

అవ. కన్నులు మొదలగు పంచేంద్రియములకును మనస్సనెడి యాఱవయింద్రియమునకును విషయీభూతంబు లగుపదార్థములెల్ల నొకయంగనయందే యున్నవి యని ప్రశ్నోత్తరముగా వర్ణింపఁబడుచున్నది:—

శ్లో. ద్రష్టవ్యేషు కిముత్తమం? మృగదశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యేష్వపి కిం? తదాస్యపవనః శ్రావ్యేషు కిం? తద్వచః,
కిం స్వాద్యేషు? తదోష్ఠపల్లవరసః స్పృశ్యేషు కిం? తద్వపు
ర్ధ్యేయం కిం నవయౌవనే సహృదయైః సర్వత్ర తద్విభ్రమాః. 7

వ్యా.—అథ చక్షుఃప్రభృతిషడింద్రియాణామత్రైవ లోకోత్తరప్రతినియతవిషయా న్వర్ణయతి—ద్రష్టవ్యేష్వితి—అత్ర ప్రశ్నోత్తరమాలికయాఽన్వయః కార్యః. ద్రష్టుం యోగ్యాని ద్రష్టవ్యాని-తేషు దర్శనీయేషు వస్తుషు * యోగ్యార్థే తవ్యత్ప్రత్యయః, ఉత్తమం శ్రేష్ఠం వస్తు కిమితి ప్రశ్నః, ప్రేమప్రసన్నమ్ అనురాగవికసితం ప్రేమదాయీ త్యర్థః 'ద్రవీభూతం మనో యత్ర దర్శనే ప్రేమదాయిని' ఇతి లక్షణాత్, మృగదృశ్యాస్త రుణ్యా, ముఖం వదనమిత్యర్థః ఏవముత్తరత్రాపి - చక్షుఃప్రీతికరత్వాదితి భావః, ఘ్రాత వ్యేషు అఘ్రాతవ్యేషు కిముత్తమమితి ప్రశ్నః, తదాస్యపవనస్తస్యాః తరుణ్యాః-ఆస్యపవనో ముఖమారుతః-తస్యైవ ఘ్రాణతర్పణత్వాదితి భావః - యద్యపి ఘ్రాణేంద్రియవిషయో గన్ధః న తు పవనః-తథాఽపి తస్యాః పద్మినీజాతిత్వాత్తదాస్యపవనే తస్య సఙ్క్రమ ణాత్ పీణాః శ్రూయన్తే-భేర్యః శ్రూయన్తే-పుష్పాణ్యాఘ్రాయన్తే' ఇత్యాదివద్గన్ధసమ్బ న్ధిని పవనే తద్ధర్మస్యోపచరితత్వాన్న విరోధః, శ్రావ్యేషు శ్రోతవ్యేషు-అత్ర * యో

గ్యార్థే యత్ప్రత్యయః - ఏవముత్తరత్రాపి, ఉత్తమం కిమ్, తద్వచ స్తస్యా స్తరుణ్యా-వచః మృదుమధురభాషణమ్-తస్యైవ శ్రవణానన్దకరత్వాదితి భావః-స్వాద్యేషు అనుభవయోగ్యేషు ఉత్తమం కిమ్, తస్యా ఓష్ఠః పల్లవ ఇవ తస్య-రసః అధరామృతమిత్యర్థః. తస్యైవ రసనేన్ద్రియతృప్తిహేతుత్వాదితి భావః. స్పృశ్యేషు స్పర్శనయోగ్యేషు వస్తుషు ఉత్తమం కిమ్, తస్యా వపుః కుసుమసుకుమారశరీరమిత్యర్థః. తస్యైవ నిరుపమత్వగిన్ద్రియసౌఖ్యావహత్వాదితి భావః. ఉత్తమం ధ్యేయం ధ్యానార్హం కిమ్-ధ్యాతవ్యేష్విత్యర్థః, నవయౌవనం తరుణీనవతారుణ్యమేవ - తస్యైవాత్యన్తమనోరఞ్జకత్వాదితి భావః, అథ సర్వథా ముఖ్యం ధ్యేయమాహ—సహృదయైర్హృదయాలుభిః - రసికజనైరిత్యర్థః సర్వత్ర సర్వదేశేషు సకలకాలేషు వా, తస్యాస్తరుణ్యా విభ్రమా విలాసాః, ధ్యేయా ఇతి శేషః. అత్ర తత్తత్ప్రసిద్ధవిషయాణామేకత్ర సమష్టివర్ణనాన్మహాన్ శృఙ్గారపరిపోషాతిశయ ఉక్తః. ఏతేనాస్యా లోకోత్తరమాభిరూప్యం సూచ్యతే, తథా చోత్తమవిషయాకాఙ్క్షిభిర్విశిష్టతరుణీసమ్భోగ ఏవ కర్తవ్య ఇతి ఫలితార్థః. అత్ర ప్రశ్నోత్తరయోశ్చాతుర్యాతిశయార్థమసకృన్నిబన్ధనాదుత్తరాలఙ్కారభేదః.

'ఉత్తరాత్ ప్రశ్న ఉన్నేయో యత్ర ప్రశ్నోత్తరే తథా,
బహుధా చ నిబధ్యేతే తదుత్తరముదీర్యతే.' ఇతి.

టీ. సహృదయైః = రసికులచే, సర్వత్ర = అంతట, దృష్టవ్యేషు = చూడఁదగినవానియందు, ఉత్తమం = మంచిది, కిం=ఏది? మృగదృశః = సుందరియొక్క, ప్రేమప్రసన్నం=ప్రీతిచే వికసించిన, ముఖం=మొగము; ఘ్రాతవ్యేషు అపి = వాసనఁజూడఁదగినవానిలోను, కిం=ఏది (ఉత్తమమ్)? తత్ ఆస్యపవనః = ఆ (సుందరి)యొక్క, నోటిగాలి; శ్రావ్యేషు=వినఁదగినవానిలో, కిమ్...? తత్ వచః = ఆపెమాటలు; స్వాద్యేషు = రుచిచూడఁదగినవానిలో, కిం...? తత్ ఓష్ఠపల్లవరసః = ఆపె మోవిచిగురుపానకము; స్పృశ్యేషు = తాకఁదగిన వానిలో, కిమ్...? తత్ వపుః = ఆపెశరీరము; ధ్యేయం = ధ్యానింపఁదగినది, కిమ్...? నవయౌవనే = ఎలప్రాయము నందలి, తత్ విభ్రమాః=ఆపె విలాసములు.

తా. రసికు లగువారు ప్రాయమున నుండునప్పుడు చూడఁదగినది యేది? (అని ప్రశ్న.) లేడికంటి యగుజవరాలి ముద్దుగులుకు తేటయైన మోము. (అని యుత్తరము.) దీనిచే నేత్రేంద్రియతృప్తికరం బగురూప మనువిషయము చెప్పఁబడినది. వాసనచూడఁదగినవానిలో నుత్తమ మేది?

(అని ప్రశ్న.) ఆమచ్చెకంటి కమ్మతావియే. (అని యుత్తరము.) దీనిచే నాసికేంద్రియవిషయము చెప్పఁబడినది. వినఁదగినవానిలో శ్రేష్ఠమైన దేది? (అని ప్ర.) ఆచిలుకలకొలికి యొక్క పలుకులె (అని యుత్త.) దీనిచే శ్రోత్రేంద్రియవిషయము సూచితంబయ్యె. పానము చేయఁదగిన వస్తువులలో నుత్తమద్రవ్యమేది? (అని ప్రశ్న.) ఆముగుదయొక్క కెమ్మోవి చిగుళ్ల తియ్యనిపానమే (అని యుత్త.) దీనిచే జిహ్వేంద్రియవిషయము చెప్పఁబడియె. తాఁకఁదగినవానిలో మేలైనది యేది ? (అని ప్రశ్న.) మెలఁతల మెత్తని మేనుదీఁగయె. (అని యుత్త.) దీనిచే త్వగింద్రియవిషయము చెప్పఁబడియె. ఎల్లప్పుడు మనసునఁ జింతింపఁదగిన దేది? (అని ప్రశ్న.) ఆయంగనలతళుకుబెళుకులె (అని యుత్త.) దీనిచే మానసేంద్రియవిషయంబు చెప్పఁబడియె. లోకంబున నుత్తమవిషయాభిలాషగలవా రుత్తమస్త్రీసంభోగమే చేయవలయును.

సీ. చూడంగఁ దగినవస్తువులందు ఘన మెద్ది?
తుల లేక తగువెలందులమొగంబు;
వలపు గైకొనఁ దగువానిలో నెయ్యది?
మగువలవదనాబ్జమారుతంబు;
వీనుల కింపైన వానియం దెయ్యది?
కోమలాంగులముద్దుగులుకుపలుకు;
తనువు సోఁకిన సుఖం బొనరించు నెయ్యది?
మెలఁతల సొబగైన మేనుదీవ;

తే. యతిమధుర మెద్ది? కాంతాధరామృతంబు;
సరసజనులకుఁ జింతింపఁ జాలు నెద్ది ?
పువ్వుఁబోఁడుల వెలలేని జవ్వనంబు;
వెలయు నెల్లెడఁ బడఁతులవిభ్రమములు.

అవ. స్త్రీలకు లోఁబడనిపురుషుఁడు లేఁ డని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఏతాశ్చలద్వలయసంహతి మేఖలోత్థ
ఝఙ్కారనూపురరవాహృత రాజహంస్యః,
కుర్వన్తి కస్య న మనో వివశం తరుణ్యో
విత్రస్తముగ్ధహరిణీసదృశైః కటాక్షైః. 8

వ్యా.—అథాసాం ముఖాద్యలఙ్కరణవర్ణనద్వారా సకలలోకసమ్మోహకత్వమాహ—ఏతా ఇతి—చలన్త్యా గలితైచిత్ర్యాద్వలమానే యే వలయసంహతిమేఖలే వలయసంహతిః కఙ్కణశ్రేణిః-మేఖలాశబ్దేన కాఞ్చీవాచినా తన్నిబద్ధాః కిఙ్కిణ్యో లక్ష్యన్తే-తదుత్థస్తదుత్పన్నో యో-ఝుంకారో ఝణఝణస్తేన·నూపురాభ్యాం మఞ్జులనినాద మఞ్జీరాభ్యాం చ పరాజితాః తిరస్కృతారాజహంస్యః కలహంసాఙ్గనా-యాభిస్తాః కలనాదసున్దరమన్దగమనరాజహంసరమణీయా ఇత్యర్థః. ని. 'రాజహంసోనృపశ్రేష్ఠే కాదమ్బకలహంసయోః' ఇతి విశ్వః, *'జాతేరస్త్రీవిషయాదయోపధాత్' ఇతి ఙీష్—శైషికస్య కపో వైభాషికత్వాన్న ప్రయోగః, ఏతాః పూర్వోక్తాస్తరుణ్యః కించి దూన వింశతి వార్షికాః స్త్రియ ఇత్యర్థః. విత్రస్తా చకితా-ముగ్ధాఽప్రౌఢా చ-యా హరిణీ కురఙ్గీ-తత్సదృశైః - తద్విలోకనవిభై రిత్యర్థః, కటాక్షైరపాఙ్గవీక్షణైః, ఏతేనైతాసాం పద్మినీత్వం సూచ్యతే—'చకితమృగదృగాభే ప్రాన్తరక్తే చ నేత్రే'ఇతి లక్షణాత్,కస్య మనో, వివశం సమ్మోహితం, న కుర్వన్తి కుర్వన్త్యేవేత్యర్థః. తరుణీలక్షణముక్తం రతిరహస్యే—

'బాలా స్యాత్ షోడశాబ్దా తదుపరి తరుణీ వింశతేర్యావదూర్ధ్వమ్,
ప్రౌఢా స్యాత్ పఞ్చపఞ్చాశదవధి పరతో వృద్ధతామేతి నారీ.'

వయోలక్షణముక్తమ్—

'నిదాఘశరదోర్బాలా పథ్యా విషయిణో భవేత్,
హేమన్తే తరుణీ యోగ్యా ప్రౌఢా వర్షావసన్తయోః,
సన్తతం సేవ్యమానాపి హీలా ప్రథయతే బలమ్.' ఇతి.

అత్ర రాజహంసీపరాజయస్య సాదృశ్యపర్యవసానాదేకా ఉపమా; హరిణీసదృశైరిత్యత్ర చాన్యా, అనయోః పరస్పరనైరపేక్ష్యాత్సజాతీయసంసృష్టిః. ఏతాశ్చ మధ్యమా నాయికాః—'లజ్జామన్మథమధ్యస్థా మధ్యమోదితయౌవనా' ఇతి లక్షణాత్.

వసన్తతిలకావృత్తమ్.

టీ. చల...హంస్యః - చలత్ = కదలుచున్న; వలయసంహతి = కడియముల మొత్తమునుండియు, మేఖలా=ఒడ్డాణమునుండియు, ఉత్థ=బయలుదేఱిన, ఝుంకార=ఝణఝణధ్వనిచేతను, నూపుర=అందెలయొక్క; రవ=చప్పుళ్లచేతను, ఆహృత=లాగఁబడిన, రాజహంస్యః=ఆఁడుహంసలుగల (అంచయాన లనుట), ఏతాః=ఈ, తరుణ్యః=జవరాండ్రు, విత్ర. దృశైః-విత్రస్త=బెదరిన, ముగ్ధ=అందమగు, హరిణీ=లేడి (చూపుల)తో, సదృశైః=సమానములైన, కటాక్షైః=క్రేగంటిచూపులతో, కస్య=ఎవనియొక్క మనః=మనస్సును, వివశం=స్వవశము తప్పినదానినిగా, న కుర్వంతి=చేయరు ?

తా. చేతికడియములయొక్కయు, నడుమునందలి యొడ్డాణముల యొక్కయు, కాళ్లయందెలయొక్కయుఁ గలరవములచే రాయంచల నోడించినయతివలు మిక్కిలి బెదరిన లేళ్లచూపులఁబోలు తమక్రీఁగంటి చూపులం బర్వఁజేసి యీపుడమియందలి యేపురుషునిమనసును లోఁబఱచుకొనఁజాలరు? స్త్రీలు పురుషుల నన్ని తెఱఁగులచేతను వశపఱచుకొనఁగల రనుట.)

మ. కరచంచన్మణికంకణక్వణరణత్కాంచీగుణస్వర్ణనూ
పురనాదాహృతరాజహంసరమణుల్ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు నేకొనరు ముగ్ధత్రస్తవల్లన్మృగీ
తరళాలోకనతుల్యవిభ్రమదృగంతస్తోమపాతంబులన్.

శ్లో. కుఙ్కుమపఙ్కకళఙ్కితదేహా గౌరపయోధరకమ్పితహారా,
నూపురహంసరణత్పదపద్మా కం న వశీకురుతే భువి రామా. 9

వ్యా.— కుఙ్కుమేతి.— కుఙ్కుమపఙ్కేన కాశ్మీరజకర్దమేన—ని. 'అథకుఙ్కుమం కాశ్మీరజన్మాగ్నిశిఖమ్'—'పఙ్కోఽస్త్రీ శాదకర్దమౌ' ఇత్యుభయత్రాప్యమరః. అథవా ఘుసృణాపరపర్యాయకుఙ్కుమకుసుమరఞ్జితచన్దనపఙ్కేన-ని. 'కుఙ్కుమం ఘుసృణమ్' ఇత్యభిధానరత్నమాలాయామ్. యద్వా కుఙ్కుమేన పఙ్కేన - సిన్దూరాపరనామ శృఙ్గారభూషణాఖ్యద్రవద్రవ్యవిశేషేణ చ- ని. 'సిన్దూరం నాగసమ్భవమ్, చీనపిష్టం చ గాన్ధారం పఙ్కం శృఙ్గారభూషణమ్' ఇత్యమరః, కలఙ్కితశ్చిహ్నితో దేహో యస్యా స్సా-కుఙ్కుమసిన్దూరాదిరఞ్జకద్రవ్యశృఙ్గారితాకారేత్యర్థః. అత ఏవ గౌరయో రరుణయోః—యద్వా పద్మినీత్వాత్ శ్రీఫలసచ్ఛాయయోః-'స్తనయుగళమనిన్ద్యశ్రీఫలశ్రీవిడమ్బి' ఇతి లక్షణాత్-పయోధరయోః కుచకుమ్భయోః - కమ్పితాశ్చలితా హారా ముక్తావలయో - యస్యాస్సా తథోక్తా, నూపురౌ మఞ్జీరౌ ఏవ హంసౌ—హంసావివ నూపురౌ వా-తాభ్యాం రణతీ శబ్దాయమానే - పదే ఏవ పద్మే-పద్మే ఇవ పదే వా- యస్యాస్సా అత ఏవ రూపకోపమయోః సాధకబాధకప్రమాణాభావా త్సన్దేహసఙ్కరః, రామా సున్దరీ భువి కం పురుషం, న వశీకురుతే న స్వాయత్తీకురుతే, జితేన్ద్రియమపి స్వాయత్తీకురుత ఇత్యర్థః. ని. 'వశ ఆయత్తతాయాం చ' ఇతి విశ్వః. *అభూతతద్భావే చ్విః - 'ఊర్యాదిచ్విడాచ శ్చ' ఇతి గతిసంజ్ఞాయామ్ - 'కుగతిప్రాదయః' ఇతి సమాసః. అత్ర సుప్సుపేత్యనువృత్తేః.

అత్ర హారాణాం కమ్పితత్వవిశేషణేన పయోధరయోరత్యన్తపటుత్వం సూచ్యతే, అన్యథా కమ్పనాయోగాత్, తేన చాత్యుత్కటయౌవనసమ్పత్తిశ్చ గమ్యతే, పయోధరయోశ్చ గౌరత్వవిశేషణేన యౌవనసమృద్ధిర్వ్యజ్యతే; ఏతేనాలమ్బనగుణలాభ ఉక్తః. ఏవం కుఙ్కుమపఙ్కకల్కనేన కటస్థోద్దీపనభావః కథితః; తథా హారనూపురాత్మకాలమ్బనాలఙ్కరణమభ్యుట్టఙ్కితమ్; రణత్పదపద్మేత్యనేనసూచితో లీలాగతివిశేషయా హానుభావశ్చ; తథా చైవంవిధసామగ్రీసముల్లసితేన,

'అభిరూప్యమకాఠిన్యమఙ్గానాం చాతిమార్దవమ్,
ఏవమాదిగుణావస్థా ప్రథమే యౌవనే భవేత్,' ఇత్యుక్త్వా-
'కృతాధరాఙ్గసంస్కారా సఖీకేళిషు లాలసా,'

ఇత్యుక్తచేష్టావిశిష్టయౌవనపరిపూర్ణేన రమయతీతి రామేతి వ్యుత్పత్త్యా లోకోత్తరలావణ్యసమ్పన్నేనాలమ్బనవిభావేనోదితే శృఙ్గారరసార్ణవే కో వా న నిమజ్జతీతి భావః. అత్ర శ్లాఘ్యవిశేషణయోగాదుదాత్తతా నామ గుణః, లక్షణం తూక్తమ్, తథాత్యన్తసుకుమారార్థసన్దర్భితత్వాత్కైశికీవృత్తిః - 'అత్యన్తసుకుమారార్థసన్దర్భా కైశికీ మతా' ఇతి లక్షణాత్. దోధకవృత్తమ్- 'దోధకవృత్తమిదం భభభా గౌ' ఇతి లక్షణాత్.

టి కుంకుమ... దేహా-కుంకుమ=కుంకుమయొక్క, పంక=బురదచేత, కళంకిత = గుఱుతుగల, దేహా=శరీరము గలదియు, గౌర ..హారా - గౌర=ఎఱ్ఱని, పయోధర = పాలిండ్లయందు, కంపిత=కదలుచున్న, హారా = ముత్యాలపేరులు గలదియు, నూపు... పద్మా - నూపురహంస=(ధ్వనియందు) హంసలవంటియందెలచేత, రణత్ = మ్రోగుచున్న, పదపద్మా = అడుగుదమ్ములుగలదియు, (అగు) రామా = సుందరి, భువి = భూమియందు, కిం=ఎవనిని, న వశీకురుతే = స్వాధీనముచేసికొనదు ?

తా. కుంకుమపువ్వుతోఁగూడిన మైపూఁత పూసికొని, బంగరువన్నెగల గుబ్బలపై ముత్తెపుసరము లదురుచుండ, తమ్మిరేకులఁబోలు కాలియందెలు ఘల్లుఘల్లుమని మ్రోఁతలు మ్రోఁగుచుండ నతివలకుఁ బుడమియందుఁ బురుషు లెవ్వరు వశులుగాక యుందురు? జితేంద్రియులనైనను మగువలు తమసొగసులచే లోఁబఱచుకొందురు.

చ. గొనబగుమేన సంకుమదకుంకుమపంక మెసంగ సిబ్బెపుం
జనుఁగవ రత్నహారములు సారెఁ బెనంగఁ బదాంబుజంబులన్

మొనసినగిల్కుటందియలమ్రోఁత చెలంగ ససంగవైభవం
బెనయఁగఁ గుల్కుకల్కిసొబగెవ్వనిఁ దా వలపింప దిమ్మహిన్.

అవ. అబలలు సబలలే యని వారినేర్పును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. నూనం హి తే కవివరా విపరీతవాచో
యే నిత్యమాహురబలా ఇతి కామినీస్తాః,
యాభిర్విలోలతరతారకదృష్టిపాతైః
శక్రాదయోఽపి విజితా_స్త్వబలాః కథం తాః? 10

వ్యా.—అథైతాసాం ప్రాగల్భ్యం వర్ణయతి—నూనమితి.— తే కవివరాః కవీశ్వరా, విపరీతవాచో వ్యత్యస్తవచనాః, నూనం సత్యం హి, తే క ఇత్యాశఙ్కాయా మాహ—యే కవివరాస్తాః ప్రసిద్ధాః, కామినీః, అబలాః దుర్బలా, ఇతి నిత్యః మాహుః బ్రువతే, వర్ణయన్తీత్యర్థః. త ఇతి సమ్బన్ధః. *'బ్రువః పఞ్చానామాదిత ఆహో బ్రువః' ఇతి ఉపాదేశః-బ్రువ ఆహాదేశశ్చ, కథం విపరీతవాచ ఇత్యాశఙ్క్య తాసాం ప్రాగల్భ్యం సాధయతి—యాభిః కామినీభిర్విలోలతరా అతితరళాస్తారకాః కనీనికా-యేషు తే తథోక్తా యే - దృష్టిపాతా లోచనప్రసారాస్తైర్ద్రక్షేపైరణైః * 'కర్తృకరణయో స్తృతీయా' ఇతి తృతీయా - 'తారకాక్ష్ణః కనీనికా' ఇత్యమరః, శక్రాదయ ఇన్ద్రాదయోఽపి - కిముతాన్య ఇతి భావః, విజితా నిర్జితాః-స్వాయత్తీకృతాఇత్యర్థః. తాస్తు కామిన్యః - కథమబలాః కుతో దుర్బలాః? కింతు ప్రబలా ఏవేత్యర్థః, వీక్షణమాత్రేణైవేన్ద్రాద్యుజ్జయినీనాం బలిష్ఠత్వం కిం వక్తవ్యమ్. అత ఏతాసాం దౌర్బల్య ప్రతిపాదకాః కవయ ఏవ దుర్బలవాచో న తు తా ఇతి భావః.

అత్రోత్తరవాక్యార్థస్య పూర్వవాక్యార్థసమర్థకత్వాద్వాక్యార్థహేతుకం కావ్యలిఙ్గమలఙ్కారః—'హేతోర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గముదాహృతమ్' ఇతి లక్షణాత్. వసన్తతిలకావృత్తమ్.

టీ. యే = ఎవరు, (కవివరులు) తాః కామినీః = ఆయువతులు, అబలాః ఇతి= అబలలు (బలములేనివారు) అని, నిత్యం = ఎల్లపుడును, ఆహుః=చెప్పుదురో, తేకవివరాః=ఆకవీంద్రులు, నూనం=నిజముగా, విపరీతవాచః హి=తప్పుడుమాట (కూఁత) లు గలవారుసుమా! యాభిః=ఏస్త్రీలచేత, విలో...పాతైః-విలోలతర=మిక్కిలి కదలునట్టి తారక=నల్లగ్రుడ్లులు గల, దృష్టిపాతైః=చూపువ్రేటులచేత, శక్రాదయః అపి = ఇంద్రాదులు సైతము, విజితాః = గెలువఁబడిరో, తాః=ఆస్త్రీలు, అబలాః కథం=అబలలు (బలములేనివారు) ఎట్లు (అగుదురు)?

తా. జనరాండ్రను జూచి వీరుబలము లేనివా రని యెల్లప్పుడు వర్ణించెడికవులు ప్రత్యక్షమునకు విరుద్ధముగామాటాడువారు. ఇది నిక్కము. స్త్రీలు చంచలములగు తమకన్నుల నిట్టటు త్రిప్పుటచేత నే సర్వరాక్షస సంహారము గావించిన యింద్రాదులను గూడ గెల్చిరి. అట్టి కామినుల నెట్లు అబల లని చెప్పదగును. కావున వారు దుర్బల లని చెప్పు కవులు మాటలపటిమ లేనివా రుగాని వా రెన్నటికిని అబలలు గారు.

చ. అతివలఁ జూచి వీ రబలలంచు వచించు మహాకవీంద్రు లు
 ద్ధతవిపరీత వాదు లివిడబ్బర గాదు విలాసినీసమం
 చితతరళాక్షిపాతములచే గెలువంబడి రింద్ర ముఖ్యులుఁ
 ధృతి నటువంటివా రబలలే గతి నైరి తలంచి చూడఁగన్.

అవ. మన్మథుఁడు కామినులకుఁ బనివాఁ డని చెప్పఁబడుచున్నది:—

శ్లో. నూనమాజ్ఞాకర స్తస్యాః సుభ్రువో మకరధ్వజః,
 యత స్తన్నేత్రసంచారసూచితేషు ప్రవ ర్తతే. 11

వ్యా.—అథ కామదేవస్య కామినీకింకరత్వముత్ప్రేక్ష్యతే—నూనమితి—మకరధ్వజః కామదేవ స్తస్యాః ప్రసిద్ధాయాః పూర్వోక్తాయా వా, సుభ్రువః కామిన్యాః-జాతావేకవచనమ్ - సుభ్రువామిత్యర్థః, ఆజ్ఞాం కరోతీత్యాజ్ఞాకరః కింకరః * 'కృఞో హేతు-' ఇత్యాదినా టప్రత్యయః, నూనమిత్యుత్ప్రేక్షాయామ్: కుతః? యతః కారణ త్తస్యాః సుభ్రువో - నేత్రసంచారేణ దృష్టిప్రసారేణ - సూచితేషు సంజ్ఞాపితేషు, ప్రవర్తతే - యథా లోకే స్వామిదృష్టిసూచితే భృత్యః ప్రవర్తతే తద్వదిత్యర్థః. అతః కామినీనాం నూనమయం కింకర ఇతి భావః; కామినీకటాక్షమాత్రేణైవ జనస్య మన్మథావేశసమ్భవాదియముత్ప్రేక్షా; సా చ నూనమితి వ్యఞ్జక సద్భావాద్వాచ్యా. త దుక్తమ్—

'మన్యే శఙ్కే ధ్రువం నూనం ప్రాయ ఇత్యేవమాదిభిః,
 ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః' ఇతి.

ఏతేన తాసామప్రతిహతజగద్వశీకరణసామర్థ్యం వ్యజ్యతే. అనుష్టుప్.

టీ. మకరధ్వజః=మన్మథుఁడు, నూనం=నిశ్చయముగా, సుభ్రువః=చక్కనికనుబొమలు గల, తస్యాః=ఆయువతికి, ఆజ్ఞాకరః=బంటు; (దొర ఎవరిని చూపి కొట్టుమనునో బంటు వానిని కొట్టునుగదా? అట్లే యనుట) యతః=ఏల యన, తన్నే... తేషు-తత్=

ఆయువతియొక్క, నేత్ర=కన్నులయొక్క, సంచార=చలనములచే, సూచిత=చూపఁబడిన, ఇషు=బాణములు గలుగునట్లుగా, (లేక, సంచార=చలనములకు, సు+ఉచితేషు=మిక్కిలి తగినటువంటి..., లేక, సూచిత = చూపఁబడినవారిపై, ఇషు=బాణములు గలుగునట్లుగా, లేక, సూచితేషు = చూపఁబడినవారియందు, లేక, 'ఇషుః', అనుపాఠమున-బాణములు గలవాఁడై ) ప్రవర్తతే=ప్రవర్తించుచున్నాఁడు.

తా. మరుఁ డతివయొక్క విధేయుఁ డగు సేవకుఁడేమో. కావుననే యతివలు కంటిచూపుచేఁ జూపఁబడినవారికడకుఁ బోవుచుండును. లోకం బునఁ బ్రభువు పొమ్మన్న చోటికిఁ బనివాఁ డేగుచుండును. అట్లే మరుఁడు కాంతలు దృష్టితోఁ గనఁబఱచిన వారిమీఁదికిఁ బోవుచుండును గావున నతివల కితఁడు పనివాఁడై యుండనోపును. కామినీజనంబుల క్రీఁగంటి చూడ్కులు పడినమాత్రముననే పురుషులు మన్మథునిబారిఁదగులుదురు.

క. నారీజనముల కాజ్ఞా
కారి యగుభటుండు మరుఁడు కైగాఁబోలుఁ జుమీ
వారికటాక్షము సోఁకిన
వారియెడన వాఁడిఁ జూపి వర్తించుఁగదా.

అవ. ఒకకామి యొకానొకకాంతను శ్లాఘించునట్లు శ్లేషమూలముగ దానిని సంబోధించువిధంబు నీరెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. కేశాః సంయమినః శ్రుతేరపి పరం పారం గతే లోచనే
అన్తర్వక్త్రమపి స్వభావశుచిభిః కీర్ణం ద్విజానాం గణైః,
ముక్తానాం సతతాధివాసరుచిరౌ వక్షోజకుమ్భావిమౌ
విత్థం తన్వి వపుః ప్రశాన్తమపి తే రాగం కరోత్యేవ నః. 12

వ్యా.—అథ రాగిణః శ్లేషవైచిత్ర్యాత్కామినీప్రశంసాపరం వచనం సమ్బోధన మభిధాయాహ ద్వాభ్యామ్-కేశా ఇతి.-కేశాః శిరోరుహాః, సంయమినః సంయతాః సమ్య జ్నియమవన్తశ్చ, లోచనే అపి శ్రుతేః పరం పారం కర్ణాన్తవిశ్రాన్తత్వం వేదాన్తపరిశీలన తాత్పర్యం చ, గతే, అన్తర్వక్త్రం వక్త్రాభ్యన్తరమపి, స్వభావతః నిసర్గాచ్ఛుచిభిః శుభ్రైః పవిత్రైశ్చ, ద్విజానాం దన్తానాం విప్రాణాం చ -ని. 'దన్తవిప్రాణ్డజా ద్విజాః' ఇత్యమరః. గణైః, కీర్ణం వ్యాప్తమ్ ఇమౌ ఏతౌ ఇతి హస్తనిర్దేశః, వక్షోజకుమ్భౌ కుచకుమ్భౌ, ముక్తా నాం మౌక్తికహారాణాం జీవన్ముక్తానాం చ, సతతాధివాసేన నిరన్తరావస్థానేన సన్తతనివా సేన చ,రుచిరౌ-ని. 'ముక్తా తు మౌక్తికే ముక్తః'-'ప్రాప్తముక్తౌ తు మోచితః' ఇత్యుభయ

త్రాపి విశ్వః. అతః హే తన్వి - ఇత్థముక్తప్రకారేణ, తే వపుః శరీరం ప్రశాన్తం ప్రసన్నమ్-వైరాగ్యసాధనసంపత్తిమదపీతి యావత్ * 'వాదా న్త' ఇత్యాదినా నిపాతః, నోఽస్మాకం, రాగమనురక్తిమ్ - సమ్భోగాభిలాషమేవేతి యావత్, కరోతి ఉత్పాద యతి-న తు వైరాగ్యమితి విరోధః - స చోక్తరీత్యా ఆభాసితత్వాద్విరోధాభాసోఽల ఙ్కారః - 'ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే' ఇతి లక్షణాత్, స చ శ్లేష ప్రతిభోత్థాపిత ఇతి తయోరఙ్గాఙ్గిభావేన సంకరః; లోచనే అన్తర్వక్త్రమిత్యత్ర * ప్రగృహ్యత్వాత్ప్రకృతిభావః * 'ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్' ఇతి ప్రగృహ్య సంజ్ఞా. శార్దూలవిక్రీడితమ్.

టీ. హే తన్వి=ఓకృశాంగీ, తే=నీయొక్క, కేశాః=వెండ్రుకలు, సంయమినః = చక్కని నియమముగలవి (ముడిగలవి అని వాస్తవార్థము), లోచనే అపి = కన్నులును, శ్రుతేః=వేదముయొక్క (చెవియొక్క), పరం = ఉత్తమమైన, పారం = తుదను, గతే= పొందినవి. (అనఁగా వేదాంతమును ఉపనిషత్తులను) పఠించినవి- (చెవియవతలియంచు వఱకు వ్యాపించినవి-మిక్కిలి వాలుగన్ను లనుట.) వక్త్రం=నోరు, అంతః=లోపల, స్వభావ శుచిభిః - స్వభావ = ప్రకృతిచేతనే, శుచిభిః=పవిత్రులైన (తెల్లనైన), ద్విజానాం = బ్రాహ్మణులయొక్క (దంతములయొక్క) గణైః = సమూహములచేత, కీర్ణం=వ్యాప్తమై నది (సహజముగ పవిత్రు లగు బ్రాహ్మణులసంఘముచేఁ జుట్టుకొనఁబడినది—సహజముగ తెల్లని పలువరుస గలది). ఇమౌ=ఈ, వక్షోజకుంభౌ = చనుగిండ్లు, ముక్తానాం=ముక్తుల (పుణ్యపురుషుల)యొక్క (ముత్యములయొక్క), సత...చిరౌ-సతత = ఎల్లప్పుడు, అధి వాస=కాఁపురము (ఉనికి)చేత, రుచిరౌ=ప్రకాశించునవి. ఇత్థం = ఇట్లు, తే=నీయొక్క, వపుః=శరీరము, ప్రశాంతం అపి=శాంతినిఁ (విరక్తిని) బొందినదైనను, నః=మాకు, రాగం ఏవ=అనురాగమునే, కరోతి=చేయుచున్నది.

తా. ఓకాంతా! నీకేశములు సంయములు (చక్కని నియమంబు గలవి). నీకన్నులో శ్రుతిపారంగతములై యున్నవి (ఉపనిషద్విచారము చేయునవిగనున్నవి). నీనోటిరంధ్రము స్వభావశుద్ధద్విజగణములతోఁ గూడియున్నది (చక్కనినడతగలబ్రాహ్మణగణములతోఁ గూడియున్నది). ఈ నీకుచకుంభములును ముక్తుల కెల్లప్పు డునికిరైయె యున్నవి. (జీవన్ముక్తుల కెల్లప్పుడు తావరమై వెలయుచున్నది). ఓసన్ననిమైసీఁగగలదానా! నీమే నిట్లు శాంతమైయున్నను (వైరాగ్యసాధనసంపత్తిగలదిగ నున్నను)

మాకు రాగమునే (సంభోగాభిలాషనే) కల్గించుచున్నది. ఇది యెుక్క వింతగడా! (శాంతులకడఁ జేరినవారికి వైరాగ్యము గలుగవలసి యుండఁగా, సంభోగాభిలాష గలిగించుట యనునది విరోధము). ఓతన్వీ! నీ నెఱికురులు ముడివేయఁబడియున్నవి. నీకన్నులు చెవితుద నొందుచున్నవి. నీవదనంబునఁ దెల్లనిపల్వరుస లున్నవి. నీగుబ్బపాలిండ్లు ముత్తెపుసరులతో నెల్లప్పుడు వెలయుచున్నవి. నీశరీర మిట్లు తేట దనము గలిగియుండుటచే మాకు రాగమును గలిగించుట వింతగాదు. అని పరిహారము.

ఈశ్లోకమున స్త్రీశరీరము శాంతమయ్యు రాగజనకంబుగా నున్న దనుటచే విరోధము. అది పైఁజెప్పినతీరున నాభాసిత మగుటచే విరోధా భాసాలంకారము. సంయమి, శ్రుతి, ద్విజాదిపదములకు శ్లేషము చెప్పు టచే రెంటికిని సంకరము.

ఉ. వావిరిఁ గన్నుదోయి శ్రుతిపారగ మెంతయు సంయముల్ కురుల్
భావశుచి ద్విజప్రకరభాజన మెన్న ముఖాంతరంబు ము
క్తావళిరమ్యముల్ కుచము లక్కట యిట్లు ప్రశాంతమయ్యు రా
జీవదళాక్షి మేను విరచించుచు నున్నది మాకు రాగమున్.

శ్లో. ముగ్ధే ధానుష్కతా కేయమపూర్వా త్వయి దృశ్యతే,
యయా విధ్యసి చేతాంసి గుణైరేవ న సాయకైః. 13

వ్యా.—ముగ్ధ ఇతి.—ధనుః ప్రహారణమస్య ధానుష్కః ధన్వీ* ప్రహారణమ్; ఇతి ఠక్* 'ఇసుసుక్తాన్తా త్కః. ని. 'ధన్వీ ధనుష్మాన్ధానుష్కః' ఇత్యమరః. తస్య భావ స్తత్తా, హే ముగ్ధే సున్దరి-ని. 'ముగ్ధస్సుందరమూఢయోః' ఇత్యమరః. యద్వా హే ఉదయద్యౌవనభావే, త్వయ్యపూర్వా అదృష్టచరా-అసాధారణీతి యావత్ - ధానుష్కతా దృశ్యతే, ఇయం ధానుష్కతా, కా కీదృశీ - న జ్ఞాయత ఇత్యర్థః. కుతః? యయా ధానుష్కతయా హేతునా, చేతాంసి యువజనమనాంసి దుర్లక్ష్యాణీతి భావః, గుణా మార్ద్వ-రూపయౌవనాదయశ్చ తైరేవ, విధ్యసి సంప్రహారసి, సాయకైః బాణైస్తు, న విధ్యసి, యతః లోకే ధానుష్కాః ప్రౌఢా ఏవ సులక్ష్యాణ్యేవ లక్ష్యాణి బాణైరేవ విధ్యన్తి, త్వం తు ముగ్ధాఽసి దుర్లక్ష్యాణ్యపి లక్ష్యాణి మార్వైభిరేవ విధ్యసీతి కృత్వా త్వదీయధానుష్కతాయా అపూర్వత్వాదజ్ఞేయత్వమితి భావః; స్త్రీణాం రూప యౌవనగుణసంపత్తిరేవ పరప్రహారణసాధనమితి ఫలితార్థః.

అత్ర పూర్వవాక్యార్థస్యోత్తరవాక్యార్థసమర్థితత్వాద్వాక్యార్థహేతుకం కావ్యలిఙ్గమ్; తచ్చ గుణయోః శ్లేషభిత్తికాభేదాధ్యవసాయమూలాతిశయోక్తిని ర్వాహమిత్య నయోరఙ్గాఙ్గిభావేన సంకరః; తేన చ ప్రసిద్ధాద్ధానుష్కాదుపమానాదుపమేయభూతముగ్ధాయా ఆధిక్య ప్రతీతేర్వ్యతిరేకో వ్యజ్యత ఇత్యలఙ్కారేణాలఙ్కారధ్వనిః. అనుష్టుప్.

టీ. హేముగ్ధే=ఓపిల్లా! (ముద్దరాలా!) యయా=దేనిచేత, చేతాంసి = మనస్సులను, గుణైః ఏవ=అల్లెత్రాడులచేతనే (రూపలావణ్యాది గుణములచేతనే),విధ్యసి=వేధించుచున్నావో, సాయకైః=బాణములచే, న (విధ్యసి)=వేధింపవో, (అటువంటి) అపూర్వా=మును పెక్కడలేని, ధానుష్కతా = విలునేర్పరితనము, త్వయి = నీయందు, దృశ్యతే=కనఁబడుచున్నది, ఇయం కా=ఇది యెట్టిది ?

తా. ఓముద్దరాలా! నీయెడ క్రొత్తదైన విలుకానితనము గన్పట్టుచున్నది. లోకంబునఁ బ్రోడలగు విలుకాండ్రు చక్కఁగాఁ గనఁబడు లక్ష్యవస్తువులనే బాణములతోఁ గొట్టుదురు. నీవన్ననో ముగ్ధవయ్యుఁ (మూఢవయ్యు, అందగత్తెవయ్యు) గంటికిఁ గనఁబడని లక్ష్యము లగు మనస్సులను గుణములచేతనే (అల్లెత్రాటిచేతనే, సౌందర్యాదిగుణముల చేతనే) గొట్టుచున్నావు. ఇది వింతగదా! (అనఁగా నీవు నీసౌందర్యాది గుణంబులచే మామనస్సులను ఆకర్షించుచున్నావు అని సమాధానము.)

క. శరములచే భేదింపక, నిరతముఁ జేసెదవు హృదయనిర్భేదము భా
సురగుణములచే నద్భుత, కరచాపప్రౌఢి నీకె కలదు లతాంగీ.

శ్లో. సతి ప్రదీపే [1]సత్యగ్నౌ సత్సు తారా [2]రవీన్దుషు,
వినా మే మృగశాబాక్ష్యా తమోభూతమిదం జగత్. 14

వ్యా.—సతీతి—ప్రదీపే అర్థప్రకాశదీప్తార్చిషి, సతి విద్యమానేఽపి అగ్నౌ తథాభూతే వహ్నౌ, చ సత్యపి, 1. 'సత్యర్కే' ఇతి పాఠే త్రిలోకప్రకాశకే సూర్యే, సత్యపి, తథా తారా2. మణీన్దుషు తిమిర నిరాసక త్వేన ప్రసిద్ధేషు నక్షత్రపద్మరాగాదిమాణిక్యచన్ద్రేషు, సత్స్వపి. తథా ప్రసిద్ధయా పూర్వానుభూతయా వా, మృగశాబస్య బాల హరిణస్యేవాక్షిణీ యస్యాస్తయా, ప్రియతమయా వినా *బహుప్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్షచ్, * 'షిద్గౌరాదిభ్యశ్చ' ఇతి ఙీష్ - ఇదం జగన్మే మమ, తమోభూతమన్ధకారమయమ్, లక్ష్యత ఇతి శేషః, తస్యా ఏవ మమ నయనజ్యోతిష్ట్వాదితి భావః.

అత్రాన్ధకారనిరాకరణసమర్థత్వేన ప్రసిద్ధే ప్రదీపాదికారణసముదాయే సత్యపి తన్నిరాసరూపకార్యానుత్థానాద్విశేషోక్తిరలంకారః. 'తత్సామగ్ర్యామనుత్పత్తిర్విశేషోక్తిర్నిగద్యతే' ఇతి లక్షణాత్; తథా ప్రదీపాదిసద్భావేఽపి తమోభూతత్వమితి విరోధశ్చ వ్యజ్యతే; తేన చాస్య మహామోహాన్ధత్వం వస్తు గమ్యత ఇత్యలంకారేణ వస్తుధ్వనిః. వృత్తం పూర్వవత్.

టీ. ప్రదీపే=దీపము, సతి=ఉన్నను, అగ్నౌ = నిప్పు, సతి = ఉన్నను, తారారవి ఇందుషు=చుక్కలు, సూర్యుఁడును, చంద్రుఁడును, సత్సు = ఉన్నను, మృగశాబకాక్ష్యా వినా=లేడిపిల్లకన్నులవంటి కన్నులుగలది (నాప్రియురాలు) లేక, ఇదం = ఈ, జగత్= లోకము, తమోభూతం=చీఁకటియైనది.

తా. వెలుఁగు నిచ్చుటకు పగటిపూట సూర్యుఁడును, రాత్రులందు చంద్రుఁడు, నక్షత్రములు, అగ్నిహోత్రుఁడు, దీపము మొదలగు వస్తువులున్నను, ఆలేడిపిల్లకన్నులంబోలు కన్నులు గల యామగున లేమిచే నీజగమెల్ల నిరులు గ్రమ్మియున్నట్లే తోఁచుచున్నది. ఆకాంతయే నాకంటికి వెలుతురు నిచ్చినది కావున నది లేక నేను జడుఁడనై యున్నాను. అని యొకకాముకుఁడు తనచెలికానితోఁ జెప్పుకొనెను.

ఆ. పెక్కుదివియ లున్న ♦ జక్కవచెలి యున్న
రిక్కరాయఁ డున్నఁ ♦ జుక్క లున్నఁ
జిన్నిలేడిచూడ్కి ♦ చేడియ నెడఁబాయు
నప్పు డంధకార ♦ మయ్యె జగము.

శ్లో. ఉద్వృత్తః స్తనభార ఏష తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠితమోష్ఠపల్లవమిదం కుర్వన్తు నామ వ్యథామ్,
సౌభాగ్యాక్షరపఙ్క్తికేవ లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాఽపి కరోతి తాపమధికం రోమావలిః కేన సా. 15

వ్యా.—ఉద్వృత్త ఇతి —ఉద్వృత్తోఽత్యున్తవర్తులః ఉత్పథగతశ్చ, ఏష ఇతి పురోవర్తినో హస్తనిర్దేశః, స్తనభారశ్చ, తరలే లీలావిలోలే చపలే చేతి గమ్యతే, నేత్రే, చలే రేచితాదివిలాసచఞ్చలే స్థిరత్వహీనే చ, భ్రూలతే చ, రాగేణ లౌహిత్యేన మాత్సర్యేణ చాధిష్ఠితమ్-తథాభూయిష్ఠమిత్యర్థః ని. 'రాగశ్చ రక్తేమాత్సర్యే క్లేశాదౌ లోహితేషు చ, ఇత్యుభయత్రాపి విశ్వః, శాశ్వతశ్చ, ఇదమితి నిర్దేశః, ఓష్ఠపల్లవం అధరకిసలయం,

చేత్యేతాసీతి శేషః. వ్యథాం మనఃపీడాం, కుర్వన్తు, నామేతి కుత్సాయామ్, ఖలానాం పరపీడాకరణస్య స్వాభావికత్వాదితి భావః; కిం తు పుష్పాయుధేన కామదేవేన, స్వయం స్వహస్తేన, లిఖితా, సౌభాగ్యాక్షరమాలికా సౌభాగ్యవ్యఞ్జకపుణ్యవర్ణపఙ్క్తిరివస్థితేత్యుత్ప్రేక్షా, తథా మధ్యస్థా అవలగ్నప్రదేశవిలగ్నా తటస్థాఽపి, సా రోమావలిః రోమరాజిః, కేన వా హేతునా, అధికం, తాపం కరోతి మనస్సంతాపయతి, విశిష్టతటస్థస్య పరసంతాపకరణానౌచిత్యాదితి భావః.

అత్ర పూర్వార్ధే ఉద్వృత్తత్వాదిపదార్థానాం శ్లేషభఙ్గ్యా స్వాభావ్యేన చ విశేషణగత్యా పీడాకరణం పదార్థం ప్రతి హేతుత్వకథనాత్పదార్థహేతుకమేకం కావ్యలిఙ్గమ్: ఉత్తరార్ధే తు తటస్థపదార్థస్య శ్లేషభఙ్గ్యైవ కేన సంతాపయతీత్యాక్షేప పదార్థం ప్రతి హేతుత్వకథనాదపరం చ; తచోప్తోత్ప్రేక్షయా సాపేక్షితత్వాత్సంకీర్ణమ్; తత్పూర్వవాక్యకావ్యలిఙ్గేన నైరపేక్ష్యాత్సంసృజ్యత ఇత్యనయోః సజాతీయసంసృష్టిః; వితేన స్తనభారాదేర్లోకోత్తరలావణ్యసంపన్నత్వమత్వన్తజననమ్మోహకత్వేన సూచ్యతే. శార్దూలవిక్రీడితం వృత్తమ్.

టీ. ఉద్వృత్తః = మదించిన (పైకి ఉబికి గుండ్రనై యున్న), ఏషః స్తనభారః= ఈచనులబరువు (అనఁగా: బరువయినచనులు), తరళే=చపలము లయిన (అందము లయిన), నేత్రే=కన్నులు, చలే=చంచలములైన, భ్రూలతే=బొమతీఁగలు, రాగా ..తమ్ - రాగ= మచ్చరముచే (ఎఱుపుచే), అధిష్ఠితం=పొందఁబడిన, ఇదం ఓష్ఠపల్లవం=ఈ మోవిచిగురు, వ్యథాం=కష్టమును, కుర్వన్తునామ = చేసినను చేయునుగాక. పుష్పాయుధేన=మన్మథుని చేత, స్వయం = తనంతటనే, లిఖితా = వ్రాయఁబడిన, సౌ .. క్తికా ఇవ - సౌభాగ్య= పెనిమిటి ప్రేమించుటయొక్క (తన్ను ప్రియుఁడు నిష్కపటముగఁ బ్రేమించె నని తెలుపునట్టి), అక్షరపంక్తికా ఇవ (స్థితా) = అక్షరములబంతివలె నున్న, సా రోమావళిః = ఆనూఁగారు, మధ్యస్థా అపి=(ఏపక్షమునకు జేరక) తటస్థముగనున్నను (నడుము మీఁద నున్నదయ్యును, కేన = దేనిచేత, అధికం = మిక్కిలి, తాపం = సంతాపమును, కరోతి = చేయుచున్నది ?

తా. ఈయుద్వృత్తమయిన (గర్వించిన; అని బాహ్యార్థము. గుండ్రనైన; అని అంతరార్థము.) చనుల బరువును, ఈచపలములైన (నిలుకడలేని; బా. కదలుచుండు=అంత.) ఈచంచలము లయిన కనుబొమలును, రాగములుగల (మచ్చరము గలదగు; అని బా. ఎఱుపుగల; అని అంత.)

వ్యథను గలిగించినను గలిగింపనీ. మన్మథుండు స్వయముగా వ్రాసిన సౌభాగ్యమును దెల్పునక్షరపంక్తియో యనఁదగిన యీనూఁగారుమధ్యస్థమయినను (తిన్నదైయున్నను; బా. నడుమనున్నను, అంత.) మీఁదు మిక్కిలిగాఁ దాపంబు గలిగించుచున్నది. ఏకారణముచేతనో తెలియకున్నది. లోకంబున గర్వచాపలద్వేషాదిగుణములు గలవారు పరులకు హాని చేయుట సహజమే. నెమ్మదిగలవాఁడు గూడ నొరులను బాధించుట యాశ్చర్యకరంబుగా నున్నది. నీచనుల యుబ్బును, అదరుపాటును, బెళుకు కనులచూడ్కులును, నీకనుబొమ్మలలీలలును, నీమొఱ్ఱని కెమ్మోవి చిగురును మనమునకు వ్యథను గలిగించుచున్నవి. వీనియన్నిటికంటె నెక్కువగా మరుఁడు వ్రాసినయక్షరములబంతియో యనఁదగు నీనూఁగారు నన్ను మదనానిలసంతప్తునిఁ జేయుచున్నది. నీయెడ మరులు గలిగి, నిన్నుఁ బొందుటకు వీలుగామిచే నన్నీ యంగములెల్ల వెతలఁ ద్రోయుచున్నవి. నన్ను దయతోఁ జూచి నీతోడిపొందనుగ్రహింపుము.

చ. గరువపుఁజన్నులుం బెళుకుగన్నులు నిల్కడలేని కన్బొమల్
   మురియును నెఱ్ఱవాలుజిగిమోవియుఁ దాపముఁజేయగాఁ దగుఁ
   స్మరలిఖితోరుభాగ్యలిపిజాల మనం దగి మధ్యవర్తియై
   పరఁగినరోమరాజియును బాయక తాపముఁ జేయు నాయమే.

శ్లో. ముఖేన చన్ద్రకాన్తేన మహానీలైః శిరోరుహైః,
   కరాభ్యాం పద్మరాగాభ్యాం రేజే రత్నమయీవ సా. 16

వ్యా.——ముఖేన ఇతి——చన్ద్రకాన్తేన ఇన్దుసున్దరేణ చన్ద్రకాన్తమణిరూపేణ చేతి గమ్యతే, ముఖేన చ, మహానీలైరతిమేచకైః సింహలద్వీపసంభవేన్ద్రనీలైశ్చ-శిరోరుహైః కున్తలైశ్చ - 'సింహలస్యాకరోద్భూతా మహానీలాస్తు తే స్మృతాః' ఇతి భగవానగస్త్యః, తథా పద్మస్య రాగ ఇవ రాగో యయోస్తా తాభ్యాం పద్మరాగరూపాభ్యాం చ, కరాభ్యామ్. సా సున్దరీ, రత్నమయీ రత్నరూపేవ, రేజే. * 'తత్ ప్రకృతవచనే మయట్' * 'టిడ్ఢాణఞ్-', ఇత్యాదినా జీప్. అనుష్టుప్.

టీ. చంద్రకాంతేన = చంద్రునివలె నందమైన (చంద్రకాంతమణియైన, అని మఱియొక యర్థము), ముఖేన=ముఖముచేతను, మహానీలైః = మిక్కిలి నల్లనైన (ఇంద్రనీలమణులైన), శిరోరుహైః=తలవెండ్రుకలచేతను, పద్మరాగాభ్యాం=తామరలయొఱుపు

వంటి యెఱుపుగలవైన (కెంపు లయిన), కరాభ్యాం = చేతులచేతను, సా = ఆకాంత, రత్నమయీ ఇవ=మణులచేఁ జేయఁబడినదియో యన, రేజే=ప్రకాశించెను.

తా. చంద్రకాంతమణిరూప మైన మోమును, గొప్పనీలముల రూపు దాల్చినకురులును. పద్మరాగమణిరూపము లైన కరంబులు గలది యగుటం జేసి, యాచెలువ రత్నమయ మై యున్నట్లు కానిపించెను. ఆసుందరియొక్క మోము చందురునిమాడ్కి మనోహరముగను, నెఱికురులు మిక్కిలి నల్లవిగను, హస్తములు తామరపూవులమాడ్కి నెఱ్ఱగను నున్నవి.

తే. మిగుల శశికాంత మైననెమ్మోముచేత
నెఱి మహానీలరుచు లైన నెఱులచేత
జలజరాగము లయినహస్తములచేత
రత్నమయ మనఁ గామినీరత్న మమరె.

శ్లో. గురుణా స్తనభారేణ ముఖచన్ద్రేణ భాస్వతా,
శనైశ్చరాభ్యాం పాదాభ్యాం రేజే గ్రహమయీవ సా. 17

వ్యా.—గురుణేతి.—గురుణా దుర్భరేణగీష్పతిరూపేణ చ-ని. 'గురుస్తు గీష్పతౌ శ్రేష్ఠే గురౌ పితరి దుర్భరే' ఇత్యుభయత్రాపి శబ్దార్ణవే. స్తనభారేణ చ, భాస్వతా ప్రకాశవతా భాస్కరేణ చ- ని. 'భాస్వాన్ భాస్కరసూర్యయోః' ఇతి విశ్వః. ముఖమేవ చన్ద్రస్తేన చ, శనైశ్చరాభ్యాం మన్దగమనాభ్యాం శనైశ్చరాఖ్యగ్రహాభ్యాం చ, పాదాభ్యాం చ సా గ్రహమయీవ రేజే, ప్రక్రియా తు పూర్వవత్.

అత్ర శ్లోకద్వయేఽపి శ్లేషమహిమ్నా రత్నమయత్వగ్రహమయత్వోత్ప్రేక్షణాత్ శ్లేషసంకీర్ణేయముత్ప్రేక్షా; తయా చాస్యా లోకోత్తరాకారరూపలావణ్యసౌన్దర్యకాన్తివిశేషభాగ్యసౌభాగ్యాదిసకలకల్యాణగుణాభిరామత్వం గమ్యతే; ఏతచ్చ మదీయశృఙ్గారశృఙ్గాటకే రుక్మిణీవల్లభవ్యాఖ్యానే 'నిధిమయీ గ్రహమయీ' ఇత్యత్ర విస్తరేణ ప్రపఞ్చితమితీహోపరమ్యతే. అనుష్టుప్.

టీ. గురుణా=గొప్పదియైన (బృహస్పతియైన, అనియర్థాంతరము), స్తనభారేణ = చనులబరువుచేతను భాస్వతా=కాంతి గల (సూర్యునిచేతను), ముఖచంద్రేణ = ముఖము అనెడి చంద్రునిచేతను, శనైశ్చరాభ్యాం=మెల్లగ నడచు (శనైశ్చరు లయిన), పాదాభ్యాం=అడుగులచేతను, సా = ఆకాంత, గ్రహమయీ ఇవ = గ్రహరూపిణియో యన

(అనఁగా: బ్రహ్మ గ్రహములచేతనే యా మెయవయవముల నిర్మించెనో యనునట్లు), రేజే=ప్రకాశించెను.

తా. స్తనభార మనెడి గురువును, వెలుఁగు గలవాఁడగు ముఖ మనెడి చంద్రుఁడును, శనైశ్చరము లగుపాదంబులును గలది యౌట వలన నాసుందరి గ్రహమయి యుండునట్లు మెఱయుచుండెను. ఆ మగువయొక్క మోము చంద్రునివలెను, స్తనములు మిక్కిలి బరువు గలవిగను, పాదములు తిన్ననినడక గలవిగాను నుండెను.

క. గురు వగుకుచభారంబును
సరసకళాభాస్వదాస్యశీచంద్రుండు శనై
శ్చరము లగుచరణములుఁ గల
కరిగమన దనర్చె నౌర! గ్రహరూప యనన్.

శ్లో. తస్యాః స్తనౌ యది ఘనౌ జఘనం చ హారి
వక్త్రం చ చారు తవ చిత్త కిమాకులత్వమ్,
పుణ్యం కురుష్వ యది తేషు తవాస్తి వాఞ్ఛా
పుణ్యైర్వినా న హి భవన్తి సమీహితార్థాః. 18

వ్యా.—తస్యా ఇతి.—తస్యాస్తరుణ్యాః స్తనౌ, ఘనౌ నిబిడౌ యద్యపి, జఘనం కటిపురోభాగశ్చ, హారి మనోహారి యద్యపి- ని. 'స్త్రీకట్యాః క్లీబే తు జఘనం పురః' ఇత్యమరః. వక్త్రం చ చారు మనోజ్ఞం యద్యపి, హేచిత్త, తవ, ఆకులత్వం లోలుపత్వం, కిం కిమర్థమ్? మాస్త్విత్యర్థః, తావన్మాత్రేణాసంభవాదితి భావః. తర్హి కిం కర్తవ్యమిత్యత ఆహ—తేషు స్తనాదిషు, తవ, వాఞ్ఛా సంభోగాభిలాషః, ఉ_స్తి యది వర్తతే చేత్, తర్హి పుణ్యం సత్కర్మ, కురుష్వ సమాచర. కుతః? పుణ్యైర్వినా సమీహితార్థా వాఞ్ఛితార్థా, న భవన్తి హి ఖలు, జ్యోతిష్టోమాదిసత్కర్మాచరణేన రమ్యాసంభోగవత్కేన చిత్పుణ్యవిశేషేణ తవాపి తత్సంభోగః సంభవిష్యతీతి భావః అర్థాన్తరన్యాసాలంకారః.

వసన్తతిలకా.

టీ. తస్యాః = ఆపెయొక్క, స్తనౌ=చన్నులు, ఘనౌ=గొప్పవి (ఒండొకటి కదిసినవి అని కాని), జఘనం చ=మొలయు, హారి=అందమైనది, వక్త్రం చ = ముఖమును, చారు=సుందరమైనది, యది=ఆయినందులకు, చిత్త = ఓమనసా! తవ = నీకు, ఆకులత్వం కిం=కలఁత యేల? తేషు=వానియందు, తవ = నీకు, వాంఛా యది=కోరికయేని, పుణ్యం=

పుణ్యమును, కురుష్వ=చేసికొనుము. (ఏల యన) పుణ్యైః వినా=పుణ్యములులేక, సమీహిత అర్థాః=కోరఁబడిన వస్తువులు, న భవంతి హి=కలుగవుగదా?

తా. ఆనాతియొక్కగుబ్బలు గొప్పవిగా నున్న నేమి? ఆయుగ్మలి పిఱుఁదులు మనోహరంబుగా నున్న నేమి? ఆయతివ మోము చక్కనిదిగ నున్న నేమి? ఓమనసా! నీ కేల యీకొఁవరపాటు? నీకు వానియందుఁ గోర్కి గలదేని,తపస్సు దానము మొదలగుపుణ్యకార్యములను జేయుము. దానధర్మాదులం జేయక కోరినకోర్కు లబ్బునే? జ్యోతిష్టోమాదియాగం బుల నొనరించువారికి రంభాదితెఱగంటియన్నువలసంభోగ మబ్బినట్లు, ఏదియో పుణ్యవిశేష మున్న నే కాని యోమనసా! నీకట్టియుత్తమాంగనయొక్క సంభోగము దొరక నేరదు.

చ. సుదతిపయోధరంబు లతిసుందరముల్ జఘనంబు రమ్య మా
వదనము హృద్య మంచుఁ జలవర్తన మేటికి నీకుఁ జిత్తమా
కదలక వానిపైఁ దలఁపు గల్గినఁ బున్నెము లాచరింపు మిం
పొదవ లభించునే సుకృతయోగము లేక సమీహితార్థముల్.

అవ. సుందరస్త్రీలవిలాసమహిమను వర్ణింపుచున్నాఁడు:—

శ్లో. ఇమే తారుణ్యశ్రీనవపరిమళాః ప్రౌఢసురత
ప్రతాపప్రారంభాః స్మరవిజయదానప్రతిభువః,
చిరం చేతశ్చోరా అభినవవికారైకగురవో
విలాసవ్యాపారాః కిమపి విజయన్తే మృగదృశామ్. 19

వ్యా —అథ విలాసవర్ణనం నిగమయతి —ఇమే ఇతి.—తారుణ్యశ్రియో యౌవనసంపదో- నవపరిమలా నూతనపరిమలప్రాయాః తద్వదభివ్యఞ్జకా ఇత్యర్థః యద్వా తారుణ్యశ్రియో నవోఽపూర్వః పరిమలః సౌభాగ్యవిశేషో యేషాం తే తథోక్తాః, ప్రౌఢసురతం ప్రచణ్డరతిస్తత్ర యః ప్రతాపః సామర్థ్యమ్ తస్య-ప్రారమ్భా ఉపక్రమాః, స్మరస్య జగజ్జిత్వరస్య మన్మథస్య విజయదానే-ప్రతిభువః, లగ్నకాః. ని. 'స్యుర్లగ్నకాః ప్రతిభువః' ఇత్యమరః. యథా ప్రతిభువః అధమర్ణాత్ ధనముద్ధృత్య ఉత్తమర్ణాయ దాతుం సమర్థాస్తథా ఇమేఽపి దిగ్విజయమాకృష్య స్మరాయ దాతుం సమర్థా ఇత్యర్థః, చిరం చిరకాలమారభ్య, చేతశ్చోరాః చిత్తాకర్షకాః మనోహరా ఇతి యావత్, అభినవ

వికారై రాకస్మికభయకమ్పానుకరణాదిప్రత్యగ్రయౌవనవికారై రేక గురవోఽత్యన్తభూయిష్ఠా, మృగదృశాం తరుణీనాం సంబన్ధిన ఇమే పూర్వోపవర్ణితా, విలాసవ్యాపారాః శృఙ్గారచేష్టావిశేషాః కిమపి అనిర్వాచ్యతయా, విజయన్తే సర్వోత్కర్షేణ వర్తన్తే. *'విపరాభ్యాం జేః' ఇత్యాత్మనేపదమ్. శిఖరిణీవృత్తమ్.

టీ. మృగదృశాం=లేడికన్నులుగలస్త్రీలయొక్క, తారు...మళాః - తారుణ్య=యౌవనముయొక్క, శ్రీ=సంపదయొక్క, నవపరిమళాః = క్రొత్తతావులను, ప్రౌఢ...రమ్భాః-ప్రౌఢసురత=కఠినరతులయందలి, ప్రతాప=నేర్పుయొక్క, ప్రారంభాః=ఉపక్రమములును, స్మర...భువః-స్మర = మన్మథునియొక్క, విజయ = గెల్పును, దాన=ఇచ్చుటయందు, ప్రతిభువః = పూటకాపులు, చిరం = బహుకాలమునుండి, చేతః చోరాః=మనసుయొక్క దొంగలును, అభి...భవః-అభినవ = క్రొత్తలైన, వికార = మనోవికారములకు, ఏకగురువః=ప్రధాన గురువులు నగు, ఇమే=ఈ, విలాస వ్యాపారాః = శృంగారచేష్టలు, కిమపి = చెప్ప నలవి గాకుండునట్లు, విజయన్తే=అన్నిటికన్న మిన్నలైయున్నవి.

తా. లేడి కన్నులంబోలు కన్నులుగలచెలువలయొక్క యీశృంగారచేష్టలు జవ్వనముచే గడు మెఱయు నసియు, విస్తార మగు మరుకేళిసల్పుటయందుఁ గల నేర్పునకుఁ బ్రారంభదశను దెల్పునవియు, మరునికి గెల్పు నొసఁగుటకుఁ బూఁటకాఁపులును, విడువక కాముకులడెందములను జూఱగొనునవియు, క్రొత్తక్రొత్తసింగారంపువికారములను బాగుగ నేర్పఁగలవియు నై యింతింతనరానిమహిమతోఁ గూడి వెలయుచున్నవి.

చ. కనఁదగు నిండుజవ్వనపుఁ గల్మికిఁ దావులు ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు ♦ పుష్పధనుర్జయదానదక్షవా
క్యనసిజచిత్తహారులు వి♦కారనిదానము లైన కామినీ
జనులవిలాసకృత్యములు ♦ సంతతరమ్యతరంబు లెన్నఁగన్.

అవ. కామినులయం దెక్కువ మోహము గలవానియొక్క సర్వస్వమును వారపహరింతు రని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ప్రణయమధురాః ప్రేమోద్గారా రసాశ్రయతాం గతాః
ఫణితిమృదులా ముగ్ధప్రాయాః ప్రకాశితసమ్మదాః,
ప్రకృతిసుభగా విస్రమ్భార్ద్రాః స్మరోదయదాయినో
రహసి కిమపి స్వైరాలాపా హరన్తి మృగీదృశామ్. 20

వ్యా.—ప్రణయ ఇతి.—

'ఏప్రమ్ణః పరమాం కాష్ఠామారూఢే దర్శనాదిభిః,

యేనాన్తరఙ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే.'

ఇత్యుక్తలక్షణః స్నేహః ప్రణయశబ్దేన వివక్షితః. తేన ప్రణయేన మధురాః సంతాపహరాః. 'శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృతమ్, ఇతి లక్షణాత్, ప్రేమ్ణా అనురాగవిశేషేణ - ఉదారా రమ్యాః - మనోహరా ఇతి యావత్, రసాశ్రయతాం శృఙ్గారాస్పదత్వం గతాః - శృఙ్గారరసప్రసరోల్లసితా ఇత్యర్థః. ఫణిత్యా సందర్భవిశేషేణ - ‡ మధురాః మాధుర్యగుణయుక్తాః అమృతప్రాయా ఇత్యర్థః, ముగ్ధప్రాయాః సౌకుమార్యభరితాః - శ్రుతిరఞ్జకా ఇత్యర్థః. ప్రకాశితోఽభివ్యఞ్జితః సమ్మదః సంభోగౌత్సుక్యం - యైస్తే తథోక్తాః, ప్రకృతిసుభగాః స్వభావరుచిరాః, విస్రమ్భార్ద్రాః విశ్వాసపరిప్లుతాః, అత ఏవ, స్మరోదయదాయినో జితేన్ద్రియస్యాపి మన్మథోద్రేకావహాః, మృగీదృశాం సంబన్ధినః స్వైరాలాపాః సర్వోక్తయ ఇతి యావత్, రహసి కమపి హరన్తి యద్వా రహసి స్వైరాలాపా ఇత్యన్వయః, కిమపి హరన్తి, యద్వా అనిర్వాచ్యతయా మనోహరా భవన్తీత్యర్థః.

అత్ర శ్లోకద్వయే సమర్థసహిష్ణోః శృఙ్గారస్య పాకసమయేఽప్యాస్వాద్యమానత్వాదన్తర్బహిఃస్ఫురణేన ద్రాక్షాపాకోఽనుసంధేయః. 'ద్రాక్షాపాకః స కథితో బహిరన్తఃస్ఫురద్రసః' ఇతి లక్షణాత్; తథా శ్లేషప్రసాదాదయో దణ్డ్యాచార్యోక్తా దశ ప్రాణాశ్చ ప్రాయేణాత్ర సన్తి. నిపుణైరున్నేయా ఇతి సంక్షేపః; ప్రకరణేఽస్మిన్నాప్రియశో నాయకా అనుకూలా దక్షిణాశ్చాఽనుసంధేయాః. 'ఏకాయత్తోఽనుకూలః స్యాత్తుల్యోఽనేకత్ర దక్షిణః' ఇతి లక్షణాత్ - హరిణీవృత్తమ్.

టీ. ప్రణయమధురాః - ప్రణయ = బతిమాలుటయందు, మధురాః=మనసును కరగించునవియు, ప్రేమఉద్గారాః = ప్రీతిని గ్రక్కునవియు, రసాశ్రయతాం ఆనందమునకు, లేక శృంగారరసమునకు, ఉనికిపట్టగుటను, గతాః=పొందినవియు, ఫణితి మృదులాః = ముచ్చటలయందు ముద్దుగుల్కునవియు, ముగ్ధప్రాయాః = గోలతనము మెండుగాఁగలవియు, ప్రకాశితసంమదాః = తెలుపఁబడిన వలపు గలవియు, ప్రకృతి సుభగాః = పుట్టువుచేతనే సొంపైనవియు, విస్రంభఆర్ద్రాః=నమ్మకముచేత తడిసినవియు (అనఁగా; మిక్కిలి నమ్మకము గలవి యనుట), స్మరా...దాయినః - స్మర ఉదయ = కామోత్పత్తిని (కామవికారములను), దాయినః = కలిగించునవియు, (అగు) మృగీదృశాం=హరిణాక్షులయొక్క, రహసి=రహస్యమునందలి, స్వైర ఆలాపాః=చనవుతోడి మాటలు; కిమపి=చెప్పనలవిగాకుండ, హరంతి = (మనస్సును) లాగుచున్నవి.

తా. లేడికన్నులవంటి కన్నులు గలయంగన లేకతంబునఁ జనవుతో మాటాడుమాటలు ప్రేమచేఁ దియ్యనివియు, అనురాగమును వెలువరించునవియు, శృంగారరసమున కాదరువులైనవియు, మాటాడురీతిచే మధురములును, స్పష్టములు గానివియు, నిబ్బరంపుసంతసముఁను వెలిపుచ్చునవియు, స్వభావముచేతనే సొంపులును, నమ్మికచే సరసములును, మన్మథవికారము గలిగించునవియు నై కాముకుల యానందనమును దోఁచుకొనుచున్నవి.

మ. ప్రణయశ్రీమధురంబు లుజ్జ్వలరసప్రాచుర్యముల్ ప్రేమ భూ
షణముల్ దర్శితహర్షముల్ రుచిరవిశ్వాసార్ద్రిముల్ హృద్యముల్
ఫణితిశ్రావ్యము లంగజప్రభవముల్ ప్రాణేశ్వరీనర్మభా
షణముల్ నామదిఁ గొల్లలాడెడి రహస్యక్రీడలం దెప్పుడున్.

ఇది శృంగారశతకంబున స్త్రీప్రశంస యను
ఒకటవవింశతి.

---

## సంభోగవర్ణనము

అవ. శృంగారము సంభోగశృంగార మని, విప్రలంభశృంగార మని ద్వివిధము. కవి సంభోగశృంగారమును మీఁద సవిస్తరంబుగా వర్ణించువాఁడై, మొదట నొకశ్లోకముచే విప్రలంభశృంగారమును వర్ణింపుచున్నాఁడు:—

శ్లో. విశ్రమ్య విశ్రమ్య వనే ద్రుమాణాం
ఛాయాసు తన్వీ విచచార కాచిత్,
స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయన్తీ శశినో మయూఖాన్. 21

వ్యా.—అథ సంభోగవిప్రలమ్భభేదవిభిన్నయోః శృఙ్గారయోర్మధ్యే సంభోగశృఙ్గారం సప్రపఞ్చముత్తరత్ర వర్ణయిష్యన్నాదౌ విప్రలమ్భశృఙ్గారమేకేనాహ— విశ్రమ్య ఇతి — కాచిత్తన్వీ కృశాఙ్గీ, వనద్రుమాణాం, ఛాయాసు చన్ద్రాతపరహితాధఃప్రదేశేషు - విశ్రమ్య విశ్రమ్య పునః పునః శ్రమమపనీయ * వీప్సాయాం ద్విర్భావః. ని. 'ఛాయాత్వనాతపే కాన్తే' ఇతి విశ్వః, విచచార సంచకార-కేలీవనసంచారస్య విరహిజనవినోదోపాయత్వాదితి భావః. కథంభూతా సతీ? కరోద్ధృతేన హస్తోత్క్షిప్తేన,

స్తనోత్తరీయేణకుచకుమ్భాచ్ఛాదనపటాఞ్చలేన, శశినశ్చన్ద్రస్య,మయూఖాన్కిరణాన్ - అతపానితి యావత్, నివారయన్తీ నిరాకుర్వన్తీ-గ్రీష్మస్మరోవ్యజనేనేవేతి భావః, చన్ద్ర కిరణానాం విరహిణీజనసన్తాపకరత్వాత్తన్నివారణోక్తిః, ఏతేన దశావస్థాపక్షే షష్ఠీ మన్మథావస్థా - తథా చ చతుర్థీ జాగరావస్థా - తథా ఉత్తరీయేణ శశిమయూఖానా మనివారణీయత్వవివేకాభావాచ్చిత్తవిభ్రమప్రతీతేః కామశాస్త్రోక్త ద్వాదశావస్థాపక్షే దశమీ ఉన్మాదావస్థా సూచ్యతే - తన్వీత్యనేన కార్శ్యావస్థా చ కథితా. తదుక్తమ్—

'దృఙ్ మనస్సఙ్గసంకల్పా జాగరః కృశతాఽరతిః,
హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ,' ఇతి;

కామశాస్త్రోక్తాస్తు—

'చక్షుఃప్రీతిర్మనస్సఙ్గః, సంకల్పోఽథ ప్రలాపితా,
జాగరః, కార్శ్యమరతిర్లజ్జాత్యాగో, ఽథ సంజ్వరః,
ఉన్మాదో, మూర్ఛనం చైవ, మరణం చరమం విదుః. ఇతి;

ఇయం చ విరహోత్కణ్ఠితా—

'చిరయత్యధికం కాన్తే విరహోత్కణ్ఠితోన్మనా.' ఇతి లక్షణాత్.
ఉపజాతివృత్తమ్.

టీ. కాచిత్=ఒకానొక, తన్వీ = కృశాంగి (సుందరి), వనే=ఉద్యానవనమందు, కరఉద్ధృతేన-కర = చేతితో, ఉత్ధృతేన = ఎత్తిపట్టుకొనఁబడిన, స్తన ఉత్తరీయేణ = చనుపయ్యెటచే, శశినః=చంద్రునియొక్క, మయూఖాన్ = కిరణములను, నివారయంతీ= అడ్డగించుచు, ద్రుమాణాం = చెట్లయొక్క, ఛాయాసు = నీడలయందు, విశ్రమ్య విశ్రమ్య = విశ్రమించి విశ్రమించి, విచచార=తిరిగెను.

తా. ఒకానొకకాంత ప్రియవిరహముచేఁ జిక్కినమేను గలదై, యొక్కవనంబునఁ బ్రొద్దుపుచ్చ వచ్చి యచ్చటఁ గాయుచుండు పండు వెన్నెలలతాపంబు సైరింపఁ జాలక తనపైఁటకొంగు నెత్తి యావెన్నె లలు దనపైఁ బడకుండునట్లు నివారించుచుఁ జెట్లయొక్క దట్టములైన నీడలయందు మాటిమాటి కలసటఁ దీర్చుకొనుచుఁ దిరుగుచుండెను.

చ. వి: హాకృశాంగి యైనఘనవేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందు నుచితంబుగ మాటికి విశ్రమించి బం
ధురగతి సంచరించెఁ జనుఁదోయిని బయ్యెదకొంగుఁ గేలఁ దా
వెరవుగఁ బూని యగ్గలపుఁ వెన్నెలకాఁకఁ దొలంగఁ జేయుచున్.

అవ. కవి సంభోగశృంగారమును వర్ణింపఁ బూని యందు బాహ్యము, ఆభ్యంతరము అను ద్వివిధశృంగారములలో మొదటిదియగు ఆలింగనాదిరూప మైన బాహ్య శృంగారమును రెండుశ్లోకములచే వర్ణింపుచున్నాఁడు:—

శ్లో. అదర్శనే దర్శనమాత్రకామా
దృష్ట్వా పరిష్వఙ్గరసైకలోలాః,
ఆలిఙ్గితాయాం పునరాయతాక్ష్యా
మాశాస్మహే విగ్రహయోరభేదమ్. 22

వ్యా.—అథ సంభోగశృఙ్గారః—స చ బాహ్యాభ్యన్తరభేదేన ద్వివిధః, వాత్స్యాయనేనాప్యస్య ద్వివిధస్యాఽపి ప్రకారాన్తరేణ ద్వివిధత్వముక్తమ్;—

'బాహ్యమాభ్యన్తరం చేతి సురతం ద్వివిధం స్మృతమ్,
తత్రాద్యం చుమ్బనాశ్లేషనఖదన్తక్షతాదికమ్,
ద్వితీయం సురతం సాక్షాన్నానాకరణకల్పితమ్.' ఇతి.

తత్ర ప్రథమమాలిఙ్గనరూపం సోపస్కారమాహ ద్వాభ్యామ్—

అదర్శన ఇతి.—అత్ర యత్తచ్ఛబ్దాధ్యాహారేణాన్వయః కార్యః, అదర్శనే ప్రియతమవిషయకదర్శనాభావే సతి * క్వచిత్ప్రసజ్యప్రతిషేధేఽపి నఞ్సమాసఇష్యతే- యథా అదర్శనమశ్రవణమభాషణమనుచ్చారణమిత్యాద్యభియుక్తోక్తైః, దర్శనమాత్రఏవ కామోఽభిలాషో యస్యాః సా తథోక్తా - తావన్మాత్రాభిలాషిణీత్యర్థః. తతో దృష్ట్వా, ప్రియతమమితి శేషః. పరిష్వఙ్గసుఖే ఆలిఙ్గనజనితసుఖే - ఏకం ముఖ్యం యథా తథా - లోలా సతృష్ణా. ని. 'లోలశ్చలసతృష్ణయోః' ఇత్యమరః.యా-ఆయతాక్షీతి శేషః, తస్యామాయతాక్ష్యాం కర్ణాన్తవిశ్రాన్తలోచనాయాం ప్రియతమాయాం. పునరాలిఙ్గితాయాం సంపరిష్వక్తాయాం సత్యామ్, విగ్రహయోః శరీరయోః. ని. 'శరీరం వర్ష్మ విగ్రహః' ఇత్యమరః. అభేదమ్ ఐక్యమ్, ఆశాస్మహే-తాదృగ్గాఢాలిఙ్గనసుఖమనుభవితుమభిలషామహే ఇత్యర్థః. తద్యథా—'ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కిఞ్చన వేద నాన్తరమేవాయం పురుషః' ఇత్యాదిశ్రుతేః ప్రియతమాగాఢాలిఙ్గనపరిష్వఙ్గే విగలితవేద్యాన్తరత్వేన బ్రహ్మానన్దసబ్రహ్మచారి సుఖవిశేషసంభవాత్తథావిధాలిఙ్గనాశంసనం యుక్తమేవేతి భావః. తదుక్తం రతిరహస్యే—

'తత్సౌఖ్యం పరతత్త్వవేదనమహోఽనన్దోపమం మూఢధీః,
కో వా నిన్దతి సూక్ష్మమన్మథకలావైచిత్ర్యమూఢో జనః.' ఇతి;

అన్యత్రాప్యుక్తమ్—

'ప్రౌఢాలిఙ్గనచుమ్బనామితసుఖం ప్రచ్ఛన్నవేద్యాన్తరమ్' ఇతి;
వృత్తం పూర్వవత్.

టీ. అదర్శనే=చూచుటకు లేనప్పుడు (చూడకమునుపు), దర్శ...కామాః-దర్శనమాత్ర=చూచుటయందు మాత్రము, కామాః=కోరికగలవారము (అగుదుము.) దృష్ట్వా = చూచి, పరి...లోలాః-పరిష్వంగ = ఆలింగనముయొక్క, రస=ఆనందమునందు; ఏక = ముఖ్యముగా, లోలాః=ఆసక్తిగలవారము, (అగుదుము.) పునః = మరల, ఆయతాక్ష్యాం= ఆవాలుగంటి,ఆలింగితాయాం=కౌఁగిలింపఁబడఁగా, విగ్రహయోః=శరీరములకు, అభేదం= వేఱులేకుండుటకు (ఐక్యమును), ఆశాస్మహే = కోరుదుము. (ఇచట కొందఱీ రీతి నన్వయింతురు——యా = ఏది, ...దర్శనమాత్రకామా = చూచుటయందు మాత్రము కోరికగలదియో; ...పరిష్వంగరసైకలోలా = కౌఁగిలింతయొక్క యానందమునందు ముఖ్యముగ నాసక్తిగలదియో, (తస్యాం=ఆ,) ఆయతాక్ష్యాం...)

తా. ఒకచెలువను జూడకుండునంతవఱకు దానిదర్శనమైన మన కబ్బునా యని కోరుచుందుము. చూచిన తర్వాత దానిబిగికౌఁగిలింతల యందే యాస గలిగియుందుము. ఆమచ్చెకంటి నాలింగనము చేసి కొన్నతర్వాత మా రెండుమేను లెప్పటికిని వీడకుండవలె నని కోరుచుందుము.

ఉ. బాలిక నన్నుఁ గన్గొననిపట్టున దర్శనమాత్ర మబ్బినం
జాలునటంచుఁ గోరె మది ◊ చక్కఁగఁ గన్నుల నన్నుఁ జూచి ప్రో
యాలు కవుంగిలింపవలె ◊ నంచుఁ దలంచెఁ దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్న నిరు◊ మేనులు నొక్కటి సేయఁ గోరితిన్.

అవ. పుష్పమాలికలు, అగరు, గంధము మొదలగువానిని ధరించుటతోఁగూడఁ జేసిన ప్రియాసంగమమే స్వర్గసుఖద మని వర్ణించుచున్నాడు:——

శ్లో. మాలతీ శిరసి జృమ్భణోన్ముఖీ
చన్దనం వపుషి కుఙ్కుమావిలమ్,
వక్షసి ప్రియతమా మదాలసా
స్వర్గ ఏష పరిశిష్ట ఆగతః. 23

వ్యా.——ఏవం పరమానన్దానుసంధాయకత్వేన పరిష్వఙ్గస్యాపవర్గత్వముక్త్వా సంప్రతి స్వర్గరూపత్వమాహ.——మాలతీ.——శిరసి మాలతీతి జాతి కుసుమమాలికేత్యర్థః. ని. 'సుమనామాలతీ జాతిః' - 'పుష్పే జాతిప్రభృతయః' ఇత్యుభయత్రాప్యమరః.

*పుష్పమాలేషు బహులమ్' ఇతి లుక్, ముఖే జృమ్భణం మదనమదజనితజృమ్భశ్చ - ని.'జృమ్భస్తు త్రిషు జృమ్భణమ్' ఇత్యమరః. యద్వా సంభోగౌత్సుక్యసూచక రాగవిలాస స్ఫూర్తిశ్చ, వపుషి, కుఙ్కుమావిలం కాశ్మీరజ మిశ్రితం ఘుసృణరసమసృణితం వా, చన్దనం పాటీరపఙ్కం చ వక్షసి, మదాలసా మదేన మన్థరా, ప్రియతమా గాఢాలిఙ్గిత మత్తకాశినీ చ, ఇత్యేషోఽయం సముదాయః, స్వర్గః స్వర్గశబ్దవాచ్యః. ఆగమః ఏతద్వ్యతిరిక్తస్వర్గాభిధాయకశాస్త్రం తు, పరిశిష్టః వదానభిజ్ఞత్వాదముఖ్యః, స్వర్గపదవాచ్యముఖ్యార్థబోధకాన్యఇత్యర్థః, అన్యథైతత్స్వర్గత్వేనైవ వదేదితి భావః.స్వర్గసమానసౌఖ్యప్రదోఽయమేవేతి పరమార్థః. రథోద్ధతావృత్తం.'రాన్నరావిహ రథోద్ధతా లగౌ' ఇతి లక్షణాత్.

టీ. శిరసి=తలయందు, జృంభణఉన్ముఖీ = పూచుటకు సిద్ధముగా నున్న, మాలతీ= జాజిపూవులమాలయును, వపుషి = దేహమునందు, కుంకుమ ఆవిలం = కుంకుమపూవుతోఁ గూడిన, చందనం = గంధమును, వక్షసి=ఱొమ్మున, మద అలసా=(యౌవన) మదముచే సోలుచున్న, ప్రియతమా=ప్రియురాలు, ఏషః=ఇది (భోగము), పరిశిష్టః = మిగిలినదై, ఆగతః = (కులోకమునకు) వచ్చిన, స్వర్గః = స్వర్గము, (స్వర్గమునందలి భోగమే యనుట.)

తా. ఏమానవుఁడరవిరిసిన జాజిపూవులమాలను ధరించి కుంకుమ పువ్వుతోఁ జేర్చిన చందనము మేని కలఁదుకొని మనోహర యగు ప్రేయసిని ఱొమ్మునఁ జేర్చుకొనుచున్నాఁడో వాఁడీలోకంబుననే స్వర్గసుఖంబు ననుభవించుచున్నాఁడు.

చ. తలపయి మాలతీకుసుమదామము నెమ్మెయిఁ గుంకుమంబుతోఁ
  గలసినకమ్మతావి విరిగంధపుఁబూత వెడందఱొమ్మునం
  దలికులనీలకుంతల మదాలస నీలసరోరుహాక్షియుం
  గలుగుట నింద్రభోగ మనఁగాఁ దగదే మణి వేఱె యున్న దే.

అవ. ఇఁక నాభ్యంతరశృంగారమును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. ప్రాఙ్మామేతి మనాగనాగతరసం జాతాభిలాషం తతః
  సవ్రీడం తదను శ్లథీకృతతను ప్రత్యస్తధైర్యం పునః,
  ప్రేమార్ద్రం స్పృహణీయనిర్భరరహఃక్రీడాప్రగల్భం తతో
  నిశ్శఙ్కాఙ్గవికర్షణాధికసుఖం రమ్యం కులస్త్రీరతమ్.

వ్యా.—అథాభ్యన్తరసంభోగం వర్ణయితు ముపక్రమతే.—ప్రాగితి.—ప్రాక్ ప్రారమ్భే, మనాక్ అల్పం, మామేతి మాస్తు మాస్త్వితి నిషేధవచనేన, అనాగతః అనుత్పన్నః రసోఽనురాగవిశేషో యస్మింస్తత్, మౌగ్ధ్యాదితి భావః. తతో నిషేధానన్తరం జాతోఽఙ్కురితోఽభిలాషో వాఞ్ఛా యస్మింస్తత్తథోక్తమ్. తదన్వభిలాషానన్తరమ్ * 'అనుర్లక్షణే'ఇతి కర్మప్రవచనీయత్వాద్వితీయా, సవ్రీడం స్రంసనాదిషు మన్దోద్యమనభావో వ్రీడా తయా సహ సవ్రీడమ్ - * 'తేన సహ-' ఇతి తుల్యయోగే బహువ్రీహిః, * 'వోపసర్జనస్య' ఇతి సహభావస్య సత్వమ్. అథ వ్రీడానన్తరం, శ్లథోద్యమం నిరాకరణే శిథిలప్రయత్నమ్, పునరుద్యమనాభావానన్తరమ్- పునః శబ్దోఽత్రానన్తర్యార్థకః,ప్రధ్వస్తం విగలితం-ధైర్యం ప్రాతిలోమ్యలక్షణమ్ యస్మింస్తత్తథోక్తమ్-అఙ్గీకృతాభిముఖ్యమిత్యర్థః. తతః ప్రేమార్ద్రం ప్రణయరసపరిప్లుతమ్. తతః స్పృహణీయా అన్యోన్యమభిలషణీయా-నిర్భరా ఉద్వేలాశ్చ-యా రహఃక్రీడా ఏకాన్తకేలయః విస్రమ్భవిహారా ఇత్యర్థః-తాభిః ప్రగల్భం ప్రౌఢమ్. తతో నిస్సఙ్గేనాప్రతిబన్ధేన - అఙ్గవికర్షణేన కుచాద్యవయవమర్దనేన అధికం సుఖం పరమానన్దో-యస్మింస్తత్తథోక్తమ్, కులస్త్రీరతం స్వస్త్రీసంభోగః రమ్యం సున్దరమ్-అత్యన్తమనోహరమితి యావత్; ఏతచ్చ ప్రథమసమాగమపరత్వేన ద్రష్టవ్యమ్ అన్యథోక్తవ్యవహారాసంభవాదితి భావః. కులశబ్దవ్యావృత్తసంభోగ స్యాదిత అరభ్య ప్రాగల్భ్యఘటితత్వేనోక్తవిలక్షణత్వాదన్యాదృశో ద్రష్టవ్యః.

నాయికా తు ముగ్ధా, నాయకస్తూత్తమోఽనుకూలః కామతన్త్రేషు నిపుణః, అన్యథోక్తక్రమసంభోగాసంభవాదితి మన్తవ్యమ్ సంభోగలక్షణముక్తం రతిరహస్యే —

'అనుకూలౌ నిషేవేతే యత్రాఽన్యోన్యం విలాసినౌ,
దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః.' ఇతి

అత్ర మామేతి వాగారమ్భసూచితైరనుభావైర్జాతాభిలాషమిత్యుక్తేన రత్యాఖ్యాస్థాయీభావేన, సవ్రీడమిత్యనేనోపలక్షితైః సంచారిభావైః, అవశిష్టైర్విశేషణైర్యథాయథం ప్రతీయమానైరనుభావాదివిశేషైః కులస్త్రీ ఇత్యుక్తేనాలమ్బనవిభావేన ప్రతీయమానో రససార్వభౌమ, శృఙ్గారో నిస్సఙ్గాఽఙ్గవికర్షణాఽధికసుఖమిత్యనేన పరిపోషాతిశయం ప్రాప్నోతీతి వేదితవ్యమ్. శార్దూలవిక్రీడితమ్.

టీ. ప్రాక్=మొదట, మనాక్ = కొంచెము, మామాఇతి=వలదువలదని, అనాగతరసం = వెలువడని రుచిగలదియు. తతః=తరువాత, జాతఅభిలాషం = పుట్టినకోరికగలదియు, (తదను=పిదప) సవ్రీడం = సిగ్గుతోఁ గూడునట్లు, శ్లథీకృతతను = సడలింపఁబడిన యవయవములు గలదియు, పునః=తరువాత, ప్రత్యస్తధైర్యం=తొలఁగిన దిట్టతనముగలదియు, ప్రేమ ఆర్ద్రం=ప్రీతిచే తడిసినదియు (పూర్ణానురాగము గల దనుట) స్పృహ

గల్భం-సప్రహాణీయ = కోరఁదగిన, నిర్భర=మితిలేని, రహః క్రీడా=ఏకాంతకేళియందు, ప్రగల్భం = గట్టితనముగలదియు, తతః = అటుతరువాత, నిశ్శంక...సుఖం-నిశ్శంక = భయములేని, అంగ = అవయవములయొక్క, వికర్షణ = రాపిడిచేత, అధిక = ఎక్కువైన, సుఖం=ఆనందముగలదియు, (అగు) కులస్త్రీరతం=కులకాంతపొందు, రమ్యం = మనోహరమైనది.

తా. రతి గలుగకముందు వలదు వల దని యడ్డుబాటుతోఁ గూడినదియు, అనంతర ముదయించినరాగము గలదియు, ఆపైని సిగ్గుతోఁ గూడినదియు, తరువాత వివశమైన శరీరము గలదియు, పిదప విడువఁబడిన ధైర్యము గలదియు, అనురాగముతో నిండినదియు, కమనీయమై గాఢానురాగయుక్తమైన ఏకాంతక్రీడచే ప్రౌఢమైనదియు, అంతనుండి జంకులేక కుచాద్యవమర్దనము వలన మించిన సుఖము గలిగిన కులకామినీసురతమే మనోహరమైనది.

ఉ. ఆది మితాదరంబు తదనంతర మంచితరాగ మంత ల
జ్జోదయరమ్య మంత శిథిలోద్యమ మంత నితాంతధైర్యవి
చ్ఛేదము ప్రేమపూరము విశేషనివిక్తవిహార మంత నా
హ్లాదకరాంగసంగము కులప్రమదారత మల్పసౌఖ్యమే.

శ్లో. ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కించి దున్మీలితానామ్,
ఉపరిసురతఖేదస్విన్నగండస్థలానాం
అధరమధు వధూనాం భాగ్యవన్తః పిబంతి. 25

వ్యా.—అథ యదుక్తమ్ 'నానాకరణకల్పితమ్' ఇతి, తత్ర నానాకరణాని ధైనుకాదిబన్ధవిశేషాః, తేషాం మధ్యే ఏకం బన్ధవిశేషం వివక్షుస్త దనుకూలముపరిసురతమాహ:- ఉరసీతి.—ఉరసి నిపతితానాం పురుషాయితబన్ధవశాద్వక్షఃస్థల మధిష్ఠితానామ్, అత ఏవ స్రస్తధమ్మిల్లకానాం రతిరభసవిశ్లథకచప్రచయానామ్ - ని. 'ధమ్మిల్లః సంయతాః కచాః, ఇత్యమరః. ముకుళితనయనానాం సుఖపారవశ్యాల్లజ్జానుభావానుకరణాద్వా వినిమీలితలోచనానామ్, తథాఽపి కిఞ్చిదున్మీలితానామ్ ఈషన్ముకుళితలోచనానామ్-అన్యథా

అనౌచిత్యాదితి భావః. అత ఏవ ఉపరిసురతే యః-ఖేదః శ్రమస్తేన స్విన్నాని స్వేదార్ద్రాణి-గణ్డస్థలాని యాసాం తాసామ్-'శ్రమః ఖేదో హి రత్యాదేర్జాతః స్వేదాదిభూమకృత్' ఇతి లక్షణాత్, వధూనాం ప్రియతమానాం సంబన్ధి, అధరమధు అధరామృతం, భాగ్యవన్తః భాగ్యశాలినః, పిబన్తి స్త్రీముఖస్య నిజముఖసామ్ముఖ్యాదక్లేశేనాధరం చుమ్బన్తీత్యర్థః. ఏతచ్చ పుణ్యకృతామేవ సంభవతి, న త్వన్యేషామతఏవ భాగ్యవన్త ఇత్యుక్తమ్; తథా బాహ్యాసురత విశేషరూపమపి చుమ్బనమారభ్యాభ్యన్తరాఙ్గతయా కథితమిత్యవగన్తవ్యమ్.

పురుషాయితలక్షణముక్తం రతిరహస్యే.—

'స్వేచ్ఛయా శ్రమిణి వల్లభే యథా యోషిదాచరతి పూరుషాయితమ్.' ఇతి. నాయికాస్తు ప్రగల్భాః.—

'స్మరమన్ధీకృతప్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా' ఇతి లక్షణాత్. నాయికా. కామతన్త్రకుశలాః అనుకూలాశ్చ, స్వభావోక్తిరలంకారః—

'స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తువర్ణనమ్' ఇతి లక్షణాత్.

మాలినీవృత్తమ్.

టీ. ఉరసి = ఱొమ్మున, నిపతితానాం = వ్రాలినవారును, స్రస్తధమ్మిల్లకానాం = జాఱినకొప్పుగలవారును, ముకుళితనయనానాం = మూసినకన్నులుగలవారును, కించిత్ = కొంచెము, ఉన్మీలితానాం = (కన్నులు) తెఱచియున్నవారును, ఉపరి...లానాం-ఉపరిసురత=పురుషాయితరతియందలి, ఖేద = అలయికచే, స్విన్న=చెమర్చిన, గండస్థలానాం = చెక్కిలిప్రదేశముగలవారును, (అగు) వధూనాం = యువతులయొక్క. అధరమధు = అధరామృతము, భాగ్యవంతః=అదృష్టవంతులు, పిబంతి=పానముచేయుదురు.

తా. సిగవీడ నానందపారవశ్యమున మూసియు మూయని కనుదమ్ములతోఁ గూడి పురుషాయితక్రీడచేఁ జెక్కులు చెమర్ప రొమ్మున వ్రాలిన కామినులయధరామృతము పుణ్యవంతులు గ్రోలుదురు.

ఉ. అక్కున వ్రాలి కొప్పు విడి కెయ్యలలనాఁడగఁ గన్నుదామరల్
చక్కఁగ మోడ్చి చొక్కి పురుషాయితసంజనితశ్రమంబునం
జెక్కుల ఘర్మబిందువులు చిందఁగ విందొనరించుబోంట్లమే
ల్మొక్కపుమోవితేనె చవిఁజూతురు భాగ్యముఁ గల్గునేర్పరుల్.

అవ. జ్ఞానపూర్వముగాఁ జేయుసంభోగసుఖమే సఫలమని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఆమీలితనయనానాం యః సురతరసోఽను సంవిదం భాతి,
మిథునైర్మిథోఽవధారితమవితథమిదమేవ కామనిర్వహణమ్. 28

వ్యా.—అథ జ్ఞానపూర్వకఏవ సురతానుభవః సార్థకః. న త్వన్య ఇత్యాహ:— ఆమీలిత ఇతి.—ఆమీలితనయనానాం సుఖపారవశ్యాద్దరముకుళిత నయనానాం, యూనాం యః సురతరసః సురతాస్వాదః, సంవిదం అను జ్ఞానమనుసృత్య భాతి-అయ మేతాదృశ ఇతి జ్ఞానగోచరతయా ప్రతిభాతీత్యర్థః. ఇదమేవ జ్ఞానపూర్వకసురతానుభవ ప్రతిభానమేవ, అవితథం అవ్యర్థమ్ - సార్థకమిత్యర్థః, కామస్య మన్మథస్య కామపురుషార్థస్య వా - నిర్వహణం ప్రతిష్ఠాపనమ్-ఉజ్జీవనమితి యావత్, న త్వన్యదాభాసత్వాదితి భావః. మిథునైః, రసజ్ఞైః స్త్రీపురుషైః - ని. 'స్త్రీపుంసౌ మిథునం ద్వన్ద్వ'మిత్యమరః. మిథోఽన్యోన్యం, అవధారితం నిశ్చితమ్ - అనుభవినామేవార్థనిశ్చయసంభవాదితి భావః; జ్ఞానపూర్వకసురతానుభవ ఏవ కామపురుషార్థ ఇతి ఫలితార్థః. అత ఇత్థంభూతసురత మేవ కర్తవ్యమ్ - న త్వన్యాదృశమ్ - తస్య క్లేశమాత్రఫలకత్వాదితి తాత్పర్యమ్. ఆర్యా వృత్తభేదః.

టీ. ఆమీలితనయనానాం=కొంచెము మూసినకన్నులుగలవారి (నాయికానాయకులయొక్క), యః=ఏ, సురతరసః=సంభోగానందము, సంవిదంఅను=జ్ఞానము ననుసరించి, భాతి=ప్రకాశించుచున్నదో (అనఁగా ఈసంభోగ మిటువంటి దని తెలియుచు ననుభవింపఁబడుచున్నదో), ఇదంఏవ=ఇదియే (ఈజ్ఞానమే - అనుభవమే), అవితథం = వ్యర్థము కాని, కామనిర్వహణమ్ - కామ = కామ(పురుషార్థ)ముయొక్క, నిర్వహణం = నెఱవేర్చుట, (అని) మిథునైః = (ఆలుమగల) జంటలచేత, మిథః=పరస్పరము, అవధారితం = నిశ్చయింపఁబడినది.

తా. సురతశ్రమమునఁ గన్నులరమోడ్చినతరుణు లగుస్త్రీపురుషులు తెలివితోఁ గూడి యేసంభోగ సుఖము ననుభవింతురో, ఆసుఖానుభవమే కామపురుషార్థమునకు సాఫల్యమని యారసజ్ఞులగు స్త్రీపురుషులొండొరులు నిర్ధారణ చేసియున్నారు.

తే. కన్నులరమోడ్చి విహరించుచున్నవారి
సురతభోగంబు తెల్వితోఁ బరఁగెనేని
రమ్యమగు నిది కామనిర్వహణ మనుచు
నాయికానాయకులకు నిర్ణయముగాదె.

అవ. స్త్రీపురుషుల కవస్థాభేదముచే నుచితముగామిని, దోషమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. ఇదమనుచితమక్రమశ్చ పుంసాం
యదిహ జరాస్వపి మాన్మథా వికారాః,

యదపి చ న కృతం నితమ్బినీనాం
స్తనపతనావధి జీవితం రతం వా. 27

వ్యా.—అథ సురతావధిం కథయన్నిగమయతి.—ఇదమితి.—ఇహాస్మిం లోకే, పుంసా మిద, మనుచితం అన్యాయ్యమ్, అక్రమో నిర్మర్యాదశ్చ, కిమిదమిత్యాశఙ్క్యాహ-జరాసు వార్ధకావస్థాస్వపీత్యర్థః. మాన్మథా వికారాః సురతవ్యాసఙ్గాః కృతా ఇతి యత్, ఇదమితి సంబన్ధః కిం తు యౌవనావధికసురతమేవ న్యాయ్యం మర్యాదాగోచరం చేత్యర్థః. తదుపరితన సురతస్యాభాసత్వాదితి భావః. తథా నితమ్బినీనాం స్త్రీణాం చ, తదనుచితమ్; కిం తదిత్యత ఆహ— స్తనపతనమ్ అవధిః మర్యాదా యస్య తత్తథోక్తం, జీవితం జీవనం వా, రతం వా సురతం వా, న కృతమితి యత్, బ్రహ్మణేతి శేషః, తదితి సంబన్ధః, స్త్రీణాం తావత్ స్తనపతనావధికమేవ జీవనం కర్తవ్యం, సురతమపి తదవధికమేవ, అన్యథా 'పఞ్చపఞ్చాశదవధి పరతో వృద్ధతామేతి నారీ' ఇతి కామశాస్త్రోక్తేర్వృద్ధానాం సంభోగానర్హత్వాత్ - 'త్యజేదన్త్యకులోద్భూతాం వృద్ధస్త్రీం కన్యకాం త్యజేత్' ఇతి నిషేధస్మరణాత్ - 'ఆలిఙ్గనం లమ్బపయోధరాణాం స్త్రీణాం చ దుఃఖత్రయమేవ భూమా.' ఇతి లమ్బస్తననితమ్బినీసంభోగస్య దుఃఖరూపత్వాచ్చేతి భావః యథాహ మాఘః—

'అయమపి జరరాః ప్రకామగుర్వీరలఘువిలమ్బిపయోధరోపరుద్ధాః,
సతత మసుమతా మగమ్యరూపాః పరిణతదిక్కరికాస్తటీర్బిభర్తి.' ఇతి.

అత్ర స్త్రీణాం పురుషాణాం చ యౌవనకృతసురతమేవ రమణీయమితి తాత్పర్యమ్.

పుష్పితాగ్రా వృత్తమ్—'అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.' ఇతి లక్షణాత్.

టీ. ఇహ=ఇచ్చట (ఈలోకములో), పుంసాం = మగవారికి, జరాసుఅపి = ముదిదశయందును, మాన్మథాః = మన్మథసంబంధములయిన, వికారాః = చేష్టలు, (ఇతి) యత్=అనునదియేదియో, నితంబినీనాం = స్త్రీలకును, స్తన...వధి- స్తన=చనులయొక్క, పతన=జాఱుట, అవధి=హద్దుగా, జీవితం వా=బ్రదుకుగాని, రతం వా=సంభోగముగాని, న కృతం=చేయబడలేదు. (ఇతి) యత్=అనునదియేదియో, ఇదం=ఇది, అనుచితం = తగనిది, అక్రమశ్చ = క్రమములేనిదియు, (అన్యాయ్య మనుట.)

తా. ఈపురుషులు ముసలివారయిన పిదపఁ గూడ మన్మథవికారంబు గలిగియుండునట్లొనర్చుటయు, స్త్రీలు కుచములు జారిపోవునంత

వఱకే బ్రతికియుండునట్లుగాని, సురతము సలుపునట్లుగాని యుండవలె నని యేర్పాటు చేయకపోవుటయు మిక్కిలి యనాగరికముగాను, న్యాయ విరుద్ధముగాను నున్నది.

చ. ఇది యుచితంబు గానిపని ✱ యిమ్మహిలో మనవారి కెంతయుం
మదనసుఖాభిలాషములు ✱ మానక యున్కి జరాభరంబునం
గొదమమిటారిముద్దుచను ✱ గుబ్బలు జాఱినవెన్క బోంట్లకుం
మదనసుఖంబు జీవితము ✱ మాన్పఁడు తామరచూలి జాణయే.

అవ. సుఖానుభవమునకు జవ్వనము ముఖ్యమని మూఁడుశ్లోకములచే వర్ణింపుచున్నాఁడు —(దేశాంతరమునఁ గొల్వుగొల్చుప్రాయపువారివచనము.)

శ్లో. రాజం స్తృష్ణామ్బురాశేర్న హి జగతి గతః కశ్చిదేవావసానం
కో వార్థోఽర్థైః ప్రభూతైః స్వవపుషి గళితే యౌవనే సానురాగే
గచ్ఛామః సద్మ యావద్వికసితనయనేన్దీవరాలోకినీనా [నామ్.
మాక్రమ్యాక్రమ్య రూపం ఝటితి న జరయా లుప్యతే ప్రేయసీ

వ్యా.—యదుక్తం సురతానుగుణ్యేన యౌవనస్యాత్యన్తావశ్యకత్వం త్రిభిర్వర్ణయతి. తత్రాదౌ చిరప్రవాసనిర్విణ్ణానాం రాజసేవాతత్పరాణాం యూనాం వచనమేతత్ — రాజన్నితి.— హే రాజన్, జగతి అస్మిన్ లోకే, కశ్చిదేవ కశ్చిదపి పుమాన్, తృష్ణా ధనలిప్సా - సైవామ్బురాశిః సముద్రస్తస్య అవసానం పారం, న గతో హి న ప్రాప్తః ఖలు; కిన్తు మగ్న ఏవేత్యర్థః తృష్ణాయా అపరిచ్ఛిన్నత్వాదమ్బురాశిత్వరూపణమ్. అథ యావత్కాఙ్క్షితార్థలాభేఽపి న తైః ప్రయోజనసిద్ధిరిత్యాహ - ప్రభూతైః ప్రచురైః - ని. 'ప్రభూతం ప్రచురం ప్రాజ్యమ్' ఇత్యమరః. అర్థైర్ధనైః, కో వార్థః కిం ప్రయోజనమ్? న కిమపీత్యర్థః. అకించిత్కరత్వాదితి భావః. ని. 'అర్థోఽభిధేయరైవస్తుప్రయోజననివృత్తిషు' ఇత్యమరః. కస్మిన్ కథం భూతే సతి? స్వవపుషి నిజశరీరే (అధికరణే) సానురాగే సంభోగేచ్ఛాజనకే అనురాగసహితే వా యౌవనే, గలితే సతి-కోఽర్థ ఇతి సంబన్ధః - ధనలాభాదపి యౌవనమేవాస్మాకం బలీయ ఇత్యర్థః. అతస్తావత్తత్పూర్వమేవ, సద్మ స్వగృహం ప్రతి, గచ్ఛామో యాస్యామః, యావత్ యదా, వికసితాని ఉత్ఫుల్లాని - కుముదాని కైరవాణి - ఇన్దీవరాణి నీలోత్పలాని చ తత్సదృశా ఆలోకా నేత్రాణి - ఆసాం సన్తీతి తథోక్తానామ్ - సితాసితాబ్జదలమనోహరనయనానామిత్యర్థః. ని. 'సితే కుముదకైరవే' - 'ఇన్దీవరం చ నీలేఽస్మిన్' ఇత్యుభయత్రాప్య

మరః. ప్రేయసీనాం ప్రియతమానాం సంబన్ధి, రూపం యౌవనప్రయుక్తసౌన్దర్యం జరయా, ఆక్రమ్యాక్రమ్య అభీక్ష్ణమాక్రమ్య, ఝడితి అఞ్జసా. ని. 'స్రాగ్ఝడిత్యఞ్జసాఽహ్నాయ' ఇత్యమరః. న లుప్యతే న హ్రియతే, తావదితి సంబన్ధః - అన్యథా శశకాపాయే బిలఖననవద్గమనవైఫల్యాద్వృద్ధస్త్రీగమననిషేధాచ్చేతి భావః. ని. 'యావత్తావచ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః.

టీ. రాజన్=ఓరాజా! జగతి = లోకములో, కశ్చిత్ ఏవ = ఎవ్వఁడును, తృష్ణా అంబురాశేః=ఆశయనెడి సముద్రముయొక్క, పారం=అవలిగట్టును, న గతః హి=పొందఁడాయెఁగదా? స్వవపుషి = తనదేహమునుండి, స అనురాగే = అనురాగముతోఁగూడిన, యౌవనే = జవ్వనము, గళితే=జాఱఁగా, ప్రభూతైః = గొప్పవైన, అర్థైః=ధనములతో, అర్థః=ప్రయోజనము, కః వా = ఏమి? వికస...నీనాం - వికసిత = విప్పారిన, నయనఇందీవర=నల్లగలువలవంటి కన్నులతో,ఆలోకినీనాం= చూచునట్టి,ప్రేయసీనాం=ప్రియురాండ్రయొక్క, రూపం=రూపము, జరయా = ముసలితనముచే, ఆక్రమ్యఆక్రమ్య = పైకొనిపైకొని, ఝడితి = తటాలున, యావత్ = ఎంతలో, న లుప్యతే = పోఁగొట్టఁబడదో, (తావత్ = అంతలో,) సద్మ = ఇంటికి, గచ్ఛామః = వెళ్లెదము.

తా. ఓరాజా! ఆశ యనునది సముద్రముం బోలినది. లోకంబున నాసముద్రపు దరిఁజూచినవాఁ డొక్కఁడయినను లేఁడు. మాదేహమున జవ్వనంబు జారకయుండునపుడే సుఖంబుల ననుభవింపవలయును. యౌవన ముడిగిన పిదప నీయపారధన మున్న నేమి యుపయోగము? కావునఁ బుడమిఱేఁడా! విరిసిన కలువలంబోలు కన్నులతోఁ జూచు మాప్రియురాండ్రయొక్క రూపంబు ముదిమిచేఁ జెడిపోకమునుపే మా యిండ్లకుఁ బోయి సుఖంబుల ననుభవింప నుత్తరు వొసఁగుము.

శా. ఆశాసాగరపార మేరికిని శక్యం బౌనె చేరంగ భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం బైనన్ ధనం బేల ధా
త్రీశా! యింటికిఁ బోదుమే ప్రియవధూహృద్యోల్లసద్రూపరే
ఖాశోభాతిశయంబు దుర్భరజరాక్రాంతంబు గాకుండఁగన్.

అవ. సర్వానర్థములకు జవ్వనము మూల మని చెప్పుచున్నాఁడు.—

శ్లో. రాగస్యాగార మేకం నరకశతమహాదుఃఖసంప్రాప్తిహేతు
ర్మోహస్యోత్పత్తిబీజం జలధరపటలం జ్ఞానతారాధిపస్య,

కన్దర్పస్యైకమిత్త్రం ప్రకటితవివిధస్పష్టదోషప్రబన్ధం
లోకేఽస్మిన్నహ్యనర్థవ్రజకులభవనం యౌవనాదన్యదస్తి. 29

వ్యా.—అథానర్థమూలమాహ— రాగస్యేతి.—రాగస్య మాత్సర్యస్య, ఏకమ్ అగారం ముఖ్యాయతనమ్ అనురాగైకస్థానమితి వా, తథా, నరకశతేషు నిరయపరమ్పరాసు-యాని మహాదుఃఖాని తీవ్రయాతనాస్తేషాం సంప్రాప్తిహేతుః ప్రాప్తిసాధనమ్-అగమ్యాగమనాదిదుష్కర్మ ప్రవర్తకత్వాదితి భావః. మోహస్య స్త్ర్యన్తరాసక్తిరూపస్య, ఉత్పత్తిబీజం జన్మకారణమ్. ని. 'హేతుర్నా కారణం బీజమ్'ఇత్యమరః. జ్ఞానతారాధిపస్య ప్రబోధచన్ద్రస్య, జలధరపటలమ్ అభ్రబృన్దం-జ్ఞానప్రకాశ ప్రతిబన్ధకమిత్యర్థః. కన్దర్పస్య కామదేవస్య, ఏకం మిత్త్రం ముఖ్యబన్ధుః, ప్రకటితో-వివిధో నానావిధః - స్పష్టః ప్రకాశశ్చ - దోషప్రబన్ధః పాతకసంబన్ధో-యస్య తత్తథోక్తమ్-యద్యౌవనమితి శేషః, అతో ఽస్మిన్ లోకే; తస్మాద్యౌవనాదన్యత్ ఇతరత్, అనర్థానాముక్తవిధానాం - వ్రజస్య సమూహస్య-కులభవనమ్ ఉత్పత్తినికేతనం, నాస్తి హి, ఇదమేవాత్యన్తానర్థమూలమిత్యర్థః; తదుక్తమ్.—

'యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా,
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్?" ఇతి.

టీ. రాగస్య = అనురాగమునకు (లేక, మాత్సర్యమునకు), ఏకం = ముఖ్యమైన అగారం=ఇల్లు, నర... హేతుః-నరకశత = నరకముల నూఱులయందలి, మహాదుఃఖ = గొప్పదుఃఖముయొక్క, సంప్రాప్తి=రాకకు, హేతుః = కారణము, మోహస్య=అజ్ఞానమునకు, ఉత్పత్తిబీజం = జన్మకారణము, జ్ఞానతారాధిపస్య=తెలివి యను చంద్రునకు, జలధరపటలం=మొయిలుమొత్తము, కందర్పస్య = మన్మథునకు, ఏకమిత్రం=ముఖ్యస్నేహితుఁడు, ప్రక...బంధం-ప్రకటిత = వెలిపుచ్చఁబడిన, వివిధ = అనేకప్రకారములగు, స్పష్ట=స్ఫుటమైన, దోషప్రబంధం = తప్పులు కుప్పలుగలదియు, అస్మిన్ = ఈ, లోకే=లోకమందు, అనర్థ...భవనం-అనర్థ=కీడులయొక్క; వ్రజ=సమూహమునకు, కులభవనం=వంశపరంపరగవచ్చిన యిల్లు, (అగునట్టిది) యౌవనాత్ = యౌవనముకంటె, అన్యత్=మఱియొకటి, నాస్తిహి = లేదుగదా !

తా. యౌవన మనునది యాశకుఁ బ్రధానస్థానము. పెక్కుపాపములను, తీరని వ్యసనంబులను బొందుటకుఁ గారణ మైనది. మోహమును గలిగించు విత్తనము. జ్ఞాన మను చంద్రునికి మొయిళ్లుల గుంపు వంటిది. (మొయిళ్లుల గుంపు చంద్రమండలమును గ్రమ్మునట్లు జ్ఞానముఁను

గ్రమ్మునది.) మరునికి విడువని నెచ్చెలి. పెక్కులైన పాపములను నిర్భయముగాఁ జేయించునది మంచిపనులకుఁ బ్రతిబంధక మయినది. ఇట్లు చేటులకుఁ బుట్టినింటి వంటిది. జవ్వనమునకు మించినది మఱొక్కటి యీ భూలోకముననే లేదు.

చ. రతిపతిచేతివాలు ఘన ♦ రాగనివాసము నీతివైరి దు
ర్గతికతదుఃఖమోహజని ♦ కారణ ముజ్జ్వలబోధతారకా
పతినిబిడాభ్రబృందము కు ♦ భ ప్రతిబంధము దోషసంగసం
గత మగునేగి జవ్వనము ♦ కన్న జగంబున వేఱె యున్న దే.

అవ. ఇట్టి సర్వానర్థమూలమయినయౌవనమున వికారము నొందనిపురుషుఁడు ధన్యుఁ డని చెప్పుచున్నాఁడు:—

శ్లో. శృఙ్గారద్రుమనీరదే ప్రసృమరక్రీడారసస్రోతసి
ప్రద్యుమ్నప్రియబాన్ధవే చతురవాఙ్ముక్తాఫలోదన్వతి,
తన్వీనేత్రచకోరపార్వణవిధౌ సౌభాగ్యలక్ష్మీనిధౌ
ధన్యః కోఽపి న విక్రియాం కలయతే ప్రాప్తే నవే యౌవనే. 30

వ్యా.—ఇత్థం భూతే యౌవనే కశ్చిదేవ నిర్వికృయ ఇత్యాహ—శృఙ్గార ఇతి.—శృఙ్గారః సంభోగవిప్రలమ్భరూప శృఙ్గారరస ఏవ ద్రుమో వృక్ష - స్తస్య నీరదే అమ్బువాహే - అఙ్కురితత్వకన్దలితత్వపల్లవితత్వపుష్పితత్వ రూపావస్థాభిః పరి పోషావహ ఇత్యర్థః, ప్రసృమరో వ్యాపనశీలో - యః క్రీడారసో మన్మథకేలి- స్తస్య స్రోతసి ప్రవాహే - అవిచ్ఛేదేన ప్రవర్తక ఇత్యర్థః. అథవా ప్రసృమరక్రీడానాం రసస్రోతసి రసప్రవాహే - యథేచ్ఛావిహారాన్విత ఇత్యర్థః, ప్రసృమరేత్యత్ర*సృఘస్యదః కర్మచ్ ప్రద్యుమ్నస్య కన్దర్పస్య-ప్రియబాన్ధవే ఆప్తబన్ధౌ * స్వార్థేఽణ్ ప్రత్యయః. ని. 'ప్రద్యుమ్నో మీనకేతనః, కన్దర్పో దర్పకోఽనఙ్గః' ఇత్యమరః. చతుర వాచో నిపుణవాక్యాన్యేవ - ముక్తాఫలాని మౌక్తికమణయః- తేషాముదన్వతి సముద్రే- సరససంలాపోత్పత్తినికేతనభూత ఇత్యర్థః - 'ఉదన్వానుదధౌ చ' ఇతి నిపాతసాత్సాధుః. సముద్రస్య ముక్తాకరత్వముక్తం రత్నశాస్త్రే—

'కరీన్ద్రజీమూతవరాహశఙ్ఖమత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని,

ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం తు శుక్త్యుద్భవమేవ భూరి.' ఇతి. తన్వీనాం విలాసినీనాం - నేత్రాణ్యేవ చకోరాః చన్ద్రికాపాయిపక్షివిశేషా స్తేషాం పార్వణ విధౌ పూర్ణచన్ద్రే-తద్వదుల్లాసక ఇత్యర్థః.-*పర్వణి భవః పార్వణ ఇతి విగ్రహః - ని.

'విధుర్విష్ణా చన్ద్రమసి' ఇత్యమరః. సౌభాగ్యలక్ష్మ్యాః సౌన్దర్యసంపదో - నిధౌ నిధానే- కదాచిదపి స్వావస్థానదశాయాం సౌన్దర్యలక్ష్మీర్న క్షీయత ఇత్యర్థః. నవే యౌవనే నూతనే వయసి, ప్రాప్తే సతి, కోఽపి ధన్యః కశ్చిదేవ సుకృతీ, విక్రియాం మన్మథవికారం, న కలయతే న ప్రాప్నోతి; ఈదృశస్తు విరల ఇతి భావః.

శ్లోకద్వయేఽపి నిరవయవరూపకాలంకారః. శార్దూలవిక్రీడితమ్.

టీ. శృంగా...దే-శృంగార = శృంగారమనెడి, ద్రుమ = వృక్షమునకు, నీరదే= మేఘమయినదియు, ప్రసృ...స్రోతసి-ప్రసృమర = వ్యాపించునట్టి, క్రీడా = సంభోగ మందలి, రస=రస (అభిలాష) మనెడి రస (జల) మునకు, స్రోతసి=ప్రవాహమయినదియు, ప్రద్యుమ్నప్రియబాంధవే = మన్మథునకు నెయ్యంపుచుట్టమయినదియు, చతు...న్వతి- చతుర = చిత్రములైన, వాక్ = మాటలనెడి, ముక్తాఫల = ముత్యాలపూసలకు, ఉద న్వతి = సముద్రమైనదియు, తన్వీ...విధౌ-తన్వీ = కృశాంగులయొక్క, నేత్ర = కన్ను లనెడి, చకోర=వెన్నెలపులుఁగులకు, పార్వణవిధౌ=పున్నమచందురుఁడైనదియు, సౌభాగ్య లక్ష్మీవిధౌ=సౌందర్యసంపదకు గనియైనదియు, (అగు) నవే యౌవనే = క్రొత్తప్రాయము, ప్రాప్తే (సతి) = రాఁగా, కోఽపి ధన్యః = ఎవఁడో పుణ్యవంతుఁడు, విక్రియాం = (మనో) వికారమును, న కలయతే=పొందఁడు. (తఱచుగా నందఱుఁ బొందుదు రనుట.)

తా. మేఘంబు వర్షించి చెట్లను పెంపొందించునట్లు, శృంగార రసమును బెంచునదియు, పాఱుచుండు క్రీడారసం బనెడి యుదకప్రవా హము వంటిదియు, మరుని కనుఁగుబందు వైనదియు (ప్రియబంధువు మాడ్కి మన్మథునికిఁ బ్రేమగూర్చునదియు), జాణపలుకు లనెడి ముత్తెము లకు సంద్రముమాడ్కి నునికిపట్టును, చకోరపక్షులను బున్నమ చందు రుఁడు సంతోష పెట్టునట్లు తీఁగెఁబోడుల కన్నుల కింపొదవునదియు, సౌందర్యసంపదకు నునికియు నైన యౌవనము దేహమున నెలకొన్న యప్పుడు పుణ్యాత్ముఁ డెవ్వఁడో యొక్కఁడు చిత్తవికారంబు నొందఁడు గాని తక్కిన యందఱు చపలు లగుదురు.

ఉ. మారునికూర్మిచుట్టము స శ మంచితకేళిరసప్రవాదంబు శృం
గారమహీజనీరదము శ కంజముఖీజనదృక్చకోరరా
కారజనీశమండలము శ కాంతవచోమణివార్ధి యౌవనం
బారయఁ జెందుచో వికృతి శ నందనివాఁడె కృతార్థుఁ డిమ్మహిన్.

అవ. యౌవన మనర్థమూలము గనుక, కామినులను విడిచినయెడల నాయౌవన మనర్థములకుఁ గారణముగాదు గదా యని శంకించి, మగువల విడుచుట కష్ట మని మూఁడు శ్లోకములచే వర్ణించుచున్నాఁడు:—

శ్లో. సంసారేఽస్మిన్నసారే కునృపతిభవనద్వారసేవాకళఙ్క-
వ్యాసఙ్గవ్యస్తధైర్యం కథమమలధియో మానసం సంనిదధ్యుః,
యద్యేతాః ప్రోద్యదిన్దుద్యుతినిచయభృతో న స్యురమ్భోజనేత్రాః
ప్రేఙ్ఖత్కాఞ్చీకలాపాః స్తనభరవినమన్మధ్యభాజస్తరుణ్యః. 31

వ్యా.—యదుక్తం యౌవనస్యానర్థమూలత్వం తత్ కామినీపరిత్యాగేఽత్యన్త దూరాపాస్తమిత్యాశఙ్క్య తాసామపరిత్యాజ్యతాం త్రిభిర్వర్ణయతి.—సంసార ఇతి.- అమలధియో నిర్మలమతయో మహాన్తః, మానసం నిజం మనః, అసారే నిస్సారే, అస్మిన్ పరివర్తమానే, సంసారే కలత్రాదిపోషణవ్యాసఙ్గరూపే, కునృపతిభవనద్వారస్య కుత్సిత రాజమన్దిరప్రతిహారస్య-సేవా అనువర్తనమేవ - కలఙ్కోఽపవాదః - తత్ర యో వ్యాసఙ్గః - అత్యాసక్తిస్తేన వ్యస్తం - ధైర్యం ధీరత్వం యస్య తత్తథోక్తమ్, ఈదృక్కష్ట కర్మాసక్తమలినమిత్యర్థః. కథం సంనిదధ్యుః సమాదధ్యుః, న కథంచిదపీత్యర్థః. కిం న స్యాచ్చేదిత్యత ఆహ—ప్రోద్యన్ ఉదిత్వరో-య ఇన్దుః తస్య ద్యుతిరివ ద్యుతిర్యేషాం తాని చన్ద్రధవలాని మాఞ్జిష్ఠాని వా - ఉద్యద్విశేషణ సామర్థ్యాత్ - తాని నిచయాని అంశుకాని-బిభ్రతీతి తథోక్తాః, అమ్భోజే ఇవ నేత్రే యాసాం తాః పద్మపలాశవిశాల లోచనా ఇత్యర్థః. ప్రేఙ్ఖత్కాఞ్చ్యః క్వణద్రశనా ఏవ - కలాపా భూషణాని - యాసాం తాః - యద్వా కాఞ్చ్యేవ భూషణాని యాసాం తాః, ని. 'కలాపో భూషణే బర్హే' ఇత్యమరః. స్తనభరేణ కుచకుమ్భగౌరవేణ - వినమన్తి అవనతాని - మధ్యాని వలగ్నాని - భజన్తీతి తథోక్తాః - పీవరకుచాః కృశోదర్యశ్చ ఇత్యర్థః. ఏతేన సౌన్దర్యాఽతిశయ ఉక్తః, ఏతాః ప్రసిద్ధాస్తరుణ్యో యువతయః - న స్యుర్యది న భవేయుర్యది - తర్హి కథం సంనిదధ్యురితి సంబన్ధః; అతో విశిష్టతరుణీనాం విద్యమానత్వాదేవ సుధియామప్యేవంభూతా భవన్తీత్యర్థః. తస్మాత్తరుణ్యో దుష్పరిహారా ఇతి భావః. తదుక్తమ్.—

'అసాధా విహ సంసారే దుర్వారే మకరధ్వజే,
కులే చ కామినీమూలే కా వా స్యాత్పరికల్పనా?'

అత్రోత్తరవాక్యార్థస్య పూర్వవాక్యార్థసమర్థకహేతుత్వాత్కావ్యలిఙ్గభేదః. స్రగ్ధరా.

టీ. ప్రోద్య—భృతః-ప్రోద్యత్ =ఉదయించుచున్న, ఇందు=చంద్రునియొక్క ద్యుతి=(కాంతివంటి) కాంతిగల, సిచయ =,చీరలుచు (చందురుకావివలె పెపుచీరలనుట), భృతః=ధరించువారును, అంభోజనేత్రాః = తామరలవంటి కన్నులుగలవారును, ప్రేంఖత్ ...లాపాః-ప్రేంఖత్ = కదలుచున్న, కాంచీ=ఓడ్డాణము నెడు, కలాపాః=సొమ్ములుగల వారును, స్తన...భాజః- స్తనభర = చనులబరువుచే, వినమత్ =వ్రాలుచున్న, మధ్య=నడుము, భాజః=పొందినవారును, (అగు), ఏతాః తరుణ్యః = ఈ(ప్రసిద్ధలగు) యువతులు, నస్యుః యది = ఉండరేని, అమలధియః = నిర్మలబుద్ధిగలవారలు, అసారే = సారములేని, అస్మిన్ =ఈ, సంసారే=సంసారమునందు, దు...ధైర్యం-దున్నృపతి = దుష్టరాజులయొక్క, భవనద్వార = దేవిడీహజారములయందలి, సేవా = కొలువుయొక్క, కళంక = దోషము యొక్క, వ్యాసంగ=సంబంధముచేత, వ్యస్త=చెదరిన, ధైర్యం = దీమసముగల, మానసం= మనస్సును, కథం = ఎట్లు, సన్నిదధ్యుః = కుదుర్చుకొందురు ?

తా. ఈ నిస్సారమయిన సంసారమునందుఁ జక్కఁగా నుద యించిన చంద్రునికాంతిసమూహమువంటి కాంతి గలవలువలు దాల్చిన వారును, కమలనేత్రలును, ఘణిల్లుఘణిల్లుమని రవణించు చిరుగజ్జెల యొడ్డాణములు ధరించినవారును, గబ్బిగుబ్బలబరువుచేఁ గొంచెమువంగిన నడుము గలవారునైన యీ ప్రమదలుండరేని నిర్మలమనస్కగల పండి తులు చెడ్డరాజులవాఁకిళ్లయందుఁ గొలువుకొలుచుటయెం దలవాటుచే ధైర్యము వీడిన తమ మనసుల నెట్లు ధరింపఁగలరు ? (చెడుదొరల కొలువువలని దుఃఖముచేఁ గలవరము నొందినవారయినను పురుషులు పైఁజెప్పినగుణములు గల స్త్రీలను బొందుటచేత నిలుకడ గల మనస్సు కలవా రగుదురు.

చ. జలజవిలోచనంబులును ॥ సన్నపుఁజందురకావిచీరెలుం
గులుకుమెఱుంగుఁజన్నులును ॥ గొంచెపుఁగౌనులు రత్నకింకిణీ
కలరశనాగుణంబులును ॥ గల్గినకాంతలు గల్గరేని గా
సిలి మతిమంతు లేటికి వ ॥ సింతురు రాజగృహాంగణంబులన్.

అవ. స్త్రీలపైనియాశ పురుషులను మ్రొక్కునట్లుచేయు నని చెప్పుచున్నాఁడుః—

శ్లో. సిద్ధాధ్యాసితకన్దరే హరవృషస్కన్ధావరుగ్ణద్రుమే
గఙ్గాధౌతశిలాతలే హిమవతః సానౌ స్థితే శ్రేయసి,
కః కుర్వీత శిరః ప్రణామమలినం మ్లానం మనస్వీ జనో
యద్విత్రస్తకురఙ్గశాబనయనా న స్యుః స్మరాస్త్రం స్త్రియః. 32

వ్యా.—సిద్ధేతి - సిద్ధైర్యోగిభిః - అధ్యాసితా అధిష్ఠితా - కన్దరా గుహా-యస్మిం స్తత్తథోక్తే ఏతేన తపస్సిద్ధిహేతుత్వం సూచ్యతే, హరస్య నిత్యసన్నిహితస్య-యో వృషో వాహనభూతో మహోక్షస్తస్య స్కన్ధేన హంసపీఠేన - కషదేతి యావత్ - అవరుగ్ణాః భగ్నాః-ద్రుమా యస్మిన్ తత్తథోక్తమ్. * 'రుజో భఙ్గే' కర్మణి క్తః. * 'ఓదితశ్చ' ఇతి నిష్ఠానత్వే ణత్వమ్. ఏతేనాఽఖిలశ్రేయఃప్రదశివసాన్నిధ్యముక్తమ్, గఙ్గాధౌతాని గఙ్గాప్రక్షాలితాని - శిలాతలాని, యస్మిన్ తత్తథోక్తే - ఏతేనాఽత్యన్తపవిత్రత్వ ముక్తమ్. అత ఏవ శ్రేయసి శ్రేష్ఠే-శ్రేయస్కరే - వా, హిమవతో గిరేః సంబన్ధిని స్థానే ప్రదేశే స్థితే సతి, కో వా మనస్వీ సుమేధాః ధీరోజనః * 'ప్రశంసాయామినిః, శిరో నిజోత్తమాఙ్గం, ప్రణామేన కున్నృపతిపాదవన్దనేన - మలినం కలఙ్కితమ్, అత ఏవ మ్లానం ఉత్కర్షహీనం, కుర్వీత, 'మలినం మానమ్' ఇతి పాఠే - మానం నిజాభిమానం (కర్మ) - శిరఃప్రమాణామేన నిజోత్తమాఙ్గవినమనేన-మలినం ప్రతిష్ఠాహీనం-కుర్వీత, నకో ఽపీత్యర్థః. కుతః? యద్యస్మాత్కారణాత్, విత్రస్తకురఙ్గశాబనయనాః పద్మినీజాతిత్వా చ్చకితబాలహరిణేక్షణాః, అత ఏవ, స్మరాస్త్రం మహావీరస్య స్మరస్య జగద్విజయసాధన భూతబాణ ఇత్యర్థః. * లిఙ్గవచనవ్యత్యయో నిత్యనపుంసకత్వేన జాత్యభిప్రాయేణ వా 'వేదాః ప్రమాణమ్' ఇత్యాదివద్ద్రష్టవ్యః ఇత్యుక్తం ప్రాక్, స్త్రియః న స్యుశ్చేత్, అతః అమోఘమదనశస్త్రభూతస్త్రీణామపరిత్యాజ్యతయా విద్యమానత్వాదేవ మనస్వినామపీదృ గ్దురవస్థాప్రాప్తిరితి భావః. వృత్తముక్తమ్.

టీ. విత్రస్త...నయనాః - విత్రస్త=బెదరిన, కురంగశాబ = లేడిపిల్లలయొక్క, నయనాః = (కన్నులవంటి) కన్నులుగలవారును. స్మరఅస్త్రం=మన్మథబాణమును, (అగు) స్త్రియః = ఆఁడువాండ్రు, న స్యుః యత్ = లేరేని, సిద్ధా...కందరే-సిద్ధ=యోగులచే, అధ్యాసిత = ఉండఁబడిన, (యోగులకాఁపురమయిన,) కందరే = చరియలుగలదియు, హర...ద్రుమే - హర = శివునియొక్క, వృష=ఎద్దుయొక్క, స్కంధ=మూఁపురముచే, అవరుగ్ణ=విఱువఁబడిన, ద్రుమే = చెట్లుగలదియు, గంగా...తలే - గంగా = గంగచేత, ధౌత=కడుగఁబడిన, శిలాతలే = ఱాతిప్రదేశములుగలదియు, (అగు) హిమవతః = హిమ వంతముయొక్క, సానౌ = చఱియయందు, శ్రేయసి = పుణ్యము, లేక మోక్షము, స్థితే సతి = సిద్ధముగా నుండఁగా, కః మనస్వీ = ఏబుద్ధిమంతుఁడు, శిరః=(తన)తలను, ప్రణామ మలినం = (ఒకరికి) వంగుటచేత మాసినదిగాను, మ్లానం = వాడినదిగాను, కుర్వీత = చేసి కొనును.

తా. వెఱచిన జింకకూనల కన్నులంబోలిన కన్నులుగల యంగ నలు మన్మథుని తూఁపులుగారేని, సిద్ధులు వసించెడి గుహాలతోఁ గూడి,

ఈశ్వరుని వాహనంబగు నందికేశుని దేహముచే పిఱువఁబడిన చెట్లచే వెలయుచు, గంగాజలముచేఁ బావనం బగు ఱాతిప్రదేశము గలిగి యుండు నుపద్రవము లేని హిమవంతముయొక్క ప్రదేశమున్నప్పుడు, ఏధీరుఁడగు మానవుఁడు రాజులకు సాష్టాంగముగాఁ బ్రణమిల్లి తనశిరస్సును మలినమయి వాడునట్లు చేసికొనును ? లోకంబున స్త్రీలు మన్మథవికారంబుఁ గలిగింపఁజాలనివా రయినయెడల, మనుజులు సంసారములఁ బాసి, హిమవంతమున కేగి తపస్సు చేయుచుందురు. అట్లుకాక మన్మథవికారమునకు వారు కారణభూతులై యున్నందుననే పురుషులు రాజుల యడుగులకు మడుగులొత్తుచు వారిచుట్టును దిరుగుచుందురు.

శా. గంగాధౌతశిలాతలంబు హరగో ౹ స్కంధప్రదేశాహతో
త్తుంగక్ష్మాజము సిద్ధసేవితగుహా ౹ స్తోమంబు శీతాచలో
త్సంగంబుండఁగ నెవ్వఁ డోపు నృపపా ౹ దంబుల్ దలందాల్ప సా
రంగీశాబవిలోచనల్ మనసిజా ౹ స్త్రంబుల్ సతుల్ లేనిచోన్.

అవ. స్త్రీలే బంధహేతువు లని చెప్పుచున్నాఁడు:—

శ్లో. సంసార ! తవ పర్యన్తపదవీ న దవీయసీ,
అన్తరా దుస్తరా న స్యుర్యది రే మదిరేక్షణాః. 33

వ్యా.—సంసార ఇతి.—హే సంసార, తవ, పర్యన్తపదవీ అవసానసీమా, న దవీయసీ స దవిష్ఠా భవతి - న దూరతరేతి యావత్ - కిన్తు నేదీయస్యేవేత్యర్థః. * దూరశబ్దాదీయసుని 'ఉగితశ్చ'ఇతి జీప్ * 'స్థూలదూర-'ఇత్యాదినా యణాదిపరలోప పూర్వగుణౌ, కుతః? తే తవ, అన్తరా మధ్యే, దుస్తరా మహానద్య ఇవ తరితుమశక్యాః * 'ఈషద్దుః—' ఇత్యాదినా ఖల్ప్రత్యయః. మదిరేక్షణాః స్త్రియః, న స్యుర్యది న సంభావితాశ్చేత్, న దవీయసీతి సంబన్ధః, సంభావితత్వాదేవ దవీయసీత్యర్థః; ఏతేన సంసారపారగమనప్రతిబన్ధిన్యః స్త్రియ ఇత్యుక్తమ్, తత్పరిత్యాగే తు శ్రేయస్సంభవ ఇతి భావః. పూర్వశ్లోకేఽప్యత్రాఽపి చ పూర్వతరశ్లోకవత్కార్యమున్నేయమ్. అనుష్టుప్.

టీ. రేసంసార = ఓసి సంసారమా! అంతరా=నడుమ, దుస్తరాః=కడవ (దాఁట) రాని, మదిరేక్షణాః=మదించిన కన్నులుగలవారు (సుందరీమణులు) న స్యుః యది=లేకుందురేని, తవ = నీయొక్క, పర్యంతపదవీ = తుదకుదారి, దవీయసీ=దూరమైనది, న=కాదు.

తా. ఓసంసారసముద్రమా! నడుమ దాటి నశక్యులయినయతివలుండరేని, నీయావలిగట్టునకుఁ బోవువారి యంతదవ్వుగాదు. ప్రమదల మూలమున యీసంసారమునకుఁ గట్టుపడి యుండవలసినది కాని, వారు లేనిచో సంసారము విడుచుట యంతకష్టము గాకయుండును.

తే. అమితసంసార! నీదుప ర్యంతపదవి
గతి దలంప దవీయసి గాదు సూవె
యర్థి నీలోనఁ గడవంగ నలవిగాని
ఖంజరీటాయతాక్షులు గలుగరేని.

## పక్షద్వయనిరూపణము

అవ. స్త్రీలయం దనురాగము గలుగునిమిత్తము సంభోగశృంగారమును వర్ణించి మరల వారిని వదలుట బుద్ధిమంతులకు నసాధ్యము గావున నందఱు వారియందే తగులు గలిగియుందురు. అట్టి సంసారులకు శ్రేయస్సు గలుగు టెట్లని యాక్షేపించి స్త్రీలకు ప్రేమతోఁ జూచువారి కీలోకసౌఖ్యములును, స్త్రీలను వదలినవిరాగులకుఁ బరలోకసౌఖ్యములును గలుగునని తెలుపుటకై యనురక్తి, విరక్తి యను రెండుపక్షములను ఇంక నేడు శ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. దిశ వనహరిణేభ్యో వంశకాణ్డచ్ఛవీనాం
కబళముపలకోటిచ్ఛిన్నమూలం కుశానామ్,
శకయువతికపోలాపాణ్డుతామ్బూలవల్లీ
దళమరుణనఖాగ్రైః పాటితం వా వధూభ్యః. 34

వ్యా.—ఇత్థం స్త్రీణాం పరిహర్తుమశక్యత్వే తదాసక్తస్య కుతః శ్రేయః ప్రాప్తిరిత్యాశఙ్కాయాం తదత్యాగత్యాగయోరైహికాముష్మికఫలసాధనత్వమేవేతి మనసి కృత్వా తదుభయమిదానీం తావన్నిరూపయితుం ప్రతిజానీతే—'అథ పక్షద్వయనిరూపణమితి' - అత స్త్రీణాం పరిత్యాజ్యత్వకథనానన్తరం పక్షయోః విరక్త్యనురక్తిరూపపక్షయోః ద్వయస్య నిరూపణం క్రియతే, తత్ప్రకారమావింశతిసమాప్తేర్వర్ణ్ణయతి.—దిశేతి.—హే జనేత్యధ్యాహార్యమ్. వనే పుణ్యారణ్యే, హరిణేభ్యః కురఙ్గేభ్యః-తపసః ప్రసక్త్యా నిర్భీకత్వేన తేషాం సమీపవర్తిత్వాదితి భావః. ఉపలకోట్యా నిశితపాషాణప్రాన్తేన - ఛిన్నాని లూనాని మూలాని - యస్య తథోక్తమ్ - తత్ర

లవిత్రాదిసాధనాన్తరాసంభవాన్మూలానాముపలకోటిచ్ఛిన్నత్వముక్తమ్, వంశకాణ్డస్య వంశకరీరస్య-ఛవిరివ ఛవిర్యేషాం తేషామ్ సరసానామిత్యర్థః, కుశానాం, కబళం గ్రాసం వా-దిశ, తపశ్చరణసమయ ఇతి శేషః; అథవా వధూభ్యః ప్రియతమాభ్యోఽరుణనఖానామగ్రైః-పాటితం శకలితం-శకయువతీనాం శకాఖ్యదేశీయతరుణీనాం-కపోలవదాపాణ్డు-ఆసమన్తాద్ధవలం, యత్తామ్బూల వల్లీదలం నాగవల్లీపత్త్రం తద్వాదిశ, సంసరణసమయ ఇతి శేషః; ఉక్తోభయమేవ పరమసౌఖ్యనిదానమ్ ఉభయత్ర, నాన్యదితి భావః. ఏవముత్తరత్రాపి యథాయోగమూహనీయమ్.

అత్ర నఖానామారుణ్యగ్రహణం మహాభాగ్యలక్షణత్వేన సుఖిత్వద్యోతనార్థమ్. తదుక్తమ్ సాముద్రికైః—

> 'పాణీ పాదతలే రక్తే నేత్రాన్తశ్చ నఖస్తథా,
> తాలు జిహ్వాఽధరోష్ఠం చ సప్తరక్తస్సుఖీ భవేత్.' ఇతి.

మాలినీ.

టీ. వనహరిణేభ్యః = అడవిజింకలకు, వంశ...వీనాం-వంశకాండ=వెదురుమోసు యొక్క, ఛవీనాం=(కాంతివంటి) కాంతిగల, కుశానాం = దర్భలయొక్క, ఉపల... మూలం-ఉపలకోటి = రాతియంచులచే, ఛిన్న = కోయఁబడిన, మూలం = వేరులుగల, కబళం (వా)=గ్రాసము(కడి)ను (గాని), వధూభ్యః = స్త్రీలకు, అరుణనఖాగ్రైః = ఎఱ్ఱని గోరుకొనలచే, పాటితం = చీల్చఁబడిన, శక...దళం-శకయువతి = శకదేశస్త్రీలయొక్క కపోల=చెక్కిళ్లవలె, ఆపాండు = కొంచెము తెల్లనైన (గోధుమవన్నెగల), తాంబూలవల్లీ దళం వా = తమలపాకునుగాని, దిశ = ఇమ్ము.

తా. ఓమనుజుఁడా! నీవు పావనమయిన యరణ్యమున బెదరు లేక దగ్గఱకేతెంచిన జింకలకు వెదురుమొలకలవలెఁ బసరుగల దర్భలను కత్తెరతాళ్ల యంచులతోనఱికి మేతపెట్టుము. (విరక్తుఁడవేని యడవి యందు వసింపుము అని భావము.) లేదా: శకదేశపుటతివల చెక్కిళ్లవలె నంతటఁ దెల్లనైన తమలపాకులను నీయెఱ్ఱని గోళ్లకొనలతోఁ జీల్చి యింతుల కిమ్ము. (అనురక్తుఁడవేని యింటనుండి స్త్రీలంగూడి విహరింపుము అనుట.)

చ. శిలమొన మూలముల్ చిదిమి ॥ చెన్నుగ వేణుకరీరకాంతిచే
లలితములైనదర్భకబ ॥ ళంబులు లేళ్ళకు నిమ్ము కానలోఁ
గలితశకాంగనావిపుల ॥ గండవిపాండురనాగవల్లికా
దళముల గోళ్ళఁ ద్రుంచి వని ॥ తాతతికైన నొసంగుమిమ్మునన్.

శ్లో. అసారాః సన్త్వేతే విరతివిరసా వాథ విషయా
జుగుప్స్యన్తాం యద్వా నను సకలదోషాస్పదమితి,
తథాఽప్యేతద్భూమౌ న హి పరహితాత్పుణ్యమధికం
న చాస్మిన్ సంసారే కువలయదృశో రమ్యమపరమ్. 35

వ్యా.—అసారా ఇతి—తే ప్రసిద్ధాః, సర్వే, పాపహేతుత్వాత్పాపాః-విషయాః శబ్దాదయః-స్రక్చన్దనవనితాదయో వా, అసారాః అస్థిరాః - నిస్సారా ఇతి వా- ని. 'సారో బలే స్థిరాంశే చ'. ఇత్యభిధానాత్, తథా, విరతౌ పరిణతిసమయే-విరసాః అనర్థకలా ఇతి వా, యద్వా సకలదోషాస్పదమ్ రాగద్వేషమోహాద్యశేషదోషప్రతిష్ఠాపనమ్ ఇతి వా* 'ఆస్పదం ప్రతిష్ఠాయామ్' ఇతి నిపాతనాత్సుడాగమః-లిఙ్గవచనవ్యత్యయస్తు పూర్వవద్ద్రష్టవ్యః, జుగుప్స్యన్తాం పరిత్యజ్యన్తామ్-పరిత్యాగే పరమసుఖలాభాదితి భావః. తథా చ వక్ష్యతి—'స్వయం త్యక్తా హ్యేతే శమసుఖమనన్తం విదధతి' ఇతి* 'గుపేర్నిన్దాయామ్'ఇతి సన్నన్తాత్ కర్మణి యకి విధౌ లోటి తఙ్; తథాఽప్యుక్తప్రకారో విషయాణాం జుగుప్స్యత్వేఽప్యేతద్భూమౌ అస్యాం భువి, పరహితాత్ పరోపకారకరణాత్, అధికం అతిరిక్తం, పుణ్యం, న హి నాస్తి ఖలు.

'శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.'

ఇతి వచనాదిదమేవాత్యన్తపుణ్యమిత్యర్థః. అథాస్మిన్సంసారే చ, కువలయదృశః ఉత్పలాక్ష్యాః * 'అన్యారాదితరర్తే-' ఇత్యాదినా పఞ్చమీ, అపరం అన్యత్, రమ్యం వస్తు నాస్తి-ఇయమేవాత్యన్తం మనోహరేత్యర్థః. అతో దోషదృష్ట్యా విషయాన్పరిత్యజ్య శమసుఖానుభవతాత్పర్యేణ వా స్థాతవ్యమ్, అన్యథా పరహితాచరణతత్పరేణ సాంసారికతయా వా వర్తితవ్యమ్, న తు ప్రకారాన్తరేణేతి భావః. శిఖరిణీ.

టీ. ఏతే=ఈ, విషయాః=(స్రక్చందనవనితాభోగాది) విషయములు, అసారాః=సారములేనివియు విరతివిరసాః = పరిణామమునందు చప్పనైనవియు సంతు=అగుఁగాక! యద్వా=లేక, నను=ఓయీ, సకల. . .స్పదం-సకల=సమస్తములైన, దోష=పాతకములకు, ఆస్పదం=పుట్టిల్లు, ఇతి = అని; జుగుప్స్యంతాం = నిందింపఁబడుఁగాక! తథాపి = అయినను, ఏతద్భూమౌ = ఈభూమియందు, పరహితాత్ = పరోపకారముకంటె, అధికం = గొప్పదయిన, పుణ్యం=పుణ్యము, న=లేదు. అస్మిన్ సంసారే=ఈసంసారమునందు, కువలయదృశః = కలువకంటికంటె, అపరం = మఱియొకటి, రమ్యం చ = ఇంపైనదియు, న=లేదు.

తా. ఈసంసారములు (శబ్దాదివిషయములు లేక పుష్పచందన వనితాదులు) సారహీనములుగానైనను, మొదట మనసున కింపుగా నున్నను గొనను నీరసములుగా నుండిన నుండుఁగాక. లేక చెలువుల కన్నిటి కిర వని యందు అావిషయముల నేవగింతురుగాక. అయినను భువిని పరోపకారమునకంటె మించినపుణ్యము లేదు. ఈసంసారమునఁ గలువకంటులకంటె సొబగయినవస్తు వేదియు లేదు.

చ. దురితనిదానముల్ సకల ౯ దోషగృహంబులు సారహీనముల్
పరిణతిఘోరముల్ విషయ ౯ పద్ధతు లెంతయుఁ గుత్సితంబు లి
ద్ధరను బరోపకారసుకృ ౯ తంబును బోలవు పుణ్యముల్ మనో
హరతరవస్తువుల్ కువల ౯ యాక్షులకన్నను గల్గ వెవ్వియున్.

అవ. పర్వతనితంబ స్త్రీనితంబములలో నేది యాశ్రయింపఁదగిన దని యడుగు చున్నాఁడు:—

శ్లో. మాత్సర్యముత్సార్య విచార్య కార్య
మార్యాః సమర్యాదమిదం వదన్తు,
సేవ్యా నితమ్బాః కిము భూధరాణా
ముత స్మరస్మేరవిలాసినీనామ్. 36

వ్యా.—మాత్సర్యమితి.—ఆర్యాః పణ్డితాః మాత్సర్యమ్ అసూయాం - పక్షపాతమితి యావత్, ఉత్సార్య నిరాకృత్య - తస్య యథార్థకథనప్రతిబన్ధకత్వాదితి భావః. కార్యం కర్తుం యోగ్యమ్ - విధేయమిత్యర్థః, విచార్య ఊహాపోహాభ్యాం సమ్యగాలోచ్య, తతః, సమర్యాదం మర్యాదయా సన్మార్గానతిక్రమణేన సహితం యథా భవతి తథా, ఇదం ఏతత్, వదన్తు కథయన్తు కిమిదమిత్యత ఆహ-ధరన్తీతి ధరాః *పచాద్యచ్ - భువో ధరా భూధరాస్తేషాం భూధరాణాం, నితమ్బాః కటకప్రదేశాః, సేవ్యాః కిము ఆశ్రయణీయా వా, ఉత అథవా, స్మరస్మేరాః స్మరోల్లసితాః మదనమదోత్కటా ఇత్యర్థః, యద్వా స్మరేణ మన్మథావేశేన హేతునా-స్మేరాః సంభోగౌత్సుక్యసూచకమన్దస్మితసున్దరవదనారవిన్దా ఇత్యర్థః, * 'ష్మిఙ్ ఈషద్ధసనే' ఇతి ధాతోః * 'నమికమ్పి-'ఇత్యాదినా రప్రత్యయః. అథవా విషయమాత్రవిశ్రాన్తివిరహేణ విశృఙ్ఖలవృత్తిత్వమదమన్థరత్వాది గుణవిశిష్టకటాక్షవీక్షణాని-స్మేరశబ్దవివక్షితాని. తదుక్తం భావప్రకాశే.—

'అపరిచ్ఛిన్నవిషయం మదమన్థరమీలితమ్,

స్ఫురదాభ్రపక్షతాయుక్తం తత్ స్మేరమితి కథ్యతే.' ఇతి.
తాని చ స్మరప్రధానాని యాసాం తాసాం స్మరస్మేరాణాం-విలాసినీనాం విలసనశీలానాం తరుణీనామ్ 'వా కమలస-' ఇత్యాదినా ఘినుణ్ప్రత్యయః. నితమ్బాః కటిప్రదేశాః ఆశ్రయణీయా వా, ఇదం వదన్త్వితి సంబన్ధః; యది వైరాగ్యం స్యాత్తర్హి గిరినితమ్బాః సేవ్యాః అన్యథా విలాసినీనితమ్బా ఇతి త్వదీయప్రశ్నస్యేదముత్తరం న త్వన్యదస్తీతి భావః. ని 'కటకోఽస్త్రీ నితమ్బోఽద్రేః' - 'పశ్చాన్నితమ్బః స్త్రీకట్యాః' ఇతి చోభయత్రాప్యమరః.

అత్ర పూర్వార్ధే ఏకవర్ణస్య పునఃపునరావృత్తేర్వృత్త్యనుప్రాసః శబ్దాలంకారః—

'ఏకద్విప్రభృతీనాం చ వర్ణానాం తు యదా భవేత్,
పునరుక్తిరసౌ నామ వృత్త్యనుప్రాస ఇష్యతే.' ఇతి లక్షణాత్.

అయం చ నితమ్బా ఇత్యత్ర ద్వయానామపి నితమ్బానాం ప్రకృతత్వాత్కేవల ప్రకృతత్వగోచరేణ ఏకనాళావలమ్బిఫలద్వయవదేకశబ్దాదర్థద్వయప్రతీతేః కేవలార్థ ప్రవణేన విజాతీయేనోత్తరవాక్యస్థేన శ్లేషేణ తిలతణ్డులవత్ పరస్పరనైరపేక్ష్యాత్ సంసృష్టిః కించిచ్చమత్కారాతిశయమావహతీతి కావ్యస్య మహానుత్కర్షః ప్రతిపాదిత ఇతి రహస్యమ్. వృత్తముపజాతిః.

టీ. ఆర్యాః=పెద్దలు, మాత్సర్యం=మచ్చరమును, ఉత్సార్య=తొలఁగించి, కార్యం=చేయఁదగినదానిని, విచార్య = ఆలోచించి, సమర్యాదం = మర్యాదతోఁ గూడునట్లు (న్యాయ్యముగా), ఇదం = దీనిని, వదంతు = చెప్పుదురుగాక; (దేని ననఁగాః) సేవ్యాః= ఆశ్రయింపఁదగినవి, భూధరాణాం=కొండలయొక్క, నితంబాః కిము=నెత్తములా? ఉత = లేక, స్మర...విలాసినీనాం-స్మర=మన్మథునిచే (కామముచే), స్మేర=చిఱునవ్వుగల (లేక, వికసించిన), విలాసినీనాం = నెరజాణలయొక్క, నితమ్బాః కిము = పిఱుఁదులా ?

తా. కార్యాకార్యములనెఱుఁగఁగల యోపండితులారా ! మీారు మచ్చరంబు మాని, శాస్త్రానుసారంబుగ నే నడుగఁబోవువానిలో నేది చేయఁదగినదో చెప్పుఁడు. పర్వతనితంబములు (మధ్యభాగములు) ఆశ్రయింపవలెనా ! మదనవికారంబును చిఱునగవును గలస్త్రీలనితంబములు (కటిపశ్చాద్భాగములు) ఆశ్రయింపవలెనా ?

ఉ. ఆరయ మత్సరంబు విడ కే నాడి సమంచితకార్యనిశ్చయో
దారవిచారులై సరసకేత న్వచియింతురు గాక సజ్జనుల్

ధారుణి సేవ్యముల్ గిరిని ర్ఝరపాతములో మఱి కాక మన్మథ
స్మేరవిలాసినీజనవి శేషనితంబములో తలంపఁగన్.

అవ. ఈసంసారమునఁ బండితులకు రెండువిధములుగాఁ గాలంబు గడచుచున్నది యని చెప్పుచున్నాఁడు:—

శ్లో. సంసారే స్వప్నసారే పరిణతితరలే ద్వే గతీ పణ్డితానాం
తత్త్వజ్ఞానామృతాంభఃప్లవలలితధియాం యాతు కాలః కథఞ్చిత్,
నో చేన్ముగ్ధాఙ్గనానాం స్తనజఘనఘనాభోగసంభోగినీనాం
‡స్థూలోపస్థశ్థలీషు స్థగితకరతలస్పర్శలీలోద్యతానామ్. 37

వ్యా.—సంసార ఇతి.—స్వప్నస్య సార ఇవ సారో యస్మిన్ సః - మిథ్యాభూత ఇత్యర్థః. * 'సప్తమ్యుపమానే' ఇత్యాదినా బహువ్రీహిః. తథా పరిణత్యాం పరిణామావస్థాయాం - తరలే అస్థిరే - అశాశ్వత ఇత్యర్థః, సంసారే సంసృతౌ, పణ్డితానాం పరిజ్ఞాతృణాం, ద్వే, గతీ అవస్థే, విద్యేతే ఇతి శేషః. కే ద్వే ఇత్యాశఙ్క్యాహ—తత్త్వజ్ఞానమేవ - అమృతామ్భః అమృతప్రాయజలం - తత్ర ప్లవ ఇవ-లలితా రుచిరా - యద్వా తత్త్వజ్ఞానామృతామ్భసి - ప్లవః ప్లవనమ్-క్రీడేతి యావత్-తత్ర లలితా ఉల్లాసవతీ - ధీర్యేషాం తత్త్వజ్ఞానోల్లసితబుద్ధినామ్ సతామిత్యర్థః, కథంచిదతిప్రయత్నేన, కాలః, యాతు గచ్ఛతు అతిక్రామత్విత్యర్థః-ని. 'కథమాది తథాప్యన్తః యత్నగౌరవబాధయోః' ఇత్యమరః. 'కాలః కదాచిత్' ఇత్యపపాఠః, ఇయమేకావస్థా; నోచేదేవం న స్యాచ్చేత్తర్హి, స్తనయోర్ఘనజఘనే విపులకటిపురోభాగే చ-ఆభోగసంభోగినీనాం విస్తృతసంభోగేచ్ఛావతీనామ్ - యద్వా స్తనయోర్ఘనజఘనస్య నిబిడతరజఘనస్య చ-య ఆభోగో విస్తార-స్తత్ర సంభోగినీనామ్ కుచమర్దన - నిధువన రూపబాహ్యాభ్యన్తర సంభోగాకాఙ్క్షిణీనామిత్యర్థః. ఏతేన సమానురాగిత్వముక్తమ్ అన్యథా ఆభాసప్రసఙ్గాత్, తదుక్తమ్—

'ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా,
యోషితో బహుసక్తిశ్చ రసాభాసస్త్రిధా మతః,' ఇతి,

ముగ్ధాఙ్గనానాం సున్దరస్త్రీణాం నవయౌవనానాం వా, 'ఉదయద్యౌవనా ముగ్ధా' ఇతి లక్షణాత్. ‡స్థూలోపస్థస్థలీషు వర్తులోచ్ఛూనమదనసదనప్రదేశేషు, *'జానపద-' ఇత్యాదినా అకృత్రిమార్థే ఙీష్, స్థగితమాచ్ఛాదితం - యత్కరతలం - తస్య స్పర్శః సంపర్కః-ఏవ లీలా తత్ర-ఉద్యమ ఉద్యోగో యేషాం తేషాం సతామ్ - కామినీమోహనోపస్థ

స్పర్శసుఖమనుభవతాం సతా మే వేత్యర్థః. కాలో యాతు, ఇయం చైకావస్థా, ఇమే ద్వే ఏవో త్తమే గతీ, న త్వేతద్వ్యతిరిక్తం గత్యన్తరమస్తీత్యర్థః, సర్వదా జ్ఞాననిష్ఠయా వా కామగోష్ఠ్యా వా పణ్డితానాం కాలో యాపయితవ్యః, స త్వన్యథేతి భావః. స్థూలోప స్థేత్యనేన ఆసాం చిత్రిణీజాతిత్వం సూచితమ్, తదుక్తం రతిరహస్యే—

'మదనసదనమస్యా వర్తులోచ్ఛూనమన్త
ర్మృదు మదనజలాఢ్యం రోమభిర్నాతిసాన్ద్రైః,
ప్రకృతిచపలదృష్టిర్బాహ్యసంభోగసక్తా
రసయతి మధురాల్పం చిత్రిణీ చిత్రరక్తా.' ఇతి;

ఏతజ్జాత్యనుకూలసురతనియతయామో౽పి తత్రైవోక్తః

'వ్రజతి రతిసుఖార్థీ చిత్రిణీమగ్రయామే
భజతి దినరజన్యోర్హస్తినీం చ ద్వితీయే,
గమయతి చ తృతీయే శఙ్ఖినీమార్ద్రభావాం
రమయతి రమణీయాం పద్మినీం తుర్యయామే.' ఇతి;

మతాన్తరే తు ద్వితీయయామ ఇత్యుక్తమ్—

'ఘనకుచనఖభేదైర్ముష్టిఘాతైశ్చ మధ్యే
రతినియతకరైశ్చ ప్రీతయుక్తైర్వచోభిః,
అనృతతరకథాభిస్తత్ర యామే ద్వితీయే
సుగుణసహితమన్తశ్చిత్రిణీం సంలభేత.' ఇతి,

స్రగ్ధరా.

టీ. స్వప్నసారే = కలయొక్క, సత్త్వవంటి సత్తగలదియు (అనఁగా; కలవలెనె యసత్యమైన దనుట), పరి...రళే-పరిణతి = పరిణామమునందు, తరళే = నిలుకడలేని దియు, (అగు) సంసారే=సంసారమునందు, పండితానాం = తెలివిగలవారికి, ద్వేగతీ = రెండుదోవలు: (అవి యేవన)తత్త్వ...ధియాం - తత్త్వజ్ఞాన=పరమాత్మవిజ్ఞాన మనెడి, అమృతఓఘ = అమృతప్రవాహములో, ప్లవ=తేలుటయందు, లలిత = ఉత్సాహముగల, ధియాం=బుద్ధిగలవారికి, కాలః = కాలము, కథంచిత్ = అతికష్టముగా, యాతు = కడ చునుగాక; నోచేత్ = లేకున్న, స్తన...నీనాం - స్తన=చన్నులయు. జఘన=మొలయు, ఘన=గొప్ప, ఆభోగ = విరివియొక్క, సంభోగినీనాం = అనుభవముగలవారై, స్ఫార = పెద్దదయైన, ఉరః=ఱొమ్ముమీఁద, శాయినీనాం = పరుండునట్టి, ముగ్ధ అంగనానాం= ముద్దరాండ్రగు స్త్రీలను, స్మరసమర = సంభోగముయొక్క, కళా = విద్యయందలి, కౌశలీ = నేర్పుయొక్క, దేశికానాం = ఆచార్యులగువారికి, (కాలః, యాతు.)

తా. ఈయస్థిర మయిన సారము లేని సంసారమునందుఁ దిరుగు పండితులు పరబ్రహ్మవిచార మనెడి యమృతమునందు మునుఁగుట యను తెప్పయందుఁ బొరలుచుండు తెలివిగలవారై కాలంబు పుచ్చెదరు. కాదేని గబ్బిగుబ్బలును, వెడఁదలగు పిఱుఁదులును గలవారగు చక్కని మగువల మరుగీములం దాశతోడఁ దమ చేతులను దడవుచుండుట యందు మక్కువ గలిగి కాలంబు పుచ్చెదరు. (సంసారమునఁ దత్త్వజ్ఞాన మొక్కగతి స్త్రీలనితంబములందుఁ జేతులనుంచుకొని యుండుట రెండవగతి. ఈ రెంటిలో మొదటి దగు తత్త్వజ్ఞానము లేనపుడు, స్త్రీ నితంబసేవనమే తత్త్వజ్ఞానమువలె సుఖదాయక మని భావము.)

శా. సారం బెక్కడ లేక మిథ్య యగుసంసారంబునఁ గా మార్గముల్
బారం జూచిన రెండు పండితులకుఁ బ్రహ్మానుసంధానయో
గారూఢత్వము రూపవద్యువతిరమ్యస్థూలమీనధ్వజా
గారన్యస్తకరారవిందకృతయోగ్యస్పర్శలీలాప్తియున్.

శ్లో. ఆవాసః క్రియతాం గాఙ్గే పాపహారిణి వారిణి,
స్తనద్వయే తరుణ్యా వా మనోహారిణి హారిణి. 38

వ్యా.—ఆవాస ఇతి.—పాపాని హరత్యభీక్ష్ణమితి పాపహారి-
'గాఙ్గం వారి మనోహారి మురారిచరణచ్యుతమ్,
త్రిపురారిశిరశ్చారి పాపహారి పునాతు మామ్.'
'పాపాపహారి దురితారితరఙ్గధారి దూరప్రచారి గిరిరాజగుహావిహారి,
ఝఙ్కారకారి హరిపాదరజోవిహారి గాఙ్గం పునాతు పరిశశ్శుభకారి వారి.'

ఇత్యాదినా సమస్తపాపక్షయకర ఇత్యర్థః. * 'బహులమాభీక్ష్ణ్యే' ణినిః, గాఙ్గే గఙ్గాసంబన్ధిని, * 'తస్యేదమ్, ఇత్యణ్ప్రత్యయః, వారిణి, ఆవాసః క్రియతామ్, స్నానపానాదినా బాహ్యాభ్యన్తరశుద్ధి సంపాదనద్వారా స్వర్గాపవర్గప్రాప్త్యర్థం తత్ర నివాసో విధీయతా మిత్యర్థః. తథా చ శ్రుతిః—

'సితాసితే సరితే యత్ర సంగతే తత్రాప్లుతాసో దివముత్పతన్తి,
యే వై తన్వాం విసృజన్తి ధీరాస్తేజనాసో అమృతత్వం భజన్తే' ఇతి-

స్మృతిశ్చ—

'గఙ్గా తుఙ్గతరఙ్గిణీ భవభయక్లేశాపహా సర్వదా,

మర్త్యానామపగాహనాత్సకృదపి స్వర్గేఽపి సంస్థాపినీ.' ఇత్యాది-

అథవా మనోహారిణి అత్యన్తమనోహరే * పూర్వవర్ణినిః, కుతః ? హారిణి ముక్తాహారవతి *అత్ర మత్వర్థీయ ఇని ప్రత్యయః, తరుణ్యా నవయౌవనాయాః, స్తనద్వయే ఆవాసః పరిశీలనతాత్పర్యం క్రియతామ్,తరుణీస్తనాశ్రయస్యైవ నిరతిశయసుఖహేతుత్వాదితి భావః.

అత్ర తరుణీగ్రహణం స్తనద్వయస్య పతనాభావేన పాటవాతిశయద్యోతనార్థమ్, అన్యథాఽభాసప్రసఙ్గాత్; ఏతేన మణిహిరణ్మయకఙ్కణయోరివ స్తనద్వయహారయో రప్యన్యోన్యరామణీయకప్రకాశపరిపోషావహత్వేన విశిష్టస్తనద్వయస్యాశ్రయణయోగ్యత్వం సూచితమిత్యవగన్తవ్యమ్, యథాహ శ్రీహర్షః—'తరుణీస్తనఏవ దీప్యతే మణిహారావలిరామణీయకమ్' ఇతి.

అత్ర పూర్వోత్తరవాక్యస్థయోరనుప్రాసయమకయోః శబ్దాఽలంకారయోః సంసృష్టిః స్పష్టా. అనుష్టుప్.

టీ. పాపహారిణి = పాపములను బోఁగొట్టు, గాంగే=గంగదైన, వారిణి (వా) = నీటియందుఁ (గాని), హారిణి = ముత్యాల పేరులుగల, మనోహారిణి=ఇంపైన, తరుణ్యా=జవరాలియొక్క, స్తనద్వయే వా=చనుదోయిమీఁదఁగాని, ఆవాసః = కాఁపురము, క్రియతాం=చేయఁబడుఁగాక !

తా. విరక్తుఁ డగువాఁడు సకలపాపంబులఁ బోఁగొట్టి పుణ్యముల నొసఁగెడి గంగానదీతీరంబునఁ గాశి మొదలగు పుణ్యక్షేత్రములందు వసింపఁదగును. అట్లు వసించి మోక్షము నొందవలయు ననుట. లేదా, ముత్యాలహారములచే నొప్పెడి జవరాలి గబ్బిగుబ్బలదోయియందు రమించి యిహలోకసౌఖ్యములం గుడువవలయును.

తే. అఖిలపాతకభయహారి ♀ యైనగాంగ
వారియందైన యువమనో ♀ హారి యగుచు
హారి యగుకల్కికుల్కుమి ♀ టారిచన్ను
దోయియందైన వాసంబు ♀ సేయవలయు.

అవ. కవి తానే పైప్రశ్న కుత్తర మిచ్చుచున్నాఁడు:—

శ్లో. కిమిహ బహుభిరుక్తైర్యుక్తిశూన్యైః ప్రలాపై
ర్ద్వయమిహ పురుషాణాం సర్వదా సేవనీయమ్,

అభినవమదలీలాలాలసం సున్దరీణాం
స్తనభరపరిఖిన్నం యౌవనం వా వనం వా. 39

వ్యా.—అథ ద్వాభ్యాం నిగమయతి—కిమితి.—ఇహాస్మిన్నర్థే, బహుభిరపరిమితైర్యుక్తిశూన్యైః నిస్సారైరుక్తైరుదితైః, ప్రలాపైరనర్థకవచనైః, కిం ఫలమితి శేషః. వాచోవిజ్ఞాపనం వినా న కిఞ్చిత్ఫలమస్తీత్యర్థః. ని. 'ప్రలాపోఽనర్థకం వచః' ఇత్యమరః. కింత్విహాస్మిం లోకే, పురుషాణాం ద్వయం, సర్వదా నిరన్తరమ్-'సర్వథా' ఇతి వా పాఠః, సేవనీయమ్, కిం తద్ద్వయమత ఆహ—అభినవా నూతనా-యా మదలీలా మన్మథావేశజనితవిలాసాస్తాసు లాలసం లోలుపమ్, అత్యాసక్తమిత్యర్థః. స్తనభరేణ కుచకలశభారేణ. పరిఖిన్నం పరిశ్రాన్తమ్, ఉభయత్రాఽపి యౌవనవతీధర్మో యౌవన ఉపచర్యతే, సున్దరీణాం యౌవనం వా, న త్వసున్దరీణామితి భావః, ఉత వనం పుణ్యారణ్యం వా, సేవనీయమితి సంబన్ధః, ఏతయోరేవ పరమసుఖనిదానత్వాదితి భావః.

మాలినీ.

టీ. ఇహ=ఈవిషయములో, యుక్తిశూన్యైః=యుక్తిలేని, ఉక్తైః=చెప్పఁబడు, బహుభిః ప్రలాపైః=పెక్కుకూఁతలచే, కిం=ఏమి (లాభము)? ఇహ=ఈలోకములో, సర్వదా = ఎల్లప్పుడు (లేక, సర్వథా=సర్వప్రకారములచే), పురుషాణాం=పురుషులకు, ద్వయం సేవనీయం=రెండు సేవింపఁదగినవి, (ఏ వన) అభి...లసం - అభినవ=క్రొత్తయైన, మద=(మన్మథ) మదముయొక్క, లీలా=విలాసములయందు, లాలసం=ఆసక్తి గలదియు, స్తనభరపరిఖిన్నం = చనులబరువుచే నలసిన, సుందరీణాం=అందకత్తెలయొక్క, యౌవనం వా=ప్రాయముగాని, వనం వా=అడవిగాని.

తా. ఆర్యులారా! పొందిక లేకుండఁ జెప్పిన పలుతెఱంగులగు వట్టిమాటలతో నేమి యుపయోగము? ప్రపంచమున మానవులు జవ్వనంపుమచ్చరమువలని వేడుకతోఁ గలుకుచుండువారును, స్తనభారముచేఁ గొంచెము ముందుకు వంగినవారు నైన చెలువల యౌవనము నైనను, వనంబునైనను సేవింపవచ్చును. (వైరాగ్యము గలుగనప్పుడు జవరాండ్రను గొలువవలయును, వైరాగ్యము గలిగిన పదంపడి యరణ్యమున నుండవలయు నని భావము.)

చ. కనుఁగొన యుక్తియుక్తములు కానివి మాటలు వేయు నేటికిఁ
గొనబుగ రెండు మానవుల కుఁ భజనార్హము లైనవస్తువుల్
వినుతనవీనచారుమద విభ్రమలాలససుందరీజన
స్తనభరఖిన్నమై యమరు యౌవనముఁ వనముఁ వసుంధరన్.

అవ. అతివయే సుఖదుఃఖములకుఁ బ్రధానహేతువు, మఱొక్కటి కాదని చెప్పు చున్నాఁడు —

శ్లో. సత్యం జనా వచ్మి న పక్షపాతా ల్లోకేషు సప్తస్వపి తథ్య మేతత్,
నాన్యన్మనోహారి నితమ్బినీభ్యో దుఃఖైకహేతుర్న చ కశ్చిదన్యః.

వ్యా.— ఇదానీం నిష్కృష్టమర్థమాహ— సత్యమితి— కిం బహునా, హేజనాః, సత్యం వచ్మి యథార్థం బ్రవీమి, పక్షపాతాత్ వైషమ్యాన్న వచ్మి, సప్తసు లోకేష్వ ప్యేతదేవ తథ్యమిత్యర్థః. కిమేతదిత్యత ఆహ— నితమ్బినీభ్య స్తరుణీభ్యః, మనోహారిమనో హారం వస్తు, నాస్తి. తథా తాభ్యోఽన్య ఇతరః, దుఃఖానా-మేకహేతుర్ముఖ్యకారణం చ నాస్తి - 'కో భోగో రమణీం వి నే'త్యాదినా భోగైకసాధనత్వాత్ -'బద్ధమూలస్య మూలం హి మహావైరతరోః స్త్రియః' ఇత్యనర్థకమూలత్వాచ్చ నితమ్బినీనా మేవ పరమ సుఖదుఃఖైకనిదానత్వాదితి భావః.

అత్ర సప్తశ్లోక్యా పక్షద్వయనిరూపణస్యాయమభిప్రాయః— అఖణ్డనిరతిశయా నన్దావాప్తిలక్షణ త్వేనాభ్యర్హితత్వాన్ముఖ్యో మోక్షః పురుషార్థ ఇతి సకలమతసిద్ధాన్తః, ప్రసూతిభాజో విశ్వస్య స్త్రీపుంసాభ్యామేవ నిష్పన్నత్వాత్కామస్య పితృఋణవిమో చనేహేతుభూతతయా సతతం మహాపురుషపరిగ్రహాత్పురుషార్థత్వమితి నన్దికేశ్వరశ్వేత కేతుపాఞ్చాలవాత్స్యాయనాదిపూర్వసిద్ధాన్తః; ఏవం చ సతి పూర్వాలాభే పరః పర ఇతి న్యాయాత్ ముఖ్యకల్పాలాభేఽనుకల్పస్యాపి విహితత్వాన్మోక్షపురుషార్థసాధన ప్రవృత్త్యలాభే కామపురుషార్థసాధనేషు వా ఆవశ్యం ప్రవృత్తిః కర్తవ్యేత్యనుసంధా యైవముపన్యస్తమితి.

అత్ర నితమ్బిన్యతిరిక్తరమ్యవస్త్వనర్థహేతోర్వస్తుత్యపి సంబన్ధేఽప్యసంబన్ధోక్తే రతిశయోక్తిభేదః ఇన్ద్రవజ్రా— 'స్యాదిన్ద్రవజ్రా యది తౌ జగౌగః, ఉపేన్ద్రవజ్రా జత జాస్తతో గౌ' ఇతి లక్షణాత్.

టీ. జనాః=ఓజనులారా!' సత్యం = నిజమును, వచ్మి = చెప్పుచున్నాను. పక్షపా తాత్ = పక్షపాతమువలన, న=కాదు. సప్తసు లోకేషు అపి=ఏడులోకములయందును, ఏతత్=ఇది, తథ్యం=నిజము. (ఏది యన) నితంబినీభ్యః = (గొప్పపిఱుఁదులుగల) సుంద రులకంటెను, మనోహారి=ఇంపైనది, అన్యత్=మఱియొకటి, న=లేదు: దుఃఖైకహేతుః చ = దుఃఖమునకు ముఖ్యకారణమును, అన్యః = మఱియొకటి, కశ్చిత్ = ఒకటియు, న = లేదు.

తా. ఓజనులారా! నేను పక్షపాతములేక నిక్కువముఁ జెప్పెదను. లోకంబులయం దన్నిటియందును ఇదే యథార్థమైనసంగతి. వైరాగ్యము గలుగనప్పుడు స్త్రీకంటె సుఖప్రదమైనది మఱొక్కటి లేదు. విరక్తి గలిగినపిదప స్త్రీలకంటె దుఃఖహేతువు మఱొక్కటిలేదు.

తే. తథ్యము వచింతుఁ బక్షపాతమునఁ గాదు
నిఖిలజగములయందు దివి నిక్కువంబు
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు
వారలే కష్టముల కెల్లఁ గారణములు.

ఇది శృంగారశతకమునందు సంభోగవర్ణన మను
రెండవవింశతి.

---

## కామినీగర్హణము

అవ. విద్వాంసుఁడును స్త్రీలను జూచి మోహించుచున్నాఁడని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కా న్వేతృత్పలలోచనేతి విపులశ్రోణీభరేత్యున్నమ
త్పీనోత్తుఙ్గపయోధరేతి సుముఖామ్భోజేతి సుభ్రూరితి,
దృష్ట్వా ముహ్యతి మోదతేఽభిరమతే ప్రస్తౌతి విద్వానపి
ప్రత్యక్షాశుచిభస్త్రికాం స్త్రియమహో మోహస్య దుశ్చేష్టితమ్. 41

వ్యా.—యదుక్తం 'దుఃఖైకహేతుర్న చ కశ్చిదన్య' ఇతి తదేవ ప్రపఞ్చయితుమిదానీంకామినీగర్హణమారభతే—అథ కామినీగర్హణమితి—అథ సంభోగనిరూపణానన్తరం కామినీగర్హణం. కామినీనిన్దా అవింశతిసమాప్తి క్రియత ఇతి శేషః. నను శృఙ్గారాలమ్బనత్వేన ప్రసిద్ధానాం కామినీనాం గర్హణే శృఙ్గారవర్ణనప్రతిజ్ఞాభఙ్గః ప్రసజ్యేతేతి చేన్న, శిశుపాలాదికృతభగవద్గర్హణస్య పురుషార్థపర్యవసానవత్కామినీగర్హణస్యాపి యథాకథంచిచ్ఛృఙ్గారవర్ణన ఏవ పర్యవసానాన్న కోఽపి విరోధఇతి మన్తవ్యమ్ తత్ప్రకారమేవవివృణోతి.—కాన్వేతి—వేత్తీతి విద్వాన్ సారాసారవిచారచతురః—జ్ఞానవానపీత్యర్థః - కిముతాన్య ఇతి భావః, * 'విదేశ్శతుర్వసు రి' తి వస్వాదేశః, ప్రత్యక్షేణాశుచిభస్త్రికాం అపవిత్రచర్మపుటం * స్వార్థే కః 'ప్రత్యయస్థాత్కాత్పూర్వ స్యే' త్యాదినా ఇకారాదేశః. * 'భస్త్రైషాజాజ్ఞే' త్యాదినా వైకల్పికః - 'పుత్త్రికా'మితి పాఠే - అశుచిపాఞ్చాలికాం అత్యన్తజుగుప్సితరూపామిత్యర్థః. తదుక్తం—

హాసోఽస్థిసందర్శనమక్షియుగ్మమత్యుజ్జ్వలం తత్కలుషావసాయాః,
స్తనౌ చ పీనౌ పిశితాస్రపిణ్డౌ స్థానాన్తరే కిం నరకో న యోషిత్.' ఇతి,

ఇత్థం భూతాం స్త్రియం*'వామ్శసో' రితి వికల్పాదియజాదేశః, దృష్ట్వా, కాన్తా కమనీయేతి మనోహరేతి వా-ని.'కాన్తం మనోహరం రుచ్యమి' త్యమరః, ఉత్పలే ఇన్దీవరే ఇవ లోచనే యస్యాస్సా తథోక్తేతి, విపులశ్రోణీభరా పృథులనితమ్బబిమ్బేతి, ఉన్నమన్తావూర్ధ్వముత్పతన్తావివ స్థితౌ-కుతః? పీనౌ పీవరౌ ఉత్తుఙ్గౌ ఉన్నతౌ చ-పయోధరౌ స్తనౌ-యస్యాస్సా తథోక్తేతి-ని. 'స్త్రీస్తనాబ్దౌ పయోధరా వి'త్యమరః, సుముఖామ్భోజా సున్దరవదనారవిన్దేతి, శోభనే మదనకార్ముకరుచిరే-భ్రువౌ యస్యాస్సా తథోక్తేతి చ, మాద్యతి మత్తో భవతి, మోదతే హృష్యతి, అభిరమతే క్రీడతి *అభిపూర్వాద్రమతేర్లటి తఙ్ *వ్యాఙ్పరిపూర్వస్యైవ పరస్మైపదిత్వనియమాత్, ప్రస్తౌతి ఉక్తప్రకారేణ ప్రకారాన్తరేణ వా అభిష్టౌతి, అత., మోహస్యావిద్యాయాః, దుశ్చేష్టితం దుర్విలసితం అహో విద్వాంసమపీదృగవస్థాపన్నం కరోతీత్యాశ్చర్యమిత్యర్థః. ఏతత్సర్వం వ్యామోహమూలమేవ, తస్య దురుచ్ఛేదత్వాదితి భావః; యద్యపి-

'అమేధ్యపూర్ణం క్రిమిజన్తుసంకులం స్వభావదుర్గన్ధమశౌచమధ్రువమ్,
కళేబరే మూత్రపురీషభాజనే రమేత మూఢా న రమేత పణ్డితః.

ఇతి వచనాత్పణ్డితస్యేత్థం జుగుప్సితకామినీకళేబరే రమణమేవ నాస్తి, తథాపి మోహస్యాత్యన్తప్రాబల్యప్రకటనార్థమిత్థముక్తమిత్యవగన్తవ్యమ్.

అత్ర క్రియాణాం బహ్వీనాం సముచ్చితత్వాత్క్రియాసముచ్చయాలంకారః-ఏక విషయః—'గుణక్రియాయౌగపద్యమలంకారస్సముచ్చయః' ఇతి లక్షణాత్.

శార్దూలవిక్రీడితమ్—'సూర్యాశ్వైర్మసజస్తతాస్సగురవః శార్దూలవిక్రీడితమ్,'

టీ. విద్వాన్ అపి=పండితుఁడు సైతము, ప్రత్య...స్త్రికాం-ప్రత్యక్ష=ప్రత్యక్షముగా, అశుచి=అపవిత్రమైన, భస్త్రికాం= (తోలు) తిత్తియైన, స్త్రియం=ఆఁడుదానిని, దృష్ట్వా=చూచి, కాంతా ఇతి=మనోహారిణియనియు, ఉత్పలలోచనా ఇతి=కలువలవంటి కన్నులు గలదనియు, విపులశ్రోణీభరా ఇతి=విశాలమగు పిఱుఁదులబరువు గలదియనియు, ఉన్న...ధరా ఇతి-ఉన్నమత్=పైకుబుకుచున్న, పీన = బలిసిన, ఉత్తుంగ=ఎత్తయిన,పయోధరా ఇతి=పాలిండ్లు గల దనియు,సుముఖఅంభోజా ఇతి=చక్కని మోముఁదామర గలది యనియు, సుభ్రూః ఇతి = మంచికనుబొమలుగలదియనియు, ముహ్యతి=మోహించును, మోదతే=సంతసించును, అభిరమతే=క్రీడించును, ప్రస్తౌతి=పొగడును, మోహస్య=మోహముయొక్క, దుశ్చేష్టితం=దుండగము, అహో=ఆశ్చర్యము.

తా. లోకమున విద్వాంసుఁడు సైతము తనకంటికి బాగుగాఁ గనఁబడుచుండు తోలుబొమ్మవంటి కాంతను జూచి మోహించుచున్నాఁడు. మఱి యానంద మొందుచున్నాఁడు. కోరఁదగినది యనియు, కలువకంటి యనియు, వెడఁదపిఱుఁదులభారము గల దనియు, నుత్సాహముతోఁ గూడిన గబ్బిగుబ్బలు గలదనియు, తమ్మివంటి మోము గల దనియు, సొగసుబొమలు గలది యనియుఁ గొనియాడుచు రమించుచున్నాఁడు. ఆహా! మోహముయొక్క చెడ్డవ్యాపార మేమని చెప్పవచ్చును?

మ. మలభూయిష్ఠపుఁదోలుబొమ్మ యగుకొ । మ్మం జూచి విద్వాంసుఁడుం
బులినశ్రోణి మనోహర స్తని నవాం । భోజాస్య నీలోత్పలా
క్షి లతాతన్వి యటంచు మత్తుఁడగు హ । ర్షించుఁ రమించుఁ బళీ
బళియంచుఁ వినుతించు మోహవికృతుల్ । భావింపఁగా జిత్రముల్.

అవ. మూఁడు శ్లోకములచే స్త్రీస్వరూపమును దూషించుచున్నాఁడు.—

శ్లో. స్మృతా భవతి తాపాయ దృష్టా చోన్మాదకారిణీ,
స్పృష్టా భవతి మోహాయ సా నామ దయితా కథమ్. 42

వ్యా. అథ త్రిభిరానుష్టుభైః స్వరూపం దూషయతి—స్మృతేతి—యా స్మృతా సదృశదృష్టిచిన్తాదిస్మృతిబీజోద్బోధకసద్భావవశాత్ప్రవాసేకదాచిత్స్మరణవిషయీకృతా సతీ, తాపాయ భవతీత్యర్థః, తతః దృష్టా సతీ, ఉన్మాదకారిణీ చిత్తవిభ్రమకరీ భవతి, స్పృష్టా, ఆలిఙ్గితా సతీ, మోహాయ భవతి బహిః ప్రపఞ్చవిస్మరణకారిణీ భవతి, అతస్సా వధూః కథం నామ కుతో వా - దయితా ప్రియతమా న కథంచిదపీత్యర్థః, కింతు ఉక్తబహ్వనర్థహేతుభూతత్వాత్ అప్రియతమైవేతి భావః.

అత్ర స్మృతా భవతి తాపాయేతి పదార్థానాం విశేషణగత్యా తురీయపాదస్థపదార్థం ప్రతి హేతుత్వాత్కావ్యలిఙ్గభేదః.

టీ. స్మృతా = తలంపఁబడినదై తాపాయ=తాపముకొఱకు, భవతి = అగును. దృష్టా చ = చూడఁబడినదై, ఉన్మాదకారిణీ (భవతి) = పిచ్చియెత్తించునది (యగును). స్పృష్టా = తాఁకఁబడినదై, మోహాయ = మోహముకొఱకు, భవతి=అగును. సా=అటువంటిది, కథంనామ=ఎట్లుగా, దయితా=ప్రియురాలు (అగును)?

తా. తలఁచినమాత్రమున వేండ్రము గలిగించును. చూచినంతమాత్రమున వెఱ్ఱిని గలుగఁజేయును. తాఁకినంతమాత్రమున సొక్కించును. అట్టిమగువ నెట్లు ప్రియురా లనవచ్చును?

క. తనుఁ దలఁచినఁ బరితాపముఁ
గనుఁగొనఁ జిత్తభ్రమంబుఁ ♦ గడువేడుక ము
ట్టిన మోహంబు నొసంగెడు
వనిత దయిత యనుచుఁ బలుక ♦ వచ్చునె జగతిన్.

శ్లో. తావదేవామృతమయీ యావల్లోచనగోచరా,
చక్షుష్పథాదతీతా తు విషాదప్యతిరిచ్యతే. 43

వ్యా — తావదితి — తావదేవ తావత్పర్యన్తమేవామృతమయీ అమృతోప మానా-తద్వన్మధురతరేత్యర్థః - వధూరితి శేషః. * 'తత్ప్రకృతివచనే మయట్' 'టిడ్ఢాణఞ్'త్యాదినా జీప్, కియత్పర్యన్తమిత్యత ఆహ—యావద్యావత్పర్యన్తం, లోచన గోచరాచక్షుర్విషయా భవతి తావదితి సంబన్ధః,వ్యతిరేకే తు నైవమిత్యాహ—చక్షుష్ప థాత్ లోచనమార్గాత్ *'బుఖ్యాది' త్యాదినా సమాసాన్తః, అతీతాతుఅతిక్రాన్తా చేద్వి షాత్కాలకూటాద, ప్యతిరిచ్యతేఅతిరిక్తాభవతి-తద్వత్ప్రాణప్రయాసకారిణీ భవతీత్యర్థః.

అత్ర వధ్వా అమృతమయత్వవిషాతిరిచ్యమానత్వాసంబన్ధేఽపి తత్సంబన్ధాభి ధానాదసంబన్ధే సంబన్ధరూపాఽతిశయోక్తిః.

టీ. యావత్ = ఎంతవఱకు, లోచనగోచరా=కనులకుఁ గనఁబడునది(అగునో), తావత్ ఏవ = అందాఁకనే, అమృతమయీ = అమృతరూపమైనది. చక్షుఃపథాత్ =నేత్ర మార్గమునుండి, అతీతాతు = కడచినదైననో, విషాత్ అపి=విషముకంటెను, అతిరిచ్యతే = గొప్ప దగుచున్నది. (విషమువలె బాధించి ప్రాణమును దీయు ననుట.)

తా. సుందరి కంటికిఁ గనఁబడు నంతవఱకే యమృతముమాడ్కి నింపు గలిగించుచుండును. కంటికిఁ గనఁబడకున్న నాసుందరియే విష మును మించినదై ప్రాణములకుపద్రవము గలిగించును సుందరాంగుల వియోగము సైఁచుట దుష్కర మని భావము.

తే. ఎంతలో నింతి కన్నుల ♦ యెదుట నిలుచు
నంతలో నింపు వాటించు ♦ నమృతమట్ల
కాక లోచనమార్గంబుఁ ♦ గడచెనేని
గరళమునకన్నఁ బ్రాణసం ♦ కటముఁ జేయు.

అవ. స్త్రీయొక్క మంచిచెడ్డలఁ జెల్పుచున్నాఁడు:—

శ్లో. నామృతం న విషం కించిదేకాం ముక్త్వా నితమ్బినీమ్,
సైవామృతలతా యుక్తా వియుక్తా విషవల్లరీ. 44

వ్యా.— ఉక్తమేవార్థం భఙ్గ్యన్తరేణాహ—నేతి—ఏకాం నితమ్బినీం, ముక్త్వా విహాయ, అమృతమమృతశబ్దవాచ్యం, కించిద్వస్తు నాస్తి, విషం విషశబ్దవాచ్యమపి కించి న్నాస్తి. ఇయమేవామృతప్రాయా విషప్రాయా చేత్యర్థః, కుత ఏతదిత్యాశఙ్క్య తత్త్వం సాధయతి—రక్తానురాగవతీ చేత్, సైవ నితమ్బిన్యేవ, అమృతలతా సంజీవనీ భవతీత్యర్థః, విరక్తా అనురాగరహితా చేద్విషవల్లరీ విషలతామఞ్జరీ - ని. 'వల్లరీ మఞ్జరీ స్త్రియా మి' త్యమరః - ప్రాణాపహారిణీ భవతీత్యర్థః.

అత్ర నితమ్బినీవ్యతిరేకేణామృతవిషయోరస్తిత్వసంబన్ధేఽప్యసంబన్ధకథనాత్ సంబన్ధే అసంబన్ధరూపాతిశయోక్తిః. తథోత్తరార్ధే తస్యా మోహామృతలతాత్వవిషవల్లరీత్వ రూపణాద్రూపకాలంకారః స చ రక్తత్వవిరక్తత్వపదార్థహేతుకకావ్యలిఙ్గోత్థితః స నూర్వాతిశయోక్తిముజ్జీవయతీతి సంకరః.,

ప్రాయేణైకార్థమప్యనేకం శ్లోకముక్తివిశేషలోభాల్లిఖన్తి కవయః - యథా నైషధే- ఆదావేవ నిపీయాది శ్లోకద్వయం, యథా చ మాఘే - ప్రసాధితస్యేత్యాది శ్లోకద్వయ మిత్యాది.

టీ. నితంబినీం = గొప్పపిఱుఁదులుగల, ఏకాం = ఒక్కతెను, ముక్త్వా = వదలి, (సుందరి తక్క అనుట) కించిత్ = ఏదియైనను, అమృతం = అమృతము, న = కాదు. విషం = విషమును, న = లేదు. యుక్తా (యది) = కూడినదైన, సావివ = ఆనితంబినియే, అమృతలతా = అమృతపుఁదీఁగ, వియుక్తా (యది) = ఎడఁబాసినదైన, విషవల్లరీ = విషపు దీఁగ (అగును).

తా. చక్కనిపిఱుఁదులుగల స్త్రీయొక్కటితప్ప వేఱొక్కవిషము గాని యమృతముగాని లేదు. ప్రేమగలస్త్రీయే యమృతలత ప్రేమలేని కాంతయే విషపుఁదీఁగె. అనురాగముగలస్త్రీ యమృతలతమాడ్కి బ్రాణముల నొసఁగును. అనురాగము లేనియతివయే విషపుఁదీఁగెవలె బ్రాణములఁ దీయు నని భావము.

ఆ. పడఁతి నొక్కదానిఁ విడిచి యించుక యమృ
తంబు లేదు భువి విషంబు లేదు
అమృతలత లతాంగి యనురాగవతి యైనఁ
గాక మెలఁగెనేని గరళవల్లి.

అవ. స్త్రీ యనుయంత్రమును జేసిన సృష్టికర్తను నిందించుచున్నాఁడు:—

శ్లో. ఆవర్తః సంశయానామవినయభవనం పట్టణం సాహసానాం
దోషాణాం సన్నిధానం కపటశతమయం క్షేత్రమప్రత్యయానామ్,

స్వర్గద్వారస్య విఘ్నో నరకపురముఖం సర్వమాయాకరణ్డం
స్త్రీయన్త్రం కేన సృష్టం విషమమృతమయం ప్రాణిలోకస్య పాశః. 45

వ్యా.—అథ స్త్రీయన్త్రస్రష్టారం దూషయతి—ఆవర్త ఇతి — సంశయానాం సందేహానామావర్తః పరిపాకః-సకలసందేహాస్పదీభూతమిత్యర్థః, అవినయానాం, భువనం లోకః, సాహసానాం, పట్టణం నగరం, దోషాణాం రాగద్వేషాదీనాం సన్నిధానమక్షయ నిధిః - కదాచిదప్యత్ర దోషా న క్షీయన్త ఇతి భావః, కపటశతమయమనేకకైతవ ప్రచురం - బహువిధకైతవాన్యత్రైవ ప్రాచుర్యేణ వర్తన్త ఇతి భావః, * ప్రాచుర్యే మయట్, అప్రత్యయానామవిశ్వాసానాం-ని. 'ప్రత్యయోఽధీనశపథజ్ఞాన విశ్వాసహేతు' ష్విత్యమరః, క్షేత్రముత్పత్తిభూమిః - అనేకాప్రత్యయోత్పాదకమిత్యర్థః, స్వర్గద్వారస్య స్వర్గలోకప్రాప్తిసాధనస్య, విఘ్నః ప్రతిబన్ధనః. నరకపురముఖం యమలోకద్వారం-తత్ప్రాపకమిత్యర్థః-ని.'ముఖం తు వదనే ముఖ్యే ఆస్యే ద్వారాభ్యుపాయయో' రితి యాదవః, సర్వమాయాకరణ్డమశేషశామ్బరీవిద్యేన్ద్రజాలమహేన్ద్రజాలపేటికేత్యర్థః, అమృతమయం సుధారూపం - విషం బహిరమృతవత్ప్రతీయమానం విచార్యమాణే విషప్రాయమిత్యర్థః; లోకస్య జనసముదాయస్య, పాశో బన్ధనసాధనం, స్త్రీయన్త్రం స్త్రీరూపకీలకం, కేన సృష్టం నిర్మితమ్, ఈదృగనర్థాశయయన్త్రనిర్మాతృత్వేన అస్య కుత్సి తత్వమేవేత్యర్థః-అథ ఏవ కేనేత్యుక్తం, యద్వా యద్యపి బ్రహ్మణైవ సృష్టం తథాఽపి ఈదృగ్దుర్యన్త్రనిర్మాతృత్వేన తస్య నామోచ్చారణమపి కర్తుం న యుజ్యత ఇతి కేనేత్యుక్తమ్.

అత్ర స్త్రీయన్త్రే పట్టణాదిరూపణాన్నిరవయవరూపకాలంకారః - తదుక్తమ్—
'ఆరోపవిషయస్య స్యాదతిరోహితరూపిణః,

ఉపరఞ్జకమారోప్యమాణం తద్రూపకమ్ మతమ్.' ఇతి. స్రగ్ధరావృత్తమ్.

టీ. సంశయానాం = సందేహములయొక్క, ఆవర్తః = సుడి, అవినయభవనం = అవినయమునకునిల్లు, సాహసానాం = తెగువలకు, పట్టణం=పట్టణము, దోషాణాం=దోషములకు, సత్ నిధానం మంచినిధి, కపటశతమయం=కపటములు వందలుగలది, అప్రత్యయానాం = అపనమ్మకములకు, క్షేత్రం = పొలము, స్వర్గద్వారస్య = స్వర్గపువాకిటికి, విఘ్నః = అడ్డము. నరకపురముఖం = నరకములపట్టణములకు హజారము, సర్వమాయాకరండం = ఎల్లమోసములకు బరణి, అమృతమయం = అమృతరూపమగు, విషం=విషము, ప్రాణిలోకస్య = ప్రాణిసమూహమునకు, పాశః = (ఉరి) త్రాడు, (అగు) స్త్రీయంత్రమ్= స్త్రీయనెడి యంత్రము, కేన=ఎవనిచేత, సృష్టం= చేయఁబడినది?

తా. సంశయములకు నికిపట్టును, అడఁకువలేమికిఁ బుట్టినిల్లును, తెంపులకు వీడును, పాపములకుఁ బెన్నిధియు, పెక్కువంచనలే మేనుగఁ గలదియు, అపనమ్మికలకుఁ బుట్టుచోటును, స్వర్గపువాకిలి నడ్డగించు గడియ మ్రానును, నరకపట్టణమునకు వాకిలియు, మాయలకన్నింటికిఁ బెట్టియయు, ప్రాణులకుఁ గట్టుత్రాడును, అమృతమువలెఁ గాన్పించు విషము నైన యీ స్త్రీయంత్రము నేమాయకాఁడు సృజించెనో! తెలియకున్నది.

మ. నరకద్వారము సాహసాకరము పుణ్యస్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి దంభనిధి దోషస్థాన మప్రత్యయో
త్కరసుక్షేత్రము కాలకూటమమృతాకారంబుస్త్రీయంత్రముక్
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళోద్బద్ధక్రియాపాశమున్.

అవ. కవులపలుకులకు మోసపోయిన యొకనివచనము:—

శ్లో. నో సత్యేన మృగాఙ్క ఏష వదనీభూతో న చేన్దీవర
ద్వన్ద్వం లోచనతాం గతం న కనకైరప్యఙ్గయష్టిః కృతా,
కిం త్వేవం కవిభిః ప్రతారితమనా స్తత్త్వం విజానన్నపి
త్వఙ్మాంసాస్థిమయం వపుర్మృగదృశాం మన్దో జనః సేవతే. 46

వ్యా.—ఇత్థమనర్థైకతన్త్రమపి స్త్రీయన్త్రం కవివాక్ప్రపఞ్చవఞ్చితో మూఢోఽనువర్తత ఇత్యాహ—నో ఇతి.—ఏష పరిదృశ్యమానో, మృగాఙ్కశ్చన్ద్రస్సత్యేన యథార్థేన, అవదనం వదనం సంపద్యమానో వదనీభూతః వదనత్వేన పరిణత ఇత్యర్థః నో న భవతీతి శేషః. * అభూతతద్భావే చ్విః * 'ఊర్యాదిచ్విడాచశ్చే'తి గతిసంజ్ఞాయాం* 'కుగతిప్రాదయ' ఇతి సమాసః, తథా ఇన్దీవరద్వన్ద్వం నీలోత్పలయుగళం*'ద్వన్ద్వం రహస్యే' త్యాదినా నిపాతః, లోచనతాం లోచనభావం చ-నగతం 'తస్య భావస్త్వతలా' వితి తల్ ప్రత్యయః, తథా కనకైస్సువర్ణదళైః-యథాచామ్పేయప్రసూనైరిత్యర్థః- 'కాఽపి చామ్పేయగౌరీ'తి పద్మినీస్వరూపనిరూపణాత్ - ని. 'అథ చామ్పేయశ్చమ్పకో హేమపుష్పక' ఇత్యమరః *'పుష్పమూలేషు బహుళమి'తి లుక్, అఙ్గయష్టిర్గాత్రయష్టి రపి, న కృతా న నిర్మితా, కిం త్వేవముక్తప్రకారేణ వదనం చన్ద్ర ఇత్యాద్యాకారేణేత్యర్థః, కవిభిః ప్రగల్భవచనైః కవీశ్వరైః, ప్రతారితమనా వఞ్చితచిత్తః-విమోహిత స్సన్నితి యావత్, మన్దో మూఢజనః తత్త్వం జానన్నపి న త్విదం చన్ద్రః కిం తు తత్సామ్యేన తథా వ్యపదిశ్యత ఇతి విదన్నపీత్యర్థః, త్వఙ్మాంసాస్థిమయమత్యన్తజుగుప్సిత

మపీత్యర్థః, మృగదృశాం స్త్రీణాం వపుః కళేబరం, సేవతే సంభోగార్థమాశ్రయతే, విద్వాంస్తు నైవమితి భావః.

అత్ర ప్రతారితమనఃపదార్థస్య జుగుప్సితవపురాశ్రయణపదార్థం ప్రతి హేతుత్వాత్కావ్యలిఙ్గభేదః. శార్దూలవిక్రీడితమ్.

టీ. ఏషః శశాంకః=ఈచంద్రుఁడు, సత్యేన=నిశ్చయముగా, వదనీభూతః= ముఖమైన వాఁడు, నో=కాఁడు; ఇందీవరద్వంద్వం = నల్లకలువలజత, లోచనతాం= కన్నులగుటను, గతంచ న = పొందినదియు కాదు, కనకైః అపి=సంపంగిపూవులచేతను, అంగయష్టిః=చేతికఱ్ఱవంటి (సన్నమైన) దేహము, కృతా న=చేయఁబడినది గాదు; కింతు= మఱి యే మన, ఏవం=ఇట్లు (చంద్రాదులు ముఖాదులుగా నైన వని), కవిభిః=కవుల చేత ప్రతారితమనాః = మోసగింపఁబడిన మనస్సుగలవాఁడై, మందః జనః = తెలివిలేని పామరుఁడు, తత్త్వం=నిజమును, విజానన్ అపి= తెలిసినవాఁడయ్యును, మృగదృశాం= లేడికన్నులుగలవారియొక్క, త్వఙ్మాంసఅస్థిమయం = తోలు మాంసము ఎముక - వీనిరూప మయిన, వపుః=శరీరము, సేవతే= సేవించును.

తా. నిజము పరికించి చూడఁ జందురుఁడే యీ మృగాక్షుల మోముగాఁ గా లేదు. కలువలజంటయే దానికన్నుదోయిగాఁ గా లేదు. దాన మెయిదీఁగ పసిఁడితోఁ జేయఁబడ లేదు. అయినను, కవులు చంద్ర ముఖి, కలువకంటి, కనకాంగి యని వర్ణించుటచే వివేకియుఁ దాను వస్తు తత్త్వము నెఱిఁగినవాఁడయ్యుఁ గవులమాటలకు మోసపోయి, మూఢుఁ డయి చర్మము మాంసము నెముకలుగ నుండు నీమృగాక్షులశరీరమును గొలుచుచున్నాఁడు.

చ. అల నెల కామినీవదన మై జనియింపఁగ లేదు కల్వలున్
నెలఁతకుఁ గన్నులై యునికి నిక్కము గాదు కడానిచే నొడల్
వలనుగఁ జేయ లేదు కవి వంచితమానసుఁ డై వివేకియున్
మలమలినాంగనాతనుస మాశ్రయుఁ డై విహరించు మందతన్.

అవ. స్త్రీలకు స్వాభావికము లైనకడగంటిచూపులు మొదలగునవి తన్నుఁ గూర్చి యని భ్రమసి పురుషుఁడు మోసపోవుచున్నాఁ డని తుమ్మెద దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో. లీలావతీనాం సహజా విలాసా
స ఏవ మూఢస్య హృది స్ఫురన్తి,

రాగో నళిన్యా హి నిసర్గసిద్ధ
స్తత్ర భ్రమత్యేవ ముధా షడఙ్ఘ్రిః. 47

వ్యా.—అథ పురుషాణాం భ్రాన్తిం సదృష్టాన్తమాహ—లీలావతీనామితి.—లీలావతీనాం విలాసినీనాం, విలాసాః విభ్రమాస్సహజాః నైసర్గికాః, అత ఏవ, తే విలాసాః, మూఢస్యాజ్ఞస్య, హృది స్ఫురన్తి అత్మగోచరా ఇమే విలాసా ఇతి బుద్ధ్యా సర్వదా హృదయపరిస్ఫురితా భవన్తీత్యర్థః ఏతచ్చ వృత్తౌ వేతి భావః;తథాహి—నళిన్యాః, రాగో రక్తిమా-అనురాగశ్చ, నిసర్గసిద్ధః, కింతు, షడఙ్ఘ్రిః షట్పదః విటశ్చ ధ్వన్యతే, వృథా వ్యర్థమేవ, తత్ర, నళిన్యాం, భ్రమతి రాగోఽయం మద్గోచర ఇతిభ్రాన్త్యా పర్యటతి-వస్తుతస్తు న తథా, అతో వ్యర్థమస్య భ్రమణమితి భావః.

అత్ర వాక్యద్వయే బిమ్బప్రతిబిమ్బభావేన సామ్యనిర్దేశాద్దృష్టాన్తాలంకారః.

'యత్ర వాక్యద్వయే బిమ్బప్రతిబిమ్బతయోచ్యతే.
సామాన్యధర్మో వాక్యజ్ఞైస్స దృష్టాన్తో నిగద్యతే.' ఇతి లక్షణాత్;

అయం చ రాగయోర్ద్వయోర్భేదేఽపి శ్లేషభిత్తికాభేదాధ్యవసాయమూలాతిశయోక్తి నిర్వ్యూఢభ్రాన్తిమదుజ్జీవితయా ప్రస్తుతనళినీషట్పదవిశేషేణ సామ్యాదప్రస్తుతకామినీవిట ప్రతీతిగోచరసమాసోక్త్యాఽఙ్గేన సంకీర్యతే. వృత్తముపజాతిః.

టీ. లీలావతీనాం=విలాసవతులకు, విలాసాః=ఒయ్యారములు, సహజాః=తోడఁబుట్టినవి; తేఏవ=అవియే, మూఢస్య=మూఢునియొక్క, హృది=మనస్సునందు, స్ఫురన్తి=ప్రకాశించును. నళిన్యాః=తామరతీఁగకు, రాగః=ప్రేమ (ఎఱుపు అని వాస్తవార్థము.), నిసర్గ సిద్ధః=స్వభావముచే నేర్పడినది. (అయినను), తత్ర=అచ్చట, షడంఘ్రిః = తుమ్మెద, (విటుఁ డనియు ధ్వని.) ముధా ఏవ=వ్యర్థముగానే, తత్ర=దానియందు (అతీఁగ యందు), భ్రమతి=తిరుగును.

తా. ఎఱ్ఱగలువకు రాగము (రక్తవర్ణముండుట) స్వాభావికమైనను, భ్రమరము వ్యర్థముగా దానిచుట్టును దిరుగునట్లు వేడుకకత్తెలగు జవరాండ్రకు కడగంటిచూడ్కులు మొదలగుచేష్టలు స్వాభావికములుగా నున్నను మూఢు లగుపురుషు లాచేష్టలన్నియుఁ దమ్ముఁ గూర్చియె వారు చేయుచున్నా రని యనుకొందురు. వా రట్టి యభిమానము గలిగియుండుట వ్యర్థము.

తే. లలిత మైనట్టిలీల లీ ల లావతులకు
సహజ మది మూఢునకు మది సందడించుఁ

బద్మినికి రాగగరిమ స్వాఁభావికంబు
తేఁటి పనిలేక దానిలోఁ దిరుగుచుండు.

అవ. చెలువల మోము మోహజనకముగా నున్నను, అంత్యమునఁ గష్టప్రద మగును గాన దానిం జూచి మోహ మంద రా దని చెప్పుచున్నాఁడు:—

శ్లో. యదేతత్పూర్ణేన్దుద్యుతిహరముదారాకృతి పరం
ముఖాబ్జం తన్వఙ్గ్యాః కిల వసతి యత్రాధరమధు,
ఇదం తత్కింపాకద్రుమఫలమిదానీమతిరసం
వ్యతీతేఽస్మిన్ కాలే విషమివ భవిష్యత్యసుఖదమ్. 48

వ్యా — అథాపాతరమణీయరమణీముఖావలోకనేన న విమోహితవ్యమిత్యాహ — యదితి. — యదేతద్వర్ణనీయం తన్వఙ్గ్యాః తరుణ్యాః, ముఖమబ్జమివ ముఖాబ్జం వక్త్రపద్మం కర్తృ, పూర్ణేన్దోః పూర్ణచన్ద్రస్య-ద్యుతిహరం కాన్తిచోరకం - తత్తుల్యమిత్యర్థః- అబ్జస్య పూర్ణేన్దుద్యుతిహరత్వం విరుద్ధమితి ధ్వనిః, తథా, పరమత్యన్తముదారా రమ్యా - ఆకృతిరాకారో-యస్య తత్తథోక్తం, కిం చ, యత్ర ముఖాబ్జే, అధరమధరోష్ఠసంబన్ధి - మధు మకరన్దః-అమృతం వా, వసతి అస్తి కిల - కిలేతి వార్తాయాం న తు కదాఽప్యనుభూతమిత్యర్థః - ప్రసిద్ధాబ్జే తు మకరన్దో వర్తతే - ముఖాబ్జే తు వార్తామాత్రమేవ న తు వస్తుతస్తదస్తీతి భావః, తదిదం వక్త్రపద్మమిదానీం అస్మిన్ సమయే ప్రారంభకాల ఇత్యర్థః, అతిరసమతిశయితమాధుర్యగుణయుక్తం రుచిరతరమితి యావత్, 'కిం కిమప్యనిర్వాచ్యమిత్యర్థః, పాకద్రుమస్య బాలరసాలాదివృక్షస్య-ఫలమ్-అతిరసబాలవృక్షఫలస్యైవేత్యేతన్నిర్దేశః-ని. 'పోతః పాకోఽర్భకో డిమ్భ' ఇత్యమరః, యద్వా పాకద్రుమఫలం పచేళిమవృక్షవిశేషఫలమిత్యర్థః - తథాభూతస్యైవాత్యన్తరసవత్త్వాదితి భావః, యద్వా-కింపాకమీషత్పక్వం - ద్రుమఫలం-తథాభూతస్యైవ రుచివిశేషాస్పదత్వాదితి భావః, అథవా కింపాకాఖ్యో ద్రుమః యస్య ఫలమాపాతమధురం పరిణామవిషమం చ తస్య కింపాకద్రుమస్య - ఫలం తత్తుల్యమిత్యర్థః, కింపాకశబ్దో నిఘణ్టువన్తరేషు మృగ్యః, తస్య రసాలాదివృక్షవిశేషవాచకత్వే తు కవిరేవ ప్రమాణం, అస్మిన్ ప్రవర్తమానే కాలే, వ్యతీతే అతిక్రాన్తే సతి, విషమివ గరళమివ, అసుఖదం స్వలావణ్యాదర్శనజనితసమ్మోహేన వివేకభ్రంశే విహితాకరణాత్ప్రత్యవాయే వాఽత్యన్తదుఃఖప్రదమిత్యర్థః, భవిష్యతి తథా చ

కాలాన్తరేఽవశ్యం దుఃఖజనకత్వాత్తాదాత్వికసుఖలోభేన తరుణీవదనపద్మం న విశ్వసనీయ మితిభావః. శిఖరిణీవృత్తమ్.

[కింపాకశబ్దశ్చ 'విషముష్టౌ నిరర్థకే చే'తి శబ్దరత్నకోశే వర్తతే, తస్మాత్ రసాలాదివృక్షాన్తఃపాతిత్వం న సంభవతీతి మన్తవ్యమ్.]

టీ. యత్ ఏతత్=ఏయిది, పూర్ణ...హారం - పూర్ణ ఇందు = నిండు చందురుని యొక్క, ద్యుతి = కాంతిని, హారం = అపహరించునదియు, పరం = మిక్కిలి, ఉదార ఆకృతి=మంచిరూపముగలదియు, యత్ర=ఎందు, అధరమధు=అధరామృతము, వసతికిల= ఉన్నదందురో, తన్వఙ్గ్యాః=కృశాంగియొక్క, తత్ ఇదం ముఖ అబ్జం=ఆయీ మోముఁదామర, కింపాకద్రుమఫలం = ముష్టిచెట్టు పండు, ఇదానీం = ఇప్పుడు, (అనుభవించునపుడు) అతిరస = మిక్కిలి రుచిగలదియై, అస్మిన్ కాలే = ఈకాలము, అతీతే = గడువఁగా, విషమివ=విషమువలె, అసుఖదం=సుఖమునీయనిది, భవిష్యతి=అగును.

తా. తీఁగెబోడియొక్క మోముఁదమ్మి పున్నమచందురు మెఱుఁగు నపహరించునదియు, మిక్కిలి యొప్పుగల రూపుగలదియు, మోవియందుఁ దీపిగలదియునై యౌవనసమయంబున ముష్టిపండువలె నెంతయు సౌఖ్యకరంబుగాఁ దోఁచినను, యౌవన కాలము మీఱినతర్వాత విషమువలె దుఃఖప్రద మగును.

శా. రాకాకైరవమిత్త్ర కాంతిహరమై రమ్యాధరోష్ఠామృతా
స్తోకంబై విలసిల్లుచున్న రమణీశుంభన్ముఖాబ్జంబు కిం
పాకక్ష్మాజఫలం బగుఁ రుచిర మైప్రారంభకాలంబునం
గాకోలంబు తెఱంగునన్ నరులకుం గష్టం బొసంగుం దుదిన్.

అవ. స్త్రీపరిత్యాగము చేసినవానికి సంసారమే లేదని చెప్పుచున్నాఁడు:—

శ్లో. ఉన్మీలత్త్రివళీతరఙ్గవలయా ప్రోత్తుఙ్గపీనస్తన
ద్వన్ద్వేనోద్యతచక్రవాకయుగళా వక్త్రామ్బుజోద్భాసినీ,
కాన్తాకారధరా నదీయమభితః క్రూరాశయా నేష్యతే
సంసారార్ణవమజ్జనం యది తదా దూరేణ సన్త్యజ్యతామ్. 49

వ్యా.—అథాస్యా అనర్థహేతుభూతనదీత్వనిరూపణేన పరిత్యాజ్యత్వమాహ— ఉన్మీలదితి.—తిస్రశ్చ తాః వళ్యశ్చ త్రివళ్య ఇతి ద్విగుసమాసః-యథాఽఽహ వామనః— 'త్రివళీశబ్దః సిద్ధః సఙ్జ్ఞాచే'దితి సూత్రేణ సప్తర్షయ ఇతివ 'దిక్సంఖ్యే సఙ్జ్ఞాయామి'తి సఙ్జ్ఞాయాం ద్విగుః. ఉన్మీలన్త్య ఉత్పద్యమానాస్త్రివళ్యో వళిత్రయమేవ తరఙ్గాః -

త్రిత్వసంఖ్యా వళ్యస్త్రివళ్య * ఉత్తరపదలోపిసమాసః. తా ఏవ తరఙ్గా ఊర్మయ-స్తేషాం - నిలయా, ప్రోత్తుఙ్గావత్యున్నతౌ - పీనౌ పీవరౌ చ - యౌ స్తనౌ తయో ర్ద్వన్ద్వేన యుగళేన హేతునా, ఉద్గతముచ్చలత్ చక్రవాకయుగళం చక్రవాకాఖ్య పక్షివిశేషయుగ్మం - యస్యాః - స్తనరూపచక్రవాకయుగళేత్యర్థః, వక్త్రమేవామ్బుజం తేనోద్భాసతే అభీక్ష్ణమితి తదుద్భాసినీ * 'బహుళమాభీక్ష్ణ్యమి' తిణినిః, అభితస్సమన్తాత్, క్రూరా కుటిలహృదయా - నదీపక్షే క్రూరా వక్రగతిప్రవాహః - అథవా - అభితస్స ర్వతః ప్రవర్తమానాః - క్రూరా నక్రాదిక్రూరజన్తవో, యస్యాస్సా, కాన్తాకారధరా - కాన్తారూపధారిణీ, ఇయం పరిదృశ్యమానా నదీకర్మ, అత్రాస్మిన్ లోకే సంసార ఏవా ర్ణవః తత్ర మజ్జనం - నాపేక్షతే నాభిలష్యతే యది, తదా అనపేక్షాపక్షే - దూరేణ సంత్యజ్యతాం దూరతర ఏవ విసృజ్యతాం * 'దూరాన్తికార్థేభ్యో ద్వితీయా చే'తి వికల్పాత్తృతీయా, అన్యథా తత్సమాశ్రయేణ అర్ణవమజ్జనమేవ సిద్ధం స్యాదితి భావః.

అత్ర సమస్తవస్తువర్తి సావయవరూపకాలంకారః. శార్దూలవిక్రీడితమ్.

టీ. ఉన్మి...లయా-ఉన్మిలత్=ఉప్పొంగునట్టి, త్రివళీ=(కడుపుమీఁది) మూఁడు ముడుతలనెడి, తరంగ=అలలయొక్క, వలయా = పంక్తిగలదియు, ప్రో..ద్వంద్వేన - ప్రోత్తుంగ = మిక్కిలి, నిక్కపొడుచుకొనినది, పీన=బలిసినదైన, స్తనద్వంద్వేన = చను దోయి (అనుమిష) చేత, ఉద్య...యుగళా - ఉద్యత = నిక్కిన, చక్రవాకయుగళా = జక్కవలజంట గలదియు, వక్త్రా...సినీ-వక్త్రాంబుజ = ముఖమనెడితామరచే, ఉద్భాసినీ= ప్రకాశించునదియు, అభితః=అంతట, క్రూరఆశయా = కఠినమైన హృదయముగలదియు (మొసళ్లమున్నగు క్రూరజలజంతువులకు స్థానమయినదియు), (అగు) కాంతా ఆకార ధరా=ప్రియురాలి (కాంత=మనోజ్ఞమయిన) రూపమును ధరించిన,ఇయంనదీ=ఈయేఱు, సంసారఅర్ణవమజ్జనం = సంసారసముద్రమున మునుకను, నేప్యతే యది=పొందించునేని, తదా=అప్పుడు, దూరేణ=దూరముగా, సంత్యజ్యతాం=విడువఁబడుఁగాక !

తా. త్రివళు లనెడి యలలును, నిక్కువలుఁదచన్నులనెడి జక్కవ కవలును, మోమనెడి తమ్మియుఁ గలిగి యంతటఁ గ్రూరాశయముగల (కఠినమనస్సు గల యని స్త్రీపరమున నర్థము. మొసళ్లు మొదలగు క్రూర జంతువుల కునికిపట్టయిన యని నదీపరమున నర్థము.) స్త్రీ యను నేఱు సంసార మనుసముద్రమునకుఁ గొనిపోవునది కావున సంసారసముద్ర మున మునుఁగఁ గోరనివారు స్త్రీనదిని చాలదూరముననే విడువ వలయును.

ఉ. చన్నులు చక్రవాకములు ♦ చక్కని మోముఁ గరంబు లబ్జముల్
గన్నులు మీలు నాభి సుడి ♦ గాఢనితంబము సైకతంబుగా
నెన్నికఁ గన్నబోటి యను ♦ నేటికి దవ్వుల నున్కి చాల మే
లెన్న భవాబ్ధిమజ్జన మ♦దేమియుఁ గోరనివారి కిమ్మహిన్.

అవ. స్త్రీలను నమ్మరా దనుటకుఁ గారణములు చెప్పుచున్నాఁడు:—

శ్లో. జల్పన్తి సార్ధమన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః,
హృద్గతం చిన్తయన్త్యన్యం ప్రియః కో నామ యోషితామ్? 50

వ్యా.—ఇతోఽపి న విశ్వాసార్హాః స్త్రియ ఇత్యాహ ద్వాభ్యాం—జల్పన్తీతి— అన్యేన సార్ధమేకేన పురుషేణ సహ, జల్పన్తి, సల్లపన్తి, సవిభ్రమాస్సవిలాసాస్సత్యః, అన్యం పురుషం, పశ్యన్తి, హృద్గతం హృదయస్థమన్యం చిన్తయన్తి, అతో యోషితాం స్త్రీణాం, ప్రియతమః నియత ఇతి శేషః, కో నామ? న కోఽపీత్యర్థః.

టీ. (స్త్రీలు) అన్యేన సార్ధం = ఒకనితోఁగూడ, జల్పన్తి = మాటాడుచుందురు, (అప్పుడే) సవిభ్రమాః=విలాసముతోఁ గూడినవారై, అన్యం = మఱియొకని, పశ్యన్తి = చూచుచుందురు; (అప్పుడే), హృద్గతం = మనసునం దున్న, అన్యం = వేఱొకనిని, చింతయంతి = తలఁచుచుందురు; యోషితాం = స్త్రీలకు, ప్రియః=ఇష్టుఁడు, కోనామ= ఎవఁడు?

తా. స్త్రీ లొక్కనితోఁ బ్రేమ మీఱ మాటాడుదురు. మఱి యొకనిఁ దళుకుబెళుకు నడతలతోఁ జూతురు. మనసున మఱొక్కనిని దలఁచుచుందురు. కావున వారి కిష్టుఁ డొక్కఁ డనుట లేదు.

తే. ఒకనితోఁ గూడి భాషింతు ♦ రొక్కనరునిఁ
జూతురు విలాససంపద ♦ సొంపు గులుక
మఱియు నొక్కనిఁ దలఁతురు ♦ మనసులోనఁ
గూర్చుప్రియుఁ డెవ్వఁడో ముద్దు♦గుమ్మలకును.

అవ. స్త్రీలకడఁ జేరరా దనుచున్నాఁడు:—

శ్లో. అపసర సఖే! దూరాదస్మాత్కటాక్షవిషానలాత్
ప్రకృతివిషమాద్యోషిత్సర్పాద్విలాసఫణాభృతః,
ఇతరఫణినా దష్టశ్శక్యశ్చికిత్సితుమౌషధై
శ్చతురవనితాభోగిగ్రస్తం త్యజన్తి హి మన్త్రిణః. 51

వ్యా.—అథ యోషిత్సర్పస్వరూపేణ సఖాయం భీషయన్ దూరాదపసర్పణ ముపదిశతి—అపసరేతి.—హే సఖే బన్ధో!, కటాక్షా అపాఙ్గవీక్షణాన్యేవ - విషానలా విషాగ్నిజ్వాలా - యస్య తస్మాత్, ప్రకృత్యా విషమాత్ స్వభావత ఏవ కుటిలాత్ * 'ప్రకృత్యాదిభ్య స్తృతీయా చే తి (?) తృతీయాసమాసః, విలాసా విభ్రమా-ఏవఫణాః స్ఫటాస్తా బిభర్తీతి •తథోక్తాత్ - ని. 'స్ఫటాయాం తు ఫణా ద్వయో రి' త్యమరః, తస్మా, ద్యోషిత్సర్పాత్కామినీరూపవ్యాళా, ద్దూరాదపసర దూరం గచ్ఛ - యోషిత్సర్ప సమాగమం మా కుర్విత్యర్థః, అన్యథా తత్సమాగమేన దంశన ప్రసఙ్గాచ్చికిత్సాయా దుష్కరత్వాదితి భావః. * 'దూరా న్తికార్థేభ్యో ద్వితీయా చే' తి చకారాత్పఞ్చమీ, తదేవ ప్రకటయతి ఇతరేతి—ఇతరఫణినా ప్రసిద్ధసర్పేణ, దష్టః పుమాన్, ఔషధైః మూలికామణిమన్త్రాదిభిరిత్యర్థః, చికిత్సితుం విషాపరోపణేనోజ్జీవయితుం, శక్యః, చతుర వనితాభోగినా నిపుణతరుణీసర్పేణ - గ్రస్తం ద్రష్టం సమాక్రాన్తం చ పురుషంతు, మన్త్రిణో మాన్త్రికా విషవైద్యా, స్త్యజన్తి విసృజన్తిహి; తద్భ్రాన్తిజనితోన్మాదస్య దుర పరోపత్వాదితి భావః.

అత్రాపి సమస్తవస్తువర్తి సావయవరూపకాలంకారః; తేన చోపమానాత్ప్రసిద్ధ సర్పాదుపమేయస్య యోషిత్సర్పస్యాధిక్యప్రతీతేర్వ్యతిరేకో వ్యజ్యత ఇత్యలంకారే ణాలంకారధ్వనిః. హరిణీవృత్తమ్ - లక్షణం తూక్తమ్.

టీ. సఖే=చెలికాఁడా! కటాక్షవిష అనలాత్ = క్రేఁగటిచూపులనెడివిషాగ్నులు గలదియుం, ప్ర...మాత్ - ప్రకృతి=స్వభావముచేతనే, విషమాత్=కుటిలమయినదియుం (సర్పపరమందు పుట్టినది మొదలు వంకరయైనదియుం), విలాస...భృతః - విలాస=శృంగార చేష్టలనెడి, ఫణా=పడగలను, భృతః = పొందినదియుం, (అగు) అస్మాత్ = ఈ, యోషిత్ సర్పాత్=స్త్రీయనెడి పామునుండి, దూరాత్ = దూరముగా, అపసర = తొలఁగుము. హి=ఏలయన; ఇతరఫణినా = మఱియొకపాముచే, దష్టః=కఱవఁబడినవాఁడు, ఔషధైః= మందులచేత, చికిత్సితుం = కుదుర్చుటకు, శక్యః=సాధ్యుఁడు; చతు...గ్రస్తం - చతుర= నేర్పరియైన, వనితా=స్త్రీయనెడి, భోగి=పాముచేత, గ్రస్తం = పట్టఁబడిన (కఱవఁబడిన) వానిని, మంత్రిణః=ఆలోచనచెప్పువారు, (విషవైద్యులు) త్యజన్తిహి=వదలుదురుగాదా!

తా. చెలికాఁడా! కడఁగంటిచూపులనెడి విసపునిప్పులు గ్రక్కు నదియు, స్వభావ వక్రమైనదియు, సొంపు లనెడిపడగలను దాల్చినదియు నైన యాఁడుది యను పాముకడఁ జేరక దవ్వునకుఁ బరుగెత్తుము. తక్కినపాములు గఱచినయెడల మంత్రజ్ఞులు మూలికలు దెచ్చి చికిత్స

చేసి, విషవేగము తగ్గించి మాన్పుదురు. జాణ యగు నెలఁతుక యను పాముచేఁ గఱవఁబడినవానిని గుదుర్చుట యసాధ్య మని తలంచి మంత్రజ్ఞులు విడిచివేయుదురు.

ఉ. చూపు విషంబు విభ్రమము◦సొంపు ఫణాఫలకంబుగా వధూ
రూపము దాల్చుభోగికిని ◦ రూఢిగ దూరముగాఁ దొలంగుమీ
దాపుగ సర్పదష్టునకుఁ ◦ దప్పు విషంబు మహౌషధంబులం
బాప వధూభుజంగవిష◦భగ్నునిచెంతకుఁ బోరు మాంత్రికుల్.

శ్లో. విస్తారితం మకరకేతనధీవరేణ
స్త్రీసంజ్ఞితం బడిశమత్ర భవామ్బురాశౌ,
తేనాచిరా త్తదధరామిషలోలమర్త్య
మత్స్యాన్వికృష్య స పచత్యనురాగవహ్నౌ. 52

వ్యా.—పునః ప్రకారాన్తరేణ భీషయతి—విస్తారితమితి—మకరకేతనో మదన, ఏవ ధీవరః కైవర్తస్తేన - కర్త్రా - ని. 'కైవర్తే దాశధీవరౌ' ఇత్యమరః, అత్రాస్మిన్ - భవామ్బురాశౌ సంసారసాగరే; స్త్రీసంజ్ఞాఽస్య సంజాతా స్త్రీసంజ్ఞితం-యోషిద్రూపమిత్యర్థః - తారకాదిత్వాదితచ్, బడిశం మత్స్యవేధనం మత్స్యగళగ్రాహకసామిషవక్రాయోయన్త్రమిత్యర్థః. ని. 'బడిశం మత్స్యవేధన మి'త్యమరః, విస్తారితం ప్రవర్తితం, యేన స్త్రీబడిశేన; తస్యా, స్త్రీబడిశస్యాధరమేవామిషం మాంసఖణ్డం-తత్ర లోలా సతృష్ణామే మర్త్యా మనుజాస్తఏవ-మత్స్యా మీనా స్తానసురాగ ఏవ వహ్నిస్తత్ర, విపచతి విశేషేణ పక్వాన్ కరోతి - అత్యన్తం సంతాపయతీత్యర్థః, మన్మథధీవర ఏవేతి శేషః, సోఽప్యేతద్ద్వారైవ మనుజాన్పరిపీడయతీతి భావః. అత్రాపి పూర్వవద్రూపకాలంకారః. వసన్తతిలకా.

టీ. అత్ర=ఈ, భవఅంబురాశౌ = సంసార మనెడి సముద్రమందు, మకరకేతన ధీవరేణ=మన్మథుఁ డనెడి జాలరిచేత, స్త్రీసంజ్ఞితం=ఆఁడుదియనెడి, బడిశం = గాలము, విస్తారితం = చాఁపఁబడినది; తేన = ఆగాలముతో, సః = ఆమన్మథుఁడు, అచిరాత్ = త్వరగా. త...మత్స్యాన్ - తత్ = ఆస్త్రీయొక్క, అధర = పెదవి యనెడి, ఆమిష=మాంసమునందు, లోల=ఆశగల, మర్త్య=మనుష్యులనెడి, మత్స్యాన్=చేఁపలను, వికృష్య = లాగి, అనురాగవహ్నౌ = ప్రేమయనెడి నిప్పునందు, పచతి = వండుచున్నాఁడు.

తా. మరుఁడను జాలరి యీ సంసారమను సముద్రమున నాఁటి

యను గాలమును విసరివైచియున్నాఁడు. ఆగాలమున మోవి యను నెర యున్నది. ఆయెరయం దాశపడి యీగాలమునకుఁ జిక్కుకొన్న పురుషు లనెడి చేపలను లాగి యాజాలరి వల పనెడి నిప్పునందుఁ బచనము చేయును. కావున నాగాలమునకుఁ జిక్కుకొనకుఁడు.

ఉ. చేరి మనోజధీవరునిచేత భవాంబుధిలోన నంగనా
కారముఁ బూని యున్న పెనుగాలము చిమ్మఁగనయ్యె దానిచే
భీరుజనాధరామిషముఁ బేర్మి భుజించునరాండజంబులన్
వారక సారెకుం దిగిచి వండు మరుం డనురాగవహ్నిలోన్.

శ్లో. కామినీకాయకాన్తారే కుచపర్వతదుర్గమే,
మా సఞ్చర మనఃపాన్థ! తత్రాస్తే స్మరతస్కరః. 53

వ్యా.—అథ మానసంభీషయతి—కామినీతి—పన్థానం గచ్ఛతినిత్యమితి పాన్థో నిత్యపథికః * 'పన్థో ణ నిత్యమితి' ణప్రత్యయః. పన్థాదేశశ్చ - మన ఏవ పాన్థః తస్య సంబుద్ధిః = హే మనఃపాన్థ, కుచావేవ పర్వతౌ తాభ్యాం-దుర్గమే గన్తుమశక్యే, కామిన్యాః-కాయో దేహస్స ఏవ కాన్తారమరణ్యం - తత్ర, మా సంచర సంచారం మా కురు-నప్రవర్తస్వ ఇత్యర్థః. కుతస్తత్ర కాన్తారే స్మర ఏవ తస్కరః చోరః, ఆస్తే వర్తతే, స చ మానసర్వస్వమపహరిష్యతీతి భావః. ని. 'చోరైకాగారికస్తేనదస్యుతస్కరమోషకా' ఇత్యమరః. * 'తద్బృహతోః కరపత్యోశ్చోరదేవతయోస్సుడ్తలోప శ్చే'తి సుడాగమత లోపౌ. అలంకారస్తు పూర్వవత్.

టీ. హేమనఃపాంథ = మనసనెడి బాటసారీ, కుచపర్వతదుర్గమే = చనుగొండలచేఁ బోవరాని, కామినీకాయకాంతారే = స్త్రీయొక్క శరీర మనెడి యడవియందు, మా సంచర=తిరుగకుము. తత్ర = అచ్చట (అడవిలో), స్మరతస్కరః = మన్మథుఁడనెడి దొంగ, ఆస్తే = కలఁడు.

తా. ఓ మనసనెడి బాటసారీ! బలితంపు గుబ్బలనెడి గట్టులచేఁ జొచ్చుటకు వీలుకాకయున్న కాల్గంటి మేననెడి యడవియందుఁ దిరుగకుము. అచ్చట మరుఁ డనెడి దొంగయున్నాఁడు. ఆతఁడు నిన్నీడ్చుకొని పోవును సుమీ.

క. స్తనపర్వతదుర్గమమై
ఘన మగుకాంతాశరీరకాంతారమునం

నఁ బోకు మనఁగ పాంథుఁడ
నలుచు మరుఁ డనెడిదొంగ కొగలఁ డచ్చోటన్.

అవ. ఒక కాముకుఁడు విరక్తుఁడై స్వానుభవముఁ దెల్పుచున్నాఁడు:—

వ్యాదీర్ఘేణ చలేన వక్రగతినా తేజస్వినా భోగినా
నీలాబ్జద్యుతినాహినా వరమహం దష్టో న తచ్చక్షుషా,
దష్టే సన్తి చికిత్సకా దిశి దిశి ప్రాయేణ ధర్మార్థినో
ముగ్ధాక్షీక్షణవీక్షితస్య న హి మే వైద్యో న వాప్యౌషధమ్. 54

వ్యా.—అథ త్రిభిః కస్యచిదనుభవమాలక్ష్యాహ—వ్యాదీర్ఘేణేతి.—వ్యాదీర్ఘేణ ...యతేన - అన్యత్ర కర్ణాన్తవిశ్రాన్తేన, చలేన చఞ్చలప్రకృతినా, వక్రగతినా నిసర్గ ...సంచారేణ, సమానమేతద్విశేషణద్వయం, తేజస్వినా బలవతా అత్యుజ్జ్వలేన చ* ...ంసాయాం వినిః, భోగినా ఫణవతా- ని. 'భోగస్సుఖే స్త్ర్యదిభృతా వహేశ్చ ...ాయయో' రిత్యమరః. అన్యత్రాభోగినేతి చ్ఛేదః - విశాలేనేత్యర్థః, నీలాబ్జస్య నీలో... స్య - ద్యుతిరివ ద్యుతిర్యస్య తేన - ఏకత్ర తద్వర్ణేన - అన్యత్ర తత్సదృశేనేత్యర్థః, ...నా సర్పేణ, పరమత్యన్తమ్-అహం దష్టః, కిం తు, తచ్చక్షుషా తస్యాః కామిన్యాః ...షా ఉక్తవిశేషణేన, న దష్ట ఇత్యర్థః, చికిత్సకాః వైద్యాః, ధర్మార్థినః పరోపకారఏవ ...యోజనమేషామస్తి తథాభూతాస్సన్తః, దిశి దిశి ప్రతిదిశం * 'నిత్యవీప్సయో'రితి ...ప్సయాం ద్విర్భావః, ప్రాయేణ భూమ్నా-సన్తి సర్వత్ర సన్తీత్యర్థః. కిం తు, ...గాయాః ముగ్ధాఙ్గనాయాః-య దక్షి - యద్వా ముగ్ధాక్షి సున్దరావలోకనం - తేన ...రూపేణ - క్షణం క్షణమాత్రం - వీక్షితస్య దృష్టస్య గ్రస్తస్యేత్యర్థః - విక్షతస్యేతి ...తే దష్టస్యేత్యర్థః, మే మమ తు, వైద్యో న హి చికిత్సకో నాస్తి హి, ఔషధం విష ...రభేషజమపి చ, నాస్తీత్యర్థః, అతో మహామోహార్ణవనిమజ్జనమేవ న తు తత్పారగ ...మితి భావః.

అత్ర ప్రసిద్ధాహ్యపేక్షయా చక్షూరూపాహేరాధిక్యకథనాద్వ్యతిరేకా... ...కారః - 'ఉపమానాద్యదన్యస్య వ్యతిరేకస్స ఏవ స' ఇతి లక్షణాత్.

టీ. వ్యాదీర్ఘేణ=మిక్కిలిపొడవైనదియు, చలేన=చంచలమైనదియు,వక్రగతినా=...కరనడకగలదియుఁ, తేజస్వినా=కాంతిగలదియు, (ఇంతవఱకు సర్పమునకును, నేత్ర...మునకును విశేషణములు సాధారణములు.) భోగినా=పడగగలదియు (సర్పపరము.), ...భోగినా=వెడల్పైనదియుఁ (అని నేత్రపరము.), నీల అబ్జద్యుతినా=నల్లగలువ కాంతిగల...యుఁ, (అగు), అహినా=సర్పముచేత, అహం = నేను, దష్టః = కఱవఁబడినవాఁడను,

(అగుట), వరం=కొంత మేలు. (కాని, అటువంటిదే యగు), తత్ చక్షుషా=ఆయువతి కంటిచేత, (కఱవఁబడినవాఁడ నగుట) న = (కొంచెము మేలు) కాదు; (ఏల యన) తప్తే (సతి)=(పాముచేత) కఱవఁబడినయెడల, దిశిదిశి=ప్రతిదిక్కునందును, ప్రాయేణ = తఱుచుగా, ధర్మఅర్థినః=పుణ్యముకుకోరునట్టి, చికిత్సకాః=(విష)వైద్యులు, సన్తి=కలరు; (కాని), ముగ్ధా...తస్య-ముగ్ధాక్షీ = అందములైన కన్నులుగలవారి (జవరాండ్ర) యొక్క, ఈక్షణ=చూపుచేత, వీక్షితస్య=చూడఁబడినట్టి, (లేక, ముగ్ధాక్షీ = యువతులచే, క్షణ=క్షణకాలము. వీక్షితస్య=చూడఁబడినట్టి), మే=నాకు, వైద్యః వా = చికిత్సచేయు వాఁడు, నహి=లేఁడుగదా? ఔషధం వా అపి=మందుగాని, న=లేదు.

తా. మిక్కిలి నిడుపై కదలుచు వంకరగాఁ బోవునదియు, బలిమి గలదియునై పడగ గలిగి, నల్లఁగలువవంటి వన్నెగల సర్పము నన్నుఁ గఱచినను హాని లేదు. అయితే చెవివఱకు నిడుపై యదురుచు, వంకర గాఁబోవుచు మెఱుఁగుగలిగి విజీవి గలిగియుండు నల్లఁగలువకు సాటి వచ్చు నాకలువకంటియొక్క చూపులను పాము గఱచినఁ గీడు తప్పక వచ్చును. అది కొంచెమైనను మేలుగాదు. సాధారణము లగుపాములు గఱచినఁ జికిత్స చేయుపుణ్యాత్ములు మూలమూలకు నెందఱో యున్నారు. ముద్దుచూడ్కులు గలకాంతలంటిచూపు తగిలెనా చికిత్సచేయు వైద్యులును లేరు; మందును లేదు.

చ. ఉరగము ముట్టినా నరుల । కుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళము నెక్కుడింతు రధికంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ । బూనినమానినిచూపు సోఁకినం
బురుషున కెందు మందులును । బొందవు పొందరు వెజ్జు లెవ్వరున్.

శ్లో. ఇహ హి మధురగీతం నృత్తమేతద్రసోఽయం
స్ఫురతి పరిమళోఽసౌ స్పర్శ ఏష స్తనానామ్,
ఇతి హతపరమార్థైరింద్రియైర్భ్రామ్యమాణః
స్వహితకరణధూర్తైః పఞ్చభిర్వఞ్చితోఽస్మి. 55

వ్యా.—ఇహేతి—ఇహ హి తరుణీష్వేవేత్యర్థః - హిరత్రావధారణార్థకః - ని. 'హి హేతావవధారణే' ఇత్యమరః, మధురం సంతాపహారం శ్రోత్రసుఖావహమిత్యర్థః,—'శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృత' మితి వచనాత్-

తత్-గీతం గానం స్ఫురతి, ఏతన్నయనానన్దకరం, నృత్తం నాట్యం, స్ఫురతి అయం రసనేన్ద్రియస్వాదాతిశయప్రదః రసః అధరామృతం, స్ఫురతి అసౌ ఘ్రాణతర్పణః, పరిమళః పద్మినీజాతినిమిత్తగన్ధవిశేషః ఘనసారగన్ధసారాదిలేపన ప్రయుక్తామోదవిశేషోవా, స్ఫురతి, ఏవ త్వగిన్ద్రియసౌఖ్యావహాః స్తనానాం స్పర్శః, స్ఫురతి, * 'స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణే'తి వామనసూత్రే ప్రాయగ్రహణాద్బహువచనప్రయోగః, ఇత్యేవం ప్రకారేణ, హతో విన్నష్టః-పరమార్థస్తత్త్వార్థో - యేషాం తైః-విషయపరతన్త్రైరిత్యర్థః, అత ఏవ, స్వహితకరణే - ధూర్తైః కితవైః - ఆత్మహితాచరణతత్పరైరివ స్థితైరిత్యర్థః, పఞ్చభిరిన్ద్రియైః శ్రోత్రాదిభిః, భ్రామ్యమాణస్తత్తద్విషయేష్వాసజ్యమానస్సన్వఞ్చితః ప్రతారితోఽస్మి, నచైతత్కైతవం ప్రాగేవాజ్ఞాసిషమిత్యర్థః. మాలినీవృత్తమ్.

టీ. ఇహ హి = ఇచ్చటఁగదా (యువతులయందుఁగదాయనుట), మధురగీతం = తీయనిపాట, స్ఫురతి = ప్రకాశించుచున్నది; ఏతత్ = ఇదిగో, నృత్తం = నాట్యము (ప్రకాశించుచున్నది.); అయం=ఇదిగో, రసః = ఆస్వాదము (అధరమాధుర్య మనుట.) (ప్రకాశించుచున్నది); అసౌ = ఇదిగో, పరమళః = (మైపూఁత) తావి (ప్రకాశించుచున్నది.); ఏషః=ఇదిగో, స్తనానాం = చనులయొక్క, స్పర్శః=తాఁకుడు (ప్రకాశించుచున్నది.); ఇతి=ఇట్లు, హతపరమార్థైః - హత=చెఱుపఁబడిన, పరమ=శ్రేష్ఠములయిన, అర్థైః=ప్రయోజనములుగలదియు, స్వ...ధూర్తైః - స్వహిత = తమకు మేలును, కరణ= చేసికొనుటచేత, ధూర్తైః=మోసగించునవియగు, పంచభిః ఇంద్రియైః=అయిదుఇంద్రియములచేతను, భ్రామ్యమాణః = (గిరిగిర) త్రిప్పఁబడుచున్నవాఁడనై, వంచితః = మోసగింపఁబడినవాఁడను, అస్మి=అయితిని.

తా. ఈకాంతయందే యింపయినపాట లున్నవి వినవచ్చు నని నాచెవులును, దీనియందె నాట్యమున్నది చూడవచ్చు నని నాకన్నులును, దీనికెమ్మోవియందే తీపియున్నది చవిగొనవచ్చు నని నానాలుకయు, దీని నోటియందలి తావియె మూర్కొనవచ్చు నని నానాసికయు, దీనిచను మొనలరాయిడియె చాలు నని నాయొడలును తలఁచి పరతత్త్వవిచారము మాని, తనమే లొడఁగూర్చుటయందు శ్రద్ధలేకుండి యీపంచేంద్రియములు నన్ను విషయములందుఁ జొప్పించి మైమఱపు గలిగించి మోసపుచ్చినవి. ఆహా! ఇప్పుడే వీనిటక్కు దెలిసికొంటిని.

ఉ. ఈమృదుగాన మీనటన ౹ మీకుచమర్దన మీసుధారసం
బీమహనీయసౌరభము ౹ నింతులయందుఁ దనర్చునంచు న

న్నేమఱఁ జేసి యాత్మహిత మిచ్చినభంగి మెలంగి యింద్రియ
గ్రామము మోసపుచ్చె హితోకార్యవిహీనుఁడ నైతి నక్కటా!

అవ. మన్మథదూషణము చేయుచున్నాఁడు:—

శ్లో. న గమ్యో మన్త్రాణాం న చ భవతి భైషజ్యవిషయో
న చాపి ప్రధ్వంసం వ్రజతి వివిధైః శాన్తికశతైః,
భ్రమావేశాదఙ్గే కమపి విదధద్భఙ్గ మసకృత్
స్మరాపస్మారోఽయం భ్రమయతి దృశం ఘూర్ణయతి చ. 56

వ్యా.—అథాఙ్గనావ్యామోహజనకం మన్మథం దూషయతి—నేతి.—మన్త్రాణాం గమ్యో మన్త్రసాధ్యో, న భవతి, భైషజ్యవిషయః ఔషధాద్యపనేయశ్చనభవతి- భేషజమేవ భైషజ్యమితి విగ్రహః *స్వార్థేష్యఞ్ప్రత్యయః. ని 'భేషజౌషధభైషజ్యాని', త్యమరః, తథా వివిధైర్నానాప్రకారైః శాన్తికశతైరనేకశాన్తికర్మభిః, ప్రధ్వంసం వినాశం చాపి, న వ్రజతి న గచ్ఛతి-

'పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే,
తచ్ఛాన్తిరౌషధైర్దానైర్జపహోమార్చనాదిభిః' ఇతి స్మరణాత్,

ప్రసిద్ధస్తు జపాదిభిః శామ్యతి న త్వయమితి భావః, కిం తు భ్రమావేశాన్మోహోత్పాదనాత్, అఙ్గే శరీరే, కమప్యనిర్వాచ్యం, భఙ్గం జాడ్యం, యద్వా, భ్రమావేశాన్మతిభ్రంశాపాదనాత్, అఙ్గే కరచరణాద్యవయవేష్విత్యర్థః, కమపి భఙ్గం విక్షేపాదివికారం, మసకృద్బహువారం, విదధత్కుర్వన్ *దధాతేర్విపూర్వాచ్ఛతృప్రత్యయః. * నాభ్యస్తాచ్ఛతురి'తి నుమభావః, స్మరాపస్మారః స్మరప్రయుక్తాఙ్గనావ్యామోహరూపాపస్మారరోగః, దృశం మదీయదృష్టిం భ్రమయతి వ్యత్యాసయతి-అతస్మిన్ తజ్ జ్ఞానం కరోతీత్యర్థః, తథా, ఘూర్ణయతి చక్రవద్భ్రామయతి చ, కిమత్ర కరోమి కథమయం చికిత్స్య ఇతి భావః, యదాహుర్వైద్యదానికాః—

'క్రుద్ధైర్ధాతుభిరాహతే చ మనసి ప్రాణీ తమస్సంవిశన్
దన్తాన్ ఖాదతి ఫేనముద్వమతి దోఃపాదం క్షిపన్ మూఢధీః
పశ్యన్ రూపమసత్త్వితో నిపతతి ప్రాయః కరోతి క్రియాః,
బీభత్సాః స్వయమేవ శామ్యతి గతే వేగే త్వపస్మారరుక్.'

వ్యతిరేకాలంకారః. లక్షణం తూక్తమ్. శిఖరిణీవృత్తమ్,

టీ. అయం=ఈ, స్మరఅపస్మారః=మన్మథుఁడనెడి యపస్మారరోగము, మన్త్రాణాం=మంత్రములకు, న గమ్యః = విషయము (గోచరము) గాదు. (మంత్రములచేఁ గుదురదు

అనుట.) భైషజ్యవిషయః చ=మందులకు విషయమును, నభవతి=కాదు; వివిధైః=అనేకము లగు, శాంతికశతైః = శాంతికర్మలవందలచేతను, ప్రధ్వంసం = నాశమును, న వ్రజతి పొందదు; భ్రమిఆవేశాత్ = భ్రాంతిపట్టుటవలన, అంగే = దేహామునందు, అసకృత్ = మాటిమాటికి, కమపి=ఒకానొక (చెప్పనలవికాని) భంగం=విఱుపును, విదధత్ = చేయుచు, దృశం=చూపును, భ్రమయతి=తడఁబఱుచుచున్నది; ఘూర్ణయతిచ=గిరగిరత్రిప్పుచున్నది.

తా. ఈమోహా మనెడి యపస్మారరోగము మంత్రముల కుండునది కాదు. ఔషధముచేఁ గుదురునది కాదు. ఎన్ని శాంతికర్మములుచేసినను నయము కాదు. పలుమాఱు మనస్సునకు భ్రమము గలిగించి చేతులు కాళ్లు మొదలగు నంగములు వంకరపోవునట్లుచేసి కన్నులు గిరగిర ద్రిప్పి భ్రమ గప్పునట్లు చేయుచున్నది. ఈరోగమునకు నేదియుఁ జికిత్స గనుపడ లేదు. ఏమి చేయుదును?

ఉ. ఆరయ మంత్రగమ్యమును నౌషధసాధ్యముఁ గాదు శాంతికా
చారశతంబులం జెడదు చండతరభ్రమకల్పనోద్ధతిꣳ
భూరివికారమంగములఁ బూన్చుచు మన్మథజన్య మీయప
స్మారము లోచనద్వయము సారెకుఁ ద్రిప్పెడుఁ జక్రముంబలెన్.

అవ. మూఁడుశ్లోకములచే వేశ్యాదూషణము చేయుచున్నాఁడు:—

శ్లో. జాత్యన్ధాయ చ దుర్ముఖాయ చ జరాజీర్ణాఖిలాఙ్గాయ చ
గ్రామీణాయ చ దుష్కులాయ చ గళత్కుష్ఠాభిభూతాయ చ,
యచ్ఛన్తీషు మనోహరం నిజవపుర్లక్ష్మీలవశ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేత కః? 57

వ్యా.—అథ త్రిభిః పణ్యాఙ్గనాగర్హాణంకుర్వన్నిగమయతి.—జాత్యన్ధాయేతి— జాత్యన్ధాయ జన్మప్రభృత్యవసన్నదృశే పురుషాయ చ, దుష్కులాయ చ, దుర్ముఖాయ ముఖరాయ బహుగర్హ్యభాషణదూషితవదనాయేత్యర్థః-ని. 'దుర్ముఖే ముఖరాబద్ధముఖా విత్యమరః, యద్వా-దుష్టం వ్యాధ్యాదినా జుగుప్సితం-దుర్గన్ధయుక్తం వా-ముఖం యస్య తస్మై, జరయా విస్రసయా-జీర్ణాని శిథిలాని కృశాని విశ్లథసన్ధిబన్ధాని చ-అఖిలాఙ్గాని కరచ రణా ద్యశేషావయవా-యస్య తస్మైచ, గ్రామీణాయ గ్రామాన్తరాదాగతాయ-అజ్ఞాతకుల గోత్రాయ పాన్థాయ చేత్యర్థః. కిం బహునా? గళత్ స్రంసమానం - కుష్ఠం కుష్ఠజనిత

పూయరక్తావి - లేనాభిభూతాయ-గర్హితాయ చ, లక్ష్మీలవశ్రద్ధయా సంపల్లేశప్రాప్త్యాశయా. మనోహరమతిసున్దరం, నిజవపుః స్వశరీరం, 'యచ్ఛన్తీష్వర్పయన్తీషు - చుమ్బనాశ్లేషణదన్తనఖవ్రణాదిసంభోగార్థం తదధీనం కుర్వతీష్విత్యర్థః. * దదాతే 'ద్ధాఞ్ దానే' ఇత్యస్మాద్ధాతోశ్శతరి * 'ఉగితశ్చే'తి జీప్.* 'పాఘ్రాధ్మే' త్యాదినా దాణో యచ్ఛాదేశః' తథా, వివేకః కర్తవ్యాకర్తవ్యవిచారస్స ఏవ కల్పలతికా . తస్యా-శ్శస్త్రీషు ఛురికాసు - వివేకవిచ్ఛేదకరీష్విత్యర్థః. - వివేకస్యావ్యఖిలార్థసంఘటకత్వాత్కల్పలతికారూపణమవగన్తవ్యం - ని. 'స్యాచ్ఛస్త్రీ చాసిపుత్రీ చ చ్ఛురికా చాసిధేను' కేత్యమరః. * 'బహ్వాదిభ్యశ్చే'తి జీష్. పణ్యస్త్రీషు వేశ్యాఙ్గనాసు, కః పుమాన్ వివేకరహితోఽపీత్యర్థః, రజ్యేతానురక్తో భవేన్న కోఽపీత్యర్థః. ని. 'వారస్త్రీ గణికా వేశ్యా సులావణ్యాఙ్గనాఽపి' చేతి వైజయన్తీ. శార్దూలవిక్రీడితమ్.

టీ. జాతిఅంధాయ చ = పుట్టంధునకును, దుర్ముఖాయ చ = రోఁతమొగముగల వానికిని, జ...ఙ్గాయ చ-జరా=ముసలితనముచే, జీర్ణ=సడలిన, అఖిల=సమస్తములయిన, అంగాయ చ=అవయవములు (కీళ్లు)గలవానికిని, గ్రామీణాయ చ = పల్లెటూరివారికిని, దుష్కులాయ చ=చెడుకులమువానికిని, గళ...తాయచ - గళత్ =(చీము) కాఱుచుండు, కుష్ఠ = పెద్దరోగముచేత, అభిభూతాయ = తిరస్కరింపఁబడినవానికిని (కుష్ఠరోగపీడితుని కనుట), లక్ష్మీ...యా-లక్ష్మీ = సంపదయొక్క, లవ = కొంచెమునందలి, శ్రద్ధయా = మక్కువచేత, మనోహరం=అందమైన, నిజవపుః = తమదేహమును, యచ్ఛంతీషు=ఇచ్చువారును, వివేక...స్త్రీషు—వివేక = (మంచిచెడుగుల నేర్పఱుచు) తెలివియనెడు, కల్పలతికా=కల్పలతకు, శస్త్రీషు=చుఱకత్తులును, (అగు), పణ్యస్త్రీషు = బోగముపడుచులయందు, కః=ఎవఁడు, రజ్యేత=వలపునొందును.

తా. వెలయాండ్రొక్కింత డబ్బున కాసపడి పుట్టుగ్రుడ్డికేనియు, వదరుఁబోతుకేనియు, ముదిమిచే నన్నియంగములు సడలినవానికేనియు, పల్లెటూరివానికేనియు, చెడుకులంబునఁ బుట్టినవానికేనియు, కుష్ఠుచేఁ గాళ్లు చేతులు తినిపోవుచుండ నసహ్యపడఁదగినవానికేనియుఁ దమసొంపు మేనిని సంభోగమునకై యప్పగింతురు. జ్ఞానమనుకల్పలతకుఁ జుఱకత్తులయిన యిట్టివెలయాండ్రయం దేవివేకి మోహము నుంచును? ఎవఁడును వెలయాండ్ర నడతలఁ దెలిసినవాఁడు వారిం జూడఁడు.

చ. విడువక పుట్టుగ్రుడ్డనకు ♦ వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిన్
జడునకు జాతిహీనునకుఁ ♦ జారునిజాంగము లొక్కరూకకై
కడువడి నిచ్చువారి గుణ♦కల్పలతల్ విదళించుకత్తులం
బడుపుఁబడంతులం దనదు♦భావముఁ జేర్చునె యెవ్వఁడేనియున్.

శ్లో. వేశ్యాసౌ మదనజ్వాలా రూపేన్ధనసమేధితా,
కామిభిర్యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ. 58

వ్యా.—వేశ్యేతి—అసౌ వేశ్యా, రూపం సౌన్దర్యమేవేన్ధనాని - తైః సమిద్భిర్వర్ధితా-మన్మథజ్వాలా మన్మథాగ్నిజ్వాలా-ని. 'ఇన్ధనం త్వేధ ఇధ్మ మేధ స్సమిత్స్త్రియా' మిత్యమరః, యత్ర మదనజ్వాలారూపవేశ్యాయాం, కామిభిః కాముకైః, యౌవనాని నూతనవయాంసి, *యువాదిత్వాదణ్ప్రత్యయః, ధనాని చ, హూయన్తేహవ్యరూపేణ తత్సాత్క్రియన్తే-విలుప్యన్త ఇత్యర్థః, స్వర్గాదిఫలకాఙ్క్షిభిరాహవనీయాగ్నిజ్వాలాయాం హవింషీవేతి భావః.

అత్ర వేశ్యాయామారోప్యమాణస్య జ్వాలాత్వస్య, ప్రకృతహవనోపయోగిత్వాత్పరిణామాలంకారః - 'ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామ' ఇతి లక్షణాత్, స చ రూపేన్ధనేతి రూపకేణ సంకీర్యతే; రూపకత్వారోపణస్యోపరఞ్జకమాత్రమేవేతి వివేకః.

టీ. అసౌ=ఈ, వేశ్యా=బోగముది, రూపే...తా-రూపా=అందమనెడి, ఇంధన=కట్టెలచే, సమేధితా=బాగుగరగుల్పఁబడిన, మదనజ్వాలా=మన్మథుఁడనెడి యగ్నిశిఖ; యత్ర=దేనియందు, కామిభిః విటులచే, యౌవనాని=ప్రాయములు, ధనానిచ = రూకలును, హూయన్తే=వేల్వఁబడుచున్నవో.

తా. ఈవెలయాలు మదనాగ్ని జ్వాలయైనది. ఇది రూపమనెడిసమిధలచేఁ బెంపొందునది. ఈయగ్నిజ్వాలయందుఁ గాముకులో జవ్వనములు, కల్ములు ననుహవిస్సులను వ్రేల్చుదురు.

క. రూపేంధనవర్ధితవే
శ్యాపంచశరాగ్నికీల♦యం దంగజపూ
జాపరతంత్రులు వేల్తురు
దాపుగఁ దమజవ్వనములు ♦ ధనములుఁ గడఁకన్.

శ్లో. కశ్చుమ్బతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి,
చార భట చోర చేటక నట విట నిష్ఠీవనశరావమ్. 59

వ్యా.—మనోజ్ఞం సున్దరమపి, వేశ్యాయా అధరః పల్లవమివేత్యుపమితసమాసోఽన త్వధరః పల్లవమితి రూపకం-రూపకే తూత్తరపదప్రాధాన్యేన తత్ర చుమ్బనాయోగాత్, కః కులపురుషః సత్కులసంభవః పుమాన్ జాతినీతికులాచారధర్మజ్ఞ ఇత్యర్థః, చుమ్బతి న కోఽపీత్యర్థః, కుత ఏతదిత్యాశఙ్కాయామచుమ్బనహేతుభూతం విశేషణమాహ— చారా గూఢపురుషాః - భటా యోధాః - చోరాస్తస్కరాః - చేటకా స్త్రీపురుష సంధానకుశలాః దౌత్యకర్మనిరతాః - విటా జారాః-వటా భూమికాధరాస్తేషాం పురుషా పశదానాం - నిష్ఠీవనశరావముచ్ఛిష్టపాత్రం - పరమాపవిత్రమిత్యర్థః - చుమ్బనసమయే తదుచ్ఛిష్టస్య తత్ర సంక్రమణాదితి భావః, అత్ర యద్యపి 'రతికాలే ముఖం స్త్రీణాం శుద్ధ మాఖేటకే శునా' మితి స్మరణాత్సురతసమయే పవిత్ర మేవ స్త్రీముఖం తథాఽ ప్యుక్తరీత్యా కశ్మలసంపర్కాత్ హేయతయా చుమ్బనానర్హత్వాన్న చుమ్బనీయమితి తాత్పర్యమ్. ని. 'శరావోవర్ధమానక' ఇత్యమరః. అత్ర రూపకోపమానుప్రాసానాం సంసృష్టిః.

టీ. మనోజ్ఞం అపి = అందమైనదియయినను, చార...శరావం-చార = వేగుల వారు, భట=బంటులు, చోర=దొంగలు, చేటక=కుంటెనకాండ్రు, నట = నట్టువులు, విట=విటులు, (వీరికి) నిష్ఠీవనశరావం=తమ్మపడిగ (ఉమ్మివేయుముంతకుడు) యైన, వేశ్యా అధరపల్లవం=భోగముదాని మోవిచిగురును, కులపురుషః = కులీనుఁ డగు మనుష్యుఁడు, కః=ఎవఁడు, చుంబతి=ముద్దిడును?

తా. వేగులు, బంటులు దొంగలు, కుంటెనకాండ్రు, నట్టువ కాండ్రు, విటులు మొదలగు హీనకులపు మనుజులు ముద్దుపెట్టి యెంగిలి చేసిన వేశ్యల కెమ్మోవిచిగు రెంతసొంపుగా నున్నను, సత్కులమునఁ బుట్టిన యేమానవుఁడు దాని కాసపడును? వేశ్యల కెమ్మోవి యెంత సొగసుఁదనము గలదిగనున్నను హీనకులజులు ముద్దుపెట్టి యపవిత్ర పఱచినందున దానిని ముద్దిడ రా దని భావము.

క. జారభటచోరచేటక, చారనటప్రభృతినీచజననిష్ఠీవా
ధారశరావము వార, స్త్రీరమ్యాధరము సంస్పృశింతురె కులజుల్.

అవ. స్త్రీలు పైకి మంచివారుగను, లోపలఁ జెడ్డవారుగ నుందు రనుచున్నాఁడు.—

శ్లో. మధు తిష్ఠతి వాచి యోషితాం హృది హాలాహలమేవ కేవలమ్,
అత ఏవ నిపీయతేఽధరో హృదయం ముష్టిభిరేవ తాడ్యతే. 60

వ్యా.—స్త్రియః బాహ్యమధురాః అన్తర్విషా, అత ఏవ సర్వథా త్యాజ్యా ఏవ న తు గ్రాహ్యా ఇత్యభిప్రాయేణాహ—మధ్వితి.—యోషితాం స్త్రీణాం, వాచి, మధు

క్షౌద్రం, తిష్ఠతి, హృది హృదయే, కేవలం ప్రాధాన్యేన, హాలాహలమేవ, కాలకూట విషమేవ, అత ఏవ అస్మాత్కారణాదేవ, అధరః అధరోష్ఠః నిపీయతే అత్ర మధు వర్తత ఇతి మత్వైవ సర్వజనైరాదృత్య నితరాం పీయతే, హృదయం ముష్టిభిః తాడ్యతే అత్ర విషం వర్తత ఇతి మత్వైవ సర్వజనైః తాడనం క్రియతే, అతః, స్త్రియః స్వవచనేషు కేవలమధుధారాస్రావిణ్యః-హృదయే విషతుల్యాభిప్రాయవత్యశ్చ- ఇతి పూర్వార్థే ప్రదర్శితమ్, ఉత్తరార్థే తు ప్రథమపాదే మధుగ్రహణం చ ద్వితీయ పాదే హాలాహలస్థాన హృదయతాడనం చేతి ప్రదర్శిత మిత్యభిప్రాయః.

అత్ర ఉత్ప్రేక్షాతిశయోక్తికావ్యలిఙ్గధ్వనిభేదానాం సంసృష్టిః.

టీ. యోషితాం=ఆఁడువాండ్రకు, వాచి=నోట, మధు=తేనె, తిష్ఠతి=ఉండును; హృది=మనస్సులో, కేవలం = ముఖ్యముగా, హాలాహాలం ఏవం = హాలహాలమనువిషమే (ఉండును); అతఏవ=కాఁబట్టియే, అధరః=పెదవి,నిపీయతే=అనఁబడుచున్నవి;హృదయం= ఱొమ్ము, ముష్టిభిః ఏవ=పిడికిళ్లతో, తాడ్యతే = గ్రుద్దఁబడుచున్నది.

తా. మగువలకు వాక్కునందుఁ దేనెయు, హృదయమున హాలాహాల మనువిష మైయున్నది. కావుననే పురుషులు వారిమోవిఁ బీల్తురు. ఱొమ్మును బిడికిళ్లతో గ్రుద్దుదురు. (అధరచుంబన స్తనమర్దనములు స్వాభావికము లయిన వని యిట్లు వర్ణింపఁబడినవి.)

చ. కలదు కదా సుధారసము ? కంజదళాక్షులకు న్దుపల్కులన్
వెలయుఁ గదా హాలాహాలము ? వీరలచిత్తమునందుఁ గావునన్
బలుమఱుఁ బల్లవాధరముఁ ? బాన మొనర్తురు నిండువేడుకన్
బలితపుఱొమ్ము ముష్టితలపాతములం బ్రహరింతు రెంతయున్.

ఇది భర్తృహరిసుభాషితశృంగారశతకమున కామినీగర్హణ మను మూఁడవ వింశతి.

---

## సు వి ర క్త ప ద్ధ తి

అవ. స్త్రీలను జూచి మనోవికారము నొందనివారు ధన్యు లని చెప్పుచున్నాఁడు.—

శ్లో. ధన్యాస్త ఏవ ధవళాయతలోచనానాం
తారుణ్యదర్పఘనపీనపయోధరాణామ్,
క్షామోదరోపరి లసత్త్రివళీలతానాం
దృష్ట్వాఽఽకృతిం వికృతిమేతి మనో న యేషామ్. 61

వ్యా.—ఏవం తావత్కామినీగర్హణం కృతం-కిం విరక్తాస్సన్తి వా న వేత్యాశఙ్కాయాం సన్త్యేవేతి మనసి నిధాయ తత్రాపి సువిరక్తదుర్విరక్తభేదేన ద్వైవిధ్యం ప్రతి పాదయిష్యన్నాదౌ సువిరక్తపద్ధతిం వర్ణయితుముపక్రమతే. 'ధన్యా' ఇత్యాదిభిర్నవభిః—ధన్యా ఇతి.—త ఏవ పురుషా, ధన్యాః సుకృతశాలినః-సువిరక్తా ఇతి యావత్-ని. 'సుకృతిః పుణ్యవాన్ ధన్య' ఇత్యమరః, తే క ఇత్యాకాఙ్క్షాయామాహ-ధవళే పుణ్డరీకదళసదృశే ఆయతే కర్ణాన్తవిశ్రాన్తే చ - లోచనే - యాసాం తాసాం, తారుణ్యదర్పేణ యౌవనమదోద్రేకేణ-ఘనా నిబిడా-పీనా పీవరా-పయోధరా స్తనా-యాసాం తాసాం, క్షామోదరస్యాతికృశమధ్యస్యోపర్యుపరిష్టా-ల్లసన్త్యః ప్రకాశమానాః - యాస్త్రివళ్యః - తిస్రశ్చ తా వళ్యశ్చ-త్రివళ్యః*'దిక్సంఖ్యే సంజ్ఞాయామితి సమాసః * సంఖ్యాపూర్వత్వేఽపి సప్తర్షయః ఇత్యాదివత్ జ్ఞేయమిత్యుక్తం ప్రాక్ - తా లతా ఇవ-యాసాం తాసాం - తేషాం తాసాం పద్మినీత్వం సూచ్యతే. తదుక్తం రతిరహస్యే—'త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషే'తి. క్షామేత్యత్ర * 'క్షాయో మః' ఇతి మత్వం - తథా చేత్థంభూతరూపసంపన్నానాం కామినీనామాకృతిమాకారవిశేషం-దృష్ట్వా* ఇఙ్గితం హృద్గతో భావో బహిరాకార ఆకృతి' రితి సజ్జనః. యేషాం పురుషాణాం మనో, వికృతిం వికారం, తత్పరతన్త్రత్వమితి యావత్, నైతి న ప్రాప్నోతి, అత ఏవ ధన్యాఇతి సంబన్ధః, ఏవం నిర్వికారచిత్తత్వం శమసంపన్నానామేవ న త్వన్యేషామితి భావః. తదుక్తం—'శమో వైరాగ్యేన నిర్వికారచిత్తత్వ' మితి వసన్తతిలకావృత్తమ్.

టీ. ధవళా...నానాం-ధవళ=(తెల్లదామరలవలె) తెల్లనయినవియు, ఆయత = విశాలములయిన, లోచనానాం=కన్నులుగలవారును, తారుణ్య...ధరాణాం-తారుణ్య = జవ్వనముయొక్క, మద = మదముచేత, ఘన=క్రిక్కిఱిసినవియు, పీన=బలిసినవియు, (అగు) పయోధరాణాం=చన్నులుగలవారును, క్షామ...తానాం-క్షామ=సన్నని; ఉదర= కడుపుయొక్క, ఉపరి=పైన, లసత్ = ప్రకాశించుచున్న, త్రివళీలతానాం=తీగలవంటి మూఁడుముడుతలుగలవారును (అగుసుందరులయొక్క) ఆకృతి=అందమును, దృష్ట్వా= చూచి, యేషాం=ఎవరియొక్క, మనః=చిత్తము, వికృతిం=వికారమును, న ఏతి = పొందదో, తే ఏవ=వారే, ధన్యాః=పుణ్యవంతులు.

తా. కదలుచుండు నిడివికన్నులు గలవారును, యౌవనగర్వము గలిగి, దట్టములై యుబ్బిన స్తనంబులు గలవారును, సన్నని నడుముపై వెలయుచుండు ముడుతలు గలవారు నైన చెలువల యాకారముఁ జూచి

నను, ఏపురుషులమనసు వికారమునొందదో, వారే పుణ్యాత్ములు (స్త్రీలు తమచూడ్కులచేతనే పురుషుల వశపఱచుకొందు రని భావము.)

చ. కలికిమెఱుంగువాలుఁదెలిగన్నులు సన్నపుఁగౌనుదీఁగెపై
నలరెడుసద్విలీలతలు కి నంచితయౌవనదర్పలక్ష్మిచేఁ
గులికెడుసిబ్బెపుగన్బులుఁదగుబ్బలునుం గలమించుఁబోండ్ల రూ
పులఁ గని నిర్వికారు లగుపూరుషులే కృతకృత్యు లిద్ధరన్.

అవ. ఒక సింగారి విరక్తుఁడై తనయనుభవముఁ దెల్పుచున్నాఁడు.—

శ్లో. బాలే ! లీలాముకుళితమమీ మన్థరా దృష్టిపాతాః
కిం క్షిప్యన్తే విరమ విరమ వ్యర్థ ఏష శ్రమస్తే,
సమ్ప్రత్యన్యే వయ ముపరతం బాల్యమాస్థా వనాన్తే
క్షీణో మోహ స్తృణమివ జగజ్జాల మాలోకయామః. 62

వ్యా.—అథ పూర్వోపభుక్తకామినీసంబోధనవ్యాజేన సువిరక్తతాం ప్రకటయతి—బాలే లీలాముకుళితమితి.—హే బాలే ముగ్ధే, లీలయా విలాసవైచిత్ర్యా - ముకుళితాన్యర్ధనిమీలనాని - యస్మిన్ కర్మణి తద్యథా తథా, మన్థరా అలసప్రాయాః, అమీ, దృష్టిపాతా విలోకనప్రసారాః, కిం కిమర్థం, క్షిప్యన్తే వికీర్యన్తే - న విక్షేప్యా ఇత్యర్థః, కింతు, విరమ విరమ అభీక్ష్ణం విరమ - దృష్టివిక్షేపాదితి శేషః. * ఆభీక్ష్ణ్యే ద్విర్భావః * 'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదం, కుతః - ఏషోఽయం తే, శ్రమః కటాక్షవిక్షేపజనితాయాసో, వ్యర్థో నిరర్థకః. అభిమతఫలానిష్పత్తేరితి భావః; నన్వేతావత్పర్యన్తం మదాయత్తచిత్తేషు యుష్మాసు కథం ఫలాసిద్ధిరిత్యత ఆహుః—సంప్రతీదానీం వయమన్యే పరే-త్వద్విలాసలాలసత్వేన సంమోహితా స్తదానీంతనా ఇదానీం న భవామ ఇత్యర్థః. కుతః-బాల్య-ముపరతం నష్టం-బాల్యశబ్దేన యౌవనం లక్ష్యతే-త్వత్పారతన్త్ర్యకారి యౌవనముపరతమిత్యర్థః, యద్వా-బాల్యమవివేకిత్వముపరతం, కిం త్వాస్థా పరిశీలనాదరః, వనాన్తే అరణ్యమధ్యే - వర్తత ఇతి శేషః-కిం తు త్వయి రాగం పరిత్యజ్య వైరాగ్యేణ వనవాసమపేక్షామహ ఇత్యర్థః,సత్కృతః- మోహః అజ్ఞానం, క్షీణో ధ్వస్తః-త్వదాసఙ్గజననహేతుర్నిర్మూలోఽభూదిత్యర్థః, అతో జగజ్జాలమశేషప్రపఞ్చం, తృణమివ నిస్సారమాలోకయామః - 'నిస్పృహస్య తృణం జగ'దితి లక్షణాత్తథా పశ్యామః, ఇదానీం జ్ఞానోదయవశాచ్చ మనస్సుఖాతిరిక్తం సర్వం తుచ్ఛమనుసందధ్మ ఇత్యర్థః. అతస్త్వయా న ప్రేక్షణీయమితి భావః.

మన్దాక్రాన్తావృత్తమ్ - లక్షణముక్తం - 'మన్దాక్రాన్తా జలధిషడగైర్మ్భౌ నతౌ తా గురూ చేత్.'

టీ. హే బాలే = ఓపిల్లా!, లీలాముకుళితం (యథాతథా) = విలాసముచే మూఁత పడునట్లుగా, మంథరాః = మెల్లని, అమీ=ఈ, దృష్టిపాతాః = చూపుపాటులు, కిం = ఏల, క్షిప్యంతే=నిగిడింపఁబడుచున్నవి? విరమ విరమ=మానుము మానుము. తే=నీయొక్క, ఏష = ఈ, శ్రమః=పాటు, వ్యర్థః = ప్రయోజనములేనిది; సంప్రతి=ఇప్పుడు, వయం= మేము, అన్యే = ఇతరులము (అనఁగా: మాఱిపోయితి మనుట); బాల్యం = కుఱ్ఱతనము, ఉపరతం = ఉడిగినది; వనాన్తే = అడవిలోపల, ఆస్థా = ఆసక్తి, (కలిగినది.) మోహః= అజ్ఞానము, క్షీణః = నశించినది; జగత్ జాలం = లోకములసమూహమును, తృణంఇవ = గడ్డిపోఁచవలె, ఆలోకయామః = చూచుచున్నాము.

తా. ఓసీ ముద్దరాలా! నీయొయ్యారముచే నరమోడ్చిన కన్నుదోయినుండి వెడలు నీతిన్ననిచూపుల్కలను నాపైఁ జిమ్మకుము. ఇఁకఁ జాలింపు చాలింపుము. ఏల యనఁగా, ఈ నీశ్రమంబు వ్యర్థమగును. మేము మునుపటివారముగాము. మే మితరుల మైతిమి. యౌవన ముడిగినది. వనవాసమునం దాసగలిగినది. నీమీఁదివలపు నశించినది. కావుననే మే మీప్రపంచమెల్ల గడ్డిపోఁచతో సమముగా నెంచుచున్నారము. కాఁబట్టి నీచేష్ట లిక్కడఁ బనికిరావు పొమ్ము. అని యొక విరక్తుఁడొక కామినితోఁ జెప్పెను.

ఉ. మానిని! యేల చిమ్మెదవు కె మాపయి మంథరదృష్టిపాతము
ల్మానుము నీశ్రమంబు విఫలం బిది వింతల మైతి మిత్తఱిన్
మానుగ జవ్వనం బడఁగె కె మానసవృత్తి వనంబుఁ గోరె న
జ్ఞానము నష్టమయ్యె యవహేళనంబుగఁ జూచెద మెల్లలోకముల్.

అవ. మఱి యుక్తమునే ప్రకారాంతమునఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. ఇయం బాలా మాం ప్రత్యనవరతమిన్దీవరదళ
ప్రభాచోరం చక్షుః క్షిపతి కిమభిప్రేతమనయా,
గతో మోహోఽస్మాకంస్మరకుసుమబాణవ్యతికర
జ్వరజ్వాలా శాన్తా తదపి న వరాకీ విరమతి. 63

వ్యా.—ఉక్తమేవార్థం భఙ్గ్యన్తరేణాహ-ఇయమితి.—ఇయమేషాబాలా-ముగ్ధా, మాం ప్రతి మాముద్దిశ్యానవరతమవిచ్ఛిన్నం యథా తథా, ఇన్దీవరదళప్రభాచోరమిన్దీవర

పత్త్రకాన్తిమోషకం - తత్కల్పమిత్యర్థః. చక్షుః, క్షిపతి ప్రసారయతి, అనయా బాలయా, కిమభిప్రేతమపేక్షితం - తన్న జానామిత్యర్థః. నను తయా త్వత్స్వజ్ఞ ఏవాపేక్షిత స్తత్ కుతో న జానాసీత్యాశఙ్కాయామాహ—అస్మాకం మోహో, గతః ఉపరతః ఇదానీమితి శేషః, నను పూర్వం మామిత్యేకవచనం ప్రయుజ్యాస్మాకమితీదానీం బహువచనప్రయోగాత్కథం సామానాధికరణ్యముపపద్యత ఇతి చేత్తథాఽపి నివృత్తిమార్గోత్సుకిత్వప్రయుక్తాత్మసంభావనయా బహూకరణం న దోషాయేతి సమాధేయం। యద్వాఽస్మానితి సముదాయనిర్దేశేన వా న దోషః, తథా స్మర ఏవ-శబరః కిరాతస్తస్య - బాణవ్యతికరేణ శరసంపర్కేణ-యో-జ్వరస్సంతాప-స్తస్య జ్వాలా, శాన్తా విరతేత్యర్థః, తదపి తథాఽపి, వరాకీ, న విరమతి విరతిం న ప్రాప్నోతి, పూర్వం ప్రాణప్రియతమా గరీయస్యాం బాలాయాం వరాకీశబ్దప్రయోగేణాస్యాత్యన్తవైరాగ్యం సూచ్యతే * 'జల్పభిక్షుకుట్టలుణ్టే' త్యాదినా, పాకన్ప్రిత్యయే షిత్వా స్త్రీప్ప్రిత్యయే చ వరాకీతి సిద్ధమ్.

శిఖరిణీవృత్తమ్.

టీ. ఇయంబాలా=ఈపిల్ల, మాంప్రతి = నన్నుఁగూర్చి, అనవరతం = ఎడతెగక, ఇందీ...చోరం - ఇందీవరదళ = నల్లగలువఱేకులయొక్క, ప్రభా = కాంతిని, చోరం= దొంగిలించునట్టి, చక్షుః=కంటిని, క్షిపతి = నిగుడ్చుచున్నది; అనయా = ఈపిల్లచేత. కిం అభిప్రేతం=ఏమి కోరఁబడినది; అస్మాకం=మాకు, మోహః=అజ్ఞానము, గతః = పోయినది; స్మర...జ్వాలా-స్మర = మన్మథునియొక్క, కుసుమబాణ = పూములుకులయొక్క, (స్మర శబరబాణ అనుపాఠమున... మరుఁ డను బోయవానిబాణములయొక్క) వ్యతికర = తాఁకుడుచేత (కలిగిన), జ్వర=సంతాపముయొక్క, జ్వాలా=మంట, శాంతా-చల్లారినది; తదపి=అయినను, వరాకీ=ఈదీనురాలు, న విరమతి=మానకున్నది.

తా. ఓచెలికాఁడా ! యీ ముద్దియ యెల్లప్పుడు కలువలచాయఁ జూఱగొను తనకంటిచూపు నాపై నిగిడించుచున్నది. ఇట్లు చేయుట యం దీమచ్చెకంటి యభిప్రాయ మేమో తెలియరాదు. మే మిపుడు దీని చూపులకు బేలుపోము. మాకు మోహము దొలఁగిపోయినది. మరుఁడేయు పూవుటమ్ముల తాఁకుళ్లచేఁ గలిగిన వేఁడిమిమంట చల్లారినది. మే మట్లు విరక్తుల మైయున్నను, ఈదీనురాలు మాత్రము మమ్ము విడువక చూచుచునే యున్నది.

ఉ. నీలసరోజపత్త్రకమనీయవిభాహరణప్రవీణదృ
గ్జాలము లీలతాంగి వెదచల్లెడు నాపయి నేమి గోరెనో
తూలె సమస్తమోహవికృతుల్ రతివల్లభభిల్లభల్లభూ
జ్వాల లడంగె మాకుఁ దనవైఖరి మానదు జోటి నేఁటికిన్.

అవ. ఒకవిరాగి మదనాదులను నిందించుచున్నాఁడు.—

శ్లో. రే కన్దర్ప కరం కదర్థయసి కిం కోదణ్డటఙ్కారితైః
రేరే కోకిల కోమలైః కలరవైః కిం వా వృథా జల్పసి,
ముగ్ధే స్నిగ్ధవిదగ్ధముగ్ధమధురైర్లోలైః కటాక్షైరలం
చేతశ్చుమ్బితచన్ద్రచూడచరణధ్యానామృతం వర్తతే. 64

వ్యా.—సంప్రతి సాటోపపరివారకందర్పనిరాకరణవచనమాహ— కిమితి.—రే కందర్ప హేమదన-రే ఇతి నీచసంబోధనే - ని. 'నీచసంబోధనే తు రే' ఇత్యమరః. ఏవ ము'త్తరత్రాపి, కోదణ్డటంకారితం కోదణ్డటంకారవత్కృతం - ధనుర్గుణటంకారపూర్వక మిత్యర్థః. * తత్కరోతీతి ణిచి ణా విష్ఠవద్భావే 'విన్మతోర్లుక్', శరం త్వదీయబాణం, కిం కిమర్థం, కుత్సితోఽర్థః కదర్థః *'కోః కత్తత్పురుషేఽచీ'తి కుశబ్దస్య కదాదేశః - కదర్థం కరోషి కదర్థయసి - వ్యర్థయసీత్యర్థః. * ధాత్వర్థే ణిచి సిప్, తథా, రేరే కోకిల హే కలకణ్ఠ, అత్ర * 'అసూయా సమ్మతి కోప కుత్సన భర్త్సనే ష్వి'త్యసూయార్థే కోపాద్యర్థే ద్విరుక్తిః - 'స్వరితమామ్రేడిత' ఇత్యాదినా ప్రాప్తస్య ప్లుతస్య * 'సాహస మనిచ్ఛతా విభాషా వక్తవ్య' ఇతి పాక్షికః ప్రతిషేధః - 'శాస్త్రత్యాగస్సాహస' మితి హరదత్తః, కోమలం రుచిరం, కలరవం మధురస్వరం - ని. 'కాకలీ తు కలే సూక్ష్మే ధ్వనౌ తు మధురాస్ఫుటే, కల' ఇత్యమరః. కిం కిమర్థం వా, వృథా వ్యర్థం, జల్పసి కూజసి వ్యాహరసీతి యావత్ - న వ్యాహర్తవ్యమిత్యర్థః - ప్రయోజనాభావాదితి భావః, తథా ముగ్ధే హే సున్దరి. స్నిగ్ధాస్సాన్ద్రాః - ని. 'స్నిగ్ధం తు మసృణే సాన్ద్రే' ఇత్యమరః. విదగ్ధాః వివిధవిలాసవిశేషవివరణనిపుణాః - చారవః ఇన్దీవరారవిన్దాదివత్స్వభావరమణీయాః-మధురాస్సుధాధారావ న్మనోహరాశ్చ - విశేషణానామపి మిథోవిశేషణవిశేష్య భావవివక్షాయాం * 'విశేషణం విశేష్యేణ బహుళమి'తి సమాసః. తై, స్తథా, లోలైర్నిసర్గచఞ్చలైః కటాక్షైరపాఙ్గావలోకనై, రలం - యద్వా స్నిగ్ధైః-

విస్రమ్భే పరమాం కాష్ఠామారూఢే దర్శనాదిభిః,
యేనాన్తరఙ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే.'

ఇత్యుక్తలక్షణస్నేహపరిష్కృతైః- తథా - విదగ్ధైః విరక్తస్యాపి మన్మథవికారోద్దీపన చతురైరిత్యర్థః-'యద్దర్శనే విరక్తోఽపి క్షుభ్యతే తత్సమన్మథ'మితి లక్షణా- త్తథా-చారుభిః విషయమాత్రవిశ్రాన్తివిరహేణ విశృఙ్ఖలవృత్తిత్వమదమన్థరత్వాది గుణశీలత్వస్య వివక్షితత్వాత్ స్మితాకారైరిత్యర్థః. తదుక్తం భావప్రకాశే—

'అపరిచ్ఛిన్నవిషయం మదమన్థరమీలితమ్,

స్ఫురదర్ధ్రాపక్షతాయుక్తం తత్ స్మేరమితి కథ్యతే.' ఇతి.

తథా - మధురైస్సంతాపహారైః - 'శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృత' మితి లక్షణాత్. తథా, లోలైస్సతృష్ణ-సంభోగౌత్సుక్యభావనాతత్పరైరిత్యర్థః. తదుక్తం—'కటాక్షైర్హాసగర్భైస్తు సంభోగౌత్సుక్యభావనే'తి, కటాక్షైః-

'యద్గతాగతవిశ్రాన్తివైచిత్ర్యేణ ప్రవర్తనమ్,

తారకాయాః కలాభిజ్ఞాస్తం కటాక్షం ప్రచక్షతే.'

ఇత్యుక్తలక్షణైరలం ఇత్థంభూతకటాక్షా న ప్రవర్తనీయా ఇత్యర్థః. * అత్ర వారణార్థ యోగాత్ పక్షే తృతీయా, నను కుత ఏవం నిరాక్రియత ఇతి చేత్తత్రాహ—చేతో మదీయచిత్తం కర్తృ, చుమ్బితమాస్వాద్యమానం-చన్ద్రచూడస్య చన్ద్రశేఖరస్య - చరణ ధ్యానమేవామృతం - యేన తత్తథోక్తం సత్, వర్తతే తిష్ఠతి - స్మరహరచరణధ్యానావధానసత్వరసంజాతపరమవైరాగ్యోల్లసితచిత్తం మామే తే క్షుద్రాః కిం కరిష్యన్తీత్యేకో భావః - అమృతపానపరితృప్తస్య కిమారనాళేనేత్యపరో భావః-బ్రహ్మానన్దభరితస్య కిం వైషయికక్షుద్రానన్దేనేత్యపరతరో భావః - నాహమిదానీం పూర్వవద్యుష్మత్కింకరః కిం తు శంకరకింకరః - అతోఽసాధ్యస్సాధయిషతాం యుష్మాకం కోఽయమపస్మార ఇత్యపరతమో భావః-సర్వథా నాస్మాకం కామిన్యపేక్షాఽస్తీతి పరమో భావః. శార్దూల విక్రీడితమ్.

టీ. రేకందర్ప=ఓరిమన్మథా! కోదండటంకారితైః = ధనుష్టంకారములచేత, కరం=చేతిని, కింకదర్థయసి=ఏలచెఱుచుకొనెదవు? రేరేకోకిల=ఓరోరికోయిలా! కోమలైః= మృదువులైన, కలరవైః=అవ్యక్తమధురధ్వనులచే, వృథా=వ్యర్థముగా, కింవాజల్పసి= ఏల ప్రేలెదవు? ముగ్ధే=ఓబాలా! స్నిగ్ధ...మధురైః-స్నిగ్ధ=ప్రేమగలవియు, విదగ్ధ=నేర్పు గలవియు, ముగ్ధ=చక్కనివియు, మధురైః = మనోహరములును, లోలైః=చంచలములును (అగు), కటాక్షైః=వాలికచూపులు, అలం=చాలును; (ఏల యన) చేతః=(నా) మనస్సు, చుంబిత...మృతం-చుంబిత=పానముచేయఁబడిన, చంద్రచూడ=(చంద్రుఁడు సిగయందుఁగల) శివునియొక్క,చరణ=అడుగులయొక్క, ధ్యాన=ధ్యానమనెడి, అమృతం=

అమృతముగలదిగా (అనఁగా: శివపాదధ్యానామృతమును పానముసేయుచు), వర్తతే= ఉన్నది.

తా. ఓరిమన్మథుఁడా! వింటినారిని మీటిమీటి యేల వ్రేళ్లు నొప్పియెత్తునట్లు చేసికొనెదవు? ఓకోకిలా! యింపగు తిన్ననికూఁతల నూరక యేల వదరెదవు? ఓముగుదరాలా! జాణతనంబున మెఱయఁ బ్రేమ వెల్లివిరియ నింపుమీఱ సొంపుగల్గియున్న చంచలము లగుకడ గంటిచూపుల నిఁకఁ జాలింపుము. మా మన సిప్పుడు చంద్రమౌళీశ్వరుని పాదకమలధ్యాన మనెడి యమృతమును గ్రోలియున్నది. (మా మనస్సు భగవంతుఁడగు పరమేశ్వరుని పదాంబుజధ్యానంబున లీనమై యున్నది.) ఇప్పుడు మా మానసము విలాసంబులఁ దగులదు. మన్మథా! నీవు సపరివారుఁడవై పొమ్మని యొక్కవిరాగి చెప్పెను.

ఉ. ఓరి మనోజ నూనశర ♦ యూరక చిమ్మకు మిన్నకే కుహూం
కారము లేల చేసెదు పికద్విజ యోమృగశాబకాక్షీ నీ
చారువిలోకనంబు లిఁకఁ ♦ జాలును నాహృదయంబు శంకరో
దారపదాబ్జచింతనసుధారసతత్పర మయ్యె నియ్యెడన్.

అవ. సంయోగవియోగములకు మనసే గారణ మనుట.—

శ్లో. విరహేఽపి సఙ్గమః ఖలు పరస్పరం సఙ్గతం మనో యేషామ్,
హృదయమపి విఘటితం చేత్ సఙ్గో విరహం విశేషయతి. 65

వ్యా.—అథ పఞ్చవిషయవిరక్తిప్రకారమాహ—విరహ ఇతి.—యేషాం స్త్రీపురుషాణాం, మనః, పరస్పరమన్యోన్యం, సంగతం అన్యోన్యానురాగబద్ధమిత్యర్థః, తేషాం విరహేఽపి వియోగావస్థాయామపి, సంగమః ఖలు సమాగమ ఏవ ఖలు 'హృదయసంగమ ఏవ సుసంగమో న తనుసంగమ ఆర్య సుసంగమ' ఇతి వచనాత్-అన్తరఙ్గబలీయస్త్వన్యాయా చేతి భావః-మనోనియమనే తు సఙ్గః విరహహేతుక ఏవ భవతీత్యాహ-హృదయమపి మనోఽపి, ‡ విఘట్టితం సమ్యక్ క్షతం-వైరాగ్యప్రవణీకృతం చేత్యర్థః, సఙ్గస్సమాగమోఽపి విరహం వియోగమేవ, విశేషయతి విశిష్టంకరోతి-తమేవాపేక్షావిషయం కరోతీత్యర్థః - తదానీం తస్యైవాక్షతత్వాదితి భావః - అతః సర్వథా మనోనియమనమావశ్యకం-తేన చేన్ద్రియప్రవృత్త్యుపరమే విషయాణామేకాన్తతః పరాహతిరితి కృత్వా పఞ్చవిషయవిరక్తిర్నామేయమేవేతి నిగూఢాభిసంధిః పరస్పరేత్యత్ర * 'కర్మవ్యవహారే సర్వనామ్నో ద్వే భవత' ఇతి వక్తవ్యాత్పరశబ్దస్య ద్విర్భావః *'సమాసవచ్చ బహుళం'-

యథా న సమాసవత్ప్రత్యేకమైకవచనం తథా పూర్వపదస్యేతి వక్తవ్యం - ద్వితీయాద్యేక వచనాన్తత్వమపరపదస్యేతి. ఆర్యాభేదః.

టీ. యేషాం=ఎవరికి, మనః = మనస్సు, పరస్పరం = అన్యోన్యముగా, సంగతం = కలిసినదో; (తేషాం=వారికి) విరహేఽపి=ఎడఁబాటునందును, సంగమః ఖలు = కూడికయే కదా! హృదయం = మనస్సు, విఘటితంచేత్ = వేఱుసేయఁబడినదేని, సఙ్గః అపి = కూడి కయు, విరహం = ఎడఁబాటును, విశేషయతి = ఎచ్చించును.

తా. ఏస్త్రీపురుషులకు పరస్పరము మనస్సు గలసియుండునో, వా రెడఁబాసియున్నప్పుడును మనస్సు గలిసియుండుటచే నొండొరులు గలిసి యున్నవారే యగుదురు. స్త్రీపురుషులకు మనసు విఱిగెనేని, వారు గలిసియుండినను విరహము గలవారే యగుదురు.

క. విరహమునందైనఁ బర
స్పర మనురాగులకుఁ బొందు ♦ భాసిలు మన సె
వ్వరి కెనయదు వారలకును
విరహము నెచ్చుగ నొనర్చు ♦ వెస సంగతియున్.

అవ. ఒకబాటసారి తనవిరక్తినిఁ దెల్పుచున్నాఁడు.

శ్లో. కిం గతేన యది సా న జీవతి ప్రాణితి ప్రియతమా తథాఽపి కిమ్,
ఇత్యుదీక్ష్య నవమేఘమాలికాం న ప్రయాతి పథికః స్వమన్దిరమ్. 66

వ్యా.—అథ కస్యచిత్ప్రవాసినో విరక్తస్య విచారరూపేణ వైరాగ్యం ప్రకట యన్నాహ—కిమితి.—సా మదీయా ప్రియతమా ప్రేయసీ, న జీవతి విరహవేదనయా ప్రాణాన్న ధారయతి యది, తదా, గతేన గమనేన * భావే క్తః కిం న కించిదపీత్యర్థః, యద్వా గతేన గృహముపగతేన మయేతి శేషః. కిమథ ప్రాణితి కేనచిద్వినోదోపాయేన జీవతి యది, తథాఽపి, ప్రాణనేఽపి, గతేన కిమ్ ఉభయథాఽపి గమనం వ్యర్థమే వేత్యర్థః, ఇతి విచార్యేతి శేషః, ఇహైవ గమ్యమానార్థత్వాదప్రయోగః - ప్రయోగే వా పౌన రుక్త్యమిత్యాలంకారికాః, పన్థానం గచ్ఛతీతి పథికః - కల్పితాప్లన్థః - 'పథ మృక్' ఇతి మృక్ప్రత్యయః, నవమేఘమాలికాం నవీనకాదమ్బినీం - విరహినివహసంహారకారిణీమితి భావః, ఉదీక్ష్య, స్వమన్దిరం నిజగృహం న ప్రయాతివైరాగ్యనిశ్చలచిత్తత్వాదితి భావః. తదుక్తం.—

'యద్భావి తద్భవత్యేవ యదభావి న తద్భవేత్'
ఇతి నిశ్చితబుద్ధీనాం న చిన్తా బాధతే క్వచిత్.' ఇతి.

రథోద్ధతావృత్తమ్.

టీ. సా ప్రియతమా=ఆప్రియురాలు, నజీవతి యతి=బ్రుకదేని (విరహవేదనచే ననుట), గతేన = (నేను) పోవుటచే, కిం=ఏమిప్రయోజనము? ప్రాణితి (యది)=బ్రదుకు నేని, తథాపి = అట్లైనను, కిం = (నేను పోవుటచే) ఏమి? ఇతి = ఇట్లు (ఆలోచించి), పథికః = బాటసారి, నవ...మాలికాం-నవ = క్రొత్తయైన, మేఘమాలికాం= మేఘముల బారును, ఉదీక్ష్య=పైనచూచి, స్వమందిరం ప్రతి=తనయింటిని గూర్చి, న ప్రయాతి = వెళ్లఁడు.

తా. ఆ నాప్రాణసఖి ప్రాణములతోనున్న నేమి యెక్కువ? బ్రతికి యుండకున్న నేమి తక్కువ? నేను విరక్తుండ నైతిని. నే నింట నున్న నొక్కటే ఇక్కడ నున్న నొక్కటే యని యొకబాటసారి నవమేఘంబు లుదయించుటఁ జూచి యిట్లు నుడివి తనయింటికిఁ బోక యుండెను.

క. చన నేటికిఁ బ్రేయసి జీ
వనవతి యగునేని ప్రాణవతి గానితఱిం
బని యేమని యొకతెరువరి
చనఁ డింటికి నవ్యజలదసమయమునందున్.

అవ. వైరాగ్యోపదేశముఁ జేయుచున్నాఁడు.—

శ్లో. విరమత బుధా యోషిత్సఙ్గాత్సుఖాత్క్షణభఙ్గురాత్
కురుత కరుణామైత్రీ ప్రజ్ఞావధూజనసఙ్గమమ్,
న ఖలు నరకే హారాక్రాన్తం ఘన స్తనమణ్డలం
శరణమథవా శ్రోణిబిమ్బం రణన్మణిమేఖలమ్. 67

వ్యా—అథ బుధానాం తత్ర వైరాగ్యముపదిశతి—విరమతేతి.—హేబుధాః విద్వాంసః. యోషిత్సఙ్గాద్యువతిసమాగమాద్యత్సుఖం తస్మాత్, కీదృగ్విధాత్ - క్షణ భఙ్గురాత్ క్షణికాత్ క్షణికసుఖప్రదయోషిత్సఙ్గాదిత్యర్థః. * 'భఞ్జో భాస మిదో ఘురచ్' ఇతి ఘురచ్ప్రత్యయః*'జుగుప్సా విరామే' త్యాదినా పఞ్చమీ, విరమత ఉప రతా భవత-తుచ్ఛసుఖదం యోషిత్సమాగమం త్యజతేత్యర్థః. * 'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదం, కిం తు కరుణా దుఃఖిష్వనుకమ్పా మైత్రీ పుణ్యకృత్సు మిత్రతా - ప్రజ్ఞా బుద్ధివిశేషః సుఖిష్వనుమోదితేతి యావత్ - ఏతేన పాపిషూపేక్షా చ

లక్ష్యతే - ఏతా ఏవా_న్తఃకరణమలశోధకత్వాచ్చి_త్తపరికర్మాణీతి వద_న్తి సాంఖ్యాః - తా ఏవ వధూజన_స్తస్య - సంగమం పరిశీలనతాత్పర్యమితి యావత్, కురుత, ఏ తేనాత్యూర్జిత సుఖం సంభవతి - కిం క్షణికసుఖావలమ్బ నే నేతి భావః. విపక్షే బాధకమాహ—నరకే నిరయే, హారాక్రా_న్తం ముక్తాహారోపశోభితం, ఘన_స్తనమణ్డలం పటుతరకుచకలశభారో- వా, అథేతి వాక్యారమ్భే రణతీ - మణిమేఖలా మణిఖచితరశనా-యస్య త_త్తథో_క్తం- కాఞ్చీకలాపరమణీయమిత్యర్థః. శ్రోణీబిమ్బం నితమ్బమణ్డలం వా, శరణం రక్షకం, న ఖలు-న భవతి హి, కరుణాదిసమాగమస్తు నైవం భవత్యతస్స ఏవావశ్యం స్వీక_ర్తవ్య ఇతి భావః. హరిణీవృ_త్తమ్ - లక్షణం తూ_క్తమ్.

టీ. బుధాః = చదువరులారా, క్షణభంగురాత్ = క్షణములో నశించునట్టి, యోషిత్ సంగాత్ = స్త్రీలతోడిచేరికయనెడి, సుఖాత్ = సుఖమునుండి, విరమత = మానుకొనుఁడు; కరుణా...సంగమం-కరుణా = దయ; మైత్రి = చెలిమి, ప్రజ్ఞా=తెలివి యనెడి, వధూ=స్త్రీలయొక్క, జన=సమూహముతోడి, సంగమం = కూడికను, కురుత = చేయుఁడు. నరకే=నరకమునందు, హార ఆక్రాంతం = ము_త్తెపుసరులచే న్యాక్రమింపఁబడిన, ఘన...మండల - ఘన=క్రిక్కిఱిసిన, _స్తనమండలం = చనుకట్టును, అథవా = కాదేని, రణ...ఖలమ్ - రణత్ = మ్రోఁగుచున్న, మణిమేఖలమ్ = రతనాలమొలనూలుగల, శ్రోణీబింబం = పిఱుఁదులకుదురును, శరణం=రక్షకము, న ఖలు=కాదుగదా!

తా. ఓపండితులారా! స్త్రీసంగ మను క్షణనశ్వర మగు సుఖము నుండి మనసుఁ ద్రిప్పుఁడు. కరుణ, మైత్రి, ప్రజ్ఞ, యనుచెలువలతో సంగ మంబొనర్పుఁడు. ము_త్తెపుహారములచే మెఱయు గబ్బిబటువుపాలిండ్లు గాని, మ్రోఁతగల చిఱుగజ్జెలచే వెలయు నొడ్యాణముఁగల పిఱుఁదులు గాని మిమ్ము నరకమునుండి లేవఁదీసి రక్షింపఁజాలవు.

మ. మన సింపొందఁగ ధీరులార కరుణా ♦ మైత్రీ మనీషా క్షమా
 వనితాసంగమ మాచరింపుఁ డెపుడున్ ♦ భామాసుఖం బస్థిరం
 బని వర్జింపుఁడు హారరమ్యకుచముల్ ♦ ప్రాంచన్మణీమేఖలా
 ధ్వనితాలంబినితంబముల్ నరకబా ♦ ధల్మాన్పి రక్షించునే?

అవ. విర_క్తునికి సంసార మక్కఱ లే దనుచున్నాఁడు.

శ్లో. యదా యోగాభ్యాసవ్యసనకృశయో రాత్మమనసో
 రవిచ్ఛిన్నా మైత్రీ స్ఫురతి కృతిన_స్తస్య కిము తైః,

ప్రియాణామాలాపై రధరమధుభిర్వక్త్రవిధుభిః
సనిశ్వాసామోదైః సకుచకలశాశ్లేషసురతైః. 68

వ్యా.—ఏవం సాంఖ్యరీత్యా వైరాగ్యముక్త్వా సంప్రతి యోగమతానుసారేణాహ—యదేతి-యదా యస్మిన్ సమయే - యస్యేత్యధ్యాహారః - ఉత్తరత్ర తచ్ఛబ్దసద్భావాత్ - తథా చ యస్య సంబన్ధినః, యోగాభ్యాసే అష్టాఙ్గయోగపరిశీలనే - యద్వ్యసనమాసక్తిస్తేన కృశయోస్తత్పరతన్త్రయోరిత్యర్థః. ఆత్మమనసోః, ప్రత్యగాత్మాఽన్తఃకరణయోః, మైత్రీ మిత్రత్వం - మైత్త్రీ వ్యాఖ్యాతా, స్ఫురతి ప్రకాశతే-యోగాభ్యాసవశేనాశేషబాహ్యవిషయాన్పరిత్యజ్య యదాత్మారామమేవ మనో భవతీత్యర్థః. తదా తస్య కృతినో ధన్యస్య *'ఇష్టాదిభ్యశ్చే' తీనిప్రత్యయః, తైః కిము-న కిమపీత్యర్థః. తే క ఇత్యాశఙ్క్యాహ—ప్రియాణాం ప్రియతమానాం సంబన్ధిభిరాలాపైః శ్రోత్రసుఖావహమృదుమధురవ్యాహారైశ్చ, తథా నిశ్వాసామోదేన సహ సనిశ్వాసామోదైః పద్మినీజాతిత్వాన్నిశ్వాసఘ్రాణతర్పణగన్ధసంబన్ధబద్భిరిత్యర్థః. వక్త్రవిధుభిర్నయనానన్దకరముఖచన్ద్రైశ్చ - అత్ర చన్ద్రస్యైకత్వేఽపి ముఖబాహుళ్యాత్ బహుళత్వసిద్ధిః, తథా సకుచకలశాశ్లేషాణి కుచకుమ్భాలిఙ్గనసహితాని - యాని సురతాని త్వగుపస్థేన్ద్రియానన్దానన్దకరబాహాభ్యన్తరసంభోగవిశేషాః - తైశ్చ, ఏవమశేషేన్ద్రియగ్రామసంతర్పణైరపి తైః కిమితి సంబన్ధః, ఆత్మానన్దానుభవవేళాయాం తేషామతితుచ్ఛతయా ప్రతీయమానత్వాదితి భావః. శిఖరిణీవృత్తమ్.

టీ. యదా=ఎప్పుడు, (యస్య=ఎవనికి) యోగ...కృశయోః-యోగ = సమాధి యొక్క, అభ్యాస = అలవాటునందలి, వ్యసన = ఆసక్తిచేత, కృశయోః=నలుగుడువడిన, ఆత్మమనసోః = ఆత్మకును మనస్సునకును, అవిచ్ఛిన్నా = తెంపులేని, మైత్త్రీ = చెలిమి, స్ఫురతి=ప్రకాశించునో, (తస్య=ఆ) కృతినః=పుణ్యునకు, ప్రియాణాం=ప్రియురాండ్ర యొక్క, తైః ఆలాపైః=ఆపలుకులచేతను, అధరమధుభిః = మోవితేనెలచేతను, సనిశ్వాస ఆమోదైః = నిట్టూర్పువాసనలతోఁగూడిన, వక్త్రవిధుభిః = ముఖచంద్రులచేతను, సకు చ...రతైః - సకుచకలశఆశ్లేష = చనుగిండ్లకౌఁగిళ్లతోఁగూడిన, సురతైః = సంభోగముల చేతను, కిము=ఏమిప్రయోజనము ?

తా. ఎవ్వఁడు యోగాభ్యాసమునందుఁ దనమనసును లయింపఁజేసి, యెల్లప్పు డాత్మయందు నిల్పి యందలియెడతెగని యానందాతిశయము నొందుచున్నాఁడో, అట్టి జ్ఞానికిఁ బ్రియకాంతల ముచ్చ

టలును, మోవితేనియలును, మోముచందురులును, కుచకలశముల కౌఁగిలింతలును, యూర్పులకమ్మనివాసనలును, సురతమును నీచములై తృణప్రాయముగాఁ దోఁచును.

చ. ఎనసినయోగమార్గరతి యెవ్వనిడెందము లోవెలుంగుతోఁ
గొనకొని యేకమై వెలుఁగుఁగూరిమి మీఱఁగ వాని కేటికిన్
వనితలముద్దుఁబల్కులును హా తెఱతేనియ లూర్పుఁదావులున్
గొనబగుమోముఁజందురులు గుబ్బలఁగౌఁగిటఁజేర్పుకూటముల్.

అవ. విరక్తునికి సర్వము బ్రహ్మ మని చెప్పుచున్నాఁడు.—

శ్లో. యదాసీదజ్ఞానం స్మరతిమిరసఞ్చారజనితం
తదా దృష్టం నారీమయమిదమశేషం జగదితి,
ఇదానీమస్మాకం పటుతరవివేకాఞ్జనజుషాం
సమీభూతా దృష్టిస్త్రిభువనమపి బ్రహ్మ మనుతే. 69

వ్యా.—అథ వేదాన్తరీత్యా వైరాగ్యవర్ణనం నిగమయతి—యదేతి.—యదా యస్మిన్ కాలే, స్మరః కామ ఏవ-తిమిరం తిమిరాఖ్యనేత్రరోగః-అన్ధకారశ్చ గమ్యతే-ని. 'తిమిరం నేత్రరోగే స్యాదన్ధకారేఽపి చ స్మృత' మిత్యభిధానాత్ - తస్య - సంచారేణ వ్యాప్త్యా - జనితముత్పాదితమజ్ఞానమవివేకః, ఆసీత్, తథా తస్మిన్ కాలే, అశేషం సర్వమిదం జగత్, నారీమయం యోషిద్రూపమితి, దృష్టమాకలితం - అజ్ఞానవశాత్తథాఽవబుద్ధమిత్యర్థః, ఇదానీమస్మిన్ కాలే తు, పటుతరః అజ్ఞాననిరసనదక్షః-అన్యత్ర నేత్రరోగనిరాకరణసమర్థశ్చ - యః వివేకస్తత్త్వజ్ఞానమేవాఞ్జనం - నేత్రకల్యాణాఖ్యసిద్ధాఞ్జనం - తజ్జుషాం ప్రాప్తవతామస్మాకం సంబన్ధినీ, దృష్టిర్మతిః - దృక్చ, అసమా సమా సంపద్యమానా సమీభూతా * అభూతతద్భావేచ్విః-నిజప్రకృతిమాపన్నా సతీత్యర్థః. త్రయాణాం భువనానాం సమాహారస్త్రిభువనం * 'తద్ధితార్థే' త్యాదినా సమాసః-పాత్రాద్యదన్తత్వాన్న స్త్రీత్వం, బ్రహ్మ బ్రహ్మమయం, మనుతే-జ్ఞానోదయవశాద్బ్రహ్మస్వరూపమవబుధ్యతే, యథాఽఞ్జనేన నేత్రరోగనివృత్తౌ ఘటాద్యర్థతత్త్వజ్ఞానం జాయతే - తథా తత్త్వజ్ఞానేన కామాన్ధకారప్రయుక్తాజ్ఞానావరణాపాయే పరవస్తుసాక్షాత్కారో భవతి. తతస్సమ్యగ్దృష్ట్యా సర్వమిదం బ్రహ్మాకారతయా పశ్యతి. అయమేవ వేదాన్తసిద్ధాన్త ఇతి భావః. అతో వివేకస్య పరశ్రేయోహేతుత్వాత్తదధిగమార్థమేవ యత్నః కర్తవ్య ఇతి తాత్పర్యమ్.

రూపకాలంకారః. వృత్తం పూర్వవత్

టీ. యదా=ఎప్పుడు, స్మర...జనితం - స్మర=మన్మథుఁడనెడి, తిమిర = రేఁజీకటి యొక్క, సంచార = కలుగుటచేత, జనితం = పుట్టింపఁబడినదైన, అజ్ఞానం = అజ్ఞానము, ఆసీత్ = ఉండెనో, తదా = అప్పుడు, అశేషం = సమస్తమైన, ఇదంజగత్ = ఈలోకము, నారీమయం ఇతి = ఆఁడువాండ్రచే నిండినదిగా, దృష్టం=కనఁబడినది; ఇదానీం=ఇప్పుడు, పటు...జుషాం - పటుతర=మిక్కిలి దృఢమయిన, వివేక = తెలివియనెడి, అంజన = కాటుక చే, జుషాం = పొందియున్న, అస్మాకం = మాయొక్క, దృష్టిః = చూపు, సమీభూతా చక్కనయినది (కుదిరినది)యై, త్రిభువనం = ముల్లోకములను, బ్రహ్మ = బ్రహ్మముగా, మనుతే = తలఁచుచున్నది.

తా. మరుం డనెడియంధకారము వ్యాపించుటచే నెప్పుడు తెలివి లేమి కలిగెనో, అప్పుడు నాకంటికి బ్రహ్మస్వరూప మగుప్రపంచమెల్ల స్త్రీమయముగాఁ దోఁచెను. మేలయిన వివేక మనుకాటుక వేసికొను టచే నాకన్నులమసక దొలఁగి యిప్పుడు ప్రపంచమెల్ల బ్రహ్మస్వరూప ముగాఁ దోఁచుచున్నది. అవివేకులకు ప్రపంచము స్త్రీయే. వివేకులకు ప్రపంచమః బ్రహ్మమే యనుట.

చ. స్మరతిమిరప్రచారభవశశ్వ దబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు వధూమయ మై కననయ్యె నిప్పు డిం
పరయఁగ సద్వివేకమహితాంజనసంగత మై మదీయభా
సురసమదృష్టి బ్రహ్మముగఁ జూచుచునున్నది విశ్వమంతయున్.

---

## దుర్వ్రక్తపద్ధతి

అవ. స్త్రీలు వివేకమును బాడుసేయువా రని నిందించుచున్నాఁడు.—

శ్లో. తావదేవ కృతినామపి స్ఫురత్యేష నిర్మలవివేకదీపకః,
యావదేవ న కురఙ్గచక్షుషాం తాడ్యతే చటులలోచనాఞ్చలైః. 70

వ్యా.—అద్వైతద్వైలక్షణ్యేన దుర్విరక్తపద్ధతిమాహ—తత్రాదౌ యదుక్తం కృతినో వివేకస్ఫురణమితి తదేతదపవదతి—తావదితి.—కృతమేభిః కృతినస్తేషాం కుశలానామపి * 'ఇష్టాదిభ్యశ్చే'తిని ప్రత్యయః - ఏష పూర్వోక్తో, నిర్మలో

నిపుణశబ్దో-వివేక స్తత్త్వావబోధ ఏవ దీపః * స్వార్థే కః, తావత్తావత్పర్యన్త మేవ, స్ఫురతి దీప్యతే, కియత్పర్యన్తమిత్యాకాంక్షాయామాహ—కురఙ్గచక్షుషాం హరిణలోచనానాం, చటులాని చఞ్చలాని - లోచనాఞ్చలాని కటాక్షవీక్షణాని-తైః-కళాప్రాయైరితి భావః. యావత్పర్యన్తమేవ, న తాడ్యతే న నిహన్యతే-నావలోక్యత ఇత్యర్థః-తావదేవేతి సంబన్ధః, వివేకకుశలోఽపి జనః కామినీకటాక్షవీక్షితః సో వా వివేకనిర్వహణదక్ష ఇతి భావః. యద్యపి-ని.'అఞ్చలం త్వంశుకాన్తే స్యా' దిత్యమరః-తథాఽపి అన్తిమత్వసామ్యా దౌపచారికోఽయం నిర్దేశ ఇతి మన్తవ్యమ్. రథోద్ధతా.

టీ. కృతినాం అపి = పుణ్యవంతులకు సైతము, ఏషః = ఈ, నిర్మల...పకః - నిర్మల=దోషములేని, వివేక=జ్ఞానమనెడి, దీపకః = దీపము, కురంగచక్షుషాం=మృగాక్షులయొక్క, చటుల...అంచలైః-చటులలోచన = తళుకుఁజూపులయొక్క, అంచలైః= అంచులతో, యావదేవ = ఎంతవఱకు, న తాడ్యతే-సుడియఁబడదో, తావదేవ = అంతవఱకే, స్ఫురతి = ప్రకాశించును.

తా. పండితు లెంతవఱకు లేఁడిచూడ్కులం బోలుచూడ్కులు గల యతివలక్రేఁగంటిచూపులచేఁ గొట్టఁబడరో, అంతవఱకే పండితులయొక్క హృదయమందు మంచిచెడ్డలను దెలియునట్టివివేక మను దీపము వెలుఁగుచుండును. స్త్రీల కడగంటిచూపులచేతనే పండితుల కైనను బుద్ధిచెడును.

క. నీలోత్పలనయనాతర
ళాలోకనహతులు సోఁకునంతకు వెలుఁగుఁ
దీలలితసుజనవిమలో
ద్వేలాతిస్ఫుటవివేకదీపము నెమ్మిన్.

అవ. దుర్వారక్తదూషణముఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. వచసి భవతి సఙ్గత్యాగముద్దిశ్య వార్తా
శ్రుతిముఖరముఖానాం కేవలం పణ్డితానామ్,
జఘనమరుణరత్నగ్రన్థికాఞ్చీకలాపం
కువలయనయనానాం కో విహాతుం సమర్థః. 71

వ్యా.—అథైతేషాం దుర్వారక్తత్వాభిద్యోతకానీదృశాన్యేవ వచనాన్యాహ.— వచసీతి.—శ్రుతిముఖరాణ్యశ్రాన్తశ్రుతిపాఠతత్పరాణి ముఖాని యేషాం తేషామ్- నిరన్తరవేదాభ్యసనవ్యసనరసనానాం వేదాన్తపారగాణామపీత్యర్థః. పణ్డితానాంవివేకినాం,

వచసి కేవలం వాఙ్మాత్ర ఏవ, సఙ్గత్యాగం వధూసంసర్గత్యాగముద్దిశ్య, వార్తా గాథా, భవతి, న త్వన్తఃకరణ ఇతి భావః. కుతః? అరుణరత్నగ్రన్థిః పద్మరాగమణిఖచితః కాఞ్చ్యేవ కలాపో భూషణం యస్య తత్తథోక్తం - ని. 'శోణరత్నం లోహితకం పద్మ రాగోఽథ మౌక్తికం,' 'కలాపో భూషణే బర్హే' ఇతి చోభయత్రాప్యమరః. కువలయ నయనానామిన్దీవరాక్షీణాం; జఘనం కటిపురోభాగం, విహాతుం త్యక్తుం కస్సమర్థః న కోఽపీత్యర్థః, ప్రాయశ ఈదృశాన్యేవ దుర్విరక్తానాం వచనానీతి భావః. మాలినీ.

టీ. శ్రుతి ..ముఖానాం-శ్రుతి=వేదములచే, ముఖర=మ్రోయుచున్న, ముఖా నాం=నోళ్లుగల, పండితానాం=విద్వాంసులకును, వచసి కేవలం=మాటయందుమాత్రమె సంగత్యాగం = (స్త్రీలతోడి) సంబంధమును వదలుటను, ఉద్దిశ్య=ఉద్దేశించి, వార్తా = ప్రస్తావము, భవతి = కలుగును; (అంతేకాని) కువలయనయనానాం = కలువకంటుల యొక్క, అరుణ...కాలాపం - అరుణరత్న = కెంపులయొక్క, గ్రంథి = కూర్పుగల, కాంచీ=మొలత్రాడనెడి, కలాపం=నగగల, జఘనం = మొలను, విహాతుం = వదలుటకు, కః=ఎవఁడు, సమర్థః=శక్తుఁడు.

తా. పండితులు వేదాంతములు నోట వదరుచు స్త్రీలతోఁ గూడిక పనికిరా దని మాటలుచెప్పుచుందురుగాని, వారిని మనఃపూర్తిగా విడువఁ గలవారు గారు. ఏల యనః కెంపులు చెక్కిన యొడ్డాణముచే నొప్పారుచున్న కలువకంటుల కటిపురోభాగము నెవ్వఁడును విడిచి పోఁజాలఁడు.

చ. నిగమసుభాషితాభ్యసన ॥ నిష్ఠలు గల్గినయట్టిపండితుల్
మగువలఁబొందు నింద్యమని ॥ మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్
జగమున నెవ్వఁ డోపు విలసత్కురువిన్దమణిప్రభాధగ
ద్ధగితకలాపరమ్యవని ॥ తాజఘనంబుఁ బరిత్యజింపఁగాన్.

అవ. మఱియు—

శ్లో. స్వపరప్రతారకోఽసౌ నిన్దతి యోఽలీకపణ్డితో యువతీః,
యస్మాత్తపసోఽపి ఫలం స్వర్గః స్వర్గేఽపి చాప్సరసః. 72

వ్యా.—స ఇతి.—సోఽసౌ, వళీకపణ్డితః అనృతభాషీ-ని. 'అలీకం త్వప్రియేఽనృతే' ఇత్యమరః, పరప్రతారకో లోకవఞ్చకః, కోఽసావిత్యత ఆహ—యః అలీక పణ్డితో, యువతీః తరుణీః *'యూనస్తి' రితి తిప్రత్యయః; నిన్దతి గర్హయతి, స ఇతి

సంబన్ధః, నను నిస్సఙ్గత్వాద్యుపతినిన్దాకరణే కథం ప్రతారకత్వమత ఆహ—యస్మాత్కా-రణా_త్తపసశ్చాన్ద్రాయణాదేః వ్రతోపవాసాదిరూపస్య వా, ఫలం స్వర్గః, తత్ర స్వర్గేఽపి చాప్సరస ఉర్వశీప్రభృతయ_స్తత్రాపి తత్సఙ్గమ ఏవేత్యర్థః-అతః పరప్రతారక ఇతి భావః-ని. 'స్త్రియాం బహుష్వప్సరసస్స్వర్వేశ్యా ఉర్వశీముఖాః' ఇత్యమరః - 'స్వపరప్రతారక' ఇతి పాఠేఽప్యయమేవార్థః. యోఽలీకపణ్డితః పణ్డితమానీ - రహస్యానభిజ్ఞ ఇత్యర్థః. యువతీర్నిన్దతి అసౌ స్వస్య పరేషాం చ ప్రతారకః - ఆత్మవఞ్చకః పరవంచకశ్చే త్యర్థః. కుతః? యస్మాదిత్యాది - శేషం సమానం - స్వపరఫలవేదనబోధనయోః పరిజ్ఞానా భావాదుభయవఞ్చక ఇత్యర్థః. ఆర్యాభేదః.

టీ. యః అలీకపండితః=కల్లవిద్వాంసుఁడు (మూఢుఁడు), యువతీః = జవ్వనులను, నిందతి=దూషించునో, అసౌ = అట్టి యాతఁడు, స్వ...తారకః-స్వ = తనయొక్కయు, పర=ఇతరులయొక్కయు, ప్రతారకః=మోసగాఁడు; యస్మాత్ = ఎందువలన (అనఁగా), తపసః అపి = (వ్రతోపవాసాది) తపస్సునకుఁగూడ, ఫలం = ఫలము. స్వర్గః=స్వర్గము, స్వర్గేఽపి చ = స్వర్గమునందును, అప్సరసః = అచ్చరలు (ఫలముగా నున్నారు.)

తా. బూటకపుఁబండితులు గొందఱు 'స్త్రీలు చెడ్డవారు, వారితోఁ జేరరాదు; అరణ్యములందుఁ దపస్సుచేయుట మే'లని పల్కుచుందురు. వీరు తాముఁను మోసపోయి, యితరులను మోసపోవునట్లు చేయువారు. ఏల యన: ఆతపస్సుకు ఫలము స్వర్గమేకదా ? స్వర్గమున నుండువారచ్చరలె. అచ్చటికిఁ బోయినను మగువలే తపఃఫలముగా నున్నప్పుడు స్త్రీలను నిందించుట పైకేకాని లోపల స్త్రీలాభమునకుఁ దగినపనులనే వారు చేయుచుందురు.

తే. కుటిలవాదియుఁ బరవంచకుండు వాఁడు
నెమ్మి నెవ్వాఁడు యువతుల నిందసేయు
నింద్రలోకము తపములకెల్ల ఫలము
స్వర్గమున నున్నవార లచ్చరలు గారె.

అవ. మదనునికి లోఁబడనివా రెవ్వరును లే రనుట.—

శ్లో. మత్తేభకుమ్భదళనే భువి స_న్తి ధీరాః
కేచిత్ప్రచణ్డమృగరాజవధేఽపి దక్షాః,
కింతు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య
కన్దర్పదర్పదళనే విరలా మనుష్యాః. 73

వ్యా.—అథ మన్మథస్యాత్యన్తదుర్జయత్వమాహ—మత్తేభేతి.—భువి భూలోకే-మత్తేభానాం మత్తమాతఙ్గానాం - కుమ్భదళనే కుమ్భస్థలవిదారణే - సమర్థా ఇతి శేషః- ధీరాః శూరాస్సన్తి, తథా కేచిత్పురుషాః ప్రచణ్డోఽత్యన్తకోపనః - యో మృగరాజః సింహస్తస్య వధే హింసాయాం, దక్షాస్సమర్థాస్సన్తి - గజఘాతిభ్యోఽప్యుత్తమాశ్శూరాస్సమ్భవన్తీత్యర్థః. కిన్తు బలినాం బలాఢ్యానాం శూరాణామ్ - జ్ఞానబలశాలినామితి చ గమ్యతే, పురతోఽగ్రే-బ్రవీమి నిశ్శఙ్కం కరముద్ధృత్య సడిణ్డిమఘోషముద్ఘోషయామీత్యర్థః. కిముద్ఘోషయసీత్యత ఆహ—ప్రసహ్యబలాత్ - భుజబలాద్బుద్ధిబలాచ్చేత్యర్థః, కన్దర్పదర్పదళనే మదనమదవిదారణే, సమర్థాః మనుష్యాః, విరళా మృగ్యాః-ప్రాయశో న సన్తీత్యర్థః. శంభుం తద్భక్తాంశ్చ వినా మదనవిజయినో న సన్త్యేవేతి శివభక్తాగ్రేసరస్య కవేర్నిగూఢతరాభిసన్ధిః.

అత్ర కన్దర్పదర్పేతిసకృద్వ్యఞ్జనద్వయావృత్తేః ఛేకానుప్రాసాఖ్యశ్శబ్దాలఙ్కారః. వసన్తతిలకావృత్తమ్.

టీ. భువి = భూమిలో, మత్త . దళనే - మత్త ఇభ = మదపుటేనుఁగులయొక్క, కుంభ=కుంభస్థలములయొక్క, దళనే=చీల్చుటయందు, ధీరాః = దిట్టలు, సన్తి=ఉన్నారు; కేచిత్ = కొందఱు, ప్రచండ ..వధేఽపి-ప్రచండ = మిక్కిలి కోపముగల, మృగరాజ = సింహముయొక్క, వధేఽపి = చంపుటయందును, దక్షాః = మొనగాండ్రు, కింతు=కాని, ప్రసహ్య=వెనుదీయక, బలినాం పురతః = బలవంతులముందఱ, బ్రవీమి = చెప్పుచున్నాను. కందర్ప . . .దళనే-కందర్ప=మన్మథునియొక్క, దర్ప = గర్వముయొక్క, దళనే = చీల్చుట యందు (చీల్పఁగల), మనుష్యాః = పురుషులు, విరళాః = అరుదు.

తా. మదపు టేనుఁగుల గండస్థలములను జీల్చుటయందుఁ జాలిన దిట్ట లనేకులు పుడమి నున్నారు. సింహములను సంహరింపఁ జాలిన వారును కొందఱు గలరు. అయినను, మన్మథునిగర్వము నణఁపఁగలవా రనేకులు లే రని నేను బలవంతులయెదుట దృఢముగాఁ జెప్పుచున్నాను. దీనికి బదు లెవ్వరు చెప్పఁగలరో చెప్పఁడు.

తే. సమదకుంజరకుంభభంజనులు మఱియు
నుగ్రమృగరాజవధదక్షు లుర్విఁ గలరు
తఱచుగా లేదు కందర్పదర్పదళన
నిపుణజను లని చాటింతు నిఖిల సభల.

అవ. పురుషుఁడు స్త్రీలకడగన్నులం బడువఱకే యోగ్యుఁడుగా నుండు నని చెప్పుచున్నాఁడు.—

శ్లో. సన్మార్గే తావదాస్తే ప్రభవతి పురుషస్తావదేవేంద్రియాణాం
లజ్జాం తావద్విధత్తే వినయమపి సమాలమ్బతే తావదేవ,
భ్రూచాపాకృష్టముక్తాః శ్రవణపథగతా నీలపక్ష్మాణ ఏతే
యావల్లీలావతీనాం న హృది ధృతిముషో దృష్టిబాణాః పతన్తి. 74

వ్యా.—అథ చ పునర్వచనవైచిత్రీమేవాహ — సదితి.—నరః - విద్వానపీతి భావః.—సన్మార్గే శ్రుతిస్మృతిబోధితాచారే తావత్తావత్పర్యన్తమేవాస్తే వర్తతే. ఇన్ద్రియాణాం చక్షురాదీనాం చ తావదేవ ప్రభవతి సమర్థో భవతి-నియమన ఇతి శేషః, లజ్జాం జుగుప్సితకర్మాచరణాచ్చేతస్సంకోచలక్షణాం వ్రీడాం చ, తావదేవ, విధత్తేఽనువర్తతే, వినయం నమ్రత్వం చ, తావదేవ సమాలమ్బతే స్వీకురుతే, కియత్పర్యన్తమిత్యాశఙ్కాయామాహ — భ్రూరేవ చాపం కార్ముకం - తేనాకృష్టాశ్చ తే ముక్తాశ్చేతి విశేషణసమాసః. ఏకత్ర భ్రూభఙ్గపూర్వక-మపరత్ర చాపనమనపూర్వకం చ ప్రయుక్తా ఇత్యర్థః. శ్రవణపథగతాః శ్రోత్రమార్గగతాః - ఏకత్ర కర్ణాన్తవిశ్రాన్తత్వా దపరత్ర తావత్పర్యన్త మాకర్షణాచ్చేతి భావః. నీలాని పక్ష్మాణి లోమాన్యన్యత్ర గరుతశ్చ యేషాం తే తథోక్తాః, ధృతిం ముష్ణన్తీతి ధృతిముషో ధైర్యభేదిన, ఏతే ప్రసిద్ధా లీలావతీనాం విలాసినీనాం, దృష్టయ ఏవ బాణాః, యావద్యావత్పర్యన్తం, హృది మానసే - వక్షసి, న పతన్తి న ప్రవిశన్తి, తావదితి సంబన్ధః తదనన్తరం సన్మార్గప్రవర్తనాదికం నిరోద్ధుం కస్సమర్థ ఇతి భావః. ఉక్తం చ ప్రబోధచన్ద్రోదయే.—

'తావద్వివేకవిభవస్తావత్సన్మార్గవర్తనం పుంసామ్,
నిపతన్తి దృష్టివిశిఖా యావన్నేన్దీవరాక్షీణామ్.' ఇతి.

అత్ర ద్వితీయార్థే సమస్తవస్తువర్తిసావయవరూపకాలంకారః. స్రగ్ధరావృత్తమ్.

టీ. భ్రూ...ముక్తాః-భ్రూ = కనుబొమయనెడి, చాప = ధనుస్సుచేత, ఆకృష్ట= లాగఁబడి, ముక్తాః=వదలఁబడినవియు, శ్రవణపథగతాః = చెవిపర్యంతము పొందినవియు, నీలపక్ష్మాణః = నల్లనిఱెప్పలుగలవియు (ఱెక్కలు అని బాణపరము); ధృతిముషః =ధైర్యమును దొంగిలించునదియు, (అయిన) లీలావతీనాం = విలాసవతులయొక్క, ఏతే దృష్టి బాణః = ఈచూపులను బాణములు, యావత్ = ఎంతవఱకు, హృది = మనస్సునందు, (ఱొమ్ములో అని బాణపరము.) నపతంతి = పడవో, నరః=పురుషుఁడు, సన్మార్గే=మంచి మార్గమునందు, తావదేవ=అంతవఱకే ప్రభవతి = ప్రభువగును. లజ్జాం=సిగ్గును, తావ

దేవ=అంతవఱకే, విధత్తే = వహించును. వినయమపి = వినయమును సైతము, తావదేవ= అంతవఱకే, సమాలంబతే = వహించును.

తా. చెవివఱకు కీడ్చి కనుబొమ లనెడువింటియందు జోడించి యేయఁబడిన నల్లనిఱెప్పలనెడు ములుకులుగలవియు, పురుషులధైర్యము బోఁగొట్టునవియు నైనవేడుకకత్తెల చూడ్కులనెడు శరము లెంతవఱకుఁ బురుషులహృదయమున నాఁటవో, యంతవఱకే పురుషుఁడు సన్మార్గమునఁ బ్రవర్తించుచున్నాఁడు. అంతవఱకే ఇంద్రియములను గెల్వఁజాలుచున్నాఁడు. అంతవఱకే చెడ్డపనులందుఁ జొచ్చుటకు సంకోచపడుచున్నాఁడు. అంతవఱకే పెద్దలయం దడఁకువతో నడచుచున్నాఁడు. (గర్వములేక యున్నాఁడు.)

శా. సారాచారముఁ బూను నింద్రియములన్ శాసించు లజ్జాన్వితుం
డై రాజిల్లుఁ బ్రశాంతిఁ జేకొను నరుండెందాఁక నెందాఁక దు
ర్వారంబుల్ శ్రుతిమార్గగాములు సుదారభ్రూధనుర్ముక్తముల్
నారీవీక్షణబాణముల్ చొరవు విన్నాణంబుగా డెందముల్.

అవ. ఇఁక రెండుశ్లోకములచే స్త్రీలమహిమ యనివార్య మనుచున్నాఁడు.—

శ్లో. ఉన్మత్తప్రేమసంరమ్భాదారభన్తే యదఙ్గనాః,
తత్ర ప్రత్యూహమాధాతుం బ్రహ్మాపి ఖలు కాతరః. 75

వ్యా.— కిం బహునా బ్రహ్మాఽప్యఙ్గనోద్యోగప్రత్యూహాచరణే న ధీరో భవతీత్యాహ—ఉన్మత్తేతి.—అఙ్గనాః స్త్రియః, ఉన్మత్తోఽత్యుత్కటో - యః ప్రేమా అనురాగ - స్తస్య సంరమ్భాత్సంభ్రమాత్ - ని. 'సంరమ్భస్సంభ్రమే కోపే'ఇతి విశ్వః. యత్కర్మ ఆరభన్తే - విహితమవిహితం వా కర్తుముద్యుఞ్జతే ఇదిత్యర్థః-తత్ర కర్మణి, ప్రత్యూహం విఘ్నం - ని. 'విఘ్నోఽన్తరాయః ప్రత్యూహః.' ఇత్యమరః. ఆధాతుం కర్తుం, బ్రహ్మాఽపి కిముతాఽన్య ఇతి భావః, కాతరస్సభయః - అసమర్థః ఖల్విత్యర్థః. అనివార్యనిశ్చయానామనావృతానామఙ్గనానాం కో నామ నివారయితేతి భావః.

అనుష్టుప్.

టీ. అంగనాః = స్త్రీలు, ఉన్మత్త...రంభాత్-ఉన్మత్త=అతిశయించిన, ప్రేమ = అనురాగముయొక్క, సంరంభాత్=ఉరవడివలన, యత్=దేనిని, ఆరంభతే = ఆరంభింతురో, తత్ర=దానికి, ప్రత్యూహం=విఘ్నమును, ఆధాతుం = చేయుటకు, బ్రహ్మా అపి= బ్రహ్మయును, కాతరః ఖలు=పిఱికివాఁడు సుమా!

తా. స్త్రీలు మిక్కుటమగు ప్రేమముతో నెట్టిపనిని జేయఁబూనినను, వారి నట్లు చేయనీకుండఁ జేయుటకు సృష్టికర్త యగు బ్రహ్మకుఁ గూడ నలవికాదు.

క. ప్రేమావేశభరంబున
భామాజను లాచరించుపని మరలింపం
దామరవిరిలోఁ బొడమిన
యామేటికి నైన నలవి యగునె తలంపన్.

శ్లో. తావన్మహత్త్వం పాణ్డిత్యం కులీనత్వం వివేకితా,
యావజ్జ్వలతి నాఙ్గేషు హతః పఞ్చేషుపావకః. 76

వ్యా.—తావదితి - మహత్త్వం మహానుభావత్వం, పాణ్డిత్యం ప్రాజ్ఞత్వమ్, కులీనత్వం మహాకులప్రసూతత్వం * 'కులాత్ఖః' ఇతి ఖప్రత్యయః. వివేకితా కర్తవ్యా, కర్తవ్యవిచారచతురత్వం చ, తావత్తావత్పర్యన్తమేవ భవతీతి శేషః. యావత్ హతో నీచః అశ్లాఘ్యతాపాదకత్వాన్నికృష్టః, పఞ్చ అరవిన్దాదయః ఇషవో బాణా యస్య సః పఞ్చేషుః మదన - స్స ఏవ పావకోఽగ్నిః, అఙ్గేషు, న జ్వలతి నావిర్భవతి - న సన్తాపయతీత్యర్థః. తావదితి సంబన్ధః. తదనన్తరం కో వా మహత్త్వాదిగుణవిశిష్ట ఇతి భావః.

'అరవిన్ద మశోకం చ చూతం చ నవమల్లికా,
నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః' ఇత్యమరః.

అత్ర మదనే అగ్నిత్వరూపణా దేకదేశవర్తిరూపకమ్. అనుష్టుప్.

టీ. యావత్ = ఎందాఁక, హతఃపంచేషుపావకః = పాడుమన్మథాగ్ని, అఙ్గేషు అవయవములయందు, న జ్వలతి = మండదో, తావత్ = అందాక, మహత్త్వం = గొప్పతనము, పాండిత్యం = వైదుష్యము, కులీనత్వం = మంచికులమునఁ బుట్టుట, వివేకితా = తెలివి.

తా. క్రూరమగు మదనాగ్ని శరీరమందుఁ బ్రవేశించి,వికారముగలిగింప కుండునంతవఱకే నరుఁడు పండితుఁ డనియు, మహిమగలవాఁ డనియు, గొప్పకులమునఁ బుట్టినవాఁ డనియు, మంచిచెడ్డ లెఱిఁగినవాఁ డనియుఁ బేరుపొందును.

క. కులశీలవివేకంబులు
దొలఁగక నరులందు నిల్చుఁదుర్భరమదన

జ్వాలనము సర్వాంగంబుల
నెలకొనునందాఁక నంత కె నిలువం గలవే?

అవ. స్త్రీలు సద్గతికి విరోధిను లనుట.—

శ్లో. శాస్త్రజ్ఞోఽపి ప్రగుణితనయోఽప్యాత్తబోధోఽపి బాఢం
సంసారేఽస్మిన్ భవతి విరలో భాజనం సద్గతీనామ్,
యేనైతస్మిన్నిరయనగరద్వారముద్ఘాటయన్తీ
వామాక్షీణాం భవతి కుటిలా భ్రూలతా కుఞ్చికేవ.

వ్యా.—అథ సాంసారికస్య సద్గతిః దుర్లభేతి సహేతుకమాహ—శా
ఇతి.—శాస్త్రజ్ఞః సకలశాస్త్రరహస్యాభిజ్ఞోఽపి * 'అతోఽనుపసర్గే కః' ఇతి
త్యయః. తత్రాపి ప్రగుణితః ప్రకర్షేణావృత్తివిషయీకృతః - నయో నీతిశాస్త్రం -
స తథోక్తోఽపి - ఫలవదర్థావబోధనపర్యన్తం సమ్యక్పరిశీలితనీతిశాస్త్రోఽపీత్యర్థః. ప్ర
శబ్దాత్ * 'తత్కరోతీ' తి ణ్యన్తాత్కర్మణి క్తః. * ణా విష్ఠవద్భావే విన్మతో ర్లు
ని. 'గుణః స్యాదవృత్తిశబ్దాక్ష్యే జ్యేన్ద్రియే ముఖ్యతన్తుషు' ఇతి వైజయన్తీ. తథా బా
దృఢ, మాత్తబోధ ఉత్పన్నజ్ఞానోఽపి పుమా, నస్మిన్ పరివర్తమానే సంసారే, సద్గతీన
భాజనం పాత్రమ్ - యోగ్య ఇతి యావత్, విరలో మృగ్యో, భవతి - స్వర్గాది
గామీ యః కశ్చిదేవ భవతి - న తు బహుళ ఇత్యర్థః. కుతః? యేన కారణేన, ఏతస్మి
సంసారే, వామాక్షీణాం మనోహరనయనానాం * 'బహుప్రీహా'ఇత్యాదినా
షిత్త్వాత్ జీష్. కుటిలా వక్రా, భ్రూర్లతేవ భ్రూలతా భ్రూవల్లీ, కుఞ్చికేవ విష్క
విఘట్టనసాధనవక్రాగ్రాయోమయశలాకేవ, నిరయనగరస్య యమపురస్య ద్వారమ్ -
ణయా ద్వారపిధానకవాటవిష్కమ్భమిత్యర్థః. ద్వారశబ్దేన కవాటస్య లేన చ తద్విష
మ్భస్య చ లక్షితత్వాత్, ఉద్ఘాటయన్తీ విఘట్టయన్తీ - వ్యామోహోత్పాదనేన దుర
ప్రవేశయన్తీత్యర్థః. భవతి ఖలు - అతో విరళ ఇతి. సంబన్ధః, స్త్రీసఙ్గినాం కుతస్సద్గతి
భావః. ఉపమాలఙ్కారః. మన్దాక్రాన్తావృత్తమ్.

టీ. యేన=ఎందుచేత, ఏతస్మిన్ = ఈసంసారమందు, వామంఅక్షీణాం=(చక
కన్నులుగల) సుందరులయొక్క, కుటిలా = వంకరయైన, భ్రూలతా = కనుబొమతీ
కుంచికాఇవ=కుంచెకోలవలె. నిర...ద్వారం - నిరయనగర=నరకపురముయొక్క, ద్వార
వాకిటిని, ఉద్ఘాటయంతీ = తెఱచుచు, భవతి = ఉన్నదో - (అందుచేత), శాస్త్ర
అపి=శాస్త్రమును దెలిసినవాఁడైనను, ప్రగుణితనయః అపి = పరిశీలింపఁబడిన నీతి

వాఁడైనను, అస్మిన్ సంసారే = ఈసంసారమునందు, సద్గతీనాం = మంచిత్రోవలకు, భాజనం=పాత్రము, విరళః=అరుదైనవాఁడు, (ఎవఁడో యొకఁడు) భవతి=అగును.

తా. ఈ సంసారమున నందమగు కన్నులుగల పొలఁతులయొక్క వంకరలైన తీఁగెవంటి కనుబొమలు నరకపట్టణముయొక్క తలుపులు దీయు కుంచెకోలలవలె నున్నవికాన నీసంసారమున మెలఁగెడు మానవుఁడు శాస్త్రజ్ఞుఁ డయినను నీతిని దెలిసినవాఁ డయ్యుఁ జక్కఁగా గురూపదేశము నొందినవాఁ డయినను సద్గతి నొందుట దుర్లభము.

తే. శాస్త్రవిదుఁడైన బుధుఁడైన సదయుఁడైన
సద్గతికిఁ బోవు టరిది సంసారసరణి
యమపురద్వారముల కవాటములఁ గుంచి
కలునుబలె విప్పుచున్నవి కలికిబొమలు.

అవ. రెండుశ్లోకములచే మదనునిమహిమ వర్ణింపఁబడుచున్నది.—

శ్లో. కృశః కాణః ఖఞ్జః శ్రవణరహితః పుచ్ఛవికలో
వ్రణీ పూయక్లిన్నః కృమికులశతైరావృతతనుః,
క్షుధాక్షామో జీర్ణః పిఠరకకపాలార్పితగళః
శునీమన్వేతి శ్వా హతమపి చ హన్త్యేవ మదనః. 73

వ్యా.—అథ ద్వాభ్యాం మన్మథస్య చరిత్రవైచిత్ర్యమాహ—కృశ ఇతి.— కృశః పిణ్డాలాభాదస్థిచర్మావశిష్టదేహః, కాణోఽన్ధకః - యద్వా ఏకాక్షః, ఖఞ్జః పాదవికలః - అకార్యకరణేన లగుడప్రహారాద్భగ్నపాద ఇత్యర్థః. తథా శ్రవణరహితః సమూలం భిన్నకర్ణః-పుచ్ఛేన వికలశ్ఛిన్నలాఙ్గూలః * 'యే నాఙ్గవికార' ఇతి సమాసః. వ్రణీ సర్వాఙ్గక్షతిమాన్, అతః పూయేన క్లిన్నః ఆర్ద్రః కృమీణాం వ్రణోత్పన్నాపాదతుచ్ఛజన్తూనాం - కులశతైః అనేకక్రిమిపరమ్పరాభిరిత్యర్థః; ఆవృతా వ్యాప్తా - తనుర్యస్య స తథోక్తః, క్షుధా బుభుక్షయా, క్షామః పరిక్షీణః * 'క్షాయో మః' ఇతి మత్వమ్, జీర్ణః జరయా శిథిలావయవః, పిఠరకకపాలేన ఘటముఖవలయే - నార్పితగళ ఆసఞ్జితకణ్ఠనాళః - శునకో హి ఘటముఖే స్వశిరో నిక్షిప్య అన్నం భక్షయతి - తతస్తావతైవ పరిపుష్టత్వేనాక్రష్టుమశక్యత్వాద్భువి విఘట్టనే నాధః కపాలాపాయే తన్ముఖకపాలే నాసఞ్జితకణ్ఠో భవతీతి ప్రసిద్ధిః. అత ఏవంభూత ఇత్యర్థః. యద్వా-చౌర్యేణాశ్నాది భక్షణే తద్దణ్డనార్థం భ్రాష్ట్రం మధ్యే ఛిద్రం కృత్వా గళే ఆసఞ్జయన్తి - తస్మాదిత్థంభూత ఇత్యర్థః. ఏవం జుగుప్సితోఽపి, శ్వా శునకః, శునీం సారమేయీం, మన్వేత్యను

సరతి-నిధువనార్థమితి భావః. తథా హి—హతం వినష్టమపి చ, మదనో హన్త్యేవ మనో వికారోత్పాదనేన పీడయత్యేవ - న తు హతహననమన్యాయ్యమితి విచారయతీత్యర్థః. శఠోఽయం మదనః కం వా కథంభూతావస్థాపన్నం న కరోతీతి భావః, అత్ర ఏవకారోఽత్యన్తాయోగవ్యవచ్ఛేదార్థః. 'పార్థో ధనుర్ధరో భవత్యేవ' ఇత్యుదాహృత్య క్రియాగతైవకారస్య తథాభూతార్థకత్వానుశాసనాత్. శిఖరిణీవృత్తమ్.

టీ. కృశః=చిక్కినదియు, కాణః = గ్రుడ్డిదియు, ఖఞ్జః = కుంటిదియు, శ్రవణరహితః=చెవులులేనిదియు, పుచ్ఛవికలః = తోఁకదెగినదియు, వ్రణీ = పుండ్లుగలదియు, పూయక్లిన్నః = చీముచేఁ దడిసినదియు, కృమికులశతైః = పురుగుతుట్టెల వందలచే, ఆవృతతనుః-ఆవృత = క్రమ్మఁబడిన, తనుః = శరీరముగలదియు, క్షుధా=ఆఁకలిచేత, క్షామః = క్షీణించినదియు, జీర్ణ=ముదిసినదియు, పిఠర...గళః-పిఠరకపాల = కుండబోచ్చెయందు, అర్పిత = ఉంపఁబడిన, గళః = మెడగలదియు; (మెడకు కుండబోచ్చెను మూతినుండి దూర్చుకొని యున్నదనుట) (అయిన) శ్వా=కుక్క, శునీం = ఆడుకుక్కను, అన్వేతి = వెంబడించి పోవును.

తా. మిక్కిలి చిక్కి, కన్నులొత్తిపోయి, కుంటిదయి, చెవులుదెగి, తోఁకలేనిదై, పుండ్లు దేహమెల్లనుండఁగా వానినుండికారు చీముచేఁ దడిసి, పెక్కుపురుపు లొడలెల్ల చుట్టికొనియుండ నాఁకలిచే డస్సి యొక గుండ్రని మోటికుండ పెంకును మెడకుఁదగిలించుకొని యల్లాడుచుండు ముదుసలి కుక్కకూడ నొక యాఁడుకుక్కను జూచిన దానితోఁ గలియ నెంచి వలపుచే వెంబడించి పోవుచుండును. మదనుఁడు చచ్చినవారికి మోహము గలిగించి యింకను జంపుచునే యుండును. మోహము చచ్చినను బోదు.

చ. కరము కృశించి కాల్ విరిగి కన్నులు గానక పుచ్ఛహీనమై
పురుగులు గ్రమ్ముచున్న వ్రణపుంజము మేనలమంగ నాఁకటం
బరవశమై ఘటీముఖకపాలగళం బగుకుక్క వెంటితో
నరిగెడుఁ గూళజంతువులనైన వధించు మనోజుఁ డక్కటా!

శ్లో. స్త్రీముద్రాం ఝషకేతనస్య పరమాం సర్వార్థసమ్పత్కరీం
యే మూఢాః ప్రవిహాయ యాన్తి కుధియో మిథ్యాఫలాన్వేషిణః,

తే తేనై వ నిహత్య నిర్దయతరం నగ్నీకృతా ముణ్డితాః
కేచిత్పఞ్చశిఖీకృతాశ్చ జటిలాః కాపాలికాశ్చాపరే. 79

వ్యా.—స్త్రీముద్రామితి.—సర్వార్థానాం సంపదం కరోతీతి సర్వార్థసంపత్కరీమ్-ధర్మార్థకామపురుషార్థసమృద్ధిహేతుభూతామిత్యర్థః, * కృఞోహేతుతాచ్ఛీల్యానులోమ్యేషి' తి టప్రత్యయః. టిత్వాన్ఙీప్. కుసుమాయుధస్య జగజ్జైత్రస్య మన్మథస్య, జయినీమ్ జయావహామిత్యర్థః. * 'జిదృక్షి' - ఇత్యాదినా ఇని ప్రత్యయః, స్త్రీముద్రాం స్త్రీరూపచిహ్నం, ప్రవిహాయ త్యక్త్వా, యే కుధియో దుర్బుద్ధయః, అత ఏవ మూఢాః కర్తవ్యాకర్తవ్యవిచారశూన్యాః మిథ్యాఫలాన్వేషిణః అభూతచరత్వాదసత్యప్రాయమోక్షఫలకాఙ్క్షిణస్సన్తః, యాన్తి ప్రవ్రజన్తీత్యర్థః. తే మూఢాస్తేన నిజముద్రాహాసజనితకోపేన, కుసుమేషుణైవ, నిర్దయతరం దయాహీనం యథా తథా, నిహత్య నీచైః కృత్వా, కేచి, న్నగ్నీకృతాః దిగమ్బరీకృతాః - ని. 'నగ్నోఽవాసా దిగమ్బరః' ఇత్యమరః. * అభూతతద్భావే చ్విః * 'అస్య చ్వౌ' ఇతి ఈత్. * 'ఊర్యాదిచ్విడాచశ్చ' ఇతి గతిసంజ్ఞాయాం. * 'కుగతి ప్రాదయః' ఇతి సమాసః. కేచిన్ముణ్డితాః పరమహంసీకృతాః - న తు సౌభాగ్యసంపన్నీకృతా ఇత్యర్థః. అతః కుసుమేషుముద్రారూపాః స్త్రియో న పరిహర్తవ్యా ఇతి భావః. యథా లోకే రాజానస్తీక్ష్ణదణ్డా నిజాజ్ఞోల్లఙ్ఘనాపరాధిజనాన్ కాంశ్చిత్సర్వస్వాపహారేణ వస్త్రహీనాన్ కుర్వన్తి, కాంశ్చిత్సర్వతో ముణ్డితశిరస్కాన్, కాంశ్చిదర్ధముణ్డితముణ్డాన్, కాంశ్చిజ్జటాధారిణః, కాంశ్చిత్కపాలభిక్షుకాంశ్చ కుర్వన్తి, తద్వదత్రాపి ఇతి ధ్వనిః.

అత్ర వైరాగ్యకృత నగ్నత్వాదేః కుసుమేషుకృతత్వోత్ప్రేక్షణాదుత్ప్రేక్షాలంకారః. సా చ నూనమిత్యాది వ్యఞ్జకాప్రయోగాత్ గమ్యా. శార్దూలవిక్రీడితమ్.

టీ. కుధియః=చెడుబుద్ధిగల, మూఢాః = అజ్ఞులు, యే = ఎవరు, మిథ్యా...షిణః సన్తః-మిథ్యా=అబద్ధమైన, ఫల = (స్వర్గాది) ఫలమును, అన్వేషిణః సన్తః = వెదకుచున్నవారై, సర్వా...కరీం-సర్వ=సమస్తములైన, అర్థ=ప్రయోజనములయొక్క, సంపత్ = సంపదను, కరీం = చేయునదియు, పరమాం = ఉత్తమమును, (అగు) ఝషకేతనస్య = (చేపపడగవాని) మన్మథునియొక్క, స్త్రీముద్రాం = స్త్రీయనెడి ముద్రను, ప్రవిహాయ= వదలిపెట్టి, యాంతి = పోవుదురో, తే = వారు (మూఢులు); తేనఏవ = ఆతనిచేతనే, నిర్దయతరం=అతిక్రూరముగా, నిహత్య = కొట్టఁబడి, నగ్నీకృతాః=దిస్సమొలగాఁ జేయఁబడినవారు, (అనఁగా; దిగంబరసన్న్యాసు లయి రనుట) ముండితాః = తలగొఱిగింపఁబడి

నారు (బోడిగుండు చేయించుకొని పరమహంసు లయిరనుట), కేచిత్ = కొందఱు, జటిలాః = జడలుగలవారుగా చేయఁబడినారు; (ఋషులైరనుట) అపరే = మఱికొందఱు, కాపాలికాః చ = తలపుఱ్ఱెతో బిచ్చమెత్తుకొనువారుగా చేయఁబడినారు, (కాపాలిక సన్న్యాసు లైరనుట.)

తా. సరళమైన బుద్ధిలేనివా రగుటచే విపరీతములఁ దలఁచు మూఢులు సకలసంపదలను, సకలకార్యముల నొడఁగూర్చునట్టి మీనధ్వజుని జయప్రద మగు స్త్రీరూపముద్రికను విడిచి, కంటికిఁ గనఁబడని స్వర్గాదిఫలములను వెదకఁబోవుచున్నారు. వారిలోఁ గొందఱిని మన్మథుఁడు తనయాజ్ఞను మీఱుట యను నెపము పెట్టి, దిస్సమొలగలవారినిగను (దిగంబరులగను), కొందఱిని బోడులనుగాను (పరమహంసలనుగాను). కొందఱిని అచ్చటచ్చట జుట్టుపెట్టి గొఱిగింపఁబడినవారినిగను (పంచశిఖులనుగాను), కొందఱిని జడలను గలవారినిగాను (మునులనుగాను), కొందఱిని తలపుఱ్ఱెయందు బిచ్చ మెత్తువారినిగాను (కాపాలికులనువారినిగాను) జేయుచున్నాఁడు. ఇది నిజము !

చ. స్మరునకు సర్వలోకజయసంపద లీయఁగఁ జాలు ప్రౌఢలం
దరుణుల నింద సేయుట నరధర్ములు కొందఱు మానవుల్ దిగం
బరులును బ్రహ్మచారులుఁ గపాలకపాణులు దండహస్తులై
తిరుగుచు నున్న వారు రతిదేవుని మీఱిన భోగ మబ్బునే.

అవ. మహర్షులకుఁ గూడ నింద్రియనిగ్రహము దుర్లభమనుట—

శ్లో. విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనా
స్తేఽపి స్త్రీముఖపఙ్కజం సులలితం దృష్ట్వైవ మోహం గతాః,
శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుఞ్జన్తి యే మానవా
స్తేషామిన్ద్రియనిగ్రహో యది భవేద్విన్ధ్యః ప్లవేత్సాగరే. 80

వ్యా.—కిం బహునా మహర్షయోఽపీన్ద్రియనిగ్రహసమర్థా న జాతా ఇత్యుపసంహరతి—విశ్వామిత్రేతి.— వాతామ్బుపర్ణాన్యేవాశనం యేషాం తే తథోక్తాః శరీరయాత్రామాత్రోపయోగి వాయూదకపరిణతపర్ణాహారా ఏవ - న త్విన్ద్రియతుష్టికరమృష్టాన్నభోజనా ఇత్యర్థః విశ్వామిత్రపరాశరప్రభృతయో-విశ్వస్య మిత్త్రం విశ్వామిత్రో గాధినన్దనః-'మిత్త్రే చర్షౌ' ఇతి దీర్ఘః. పరాశరో వ్యాసపితా - తౌ ప్రభృతీ యేషాం తే తథోక్తాః - ప్రభృతిశబ్దేన శాణ్డిల్యాదయోఽపి సఙ్గృహ్యన్తే, యే మహర్షయస్సన్తీతి

శేషః. తేఽపి, సులలితమతిసున్దరమ్-ని. 'లలితం త్రిషు సున్దరమ్' ఇతి శబ్దార్ణవే. స్త్రీణాం మేనకా రమ్భా సత్యవతీ ధాన్యమాలిన్యాది యోషితాం, ముఖపఙ్కజం, దృష్ట్వైవావలోక్యైవ, మోహం గతాః తత్పరతన్త్రా జాతాః-న త్విన్ద్రియనిగ్రహసమర్థా ఇత్యర్థః. కింతు యే, మానవాస్సాధారణమర్త్యాః సఘృతమ్ ఆజ్యప్లుతం, తదపి పయసా క్షీరేణ - దధ్నా చ-యుతం మిశ్రితం శాల్యన్నం కలమాఖ్యవ్రీహ్యన్నమ్ - అత్యన్తవీర్యవృద్ధికరం మృష్టాన్నమిత్యర్థః భుఞ్జతే అభ్యవహరన్తి * 'భుజోఽనవనే' ఇత్యాత్మనేపదమ్, తేషాం మానవానాం, యదీన్ద్రియనిగ్రహః ఇన్ద్రియనియమస్సంభవేద్యది, తదా విన్ధ్యః పర్వతః సాగరే, ప్లవేత్ ఉన్మజ్జేత్, న తు కదాచిదపి విన్ధ్యః ప్లవతి, గ్రావప్లవనస్యాశ్రుతచరత్వాత్. తథా చ విన్ధ్యప్లవనస్య యథా అసంభావితత్వం తథా ఇన్ద్రియనిగ్రహస్యాపీత్యర్థః; వాతాద్యశనానాం ఋషీణామేవైతాదృశావస్థాపన్నత్వమ్, కిముత మృష్టాన్నభోజినాం మానవానామితి భావః,

అత్రేన్ద్రియాణాం నిగ్రహసంబన్ధేఽపి విన్ధ్యప్లవనదృష్టాన్తేనాసంబన్ధోక్తేస్సంబన్ధేఽసంబన్ధరూపాతిశయోక్తిః. శార్దూలవిక్రీడితమ్.

టీ. వాత...శనాః-వాత=గాలియు, అంబు=నీళ్లును, పర్ణ = ఆకులును, అశనాః= తిండిగాఁగల, తేఽపి, విశ్వామిత్రపరాశర ప్రభృతయః = విశ్వామిత్రుఁడు పరాశరుఁడు మొదలగువారుకూడ, సులలితం = మిగుల అందమైన, స్త్రీముఖపంకజం = ఆఁడుదాని ముఖకమలమును, దృష్ట్వా = చూచి, మోహం = అనురాగమును, గతాః = పొందిరి, యేమానవాః=ఏమనుష్యులు, సఘృతం=నేతితోఁ గూడినదియు, పయోదధియుతం=పాలు పెరుగులతోఁ గూడినదియు, (అగు), శాలిఅన్నం = వరియన్నమును, భుంజతే = భుజింతురో, తేషాం=వారికి, ఇంద్రియనిగ్రహః=ఇంద్రియములను నిగ్రహించుట, భవేత్ యది=కలుగునెడల, వింధ్యః=వింధ్య(పర్వత)ము, సాగరే = సముద్రమునందు, ప్లవేత్ = తేలును.

తా. విశ్వామిత్రుఁడు, పరాశరుఁడు మొదలగు పెక్కండ్రు మహర్షులు సంసారముఁ బాసి, యాకులు దినుచు, నీళ్లు ద్రాగి యడవియందుఁ దపస్సు సేయుచుండిరి. అట్టివారు గూడ చక్కనిస్త్రీల మోముఁదమ్మిని జూడఁగానే మరునికి లోఁబడి వలపునొందిరి. పెరుఁగు, పాలు, నెయ్యి చేర్చి వరియన్నమును దినుమానవుల కింద్రియనిగ్రహంబు గలిగెనేని, వింధ్యపర్వతము సముద్రమునఁ దేలును. పర్వతము తేలుట యెట్లసంభావ్యమో అట్లు మానవుల కింద్రియనిగ్రహము కలుగుట దుస్తరమని భావము.

చ. వనదళవాతముల్ మెసవుచువారు పరాశరకౌశికాదు లా
ఘనులును సుందరీజనులఁ గన్గొని మోహితచిత్తు లైరి హె
చ్చిన ఘృతపాయసాన్నము భుజించెడివారలకుం మనోజయం
బు నెగడునేని వింధ్యము సముద్రజలంబులఁ దేలియాడదే.

ఇది శృంగారశతకంబున సువిరక్త దుర్విరక్తపద్ధతులను
నాలుగవ వింశతి.

---

## ఋతువర్ణనపద్ధతి

ఆవ. వసంతర్తువు రాఁగానే, కామోద్దీపకవస్తుప్రాదుర్భావము కలుగు నని చెప్పుచున్నాఁడు.—

శ్లో. పరిమళభృతో వాతాః శాఖా నవాఙ్కురకోటయో
మధురవిరుతోత్కణ్ఠాభాజః ప్రియాః పికపక్షిణామ్,
విరళవిరళస్వేదోద్గారా వధూవదనేన్దవః
ప్రసరతి మధౌ ధాత్ర్యాం జాతో న కస్య గుణోదయః. 81

వ్యా.—ప్రాసఙ్గికం పరిసమాప్య ప్రస్తుతశృఙ్గారోపయోగితయా ఋతువర్ణనం ప్రారిప్సుస్తదాదౌ లోకవేదయోః ప్రాథమ్యేన వ్యవహారాద్వసన్తం వర్ణయతి పరిమళేత్యాదిభిః షడ్భిః—పరిమళే ఇతి.—వాతాః ఉపవనపవనాః, పరిమళం బిభ్రతీతి పరిమళభృతః - వివిధకుసుమసమ్మర్దజనితవిశేషబన్ధురాః - జాతా ఇతి శేషః, ని. 'విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే' ఇత్యమరః. శాఖాః రసాలాదితరుస్కన్ధాః నవాఙ్కురాణి నూతనకిసలయాని-కోటిష్వగ్రేషు-యాసాం తాస్తథోక్తాః - పల్లవితా జాతా ఇత్యర్థః. పికపక్షిణాం పికాఖ్యపక్షివిశేషాణాం, ప్రియాః కోకిలాఙ్గనా ఇత్యర్థః. ని. 'కోకిలః పిక ఇత్యపీ' త్యమరః. మధురా సహకారాఙ్కురకషాయాస్వాదలాభాత్సగుణా-విధురా కాకకృతోపద్రవవశా ద్విగుణా చ-కష్టేతి యావత్-యా ఉత్కణ్ఠా-కూజితౌత్సుక్యం-తాం భజన్తీతి తథోక్తా - జాతాః - 'భజోణ్విః' ఇతి ణ్విప్రత్యయః. ని. 'విదురస్స్యాత్కష్ట విశ్లిష్టయో రపి' ఇతి విశ్వః. వధూనాం - వదనేన్దవో వక్త్రచన్ద్రాః, విరళవిరళాః గ్రీష్మాతిరేకాభావా న్మన్దప్రకారాః 'ప్రకారే గుణవచనస్య' ఇతి సాదృశ్యార్థే ద్విర్భావః. స్వేదోద్గారః శ్రమజలనిష్యన్దో-యేషాం తే తథోక్తా జాతాః - అత్రోద్గారశబ్దస్య గౌణవృత్తిసమాశ్రయణాన్న గ్రామ్యకత్వ్యామధ్యపతితత్వమిత్యుక్తం ప్రాక్, తథాహి-ధాత్ర్యాం భువి, మధౌ వసన్తే, ప్రసరతి వ్యాప్రియమాణే సతి, కస్య వస్తునో, గుణోదయో గుణో

త్కర్షో, న జాతః, సర్వస్యాపి జాయత ఏవేత్యర్థః. * 'గత్యర్థాకర్మక' ఇత్యాదినా వర్త మానే కర్తరి క్తప్రత్యయః. *'మతి బుద్ధి పూజార్థేభ్యశ్చ'ఇతి చకారాత్ వర్తమానతా. ని. 'అథ పుష్పరసే మధు చైత్యే వసన్తే చైత్రే చ' ఇతి విశ్వప్రకాశః. హరిణీవృత్తమ్.

టీ. వాతాః = వాయువులు, పరిమళభృతః = పరిమళమును, భరించునవి = (అయినవి); శాఖాః = కొమ్మలు, నవ ..కోటయః-నవ = క్రొత్త, అంకుర = (చిగుళ్ల) మొలకలయొక్క, కోటయః = కొనలుగలవి (అయినవి); పికపక్షిణాం = కోయిలపిట్టలయొక్క, ప్రియాః=ప్రియురాండ్రు. మధుర...భాజః-మధుర=తియ్యని, విరుత = ధ్వనులయందు, ఉత్కంఠా = కోరికను, భాజః = పొందినవి (అయినవి); వధూ...న్దవః-వధూ = స్త్రీలయొక్క, వదనఇందవః=ముఖచంద్రులు, విరళ...ద్గారాః-విరళవిరళ=కొంచెము, స్వేద = చెమటయొక్క, ఉద్గారాః = పొటమరించుటగలవి (అయినవి): ధాత్ర్యాం = భూమియందు, మధౌ = వసంతఋతువు, ప్రసరతి సతి = జరుగుచుండఁగా, కస్య = దేనికి, గుణఉదయః = గుణములయొక్క ఆవిర్భావము, న జాతః = కలుగదు. (లోకమునకంతకు గలుగు ననుట.)

తా. వసంతర్తువు వచ్చినంతనే యేవస్తువు గుణసహితముగా నుండదు ? సకలవస్తువులు రమ్యములై యుండును. వాయువులు కమ్మని తావి గలిగి వీఁచుచుండును. కొమ్మలకొనలందుఁ జిగుళ్లు చిగిరించుచుండును. కోకిలములు చెవుల కింపుగఁ గూయుటయం దాస గలిగి యుండును. రాత్రులందు అతివల చంద్రబింబములంబోలు ముఖముల నుండి సురతమువలని చెమట స్వల్పముగాఁ గాఱుచుండును.

చ. వలపువహించె గంధగిరివాతపరంపర భూరిభూజశా
ఖలు చిగిరించె నింపెసఁగెఁ గాకలి కోకిలలందుఁ జెక్కులం
బలుచని ఘర్మబిందువులు భామలకుం బ్రసరించె నెయ్యెడం
జెలువు ఘుంటిపఁ జాలదు విశేషవసంతసమాగమం బిలన్.

శ్లో. మధురయం మధురై రపి కోకిలా
కలకలై ర్మలయస్య చ వాయుభిః,
విరహిణః ప్రహిణ స్తి శరీరిణో
విపది హ న్త సుధాఽపి విషాయతే. 82

వ్యా.—మధురితి.—అయం పూర్వోక్తో, మధుర్వసన్తః - సకలచరాచరోల్లాసకర ఇతి భావః. మధురైః శ్రావ్యైస్సంతాపహరైర్వా - 'శీతలీక్రియతే తాపో యేన త న్మధురం స్మృతమ్' ఇతి లక్షణాత్, కోకిలానాం, పికసున్దరీణాం-కలవైరవ్యక్తమనోహరైః స్వరవిశేషైః-ని. 'కాకలీతు కలే సూక్ష్మే ధ్వనౌ తు మధురాస్ఫుటే, కలః' ఇత్యమరః. కోకిలేత్యత్ర జాతిగ్రహణేఽపి. 'కోకిలా జాతా' వపి' ఇతి న జీష్. తథా మలయస్య వాయుభిః శ్రీఖణ్డశైలానిలైశ్చ - అత్యన్తసుఖావహైరపీతి భావః. విరహిణః శరీరిణః వియోగిజనాన్, ప్రహిణస్తి వినాశయతి, తథాహి—విపది ఆపత్కాలే, సుధా అమృత మపి, విషాయతే విషమివాచరతి - తద్వత్ప్రాణప్రయాసకరీ భవతీత్యర్థః *'ఉపమానా దాచారే' ఇతి క్యచ్. * 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః' ఇతి దీర్ఘః. హన్తేతి విషాదే. ని. 'హన్త హర్షేఽనుకమ్పాయాం వాక్యారమ్భవిషాదయోః' ఇత్యమరః.

సామాన్యేన విశేషణసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః; స చ విషాయతే ఇత్యత్ర ఉపమయా అఙ్గేన సఙ్కీర్యతే. అనుప్రాసశ్శాబ్దః. ద్రుతవిలమ్బితవృత్తమ్.

టీ. అయం = ఈ, మధుః = వసంతము, మధురైః = తియ్యని, కోకిలాకలకలైః= ఆఁడుకోయిల కలకలధ్వనులచేత, మలయస్య వాయుభిశ్చ = మలయమారుతములచేతను, విరహిణః = ఎడఁబాటు గలిగిన, శరీరిణః = జనులను, ప్రహిణస్తి= మిక్కిలి బాధపెట్టు చున్నది, హన్త=అయ్యో!, విపది = ఆపదయందు, సుధాఅపి = అమృతము సైతము, విషాయతే = విషమువలె నగును.

తా. ఈవసంతర్తువు చెవుల కింపయినకోకిలముల యవ్యక్తము లగు కూతలచేతను, మలయమారుతములచేతను విరహులగు జనులను జంపుచున్నది. అక్కటా! చెడుకాలంబున నమృతంబును విష మగును.

తే. నిండుకొని వచ్చుఁగందపుఁగొండచల్ల
గాలియును బికకాకలీకారవంబు
విరహిజనుల వధించె నవ్వేళఁ గాన
నమృతమును విషమగు విపత్ప్రాప్తియందు.

శ్లో. ఆవాసః కిలికించితస్య దయితాః పార్శ్వే విలాసాలసాః
కర్ణే కోకిలకామినీకలరవః స్మేరో లతామణ్డపః,
గోష్ఠీ సత్కవిభిః సమం కతిపయైర్ముగ్ధాః సితాంశోః కరాః
కేషాంచిత్సుఖయన్తి చాత్ర హృదయం చైత్రే విచిత్రాః ప్రజః. 83

వ్యా.—విరహిణామేవ కృచ్ఛ్రం, న త్వన్యేషా మిత్యాహ—ఆవాస ఇతి - పార్శ్వే పరిసరే, కిలికిఞ్చితస్య, 'రోషాశ్రుహర్ష భీత్యాదేస్సఙ్కరః కిలకిఞ్చితమ్' ఇత్యుక్త లక్షణ శృఙ్గారచేష్టావిశేషస్యావాసో నివాసభూతః - అత్రాధారమాత్రవివక్షయైకవచన గ్రహణమితి వివేకః. తథా, విలాసాలసాః లీలామన్థరాః - కటాక్షభుజాక్షేపాది వివిధ విభ్రమాచరణతత్పరా ఇత్యర్థః. ఏతేనైతాసాం స్మరమన్దీకృతప్రౌఢత్వాత్ప్రాగల్భ్యం సూచ్యతే, దయితాః ప్రియతమాశ్చ, కర్ణే కర్ణయోరిత్యర్థః. * 'స్తనాదీనాం ద్విత్వ విశిష్టా జాతిః ప్రాయేణ' ఇతి వామనసూత్రే ప్రాయగ్రహణాదేకవచనప్రయోగః. కోకిల కామినీనాం కలకణ్ఠాఙ్గనానాం - కలవరః అవ్యక్తమధురస్వరశ్చ, స్మేరః ఈషద్వికసిత కుసుమ ఇత్యర్థః. అత్ర కుసుమధర్మః కుసుమితే ఉపచర్యతే * 'ష్మిఙ్ ఈషద్ధసనే' ఇతి ధాతోః * 'నమి కమ్పి' ఇత్యాదినా కప్రత్యయః. లతామణ్టపో లతాగృహం చ, కతి పయైః కైశ్చిదేవ - అన్యథా రసాభాసాత్, సత్కవిభిస్సరసవిచిత్రచారుప్రబన్ధప్రణయన చతురతరకవీశ్వరైః, సమం, గోష్ఠీప్రసఙ్గశ్చ, ముగ్ధా మనోహరాః, సితాంశోః కరా శ్చన్ద్రకిరణాశ్చ, విచిత్రాః నానావిధాః, స్రజః పుష్పమాలికాశ్చ, అత్ర అస్మిన్, చైత్రే వసన్తే, కేషాంచిత్ అన్యేషామేవేత్యర్థః. హృదయం సుఖయన్తి రఞ్జయన్తి - న సర్వేషా మిత్యర్థః. ఈదృక్సౌభాగ్యసంపన్నానాం విరళత్వాదితి భావః.

అత్ర ఖలేకపోతన్యాయాద్దయితాది బహుకారణానాం హృదయరఞ్జన రూపైక కార్యసాధనసముద్యోగకథనాద్ద్వితీయసముచ్చయాలఙ్కారః. తదుక్తం విద్యానాథేన.—

'ఖలే కపోతన్యాయేన బహూనాం కార్యసాధనే,
కారణానాం సముద్యోగస్స ద్వితీయస్సముచ్చయః.' ఇతి.

శార్దూల విక్రీడితమ్.

టీ. పార్శ్వే = ప్రక్కను, కిలికించితస్య = (కోపము, సంతోషము, భయము, మున్నగుదళ లొక్కసారియే కలిగెడి యొకానొక) శృంగారచేష్టకు, ఆవాసః = ఉనికి పట్టును, విలాసాలసాః-విలాస = ఒయ్యారముచే, అలసాః = మందగించినవారును, (అగు), దయితాః = ప్రియురాండ్రు, కర్ణే=చెవియందు, కోకిల...రవః = కోకిలకామినీ = ఆడు కోయిలలయొక్క, కల=అవ్యక్తమధురము లయిన, రవః = ధ్వనియు, స్మేరః = వికసించిన, లతామంటపః = పొదరుటిల్లును, కతిపయైః = ఒకకొందఱు, సత్ కవిభిః సమం = మంచి కవులతోఁగూడ, గోష్ఠీ=సల్లాపమును, ముగ్ధాః=మనోహరములైన, సితాంశోః = చంద్రుని

యొక్క, కరాః=కిరణములును, విచిత్రాః=పెక్కువన్నెలుగల, స్రజః=(పూల) దండలును, అత్ర = ఈ, చైత్రే = వసంతమునందు, కేషాంచిత్ = కొందఱియొక్క, హృదయం = మనస్సును, సుఖయంతి = సుఖపెట్టును.

తా. దయితలవెంబడిఁ గొంచెమునేపు క్రీడించి పరుండుట చేతను, చెవులకింపగు నాఁడుకోయిలలపాటలను వినుటచేతను, చక్కఁగాఁ బూచిన తీఁగెలయిండ్లయం దుండుటచేతను, గొందఱు కవులతోడ ముచ్చట లాడుటచేతను, వెన్నెలలందుఁ బరుండుటచేతను గొందఱు మాత్రము వసంతర్తువునందు రాత్రులందు సుఖముల ననుభవించు చుందురు.

చ. ఘనకిలికించితప్రచురకాంతలు చెంతఁ బికాంగనాకల
స్వనములు వీనులందు సుమశాలి నికుంజము పుష్పమాల్యముల్
వినుతకవిప్రసంగమును వెన్నెలతేటలు భాగ్యవంతులా
జనులకుఁ జైత్రమాసమునసౌఖ్య మొనర్చు సుగంధితోయముల్.

శ్లో. పాన్థస్త్రీవిరహానలాహుతికలామాతన్వతీ మఞ్జరీ
మాకన్దేషు పికాఙ్గనాభిరధునా సోత్కణ్ఠమాలోక్యతే,
అప్యేతే నవపాటలాపరిమలప్రాగ్భారపాటచ్చరా
వాన్తి క్లాన్తివితానతానవకృతః శ్రీఖణ్డశైలానిలాః. 84

వ్యా.—పాన్థస్త్రీతి.—అధునేదానీమ్, వసన్తసమయ ఇత్యర్థః. పాన్థస్త్రీణాం ప్రోషితభర్తృకాణాం, విరహానలస్య వియోగాగ్నేః - ఆహుతికలాం ఆహుతి కలనామ్ తత్సామ్య మిత్యర్థః. 'కలా శిల్పే కాలభేదే చన్ద్రాంశే కలనా కలా' ఇతి వైజయన్తీ. ఆతన్వతీ ఆదధానా తద్వృద్ధిపికేత్యర్థః. తనోతేశ్శతరి * 'ఉగితశ్చే'తి జీప్. మాకన్దేషు రసాలవిశేషేషు - విద్యమానేతి శేషః. మఞ్జరీ - పుష్పమఞ్జరీ, పికాఙ్గనాభిః కోకిలాభిః, సోత్కణ్ఠమాలోక్యతే సానన్ద ముద్వీక్ష్యతే - ఇష్టత్వాదితి భావః. తథా పాటలా ఫలేరుహాఖ్య వృక్షవిశేషః-ని. 'పాటలిః పాటలా మోఘా కాచ స్థాలీ ఫలేరుహా' త్యమరః* 'పుష్పమూలేషు బహుళమ్' ఇతి లుపి * యుక్తవద్వ్యక్తి వచనే భవతః-నవపాటలా పరిమళ ప్రాగ్భారస్య నూతన పాటలీకుసుమగన్ధసంపత్తేః- పాటచ్చరా మలిమ్లుచాః తద్గన్ధాపహారిణ ఇత్యర్థః. తథా క్లాన్తివితానస్య క్లాన్తిసమూహస్య - తానవం తనుత్వం - కుర్వన్తీతి క్లాన్తివితానతానవకృతః * కరోతేః క్విప్, అప్యేతే మన్దాః, తే ప్రసిద్ధా శైత్యమాన్ద్యసౌరభ్యయుక్తాః, శ్రీఖణ్డశైలానిలా మలయ

మారుతాః, వాన్తి ప్రసరన్తి* 'వాగతిగన్ధనయోః' ఇతి ధాతోర్లట్. ఏతేన విరహిణాం దురన్తదుఃఖజనకత్వం సంయుక్తానాం పరమానన్దకత్వం చాస్యోక్తమిత్యవగన్తవ్యమ్.

అత్ర వియోగాగ్నిరిత్యత్ర రూపకమ్; ఆహుతికలామిత్యత్రోపమయా సాపేక్షత్వాత్సంకీర్ణం సచ్ఛాబ్దేనానుప్రాసేన సంకీర్యతే. వృత్తం పూర్వవత్.

టీ. అధునా = ఇప్పుడు, పాంథ...కలాం-పాంథస్త్రీ = బాటసారుల పెండ్లాల యొక్క (అనఁగా: భర్తృవియోగమునొందినవారియొక్క యనుట), విరహానల = ఎడఁబాటుఅనెడి నిప్పుయొక్క, ఆహుతికలాం = హవిస్సుయొక్కపనిని, ఆతన్వతీ = చేయుచున్నదై (అనఁగా: హవిస్సు వంటిదై యనుట) మాకందేషు = తియ్యమామిడిచెట్ల యందలి, మంజరీ = పూగుత్తి, పికాంగనాభిః = ఆఁడుకోయిలలచేతను, సఉత్కంఠం = ప్రేమతో, ఆలోక్యతే=చూడఁబడుచున్నది. నవ = క్రొత్త, పాటలా = కలిగొట్టు పూల యొక్క, పరిమళ = వాసనయొక్క, ప్రాగ్భార = మొత్తముయొక్క, పాటచ్చరాః = దొంగలును, క్లాంతి...కృతః-క్లాంతి=బడలికలయొక్క, వితాన = సమూహముయొక్క, తానవ=అల్పత్వమును, కృతః=చేయునవియు, అల్పాః=మందములును, (అగు), తే=ఆ, శ్రీ...నిలాః-శ్రీఖండశైల=మలయపర్వతముయొక్క, అనిలాః = వాయువులు, వాన్తి = వీచుచున్నవి.

తా. ఈవసంతర్తువునందు బాటసారుల యత్రివల విరహ మనెడు నగ్నియందు వేల్చెడి హోమద్రవ్యమో యనఁదగియుండు మామిడి చిగుళ్ళను ఆఁడుకోయిలలు తమితోఁ జూచుచున్నవి. మఱియు మలయ మారుతములు క్రొత్తగాఁ బూచిన శిరీషపుష్పముల నెత్తావిని జూఱ కొనుచు నలసటను దీర్చునట్టివై వీచుచున్నవి.

చ. వరలు వియోగినీవిరహవహ్నికి నాహుతిలీలఁ బొల్చు భా
సురసహకారమంజరులఁ గి జూచి మదించెఁ బికంబు లిత్తఱిఁ
సురతపరిశ్రమాతిశయసూదనముల్ విహరించెఁ బాటలీ
పరిమళభారచోరములుబంధురచందనశైలవాతముల్.

శ్లో. ప్రథితః ప్రణయవతీనాం తావత్పదమాతనోతు హృది మానః,
భవతి న యావచ్ఛన్దనతరుసురభిర్మలయపవమానః. 85

వ్యా.— ప్రథిత ఇతి.— ప్రథితః ప్రసిద్ధః దృఢతర ఇతి యావత్, మానః ప్రియతమస్యాన్యస్త్రీసక్తిత్వజనితేర్ష్యాకృతకోపః—

'స్త్రీణామీర్ష్యాకృతః కోపో మానోఽన్యాసఙ్గిని ప్రియే,
శ్రుతే వానుమితే దృష్టే' ఇతి దశరూపకే.

ప్రణయవతీనాం ప్రియతమానాం హృది, తావత్తావత్పర్యన్తం, పదం స్థానం, ఆతనోతు కరోతు-తిష్ఠత్విత్యర్థః'.*సమ్భావనాయాం లోట్. ని. 'పదం వ్యవసితత్రాణస్థానలక్ష్మాఙ్ఘ్రి వస్తుషు' ఇత్యమరః. కియత్పర్యన్తమిత్యత ఆహ—చన్దనతరుసురభి, శ్రీఖణ్డద్రుమపరిశీలన సుగన్ధిః. 'సుగన్ధౌ చ మనోజ్ఞే చ సురభిర్వాచ్యలిఙ్గవత్' ఇతి విశ్వః. మలయపవమానో మలయమారుతః, యావత్పర్యన్తం న భవతి న ప్రసరతి. తావదితి సంబన్ధః. సామాన్యస్య విశేషపర్యవసానాత్ప్రసరణార్థత్వం భువో ద్రష్టవ్యమ్. ని. 'యావత్తావచ సాకల్యేఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః. అస్యాత్యన్తోద్దీపకత్వాన్మానిన్యోఽతిదృఢమపి నిజమానం విహాయ ప్రియతమపరతన్త్రాః స్వయమేవ భవన్తీత్యర్థః. ఆర్యాభేదః.

టీ. చందనతరుసురభిః-చందనతరు = గంధపుఁజెట్లచేత, సురభిః = పరిమళించునట్టి మలయపవమానః = మలయమారుతము, యావత్ = ఎంతవఱకు, న భవతి = కలుగదో తావత్ = అంతవఱకు, ప్రణయవతీనాం = అనురాగము గలవారి (స్త్రీల) యొక్క, హృది=మనస్సునందు, ప్రథితః = ప్రసిద్ధమగు, మానః = (తన ప్రియుఁ డితరనాయికతో గూడినట్లు చూచికాని, వినికాని, యూహించికాని మిగుల నీర్ష్యనువహించుటచేఁగలిగిన) ప్రణయకోపము, పదం = ఉనికిని, ఆతనోతు = చేయునుగాఁక !

తా. లోకమున మగువలు దమభర్తలన్యకాంతలను గూడి రన్న యీసుచే, వారు తమకడకు వచ్చినను పెడమోము పెట్టి మాటలాడక బిఱ్ఱుగలిగి కోపముతో నుందురు. అట్టివారు చందనవృక్షములలోనుండి వీచుకమ్మనితావిగలదక్షిణపుగాలి సోఁకఁగానే మదనపరవశలై కోపము వీడి తమంతటఁ దామే ప్రియులకడ కేగుదురు.

తే. అంగజునిగంధసింధురం ౯ బనఁగఁ బరఁగు
మలయజసుగంధి మలయాద్రి ౯ మారుతంబు
మలయ దెందాఁక నందాక ౯ మానవతుల
మానపంబుల నెలకొని ౯ మాన మమరు.

శ్లో. సహకారకుసుమ కేశరనికరభరామోదమూర్ఛితదిగంతే,
మధురమధువిధురమధుపే మధౌ భవేత్కస్య నోత్కణ్ఠా. 86

వ్యా.—సహకారేతి.—సహకారకుసుమానాం రసాలవిశేషప్రసూనానామ్-ని. 'ఆమ్రశ్చూతో రసాలోఽసౌ సహకారోఽతిసౌరభః' ఇత్యమరః. యే కేసరనికరాః కిఞ్జల్కపుఞ్జాః - తేషాం యే భరాస్సమృద్ధయః - తేషా - మామోదేన పరిమళవిశేషేణ-మూర్ఛితా వ్యాప్తా-దిగన్తా యస్మిన్ తస్మిన్, మధురేణ మాధుర్యగుణయుక్తేన-మధునా మకరన్దేన-విధురా విహ్వలా ఉన్మత్తా ఇతి యావత్-మధుపా భృఙ్గా యస్మిన్ తస్మి, న్నిత్థమస్యోక్తముద్దీపకత్వమిత్యర్థః. మధౌ వసన్తే, కస్య జనస్య స్త్రియో వా పురుషస్య వేత్యర్థః. ఉత్కణ్ఠా సంభోగౌత్సుక్యం, న భవేన్నోత్పద్యేత? అతస్సర్వస్యాపి ఉత్పద్యేత ఏవేత్యర్థః. అతో మానత్యాగో యుజ్యత ఇతి భావః. అనుప్రాసః శబ్దాలంకారః. వృత్తం పూర్వవత్.

టీ. సహ...దిగన్తే-సహకార=తియ్యమామిడి,కుసుమ=పువ్వులయొక్క, కేసరనికరభర=కింజల్కసమూహముల బరువుల, ఆమోద=సువాసనలచే, మూర్ఛిత = ఆక్రమింపఁబడిన, దిక్ అన్తే=దిక్కులయొక్క కొనలు గలదియు, మధుర...మధుపే-మధుర=తీయని, మధు = మకరందముచేత, విధుర=మదించిన, మధుపే = తుమ్మెదలు గలదియు (అగు), మధౌ = వసంతఋతువునందు, కస్య=ఎవనికి, ఉత్కణ్ఠా = (సురతమునకు) ఇచ్ఛ, న భవేత్=కలుగదు.

తా. వసంతర్తువునందుఁ దియ్యమామిడిపూఁతయొక్క కింజల్కముల కమ్మనితావులు దిక్కులెల్ల వ్యాపించియుండును. తుమ్మెదలు పూఁదేనియలు గ్రోలుటయందు విసుఁగుచెందియుండును. ఇట్టి మనోహర మగు ఋతువునం దెవరి కాశ పుట్టకుండును? అందఱును వసంతకాలమునఁ బ్రేమతో వనంబుల సొంపుఁ జూచుచుందురు.

తే. సరససహకారకుసుమకేసరసమూహ
గురుతరామోదమయదిగంతరము మధుర
మధువిధురమధుపము మధుమాససమయ
మెవ్వనికి వేడ్క వాటింపకే దిజ్జగమునఁ.

అవ. గ్రీష్మర్తువును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. అచ్ఛాచ్ఛచన్దనరసార్ద్రతరా మృగాక్ష్యో
ధారాగృహాణి కుసుమాని చ కౌముదీ చ,
మన్దో మరుత్సుమనసః శుచి హర్మ్యపృష్ఠం
గ్రీష్మే మదం చ మదనం చ వివర్ధయన్తి. 87

వ్యా.—అథ త్రిభిర్గ్రీష్మం వర్ణయతి— అచ్ఛాచ్ఛేతి.—అచ్ఛాచ్ఛః స్వచ్ఛః - యశ్చన్దనరసః పటీరద్రవః - ని. 'గుణే రాగే ద్రవే రసః' ఇత్యమరః తేన - ఆర్ద్రతరా అత్యన్తార్ద్రా - సన్తాపశాన్త్యర్థం సాన్ద్రచన్దనపఙ్కచర్చితాఙ్గా ఇత్యర్థః. మృగాక్ష్యః తరుణ్యశ్చ, ధారాగృహాణి జలయన్త్రవేశ్మాని, కుసుమాని-మల్లికాదీని, కౌముదీ చన్ద్రికా చ, సుమనసో జాత్యాస్సంబన్ధీ గ్రీష్మకాలేఽతివికాస సమ్భవాత్, తత్కుసుమపరిశీలనజనితామోదభరిత ఇత్యర్థః. ని. 'సుమనా మాలతీ జాతిః' ఇత్యమరః. మన్దో మరుత్ మన్థరగన్ధవాహశ్చ, శుచి శుభ్రం-సుధాలేపేనేతి భావః. హర్మ్యపృష్ఠం సౌధోపరిప్రదేశ శ్చేతి, గ్రీష్మే ఋతౌ మదం- హర్షవ్యతికరం, మదనం చ, వివర్ధయన్తి ఉద్దీపయన్తి.

అత్రాపి ద్వితీయస్సముచ్చయాలఙ్కార ఊహ్నేయః. వసన్తతిలకావృత్తమ్.

టీ. అచ్ఛ...తరాః—అచ్ఛఅచ్ఛ = తెల్లతెల్లని, చన్దనరస = గంధపురసముచే, ఆర్ద్రతరాః=మిక్కిలితడిదైన, మృగాక్ష్యః=లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలును, ధారాగృహాణి = (నీటి) ధారలయిండ్లును, కుసుమానిచ = పుష్పములును, కౌముదీచ = వెన్నెలయును, సుమనసః=జాజియొక్క, మన్దమరుత్ = మెల్లనిగాలియు, శుచి = తెల్లనైన, హర్మ్యపృష్ఠం=మిద్దెయొక్క పైప్రదేశమును, గ్రీష్మే=వేసవికాలమున, మదం = హర్షమును, మదనంచ-మన్మథుని వివర్ధయన్తి = పెంచును.

తా. గ్రీష్మర్తువునందు నిర్మల మగు మేలైనచందనముఁ బూసి కొన్న వారలగు మచ్చెకంటులును, నీటిధారలు పడుయంత్రములు గలగృహములును, పుష్పములును, వెన్నెలయు, తిన్ననిగాలియు, జాజి పూవులు, వెల్లనైన మేటి యుప్పరిగలు ఇవియన్నియుఁ బురుషులకు మదమును, మన్మథవికారమును వృద్ధిచెందించుచున్నవి.

చ. అతిసితచందనార్ద్రరుచిరాంగులు భామినులుꣳ సుగంధసం
గత నగుమందమారుతముఁ గౌముదియుꣳ జలయంత్రగేహము
న్నతశుచి సౌధభాగము ఘనం బగువాసనఁ బూనుపుష్పసం
తతియు మదంబు దర్పకుని దర్పముఁ బెంపుగఁ జేయు వేసవిన్.

శ్లో. స్రజో హృద్యామోదా వ్యజనపవనశ్చన్ద్రకిరణాః
పరాగః కాసారో మలయజరజః సీధు విశదం,
శుచిః సౌధోత్సఙ్గః ప్రతను వసనం పఙ్కజదృశో
నిదాఘార్తా హ్యేతత్సుఖముపలభన్తే సుకృతినః. ౪౩

వ్యా.—స్రజ ఇతి.—హృద్యా మోదా మనోహరగన్ధాః, స్రజః పుష్పమాలికాశ్చ, వ్యజనపవనస్తాళవృన్తసమీరణశ్చ-ని. 'వ్యజనం తాళవృన్తక' మిత్యమరః. చన్ద్రకిరణాశ్చ, పరాగస్సుమనోరజశ్చ, కాసారః క్రీడాసరశ్చ, మలయజరజశ్చన్దనక్షోదశ్చ; విశదం నిర్మలం, శేరతే అనేనేతి శీధు మద్యం చ 'శీఙో ధుక్' ఇత్యౌణాదికో ధుక్ప్రత్యయః. శుచి శ్శుభ్రః విహారయోగ్య ఇత్యర్థః. సౌధోత్సఙ్గః - ప్రాసాదోపరిప్రదేశశ్చ, ప్రతను వసనం సూక్ష్మామ్బరం, పఙ్కజదృశః పద్మపలాశలోచనా, శ్చేత్యేతత్సర్వం భోగసాధనమ్ *-'నపుంసకమ్-' ఇత్యాదినా నపుంసకైకశేషః. నిదాఘర్తౌ గ్రీష్మర్తౌ* 'ఋద్గణః'ఇతి రపరో గుణః. విలసతి విజృమ్భమాణే సతి సుకృతినః పుణ్యశాలినః; లభన్తే ప్రాప్నువన్తి. కథ మసుకృతినామీదృగ్భోగసాధనలాభ ఇతి భావః. శిఖరిణీ.

టీ. హృద్య ఆమోదాః=మనోహరమగు సువాసనగల, స్రజః=పుష్పమాలికలును, వ్యజనపవనః=విసనకఱ్ఱలగాలియు, చన్ద్రకిరణాః=చంద్రుని వెలుంగులును, పరాగః=పువ్వులపుప్పొడియు, కాసారః=(క్రీడకుఁ దగిన) సరస్సును, మలయజరసః = గంధపుద్రవమును, విశదం=నిర్మలమైన, సీధు మద్యమును, శుచిః=శుభ్రమైన, (విహారమునకు యోగ్యమైన), సౌధ ఉత్సఙ్గ = మిద్దెయొక్క పైప్రదేశమును, ప్రతను = సన్నని, వసనం=వస్త్రమును, పఙ్కజదృశః = పద్మపత్రములవంటి కన్నులు గలస్త్రీలును, అను, ఏతత్ = దీనిని, నిదాఘఋతౌ=గ్రీష్మఋతువు, విలసతి సతి = విజృంభించుచుండఁగా, సుకృతినః = పుణ్యాత్ములు, లభన్తే=పొందుదురు.

తా. వేసవికాలంబున నెండకు డస్సి పుణ్యవంతులు కమ్మనివాసనగల పూలదండలను, విసనకఱ్ఱలగాలిని, చంద్రకిరణములను పుప్పొడిని, కొలఁకులను, స్వచ్ఛమగు మద్యమును, తెల్లని మేడల పైభాగములను, సన్ననిబట్టలను, కమలములంబోలు నేత్రములు గల స్త్రీలను వీనిని బొంది సుఖింతురు.

ఉ. కమ్మనిదండలున్ సురఁటిగాడ్పులు వెన్నెలయుం బరాగపుం
జమ్మును మంచిగందమును సన్నపువల్వలు సీధుపానముం
దమ్ముకొలంకు మేడయును దామరసాక్షు లనంగ నొప్పుభో
గమ్ములు పుణ్యవంతులకుఁ గాని లభింప వటంద్రు వేసవిన్.

శ్లో. సుధాశుభ్రం ధామ స్ఫురదమలరశ్మిః శశధరః
ప్రియావక్త్రామ్భోజం మలయజరసశ్చాతిసురభిః

స్రజో హృద్యామోదా స్తదిదమఖిలం రాగిణి జనే
కరోత్యన్తఃక్షోభం న తు విషయసంసర్గవిముఖే. ౬౯

వ్యా.—సుధేతి—సుధయా లేపనద్రవ్యేణ శుభ్రమ్, యద్వా సుధా అమృతం తద్వచ్ఛుభ్రమ్-'సుధా స్యాల్లేపనద్రవ్యేఽమృతే చ' ఇతి విశ్వః. అతిసురభి అత్యన్తసుగన్ధి, రాగిణి విషయాసక్తే, విషయసంసర్గవిముఖే విరక్తే - విరక్తస్య తేషామకిఞ్చిత్కరత్వాదితి భావః. నిగదిత వ్యాఖ్యాన మన్యత్. వృత్తం పూర్వవత్.

టీ. సుధాశుభ్రం=గచ్చుపూయుటచే తెల్లనైన, ధామ = ఇల్లు, స్ఫురత్ అమల రశ్మిః=ప్రకాశించు తెల్లని కిరణములు గల, శశధరః=చంద్రుఁడు, ప్రియావక్త్రఅమ్భోజం=కాంతయొక్క మోముఁ గమలము, అతిసురభిః=మిక్కిలి సుగంధి యగు, మలయజరసః=గంధపుద్రవము, హృద్యఆమోదాః=మనోహరమగు సువాసనగల, స్రజః=పుష్పమాలికలు, అను, తత్ ఇదమ్ అఖిలం=ఆ యీసర్వమును, రాగిణి=విషయాసక్తుఁడగు, జనే=మనుష్యునికి, అన్తః క్షోభం = మనస్సునందు కలవరమును, కరోతి = చేయును, విషయసంసర్గవిముఖేతు=విరక్తునికన్ననో, (న కరోతి)=చేయదు.

తా. సున్నపుఁబూతచేఁ దెల్లనైనయిల్లును, వెలుఁగు చున్న వెల్లనైన కిరణములు గల చంద్రుఁడును, ప్రియురాలియొక్క కమలముం బోలు ముఖమును, మిక్కిలి పరిమళించుచున్న గంధపుఁబొడియు, మనోహరమగు వాసన గల పూవులదండలు ఇవియన్నియు సంసారసక్తి గలవారికి మనంబున గలవరమును గలిగించునుగాని, విషయసుఖములందపేక్షలేనివారి కెట్టిహానియుఁ జేయఁజాలవు.

తే. కలువచెలియును బూవుదండలును మంచి
గందమును గేళిసౌధంబుఁ గలికిమోముఁ
గాముకునకు వికారంబుఁ గలుగఁజేయుఁ
గలఁక వాటింప వెపుడు నిష్కామునకును.

అవ. వర్షర్తువును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. తరుణీవైషా దీపితకామా వికసితజాతీపుష్పసుగన్ధిః,
ఉన్నతపీనపయోధరభారా ప్రావృట్ తనుతే కస్య న హర్షమ్. ౭౦

వ్యా.—అథ వర్షాసమయ వర్ణనమారభతే—తరుణీతి.—ఉద్దీపిత ఉత్పాదితః - కామో మన్మథః సురతాభిలాషో వా-యయా సా తథోక్తా, వికసన్తి వికస్వరాణి-యాని

జాతీపుష్పాణి తైః-శోభనో ,గన్ధో యస్యాస్సా తథోక్తా-ఏకత్ర జాతీకుసుమవికాస సంభవాత్-అన్యత్ర తత్కుసుమాలంకృతత్వాచ్చేతి భావః.* 'గన్ధస్యేదుత్పూతి సు సురభిభ్యః' ఇతి గన్ధశబ్దస్య ఇకారోఽన్తాదేశః, యద్యపి 'గన్ధశబ్దస్యేత్వే తదేకాన్తగ్రహణమ్' ఇత్యుక్తమ్.తథాఽపి కవీనాం నిరఙ్కుశత్వాత్పర్యనుయోగః, ఉన్నత ఉత్తుఙ్గః - పీనః పీవరశ్చ - పయోధరభారోఽమ్భోధరబృన్దం చ - అన్యత్ర స్తనభరశ్చ - యస్యాః సా తథోక్తా-ని. "స్తనాఽమ్భోధౌ పయోధరౌ" ఇతి వైజయన్తీ. అత ఏవ తరుణ్యా వేష ఇవ వేషో యస్యాః సా కామినీవ మోహనకారిణీత్యర్థః. ప్రావృడ్ వర్షాః. కస్య పుంసో హర్షం సంభోగోత్సుకం, న తనుతే సర్వస్యాపి తనుత ఏవేత్యర్థః. శ్లేషానుప్రాణితేయ ముపమా.

టీ. దీపితకామా=రేపఁబడిన కామము గలదియును, విక...గన్ధిః-వికసిత=వికసించిన, జాతీపుష్ప=జాజిపువ్వులచే, సుగన్ధిః=సువాసనగలదియు, ఉన్నత=పొడవై, పీన=బలసిన, పయోధర=మేఘములయొక్క, (అని వర్షాకాలపరము) పాలిండ్లయొక్క, (అని తరుణీ పరము) భారా=బరువు గలదియును (అగు) ఏషా ప్రావృట్ = ఈ వర్షఋతువు, తరుణీ ఇవ=మోహనకారిణివలె, కస్య = ఎవనికి, హర్షం = సంభోగసంతోషమును, న తనుతే = చేయదు.

తా. కామమును వృద్ధిచేయునదియు, పూచిన జాజిపూవుల కమ్మనితావిగలదియు, ఎత్తైన గొప్పపయోధరములు గలదియు, (స్త్రీ పక్షమున గబ్బిగుబ్బలుగలదియు) నైన వర్షర్తువు జవరాలివలె నెవరికి సంతసమును గలిగింపదు.

క. కామోద్దీపకయు సము
ద్ధామపయోధరవిరాజితయు జాతిసుమ
స్తోమసుగంధియు నై స
ర్వామోద మొనర్చెఁ బ్రావృడంగన భళిరే.

శ్లో. వియదుపచితమేఘం భూమయః కన్దలిన్యో
నవకుటజకదమ్బామోదినో గన్ధవాహాః,
శిఖికులకలకేకారావరమ్యా వనాన్తాః
సుఖినమసుఖినం వా సర్వముత్కణ్ఠయంతి. 91

వ్యా.—వియదితి—ఉపచితాః పరిచితా - మేఘా యస్మిం స్త త్తథోక్తమ్ ఘనాఘనసంచారవదిత్యర్థః. వియత్ ఆకాశం చ, కన్దలాని అఙ్కురాణి ఆసాం

సన్తీతి కన్దలిన్యో, భూమయో భూప్రదేశాశ్చ, నవో నూతనః-కుటజానాం గిరిమల్లికానాం కదమ్బానాం నీపకుసుమానాం చ-ఆమోదో గన్ధవిశేషః విషామస్తీతి తథోక్తా గన్ధవాహాః ఉద్యానపవనాశ్చ-ని. 'కుటజో గిరిమల్లికా' ఇత్యమరః కే మూర్ధ్ని కాయన్తి ధ్వనయన్తి కేకా మయూరవాణ్యః. ని-'కేకా వాణీ మయూరస్య' ఇత్యమరః. శిఖికులానాం మయూరనికరాణాం-యాః కలకేకారావాఅవ్యక్తమధురకేకాస్వరా-స్తైరమ్యా మనోహరా, వనాన్తాశ్చ కేళీవనమధ్యప్రదేశాశ్చ, సుఖినం దుఃఖినం వా, సర్వమ్ అశేషం జనమ్, ఉత్కణ్ఠయన్తి సంభోగౌత్సుక్యవన్తం కుర్వన్తీత్యర్థః. ఉద్దీపకత్వాదితి భావః. ఉత్కణ్ఠాశబ్దాత్ * తత్కరోతి-' ఇతి ణ్యన్తాల్లట్. మాలినీ.

టీ. ఉపచితమేఘం=దట్టమైన మబ్బులు గల, వియత్=ఆకసమును, కన్దళిన్యః = అంకురములుగల, భూమయః=భూప్రదేశములును, నవ... మోదినః—నవ=క్రొత్తలైన, కుటజ=కొండమల్లెలయొక్కయు, కదమ్బ = నీపపుష్పములయొక్కయు, ఆమోదినః= సువాసనలు గల, గన్ధవాహాః = ఉద్యానవాయువులును, శిఖి...రమ్యాః-శిఖికుల=నెమళ్ల సమూహములయొక్క, కల=అవ్యక్త మధురమైన, కేకారవ=కూఁతలయొక్క ధ్వనిచే, రమ్యాః=మనోహరములగు, వన అన్తాః=అడవిమధ్యప్రదేశములును, సుఖినం=సుఖపురుషుని, అసుఖినంవా=సుఖపరాఙ్ముఖునిగాని, సర్వం=అందఱను, ఉత్కణ్ఠయన్తి=కామాతురులుగఁ జేయుచున్నది.

తా. దట్టము లయిన మబ్బులతోఁ గూడిన యాకసంబును, పుట్టకొక్కులతోఁ గూడిన పొలములును, అప్పుడే పూచిన యడవిమల్లెపూలకావితోఁ గూడి వీచెడువాయువులును, నెమళ్లగుంపుల యింపగు కూఁతలతోఁగూడి మనోహరంబులై యుండువనప్రదేశములును, ఈవస్తువులు సుఖవంతునినైనను, దుఃఖవంతునినైనను అందఱిని సంతోషపఱచును.

చ. జలధరమాలికాఖచితచారునభంబు నవాంకురప్రభా
లలితమహీతలంబును గళస్వనకేకికులోల్లసద్వన
స్థలములు జాతినీపకుటజస్ఫుటగంధిలగంధవాహముల్
నెలకొని యెల్లవారలకు నిండుముదంబు ఘటించె నత్తఱిన్.

అవ. ప్రియలం బాసినబాటసారులదశను వర్ణించుచున్నాఁడు:—

శ్లో. ఉపరి ఘనం ఘనపటలం తిర్యగ్గిరయోఽపి న_ర్తితమయూరాః,
క్షితిరపి కన్దళధవళా దృష్టిం పథికః క్వ పాతయతి.

వ్యా.—ఉపరీతి—ఉపరి ఉపరిష్టా ద్ఘనం సాన్ద్రం, ఘనపటలం మేఘబృన్దమ్, వర్తత ఇతి శేషః. ని. 'ఘనాః కఠిన సఙ్ఘాత మేఘకాఠిన్య ముద్గరాః' ఇతి వైజయన్తీ. తిర్యగ్ దిక్షు ఇత్యర్థః. మయూ్యమతిశయేన రమన్త ఇతి మయూరాః * పృషోదరాదిత్వా త్సాధుః, నర్తితా నృత్యన్తః స్వార్థే ణిచి * 'గత్యర్థాకర్మక -' ఇత్యాదినా వర్తమానే కర్తరి క్తః. * 'మతిబుద్ధి-' ఇతి వర్తమానతా - యద్వా నర్తితా మేఘబృన్దేన నాటితాః- మేఘోదయే తేషాం ఉల్లాసవశేన నాట్యసంభవాత్-తథా భూతా మయూరా యేషు తే తథోక్తా, గిరయోఽపి, వర్తన్త ఇతి శేషః. క్షితిరపి భూమిరపి, కన్దలై ర్నానావిధా ఙ్కురై - ర్ధవలా స్వచ్ఛా, అతః పన్థానం గచ్ఛతీతి పథికః పాన్థః* 'పథష్కన్', ఇతి ష్కన్ప్రత్యయః. దృష్టిం, క్వ కుత్ర, పాతయతి ప్రసారయతి? న కుత్రా పీత్యర్థః. సర్వత్రాప్యుద్దీపనసంభవాదితి భావః. మహత్కష్టమత్ర విరహిణామితి పరమార్థః. ఆర్యాభేదః.

టీ. ఉపరి=పైభాగమునందు, ఘనం = సాన్ద్రమైన, మేఘపటలం = మేఘసమూహము, తిర్యక్ = నలుదిక్కులయందు, నర్తితమయూరాః = ఆడింపఁబడిన నెమళ్లుగల, గిరయః అపి=పర్వతములును (ఉన్నవి), క్షితిరపి = భూమియును; కన్దళధవళా = అంకురములచేఁ దెల్లనిది; పథికః=పాంథుఁడు, దృష్టిం=చూపును, క్వపాతయతి=ఎక్కడప్రసరింపఁ జేయును.

తా. మేఘములు నెమళ్లు పుట్టగొడుగులు మొదలగునవి విరహులకుఁ గామోద్దీపకములు గనుక ప్రియాంగనలఁ బాసి తిరుగుచుండు బాటసారులు తమదృష్టులను మీఁదనే యుంచుచుఁ బోవుదమనిన పైన దట్టములైన మేఘముఁలున్నవి. అడ్డముగాఁ జూచుచుఁ బోవుద మనిన నెమళ్లు పర్వతములయందు నాట్యములాడుచున్నవి. క్రిందఁ జూచుచుఁ బోవుదమనిన పుడమియుఁ బుట్టగొడుగులచేఁ దెల్లపాఱియున్నది. పైనను క్రిందను రెండుపార్శ్వములందునుగాక బాటసారి తనదృష్టి నేతట్టునకు బోనిచ్చుచుఁ బోఁగలఁడు? (కావున నట్టిసమయములందుఁ గాంతతోడి యునికియే మంచిది.)

తే. మీఁద మబ్బులమోసులు । మిసిమిచూపఁ
బుడమియును గందళమ్ములఁ । బొదల నాడు
నెమ్మిగమితోడ దెసలశై । లమ్ము లుండ
విరహిజనుఁ డెందుఁ దనదృష్టి । విరియఁజేయు.

శ్లో. ఇతో విద్యుద్వల్లీవిలసితమితః కేతకితరోః
స్ఫురద్గన్ధః ప్రోద్యజ్జలదనినద స్ఫూర్జితమితః,
ఇతః కేకిక్రీడాకలకలరవః పక్ష్మలదృశాం
కథం యాస్యన్త్యేతే విరహదివసాః సమ్భృతరసాః. 93

వ్యా.—ఇత ఇతి.—ఇతోఽస్మిన్ప్రదేశే, విద్యుద్వల్లీనాం తటిల్లతానాం-విలసితం స్ఫురణమ్, భవతీతి శేషః. ఇతః ప్రదేశే, కేతకితరోః కేతక్యాఖ్యవృక్షస్య-తత్కుసుమస్యేత్యర్థః. * 'జ్యాపోః సంజ్ఞాచ్ఛన్దసోర్బహులమ్' ఇతి హ్రస్వః. కాలిదాస ఇతివత్. స్ఫురన్ వ్యాప్నువానో, గన్ధశ్చ వర్తత ఇతి శేషః. ఇతః ప్రోద్యత్ప్రవృద్ధం, జలదనినదస్య మేఘగర్జితస్య-స్ఫూర్జితం ఆరవం చ, భవతీతి శేషః. ఇతశ్చ కేకినాం శిఖావలానాం-క్రీడాసు కేలిషు-యః కలకలరవః కోలాహలధ్వనిః-ని. 'శిఖావలః శిఖీ కేకీ' 'కోలాహలః కలకలః' ఇతి చామరః. యద్వా కలకలరవః అత్యన్తావ్యక్తమధురప్రకారస్వనశ్చ, సముజ్జృమ్భత ఇతి శేషః. పక్ష్మాణ్యాసాం సన్తీతి పక్ష్మలాః * సిధ్మాదిత్వాల్లచ్ప్రత్యయః. తథాభూతా దృశో యాసాం తాసాం నారీణాం నారీప్లవలోచనానామ్, ఏతే ప్రసిద్ధాః, సంభృతరసాః సంపూర్ణశృఙ్గారాః-ఉద్దీపకా ఇత్యర్థః. విరహదివసా వియుక్తవాసరాః, కథం-యాస్యన్తి-అతిక్రమిష్యన్తి? న కథం చిదపీత్యర్థః; దురన్తత్వాద్దివసమేకం యుగం భవిష్యతీతి భావః. శిఖరిణీవృత్తమ్.

టీ. ఇతః=ఈచోటు, విద్యు...సితం—విద్యుద్వల్లీ=మెఱుపుఁదీఁగయొక్క, విలసితమ్ = స్ఫురణము, ఇతః = ఈచోటు, కేతకి తరోః = మొగలిచెట్టుయొక్క, స్ఫురన్ = వ్యాపించుచుండు, గన్ధః = సువాసన, ఇతః, ప్రోద్య...ర్జితం—ప్రోద్యత్ = ప్రవర్ధమానమగుచున్న, జలద=మేఘపు, నినద = గర్జయొక్క, స్ఫూర్జితం = మ్రోఁత, ఇథః, కేకీ... రవః—కేకీ=నెమళ్లయొక్క క్రీడా=ఆటలయందలి, కలకలరవః=కోలాహలధ్వని, కావున సంభృతరసాః, సంభృత=సంపూర్ణమై, రసాః = శృంగారరసముగల, ఏతే = ఈ, విరహదివసాః = వియోగదినములు, పక్ష్మలదృశాం = దట్టపు ఱెప్పలచేఁ గప్పఁబడిన కన్నులుగల స్త్రీలకు, కథం=ఏవిధముగ, యాస్యన్తి=అతిక్రమించును, లేక కడచును.

తా. ఒకతట్టు మెఱుపుఁదీఁగెలు మెఱయుటయు, ఒకతట్టు మొగలిపూలయొక్క సువాసనయు, మఱియొకప్రక్కఁ గ్రమ్ముచుండు మొగుళుల యుఱుములును, వేఱొకప్రక్క నెమళులయొక్క. యాటలయందలి యవ్యక్తమధుర మగుధ్వనులును అను నీశృంగారరసోద్దీపకము లగుపదార్థములతోఁగూడిన యీదినములను, విరహిణులగు కాంత లెట్టులు

గడపఁగలరు? పైఁజెప్పిన యన్నివస్తువులు విరహోద్దీపకములు గావున నీదినంబులందు విరహిణులగు స్త్రీలు బాధపడుదు రని భావము.

ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుఁదివె? లిక్కడఁ గేతకిగంధవైభవం
బిక్కడ భూరిగర్జితము? లిక్కడ మత్తమయూరనిస్స్వనం
బక్కట యారసోజ్జ్వలము? లైనవినంబులు మన్మథార్తి పెం
పెక్కు వియోగినీజనుల? కెట్లు చనం గల వెన్ని చూడఁగన్?

శ్లో. అసూచీసంచారే తమసి నభసి ప్రౌఢజలద
ధ్వనిప్రాజ్ఞమ్మన్యే పతతి పృషతానాం చ నిచయే,
ఇదం సౌదామన్యాః కనకకమనీయం విలసితం
ముదం చ మ్లానిం చ ప్రథయతి పథి స్వైరసుదృశామ్. 94

వ్యా.—అసూచీతి,—తమసి అన్ధకారే, న విద్యతే సూచీసంచారో యస్మిం స్తస్మిన్సూచ్యగ్రమాత్రస్యాప్యనవకాశప్రదే - గాఢతమే సతీతి యావత్, తథా, నభసి అన్తరిక్షే చ, ప్రౌఢః ప్రగల్భః - గమ్భీర ఇతి యావత్ యో-జలదధ్వనిర్మేఘ గర్జితం-తేన-ప్రాజ్ఞం వాచాలమాత్మానం మన్యత ఇతి ప్రాజ్ఞమ్మన్యే - బహులతర మేఘ నిర్హ్రాదవతి సతీత్యర్థః. * 'ఆత్మమానే ఖశ్చ' ఇతి ఖశి ముమాగమః. తథా పృషతానాం బిన్దూనాం చ-నిచయే సన్దోహే-పతతి సతి-ని. 'పృషన్తి బిన్దుపృషతౌ' ఇత్యమరః. కనక కమనీయం కనకనికషణరేఖాసున్దర, మిదం ప్రవర్తమానం, సౌదామన్యా విద్యుతః. ని. 'తడిత్సౌదామనీ విద్యుత్' ఇత్యమరః. విలసితం స్ఫురణం (కర్తృ) స్వైరసుదృశాం అభి సారికాణాం, పథి ప్రియగృహమార్గే, ముదం మార్గప్రదర్శకత్వాత్సంతోషం. మ్లానిమ్ ఆత్మప్రకాశనహేతుత్వాత్ మ్లానిం చ * 'గ్లై మ్లై హర్షక్షయే' ఇత్యస్మాద్ధాతోః 'వీజ్యా జ్వరిభ్యో నిః' ఇత్యౌణాదికో నిప్రత్యయః, ప్రథయతి ప్రకటయతి కరోతీత్యర్థః. 'కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా' ఇతి లక్షణాత్ కాన్తముద్దిశ్య నిగూఢ మభిసరణశీలానాం స్త్రీణాముపయోగానుపయోగాభ్యాం హర్షాహర్ష హేతుత్వాదితి భావః. ని. 'కాన్తార్థినీ తు యా యాతి సంకేతం సాఽభిసారికా' ఇత్యమరః.

వృత్తం పూర్వవత్.

టీ. తమసి=అంధకారము, అసూచీసఞ్చారే = సూదికదలికలేనిది అగుచుండ, నభసి=ఆకసము, ప్రౌఢ...మన్యేసతి, ప్రౌఢ=గంభీరమైన, జలదధ్వని=మేఘగర్జనము

చేత, ప్రాజ్ఞమ్మన్యే=వాచాలునిగా తలంచుకొనునది కాఁగా, పృషతానాం=వర్ష బిందు వులయొక్క, నిచయే = సమూహము, పతతిసతి = పడుచుండఁగా, కనకకమనీయం= బంగారమువలె-బంగారురేఖవలె, కమనీయం = సుందరమైన, సౌదామన్యాః=మెఱపు యొక్క, ఇదంవిలసితం = ఈస్ఫురణము - మెఱయుట, స్వైరసదృశాం=అభిసారి కలకు - కాంతార్థినులై పోవువారికి, పథి = మార్గమున ముదంచ=(దారిచూపుటచే) సంతోషమును, మ్లానించ = (ఆత్మప్రకాశనహేతువుచే) భేదమును, ప్రథమయతి= ప్రకటించుచున్నది.

తా. దట్టములయిన మబ్బుల యుఱుములతోఁగూడిన వర్షర్తువు నందు సూది దూఱుటకుఁ గూడ వలనుపడనంత దట్టమయిన చీకటి యందు వానచినుకులు గురియునప్పుడు ఈపసిడివంటి చాయగల మెఱుపువెలుఁగు బాటలందు యథేచ్ఛాసంచారముగల కాంతలకు సంతసమును, వ్యసనమును గలిగించుచున్నది.

చ. ఘనతిమిరంబు సూది కవకైకాశ మొసంగమి మీఁద వారిద
స్వనముల మిన్ను పిక్కటిల వారికణంబులు రాలుచుండఁగాఁ
గనకపురేఖలం దెగడు కాఱుమెఱుంగులు జారకామినీ
జనములకుఁ ముదంబును విషాదమునుం బ్రకటించెఁ ద్రోవలన్.

శ్లో. ఆసారేణ న హర్మ్యతః ప్రియతమైర్యాతుం బహిశ్శక్యతే
శీతోత్కమ్పనిమిత్తమాయతదృశా గాఢం సమాలిఙ్గ్యతే,
జాతాః శీకరశీతలాశ్చ మరుతో రత్యన్తఖేదచ్ఛిదో
ధన్యానాం బత దుర్దినం సుదినతాం యాతి ప్రియాసఙ్గమే. 95

వ్యా.—ఆసారేణేతి—ప్రియతమైర్వల్లభై, రాసారేణ ధారాసంపాతేన హేతునా - ని. 'ధారా సంపాత ఆసారః' ఇత్యమరః. హర్మ్యతః. ప్రాసాదాత్ ధామతః' ఇతి పాఠే గృహాత్-ఉభయత్రాపి * పఞ్చమ్యాస్తసిల్. 'అప పరి బహి' రిత్యాదినా సమాసవిధానజ్ఞాపకాత్' బహిర్యోగే పఞ్చమీ. బహిర్యాతుం, న శక్యతేన న సమర్థ్యతే. 'శక్ల శక్తౌ' - భావే లట్. 'శకధృష' ఇత్యాదినా తుమున్ ప్రత్యయః. తథా ఆయతదృశా దీర్ఘదృశా తరుణ్యా, శీతేన-యదుత్కమ్పో గాత్రవేపథు-స్తన్నిమిత్తమ్ - తన్నివారణార్థమిత్యర్థః. గాఢ మతిదృఢం, సమాలిఙ్గ్యతే పరిరభ్యతే - పూర్వవల్లట్. తథా, శీకరై రమ్బుకణైః-శీతలాః శిశిరాః - ని. 'శీకరోఽమ్బుకణః స్మృతః' ఇత్యమరః. రత్యన్తే సురతావసానే - యః ఖేదః శ్రమ - స్తంఛిన్దన్తీతి తథోక్తాః

సురతసంరమ్భజనితశ్రమాపహారిణ ఇత్యర్థః. 'శ్రమః, ఖేదోఽథ రత్యాదేర్జాతః స్వేదాతిభూమికృత్' ఇతి లక్షణాత్. మరుతశ్చ, జాతాః ప్రసృతాః, అతః; ధన్యానాం పుణ్యశాలినాం, ప్రియాసఙ్గమే ప్రియాసంభోగే సతి, దుర్దినం దుష్టదినమపి మేఘచ్ఛన్నదినం చ. ని. 'మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్' ఇత్యమరః. సుదినతాం సుదివసత్వం యాతి అన్యేషాం తు తదేవ భవతీత్యర్థః. బతేతి విస్మయే. ని. 'బత ఖేదానుకమ్పామన్త్రణసంతోష విస్మయే' ఇత్యభిధానాత్.

అత్ర దుర్దినమపి సుదినతాం యాతీతి స్ఫురతో విరోధస్యోక్తసమాధానాద్విరోధాభాసోఽలఙ్కారః. 'ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే' ఇతి లక్షణాత్. శార్దూలవిక్రీడితమ్.

టీ. ప్రియతమైః=వల్లభులకు, ఆసారేణ=వర్షాధారచే, హర్మ్యతః = మేడనుండి, బహిః=వెలుపలికి, యాతుం=పోవుటకు, నశక్యతే=శక్యముగాదు, ఆయతదృశా=దీర్ఘములైన కన్నులుగలస్త్రీ, శీతో...నిమిత్తం-శీత = చలిచేనైన, ఉత్కంపనిమిత్తం = వడకు మూలముగా, గాఢం=బిగువుగా, సమాలిఙ్గ్యతే = కౌఁగిలించుచున్నది, శీకరశీతలాః = నీటి కణములచే చల్లనైన, మరుతశ్చ=వాయువులును, జాతాః = ప్రసరించినవి; బత = ఆహా, ధన్యానాం=పుణ్యశాలురకు, ప్రియాసఙ్గమే సతి=ప్రియతోడికూడిక ఉండఁగా, దుర్దినం=దుష్టదినమైనను (మేఘాచ్ఛాదనదినమైనను) సుదినతాం=మంచిదిన మగుటను, యాతి = పొందుచున్నది.

తా. జడివాన కురియుటచేఁ బ్రియులగువారు మేడలు విడిచి వెలుపటఁ బోవుటకు వీలుకాదు. విశాలనేత్రలగు పొలఁతులు చలికి వణఁకుచుఁ దమ ప్రియులను గట్టిగఁ గౌఁగిలించుకొందురు. అలసటను బాగుగాఁ బోఁగొట్టునట్టి చల్లనితుంపురులతోఁ గూడిన గాలులు వీచుచుండును. కావున దుర్దినము (సూర్యరశ్మి లేనిదినము 'దుర్దినము' అనఁబడును.) పుణ్యాత్ములకుఁ దమయతివలతోడి కూడికచే సుదినత్వము నొందుచుండును.

ఉ. కేరుచు మేడనుండి వెలి కేఁగం జన శక్యము గాక యుండె నా
సారము చేత శీతమున జవ్వని కౌఁగిలి గ్రాలె శీకరో
దారసమీరణంబు సురతశ్రమవారణ మయ్యె దుర్దినం
బారయ నయ్యెడన్ సుదిన మయ్యెఁ గృతార్థుల కంగనారతిన్.

అవ. శరదృతువును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. అర్ధం సుప్త్వా నిశాయాః సరభససురతాయాససన్నశ్లథాఙ్గః
ప్రోద్భూతాసహ్యతృష్ణో మధుమదనిరతో హర్మ్యపృష్ఠే వివిక్తే,
సంభోగక్లాన్తకాన్తాశిథిలభుజలతావర్జితం కర్కరీతో
జ్యోత్స్నాభిన్నాచ్ఛధారం పిబతి న సలిలం శారదం మన్దపుణ్యః.

వ్యా.—.అస్మిన్నైకేన శరదం వర్ణయతి—అర్ధమితి.—నిశాయాః రాత్రేః అర్ధమ్-యామద్వయమిత్యర్థః ని. 'పుంస్యర్ధోఽర్ధం సమేంఽశకే' ఇత్యమరః. *అత్యన్తసంయోగే ద్వితీయా సుప్త్వా శయిత్వా-నిద్రయా యామద్వయం గమయిత్వేత్యర్థః. తతః మధ్యే ఇతి శేషః. సరభసం సోద్వేగం-యత్సురతమాభ్యన్తరసంభోగః - తేన-య - ఆయాసః, శ్రమ-స్తేన-సన్నాని పరిఖిన్నాని-అతఏవ - శ్లథాని శిథిలాని-అఙ్గాన్యవయవా యస్య స తథోక్తః.

'మధ్యం నక్తముదాహృతం శరది చ ప్రత్యూషకాలో హిమే.'

ఇతి భోజవచనా దర్ధరాత్రకృతసురతపరిశ్రాన్త ఇత్యర్థః. ఏతేనైతస్య నాయకస్య కామతన్త్రకుశలత్వం, నాయికాయాః శఙ్ఖినీత్వం చ సూచ్యతే. తృతీయయామస్య తత్సురతయోగ్యకాలత్వాత్. తదుక్తం రతిరహస్యే.—

'రమయతి చ తృతీయే శఙ్ఖినీ మార్ద్రభావం,
గమయతి రమణీయాం పద్మినీం తుర్యయామే,' ఇతి.

అన్యత్రాప్యుక్తం—

'కుసుమితవనమధ్యే సూచిమారస్తృతీయే,
తిమిరనిబిడయామే శఙ్ఖినీం సంలభేత.' ఇతి.

అత ఏవ ప్రోద్భూతా ప్రకర్షేణోత్పన్నా - అత ఏవాసహ్యా స్వతః శమయితుమశక్యా-తృష్ణా పిపాసా-యస్య స తథోక్తః తథా, మధునా సంభోగప్రాక్కాలీనమద్యపానేన-యో మదో మోహ-స్తేన నిరతః పరవశ ఇత్యర్థః. 'మదిరాదికృతో మోహో హర్షవ్యతికరో మద' ఇతి లక్షణాత్. వివిక్తే విజనే ని. 'వివిక్తౌ పూతవిజనౌ' విత్యమరః. అన్యథా విస్రమ్భవిహారానుభవాదితి భావః. హర్మ్యపృష్ఠే ప్రాసాదోపరిప్రదేశే, కర్కరీతః గలన్తికాఖ్యసచ్ఛిద్రకుణ్డికాయాః * పఞ్చమ్యాస్తసిః - ని. 'కర్కర్యాలూ గ్గలన్తికే' త్యమరః. సంభోగక్లాన్తాయ స్సురతాయాసపరిశ్రాన్తాయాః - కాన్తాయాస్స్వప్రియతమాయాః-శిథిలయా నిస్సహయా-భుజలతయా-ఆవర్జితం ధారాకారేణ దత్తమితి స్వాదాతిశయోక్తిః, శారదం శరత్కాలసంబన్ధి సలిలం హంసోదకమిత్యర్థః. జ్యోత్స్నయా చన్ద్రి

కయా-భిన్నా మిలితా-అత ఏవాచ్ఛ ధారా యస్మిన్ కర్మణి తద్యథా తథా, మన్దపుణ్యో భాగ్యహీనో-న పిబతి-భాగ్యసంపన్నస్తు పిబతీత్యర్థః. హంసోదకలక్షణముక్తం ద్రవ్యరత్న మాలాయామ్—

'అహ్ని తప్తమహిమాంశురశ్మిభిశ్శీతమమ్బు శశిరశ్మిభిర్నిశి,

ఏవమేవ తదహర్నిశం స్థితం తచ్చ హంసజలనామకం స్మృతమ్'. ఇతి.

ఏతత్పానే గుణసంపత్తిరపి తత్రైవోక్తా—

'ప్రసాదకం త్రిదోషఘ్నం హృద్యం లఘు చ శీతలం,

వృష్యం మనోహరం స్వాదు విషఘ్నం కాన్తికృత్పరమ్.' ఇతి.

శరద్యేతత్పానే నియమశ్చాప్యుక్తోఽన్యత్ర—

'కర్పూరాగరుజం సితాద్యభిరస్త్రైర్హంసోదకం వాసితం,

సౌధం చాతిమనోహరం శిశిరతో ముగ్ధాఙ్గనాలిఙ్గనమ్.' స్రగ్ధరావృత్తమ్

టీ. నిశాయాః=రాత్రియొక్క, అర్ధం=సగము, సుప్త్వా=నిద్రించి, సరభ...... ధాఙ్గః—సరభస = వేగముతోఁ గూడిన, సురత = అభ్యంతర సంభోగముయొక్క, ఆయాస=శ్రమచేత, సన్న=సొక్కిన, శ్లథ = సడలిన, అఙ్గః = అవయవములు గలిగిన వాఁడును, ప్రోద్భూత = స్పష్టముగఁ బొడమిన, అసహ్యా=శమించుటకు శక్యముకాని, తృష్ణః=దాహముగలవాఁడును, మధుమదనిరతః=మద్యపానముచేఁ గలిగిన కైపుచేత, పరవశుఁడును; హర్మ్యపృష్ఠే=మిద్దెయొక్క వైప్రదేశమునందు వివిక్త=ఏకాంతమున, కర్కరీతః=ముక్కుచెంబునందుండి, సమ్భోగ...వర్జితం-సమ్భోగ=సురతముచే, క్లాన్త = శ్రమఁజెందిన, కాన్తా=(తన) ప్రియయొక్క, శిథిల=సడలిన, భుజలతా = తీఁగవంటి భుజముచేత, ఆవర్జితం=(ధారగా) వంపఁబడిన, సలిలం=నీటిని, శారద=శరత్కాలమునకు సంబంధించిన (హంసోదక మని యర్థము)దానిని, జ్యోత్స్నా...ధారం-జ్యోత్స్నా= వెన్నెలలచే, భిన్న=మిళితమై, అచ్ఛ=స్వచ్ఛమైన, ధారం=నీటిధార కలదానిని, మన్ద పుణ్యః=భాగ్యహీనుఁడు, న పిబతి=త్రాగఁడు.

తా. ఎట్టులో సగము రాత్రివఱకు నిద్రించి, యావల నిబ్బర మైన సంభోగమందలి యలసటచే డస్సిన వీడినయంగములు గలవాఁ డును, విశేషమైన యోర్వరానియాసగలవాఁడగుటచే మద్యపానమునం దెక్కువ మక్కువగలవాఁడును నై యేపురుషుఁ డేకాంతస్థలంబున, సంభోగమునఁ దనప్రియుని గట్టిగఁ గౌఁగిలించికొని, సంభోగాంతమున డస్సినదై తనచేతికట్టును వీడినయుత్తివ తనశిథిలభుజనుచేఁ దెచ్చియిచ్చిన

వెన్నెలతోఁగూడిన నిర్మలధారగల శరత్కాలమందలి యుదకంబును ద్రావఁడో, ఆపురుషుఁ డదృష్టహీనుఁడు (ఏపురుషుఁడు శరత్కాలంబున సుకతశ్రమముచే డస్సినవాఁడై మేడయొక్క పైభాగమున నట్టి కాంత దెచ్చియిచ్చినయుదకంబును ద్రాగునో, ఆపురుషుఁడు ధన్యుఁడని భావము.).

చ. ప్రియముగ రేసగంబు నిదుకరించి నితాంతరతాంతవిహ్వలుం
డయి దగఁ జెంది యాసవమదాలసుఁడై రతిఖిన్న కామినీ
శయమునఁ గర్కరీగళితచంద్రవిభాచ్ఛశరజ్జలంబు లా
రయఁ గృతపుణ్యుఁ డింపెసఁగఁ ద్రాగు రమాస్థితసౌధసీమలన్.

అవ. హేమంతఋతువును వర్ణించుచున్నాఁడు:—

శ్లో. హేమన్తే దధిదుగ్ధసర్పిరశనా మాఞ్జిష్ఠవాసోభృతః
కాశ్మీరద్రవసాన్ద్రదిగ్ధవపుషశ్ఛిన్నా విచిత్రై రతైః,
వృత్తోరుస్తనకామినీజనకృతాశ్లేషా గృహాభ్యన్తరే
తామ్బూలీదళపూగపూరితముఖా ధన్యాః సుఖం శేరతే. 97

వ్యా.—అథ ద్వాభ్యాం హేమన్తం వర్ణయతి—హేమన్త ఇతి.—హేమన్తే హేమన్తఋతౌ, దధి ప్రసిద్ధం దుగ్ధసర్పిషీ క్షీరఘృతౌ-తాన్యశనం యేషాం తే తథోక్తాః-నను దుగ్ధాజ్యాదీనాం శైత్యావసాదకత్వేన సేవనం భవతు - దధిసేవనస్య తదతిరేకకరత్వాత్తత్సేవనం కథం యుక్తమితి చేన్న - తస్యాప్యాయుష్కామస్య హేమన్తే సేవనోపయోగాత్. తదుక్తం చారుచర్యాయామృతుచర్యాప్రస్తావే సర్వజ్ఞభోజరాజేన—

త్రిషు చ దధి నిషేవ్యం గ్రీష్మకాలే వసన్తే
శరది చ పరివర్జ్యం వాఞ్ఛతా దీర్ఘమాయుః,
యది ఖలు పరివాఞ్ఛా సేవ్యతాం సర్వకాలం
సహగుడమధుపాత్రే శర్కరాముద్గయూషైః. ఇతి.

మఞ్జిష్ఠయా రఞ్జకద్రవ్యేణ రక్తాని మాఞ్జిష్ఠాని-వాసాంసి సురక్తవసనాని-బిభ్రతీతి తథోక్తాః * 'తేన రక్తం రాగా ది' త్యణ్ప్రత్యయః-యదపి-

'నిర్వాతం భవనం సరక్తవసనం పహ్నేః పరం సేవనమ్.' ఇతి.

వసన్తసమయయోగ్యత్వేన సురక్తవసనధారణమభిహితం తథాఽపి మతాన్తరే ఏవముక్తమితి న విరోధః. కాశ్మీరద్రవేణ కుఙ్కుమపఙ్కేన-సాన్ద్రం యథా తథా-దిగ్ధాని

రూషితాని - వపూంషి యేషాం తే తథోక్తాః, విచిత్రైర్బాహ్యాభ్యన్తరరూపేణ నానా విధైః రతైః, ఖిన్నాః శ్రాన్తాః, వృత్తౌ వర్తులౌ - ఊరూ పీనౌ చ- స్తనౌ యాసాం తా స్తథోక్తా-యాః కామిన్య స్తా ఏవ జన- స్తేన కృతాశ్లేషాః విహితపరిరమ్భాః. తదుక్తం—

'కస్తూర్యాఽగరుకుఙ్కుమై రతికృతం పానం తటాకస్థితం,
శీతం నైవ విదీర్యతే ప్రియతమై రాలిఙ్గనం కమ్బళమ్.' ఇతి.

తథా తామ్బూలీదళై ర్నాగవల్లీదళైః-పూగైః క్రముకైశ్చ-పూరితాని ముఖాని వక్త్రాన్తరాళాని-యేషాం తే త థోక్తా స్తామ్బూలచర్వణరతాః-తత్పరా ఇత్యర్థః. ని. 'ఘోణ్టాతు పూగః క్రముక' ఇత్యమరః. ఇత్థంభూతా ధన్యాః సుకృతినః; గృహాభ్యన్తరే మన్దిరాన్తరాళే, సుఖం యథా తథా, శేరతే స్వపన్తి. *'శీఙో రుడ్' తి రుడాగమః. తామ్బూలస్య మానసోల్లాసాది బహుగుణ హేతుత్వా త్తచ్చర్వణోక్తిః తదుక్తం చారుచర్యాయాం—

'మనసో హర్షణం శ్రేష్ఠం రతిదం మదకారణం,
ముఖరోగహరం హృద్యం దీపనం వస్తిశోధనం,
ముఖశోధి క్రిమిహరం తామ్బూలం శ్రీకరం పరమ్.' ఇతి.

తత్కాలానుగుణోపచారత్వేన వీర్యవృద్ధికరత్వేన చ ప్రథమం దధిక్షీరాజ్యప్రాజ్యమృష్టాన్నం భుక్త్వాఽనన్తరం కుఙ్కుమకస్తూర్యాది మిశ్రిత చన్దనలేపనపూర్వకం వివిధసురత సంరమ్భ సంభోగపరిశ్రాన్తాః కాన్తాసమాలిఙ్గితగాత్రాశ్చ సన్తస్తామ్బూలచర్వణరతాః సుకృతశాలిన స్సుఖేన నిదాతగృహాభ్యన్తరే స్వపన్తీతి సముదాయార్థః.

శార్దూలవిక్రీడితమ్.

టీ. హేమంతే=హేమంతఋతువునందు, దధి . . రశనా-దధి = పెరుగు, దుగ్ధ= పాలు, సర్పిః = నేయియు, అశనాః = భుజించువారును, మాఞ్జిష్ఠ . . భృతః—మాఞ్జిష్ఠ= చెంగావి, వాసః = వస్త్రములను, భృతః = ధరించువారును, కాశ్మీ . . . వపుషః—కాశ్మీర ద్రవ=కుంకుమను నలఁదికొనుటచే, సాన్ద్రే = దట్టముగా, దిగ్ధ = పూయఁబడిన, వపుషః = దేహముగలవారును, విచిత్రైః= (బాహ్యాభ్యంతరరూపములచే) నానావిధములైన, రతైః= సంభోగములచే, ఖిన్నాః = అలసినవారును, వృత్తో . . . శ్లేషాః—వృత్త = గుండ్రములైన, ఊరు=గొప్ప, స్తన=పాలిండ్లుగల, కామినీజన = కాంతలచే, కృత = చేయఁబడిన, ఆశ్లేషాః=కౌఁగిలింతలుగలవారును, తామ్బూలీ . . . ముఖాః—తామ్బూలీదళ=తమలపాకులతోను, పూగ = వక్కలతోను, పూరిత = నిండింపఁబడిన, ముఖాః = నోరుగలవారును,

(అయి), ధన్యాః=పుణ్యశాలురు, గృహాభ్యన్తరే=ఇంటిలోపల, సుఖం=సుఖముగ, శేరతే=నిదురింతురు.

తా. హేమంత ఋతువునందు ధన్యులగుపురుషులు పాలు పెరుగు నెయ్యి చక్కఁగా వేసికొని భుజించుచు, చెంగావి బట్టలను గట్టుకొని, దట్టముగా మేనికి కుంకుమపూఁతఁ బూసికొని నానావిధసురతములచే డస్సినవారలై, బలిసినతొడ లుబ్బుగుబ్బలుం గలకాంతలచేఁ గట్టిగఁ గౌఁగిలింపఁబడినవారలై తాంబూలము చక్కఁగా నమలుచు, గదులలో సుఖముగా నిదురింతురు.

చ. ఘృతదధిదుగ్ధభోజన మెలర్ప భుజియించి సురంగవస్త్రముల్
హితముగఁ దాల్చి కుంకుమము హెచ్చుగ మేన నలంది ధన్యుల
ద్భుతరతిఖిన్నులై విడెము పుక్కిట నుంచి పృథుస్తనాంగనా
కృతపరిరంభులై కడు రమింతురు మేడలలోన సీతునన్.

శ్లో. ప్రోద్యత్ప్రౌఢప్రియఙ్గుద్యుతిభృతి వికసత్కున్దమాద్యద్ద్విరేఫే
కాలే ప్రాలేయవాతప్రచలవిలసితోదారమన్దారధామ్ని,
యేషాం నో కణ్ఠలగ్నా క్షణమపి తుహినక్షోదదక్షా మృగాక్షీ
తేషామాయామయామా యమసదనసమా యామినీ యాతియూ
[నామ్.

వ్యా.—ప్రోద్యదితి.—ప్రోద్యన్త్యః ఉదిత్వరాః - ప్రౌఢాః ప్రవృద్ధాశ్చ యాః ప్రియఙ్గవః ఫలిన్యః-తాభిర్ద్యుతిముపచయజనితశోభాం-బిభర్తీతి తథోక్తే-ని 'ప్రియఙ్గుః ఫలినీ ఫలీ' త్యమరః- ద్వౌ రేఫౌ వర్ణవిశేషౌ యస్య స ద్విరేఫో భ్రమరశబ్దః. ఉపచారాత్తదర్థోఽపి ద్విరేఫ ఉచ్యతే * యథాహ కైయటః — 'శబ్దధర్మేణాఽప్యర్థస్య వ్యపదేశో దృశ్యతే-యథా భ్రమరశబ్దస్య ద్విరేఫత్వాద్ద్విరేఫో భ్రమరః.' వికసద్భిః-కున్దైర్మాఘ్యకుసుమైః-మాద్యన్తో ద్విరేఫాయస్మిన్ తస్మిన్-ని 'మాఘ్యం కున్దమి' త్యమరః. * 'పుష్పమూలేషు బహుళ' మితి లుక్. యద్యపి కున్దవికసనం శిశిరర్తులక్షణం తథాఽపి తత్ప్రత్యాసత్త్యోక్తమితి న విరోధః. ప్రళయాదాగతం ప్రాలేయం హిమం * 'తత ఆగత' ఇత్యణ్. * 'కేకయమిత్రయుప్రళయానాం యాదేరియ' ఇతి. యశబ్దస్య ఇయాదేశః - ప్రాలేయవాతైస్తుషారవాయుభిః - ప్రచలం చఞ్చలమ్ - అత ఏవ విలసితం ప్రకాశమాన - ముదారం రమ్యం చ - మన్దారాణాం సంతానకతరూణాం-ధామ స్థానం-

యస్య తస్మిన్-యద్వా-మన్దారాణాం పారిభద్రకతరూణాం-ధామేతి ఉభయత్రాప్యుపచ యహేతుత్వాదితిభావః. ని. 'పారిభద్రో నిమ్బతరుర్మన్దారః పారిజాతకః' ఇత్యమరః. ఏవం భూతే కాలే హేమన్తసమయే,యేషాం యూనాం తరుణానాం, తుహినక్షోదే శీతనివారణే దక్షా.కుచకుమ్భయోరాఢ్యసంభవేన తదాలిఙ్గనాన్ని వారణసమర్థేత్యర్థః.మృగాక్షీ తరుణీ క్షణమల్పకాలమపి *అత్యన్తసంయోగే ద్వితీయా, కణ్ఠలగ్నా కణ్ఠావసక్తా-కణ్ఠాలిఙ్గనతత్పరేతి యావత్, నో న భవతీత్యర్థః. తేషాం యూనాం, ఆయామాః అత్యన్తదీర్ఘా-యామాః ప్రహరాః-యస్యాస్సా, విరహవేదనావశా త్తథా ప్రతీయమానయామేత్యర్థః. యామినీ రజనీ, యమసదనసమా యమలోకకల్పా - దురన్తదుఃఖావహేత్యర్థః, యాతి గచ్ఛతి, తదానీమఙ్గనాశ్లేషాలిఙ్గనమన్తరేణ దురన్తవిరహవేదనామహానద్యాస్తరితు మశక్యత్వా దితి భావః. ని. 'ద్వౌ యామప్రహరౌ సమౌ' ఇతి, 'రజనీ యామినీ తమీ' ఇతి చాప్యమరః.

అనుప్రాసోపమయోశ్శబ్దార్థాలంకారయోస్సంసృష్టిః. స్రగ్ధరావృత్తమ్.

టీ. ప్రోద్యత్=దట్టముగా పూయుచున్న, ప్రౌఢ=ప్రవర్ధమానమైన, ప్రియఙ్గు= ప్రేంకణపుఁదీఁగలయొక్క, ద్యుతి = శోభను, భృతి = తాల్చినదియు, వికచ... రేఫే - వికసత్=విరియుచున్న, కుంద=మొల్లలచే, మాద్యత్ = మత్తిల్లుచున్న, ద్విరేఫే = తుమ్మెదలు గలదియు, ప్రాలేయ ..ధామ్ని-ప్రాలేయవాత = తుషారవాయువుచే, ప్రచల = కదలుచు, విలసితం = ప్రకాశమానమై, ఉదారం=రమ్యమైన, మన్దార=మన్దారపుష్పములకు, ధామ్ని=స్థానమును, (అగు) కాలే = (హేమంత) ఋతువునందు, యేషాం యూనాం = ఏతరుణ వయస్కులకు, తుహి...దక్షా - తుహిన = మంచును, క్షోద = నివారించుట యందు, దక్షా = సమర్థయైన, మృగాక్షీ = మచ్చెకంటి, క్షణమపి = అల్పకాలమైనను, కణ్ఠలగ్నా-కణ్ఠ = మెడయందు, లగ్నా = తగులుకొనినది, నో = కాదో (కౌఁగిలింపదో యనుట), తేషాం = వారికి, యామినీ = రాత్రి, ఆయామయామా = నిడుదజాములుగల, యమసదనసమా = యమలోకకల్పమై (మిక్కిలి దుఃఖమును గలిగించునదై,) యాతి = కడచును.

తా. దట్టముగాఁ బూచిన ప్రేంకణపుఁ బూవులకాంతిఁ దాల్చినదియు, విరియుచున్న మొల్లలంయఁ దిరుగుచు మత్తిలియున్న తుమ్మెదలుగలదియు, మంచుగాలి వీచుటచేఁ గదలుచున్న వికసించిన మందార పుష్పములదండలు గలదియునైన హిమవంతర్తువునందు మంచుగాలి వలని బాధ దీర్పఁగల మచ్చెకంటి నిముసమైనను ఏపురుషులను కౌఁగి

లింపదో, యాపురుషుల కాహిమవంత ర్తువునందలి నిడుదజాములు గల రాత్రి నరకసమమై బహుకష్టముతోఁ గడచును.

స్రగ్ధర. ప్రోద్యత్ప్రౌఢప్రియంగు ॥ స్ఫుటరుచియుతమై ॥ ఫుల్లమల్లీమతల్లీ
మాద్యత్సారంగమై హైమ ॥ మనపవనచల ॥ న్మంజుమందారభూజా
తదోద్గతంబైన హేమం ॥ తమున విరహాసంతప్తులౌ వారికెల్లన్ [illegible]రిన్.
సద్యామాయామరాత్రుల్ ॥ చను విషమయమ ॥ స్థానసాదృశ్యమూ

అవ. శిశిరర్తువును వర్ణించుచున్నాఁడు —

శ్లో. చుమ్బన్తో గణ్డభిత్తీ రలకవతి ముఖే సీత్కృతాన్యాదధానాః
వక్షస్సూత్కఞ్చుకేషు స్తనభరపులకోద్భేదమాపాదయన్తః,
ఊరూనాకమ్పయన్తః పృథుజఘనతటాత్స్రంసయన్తోంశుకాని
వ్యక్తం కాన్తాజనానాం విటచరితభృతః శైశిరా వాన్తి వాతాః. ౧౧

వ్యా.—అథ ద్వాభ్యాం శిశిరర్తుం వర్ణయన్ నిగమయతి—చుమ్బన్త ఇతి—కాన్తాజనానాం-గణ్డా భిత్తయ ఇవ తాః - గణ్డభిత్తీః కపోలస్థలీః, చుమ్బన్తః 'స్తననయన కపోలాన్ చుమ్బనస్థాన మాహుః' రితి రతిరహస్యోక్తేరితి భావః. అత ఏవాలకవతి విశ్లేషణవశాచ్చూర్ణకున్తలాలంకృతే-ముఖే - ని. 'అలకాశ్చూర్ణకున్తలాః' ఇత్యమరః. సీత్కృతాని సీత్కారాణి - సీదిత్యనుకరణశబ్దః. ఆదధానాః కుర్వాణాః - ఉత్పాదయన్త ఇత్యర్థః. వక్షస్సు ఉరస్థలీషు, ఉత్కఞ్చుకేషు ఉద్గ్రథితకూర్పాసకేషు సత్స్వపి, స్తనభరేషు - పులకోద్భేదం రోమాఞ్చప్రాదుర్భావ, మాపాదయన్తః - ఇతి సాత్త్వికోక్తిః, ఊరూన్ సక్థీని ఆకమ్పయన్తః, ప్రచాలయన్తః, పృథు విశాలం - యజ్జఘనతటం జఘనప్రదేశస్తస్మా, దంశుకాని పరిధానాం శుకగ్రన్థీనీత్యర్థః. స్రంసయన్తః విశ్లథయన్తః, అత ఏవ - వ్యక్తం స్ఫుటం-విటానాం పల్లవికానామివ - చరితాని - కృత్యాని బిభ్రతీతి తథోక్తాః, శిశిరస్యైతే శైశిరాః - శిశిరర్తుసంబంధినః - 'తస్యేద మి' త్యణ్. వాతాః వాన్తి సంచరన్తి; విటసాధారణవిశేషణవిశిష్టత్వా ద్వాతానాం తచ్చరితభరణం యుక్తమితి భావః. తదుక్తం రతిరహస్యే—

'అలకచుబుకగణ్డం నాసికాగ్రం చ చుమ్బన్
పునరుపహితసీత్కం తాలు జిహ్వాం చ భూయః,
భరితలిఖితనాభీమూలవక్షోరుహోరు
శ్లథయతి ధృతధైర్యః శ్లాఘయిత్వాథ నీవీమ్.' ఇతి.

అత్ర విటచరితభృత ఇత్యత్ర ఉపమాలంకార, స్స చ వ్యక్తమిత్యనేనాభివ్యజ్ఞితయోత్ప్రేక్షయాఽఙ్గేన సంకీర్యత ఇతి సంక్షేపః వృత్తం పూర్వవత్.

టీ. ఈశిశిరఋతువున వీచుగాడ్పులు విటులు సేయుపనులను చేయుచున్న వనుట.—కాన్తాజనానాం = జవరాండ్రయొక్క, గణ్డభిత్తీః = గోడలవంటి చెక్కిళ్లను, చుమ్బన్తః = ముద్దిడుచు, అలకవతి = ముంగురులుగల, ముఖే = మోమునందు సీత్కృతాని = సీత్కారములను, ఆదధానాః = కావించుచు, (సీత్ అనుట చలిచేత నని వాయుపరార్థము; మోవికాటుచేత నని విటపరార్థము) వక్షస్సు=ఉరఃస్థలములు, ఉత్కఞ్చుకేషు (సత్స్వపి)=పైనఁదొడిగింపఁబడిన అవికలుగలవియైనను, (వాయుపరార్థము) వదలివేయఁబడిన అవికలు గలవి (విటపరార్థము), స్తన..ద్భేదం— స్తనభర=వలుదపాలిండ్లయందుఁ పులక = గగుర్పాటుయొక్క, ఉద్భేదమ్ = పొడమటను, ఆపాదయన్తః = కలిగించుచు, ఊరూన్ = తొడలను, ఆకమ్పయన్తః = వణఁకించుచు, పృథు జఘన తటాత్=విశాలమగు మొలప్రదేశమునందుండి; అంశుకాని = చీరలను, స్రంసయన్తః = విడఁదీయుచు, వ్యక్తం = స్ఫుటముగా, విటచరిత భృతః=విటుల కృత్యములను దాల్చినవై, శైశిరాః = శిశిర ఋతుసంబంధములైన, వాతాః = వాయువులు, వాన్తి = సంచరించుచున్నవి, లేక, వీచుచున్నవి.

తా. శిశిరర్తువునందలి గాడ్పులు జవరాండ్రచెక్కిళ్లను ముద్దిడుచు (తాఁకుచు), ముంగురులు గలమోమున సీత్కారములు గావించుచు గుత్తపుఅవికెలు దొడిగినను చలిచే గగుర్పాట్లు పుట్టించుచు, తొడలఁ గదలించుచు వలుఁదపిఱుఁదులనుండి కోకలు వీడఁజేయుచు విటులుచేయుపనులం జేయుచు వీచుచున్నవి.

ఉ. చెక్కులు ముద్దుగొంచు ముఖసీమను సీత్కృతులన్ ఘటించుచుం
జక్కని చన్గవం బులకజాలములన్ మొలపించుచుం గటిం
జెక్కినచేలముం దొలఁగఁ జేయుచు శైశిరమారుతంబు లిం
పెక్కఁగఁ గాంతలందు విటకృత్యముఁ బూని చరించు నిత్తఱిన్.

శ్లో. కేశానాకులయన్ దృశో ముకులయన్ వాసో బలాదాక్షిప
న్నాతన్వన్పులకోద్గమం ప్రకటయన్నఙ్గేషు కంపం శనైః,
వారం వారముదారసీత్కృతకృతో దన్తచ్ఛదాన్ పీడయన్
ప్రాయః శైశిర ఏష సంప్రతి మరుత్కాన్తాసు కాన్తాయతే. 100

వ్యా. కేశానితి.—కేశాన్ శిరోరుహాన్, ఆకులయన్ వ్యాకులీకుర్వన్-ఏకత్ర విశ్లేషణాదన్యత్ర కేళిసంరమ్భాచ్చేతి భావః. దృశో, ముకుళయన్నిమీలయన్-ఏకత్ర పరుషస్పర్శవశా దపరత్ర సుఖపారవశ్యాచ్చేతి భావః. వాసో జఘనాంశుకం, బలాత్ప్రసహ్యాక్షిపన్ ఆకర్షన్ - ఏకత్ర వేగవశాదపరత్ర సంభోగేచ్ఛయా చేతి భావః. పులకోద్గమం రోమాఞ్చం, ఆతన్వన్నుత్పాదయన్ - ఏకత్ర శీతలస్పర్శాదన్యత్ర శృఙ్గారోద్బోధనాచ్చేతి భావః. ఆవేగేనోద్వేగేన - యః కమ్పో గాత్రవేపథు స్తం, శనైః ప్రకటయ న్మన్దమభివ్యఞ్జయన్-ఇతి విశేషణద్వయేన సాత్త్వికోక్తిః, ఉదారాణి మనోజ్ఞాని-సీత్కృతాని కుర్వన్తీతి తథోక్తాన్, 'ఛాద్యన్తే ఏభిరితి ఛదాః * 'పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయే ణే' తి ఘ ప్రత్యయః. ఛాదేర్ఘే ఽద్వ్యుపసర్గ స్యే'తి హ్రస్వః. దన్తానాం ఛదాః, తానధరోష్ఠాన్, వారం వారం పునః పునః, పీడయన్-ఏకత్ర శైత్యాతిశయే నాన్యత్ర దన్తక్షతేన చ వ్యథయన్నిత్యర్థః. ఏషోఽయం, శైశిరో మరుత్ శిశిరమారుతః, సమ్ప్రతీదానీం శిశిరర్తౌ, ప్రాయో భూమ్నా, కాన్తాసు కామినీషు విషయే, కాన్తాయతే-

'కథాభిః కమనీయాభిః కామ్యైర్భోగైశ్చ సర్వదా,
ఉపచారైశ్చ రమయేద్యస్స కాన్త ఇతీరితః.'

ఇత్యుక్తలక్షణః కాన్త ఇవాచరతి - ఉక్తవిశేషణైః కాన్తసాదృశ్యలాభా త్స ఇవ వర్తత ఇత్యర్థః. *'ఉపమానా దాచార,' ఇతి క్యఙ్ *'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః.'

అత ఏవోపమా - సాచ ప్రాయశ్శబ్దాదివ్యఞ్జితోత్ప్రేక్షయా సంకీర్యతే. తదుక్తమాచార్యదణ్డినా—

'మన్యే శఙ్కే ధ్రువం నూనం ప్రాయ ఇత్యేవమాదిభిః,
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివశబ్దోఽపి తాదృశః.' ఇతి.

శార్దూలవిక్రీడితమ్.

టీ. సమ్ప్రతి = ఇపుడు, ఏషః = ఈ, శైశిరః = శిశిరకాలపు, మరుత్ = గాలి, ప్రాయః=తఱుచుగా, కాన్తాసు = జవరాండ్రయెడల, కేశాన్ = తలవెంట్రుకలను, ఆకులయన్=చిక్కుపఱచుచు, దృశః = కన్నులను, ముకులయన్=మూయుచు, వాసః = వస్త్రమును, బలాత్ = బలవంతముగా, ఆక్షిపన్ = ఈడ్చివైచుచు, పులకఉద్గమమ్ = గగుర్పాటుయొక్క మొలపించుటను, ఆతన్వన్ = కలిగించుచు, అఙ్గేషు = అవయవములయందు, శనైః=తిన్నగా, కమ్పం=వడఁకును; ప్రకటయన్=వెల్లడిపఱచుచు, ఉదార...

కృతః- ఉదార = మనోజ్ఞమైన, సీత్కృత = సీత్కారమును, కృతః = చేయు, దన్తచ్ఛదాన్ = క్రింది పెదవులను, వారంవారం=పలుమాఱు, పీడయన్ = నొప్పించుచు, కాన్తాయతే=ప్రియునివలె నాచరించుచున్నవి.

తా. వాయువు తలవట్టి యూడ్పుచు, కన్నులను మూయుచు, బలాత్కారముగా బట్టఁబట్టి లాగుచు, గగుర్పాటు పుట్టఁజేయుచు, మెల్ల మెల్లఁగ నంగముల వణఁకు పుట్టించుచు, మాటిమాటికి గొప్ప సీత్కారములఁ జేయుచు; నొడుగఱచుచుఁ దఱుచుగాఁ గాంతలందుఁ బ్రియుని మాడ్కి నాచరించుచున్నాఁడు.

ఉ. వేసవిఁ గ్రొన్ననల్ చెదర ॥ విప్పుచుఁ గన్నుల మూయుఁ జేయుచుం
బూనిన సీత్కృతుల్ నెఱపు ॥ మోవుల నొక్కుచు నీవు లూడ్పుచున్
జానుగ మేనులం బులక ॥ జాలములన్ వెలయించుచున్ బర
స్త్రీనికరంబునందుఁ బతి ॥ రీతిఁ జరించు సమీరుఁ డత్తఱిన్.

ఉ. ఉపనిషదర్థవేద్య దురి ॥ తోగ్ర భవామయవైద్య వాసరా
ధిపశశివహ్నినేత్ర సహ ॥ దీర్ణపవిత్రచరిత్ర సత్కృపా
స్నపితసమస్తలోక కర ॥ సంగతదివ్యపినాక భీకర
ద్విపసురవైరిభంజన సు ॥ ధీజన రంజన నిర్గతాంజనా.

ఉత్సాహ.—

తారకాసురారిజనక ॥ దక్షయాగభంజనా
తారకాచలేంద్రవాస ॥ దానకల్పభూరుహా
తారకాధినాయకావ ॥ తంస భవపయోధిసం
తారకాభిధాన యాతు ॥ ధానవైరిసన్నుతా.

క. దండధరచండవిక్రమ, దండనపాండిత్యమండి ॥ తప్రబలభుజా
దండ సుపర్వాలయకో, దండ యఖండప్రమోద ॥ తాండవలోలా.

శృగారశతకము సమాప్తము.

---

శ్రీ ర స్తు

# భ ర్తృ హ రి సు భా షి త ము

# వై రా గ్య శ త క ము



## తృ ష్ణా దూ ష ణ ము

శ్లో. చూడో త్తంసితచారుచన్ద్రకలికాచంచచ్ఛిఖాభాస్వరో
లీలాదగ్ధవిలోలకామశలభః శ్రేయోదశాగ్రేస్ఫురన్,
అన్తఃస్ఫూర్జదపారమోహతిమిరప్రాగ్భారముచ్చాటయం
శ్చేతస్సద్మని యోగినాం విజయతే జ్ఞానప్రదీపో హరః. 1

వ్యా. చూడేతి. చూడో త్తంసితస్య శిరోభూషణీకృతస్య, - చన్ద్రస్య - చారుకలికయా మనోహరకోరకేణేవ - చఞ్చచ్ఛిఖయా ప్రకాశమానాగ్రేణ - భాస్వరః ప్రకాశమానః, విలోలః చఞ్చలః-కామ ఏవ శలభః-యః లీలయా విలాసేన-దగ్ధోయేన, శ్రేయసాం శుభానాం - దశాసు అవస్థాసు-అగ్రే పురతః - స్ఫురన్ ప్రకాశమానః, అన్త ర్మనసి - స్ఫూర్జతః విజృమ్భమాణస్య - అపారస్య అనన్తస్య - మోహతిమిరస్య - ప్రాగ్భారం గురుం ప్రాక్ప్రదేశమ్, ఉచ్చాటయన్ నిరస్యన్, జ్ఞానప్రదీపః జ్ఞానప్రకాశకః, హరః భక్తానాం జ్ఞానాజ్ఞానకృత మానసిక వాచిక కాయికపాపహారీ భగవాన్ సామ్బశివః, యోగినాం సనకాదీనాం, చేతస్సద్మని మనస్యేవ గృహే, విజయతే సర్వోత్కర్షేణ వర్తతే.

ప్రథమతః చూడో త్తంసితేతి వాక్యే చన్ద్రపదగ్రహణాత్ భక్తానాం తాపహారిత్వర్థో లభ్యతే, లీలాదగ్ధేతి వాక్యే కామశలభపదగ్రహణాత్ మహాశత్రుసంహారీతి లభ్యతే, అన్తఃస్ఫూర్జదితి వాక్యే మోహతిమిరపదగ్రహణాత్ యథా ఉదిత స్సూర్యః సర్వతిమిరాణి నాశయతి తథా అయమపి అజ్ఞాననాశం కరోతీతి, చేతస్సద్మనీతి వాక్యే జ్ఞానదీపపదగ్రహణాత్ కామక్రోధాది షడ్వర్గరహితనిర్మలచిత్తానాం నిస్సఙ్గానాం యోగినాం చేతసి యథా వర్తతే తథా భక్తానాం సర్వాజ్ఞాననాశనం కుర్వన్ జ్ఞానప్రదీపో హరో విజయత ఇత్యభిప్రాయః. శార్దూలవిక్రీడితమ్.

టీ. శివునిదీపముగ నుపమించి చెప్పుచున్నాఁడు. చూడో... భాస్వరః— చూడా=సిగయందు, ఉత్తంసిత=చుట్టఁబడిన పుష్పములదండగాఁ జేయఁబడిన, చారు= సొగసైన, చంద్రకలికా=చందురునికల యనెడి, చఞ్చత్ = ఒప్పు (ఇది చంద్రపరము) లేక చలించు (ఇది శేఖరపరము), శిఖా = జ్వాలచేత, భాస్వరః = ప్రకాశించినవాఁడై, లీలా...శలభః—లీలా=విలాసముగా, దగ్ధ=కాల్పఁబడిన, విలోల = చంచలమనస్సుగల, కామ=మన్మథుఁడను, శలభః = మిడుతఁ గలదియు, శ్రేయః = శుభమగు, దశా=అవస్థ యందు, అగ్రే = ముందుగా, స్ఫురన్ = ప్రకాశమానమగుచు, అన్త...ప్రాగ్భారం - అన్తః=మనస్సునందు, స్ఫూర్జత్=విజృంభించుచున్న, అపార = అంతములేని, మోహ= అజ్ఞానమను, తిమిర = అంధకారముయొక్క, ప్రాగ్భారం = మొత్తమును, ఉచ్చాటయన్ = మాయమగునట్లు వెడలఁగొట్టుచు, జ్ఞానప్రదీపః = జ్ఞానజ్యోతి, (అగు); హరః = శివుఁడు, యోగినాం = యోగులయొక్క; చేతఃసద్మని=మనస్సనునింటియందు, విజయతే=సర్వశ్రేష్ఠుఁడై యున్నాఁడు. భక్తులమానసిక వాచిక కాయిక సంబంధములగు పాపములను బోఁగొట్టువాఁడైన భగవంతుఁడు సాంబశివుఁడు సనకాదియోగుల మనోగృహములయందు సర్వోత్కృష్టుఁడైయున్నాఁడు.

తా. శివుఁడు దీపముఁగను, నాతఁడు ప్రసాదించు జ్ఞానము వెలుతురుగను, నాతని సిగయందలి చంద్రుఁడు జ్వాలగను, నాతనిని దగ్ధతే దహింపఁబడిన మన్మథుఁడు మిడుతగను, శుభావస్థయందు ముందుగా శివుఁడు దోఁచుట మంచివత్తికొనయం దుండు దీపపువెలుఁగుగను, యోగులమనస్సులు ఇండ్లవంటి వనియు అజ్ఞానము చీఁకటివంటి దనియు చెప్పి దానిని పోఁగొట్టు సాంబశివుఁడు యోగులమనస్సులలో మెలఁగుచు సర్వోత్కృష్టుఁడై యున్నాఁ డనుచున్నాఁడు.

క. శ్రీరమణధృతమృదంగక
భీరధిమింధిమిసినాద ఽ భేదక్రమయో
గ్యారంభగుంభనటన
శ్రీరంజిత సుఖనివేశ ! ఽ శ్రీసోమేశా.

చ. కలితవతంసితేందుకలి ఽ కాశిఖచే విలసిల్లి చిత్తభూ
శలభము నుగ్గుసేసి శుభ ఽ సారదశాగ్రమునన్ వెలుంగుచున్
బలవదపారమోహభర ఽ గాఢతమోహరణంబు సేయుచుం
దెలివి వెలుంగు పొల్చు శివఽదేవుఁడు యోగిమనోంబుజంబులన్,

అవ.—వైరాగ్యసిద్ధికి సాధనము తృష్ణను విడనాడుట. ఆయుపదేశముచు జేయుచున్నాఁడు.—

శ్లో. భ్రాన్తం దేశమనేకదుర్గవిషమం ప్రాప్తం న కించిత్ఫలం
త్యక్త్వా జాతికులాభిమానముచితం సేవా కృతా నిష్ఫలా,
భుక్తం మానవివర్జితం పరగృహేష్వాశంకయా కాకవ
త్తృష్ణే! జృమ్భసి పాపకర్మపిశునే నాద్యాపి సంతుష్యసి. 2

వ్యా.—అథ రాగస్య తృష్ణామూలకత్వాత్తద్ధ్వంసం వినా న వైరాగ్యసిద్ధిరిత్యభిప్రేత్య తత్సిద్ధ్యర్థమాదౌ తావత్తత్పరిపన్థిభూతాం తృష్ణాం దూషయతి—భ్రాన్తమిత్యాది నవభిశ్శ్లోకైః తత్ర ప్రథమం స్వకర్మకష్టనివేదనపూర్వకం తృష్ణాం సంబోధ్య త్రిభిర్దూషయతి—భ్రాన్తమితి—అనేకైర్బహుభి - ర్దుర్గైః పార్వత వార్క్ష జల దుర్గాదిభిః - విషమం వికటం దుస్సంచారమిత్యర్థః, దేశం, భ్రాన్తం సంచరితం, తథాఽపి, కించి దల్పమపి, ఫలం ధనం, నప్రాప్తం న లబ్ధం. బహుఫలాపేక్షయైవ దుర్గమ విదేశసంచారః కృతః-ఫలం త్వీషదపి న ప్రాప్త మిత్యర్థః - అత్ర దేశశబ్దస్య నపుంస కత్వం నిఘణ్ట్వన్తరేషు మృగ్యం - యద్వా - దేశముద్దిశ్య భ్రాన్తం * భావే క్తప్రత్యయః. అథవా - ని. 'నీవృజ్జనపదౌ దేశవిషయౌ వి' త్యభిధానాత్ - పుంలిఙ్గస్యాపి దేశశబ్దస్య నపుంసకత్వసంబన్ధ మనువర్తత ఇతి భాష్యకారప్రయోగా దిష్యతే. తథా, ఉచిత మనురూపం, జాతికులయోః - జాతిః బ్రాహ్మణత్వాదిః - కులం సద్వంశః-తయోరభిమానమిత్యర్థః. * సాపేక్షత్వేఽపి గమకత్వాత్సమాసః, త్యక్త్వా విసృజ్య, నిష్ఫలా ఫలశూన్యా, సేవా పరిచర్యా, కృతా - ధనాఢ్యానామితి శేషః, ఉభయత్రాపి కష్టమేవావశిష్టం న త్వన్య త్కించిదపీత్యర్థః. ని. 'లాభనిష్పత్తియోగేషు బలే శక్త్యే ధనేఫల' మితి వైజయన్తీ, తథా మానవివర్జిత మభిమానశూన్యం యథా తథా-బహుమానవిహీనమితి వా, ఆశఙ్కయా ఆకాఙ్క్షయా - లోలుపత్వేనేతి యావత్, పరగృహేషు, కాకేన బలిభుజా-తుల్యం కాకవత్ * 'తేన తుల్యం క్రియా చేద్వతిః' ఇతి వతిప్రత్యయః, భుక్తమ్ అభిమానత్యాగేఽపి న బహుమానపూర్వకం కిం తు సావమానమేవ దత్తం పరాన్నపిణ్డ మభ్యవహృతమిత్యర్థః. తథాఽపి, పాప కర్మణాం పాపాత్మనాం - పిశునే సూచికే-యేషాం తృష్ణా త ఏవ పాపిష్ఠా ఇతి భావః-యద్వా - పాపకర్మణాం దుష్కర్మణాం - పిశునే ప్రవర్తికే- ఇత్యర్థః. ఏతద్వ్యతిరేకేణ దుష్కర్మప్రవర్తకాన్తరాభావాదితి భావః, హే తృష్ణే విషయస్పృహే. జృమ్భసి ప్రవృద్ధా భవసి, కిం త్వద్యాపి ఈదృక్కష్టకర్మప్రవర్తనదశాయామపీతి

భావః, న సంతుష్యసి సంతుష్టా న భవసి - విరతిం న ప్రాప్నోషీత్యర్థః. ఇతః పరమపి కించిద్దుష్టకర్మ కారయితు మపేక్షాఽస్తీవ ప్రతిభాతీతి భావః. శార్దూలవిక్రీడితమ్.

టీ. అనేకదుర్గవిషమం = అనేకములగు పోవుటకశక్యములైన ప్రదేశములచే సంచరించుటకు యోగ్యముగాని, దేశం = దేశమున, భ్రాన్తం = సంచరించితిని. కిఞ్చిత్ = అల్పమైనను, ఫలం = ప్రయోజనము-(ధనము), ప్రాప్తం న = లభ్యపడినది కాదు, ఉచితం=తగిన, జాతికుల అభిమానం = జాతియందును, సద్వంశమునందును గల ప్రీతిని, త్యక్త్వా = వదలి, నిష్ఫలా = ప్రయోజనకారికాని, సేవా=కొలువు, కృతా= చేయఁబడినది, మానవివర్జితం = అభిమానమును వదలి, పరగృహేషు = ఇతరుల ఇండ్ల యందు, కాకవత్ = కాకివలె, అశఙ్కయా=జంకుతో, భుక్తం=భుజించితిని, పాప కర్మపిశునే = పాపకార్యములయందు ప్రవర్తించేదానా! తృష్ణే = ఓ ఆశా! జృంభసి= విజృంభించుచున్నావు. అద్యాపి=ఇప్పుడును, నసంతుష్యతి=తనివిం జెందవు.

తా. అడవులతోఁ గొండలతో నదులతోఁ దిరుగరానిదేశ మెల్లఁ దిరిగి తిరిగి విసికితిని. లేశమైనను లాభము కలుగలేదు. ఉండవల సిన జాత్యభిమానమును గులాభిమానమును విడిచి నిష్ఫలమైన సేవా వృత్తి నాచరించితిని. సిగ్గు వోనాడి కాకివలె నితరుల కొంపల బెదరుచుఁ దిండితింటిని. పాపకర్మలకుఁ బాల్పఱుచు నో యాశా! ఇంకను బెచ్చు పెరుఁగుచునే యుంటివిగాని పరితృప్తి చెందవు గదా!

చ. విసికితి దుర్గదుర్విషయవిభ్రమయుక్తిఁ గులాభిమానముక్
బసచెడ సేవ చేసితి విపన్నుఁడనై పరగేహసీమ వా
యసమువలెక్ భుజించితిఁ బ్రయత్నము నిష్ఫలమై నశించె సం
తసపడవుగ్రకర్మపిశునత్వము చూపెద వాశ యేటికిన్?

శ్లో. ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం ధ్మాతా గిరేర్ధాతవో
నిస్తీర్ణస్సరితాంపతిర్నృపతయో యత్నేన సంతోషితాః,
మన్త్రారాధనతత్పరేణ మనసా నీతాః శ్మశానే నిశాః
ప్రాప్తం కాణవరాటకోఽపి న మయా తృష్ణే! సకామా భవ. 3

వ్యా.—ఉత్ఖాత మితి.—నిధిశఙ్కయా నిక్షేపోఽత్ర తిష్ఠతీతి భ్రాన్త్యా క్షితి తలం కించిదిష్టకాదినిచితభూతలం, ముత్ఖాతమవదారితం-తత్ర న కించిల్లబ్ధమిత్యర్థః, తథా గిరేః, ర్ధాతవః మనశ్శిలాద్యాః, ధ్మాతాః సువర్ణభావం ప్రాప్స్యన్తీతి ధియా అగ్ని మూషాయాం సమాలికావిశేషం నిక్షిప్య యావత్ప్రాణం ఫూత్కారైస్సంతాపితా

ఇత్యర్థః. తథాఽపి న కించిజ్జ్ఞాతమితి భావః. * 'ధ్మాశబ్దాగ్ని (వక్త్ర) సంయోగయోః' త్యస్మాద్ధాతోః కర్మణి క్తః - ని. 'ధాతుర్మనశ్శిలాద్యద్రే'రిత్యమరః. అన్యత్రాప్యుక్తం—

'సువర్ణరూప్య తామ్రాశ్మ హరితాళ మనశ్శిలాః
గైరికాఞ్జన కాశ్మీర లోహ సీసా స్సహిఙ్గులాః
గన్ధకాభ్రకమిత్యాద్యా ధాతవో గిరసంభవాః. ఇతి.

అత్ర సువర్ణ రూప్యవ్యతిరేకేణైవ యోజ్య-మన్యథా ప్రకృతాసంగతేరితి, తథా, సరితాం పతిస్సముద్రో, నిస్తీర్ణః, ద్వీపాన్తరేషు వాణిజ్యేన బహుధనం సంపాదయిష్యామీతి సాంయాత్రికభావేన విలఙ్ఘిత ఇత్యర్థః. నృపతయో రాజానశ్చ, యత్నేన ధనానువర్తనరూపప్రయత్నేన, సంతోషితాః, తథా మన్త్రారాధనతత్పరేణ మన్త్రజపతాత్పర్యవతా మనసా హేతునా, శ్మశానే ప్రేతభూమౌ, నిశా రాత్రయో, నీతా యాపితాః. భూతప్రేతపిశాచాదిభ్యో భయ మవిగణయ్య నిధ్యాదిప్రదర్శకదేవతాభిముఖీకరణసాధనమన్త్రజపతాత్పర్యేణ నిశాసు శ్మశానే స్థితమిత్యర్థః, తథాఽపి మయా, కాణవరాటకః అన్ధకపర్దోఽపి, న ప్రాప్తః - ధనం తు దూరాపాస్తమితి భావః. ని. 'కపర్దశ్చ వరాటక' ఇతి హలాయుధః. అతః, తృష్ణే, సకామా సఫలమనోరథా, భవ త్వత్ప్రతిజ్ఞాతార్థనివృత్తేః సిద్ధసంకల్పా భవేత్యర్థః. ఇత్థమనర్థహేతుభూతయా తృష్ణయా వృథా వ్యాపారజనితశ్రమ ఏవావశిష్టో న వాఞ్ఛితలాభ ఇత్యతస్తదున్మూలనే యత్నః కర్తవ్య ఇతి భావః. వృత్తం పూర్వవత్.

టీ. నిధిశఙ్కయా=నిక్షేప(మున్నదను) భ్రమచేత, క్షితితలం = భూప్రదేశము ఉత్ఖాతం=త్రవ్వఁబడినది, గిరేః = కొండయొక్క, ధాతవః = (మనశ్శిలాది) జాతివిశేషములు, ధ్మాతాః=(బంగారముగా మారునని మూలికలతో నింపిన మూసలను నిప్పునం దుంచి గొట్టములతో) ఊఁదఁబడినవి, సరితాం పతిః = సముద్రము, నిస్తీర్ణః = దాఁటఁబడినది, నృపతయః=రాజులు, యత్నేన = ప్రయత్నముతో, సన్తోషితాః = సంతోషపెట్టఁబడిరి. మన్త్రా...పరేణ-మన్త్ర=మంత్రములతోడి, ఆరాధన = జపమునందు, తత్పరేణ=ఆసక్తమైన, మనసా=మనస్సుచే, శ్మశానే=ప్రేతభూమియందు, నిశాః = రాత్రులు, నీతాః = కడపఁబడినవి, కాణవరాటకః అపి=గ్రుడ్డిగవ్వయైనను, మయా = నాచే, నప్రాప్తః = పొందఁబడలేదు, తృష్ణే=ఓ ఆశా! సకామా భవ=సంకల్పసిద్ధవు గమ్ము.

తా. నిక్షేపము దొరకు ననునాశతో నేలఁ ద్రవ్వితిని. బంగారు కొఱకై కొండలమీఁది మణిశిల మొదలగు ధాతువులఁ గరగించితిని.

సముద్రప్రయాణములఁ గావించితిని. కష్టపడి వారి మనసువచ్చునట్లు నడచుకొని రాజుల సంతస పెట్టితిని. మంత్రారాధనముల నొనర్చుచు శ్మశానములందుఁ బెక్కురాత్రులు గడపితిని. ఇంతచేసియు నేనొక గ్రుడ్డిగవ్వనైనఁ గాంచనైతిని. ఆశా! యింక సంతోషపడి యూర కుండుము.

చ. నిధి యనుశంక భూతలము ద్రవ్వితి నావచే మహో
దధిఁ దరియించితిన్ శిఖరిధాతువు లూఁదితి రాజుఁ గొల్చితిన్
వ్యథ గొని ఘోరమంత్రజప మర్థి నొనర్చితి గవ్వయైన నే
విధమునఁ బొందనైతిఁ గదవే ముద మందఁగ చే దురాశరో.

శ్లో. ఖలోల్లాపాస్సోఢాః కథమపి తదారాధనపరై
ర్నిగృహ్యాన్తర్బాష్పం హసితమపి శూన్యేన మనసా,
కృతో విత్తస్తమ్భప్రతిహతధియామఞ్జలిరపి
త్వమాశే! మోఘాశే! కిమపరమతో నర్తయసి మామ్. 4

వ్యా.—ఖలోల్లాపా ఇతి.—ఖలానాం దుర్జనానా, ముల్లాపాః దుర్భాషితాని, తదారాధనపరైస్తత్సేవాతత్పరై - రస్మాభిరితి శేషః. కథమ ప్యతికృచ్ఛ్రేణ, సోఢాః క్షాన్తాః - అన్యథాభావే కార్యభఙ్గో భవేదితి భయాదితి భావః తథా, అన్తరభ్యన్తర ఏవ-బాష్పం తదాలాపశ్రవణజనితాశ్రు, నిగృహ్య నియమ్య, శూన్యేన నిరుత్సుకేన, మనసా ఉపలక్షితైర్నిర్భిన్నాన్తఃకరణై రిత్యర్థః, హసితం హాసోఽపి కృత ఇతి శేషః * కర్తరి క్తః. దురాలాపైరాక్షిప్తా అపి తే సంతోషవన్త ఏవ న తు నిర్విణ్ణా - అతో విశ్వసనీయా ఇతి బుద్ధ్యుత్పాదనార్థం నిర్విషయమిథ్యాహాసోఽపి విరచిత ఇత్యర్థః. తథా, విత్తేన ధనేన - యః స్తమ్భో జడీభావ-స్తేన ప్రతిహతా మూఢా వివేకశూన్యేతి యావత్ - ధీర్యేషాం తేషాం ధనదుర్మదాన్ధానామిత్యర్థః. ని. 'స్తమ్భౌ స్థూణా జడీభావౌ' ఇత్యమరః. అఞ్జలిరపి కృతః ప్రహ్వీభావోఽపి విహితః తథాఽపి న కించి ల్లబ్ధమితి భావః. అతః మోఘాశే వ్యర్థమనోరథే ఆశే తృష్ణే. ని. 'ఆశా తృషా దిశోః ప్రోక్తే'తి విశ్వః. త్వం, మా, మతోఽస్మాత్ఖలాలాపాదిసహనాదికృత్యాత్, అపరమితరత్, కిం కార్యం, నర్తయసి నాటయసి-మయా కిం కార్యం కారయసీతి యావత్ - న కిమపీత్యర్థః, నాటయితవ్యార్థస్య వైయర్థ్యాదితి భావః; నను పూర్వశ్లోకే మయేత్యేకవచనం ప్రయుక్తం - అత్ర తు తదారాధనపరైరితి బహుత్వం-కథమేతత్సమఞ్జసమితి చేత్సత్యం - తృష్ణోపహతానాం బహుత్వాత్తత్ప్రయుక్తతత్కర్మ కర్తృభేదేన క్వచిదేకవచనం క్వచి

ద్బహువచనం చ వివక్షితమిత్యవ ధేయమ్; ఏవము త్తరత్రాపి యోజ్యమ్. శిఖరిణీవృత్తమ్ - 'రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగశ్శిఖరిణీ' తి లక్షణాత్.

టీ. ఖలఉల్లాపాః = దుర్జనులయొక్క దుర్భాషితములు, తదారాధనపరైః-తత్ = వారిని, ఆరాధన=కొలుచుటయందు, పరైః = ఆసక్తు లగువారిచేత, కథమపి = ఏవిధము ననో, సోఢాః=సహింపఁబడినవి; అన్తః=లోలోపుగనే, బాష్పం = కన్నీటిని, నిగృహ్య= అడంచుకొని, శూన్యేన = నిరుత్సుకమగు, మనసా = అంతఃకరణముతో, హసితమపి= నవ్వునుకూడ నవ్వితిమి, విత్త...ధియాం-విత్త = ధనముచేనైన, స్తంభ = జడత్వముచే, ప్రతిహత = కొట్టఁబడిన (వివేకశూన్యమైన). ధియాం = బుద్ధిగలవారికి, అఞ్జలిరపి = చేతులను జోడించుట సైతము, కృతం = చేయఁబడినది, మోఘ = వ్యర్థమగుమనో రథముగల, ఆశే=ఓ ఆశా, త్వం = నీవు, మాం = నన్ను, ఇతఃపరం = ఇంతకంటెను, కిం న ర్తయసి=ఇంక ఏమాట ఆడించెదవు?

తా. నీచులఁ గొలుచుచు వారిదుర్భాషలెల్ల సైఁచితిని. పొరలి వచ్చు కన్నీటిని లోలోన మ్రింగి మనసునలేని వెడనవ్వు సయితము నవ్వితిని. ధనగర్వముచే మతిమాలినవారికి దోసిలి యొగ్గితిని. ఆశా! నీకోరిక యీడేఱ లేదు. ఇంక నన్నేమి యాడించెదవు?

చ. పలువలు పల్కుమాట లోకశభంగి సహించితి బాష్పవారి లో
పలనె హరించి శూన్యమగుశభావమునన్ వెడనవ్వు నవ్వితిన్
బొలుపఱి విత్తజాడ్యహతశబుద్ధుల కంజలి చేసితిం గటా
తలఁకక యింక నేపనికిఁ శ దార్చెదు నన్ను దురాశ నీవిటన్.

శ్లో. అమీషాం ప్రాణానాం తులితబిసినీపత్త్రపయసాం
కృతే కిం నాస్మాభిర్విగళితవివేకైర్వ్యవసితం,
యదాఢ్యానామగ్రే ద్రవిణమదనిస్సంజ్ఞమనసాం
కృతం వీతవ్రీడైర్నిజగుణకథాపాతక మపి. 5

వ్యా.—అథ తృష్ణాదుర్విలసితేనైవ మహదనుచితమప్యాచరితమిత్యాహ—అమీషామితి.—కించ, తులితాని సమీకృతాని-బిసినీపత్త్రపయాంసి-యేషాం తేషాం-నళినీదళ గతజలలవతరళానాం-క్షణభఙ్గురాణా మిత్యర్థః, అమీషామవిశ్వసనీయానాం ప్రాణానాం కృతే - ఏతత్పాలనార్థమిత్యర్థః. ని. 'అర్థే కృతే శబ్దౌ ద్వౌతాదర్థ్యేఽవ్యయ సజ్ఞితా వి' తి వచనాత్, విగళితః భ్రష్టః - వివేకః కర్తవ్యాకర్తవ్యా విచారో - యేషాం తైరస్మాభిః, కిం దుష్కర్మ, న వ్యవసితం నోద్యుక్తం - సర్వ మపి వ్యవసిత మేవే

త్యర్థః, కుతః? యద్యస్మాత్కారణాత్, ద్రవిణమదేన ధనమదేన, నిస్సంజ్ఞాని స్తమ్భితాని - మనాంసి యేషాం తేషాం - విమర్శశూన్యాన్తఃకరణానా; మాఢ్యానాం - ని. 'ఇభ్య ఆఢ్యో ధనీ స్వామీ' త్యమరః. అగ్రే పురస్తాత్, * మ్లానవ్రీడైర్నిర్లజ్జై, రస్మాభి, ర్నిజగుణకథాపాతకంస్వకీయవిద్యావినయాదిగుణప్రశంసారూపపాపమపి, కృతం తచ్చ నిషిద్ధమ్ 'ఆత్మప్రశంసాం పరగర్హాణమివ వర్జయేత్' ఇత్యాపస్తమ్బస్మరణాత్. 'ఆత్మప్రశంసా మరణం పరనిన్దా తథైవ చే'తి వచనాదాత్మగుణప్రశంసైవాత్మోపఘాతః-తస్య చ నిరయప్రాపకత్వే నిపాతకత్వం చ; నిజగుణప్రఖ్యాపనేన ధనం సంపాద్య తేన ప్రాణాన్ సంతర్పయిష్యామ ఇత్యాశయేనేదృశానుచితమాచరితం - తథాఽపి న తల్లబ్ధమిత్యపిశబ్దార్థః.

టీ. తులిత...పయసాం-తులిత = సామ్యముచేయఁబడిన, బిసినీపత్ర=తామరాకులోని, పయసాం=నీరుగల, అమీషాం=ఈ, ప్రాణానాం కృతే = ప్రాణములకొఱకు, విగళితవివేకైః=మతిమాలిన, అస్మాభిః=మాచేత, కిం=ఏది, నవ్యవసితం = యత్నింపఁబడలేదు? యత్=దేనిచే (ఏకారణముచే నన), ద్రవి...నసాం-ద్రవిణమద = ధనమదముచే, నిస్సంజ్ఞ = స్తంభీభూతమైన, లేక మైమఱచిన, మనసాం=మనస్సుగల, ఆఢ్యానాం = ద్రవ్యవంతులయొక్క, అగ్రే=ఎదుట, వీతవ్రీడైః = పోయినసిగ్గుఁగల (సిగ్గులేక). నిజ...పాతకమపి-నిజగుణకథా - స్వగుణకీర్తనము (అను), పాతకమపి = పాపముకూడ, కృతం = చేయఁబడినది.

తా. తామరాకులోని జలబిందువులవలెఁ జంచలములైన యీ ప్రాణములకొఱకై మతిమాలిన మన మెట్టిదుష్కార్యము చేయఁబూనము? ధనమదముచే మది మఱచియున్న ధనికులచెంత సిగ్గువదలి స్వగుణసంకీర్తన మనుపాతకమును సయిత మార్జించుకొంటిమి.

మ. నళినీపత్రగతాంబుచంచలము లెన్నం బ్రాణముల్ వీనికై
గళితప్రజ్ఞత మేము చేయనియకార్యంబు లేదేమియున్
బలవద్విత్తమదాతిరేకజనితోపస్మారులైనట్టి లు
బ్ధులయొద్దన్ నిజసద్గుణస్తుతి మహాదోషంబు గావించుటన్.

శ్లో. క్షాంతం న క్షమయా గృహోచితసుఖం త్యక్తం న సంతోషత
స్సోఢో దుస్సహశీతవాతపవనక్లేశో న తప్తం తపః,
ధ్యాతం విత్తమహర్నిశం నియమితప్రాణైర్న శమ్భోః పదం
తత్తత్కర్మ కృతం యదేవ మునిభి స్తైస్తైః ఫలైర్వంచితాః. 6

వ్యా.—అథ యద్యప్యుచితతమేవాచరితం తథాఽపి తస్యాయాథాతథ్యాన్న ఫలోపధాయకమభూ దిత్యాహ—క్షాన్తమితి.—సత్యేవమపి పరిభవహేతౌ మనసోఽనుద్వేగః క్షమా - తయా, న క్షాన్తం న సోఢమ్ - అవమానాదికమితి శేషః - కిం త్వశక్తతయై వేతి భావః, తథా, గృహే ఉచితం యుక్తం, యత్ సుఖం మృష్టాన్నభోజనకళత్రసంభోగాదిజనితానన్దాది, తచ్చ, సంతోషతః కిమనేన తుచ్ఛేనేతి పరితోషా, న్న త్యక్తం - కిం త్వసంభావితబ్రహ్మచర్యైవేతి భావః, తథా, దుస్సహాః సోఢుమశక్యాః - యే శీతవాతతపనైః - క్లేశా దుఃఖాని తే, సోఢాః క్షాన్తాః - దేహయాత్రార్థం దేశాన్తరసంచారే తేషామనుభూతత్వాదితి భావః, తపశ్చాన్ద్రాయణాదికం తు, న తప్తం న చరితం, తథా, నియమితప్రాణైరన్తఃప్రత్యాహృతప్రాణై, రస్మాభిః, అహశ్చ నిశా చాహర్నిశమ్ - అహోరాత్రం * 'అచతురే' త్యాదినా నిపాతనాత్సాధుః, విత్తం, ధ్యానం చిన్తితం, శంభోః పదం న ధ్యాతం, అతో మునిభి, ర్యద్యత్కర్మ కృతమ్, అవమానసహనాదికమాచరితం, తత్తదేవ కర్మ, అస్మాభిశ్చ కృతం, కింతు తైస్తైస్తత్తత్కర్మనియతైః, ఫలైర్వఞ్చితా వర్జితాః, తేషామయథాచరణేన వైగుణ్యాత్ఫలభాజో న జాతా ఇత్యర్థః; క్షాన్త్యాదినైవ యద్యవమానాదికం క్షాన్తం స్యాత్తర్హి ఫలలాభో భవేదేవ - న తు తదాచరితమ్; అయం చానర్థస్తృష్ణా దుర్విలసితమూల ఏవేతి ఫలితార్థః. శార్దూలవిక్రీడితం వృత్తం-లక్షణం తూక్తమ్.

టీ. క్షాన్త = ఓర్చితిమి, నక్షమయా = సైరణచేతకాదు సుమా, గృహోచిత సుఖం = సంసారసౌఖ్యము, త్యక్తం = విడనాడఁబడినది, సంతోషతః న=ఆనందముచేత కాదు సుమా, దుస్సహా, శీత, వాతతపనక్లేశః = సహింపరాని, చలి, గాలి, ఎండల శ్రమ, సోఢః = ఓర్వఁబడినది, తపః న తప్తం = తపస్సుచేయఁబడలేదుసుమా, విత్తం = ధనము. అహర్నిశం = రేయింబవళ్లు, ధ్యాతం = ధ్యానింపఁబడినది, నియమితప్రాణైః=నిగ్రహింపఁబడిన మనోవృత్తులుగల (మాచే), శమ్భోః పదం న (ధ్యాతం)=శివునిచరణము ధ్యానింపఁబడలేదు సుమా, మునిభిః=మునులచే, యత్కర్మ = ఏ (పైచెప్పిన అవమానసహనాదులైన) కర్మము, కృతం=చేయఁబడినదో, తత్తత్కర్మ = ఆయాకర్మ (మాచేత), కృతం = చేయఁబడినది, తైః తైః ఫలైః = ఆయాఫలములచేత, వఞ్చితాః = మోసగింపఁబడితిమి సుమా.

తా. నిందావమానాదులను సహించియుంటిమి, కాని యది క్షమవలనఁ గాదు. సంసారసౌఖ్యమును విడనాడితిమి కాని యది పరమానందముతోఁగాదు. ఎండవానలకోర్చియుంటిమి గాని యది తప మొనరించుటకై కాదు. రేయనక పవ లనక ధనమును ధ్యానించితిమి కాని

మనోవృత్తులనాపి శివచరణముల ధ్యానింప లేదు. మునులుచేయు నాయా కర్మలఁ జేయనేచేసితిమి కాని వాని ఫలములు మమ్ము మోసపుచ్చెను.

మ. క్షమచేఁగా దవమానమోర్చుట మహాశసంతుష్టిచేఁ గాదు గే
హామునం దైనసుఖంబు మానుట తపోవ్యాసక్తిచేఁ గాదు దు
ర్దమశీతోష్ణజయంబు కాదు హరుపైఁ ధ్యానంబు విత్తంబుపై
నమరెఁ మాకు మునీంద్రకృత్యములు లేవాసత్ఫలాభ్యున్నతుల్.

శ్లో. భోగా న భుక్తావయమేవ భుక్తా స్తపో న తప్తం వయమేవ తప్తాః,
కాలోనయాతో వయమేవ యాతా స్తృష్ణానజీర్ణావయమేవ జీర్ణాః.

వ్యా.—అథ త్రిభిర్జరాదూషణద్వారా తృష్ణాం నిన్దతి—భోగా ఇతి.— భుజ్యన్త ఇతి భోగాః స్రక్చన్దనాదివిషయా, న భుక్తా నానుభూతాః, కిం తు వయమేవ భుక్తాః తత్ప్రాప్త్యర్థం దురన్తచిన్తయా గ్రస్తా, తథా, తపః వ్రతోపవాసాదిపుణ్యం, న తప్తం నాచరితం, కింతు వయమేవ తప్తాః ఆధ్యాత్మికాదితాపత్రయేణ సంతాపితాః తథా, కాలో న యాతః న గతః-తస్యాఖణ్డదణ్డాయమానత్వేన యానాసంభవాదితి భావః, కిం తు వయమేవ యాతాః జీవితావధికాలముల్లఙ్ఘ్యావసానం ప్రాప్తా ఇత్యర్థః, అథవా కాలో న యాతః సదాచారసజ్జనసహవాసాదినా న గతః - తథా చేచ్ఛ్రేయో భవేదేవేతి భావః. కిం తు వయమేవ యాతాః దేహగేహాదియోగక్షేమానుసంధానలమ్ప టత్వేన కాలమతిక్రమ్య గతా ఇత్యర్థః, తథా తృష్ణా, న జీర్ణాః న శిథిలా-తచ్ఛైథిల్య హేతోరనుపస్థితత్వాదితి భావః, కింతు వయమేవ జీర్ణాః తృష్ణాసహాకృతజరయా శిథి లాఙ్గా జాతా ఇత్యర్థః. అతః ఇతః పరం వా, క్షిప్రం ఖట్వాఙ్గధారిచిన్తనేనైవ తృష్ణో న్మూలనహేతుస్సంపాదనీయ ఇతి భావః.

ఇన్ద్రోపేన్ద్రవజ్రాలక్షణశ్రవణాదుపజాతివృత్తమ్.—'అనన్తరోదీరిత లక్ష్మభాజౌ పాదౌ యదీయావుపజాతయ స్తా' ఇతి లక్షణాత్.

టీ. భోగాః = (స్రక్చందనవిషయములు మొదలగునవి) భోగములు, నభుక్తాః = అనుభవింపఁబడ లేదు. వయ మేవ = మేమే, భుక్తాః = (కాలముచే) భుజింపఁబడితిమి, తపః = (వ్రతములు, ఉపవాసములు మొదలగునవి) తపస్సు, నతప్తాః = ఆచరింపఁబడలేదు. వయమేవ = మేమే, తప్తాః = (ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికములను తాపత్రయ ములచే) తపింపఁబడితిమి, కాలః=కాలము, న యాతః=గడవలేదు, వయమేవ = మేమే, యాతాః = పోయితిమి, (అనఁగా జీవింపవలసినకాలము గతింపఁగా అవసానకాలము

ప్రాపించినది యనుట. తృష్ణా = ఆశ, నజీర్ణా=శిథిలత నొందలేదు, వయమేవ = మేమే, జీర్ణాః = శైథిల్యము నొందితిమి.

తా. భోగములు మాచే ననుభవింపఁబడలేదు. మేమే యనుభవింపఁబడితిమి. తపస్సు మాచేఁ దపింపఁబడ లేదు. మేమే తద్దయు సంతప్తులమైతిమి. కాలము పోవుటలేదు. మేమే పోవువారము. ఆశ బిగిదప్ప లేదు. మేమే బిగి దప్పినవార మైతిమి.

క. భోగానుభవంబు తపో
యోగము కాలంబు చనుటయును ఘనతృష్ణో
ద్యోగవిరామము లే దహ
హా గురుత వహించి తృష్ణ యలజడి తెచ్చెన్.

శ్లో. వలిభిర్ముఖమాక్రాన్తం పలితై రంకితం శిరః,
గాత్రాణి శిథిలాయన్తే తృష్ణైకా తరుణాయతే. 8

వ్యా.—వలిభిరితి— వలిభిర్జరావిశ్లథచర్మరేఖాభిః, ముఖం వక్త్రమాక్రాన్తం - వైరూప్యం ప్రాపిత మిత్యర్థః. పలితేన జరసా శౌక్ల్యేన, శిరః మస్తకమ్, అఙ్కితం చిహ్నితం - శిరః కేశాదయో ధవళా జాతాః ఇత్యర్థః. తథా, గాత్రాణి కరచరణాద్యవయవాః - అవయవివాచినో గాత్రశబ్దస్యావయవార్థత్వం లక్షణయా వేదితవ్యమ్ - అవయవావయవినోరభేదవివక్షయా వా - న చ వక్త్రబాహుళ్యవివక్షాయాం యథాశ్రుతమేవ సమఞ్జసమితి వాచ్యం - ముఖం శిర ఇత్యేకవచనప్రయోగవిరోధాత్ - నను తత్రాపి జాత్యేకవచనగ్రహణే న కోఽపి విరోధ ఇతి చేత్క్రమనేన బకబన్ధప్రయాసేనేత్యలమతిప్రసఙ్గేన, శిథిలాయన్తే శిథిలానీవాచరన్తి జరాజర్జరభావశ్లిష్టసంధిబన్ధతయా కార్యకరణాసమర్థాని జాయన్త ఇత్యర్థః. కింతు, ఏకా తృష్ణా, తరుణాయతే తరుణీవాచరతి - బలిష్ఠా జాతేత్యర్థః. జరయా సర్వమప్యేవం విశకలితం న తృష్ణేతి మహదేతదాశ్చర్యమితి భావః. ఉభయత్రాపి * 'కర్తుః క్యఙ్సలోపశ్చే' తి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః.' ఇతి దీర్ఘః.

శ్లోకాఖ్యమేత దానుష్టుభం వృత్తం - లక్షణం తు నీతిశతకాద్యపద్యే ఉక్తమ్.

టీ. వలిభిః=ముడుతలచే, ముఖం= మొగము, ఆక్రాన్తం = ఆవరింపఁబడినది. (విరూపముఁ జెందినది అని భావము.) పలితైః=నరసినవెండ్రుకలచే, శిరః = తల, అఙ్కితం = చిహ్నముగలది, గాత్రాణి = అవయవములు, శిథిలాయన్తే = పట్టువదలుచున్నవి, కాని,

తృష్ణా ఏకా = ఆశమాత్రము, తరుణాయతే = జవ్వనివలె యాచరించుచున్నది. (విజృంభించుచున్నది.)

తా. మొగమెల్ల ముడుత లావహిల్లినవి. తలయెల్ల నరసినది, అంగములు పట్టువదలుచున్నవి. ఒక్కయాశమాత్రము విజృంభించుచున్నది.

క. కరచరణాద్యవయవముల
భర ముడిఁగెఁ వళులు మొగముపై నిండారెఁ
శిరసెల్లఁ దెల్లవాఱెను
దరిమాలినతృష్ణ యొకఁడెతరుణతఁ బూనెన్.

శ్లో. నివృత్తా భోగేచ్ఛా పురుషబహుమానోఽపి గళిత
స్సమానాస్స్వర్యాతాస్సపది సుహృదో జీవితసమాః,
శనైర్యష్ట్యుత్థానం ఘనతిమిరరుద్ధే చ నయనే
అహో మూఢః కాయ స్తదపి మరణాపాయచకితః. ౧

వ్యా.—నివృత్తేతి.—భోగేచ్ఛా విషయానుభవస్పృహా, నివృత్తా, అత్ర జరాదూషణాభినివేశ పారవశ్యేనేత్థముక్తం - తేన "తృష్ణైకా తరుణాయత" ఇత్యవిరోధః. పురుష ఇతి యో, బహుమానస్సమ్మాన, స్సోఽపి గళితః అపగత - స్తత్ప్రయోజక పౌరుషాద్యపాయాదితి భావః. యద్వా - పురుషాణాం బహుమాన స్తత్కర్తృకసమ్మాన - స్సోఽపి గళితః - పూర్వవత్పురుషాదినా న బహుమన్యత ఇత్యర్థః. ఇదానీం తాదృశగౌరవలాభాదితి భావః. అథ పరేతబాన్ధవశోచనాపదేశేన స్వస్యాపశతాం సూచయన్నాహ—జీవితసమాః ప్రాణతుల్యాః - అత్యన్తప్రాణతుల్యా ఇత్యర్థః. సుహృదో బన్ధవశ్చ, సమానాస్సబహుమానా స్సన్త స్సపది సద్యఏవ జరావస్థాయాః ప్రాగేవేత్యర్థః. స్వర్యాతాః స్వర్గం గతాః - నిజసుకృతపాకేన పుణ్యలోకం గతా ఇత్యర్థః. జరాదుర్దశాపత్త్యా బహుమానరహితోఽహం న యాతో హీనజీవన ఇతి భావః. యద్వా - సమానాస్సవయసః - జీవితసమా బన్ధవశ్చ - సపది సద్యఏవ దురవస్థాపత్తేః పూర్వమేవేతి భావః - స్వర్యాతా లోకాన్తరం గతాః - న త్వహమిత్యర్థః. ని. 'స్వరవ్యయం స్వర్గనాకత్రిదివత్రిదశాలయా' ఇత్యమరః. నను కంచిత్కాలం స్థీయతాం కిమనేన అమఙ్గళాశంసనేనేత్యత ఆహ—శనైర్యష్ట్యుత్థానం, యష్ట్యుత్థానం యష్ట్యవష్టమ్భేనోత్థానం - ప్రాప్త మితి శేషః. పాదపాటవవిఘట్టనాత్స్వయముత్థానే సంచారే

హా శక్తిర్నాస్తీత్యర్థః. న కేవలమేతావన్మాత్రమేవ - కింతు నయనే చక్షుషీ చ * ప్రగ్రహాత్ప్రత్యాదస్య అహో ఇత్యనేన సంధ్యాభావః. ఘనం నిబిడం - యత్తిమిరం పటలాఖ్యనేత్రరోగవిశేషో వైద్యశాస్త్రప్రసిద్ధః. ని. 'తిమిరం ధ్వాన్తే నేత్రామయేఽపి చే' తి విశ్వప్రకాశశ్చ, తేన రుద్ధే నిరుద్ధశుద్ధప్రసారే అర్థగ్రహణాసమర్థే జాతే ఇత్యర్థః. అన్ధకపఙ్గుజీవనాద్వరం మరణమేవేతి భావః. ఏతత్సర్వమనర్థజాతం జరాకృతమేవేతి హృదయం. తదపి తథాఽపి, మూఢః జ్ఞానహీనః, కాయో దేహః, మరణేన యోఽపాయో విశ్లేషః - నాశ ఇతి యావత్ - తస్మాచ్చకితో భీతః భవతీతి శేషః; అత్ర దేహిధర్మః తదుపాధౌ దేహే ఉపచర్యతే, అహో ఈదృక్కష్టదశాయామపి జీవితాశైవ బలీయసీ న విజ్ఞానోదయ ఇత్యాశ్చర్యమిత్యర్థః. ఏతదపి తృష్ణావిలసితమేవేతి భావః. శిఖరిణీ వృత్తమ్.

టీ. భోగఇచ్ఛా=భోగమునందలి కోరిక, నివృత్తా = అడుగంటినది. పురుషబహుమానః అపి=పురుషుఁడనను సమ్మానముగూడ, గళితః=జారిపోయినది, జీవితసమాః = ప్రాణసమానులు, సమానాః=వయస్సు మొదలగువానిచే సమానులు, సుహృదః = చెలికాండ్రు, సపది=త్వరగా, స్వః=స్వర్గమునకు, యాతాః=గతించిరి. శనైః=మెల్లఁగ, యష్టి = కఱ్ఱచే, ఉత్థానం=లేచుట, (కలిగినది), నయనే చ = కన్నులును, ఘనతిమిరరుద్ధే = దట్టమైన పొరలచేఁ గ్రమ్మఁబడినవి. తదపి=అయినను, అహో=అయ్యో! మూఢః=తెలివిలేని, కాయః = దేహము, మరణఅపాయచకితః = చావుచేతనైన అపాయమునకు భయపడినది (గానున్నది)

తా. అనుభవింపవలయు ననెడుకోరిక యడుగంటినది. పురుషుఁడననుకొనుబింకము చల్లనారినది. ప్రాణసమానులైన తోడిచెలికాండ్రు స్వర్గస్థులైరి. నేనా ముదుకాళ్లముదుసలినైతిని. కఱ్ఱలేనిది నిలువఁజాలను. కనులు పొరలుగ్రమ్మి యగపడుటలేదు. అయ్యో! ఈ సిగ్గుమాలినకాయ మిట్టియవస్థనున్నను, బ్రాణములు వదలవలయునే యని భయపడుచునే యున్నదిగదా!

శా. భోగాపేక్ష తొలంగెఁ బూజ్యత చెడెన్ శోభా నిమిత్తుల్ మహాభాగుల్ నెల్లిరి దండ మూఁతగొనుటల్ ప్రాప్తించెఁ గన్నుల్ తమోరోగచ్ఛన్నము లయ్యె దేహము జరారూఢంబు ప్రాణానిలత్యాగాపాయభయంబునన్ వడఁకెడున్ సోదా నెంత సమ్మోహమో.

శ్లో. ఆశానామ నదీ మనోరథజలా తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ,
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుఙ్గచిన్తాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః 10

వ్యా.—నన్వేతాదృశతృష్ణాముల్లఙ్ఘ్య స్వాత్మసుఖానుభవతత్పరా యే కేచన మహాన్తస్సన్తి కిమిత్యాశఙ్క్య సన్త్యేవేతి నిగమయన్ తస్యాః పృథగ్జనదుస్తరతరత్వ ద్యోతనార్థం మహానదీత్వం రూపయతి—ఆశేతి—మృష్టాన్నపానభోజనవిచిత్రామ్బర భూషణషోడశవార్షికకామినీసంభోగాదిగోచరమానసవ్యాపారా మనోరథా స్త ఏవ జలాని యస్యాస్సా తథోక్తా, అప్రాప్యేష్వప్యర్థేషు ప్రాప్త్యభిలాషవిశేషాః తృష్ణా-స్తాభిరేవ తరఙ్గైః కల్లోలై - రాకులా సఙ్కులా, అభిమతవస్తుషు స్నేహో రాగః - ఉపలక్షణమేతద్ద్వేషాదీనాం - తథా చ రాగద్వేషాదయ ఏవ - గ్రాహా న క్రాదయ-స్తద్వస్యాం స స్తీతి తథోక్తా, తత్తత్పదార్థలాభాలాభగోచరాః వితర్కాః - త ఏవ విహగాః కారణ్డవాదిపక్షిణో యస్యాం సా తథోక్తా, 'మనసో నిర్వికారత్వం ధైర్యం సత్స్వపి హేతుష్వి' త్యుక్తలక్షణం ధైర్యం-తదేవ ద్రుమః-తం ధ్వంసయతి ఉన్మూలయతీతి తథోక్తా, అజ్ఞానం మోహ ఏవ - తద్వృత్తయో దమ్భదర్పాదయో లక్ష్యన్తే. తథా చ - మోహాః అజ్ఞానవృత్తయ - ఏవావర్తా జలభ్రమా-స్తైస్సుదుస్తరా సుష్ఠు తరితుమశక్యా, అతిగహనా-ఏకత్ర దుర్విభావ్యస్వాభావ్యాదన్యత్ర దురవగాహత్వాచ్చేత్థమితి నిర్ణేతుమశక్యేత్యర్థః. ఇష్టాధిగమజనితధ్యానం చిన్తా-చిన్తా బహువిధ త్వేఽపి చిన్తానాం తటద్వయరూపణోపయోగార్థం ద్విత్వం వక్ష్యతే-తథా ప్రోత్తుఙ్గే అత్యున్నతే-చిన్తే ఏవ తటే-యస్యాస్సా తథోక్తా ఆశానామ నైకవిధాత్యాయతతృష్ణా-ని. 'దశాఽవస్థాఽనేకవిధాఽత్యాశా తృష్ణాఽపి చాయ తే' త్యమరః. నామేతి ప్రసిద్ధౌ-ఆశేతి ప్రసిద్ధే త్యర్థః. యా నదీ వర్తత ఇతి శేషః-యత్తదోర్నిత్యసంబన్ధాత్, తస్యా ఆశానద్యాః, పారం గతాః జ్ఞానప్లవేనేతి భావః, అత ఏవ విశుద్ధమనసో నిర్మలాన్తః కరణా, యోగీశ్వరా మహాయోగినః,నన్దన్తి బ్రహ్మానన్దమనుభవన్తీత్యర్థః, అతస్సర్వథా తృష్ణా తరణోపాయోఽన్వేషణీయః శ్రేయస్కామేనేతి భావః.

టీ. ఆశానామ=ఆశ యనునది, నదీ=ఏఱు, మనోరథజలా=(మృష్టాన్న పానభోజనము, విచిత్రాంబరభూషణధారణము, షోడశవార్షికకామినీసంభోగము మొదలగు) కోరిక లనునీళ్లుగలది, తృష్ణా...కులా-తృష్ణా = (పొందరానివస్తువును పొందవలయునను)

మానురాగిణ్యా స్తరుణ్య ఇత్యర్థః. అన్యథా రసాభాసప్రసఙ్గాత్, స్వప్నేఽపి నాలిఙ్గితాః ఏతేనాత్యన్తమిథ్యాభూతస్వప్నాలిఙ్గనాభావానుశోచనేన జాగ్రద్దశాయాం తస్యాత్యన్తా సంభావితత్వం సూచ్యతే, నను కామినిష్ఠ త్యర్థమఙ్గనాలిఙ్గనాధరచుమ్బనాదికమావశ్యకం-తత్ర పూర్వశ్లోకే అధరచుమ్బనముక్తం-కిం తు పూర్వతరశ్లోకోక్తమేవ ఆలిఙ్గనం పునరత్రాప్యుక్త-మతః పౌనరుక్త్యదోషః ప్రసక్త ఇతి చేన్న-తత్ర కతిపయాలిఙ్గనాభావమాత్రానుశోచనమత్ర తు సర్వాఙ్గనాలిఙ్గ నాభావానుశోచనమితి న దోషప్రసక్తిరితి వేదితవ్యమ్‌: కిం త్వయం పరివర్తమానః, కాలః, కాకైర్బలిభుగ్భిరివ అస్మాభిరితి శేషః. వరపిణ్డేషు పరాన్నేషు - లోలుపతయా లాలసతయా - సావమానపరపిణ్డాదనకుక్షిమ్భరితయేత్యర్థః. ప్రేర్యతే యాప్యతే - న త్వర్థసాధకతయేతి భావః. ని. 'పరాన్నః పరపిణ్డాద' ఇత్యమరః * ప్రపూర్వాదీరయతేః కర్మణి లట్, ఏతత్సర్వం కాలవిలసితమేవేతి తాత్పర్యమ్, యద్యప్యత్ర వైరాగ్యప్రకరణే ధర్మార్థపితృశుశ్రూషావిద్యాయశోఽధిగ మానాం యథా కథఞ్చిత్పురుషార్థోపయోగితయా తదభావానుశోచనం వక్తుం యుక్తం-న త్వఙ్గనాలిఙ్గ నాదిసంభోగాభావానుశోచనం - తదపి శ్లోకత్రయేణ త్రివారసిద్ధ్యర్థం కథయితు మత్యన్తా యుక్తం-నను విద్యాధ్యయనాభావే ద్వివారానుశోచనం న యుక్తమితి చేన్న-తస్యా ఉపాదేయత్వేన శతకృత్వస్తదభావానుశోచనేఽప్యనౌచిత్యాభావాత్ -అన్యస్య త్వనుపాదేయత్వాదేతదనుశోచనమనుచితమివ ప్రతిభాతి-తథాఽపి తస్యాపి పురుషార్థమధ్యపరిగణనయా సంపాతాపాతత్వాత్ -ప్రసూతిభాజో విశ్వస్య శ్రీపుంసాభ్యామేవ నిష్పన్నత్వాత్ కామస్య పురుషార్థత్వేన చ పితృఋణవిమోచనహేతుభూతతయా చ తాదృశశాస్త్రస్య మహాపురుషప్రణీతత్వాత్ - 'ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభేతి' భగవద్వచనాత్తద్విరుద్ధస్యైవానుపాదేయత్వాత్-అత్ర తు తదవిరుద్ధస్యైవ తత్కామస్య వివక్షితత్వేనోపాదేయత్వాచ్చ తదేవానుశోచితుముచితం, యద్వా - లోకే తావదుత్తమవస్తులాభే అధమవస్త్వపేక్షా - తస్యాప్యలాభే తదనుశోచనం ప్రాయశః ప్రసిద్ధం-యథా పిపాసితస్యాలబ్ధశర్కరాపానకస్యారనాళాపేక్షాయాం తదలాభే అనుశోచనం-తద్వత్కాలవిప్రలబ్ధస్యానధిగతపరమార్థానామపేక్షాయాం పదలాభేఽనుశోచనముచితమేవ, అత ఏవ శ్లోకత్రయేఽపి ప్రతిశ్లోకం పూర్వార్ధే ఉత్తమమధ్యమభేదేన పక్షద్వయాభావానుశోచన ముక్త్వా అధమత్వాతిశయేన తృతీయపక్షే తదభావానుశోచన ముక్తమిత్యల మతిప్రపఞ్చేన.

టీ. కళఙ్కరహితా = నిర్దోషమైన, విద్యా=శాస్త్రము, న అధిగతా=అభ్యసింపఁబడలేదు; విత్తంచ = ధనమును, న ఉపార్జితం = సంపాదింపఁబడినదికాదు, సమాహి

తేన = సావధానముగల, మనసా=మనస్సుతో, పిత్రోః = మాతాపితరులకు, శుశ్రూషా పరిచర్య, సంపాదితా న = చేయఁబడినది కాదు; ఆలోలాయతలోచనాః = చంచలములును-కర్ణాంత విశ్రాంతములును నగు జగన్మోహన నయన లగు, యువతయః = కామినులు, స్వప్నేఽపి - కలయందైనను, ఆలిఙ్గితాః న = కౌఁగిలింపఁబడినవారు కారు; అయం కాలః = ఈకాలము, కాకైః ఇవ = కాకులచేతవలె, పరపిణ్డలోలుపతయా = ఇతరుల యన్నమును తినుటయందలి యాసచే, ప్రేరితః = కడపఁబడినది.

తా. నిష్కళంకమయిన విద్యను నేర్వలేదు. ధనము నార్జింపలేదు. నిలుకడ గలమనసుతోఁ దలిదండ్రులకు సేవ కావింపలేదు. చంచలవిశాల నయన లగు మించుఁబోండ్లకౌఁగిలింతల స్వప్నముననైన నందుకొనలేదు. కాకులవలెఁ బరపిండములకై తిరిగి కాలమును గోలుపోయితిమి.

చ. వినయవిశేషహృద్య లగు ని విద్యలు నేర్చుటలేదు నీతిచే
ధనమును గూర్పలేదు తలి ని దండ్రులసేవయుఁ జేయలేదు చ
క్కనిచిగురాకుఁబోండ్లబిగి ని కౌఁగిలియుం గలనైనలేదు గొ
బ్బున సమయంబు కాకులకుఁ ని బోలె గతించెఁ బరాన్నభుక్తులన్.

శ్లో. వయం యేభ్యో జాతాశ్చిరపరిగతా ఏవ ఖలు తే
సమం యైస్సంవృద్ధాస్స్మృతివిషయతాం తేఽపి గమితాః,
ఇదానీమేతే స్మః ప్రతిదివసమాసన్నపతనా
గతాస్తుల్యావస్థాం సికతిలనదీతీరతరుభిః. 43

వ్యా.—అథ కాలవికలనావిపాకవచనమాహ—వయమితి—వయం యేభ్యః మాతాపితృభ్యః, జాతాః ఉత్పన్నాః తే చిరపరిచితా ఏవ చిరకాలపరిచయవన్త ఏవ వినష్టా ఏవేత్యర్థః ఖలుశబ్దోఽత్ర నిశ్చయే వాక్యాలంకారే వా, తథా యైర్జనైస్సమం, సంవృద్ధాస్సమ్యగ్వృద్ధిం గతాః-'సంవృత్తా' ఇతి పాఠే ప్రవృత్తా ఇత్యర్థః. తేఽపి, స్మృతివిషయతాం స్మరణగోచరత్వం, గమితాః ప్రాపితాః కాలేనేతి శేషః-తేఽపి నష్టా ఇత్యర్థః * గమేర్ణ్యన్తాత్కర్మణి క్తః * 'గతిబుద్ధీ'త్యాదినా అణి కర్తుః కర్మణి 'ణ్యన్తే కర్తుశ్చ కర్మణ' ఇతి వచనాత్ - అథవా గమితా గతా ఇత్యర్థః. స్వార్థే ణిచ్ 'రామో రాజ్యమకారయది' తి వత్, ఇదానీం వార్ధకావస్థాయామేతే వయం, ప్రతిదివసం ప్రత్యహం * యథార్థేఽవ్యయీభావః, ఆసన్నం సమీపవర్తి - పతనం నిధనం యేషాం తే తథోక్తాః, అత ఏవ, సికతాఽస్మిన్నస్తీతి సికతిలం సైకతప్రాయం * 'దేశే లుబిలచౌ చే' త్యనేన త దస్త్యస్మిన్నిత్యర్థే ఇలచ్ ప్రత్యయః - యన్నదీతీరం నదీతట

ప్రదేశః - తత్ర యే - తరవః వృద్ధాస్తైస్తుల్యావస్థాం గతాః సమదశాం ప్రాప్తాః స్మః, క్షిప్రమేవ యాస్యామ ఇత్యర్థః. ఏతత్సర్వం కాలకృతమేవ - అన్యథా కథమన్యస్యేదృక్సామర్థ్యమితి భావః.

అత్ర యే తరఙ్గభఙ్గ్యా ఘూర్ణితైస్సికతాపనయే అవిలమ్బేన తరుణాం నిర్మూలః- తద్ద్యోతనార్థం నదీతీరస్య సికతిలవిశేషణం.

ని. 'స్త్రీ శర్కరా శర్కరిలశ్శార్కరశ్శర్కరావతీ,
దేశ ఏ వాదిమా వేవమున్నేయాః సికతావతీ.' ఇత్యమరః.

శిఖరిణీవృత్తమ్.

టీ. వయం= మేము, యేభ్యః = ఎవరినుండి, జాతాః=పుట్టితిమో, తే=వారు, చిర పరిగతాః ఏవఖలు=బహుకాలమునకు మునుపే చచ్చినవారలేకదా; యైః సమం = ఎవరితోఁగూడ, సంవృద్ధాః = చక్కఁగాఁ బెరిగితిమో, తేఽపి = వారును, స్మృతివిషయతాం=స్మరణకువచ్చుటను, గమితాః = పొందింపఁబడిరి; ఇదానీం = ఇప్పుడు (వార్ధకావస్థలో), ప్రతిదివసం=దినదినమునకు, ఆసన్నపతనాః = దగ్గఱిన చావుకలవారమై, సిక... తరుభిః-సికతిల = ఇసుకగలదైన, నదీతీర = ఏటిగట్టునందలి, తరుభిః=చెట్లతో, తుల్యావస్థాం = సమానమగు దశను, గతాః=పొందినవారమై, ఏతేస్మః = ఇదిగో ఉన్నాము.

తా. మమ్ముఁ గన్న తలిదండ్రులు గతించి చిరకాలమైనది. ఎవరితోఁ బెరిగితిమో వారును స్మరణీయులైరి. ఇప్పు డీమాకును, ఇసుకపాఱుగా నున్న యేటిదరిని గలచెట్టునకువలెఁ గూలుకాలము చేరువగుచున్నది.

ఉ. తాలిమి మాలి కన్నతలి ॥ దండ్రులఁ దోడ మెలంగువారలం
గాలము గోలుపుచ్చె నని ॥ కానరు ఘోరజరాభరార్తులై
తూలుచు నిత్యసన్నిహిత ॥ దుర్దశులై సికతాలగన్నదీ
కూలమహామహీజముల ॥ కుఱ్ఱ సరివత్తురు మూఢమానసుల్.

శ్లో. ఆయుర్వర్ష శతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వవృద్ధత్వయోః,
శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే
జీవే వారితరఙ్గచఞ్చలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్. 49

వ్యా.—అథ ప్రాణినాం విచార్యమాణే సుఖలేశస్యాప్యవకాశో నాస్తీత్యాహ— ఆయురితి.—నృణాం మర్త్యానామాయుర్జీవితావధికాలః, వర్షశతం శతసంవత్సరాత్మకం, పరిమితం క్లృప్తం-బ్రహ్మణేతి శేషః. ని. 'వింశత్యాద్యాస్సదైకత్వే సర్వాస్సంఖ్యేయసంఖ్యయోః

యో' రిత్యమరః. తదర్ధం తస్య వర్షశతస్యార్ధం - పఞ్చాశద్వత్సరాత్మకం, రాత్రౌ గతం. ఇన్ద్రియవ్యాపారోపరమరూపనిద్రావస్థయా గళితం భవతీత్యర్థః. పరస్య తస్య జాగరూకేణ వర్తమానస్యార్ధస్య పఞ్చాశద్వత్సరాత్మకస్యాపర మన్యదర్ధం - పఞ్చవింశతిసంవత్సరాత్మకం, బాలత్వవృద్ధత్వయోర్గతమజ్ఞానాశక్తత్వావస్థావిషయతయా నష్టమిత్యర్థః. ద్వాదశసంవత్సరాత్మకమేకమర్ధం బాలత్వే అన్యద్వృద్ధత్వ ఇతి వివేకః. శేషం పఞ్చవింశతిసంవత్సరాత్మకమేతదవశిష్టార్ధం, వ్యాధిభిః రోగైః - వియోగదుఃఖైః పుత్త్రకళత్రాది విరహప్రయుక్తదుఃఖైస్సహితం సత్ -సేవాదిభిః స్వజీవనార్థం విత్తవత్సు పరిచర్యాదికష్టకర్మభిర్నీయతే అతివాహ్యతే. అతః వారితరఙ్గవచ్చఞ్చలతరే అతిచఞ్చలే క్షణిక ఇత్యర్థః. జీవే జీవనే, ప్రాణినాం, సౌఖ్యం సుఖం, కుతః? న కుతోఽపీత్యర్థః; ఉక్తరీత్యా విచార్యమాణే సుఖలేశస్యాప్యనవకాశా దితి భావః.

టీ. నృణాం=మర్త్యులకు, ఆయుః = జీవితకాలము, వర్షశతం = నూఱుసంవత్సరములు, పరిమితం=క్లుప్తముగ గణింపఁబడినది. తదర్ధం = దానిలో సగము, రాత్రౌ=రాతిరియందు, గతం=చనినది. తస్య పరస్య అర్ధస్య = ఆవేఱుసగములో, అపరం అర్ధం = మఱియొకసగము, బాలత్వ వృద్ధత్వయోః = పసితనమునను, ముదిమియందును, గతం=కడచినది, శేషం=కొరవ, వ్యాధివియోగాదుఃఖసహితం సత్=రోగములయు, ఎడబాపులయు, దుఃఖముతోఁగూడినదై, సేవాదిభిః = కొలువుమొదలగువానిలో, నీయతే = కడపఁబడుచున్నది. (కావున), వారి...తరే - వారి తరఙ్గ = నీటియలవలె, చఞ్చలతరే = మిక్కిలి యస్థిరమైన, జీవే=బ్రతుకునందు, ప్రాణినాం = జనులకు, సౌఖ్యం = సుఖము, కుతః = ఎక్కడిది ?

తా. మనుజుల కాయుఃపరిమితి 100 వత్సరములు, అందు సగము (50) ఏండ్లు నిద్రలోఁ బోవును. మిగిలిన 50 సంవత్సరములలోఁ బసితనము, ముసలితనములో 25 వర్షములు పోవును. రోగములతోను, ఎడఁబాటులతోను, దుఃఖములతోను నిండినతక్కు 25 వత్సరములును బొట్టకై సేవాదికృత్యములతోఁ గడపవలయును. మఱి యీజీవితమన్ననో నీటివలెఁ జంచలము. ప్రాణుల కింక సౌఖ్య మెట్లు ?

ఉ. ఆయువు నూఱువత్సరము ♦ లందు సగంబు నశించె నిద్రచే
నాయఱిలో సగంబు గత ♦ మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ
బాయక తక్కినట్టిసగఁ ♦ బాలు గతించుఁ బ్రయాసవృత్తిచే
నాయువు చంచలం బగుడుఁ ♦ బ్రాణుల కెట్లు సుఖంబు చేకుఱున్,

శ్లో. క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపి చ సమ్పూర్ణవిభవః,
జరాజీర్ణైరఙ్గైర్నట ఇవ వలీమణ్డితతను
ర్నరస్సంసారాన్తే విశతి యమధానీయవనికామ్. 50

వ్యా.—అథ కాలత్రయయుక్తబాల్యాద్యవస్థాక్రమేణ మర్త్యః సర్వోఽపి మ్రియత ఇత్యుపసంహరతి—క్షణమితి.—క్షణం క్షణమాత్రమిావత్కాలమిత్యర్థః *అత్యన్తసంయోగే ద్వితీయా, బాలః శిశుర్భూత్వా, తథాక్షణమపి, కామేన మన్మథేవ రసికః శృఙ్గారరసాభినివిష్టః - యద్వా - కామ్యన్తే అభిలష్యన్త ఇతి కామాః - కామినీ సంభోగాదివిషయాస్తేషు - రసికః అనురాగవాన్, యువా తరుణశ్చ, భూత్వా, తథా క్షణం, విత్తైర్హీనో నిర్ధనో, భూత్వా, క్షణమపి సంపూర్ణవిభవః పరిపూర్ణధనశ్చ భూత్వా. ని. 'అర్థ రై విభవా అపీ'తి పర్యాయేష్వమరః. తథా, క్షణం జరయా-జీర్ణై శిథిలైః - విశ్లిష్టసంధిబంధైరితి యావత్ - అఙ్గైరుపలక్షితః, అత ఏవ, వలీభిర్విశ్ల చర్మభఙ్గిభి-ర్మణ్డితా భూషితా చిహ్నితేతి యావత్ - *'మడి భూషణ'ఇతి ధాతో కర్మణి క్తః- తనుర్గాత్రం-యస్య తథోక్తా, భూత్వా, నరస్సర్వోఽపీత్యర్థః. నటస్త్రీ ద్వేషధారీ నర్తక ఇవ - సంసారస్య బాల్యయౌవనాద్యవస్థానుభవరూపసంసారకపట నాటకస్య - నాట్యప్రసఙ్గాడమ్బరస్య చ-అన్తేఅవసానే, యమో ధీయతేఽత్రేతి యమ ధానీ యమరాజధానీ సంయమనీ నామ్నా యమపురీ * 'కరణాధికరణయోశ్చే'తి ల్యుట్ టిత్త్వాత్ జీప్. సా యవనికా ప్రతిసీరా తిరస్కరణీవ-తాం విశతి మృతో భవతి-అన్య త్ర ప్రవిష్టో భవతీత్యర్థః. ని. 'ప్రతిసీరా యవని కే' త్యమరః. నటే విశేషణాని యోజ్యాని.

ఉపమాలంకారః. శిఖరిణీవృత్తమ్.

టీ. నరః = మర్త్యుఁడు, నట ఇవ = నట్టువునివలె, క్షణం = నిమిషము, బాలః = బాలుఁడు. భూత్వా = అయి, క్షణమపి = నిమిషమే, కామరసికః = భోగరసికతతోను. యువా=పడుచువాఁడును, (అయి), క్షణం=నిమిషము, విత్తైః=ధనముచే, హీనః=లేమిగల వాఁడు - కొఱవడినవాఁడును, (అయి), క్షణమపి = నిముసములోపుగనే, సంపూర్ణవిభవః=పరిపూర్ణధనముగలవాఁడు, (అయి), జరాజీర్ణైః = ముసలితనముచే శిథిలమైన, అఙ్గైః = అవయవములతో, వలీ...తనుః-వలీ=ముడుతలచే, మణ్డిత = చిహ్నితములైన, తనుః = దేహముగలవాఁడు, (అయి), సంసారఅన్తే = బాల్యయౌవనాద్యనుభవరూపసంసారమను

కపటనాటకముయొక్క అవసానమునందు, యమధానీయవనికాం = తెరవంటిదగు యమపురిని (సంయమిని), విశతి = చొచ్చును (చచ్చు ననుట).

తా. సంసార మనెడు కపటనాటకమున నరుఁ డను నట్టువు, కొలఁది కాలము బాలుఁడుగను, మఱికొంతకాలము భోగరసికతతోఁ బడుచు వాఁడుగను, ఇంకఁ గొంత కాలము దరిద్రుఁడుగను, మఱియుఁ గొంత కాలము ఐశ్వర్యశాలిగను, ఆపైఁ గొంత కాలము ముఁడుకాళ్ల ముదుసలిగను నటించి తుదకు యమపుర మను తెరమఱుఁగునకుఁ జొచ్చును.

ఉ. బాలకుఁడై క్షణంబు యువభావయుతుం డయి కొంత కాల ము
ద్వేలదరిద్రుఁడై క్షణము విత్తసమన్వితుఁడై క్షణంబు జీ
ర్ణాలసగాత్రుఁడై నటునియట్ల నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయనామ మైనతెరయందుఁ జొరంబడు సత్వరంబుగన్.

ఇది వైరాగ్యశతకమునందు కాలమహిమానువర్ణన మను

ఐదవ దశకము.

---

## యతినృపతిసంవాదము

శ్లో. త్వం రాజా వయమప్యుపాసితగురుప్రజ్ఞాభిమానోన్నతాః
ఖ్యాత స్త్వం విభవైర్యశాంసి కవయో దిక్షు ప్రతన్వన్తి నః,
ఇత్థం మానధనాతిదూరముభయోరప్యావయోరన్తరం
యద్యస్మాసు పరాఙ్ముఖోఽసి వయమప్యేకాన్తతో నిఃస్పృహాః. 51

వ్యా.—అథ ఇహ కశ్చిత్కశ్చిద్భాగ్యోదయాదిత్థంభూతకాలవైషమ్యం జ్ఞాత్వా వైరాగ్యాద్యది యతిర్భవేత్తదా నైరపేక్ష్యాత్తృణమివ జగజ్జాలమాలోకయన్నవధీరితానువర్తనేచ్ఛో రాజ్ఞా సహ సంవాదం కర్తుం శక్నుయాన్నాన్యథా. అతో నిరఙ్కుశత్వయతిభావోఽవశ్యం సంభావనీయ ఇతి వివేకినాం జ్ఞాపయితుం తత్సంవాదప్రకారమాహ — త్వమితి.—త్వం, రఞ్జయతీతి రాజా మహోన్నత ఇత్యర్థః. వయమప్యుపాసితాస్సేవితా - గురవః ఆచార్యాః - యయా సా తథోక్తా - 'ఆచార్యవాన్ పురుషో వేదేతి శ్రుతేః - నిరన్తరగురుసేవాతత్పరేత్యర్థః. యద్వా - ఉపాసితా - గురూపాసనావశాత్సంపాదితా - గురుః శ్రేష్ఠా చ యా ప్రజ్ఞా త్రైకాల్యగోచరబుద్ధివిశేషప్రవృత్తి-స్తయా యోఽభిమాన అగ్రహ స్తేనోన్నతాః ఉత్కృష్టాః, త్వం, విభవైర్ధన

సంపద్భిః, ఖ్యాతః సర్వత్ర ప్రసిద్ధః, తథా, కవయః విద్వాంసః - యద్వా-విచిత్ర ప్రబన్ధవచనరచనాచాతురీధురీణప్రతిభాసంపన్నాః కవయితారః, నోఽస్మాకం, యశాంసి కీర్తీః, దిక్షు దిగన్తరాశేషు, ప్రతన్వన్తి విస్తారయన్తి-ఏతే మహాన్తస్సంతతపరిచర్యాభినన్దితాచార్య కృపాకటాక్షలబ్ధప్రజ్ఞాభిమానమానస మహోత్సవశాలినః జ్ఞానవిజ్ఞానసంపన్నా మోక్షసామ్రాజ్యపట్టభద్రాస్తృణీకృత బ్రహ్మపురన్దరా ఇత్యస్మానపి కీర్తయన్తీత్యర్థః. తస్మాద్వయమపి ఖ్యాతా ఏవేతి భావః. అతః ఇత్థమనేన ప్రకారేణ, త్వం చాహం చాహం - తయోః - *'త్యదాదీని సర్వైర్నిత్య' మిత్యేకశేషః, ఉభయోరప్యన్తరం-తారతమ్యం,† మానధనాభ్యామతిదూరమత్యన్తవిప్రకృష్టం--త్వం కేవలం ధనవాన్-వయం తు ప్రజ్ఞాప్రయుక్తాభిమానధనవన్తః - అతః తవ చాస్మాకం చ సుమేరుసర్షపయోరివ మహదన్తర మిత్యర్థః. అతస్త్వమస్మాసు విషయే, పరాఙ్ముఖః అనాదరపరో, ఽసి యది-తర్హి, వయమప్యేకాన్తతో, నిస్పృహాః నిరపేక్షా-అనాదరపరా ఇత్యర్థః - త్వయాతిశేషః, అనాదరేఽప్యవస్థానే నాస్మాకమత్ర ప్రయోజనమస్తి - తవాస్మాస్వాదరశ్చేదస్మాకమపి త్వయ్యాదరస్తద్వశాదత్ర స్థాస్యామః-అన్యథాన్యత్ర గమిష్యామ ఇతి భావః. అత్ర 'త్వం రాజా వయ మి'త్యుపక్రమే 'వయమప్యేకాన్తతో నిస్పృహా' ఇ త్యుపసంహారే చ బహువచనం ప్రయుజ్య ఆవయోరితి ద్వివచనప్రయోగః కథం యుజ్యత ఇతి చేత్సర్వేషాం సముదాయవివక్షయా వా ఆత్మసంభావనాయాం బహువచనప్రయోగేణ వా యుక్తత్వాన్న కోఽపి విరోధః. ఏవముత్తరత్రాఽపి ద్రష్టవ్యమ్. శార్దూలవిక్రీడితం వృత్తమ్.

టీ. త్వం = నీవు, రాజా = రాజవు - గొప్పవాఁడవు. వయమపి = మేమును, ఉపా...న్నతాః-ఉపాసిత=సేవింపఁబడిన, గురు = ఆచార్యులుగలదై, ప్రజ్ఞా = త్రికాలములయందును జరుగుసంగతులు గోచరించు బుద్ధివిశేషప్రవృత్తియొక్క, అభిమాన = ఆగ్రహము-గర్వముచే, ఉన్నతాః=గొప్పవారము. త్వం=నీవు, విభవైః = ధనసంపత్తులచే, ఖ్యాతః=ప్రసిద్ధుఁడవు, నః = మాయొక్క, యశాంసి=కీర్తులను, కవయః = విద్వాంసులు, లేక, విచిత్రప్రబంధ వచన రచనాచాతురీ ధురీణసంపన్నులగు కవులు, దిక్షు = దిగంతరాళములయందు, ప్రతన్వన్తి=విస్తరింపఁజేయుచుందురు. ఇత్థం = ఇట్లు, మానద=గర్వమును ఖండించువాఁడా, ఆవయోః ఉభయోరపి = మనకు ఇరువురకును, అన్తరం = భేదము, నఅతిదూరం=మిక్కిలి దూరముకాదు. అస్మాసు=మావిషయమున, పరాఙ్ముఖః = పెడమొగముగలవాఁడవు, అసి యది=అగుదువేని, వయమపి=మేమును, ఏకాన్తతః=పూర్ణముగా-బొత్తిగా, నిఃస్పృహాః = ఆశలేనివారము.

తా. నీవు దొరవు; మేము గురుశుశ్రూషచే నార్జించిన ప్రజ్ఞావిభవముచే నధికులము. సొమ్మున నీవు పేరెత్తినవాఁడవు; జ్ఞానమున మాకీర్తిని కవులు దిగంతముల నించుచున్నారు. ఇవ్విధమున నీకును మాకును భేద మంతగా లేదు. నీవే మమ్ము లెక్కసేయవేని నిఃస్పృహులమగు మేమూ నిన్నాశించువారము.

ఉ. రాజవు నీవు మేము గురు॥ రాట్కలితప్రతిభాభిమానవి
భ్రాజితమానసాత్ములము ॥ భవ్యధనప్రథితుండ వీవు స
ద్రాజి నుతించు మాయశము ॥ దవ్వు సుమీ మనవాసి మమ్ము ని
ర్వ్యాజతఁ జూడవేని యనురాగము మాకును లేదు నీయెడన్.

శ్లో. అర్థానామీశిషే త్వం వయమపి చ గిరామీశ్మహే యావదర్థం
శూరస్త్వం వాదిదర్పవ్యుపశమనవిధావక్షయం పాటవం నః,
సేవన్తే త్వాం † ధనాఢ్యా మతిమలహతయే మామపి శ్రోతుకామా
మయ్యప్యాస్థా న తే చేత్త్వయి మమ సుతరామేష రాజన్గతోఽస్మి.

వ్యా.—ఉక్తమేవార్థం భఙ్గ్యన్తరేణాహ—అర్థానామితి.—త్వ, మర్థానాం ధనానామీశిషే ఈశ్వరో భవసి తథా వయమపి చ, యావానర్థో యావదర్థం-యావదభిధేయం యథా తథేత్యర్థః. * 'యావదవధారణ' ఇత్యవ్యయీభావః. ని. 'అర్థోఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిష్వి'త్యమరః. గిరాం శాస్త్రవచనానా, మీశ్మహే-అశేషశాస్త్రవిశేషార్థానాం ప్రభవామ ఇత్యర్థః. 'విద్మహే' ఇతిపాఠే గిరాం యావదర్థమశేషవిశేషార్థానిత్యర్థః. విద్మహే జానీమహే, తథా, త్వం, శూరః శౌర్యవాన్-రిపుదమన ఇతి శేషః, తథా, నోఽస్మాకం, వాదిదర్పవ్యుపశమనవిధౌ ప్రతివాదిగర్వనిర్వాపణవిధానే - ని. 'విధి ర్విధానే దైవే చే' త్యమరః. అక్షయ మవినాశి, పాటవం సామర్థ్య-మస్తీతి శేషః. త్వాం, † ధనాఢ్యా ధనస్వామినః. ని. 'ఇభ్య ఆఢ్యో ధనీ స్వామీ' త్యమరః. సేవన్తే భజన్తే-తదవినాశార్థం తదభివృద్ధ్యర్థం చేతి భావః. యద్వా ధనాఢ్యా ధనాఢ్యత్వాభిలాషిణః - రాజసేవయా ధనసంపాదనేచ్ఛవ ఇత్యర్థః. త్వాం సేవన్తే, మామప్యుపాసతేత్యర్థః, మతిమలహతయే బుద్ధిజాడ్యనివృత్త్యర్థమ్-

'యస్తు పర్యటతే దేశాన్ యస్తు సేవేత పణ్డితాన్,
తస్య విస్తారితా బుద్ధిస్తైలబిన్దురివామ్భసి.'

ఇతి వచనాదితి భావః. యద్వా-మతిమలాని రాగద్వేషాదయః-తేషాం హతయే ప్రక్షాళనార్థం - బుద్ధిశుద్ధిద్వారా జ్ఞానావాప్త్యర్థమిత్యర్థః. శ్రోతుం కామోఽభిలాషో యేషాం తే శ్రోతుకామాః - శుశ్రూషవః-'గురుముఖాచ్ఛ్రోతవ్య మి'తి న్యాయేనాస్మన్ముఖాచ్ఛాస్త్రార్థశ్రవణేచ్ఛవః - 'గురుశుశ్రూషయా విద్యే'త్యుపదేశవచనవిశ్వాసవన్తశ్శిష్యా ఇత్యర్థః. సేవన్త ఇతి సంబన్ధః. * 'తుం కామమనసో ర'పీతి తుమునో మకారలోపః. అతః హే రాజన్, తే మయ్యపి, ఆస్థా న చేదనాదరో యది, తదా మమ త్వయ్యపి, నితరామత్యన్తం * అవ్యయత్వాదాంప్రత్యయః, అనాస్థా నిరపేక్షత్వాదితి భావః. 'ఏష రాజన్ గతోఽస్మి' ఇతి పాఠ అన్యత్ర గమిష్యామీత్యర్థః. *వర్తమానసామీప్యే వర్తమానప్రత్యయః; స్వస్య నిరఙ్కుశత్వద్యోతనార్థ మేతచ్ఛబ్దప్రయోగః;పూర్వశ్లోకోక్త భావ ఏవాత్రాప్యనుసంధేయః. స్రగ్ధరావృత్తమ్.

టీ. త్వం = నీవు, అర్థానాం = ధనములకు, ఈశిషే = దొరవు. వయమపిచ = మేమును, యావదర్థం = సర్వార్థబోధకమగు నర్థమెంతో యంతవఱకు, గిరాం = శాస్త్రవచనములకు, ఈశ్మహే = దొరలము. త్వం శూరః=నీవు శౌర్యవంతుఁడవు, నః=మాకును, వాది...విధౌ-వాది=ప్రతివాదులయొక్క, దర్ప = గర్వముయొక్క, వ్యుపశమనవిధౌ = అడఁగించుటయందు, అక్షయం = కొఱతపడని, పాటవం = నేర్పు, (కలదు)-త్వాం = నిన్ను, ధనాన్ధాః = ధనముచే గ్రుడ్డియైనవారు, సేవన్తే = సేవించుచున్నారు. మామపి = నన్నును, మతిమలహతయే = బుద్ధిదోషశాంతికై, శ్రోతుకామాః = వినఁగోరికగలవారు, (సేవన్తే), హేరాజన్=ఓరాజా, తే=నీకు, మయి=నాయందు, ఆస్థా న చేత్=అనాదరమైనయెడల, మమ=నాకు, త్వయి అపి = నీయందును, సుతరాం = బొత్తిగా, (న = లేదు,) ఏషః = ఇదే, గతః అస్మి = పోవుచున్నాను

తా. నీకు ధనము కలదు. మాకు సర్వశాస్త్రసిద్ధాంతములు కలవు. నీవు దేహశూరుఁడవు. మేము వాదశూరులము. ధనకాములు నిన్నుఁ గొలుతురు. చిత్తశుద్ధికాములు మమ్ము శుశ్రూషచేయుదురు. నాయందు నీకు గౌరవములేదేని నీయందు నాకు మొదలే లేదు. ఇదుగోఁ బోవుచున్నాను.

చ. ధనపతి వీవు మేము వివిధశ్రుతిపుంజపదార్థతత్త్వశా
సనులము నీవు శూరుఁడవు ర చండతరప్రతివాదిగర్వభం
జనులము మేము నిన్ను ధనకాములు మమ్ము భజింతు రాశ్రితుల్
వినయము సేయవేని పృథివీవర సాగెద మీక్షణంబునన్.

శ్లో. వయమిహ పరితుష్టా వల్కలైస్త్వం దుకూలైః
సమ † ఇహ పరితోషో నిర్విశేషో విశేషః,
స తు భవతు దరిద్రో యస్య తృష్ణా విశాలా
మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః. 53

వ్యా.—అథ కథమన్యత్ర గమిష్యసీత్యాశఙ్క్యాఽఽమస్మాకం నిత్యసంతుష్టాన్తః కరణత్వాన్న కిఞ్చిదపి కృచ్ఛ్రమిత్యాహ—వయమితి—హే రాజన్, వయమిదానీం, వల్కలైర్దారుత్వఙ్నిర్మిత చీవరైః, పరితుష్టాస్సన్తుష్టాః, త్వం, దుకూలైః క్షౌమైర్విచిత్ర చీనామ్బరైరిత్యర్థః. పరితుష్ట ఇతి వచనవిపరిణామేన సంబన్ధః, పరితోషః సంతోషః, అస్మాకం తవ చ, సమ ఇవ తుల్య ఏవ-ఇవశబ్దోఽత్రావధారణార్థకః, విశేష అన్యతరోత్కర్షస్తు, నిర్విశేషో విశేషరహితః - మామక తావక పరితోషయోరన్తరం న కిఞ్చిదప్యస్తీత్యర్థః. 'సమ ఇవ పరితోషో జాయతే కో విశేష' ఇతి వా పాఠః. కిం తు యస్య పుంసస్తృష్ణా ధనలిప్సా, విశాలా అత్యాయతా, స పుమాన్, దరిద్రోఽకిఞ్చనో, భవతు న త్వన్య ఇత్యర్థః. *సమ్భావనాయామ్ లోట్, కథమేతదిత్యాశఙ్క్యోక్తమర్థమర్థాన్తర న్యాసేన ద్రఢయతి—మనసి చ పరితుష్టే చిత్తే యేన కేనచిత్సన్తుష్టే సతి, కః పుమానర్థవాన్ ద్రవ్యసమ్పన్నః, కశ్చ వా, దరిద్రః ద్రవ్యహీనః - న కోఽపీత్యర్థః-మనః పరితోషే లాభాలాభయోర-కిఞ్చిత్కరత్వాదితి భావః. అతో నకిఞ్చిదప్యస్మాకం కృచ్ఛ్రమితి వేదితవ్యమ్.

మాలినీవృత్తమ్ - 'ననమయయయుతేయం మాలినీ భోగిలోకై' రితి లక్షణాత్.

టీ. వయం = మేము, ఇహ = ఈ, వల్కలైః = నారచీరలచే, పరితుష్టా = తనిసినవారము, త్వం = నీవు, దుకూలైః = విచిత్రచీనాంబరములచే, (పరితుష్టుఁడవు). ఇహ=ఇందు, పరితోషః=తృప్తి, సమః=తుల్యమే, విశేషః=భేదము. నిర్విశేషః=గొప్పది కానిది, కింతు=ఐనను, యస్య తృష్ణావిశాలా=ఎవనికి ఆశగొప్పదో, సః దరిద్రః భవతు= వాఁడు దరిద్రుఁడగుగాక. (కిం) చ=మఱియును, మనసి తుష్టే సతి=మనస్సు తనిసినది కాఁగా, కః అర్థవాన్ = ఎవఁడు సంపన్నుఁడు? కః దరిద్రః = ఎవఁడు పేద?

తా. దుకూలములు దాల్చి నీ వెంతతృప్తి చెందుదువో నార చీరలు దాల్చి మేము నంతతృప్తిని చెందుచునే యున్నాము. తృప్తి యెడల నిర్వురకును భేదము లేదు. ఇంక నింక నని యాశ యెవని బాధించునో వాఁడు దరిద్రుఁ డగును. కాని మనసు తృప్తిచెందినపుడు దారిద్ర్యమేమి? ఐశ్వర్యమేమి? అట్టివాఁ డీ రెంటికినిలోఁబడఁడు.

చ. కలితదుకూలవస్త్రములు గట్టిననీకును జీర్ణవల్కలం
బులు ధరియించుమాకును బ్రమోదము తుల్యము లేదు వాసి య
గ్గల మగుతృష్ణ యెవ్వనికి గాఢదరిద్రుఁడు వాఁడు లేమియుం
గలిమియు లేవు సమ్మదవిశోకస్వగమానసులైనవారికిన్.

శ్లో. ఫలమలమశనాయ స్వాదు పానాయ తోయం
క్షితిరపి శయనార్థం వాససే వల్కలం చ,
నవధనమధుపానభ్రాన్తసర్వేన్ద్రియాణా
మవినయమనుమన్తుం నోత్సహే దుర్జనానామ్. 54

వ్యా.—తథాఽపి శరీరయాత్రాయా అన్యథాసంభావ్యమానత్వే న్న దుర్జనావినయం సోఢుం శక్నోమీత్యాహ—ఫలమితి—ఫలమ్, అశనాయ భోజనాయ క్షున్నివారణార్థమిత్యర్థః, అలం పర్యాప్తం. *అలమితి పర్యాప్త్యర్థగ్రహణా 'న్నమస్స్వస్తీ' త్యాదినా చతుర్థీ - ఏవముత్తరత్రాపి ద్రష్టవ్యం. తథా, స్వాదు మధురం-ని. 'త్రిష్విష్టమధురౌ స్వాదూ' ఇత్యమరః తోయముదకం, పానాయ తృష్ణోపశాన్త్యర్థమిత్యర్థః. అలం, తథా క్షితిరపి శయనార్థం సంవేశనాయ, అలం, తథా, వల్కలం చ, వాససే ఆచ్ఛాదనార్థమ్, అలమ్, అతః, నవం సద్యస్సంభావితం - యద్ధనం - తదేవ మధుపానం మద్య పానం - తేన భ్రాన్తాన్యమార్గవర్తీని - సర్వాణీన్ద్రియాణి యేషాం తేషాం-ధనమధుపానస్య చిత్తవికారావివేకాదికారిత్వేన యథాకథంచిద్వివేకలేశసంభవే తన్నివృత్త్యర్థం నవవిశేషణమ్, దుర్జనానాం దుర్మార్గశాలినామవినయందుర్వినయమనాదరమితి యావత్, అనుమన్తుమఙ్గీకర్తుం, నోత్సహే న మృష్యామి, సతి గత్యన్తరే కిమర్థం సోఢవ్యమితి భావః.

టీ. అశనాయ = భోజనమునకు - ఆఁకలితీరుటకు, ఫలం = పండు, అలం = చాలును. పానాయ = త్రాగుటకు, స్వాదు=తీయని, తోయం=నీరు, (అలం=చాలును) శయనార్థం=పరుండుటకు, క్షితిరపి=నేలయు, (అలం = చాలును). వాససే=వస్త్రమునకు (ఆచ్ఛాదనార్థము), వల్కలంచ = నారచీరయును, (అలం=చాలును) నవ...రాణాం-నవ-క్రొత్త, ధన=ధనమను, మధుపాన = మద్యపానముచే, భ్రాన్త=తెలివితప్పిన, సర్వ=సకలమైన, ఇన్ద్రియాణాం=ఇంద్రియములుగల,దుర్జనానాం=దుష్టులయొక్క,అవినయం=అనాదరమును, అనుమన్తుం=అంగీకరించుటకు, న-ఉత్సహే=కడంగను.

తా. తినుటకుఁ బండ్లును, త్రావ నుదకమును, కట్టుటకు నారచీరలును, శయనింప నేలయును మాకుఁ జాలును. కల్లుద్రావినఁ గై పెక్కి

నట్లు నూతనసంపదలచే నొడలు మరచి కనులు గానకున్న నీచుల దుర్వి
నయమున కణఁగి మణఁగి యుండఁ దలంపము.

చ. ఫలములు చాలు జీవికకు ♦ బానము సేయ జలంబు చాలు వ
ల్కలములు చాలుఁ గట్టుట కిలాతలముల్ శయనింపఁ జాలు ని
ష్ఫలనవవిత్తసీధురసపానవిజృంభితమోహలీనచి
త్తులగునికృష్టభూపతులదుర్నయ మించుకయుఁ సహింతునే.

శ్లో. అశ్నీమహి వయం భిక్షా మాశావాసో వసీమహి,
శయీమహి మహీపృష్ఠే కుర్వీమహి కిమీశ్వరైః. 55

వ్యా.—ఏవమేవార్థం భఙ్గ్యన్తరేణాహ—అశ్నీమహీతి.—వయం భిక్షాం భిక్షా
ప్తమశ్నీమహి, భోక్ష్యామహే. * 'అశ భోజన' ఇతి ధాతోర్లిఙ్-ఆత్మనేపదోత్తమపురుష
బహువచనమ్. ఏవముత్తరత్రాపి ద్రష్టవ్యం. తథా, ఆశా ఏవ వాసో, వసీమహి ఆచ్ఛాద
యిష్యామః-దిగమ్బరా భవిష్యామ ఇత్యర్థః. మహీపృష్ఠే భూతలే, శయీమహి స్వప్స్యామి
కః. అత, ఈశ్వరైః రాజభిః, కిం కుర్వీమహి కిం కరిష్యామః - న కిమపీత్యర్థః. శరీర
మాత్రాయా అన్యథైవ సంభావ్యమానత్వాదితి భావః. ఇత్థం స్థితత్వమేవ బ్రహ్మనిష్ఠ
మతిలక్షణం. తదుక్తం మహాభారతే ఉద్యోగపర్వణి ధృతరాష్ట్రం ప్రతి సనత్సు
జాతేన—

'యేన కేనచిదాచ్ఛన్నో యేన కేనచిదాశితః,
యత్ర క్వచన శాయీ స్యాత్తం దేవా బ్రాహ్మణం విదుః' ఇతి-

ఉక్తం చ శ్రీమహాభాగవతే—

'చీరాణి కిం పథి న సన్తి దిశన్తి భిక్షాం
నోవాఙ్ఘ్రిపాః? పరభృతస్సరితోఽప్యశుష్యన్ ?
రుద్ధా గుహాః కిం? మజితోఽవతి నోపపన్నాన్ ?
కస్మాద్భజన్తి యతయో ధనదుర్మదాన్ధాన్ ?' ఇతి.

తథా చోక్తం శివగీతాయాం—

'సంవీతో యేన కేనాశ్నన్భక్ష్యం వాఽభక్ష్యమేవ, వా,
'శయానో యత్ర కుత్రాఽపి సర్వాత్మా ముచ్యతేఽత్ర సః.' ఇతి.

టీ. వయం=మేము, భిక్షాం = బిచ్చపుకూటిని అశ్నీమహి = భుజింతుము. ఆశా=
దిక్కులను, వాసః = వస్త్రమును, వసీమహి = కట్టుకొందుము (దిగంబరులము అనుట),

మహీపృష్ఠే=భూతలమున, శయామహే = పరుందుము. (అట్టి మేము), ఈశ్వరైః = రాజులతో, కిం కుర్వీమహి = ఏమిచేయుదుము ?

తా. భిక్షాన్నము భుజింతుము. దిగంబరులముగా నుందుము. నేలపై శయనింతుము. ఐశ్వర్యవంతులతో మా కేమి పని కలదు?

తే. చేరి భిక్షాన్న మారగింతు చెదము మేము
కట్టెదము దిక్కు లనియెడికలితశాటిఁ
బవ్వళించెద మిల యనుకసాన్పుమీఁద
నేమికార్యము మాకు నరేంద్రులందు.

శ్లో. న నటా న విటా న గాయకా న చ సభ్యేతరవాదచుఞ్చవః,
నృపమీక్షితుమత్ర కే వయం స్తనభారానమితా న యోషితః.

వ్యా. అథ స్వస్య రాజదర్శనాయోగ్యతాయాః ప్రకటనాపదేశేన తం నిన్దతి— నేతి.—వయం, నటాః వివిధవేషధారిణో విచిత్రనాట్యనిపుణాః, న న భవామ ఇత్యర్థః. యేన నయనానన్దో భవేదితి భావః. విటా ఏకవిద్యాః నాయికానుకూలనచతురాః, న న భవామః. యేన తత్తన్నాయికానుకూల్యప్రయోజనం సిధ్యేదితి భావః. తదుక్తమలంకారశాస్త్రే—'నాయకానాం నాయికానుకూలనే సహాయాః పీఠమర్దవిటచేట విదూషకాదయ' ఇతి, తల్లక్షణం చ తత్రైవ—

'కించిదూనః పీఠమర్దః ఏకవిద్యో విటః స్మృతః,
సంధానకుశలశ్చేటో హాస్యప్రాయో విదూషకః.' ఇతి.

గాయన్తీతి గాయకాస్సఙ్గీతకుశలాః, తే, న న భవామః - యేన శ్రవణానన్దో భవేదితి భావః. సభాయాం సాధవస్సభ్యాః * 'తత్ర సాధుః' ఇతి యత్ప్రత్యయః. తేభ్య ఇతరే యే వాదచుఞ్చవః అశిష్టగ్రామ్యాలాపాః - సాధారణజనమనోవినోదమాత్రపర్యవసాయినో న తు శాస్త్రసంవాదిన ఇత్యర్థః. యద్వా - సభ్యాః విద్వాంసః - తదితరే సాధారణజనా స్తేషాం - వాదా స్తద్వదనయోగ్యవాక్యాని - తైశ్చుఞ్చవః విత్తా - హాస్యకారిణ ఇత్యర్థః. న న భవామః, యేన మనోవినోదో భవతీతి భావః. * 'తేన విత్తశ్చుఞ్చుప్చణపౌ' ఇతి చుఞ్చుప్ప్రత్యయః. తథా స్తనభారైః కుచకుమ్భభరైరానమితా ఈషన్నమ్రాఙ్గ్యః, యోషితోఽపి, న న భవామః-యేన ససంరమ్భసంభోగౌత్సుక్యం భవేదితి భావః. అతో, నృపం రాజానమీక్షితుం ద్రష్టుమ్, అత్ర నటాదిషు, వయం, కే? న కేచిదిత్యర్థః. ఏతేషామన్యతరత్వే యోగ్యతాస్స్యాదితి భావః; ఏతే న అసభ్యానామేవావ

కాశప్రదో న తు సభ్యానామితి నృపస్య నిన్దా గమ్యతే; 'నృప వీక్షితుమి' తి పాఠః- తదా-'హేనృపేత్యామన్త్రణం - త్వామి' తి శేషః. అన్యదుక్తార్థమ్.

వైతాళీయాఖ్యమర్ధసమవృత్తం-

'షడ్విషమేఽష్టౌ సమే కలాష్షట్చ సమే స్యుర్నో నిరన్తరాః,
న సమాఽత్ర పరాశ్రితా కలా, వైతాళీయేఽన్తే రలౌ గురుః.'

ఇతి లక్షణాత్.

టీ. వయం=మేము, నటాః = (వివిధవేషధారిణులము విచిత్రనాట్య నిపుణులము అగు) నట్టువులము, న=కాము. విటాః=నాయికానుకూలనచతురులగు తార్పుగాండ్రము, న=కాము, గాయకాః = సంగీతకుశలుఁరము, న = కాము. సభ్యే...చుఞ్చవః చ - సభ్య ఇతర=అసభ్యపు, వాదచుఞ్చవః చ=మాటనేర్పరులముసు, న=కాము. స్తనభార=పాలిండ్ల బరువుచే, ఆనమితః = కొంచెము నమ్రాంగులము, న = కాము. అత్ర=ఇందు, నృపం= రాజును, ఈక్షితుం = చూచుటకు, కే వయం = మే మెవ్వరము?

తా. మేము నటులము కాము. విటులము కాము. గాయకులము కాము. అసభ్యవాదచుంచువులము కాము. చనుఁగవ వ్రేఁగునతూఁగాడు బోగపుటాండ్రము కాము. రాజును జూడ మాకేల?

క. విటగాయక వైతండిక
నటజనులము గాము పృథుఘనస్తనసమితో
త్కటవార కాంతలము గా
మటు గావున నృపునిఁ జూడ నగునే మాకున్.

శ్లో. విపులహృదయైర్ధన్యైః కైశ్చిజ్జగజ్జనితం పురా
విధృతమపరైర్దత్తం చాన్యైర్విజిత్య తృణం యథా,
ఇహ హి భువనాన్యన్యే ధీరాశ్చతుర్దశ భుఞ్జతే
కతిపయపురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః. 57

వ్యా.—నిన్దామేవ చతుర్భిః ప్రపఞ్చయతి.—విపులేతి.—పురా పూర్వకాలే, విపులహృదయైర్మహామనస్కైరుదారబుద్ధిభిరిత్యర్థః. ఈశ్వరైర్హరిశ్చన్ద్రాదిసార్వభౌమైః, ఏతత్పరిదృశ్యమానం, జగద్భూమణ్డలం, జనితముత్పాదితం. సమగ్రధర్మాచరణే సంస్థాపితమిత్యర్థః. తథా, అపరైర్యయాతిప్రభృతిభిరీశ్వరైర్విధృతం విశేషేణ ధృతం సమ్యక్పరిపాలితమిత్యర్థః. తథాఽన్యైర్బలిప్రభృతిభిర్విజిత్య శత్రుజయేన స్వవశం కృత్వా,తృణం

యథాతృణమివ, దత్తమర్థిసా త్కృతమ్. ఏతేనై తేషాం మహౌదార్యం సూచ్యతే. ఇహ హి ఇదానీమపి, అన్యే, ధీరాః స్థైర్యశాలినః, చతుర్దశభువనాని - భూరాదీని చతుర్దశ విష్టపాని, భుఞ్జతే అనుభవన్తి - తాదృక్సామర్థ్యసంపన్నాస్సన్తీత్యర్థః, *'భుజ పాలనాభ్యవహారయో' రితి ధాతోర్లట్ * 'భుజోఽనవన' ఇత్యాత్మనేపదమ్. అతః, కతిపయాని చ తాని పురాణి చ తేషాం ద్విత్రాణాం పఞ్చషాణాం వా పురాణామిత్యర్థః. స్వామ్యే ఆధిపత్యే సతి, పుంసాం, ఏష పరిదృశ్యమానో, మదో దర్ప ఏవ-జ్వరః సన్నిపాతః బుద్ధిభ్రంశహేతుత్వాత్, కః కిమర్థమిత్యర్థః; అతః పురాతనమహారాజచరితానుస్మరణాల్లజ్జితవ్యం-న తూన్మత్తేన భవితవ్యమితి భావః. హరిణీవృత్తమ్.

టీ. విపులహృదయైః కైశ్చిత్ ధన్యైః = ఉదారమనస్సుగలకొందఱు పుణ్యాత్ములచే, పురా= పూర్వకాలమున, జగత్ = లోకము, జనితం = సృష్టింపఁబడినది. అపరైః= మఱికొందఱుచే, విధృతం = పరిపాలింపఁబడినది. అన్యైః = ఇంకను కొందఱుచే, విజిత్య= జయింపఁబడి, తృణం యథా = గడ్డిపోఁచవలె, దత్తం=(యాచకులకు) ఈఁబడినది. అన్యే ధీరాః= వేఱుధీరులు, చతుర్దశభువనాని = పదునాలుగులోకములను, భుఞ్జతే=అనుభవించుచున్నారు. కతిపయపురస్వామ్యే సతి=ఒకకొన్నియూరుల దొరతనము కలుగుమాత్రాన పుంసాం = పురుషులకు, ఏషః మదః జ్వరః = బుద్ధిమాంద్యమును గలిగించు సన్నిపాతజ్వరమువంటి ఈమదము, కః = ఏమి?

తా. తొల్లి మహాస్వాంతు లగుప్రజాపతులీజగమును సృజించిరి పిదప మఱికొందఱు మన్వాదులు కాపాడిరి. మఱికొందఱు పరశురామప్రభృతులు జయించి యితరులకు దానముచేసిరి. ఇప్పుడును బదునాల్గుభువనములను ధీరు లగుబలిముఖ్యు లనుభవించుచున్నారు. కొన్నియూళ్లకుమాత్రము దొరతన మబ్బినంతనే మనుజుల కీమదజ్వర మేమి?

ఉ. అంచితబుద్ధులైన మనుజాధిపతుల్ జగ మెల్లఁ దొల్లి ని
ర్మించిరి దానిఁ గొందఱు భరించిరి యిచ్చిరి గొంద ఱర్థికి
న్మించి జగమ్ము లన్నియు ననేన్మిది భుజించుచుఁ గొంద ఱుండఁగాఁ
బంచపపట్టణేశుల కపారమదజ్వర మింత యేటికిన్.

శ్లో. అభుక్తాయాం యస్యాం క్షణమపి న యాతం నృపశతై
ర్భువస్తస్యా లాభే క ఇవ బహుమానః క్షితిభృతాం,

తదంశస్యాప్యంశే తదవయవలేశేఽపి పతయో
విషాదే కర్తవ్యే విదధతి జడాః ప్రత్యుత ముదమ్. 58

వ్యా.—అభుక్తాయామితి.—నృపశతైః అనేకభూపాలకైః, యస్యాం భువి అభుక్తాయామననుభూతాయాం సత్యాం, క్షణం క్షణమాత్రమపి, న జాతం. కింతు క్షణమాత్రవ్యవధానరహితమేవానుభూయత ఇత్యర్థః. తస్యా భువో, లాభే ప్రాప్తౌ, క్షితిభృతాం రాజ్ఞాం, క ఇవ - ఇవశబ్దో వాక్యాలంకారే. 'ఇవేతీషదర్థోపమా వాక్యాలంకారే ష్వి'తి గణవ్యాఖ్యానే. బహుమాన ఉత్కర్షో - న కోఽపీత్యర్థః. సర్వసాధారణ్యాదితి భావః. కింతు, తస్యాః భువోఽంశస్యాపి, అంశే భాగే చ. తథా తస్యాంశస్య - యోఽవయవ ఏకదేశస్తస్య - లేశే అత్యల్పకణేఽపి చేత్యర్థః. పతయః ఈశ్వరాః, జడా మన్దాః, విషాదే స్వల్పతమభూఖణ్డాధిపతయో వయం జాతా ఇతి విషాదే దుఃఖే కర్తవ్యే సతి, ప్రత్యుత వైపరీత్యేన, ముదం సంతోషం, విదధతి కుర్వన్తి మోదన్త ఇత్యర్థః. అహో మహానయమేతేషామవివేక ఇత్యర్థః. 'ప్రత్యుతేత్యుక్తవైపరీత్య' ఇతి గణవ్యాఖ్యానే.

టీ. యస్యాం=ఏభువి, క్షణమపి=నిముసమేనియు, అభుక్తాయాం = అనుభవింపఁబడకుండ, నృపశతైః = రాజులవందలు, యాతం న=పో లేదో (అనేకరాజు లీభూమిని పాలింపక క్షణమైన నుండలే దనుట,) తస్యాః భువః లాభే = ఆభూమి ప్రాప్తించుటచే, క్షితిభృతాం = రాజులకు, క ఇవ బహుమానః = ఎట్టియుత్కర్ష (అయినను), తత్ అంశస్య అంశే అపి=దానిభాగములో భాగమునకు, తత్ అవయవలేశే అపి=దానిభాగములో నత్యల్పకణమునకేని, పతయః=స్వాములగువారు, విషాదే కర్తవ్యేసతి = దుఃఖపడవలసినది యుండఁగా, జడాః సన్తః = మూఢులై, ప్రత్యుత = విపరీతముగ, ముదం విదధతి = సంతసము ననుభవింతురు.

తా. ఈభూమి నెప్పుడును రాజు లెవరో యనుభవించుచునే యుందురు. ఇట్టి భుక్తముక్త మగుభూమి లభించినప్పుడు రాజుల కేపాటి గౌరవము చేకుఱును? అందు నీభూమియంశములోని యంశమునం దొకలవలేశమునకు యాజమాన్యము చెందువారు చింతిలవలసియుండఁగా మూర్ఖులై వైపరీత్యముచే సంతసింతు రేల?

చ. ఎడ నిముసంబు లేక ధరణీశశతంబు భుజించుచున్న యి
ప్పుడమి లభించినన్ మహిమ కేఁ పొందునె రాజుల నేలతున్కల్లో

నడరు లవంబులోఁ దునియఁయం దొకమూలకు నాథులైనవా
రడలక వైపరీత్యమున హర్షముఁ జెందుదు రెంత మందులో!

శ్లో. మృత్పిణ్డో జలరేఖయా వలయితస్సర్వోఽప్యయం నన్వణుః
స్వాంశీకృత్య సఏవ సంయుగశతై రాజ్ఞాం గణైర్భుజ్యతే,
†నో దద్యుర్దదతేఽథవా కి††మపి తే క్షుద్రా దరిద్రా భృశం
ధిగ్ధిక్తాన్ పురుషాధమాన్ ధనకణం వాఞ్ఛన్తి తేభ్యోఽపి యే. 59

వ్యా.—ఆస్తాం తావత్ క్షుద్రనృపవార్తా. తద్యాచ్ఞాపరాస్తు తతోఽప్యత్యన్త క్షుద్రా ఇత్యాహ—మృత్పిణ్డ ఇతి.—జలరేఖయా సముద్రాకారేణ జలరేఖయా జలధారయా చ, వలయితో వేష్టితః - పుఞ్జీకృతశ్చ, యోఽయం పరిదృశ్యమానస్సర్వః అశేషోఽపిమృత్పిణ్డశ్చ, అణుర్నను, తం తాదృశమృత్పిణ్డమేవ, సంగరశతైః యుద్ధశతైః, స్వాంశీకృత్య స్వభాగీకృత్య, యే రాజ్ఞాం గణాః, భుఞ్జతే అనుభవన్తి, † తే రాజగణా, దద్యుర్హి అర్థం వితరేయుర్వా * దదాతేర్భవిష్యతి లిఙ్, అథవేతి పక్షాన్తరే, దదతః వితరన్తో వా * దదాతేర్వర్తమానే శతృప్రత్యయః. 'నాభ్యస్తాచ్ఛతు రి'తి నుమభావః. 'దదతేఽథవేతి వా పాఠః. ††అపరమన్యద్ధుమ్కారం, కిమపి నాస్త్యేవేత్యర్థః. భృశమత్యర్థం క్షుద్రా హీనాః, దరిద్రా దీనాశ్చ - అనేకసంయుగక్లేశార్జితమృత్పిణ్డభోక్తృత్వాత్ క్షుద్రత్వం-తత్రాప్యంశభాగిత్వాద్దరిద్రత్వం చావగన్తవ్యం, తతస్తేభ్యః క్షుద్రదరిద్రేభ్యో రాజగణేభ్యో, యే పురుషాధమా, ధనకణాన్ ధనలేశాన్, వాఞ్ఛన్త్యభిలషన్తి, తాన్ పురుషాధమాన్ - మానుషాపశదాన్, ధిగ్ధిక్, కూర్పరాధఃప్రసృతజలపానవత్తథావిధ క్షుద్రయాచ్ఞాయాః పరమనైచ్యావహత్వాత్తద్యాచితారస్తతోఽపి నీచాస్తే నరాధమాః శ్వానఃపున్యేన నిన్ద్యా ఇత్యర్థః. ని. 'ధిఙ్నిర్భర్త్సననిన్దయో'రి త్యమరః.

* 'ఉభసర్వతసోః కార్యా ధిగుపర్యాదిషు త్రిషు,
ద్వితీయాఽఽమ్రేడితాన్తేషు తతోఽన్యత్రాపి దృశ్యతే.'

ఇతి వచనాత్పురుషాధమానితి ద్వితీయా. * వీప్సాయాం ద్విర్భావః. స్వదగ్ధకుక్షికుణ్డ పూరణైకప్రయోజనాయాః పురుషాధమత్వజనన్యాః క్షుద్రయాచ్ఞాయా ధిక్కారం విధాయ స్వతస్సిద్ధానన్దనిర్వ్యాకులస్య పురుషోత్తమత్వజనకస్య యతిభావస్యైవ జీవాతోర్గ్రహణం విధేయమితి తాత్పర్యమ్.

టీ. జలరేఖయా = సముద్రమను జలరేఖచే-నీటిగీఱచే, వలయితః = చుట్టఁబడిన, అయంమృత్పిణ్డస్సర్వోఽపి = భూమియను నీమట్టిముద్దయంతయు, అణుః నను = అణువే

కదా, సవివ = ఆకొంతయే, రాజ్ఞాం గణైః = రాజులసమూహముచే, సంయుగశతైః= అనేకములగు యుద్ధములచే, స్వాంశీకృత్య = తమయంశములుగఁ జేయఁబడి, భుజ్యతే= అనుభవింపఁబడుచున్నది. భృశం = మిక్కిలి, క్షుద్రాః = హీనులును, దరిద్రాః = దరిద్రులును, (అగు), తే=ఆరాజులు, నోదద్యుః=ఇయ్యరు. అథవా = ఒకవేళయిత్తురేని, కిమపి దదతే=కొంతయే ఇత్తురు. తేభ్యోఽపి = ఇట్టివారివలనకూడ, యే = ఎవరు, ధనకణం = ధనలేశమును, వాఞ్ఛన్తి=కోరుదురో, తాన్ పురుషాధమాన్ = ఆనీచులగుపురుషులను, ధిక్ ధిక్=ఛీఛీ (నిందింపవలయును అనుట).

తా. ఈభూమి సముద్రముచే గిఱిగీయఁబడిన మట్టిముద్దగదా! ఇది యీసృష్టిలో నెంత! అణువంత! ఈయణువంతను యుద్ధములుచేసి కొట్లాడి కొట్లాడి పెక్కురురాజులు పంచుకొని యనుభవించుచున్నారు. ఇట్టివారొరుల కొసంగుదురా? ఒసంగినను ఈనికృష్టులు నీచాతినీచముగా నించుకంత! ఇస్సిరో! అట్టి నృపతులకడ యాచనకుఁ బోవువారి బ్రదు కెంతరోఁత!

చ. తగ జలరేఖచే వలయితం బగుకొంచెపుమంటిముద్దకై
  జగడము లాడి యోడి పెలుచన్ విభజించి భుజించుచున్నదు
  ర్భగనృపు లిచ్చువారె తలఁపం గడు నీచులు వారియందు నొ
  ప్పుగ ధనలేశకాంక్ష గలపూరుషులుం గడుహీనులే కదా!

శ్లో. స జాతః కోఽప్యాసీన్మదనరిపుణా మూర్ధ్ని ధవళం
  కపాలం యస్యోచ్చైర్వినిహితమలఙ్కారవిధయే.
  నృభిః ప్రాణత్రాణప్రవణమతిభిః కైశ్చిదధునా
  నమద్భిః కః పుంసామయమతులదర్పజ్వరభరః. 60

వ్యా.—కిం బహునా స ఏవ సఫలజన్మేతి నిగమయతి—స ఇతి.—స పుమాన్, కోఽపి కశ్చిదేవ, జాతః సఫలజన్మాఽఽసీత్ - న సర్వ ఇత్యర్థః. కోఽసావిత్యత ఆహ— యస్య పుంసః ధవళం శుభ్రం, కపాలం శిరోఽస్థి మదనరిపుణా శంభునా, ఉచ్చైరున్నతే- సర్వోపరివర్తిమాన ఇత్యర్థః, మూర్ధ్ని నిజమస్తకే, అలంకారవిధయే భూషణవిధానాయ, వినిహితం నిక్షిప్తం, స ఏక ఏవేతి సంబన్ధః. సకలసురాసురమౌళిఖచితమణిప్రభాదీపిత పాదారవిన్దస్య కైలాసగిరీశ్వరస్య భగవతశ్శంభోః కపాలశేఖరత్వాదితి భావః. కిం త్వధు నేదానీం, ప్రాణత్రాణే తుచ్ఛప్రాణసంరక్షణే - ప్రవణా సక్తా - మతిర్యేషాం తైస్తథోక్తైః,

అత ఏవ నమద్భిర్నమస్కుర్వాణైః కైశ్చిత్కతిపయైరేవ, నృభిర్మనుష్యైః * హేతౌ తృతీయా. అథవా నమద్భిః పుంసాం నరవరం మన్యానాం రాజ్ఞామయం పరిదృశ్యమానః అతులో నిస్సీమా - యో దర్పో మద స్స ఏవ జ్వరభరో జ్వరోద్రేకః-అపభ్రంశహేతుత్వాత్, కః కిమర్థమిత్యర్థః, మరణానన్తరేఽపి యస్య శిరః ఆదరపూర్వకం మహాదుపాదేయం భవతి స ఏవ సఫలజన్మా పురుషోత్తమశ్చ-అన్యస్సర్వోఽపి నిష్ఫలజన్మా పురుషాధమశ్చేతి భావః.

టీ. యస్య = ఏపురుషునియొక్క, ధవళం కపాలం=తెల్లనిపుఱ్ఱె, మదనరిపుణా= మన్మథారిచే, ఉచ్చైః=అన్నిటికంటె శ్రేష్ఠమైనదిగా, మూర్ధ్ని=తలయందు, అలఙ్కారవిధయే = భూషణవిధానమునకు, వినిహితం = పెట్టుకొనఁబడినదో, సః కోఽపి=అయొకానొకఁడు, జాతః ఆసీత్ = పుట్టినవాఁడాయెను. అధునా = ఇప్పుడు, ప్రాణ ..మతిభిః= ప్రాణత్రాణ = ప్రాణములను రక్షించుకొనుటయందు, ప్రవణ = సక్తమైన, మతిభిః = మనస్సుగలవారై, నమద్భిః=నమస్కరించుచున్న, కైశ్చిత్ నృభిః=కొందఱు మనుజులచే, పుంసాం=జనులకు, అయం అతులదర్పజ్వరభరః = తులలేని పొగరనెడి యీజ్వరతీవ్రము, కః=ఏమి?

తా. ఎవనికపాలమును పరమేశ్వరుఁడు వానిభక్తికి మెచ్చి మరణానంతరమున శిరోలంకారముగాఁ దాల్చెనో ఆవానిజన్మమే సార్థకము. తమపొట్టకై యెవరోకొందఱు మ్రొక్కినంతమాత్రముననే రాజులకుఁ గొందఱకి మిన్ను మన్ను గానక విఱ్ఱవీఁగుట యేమి?

చ. అతఁడ సుజన్ముఁ డెవ్వనిసుసమంచితశుభ్రకపాల మద్రిజా
పతి కుతుకంబుతోడఁ దలపై ధరియించె విభూషణంబుగా
క్షితిపయిఁ బ్రాణరక్షణముగ నేయుటకై తముఁ జేరి కొంద ఱా
నతు లయి రంచు దుర్మదఘనజ్వర మేటికి మానవాళికిన్.

ఇది వైరాగ్యశతకమునందు యతినృపతిసంవాదవర్ణన మను

ఆఱవదశకము.

---

## మనస్సంబోధననియమనము

శ్లో. పరేషాం చేతాంసి ప్రతిదివస మారాధ్య బహుధా
ప్రసాదం కిం నేతుం విశసి హృదయ క్లేశ † కలితం,

ప్రసన్నే త్వయ్యన్తస్స్వయముదితచిన్తామణిగుణే
విముక్తస్సంకల్పః కిమభిలషితం పుష్యతి న తే. 61

వ్యా.—అథ మనోనియమనదక్షస్యైవ యతిత్వాత్తత్ప్రసక్తానన్తరం మనస్సంబోధనపూర్వకం తన్నియమనప్రకారమాహ—పరేషామితి.—హేహృదయ, ప్రతిదివస మనుదినం, బహుధా బహుప్రకారైః * 'ప్రకారవచనే థాల్' (?)'పరేషాం' చేతాంసి ఆరాధ్య ప్రసాద్య-తత్కాలోచితానువర్తనైరనుకూలీకృత్యేత్యర్థః క్లేశేనాతిప్రయాసేన-† కలితం సంపాదితం, ప్రసాదమనుగ్రహం నేతుం ప్రాపయితుం - మనాంస్యేవేత్యర్థః. *నయతేః ద్వికర్మకాత్తుమున్ ప్రత్యయః, విశసి కిం ప్రవర్తసే కిమిత్యర్థః. అథ యథా కథంచిత్పరచిత్తప్రసాదనేనాభిలషితం సాధయిష్యామి - అతః కిమర్థమేవం నిషిధ్యత ఇత్యత ఆహ—ప్రసన్న ఇతి.—త్వయి,అన్తరభ్యన్తరే, ప్రసన్నే సమేహితే సతి-బహిర్ముఖత్వవైముఖ్యేన స్వస్థాన ఏవ స్థితే సతీత్యర్థః. స్వయం స్వప్రయత్నం వినైవేత్యర్థః. ఉదితః ఆవిర్భూతశ్చిన్తామణిగణః చిన్తారత్ననిచయరూప ఇత్యర్థః. ఏవమేవ చిన్తామణిరశేషాభిలషితదానసమర్థస్తద్గణశ్చ కిం వక్తవ్యమితి భావః, వివిక్తోనిష్కలఙ్కః,సఙ్కల్ప ఇచ్ఛావిశేషతః, తే తవాభిలషితం వాఞ్ఛితం, న పుష్యతి కిం నపూరయతి కిం-పూరయత్యేవేత్యర్థః. అథ వా కిం వాఽభిలషితం న పుష్యతి సర్వమపి పుష్యత్యేవేత్యర్థః. అతః ఆత్మప్రసత్త్యైవాభిలషితప్రాప్తౌ కిమన్యప్రసాదనాయాసేనేత్యర్థః. అన్యథా సస్యక్షేత్రం విహాయారణ్యకర్షణన్యాయః ప్రసజ్యేతేతి తాత్పర్యమ్.

టీ. హృదయ=ఓమనసా, ప్రతిదివసం = అనుదినమును, బహుధా=నానావిధములగు, పరేషాం=ఇతరులయొక్క, చేతాంసి=మనస్సులను, ఆరాధ్య = సేవించి, ప్రసాదం=అనుగ్రహమును, నేతుం = ప్రాపించుటకు, క్లేశకలితం = కష్టములగవానమును, కిం విశసి = ఏల వర్తించెదవు? అన్తః = అభ్యంతరమున, స్వయం=తనప్రయత్నమేలేక, ఉది...గుణే-ఉదిత=ఆవిర్భవించిన, చిన్తామణి గుణే = కోర్కులనిచ్చు చింతామణి యను రత్నముయొక్క గుణములు గలదానవైన, త్వయి = నీవు, ప్రసన్నే సతి=మాలిన్యము లేనిదానవుకాఁగా, విముక్తః సంకల్పః = వదలఁబడిన ఇచ్ఛావిశేషము, తే = నీయొక్క, అభిలషితం=కోరికను, కిం=దేనిని, న పుష్యతి=తీర్పదు.

తా. ఓమనసా ! ఒరులమనస్సు లనుదినము ననుసరించి వారియనుగ్రహము నార్జించుకొనుట కేల కడగండ్లు పడెదవు ? నీవు నిర్మలముగా

నగుదువేని చింతామణిని బోలుదువు. ఎట్లనఁగా: సంకల్పములు పోయినతర్వాతఁ గావలసిన దేమున్నది ?

చ. పరులమనంబు లోలి బహుళభంగులఁ గొల్చి ప్రసన్నతాగుణ
స్ఫురణ వహింపఁ జేయుటకుఁ బూనఁగ నేటికి నీవు చిత్తమా
స్థిరముగ సుప్రసాదము భజించి నిలింపమణీగణోదయ
స్ఫురితగతిఁ మనోరథముఁ సొంపు వహింపదె నీకు మేలుగన్.

శ్లో. పరిభ్రమసి కిం ముధా క్వచన చిత్త విశ్రామ్యతాం
స్వయం భవతి యద్యథా భవతి తత్తథా నాన్యథా,
అతీతమననుస్మరన్నపి చ భావ్యసఙ్కల్పయ
న్నతర్కితసమాగమానసుభవామి భోగానహమ్. 62

వ్యా.—ఏవం మనఃప్రసాదే గుణముక్త్వా తస్యాగుణత్వమాహ.—పరిభ్రమసీతి.—హేచిత్త, ముధా వ్యర్థం, కిం కిమర్థం, భ్రమసి సంచరసి - న సంచరితవ్యమిత్యర్థః. ప్రయోజనాభావాదితి భావః. తర్హి కిం కర్తవ్యమత ఆహ—క్వచన కుత్రచిత్ స్థలే, విశ్రామ్యతాం స్థీయతాం - సంస్థాన ఏవ స్వైరం వర్తతామిత్యర్థః. నన్వేవం చేత్కథం కార్యసిద్ధిరిత్యత ఆహ—యత్కార్యం, యథా యేన ప్రకారేణ, భవతి, తత్, తథా, స్వయమప్రయత్నేనైవ, భవతి, అన్యథా వైపరీత్యేన, న భవతి-'యద్భావి తద్భవత్యే వే' త్యాదివచనాత్సర్వమేతత్ దైవాయత్తమితి భావః. అతో విశ్రామ్యతామితి సమ్బన్ధః. విశ్రమే కిం ఫలమిత్యత ఆహ—అహమ్, అతీత మతిక్రాన్తమర్థమననుస్మరన్నచిన్తయన్ననుశోచన్నిత్యర్థః. తథా భావి చాపి భవిష్యదర్థమపి చ వస్తు *సామాన్యే నపుంసకత్వనిర్దేశః,అసఙ్కల్పయన్ననాకాఙ్క్షన్, అతర్కితోఽనభ్యూహితస్సమాగమో యేషాం తాన చిన్తితోపనతానిత్యర్థః. భోగాన్విషయాననుభవామిదైవవశాత్సంభావితార్థాన్ భోక్ష్యామి*వర్తమానసామీప్యే వర్తమానప్రత్యయః-యద్వా-అనుభవామి భుంజే, అతో మదర్థం న పరిభ్రమితవ్యమితి భావః. ఏవం చేత్సర్వేశ్వరస్యాప్యవశ్యం ప్రియో భవేయ మితి తాత్పర్యమ్. తదుక్తం భగవతా—

'యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్య స్స మే ప్రియః.'

అన్యత్రాప్యుక్తం—

'గతార్థాన్నానుశోచన్తి నార్థయన్తే మనోరథాన్,
వర్తమానేన వర్తన్తే తేన మే పాణ్డవాః ప్రియాః.' ఇతి.

పృథ్వీవృత్తం-'జసౌ జసయలా వసుగ్రహాయతిశ్చ పృథ్వీ గురుః' ఇతి లక్షణాత్.

టీ. చిత్త=మనసా, ముధా = వ్యర్థముగా, కిం=ఎందుకు, పరిభ్రమసి = సంచరించెదవు? క్వచన=ఏచోటనైనను, విశ్రామ్యతాం = బడలికను దీర్చుకొనుము. యత్ స్వయం యథాభవతి = ఏకార్యము స్వతంత్రముగ నేతీరున కానున్నదో, తత్ తథాభవతి అన్యథా న=అది యటులే అగును వేఱుకానేరదు. అహం=నేను, అతీతం=అతిక్రమించిన దానికి, అననుస్మరన్ = చింతింపక, భావిచాపి = రాఁబోవుదానికి, అసంకల్పయన్ = కోరక, అతర్కితసమాగమాన్ = ఊహాలోకలేక వచ్చునట్టి, భోగాన్ = సుఖములను, అనుభవామి=పొందెదను.

తా. ఓమనసా! వ్యర్థముగా నేల క్రుమ్మరెదవు? ఎక్కడైన విశ్రమింపుము. ఏది యెట్లు కావలయునో యది యట్లే యగుఁ గాని వేఱు కాదు. కావున నేను కడచినదానిఁ దలపెట్టక రానున్నదానిఁ గోరక యప్రయత్నలబ్ధము లగుభోగముల ననుభవించెదను.

ఉ. ఏల పరిభ్రమించెద వనేకవిధంబుల వెఱ్ఱిచిత్తమా
తాలిమి విశ్రమింపు మొకచోవున యత్నము లేకయే యగున్
మేలును గీడు నేఁ దలఁప నీ మించినకార్యము భావికార్యమున్
లాలసవృత్తిఁ గోర విధిలబ్ధఫలంబులు నే భుజించెదన్.

శ్లో. ఏతస్మాద్విరమేన్ద్రియార్థగహనాదాయాసకాదాశ్రయ
శ్రేయోమార్గమశేషదుఃఖశమనవ్యాపారదక్షం క్షణాత్,
+శాన్తం భావముపైహి సన్త్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మా భూయో భజ భఙ్గురాం భవరతిం చేతః ప్రసీదాధునా. 63

వ్యా.—అథ విశిష్య సంబోధనప్రకారమేవాహ—ఏతస్మాదితి.—హే చేతః, ఏతస్మాత్ పరిదృశ్యమానాత్, ఆయాసయతీత్యాయాసకాత్ దుఃఖజనకాత్, ఇన్ద్రియార్థాశ్శబ్దాదివిషయా-ఏవ గహనమరణ్యం - తస్మాత్ దుర్విగాహత్వాదేతద్రూపణం, విరమ - విరామం ప్రాప్నుహి - అత్యన్తదుఃఖవిషయాసక్తిం మా కుర్విత్యర్థః.*'జుగుప్సావిరామే' త్యాదినా పఞ్చమీ. * 'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదం, కింతు. క్షణాత్ క్షణమాత్రేణైన, అశేషదుఃఖశమన మేకవింశతిమహాదుఃఖవిధ్వంసన మేవ - వ్యాపారస్తత్ర

దక్షం సమర్థం, శ్రేయోమార్గం జ్ఞానమార్గమ్. ఆశ్రయ అనుసర-తత్ర ప్రవర్తస్వేత్యర్థః. తథా. † స్వాత్మీభావం స్వరూపానుసంధానతత్పరత్వమ్, ఉపైహి ప్రాప్నుహి, తథా, నిజాం స్వకీయాం.'చఞ్చలం హి మనః కృష్ణే'త్యాదౌ ప్రసిద్ధామిత్యర్థః. కల్లోలవల్లోలా మతిచపలాం, గతిం వ్యాపారం, సంత్యజ సమ్యగ్విసృజ్య సుస్థిరం భవేత్యర్థః. భూయః పునరపి, భఙ్గురాం భఙ్గశీలా - మశాశ్వతాం, భవరతిం సంసారాసక్తిం, మా భజ మా సేవస్వ, కిం త్వధునేదానీం, ప్రసీద ప్రసన్నం భవ, చిత్తప్రసాదమన్తరా పుణ్యాశతైరపి శ్రేయః ప్రాప్త్యసమ్భవాదితి భావః.

టీ. చేతః = (ఓ)మనసా, ఆయాసకాత్ = అలజడికలిగించునది యగు, ఏతస్మాత్ ఇంద్రియార్థగహనాత్ = శబ్దాదివిషయములను నీయరణ్యమునుండి, విరమ=విరామమును పొందుము. క్షణాత్ = నిముసములో, అశేషదుఃఖశమనవ్యాపారదక్షం = సమస్తదుఃఖములను పోఁగొట్టునట్టి వ్యాపారమున సమర్థ మగు, శ్రేయోమార్గం = జ్ఞానమార్గమును, ఆశ్రయ=అనుసరింపుము. శాన్తం = శాంతపడు, భావం = ఉనికిని, ఉపైహి=పొందుము. కల్లోలలోలాం = పెద్దయలవలె యతిచపలమైన, నిజాంగతిం = స్వకీయమైన వ్యాపారమును, సన్త్యజ=బొత్తిగావదలుము-సుస్థిరుఁడవు కమ్ము. భూయః=వెండియు, భఙ్గురాం = శాశ్వతముకాని, భవరతిం = సంసారమునందలి రక్తిమను, మాభజ=పొందకుము. అధునా= ఇప్పుడు, ప్రసీద = ప్రసన్నుఁడవు కమ్ము.

తా. మనసా ! ఆయాసపెట్టెడు నీయింద్రియార్థము లనెడు నరణ్యముతో్రవఁ దృజించి శ్రేయస్సునకుఁ జేర్చునట్టియు సర్వదుఃఖనాశక మగునట్టియు సన్మార్గమునఁ బ్రవేశింపుము. ప్రశాంతభావమును జెందుము. అతిచంచల మగు నిప్పటివర్తనమును విడనాడుము. అస్థిర మగు సంసారేచ్ఛను మరలఁ జెందకుము. నైర్మల్యము నందుము.

శా. ఆయాసప్రద మింద్రియార్థగహనంబాతో్రవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖనికరచ్ఛేదార్థమై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందుమీ స్థిరతచేదీపింపుమీ చిత్తమా
మాయాకేళికి వెండియుం జొరకుమీ మాలిన్యముక్తిన్ వీడుమీ.

శ్లో. మోహం మార్జయ తాముపార్జయ రతిం చన్ద్రార్ధచూడామణౌ
చేతస్స్వర్గతరఙ్గిణీతటభువామాసఙ్గమఙ్గీకురు,

కో వా వీచిషు బుద్బుదేషు చ తడిల్లేఖాసు చ † శ్రీషు చ
జ్వాలాగ్రేషు చ పన్నగేషు ‡ చ సరిద్వేగేషు చ ప్రత్యయః. 64

వ్యా. అథ విశ్వసనీయేష్వేవ విశ్వాసం కురు నాన్యత్రేత్యాహ— మోహమితి— హే చేతః, మోహం పుత్రమిత్రాద్యాసక్తిజనకాజ్ఞానం, మార్జయ శోధయ - త్యజేతి యావత్ - తత్ర విశ్వాసం మా కు ర్విత్యర్థః. కిం తు చన్ద్రార్ధః చూడామణిర్యస్య తస్మిన్ చన్ద్రశేఖరే శంభౌ, తాం తథాభూతామనిర్వాచ్యామిత్యర్థః, రతిమనురక్తిముపార్జయ సంపాదయ, తథా స్వర్గతరఙ్గిణ్యా మన్దాకిన్యాః - యాస్తటభువస్తీరప్రదేశాస్తాసామాసఙ్గం తత్ర నివాసాసక్తిమ్, అఙ్గీకురు అనుమన్యస్వ - ఉభయత్రైవ విశ్వాసం కుర్విత్యర్థః. ఏతస్యైవశ్రేయస్కరత్వాదితి భావః. కుత ఏతదిత్యాశఙ్క్యాన్యత్రావిశ్వాసోత్పాదనార్థమస్వరసముద్భావయతి—వీచిషు వారితరఙ్గేషు చ, బుద్బుదేషు జలస్ఫోటేషు చ, తటితో లేఖా ఇవ తాసు విద్యుల్లతాసు చ, † శ్రీషు చ సంపత్సు చ - 'తటిల్లేఖాసు తల్లీషు చే'తి పాఠే-ప్రశస్తాస్తటిల్లేఖాస్తటిల్లేఖామతల్లయః-తాసు చ * 'ప్రశంసావచనైశ్చే'తి నిత్యసమాసః. 'మతల్లికా మచర్చికా ప్రకాణ్డ ముద్ధతల్లజౌ' విత్యమరః. జ్వాలాగ్రేష్వగ్నిశిఖాముఖేషు చ, పన్నగేషు సర్పేషు, ‡ సుహృద్వర్గేషు చ బన్ధుజనసముదాయేషు చ, కో వా ప్రత్యయః? ఉత్తరోత్తరం తారతమ్యేన నశ్వరతయా ప్రత్యక్షసిద్ధేషు విచిత్రసంస్థితిషు చతుర్షు, 'గృహదీప ఇతి చుమ్బనకరణేశ్మశ్రు దాహః' ఇతి లోకన్యాయేన ప్రత్యక్షేణ చ దాహహేతుతయా ప్రసిద్ధేషు జ్వాలాగ్రేషు చ, స్పృష్టతయా ప్రాణహర్తృషు పన్నగేషు చ, విపత్సు పరిత్యాగశీలేషు బన్ధుజనేషు చ, కో వా విశ్వాసః? న కోఽపీత్యర్థః. ఉత్తరోత్తరమవిశ్వసనీయత్వాదితి భావః. ని 'ప్రత్యయోఽధీనశపథజ్ఞానవిశ్వాసహేతు' ష్విత్యమరః.

అత్ర ప్రస్తుతానాం స్వబన్ధుజనానామప్రస్తుతానాం వీచిప్రభృతీనాం చ యథా కథఞ్చిదౌపమ్యస్య గమ్యమానత్వాద్దీపకాలంకారభేదః. తదుక్తం విద్యానాథేన.—

'ప్రస్తుతాప్రస్తుతానాం చ సామస్త్యే తుల్యధర్మతః,
ఔపమ్యం గమ్యతే యత్ర దీపకం తన్నిగద్యతే.' ఇతి.

టీ. చేతః = (ఓ) మనసా, మోహం = పుత్రమిత్రాద్యాసక్తిఁ గలిగించునజ్ఞానమును, మార్జయ = తుడిచివేయుము - వదలుము. చన్ద్రార్ధచూడామణౌ = అర్ధచంద్రుని చూడారత్నముగాఁగల శంభునియందు, తాం=అనిర్వాచ్యమగు, రతిం = అనురక్తిని-భక్తిని, ఉపార్జయ = సంపాదింపుము. స్వర్గతరఙ్గిణీతటభువాం = మందాకినీతీరభూములయందు, ఆసఙ్గం = నివాసాసక్తిని, అఙ్గీకురు = అంగీకరించుము. వీచిషు = అలలయందును, బుద్బు

దేషు చ=జలస్ఫోటములయందును, తడిత్ లేఖాసు చ = విద్యుల్లతలయందును, స్త్రీషుచ = అంగనాజనములయందును, జ్వాలాగ్రేషు=అగ్నిశిఖాముఖములయందును. పన్నగేషుచ = పాములయందును, సరిత్ వేగేషు చ = ఏటి వడులయందును, కోవా ప్రత్యయః = ఏమి నమ్మిక ?

తా. డెందమా ! సంసారమోహము నింక విడనాడుము. అర్ధచంద్రావతంసునిపైఁ దాత్పర్యముఁ జెందుము. గంగానదీతీరప్రదేశముల నివసింపఁ దలంపుము. తరఁగలందును, నీటిబుడగలందును, మెఱుపులందును, స్త్రీలయందును, జ్వాలాగ్రములందును, సర్పములందును, నదీవేగములందును నమ్మక ముండనగునా?

చ. దురితపుమోహముం దొలఁగఁద్రోయుము సేయుము భక్తి శూలిపై
వరసురవాహినీతటనివాసముఁ జేకొను మేటినమ్మికల్
తరఁగలయందు బుద్బుదవితానములందు మెఱుంగుఁదీఁగెలం
దరయఁగఁ గీలలందు ఫణులందు సుహృజ్జనులందు డెందమా.

శ్లో. చేతశ్చిన్తయ మా రమాం సకృదిమామస్థాయినీమాస్థయా
భూపాలభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాఙ్గనామ్,
కన్థాకఞ్చుకితాః ప్రవిశ్య భవనద్వారాణి వారాణసీ
రథ్యాపఙ్క్తిషు పాణిపాత్రపతితాం భిక్షామపేక్షామహే. 65

వ్యా.—అథ ప్రకారాన్తరేణ సమ్బోధయతి—చేత ఇతి.—హే చేతః, అస్థాయినీ మస్థిరాం, కుతః-భూపాలానాం రాజ్ఞాం-భ్రుకుటీ భ్రూభఙ్గ ఏవ - కుటీ కుటీరం - తత్ర విహరణం విహారో = యస్య తథోక్తో యో వ్యాపారస్తేన - పణ్యాఙ్గనాం వ్యభిచారిణీమితి యావత్ - భ్రూసంజ్ఞాయా నరవరణశీలామిత్యర్థః - తదాయత్తత్వాత్తస్యా ఇతి భావః - యద్వా - భూపాలభ్రుకుటీకుటీరే విహరణమేవ వ్యాపారో యస్యాస్సా తథోక్తా సా చ - పణ్యాఙ్గనా వారవిలాసినీ - తాం తథాభూతాం తదధీనత్వాత్తత్ప్రయుక్తప్రవృత్తినివృత్తికామిత్యర్థః. అత్ర పణ్యాఙ్గనారూపణం విహారే విశృఙ్ఖలత్వద్యోతనార్థం-నైయత్యేన వ్యభిచరణశీలత్వప్రకటనార్థం చ - యథా వారవనితా కుత్రచిత్కంచిత్కాలం విహృత్యానన్తరమన్యత్ర గచ్ఛతి తద్వదితి ధ్వనిః. ఇహ కానిచిదర్థాన్తరాణి స్ఫురన్తి బుద్ధిమద్భిరున్నేయాని - గ్రన్థగౌరవభయాన్న లిఖ్యన్తే. తామిమాం పరిదృశ్యమానాం, రమాం సంపత్తిమ్, ఆస్థయా ఆదరేణ, సకృత్ కృ-

దాచిదపి మాచిన్తయ మాకాఙ్క్షయ-తత్సంప్రార్థనప్రయత్నం మా కుర్విత్యర్థః. తర్హి కథం జీవికేత్యాశఙ్క్యాయమాహ—కన్థైవ కఞ్చుకమేషామస్తీతి కన్థాకఞ్చుకినః - కన్థావచ్ఛిన్నగాత్రాస్సన్తః, అత్ర యద్యపి బహువ్రీహిణైవ వివక్షితార్థలాభాత్పునః ప్రత్యయాన్తరగ్రహణే ప్రక్రియాగౌరవం * 'న కర్మధారయాన్మత్వర్థీయ' ఇతి నిషేధాత్-తథాఽపి 'త్వగుత్తరాసఙ్గవతీం' 'శోకప్రీతిచకోరపారణపటుజ్యోతిష్మతీ లోచనే' ఇత్యాది మహాకవిప్రయోగశ్చ వర్తతే ఇతి వైయాకరణాః కథయన్తి - యద్వా - కన్థయా కఞ్చుకినః కఞ్చుకవన్తః కన్థాచ్ఛాదితగాత్రాస్సన్త ఇత్యర్థః, వయమితి శేషః, వారాణస్యాః కాశీపట్టణస్య - ని. 'కాశీ వారాణస్యవన్తీ' త్యమరః. రథ్యా పఙ్క్తిషు రాజమార్గశ్రేణిషు - ని. 'రథ్యా ప్రతోళీవిశిఖే' తి పర్యాయేష్వమరః. భవన ద్వారాణి గృహప్రతిహారప్రదేశాన్, ప్రవిశ్య, పాణిరేవ పాత్రం తత్ర - పతితాం నిక్షిప్తామ్-ఏతే నాయాచాపూర్వకత్వం సూచ్యతే, భిక్షామపేక్షామహే స్పృహయామహే. 'పాణిపాత్ర ఉదరమాత్ర పాత్రే పతితమశ్నియా, దిత్యాది శ్రుతేరనాయాస సిద్ధభిక్షాహారేణ శరీరయాత్రాం నిర్వర్తయన్తః పుణ్యక్షేత్రేషు సుఖేన నివత్స్యామ ఇత్యర్థః, తదుక్తం—

'భిక్షాహారో నిరాహారో భిక్షాన్నైవ ప్రతిగ్రహః,
అసతో వా సతో వాఽపి సోమపానం దినే దినే.' ఇతి.

టీ. చేతః = (ఓ) మనసా, అస్థాయినీం = అస్థిరమయినదియు, భూపాల... పణ్యాఙ్గనామ్-భూపాల=రాజులయొక్క, భ్రుకుటీ = బొమముడియను, కుటీ = కుటీరము నందు, విహరణ=మెలఁగుట యను, వ్యాపార=కార్యము గల, పణ్యాఙ్గనాం=వెలయాలు (నగు), ఇమాం రమాం=దృశ్యమానమగు నీసంపదను, ఆస్థయా = ఆదరముతో, సకృత్ = ఒకప్పుడును, మాచిన్తయ = కోరకుము. కన్థాకఞ్చుకితాః సన్తః = బొంతను కప్పుకొన్న వారమై, వారాణసీరథ్యాపఙ్క్తిషు = కాశీరాజవీథులవరుసలయందు, భవనద్వారాణి = ఇండ్లవాకిళ్లయందు, ప్రవిశ్య=ప్రవేశించి, పాణిపాత్రపతితాం=చేతు లనుపాత్రయందు పడిన, భిక్షాం=బిచ్చమును, అపేక్షామహే = కోరుచున్నాము.

తా. చిత్తమా! రాజులకనుబొమ్మ లనుగుడిసెవేసి లక్ష్మి యనెడు వెలయాలు తిరుగులాడుచుండును. ఎప్పుడును నీ వాసిలుకడలేక వర్తించు బహుచారిణిని గోరకుము. బొంత గప్పికొని వారాణసీపట్టణహట్టము లందు గృహద్వారములనుండి యఱచేతిలో నుంచఁబడు భిక్షాన్న మారగించి మేము జీవింపఁగలము.

మ. అవనీశభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాంగనల్
భువిలో సంపద నించుకం గొనకుమీ భోగార్థమై చిత్తమా
శివమోదావహ కాశికానగర సుశ్రీరాజమార్గంబులన్
భవనద్వారములందుఁ జేత నిడు సద్భైక్షం బపేక్షించెదన్.

శ్లో. అగ్రే గీతం సరసకవయః పార్శ్వయోర్దాక్షిణాత్యాః
పశ్చాల్లీలావలయరణితం చామరగ్రాహిణీనామ్,
యద్యస్త్యేవం కురు భవరసాస్వాదనే లమ్పటత్వం
నో చేచ్చేతః ప్రవిశ సహసా నిర్వికల్పే సమాధౌ. 66

వ్యా.—అథ తవ యది సర్వథా సంసారరసానుభవేఽభినివేశస్తావదిత్థం భూత సామగ్ర్యాం తత్రాభిరతిం కురు, అన్యథా ధ్యాననిష్ఠో భవేత్యాహ—అగ్ర ఇతి— అత్ర గీతశబ్దేన గాయకజనో లక్ష్యతే, తథాచ, హే చేత ఇత్యధ్యాహారః. అగ్రే పురస్తాద్గీతం వీణావాదనప్రవీణగాయకసముదాయశ్చ. తథా, పార్శ్వయోరపీత్యర్థః. దాక్షిణాత్యా దక్షిణదేశోద్భవాః - తేషామేవ విచిత్రప్రబన్ధనిర్మాణకౌశలసంభవాదితి భావః. * 'దక్షిణా పశ్చాత్పురసస్త్యగి'తి త్యకప్రత్యయః, సరసా రసోల్లసితశబ్దార్థసంఘటనచతురా, యే కవయః కవయితారస్తే చ, తథా, పశ్చాత్ పృష్ఠభాగే, చామరాణి ప్రకీర్ణకాని - గృహ్ణన్తీతి చామరగ్రాహిణ్యః - తాసాం వాలవ్యజనవీజనతత్పరాణాం రమణీనాం. ని. 'చామరం తు ప్రకీర్ణకమి'త్యమరః. లీలయా వీజనవైచిత్ర్యవిలాసేన- యద్వలయరణితం మణికఙ్కణఝణత్కారస్తచ్చేత్యేతత్సర్వం. * 'నపుంసకమనపుంసకేనే' త్యాదినా నపుంసకైకశేషః. ఏవముక్తప్రకారేణాస్తి యది వర్తతే చేత్తర్హి, భవే సంసారే - యో రసస్తస్యాస్వాదనే అనుభవే - లమ్పటత్వం లోలుపత్వం, కురు, తదాసక్తం భవేత్యర్థః. ని. 'లోలుపో లోలుభో లోలో లాలసో లమ్పటశ్చస' ఇతి యాదవః. నో చేదేవం నాస్తి చేత్సహసా అవిలమ్బేనైవ * 'స్వరాదిపాఠాదవ్యయ'మితి శాకటాయనః. నిర్వికల్పే నిరాతఙ్కే, సమాధౌ ధ్యానే, ప్రవిశ బ్రహ్మధ్యాననిష్ఠం భవేత్యర్థః. కిమన్యథోభయభ్రంశహేతునా వృథా దైన్యేనేతి భావః.

మన్దాక్రాన్తావృత్తమ్.

టీ. చేతః (ఓ) మనసా, అగ్రే = ముందు, గీతం = పాటయు, (వీణావాదనమున ప్రవీణులు అగుపాటకుల సమూహపుపాట), పార్శ్వయోః = ప్రక్కలయందు, దాక్షిణాత్యాః సరసకవయః = విచిత్రప్రబంధనిర్మాణనిపుణు లగు దాక్షిణాత్యకవులును,

పశ్చాత్ = వెనుక, చామరగ్రాహిణీనాం=వింజామరలు వీఁచుజవరాండ్రయొక్క, లీలావలయరణితం = విలాసముగా వీఁచునప్పుడు రత్నకడియముల ఝుణత్కారమును, ఏవం= ఈవిధమున, అస్తియది = కలదేని, భవరస ఆస్వాదనే = సంసారరసమును ఆస్వాదించుటయందు, లమ్పటత్వం = లోలుపత్వమును-ఆసక్తిని, కురు = వహింపుము. నో చేత్=లేదేని, సహసా = వెంటనే, నిర్వికల్పే = నిరాతంకమైన, సమాధౌ = యోగమునందు, ప్రవిశ = చొరుము. బ్రహ్మధ్యాననిష్ఠాపరుఁడై ఆత్మమాత్రవుగా నుండుము.

తా. మనసా! ఎదుట మధురగానము, ప్రక్కలను సరసులగు దాక్షిణాత్యకవులు, వెనుకఁ జామర గ్రాహిణుల కరకంకణక్వణములు, ఇవికలవేని సంసారరసాస్వాదనమున లాలస వగుము. లేదా నిర్వికల్ప సమాధియందుఁ బ్రవేశింపుము.

చ. సరసులు దాక్షిణాత్యకవిచంద్రులు చెంతలయందు ముందటన్
సురుచిరగీతముల్ వెనుక శోభితచామరపాణిమానినీ
కరమణికంకణక్వణముఁ గల్గిన యేని భవానుభూతిచేఁ
బరఁగుము గల్గవేని భవభంజనయోగముఁ బూను మానసా.

శ్లో. ప్రాప్తాః శ్రియస్సకల కామదుఘా స్తతః కిం
న్యస్తం పదం శిరసి విద్విషతాం తతః కిం,
సంపాదితాః ప్రణయినో విభవై స్తతః కిం
కల్పం స్థితం తనుభృతాం తనుభి స్తతః కిమ్ ? 67

వ్యా.—అథ విచార్యమాణే సంపత్తిలాభశత్రుజయాదీనామప్యకించిత్కరత్వమేవేత్యాహ—ప్రాప్తా ఇతి.—హే చేతః తనుభృతాం శరీరిణాం, సకలకామాన్ దుహన్తీతి సకలకామదుఘాః అశేషమనోరథపరిపూరకా ఇత్యర్థః. శ్రియః ప్రాప్తాః, తతః కిం, తథా విద్విషతా మమిత్రాణాం * ద్విషోఽమిత్రే ఇతి శతృప్రత్యయః, శిరసి పదం, న్యస్తం నిక్షిప్తం-పరాక్రమాతిశయేన సర్వే శత్రవః పాదాక్రాన్తీకృతా ఇత్యర్థః. తతః కిం; విభవైర్ధనైః, ప్రణయినస్సుహృదస్సంపాదితాః సంగృహీతాః వశంవదీకృతా ఇత్యర్థః. 'సమ్మానితా' ఇతి పాఠే - బహుమానితాః. తతః తథా, కల్పస్థితాః కల్పాన్తరస్థాయిన్య ఇత్యర్థః. తనవః శరీరాణి, సంపాదితా ఇతి సంబన్ధః, కేన చిద్యోగేన సంగృహీతాః, తతః కిం, తేషాం శ్రేయస్సాధనత్వనిషేధాదితి భావః. ఏతదాదిశ్లోకచతుష్టయం వసన్తతిలకావృత్తమ్.

టీ. తనుభృతాం = శరీరధారులకు, సకలకామదుఘాః = ఎల్లమనోరథములను పితుకునట్టి, శ్రియః = సంపదలు, ప్రాప్తాః = పొందఁబడినవి, తతః = అందువలన, కిం = ఏమి? విద్విషతాం = అమిత్రులయొక్క, శిరసి = తలయందు, పదం=అడుగు, న్యస్తం = పెట్టఁబడినది. విభవైః=ఐశ్వర్యములచే, ప్రణయినః=సుహృత్తులు, సమ్మానితాః = సత్కరింపఁబడిరి (తతః కిం=అందువలన నేమి?) తనుభిః కల్పస్థితం=దేహములు కల్పాంతరకాలమంతయు ఉండినవి. (తతః కిం = అందువలన నేమి ?)

తా. పురుషుఁడు కోరికలఁ దీర్చుసంపదలు గలిగిన నేమి? శత్రువుల నెల్ల నోడించిన నేమి? ఐశ్వర్యము నొసంగి మిత్రుల గారవించిన నేమి? కల్పాంతము చావులేక బ్రతికిన నేమి? సర్వము నిష్ప్రయోజనము.

చ. సకలశుభంబు లిచ్చుప్రియశ్రీసంపద వచ్చిన నేమి దానిచేఁ
ప్రకటవిరోధిమస్తకము శ్రీపైఁ బద ముంచిన నేమి దానిచే
నికటధనంబుచే హితులకేర్పుగ నేలిన నేమి దానిచే
వికృతముగాక ప్రాణికి భువిం దను వుండిన నేమి దానిచేన్.

శ్లో. భక్తిర్భవే మరణజన్మభయం హృదిస్థం
స్నేహో న బన్ధుషు న మన్మథజా వికారాః,
సంసర్గదోషరహితా విజనా వనాన్తా
వైరాగ్యమస్తి కిమితఃపరమర్థనీయమ్. 68

వ్యా.—నన్వేవం శ్రేయస్సాధనత్వేన వ్యవహృతానామేతేషాం నిషేధే కిమన్యచ్ఛ్రేయస్సాధనమిత్యత ఆహ—భక్తిరితి.—హే చేతః, భవే శమ్భౌ, భక్తిర్భజనానురాగః కార్య ఇతి శేషః, కిం చ, మరణజన్మభ్యాం మహోపద్రవకారిభ్యాం నిధనోత్పత్తిభ్యాం - భయం, హృది తిష్ఠతీతి హృదిస్థం కర్తవ్యమితి శేషః. నతు విస్మర్తవ్యమితి భావః. బన్ధుషు పుత్రమిత్రకళత్రాదిషు విషయే, స్నేహోఽనురాగో, న న కార్యః, తథా మన్మథాజ్జాయన్త ఇతి తథోక్తా, వికారాః స్త్రీపరతన్త్రత్వాదయః, న న కార్యాః - శ్రేయోఽన్తరాయత్వాదితి భావః ఇత్థం శ్రేయస్సాధనత్వేన కర్తవ్యద్వయం తదసాధనత్వేనాకర్తవ్యద్వయం చోపదిశ్యేదానీం పునర్ముఖ్యం కర్తవ్యాన్తరముపదిశతి — సంసర్గదోషైస్సఙ్గదోషైః - రహితాః కామక్రోధాది ప్రసఙ్గవర్జితా ఇత్యర్థః. 'సఙ్గాత్సంజాయతే కామ' ఇత్యాది భగవద్వచనేన సఙ్గజనిత కామాది దోషపరమ్పరాయా అనర్థహేతుత్వాదితి భావః. కుతః? వచనా

వివిక్తాః, వనాన్తా వనప్రదేశాస్సన్త్వ్యాఖ్యాఇతి శేషః. తత్ర కిమస్తీత్యాకాఙ్క్షాయామాహ— వైరాగ్యమస్తి సంభవ తీత్యర్థః. అతో వైరాగ్యత్పరమన్య, త్కిమర్థనీయమఖిలమణీయం? న కిమపీత్యర్థః. తస్యైవ పరమశ్రేయస్సాధనత్వాదితి భావః.

టీ. భవే=శంభునియందు, భక్తిః = బత్తి (కలదని శేషము), మరణజన్మభయం= చావుపుట్టువులవలని భయము, హృదిస్థం = మనస్సుననున్నది, బన్ధుషు=పుత్త్ర మిత్త్రకళత్త్రాదులవిషయమున, స్నేహః = అనురాగము, న=లేదు. మన్మథజాః = మదనునివలనపుట్టునట్టి, వికారాః = స్త్రీపరతంత్త్రాదిచెడుభావములు, న = లేవు. విజనాః=నిర్జనమై, సంసర్గదోషరహితాః = సంగమువలని చెడుగులచే వదలఁబడినవైన, వనాన్తాః=అరణ్యప్రదేశములు (కలవు). వైరాగ్యం = విరక్తి, అస్తి=కలదు. ఇతఃపరం = ఇటుపైని, అర్థనీయం కిం=అపేక్షింపఁదగినది (ఏమియు లేదనుట.)

తా. మనసా! శివునందు భక్తి, జననమరణాదులందు భయమును, దారపుత్త్రాదులందుఁ బ్రేమలేకుండుటయు, మన్మథవికారములకు లోను గామి, సంసర్గదోషము కలుగని నిర్జనము లగువనాంతములును, వైరాగ్యమును తక్క నింకఁ గోరవలసిన దేమున్నది ?

చ. హరచరణాబ్జయుగ్మమునఁ నంచితభక్తి మనంబులో జరా
మరణభయంబు బాంధవసమాజముపై స్పృహ లేమి దుస్సహ
స్మరశరనిగ్రహంబు మునిసమాన్యవివిక్తవనప్రదేశముల్
పరమవిరక్తియుం గలుగఁ భాగ్యమహోన్నతి వేఱ యున్నదే.

శ్లో. తస్మాదనన్తమజరం పరమం వికాసి
తద్బ్రహ్మ చిన్తయ కిమేభిరసద్వికల్పైః,
యస్యానుషఙ్గిణ ఇమే భువనాధిపత్య
భోగాదయః కృపణలోకమతా భవన్తి. 69

వ్యా.—అథ బ్రహ్మవిచారతత్పరస్య తే సర్వేఽపి భువనాధిపత్యాదయస్తుచ్ఛావివ ప్రతిభాన్తీత్యుపసంహరతి—తస్మాదితి.—తస్మాత్ యస్మాద్వైరాగ్యమేవార్థనీయం తస్మాదిత్యర్థః. హేచేతః, అనన్తమపరిచ్ఛిన్నం త్రివిధపరిచ్ఛేదశూన్యం తథా, అజరం జన్మజరామరణవర్జితమ్, అత ఏవ, పరమం సర్వోత్కృష్టం తథా, వికాసి వికస్వరం సర్వవ్యాపీత్యర్థః. యద్వా-వికాసి భాస్వరం, తద్బ్రహ్మ, చిన్తయ, విచారయ, ఏభిః క్రియమాణైః రసద్వికల్పైరసద్భిరసాధుభిః - అసత్యైర్వా - వికల్పైః సత్తద్భోగ ప్రాప్త్యప్రాప్తిగోచర

విచారైః. కిం-వికల్పసాధ్యం నాస్తీత్యర్థః. * గమ్యమానసాధనక్రియాపేక్షయా కరణత్వాత్తృతీయా, * 'న కేవలం శ్రూయమాణైవ క్రియానిమిత్తం కారకభావస్య - అపి తు గమ్యమానాపీ'తి వచనాత్ *యత్తదోర్నిత్య సంబన్ధాత్తచ్ఛబ్దస్య యచ్ఛబ్దాకాఙ్క్షాయామాహ—యస్య బ్రహ్మణః-అనుషఙ్గిణః సమ్భున్ధవన్తః యద్బ్రహ్మవిచారఇత్యర్థఃత వేతి శేషః. ఇమే కామ్యమానాః, భువనాధిపత్యం లోకాధిపత్యం - భోగఃస్వర్గాదిసత్వాన్త లోకసముదాయస్థః తావాదీయేషాం తే తదాదయో భోగాః కృపణలోకానాం బ్రహ్మవిచారహీనజనానాం - మతా ఇష్టా యోగ్యా ఇతి యావత్-భవన్తి ప్రతిభాన్తి-తేషామేవ యోగ్యాః తే న మాదృశానామితి ప్రతీయన్త ఇత్యర్థః.భువనాధిపత్యాదీనామేవం ప్రతీయమానత్వే కిముతాన్యేషామితి భావః. తదానీం తవ తృణీకృతబ్రహ్మపురన్దరత్వాత్సర్వేఽపి తుచ్ఛా ఏవ ప్రతిభాన్తీతి పరమార్థః. యద్వా - నను సర్వదా భోగజాతమేవ మమాభిలషితం నాన్యదితి యది మన్యసే, తదా ఇత్థంభూతస్య తవసర్వే భువనాధిపత్యాదిభోగా అనుషఙ్గాత్స్వయమేవ సమ్భవన్తీతి సమాధానమభిప్రేత్యాహ-హేచేతః, తత్ సకలవేదాన్తప్రసిద్ధం - యద్వా - తచ్ఛబ్దలక్ష్యార్థభూతమిత్యర్థః. 'తత్త్వమసీ'తి మహావాక్యే తథా వ్యాఖ్యానాదితి భావః, చిన్తయ, చిన్తనఫలమాహ— యస్య బ్రహ్మచిన్తనతత్పరస్య, తే, కృపణలోకమతా ఇమే భువనాధిపత్యభోగాదయః, అనుషఙ్గిణః భవన్తి అనుషఙ్గాత్స్వయమేవ సమ్భవన్తీత్యర్థః. బ్రహ్మధ్యాననిష్ఠాసామ్రాజ్యలక్ష్మీపతేః కిం తే దుర్లభమితి భావః. శేషం సమానమ్ - యద్వా - యస్య బ్రహ్మచిన్తనస్య ఇమే భువనాధిపత్యాదయః అనుషఙ్గిణః అనుబన్ధినః భవన్తి - తథా చ సతి బ్రహ్మచిన్తనే తదనుబన్ధవశాత్సర్వేఽపి స్వయమేవ సమ్భవన్తీతి భావః. అత్ర 'శిఖాతే వర్ధతే నూనం గుళూచీం పిబ శాబకే'తి శాస్త్రవచనమనుసృత్యతాత్పర్యాన్తరేణైవం సమాహితమిత్యనుసన్ధేయమ్; కృపణలోకమతా ఇత్యత్ర యద్యపి * మతిబుద్ధీత్యాదినా వర్తమానార్థే క్తప్రత్యయే * 'క్తస్య చ వర్తమాన' ఇతి షష్ఠీసమాస నిషేధః-తథాఽపి నిరఙ్కుశాః కవయ ఇత్యలమ్.

టీ. తస్మాత్=అందుచేత (ఇహమందు వైరాగ్యముతప్ప అపేక్షింపదగిన దేదియు లేనందున), కృపణలోకమతాః = దీనులయొక్క సమూహమునకు ఇష్టములైన, భోగ (భువనాధిపత్యము మొదలగు) సుఖములు, ఆదయః = మొదలైనవి, యస్య=ఏబ్రహ్మమును, అనుషఙ్గిణః = అనువర్తించునవో, అనన్తం = అంతములేనిది, అజరం = ముదిమిలేనిది, పరమ = సర్వోత్కృష్టమైనది, వికాసి = సర్వవ్యాపియై వెలుంగుచుండునది,

(అగు) తత్ బ్రహ్మ=ఆబ్రహ్మమును. చిన్తయ=ధ్యానింపుము. ఏభిః=ఈ, అసత్=చెడు, వికల్పైః=తలంపులచేత, కిం=ఏమిప్రయోజనము?

తా. కాఁబట్టి యనంతమును, నిర్వినాశమును, సర్వోత్కృష్ట మును నగు నాబ్రహ్మమును జింతింపుము. ఈ చెడుచింతలతో నేల? బ్రహ్మచింతనునకు భువనాధిపత్యభోగాదులు నీచసమ్మతములుగాఁ దోఁచును.

తే. కావున ననంత మజర మక్షర మజంబు
బ్రహ్మము భజింపు మతివికల్పములు మాను
బ్రహ్మసంగికి భువనాధిపత్యభోగ
పదవియును నీకుఁ దుచ్ఛమై పరఁగు జూవె.

శ్లో. పాతాలమావిశసి యాసి నభో విలఙ్ఘ్య
దిఙ్మండలం భ్రమసి మానస చాపలేన,
భ్రాన్త్యాఽపి జాతు విమలం కథమాత్మనీనం
తద్బ్రహ్మ న స్మరసి నిర్వృతమేషి యేన. 70

వ్యా.—ఏవమేవార్థం పునః ప్రకారాన్తరేణోపదిశన్నియమయతి — పాతాళ మితి.—హే మానస, చాపలేన తత్తద్విషయాసక్తిజనితచాపల్యేన *యువాదిత్వాదణ్, *హేతౌ తృతీయా, పాతాళమావిశసి అత్యన్తాధఃప్రదేశమపి గచ్ఛసీత్యర్థః. తథా, నభోఽన్తరిక్షం విలఙ్ఘ్య, యాసి, అత్యూర్ధ్వప్రదేశమపి గచ్ఛసీత్యర్థః. తథా దిఙ్మణ్డలం దిశ్చక్రవాళం, భ్రమసి అతిదూరదేశమపి ధావసీత్యర్థః. సర్వత్రాపి మనోగతేర్నిరర్గళ త్వాదితి భావః కిం తు, భ్రాన్త్యా భ్రమవశేనాపి - మాస్తు వివేకేనేత్యపి శబ్దార్థః. తథాపి, జాతు కదాచిదపి, విమలం నిర్మలమ్ - అవిద్యాకార్యసంబన్ధశూన్యమిత్యర్థః. కిన్తు ఆత్మహితమాత్మనీనం సుఖస్వరూపత్వాత్ *'ఆత్మన్విశ్వజనభోగోత్తరపదాత్ఖ' ఇతిఖప్రత్య యః. 'ఆత్మలీనమి'తి పాఠే-ఆత్మన్యన్తరాత్మని-లీనం నిలీయ స్థితం-సర్వాన్తర్యామిత్వాత్, బ్రహ్మ, కథం, న సంస్మరసి న ధ్యాయసి సర్వథా స్మర్తవ్యమిత్యర్థః. కుతః? యేన సంస్మర ణేన, నిర్వృతిమానన్దమేషి ప్రాప్నోషి, అతః యథాకథంచిత్స్మరణేఽప్యానన్దజనకత్వా దవశ్యం స్మర్తవ్యమేవ-

'హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః,
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః.'

ఇత్యాదివచనాదితి భావః.

టీ. మానస=(ఓ) మనసా, చాపలేన = తత్త్వవిషయాసక్తిచపలత్వముచే, పాతాళం=పాతాళమును, ఆవిశసి= చొచ్చెదవు. నభః=ఆకసమును, విలఙ్ఘ్య=దాఁటి, యాసి = పోయెదవు. (మిక్కిలి యధఃప్రదేశమును జొచ్చెదవు. అత్యూర్ధ్వభాగమును దాఁటెదవు.) దిఙ్మండలం=దిక్చక్రవాళమును, భ్రమసి=తిరిగెదవు. (మిక్కిలి దవ్వైన ప్రదేశమున సంచరించెదవు.) వినపి బ్రహ్మస్మరణచే, నిర్వృత్తిం= మోక్షమును, ఏషి=పొందుచున్నావో, భ్రాన్త్యాఅపి=భ్రమచేనైనను, జాతు = ఒకానొకప్పుడైనను, విమలం=నిర్మలముగు, ఆత్మనీనం=ఆత్మకు హితమగు, తత్ బ్రహ్మ=ఆబ్రహ్మమును, న స్మరసికథం=ధ్యానించుట లేదేమి?

తా. మనసా! కుదిరిక లేక యెల్లలోకములఁ దిరుగులాడెదవు. దారితప్పియైన నిప్పుడును దేనిచింతనమువలన నిర్వాణముఁ జెందెదవో యట్టిపరబ్రహ్మమును దలంప వేమి?

చ. బలిసదనంబుఁ జొచ్చెదవు ♦ ప్రాఁకెద వభ్రపదంబు దాఁటి ది
గ్వలయము నాక్రమించెదవు ♦ వారక చిత్తమ చాపలంబునం
దలఁప వొకప్పుడున్ మఱచి ♦ తప్పియు లోన వెలుంగుబ్రహ్మము
న్దలఁచెద వేని పొందెదవు ♦ నాశవివర్జితనిత్యసౌఖ్యమున్.

ఇది వైరాగ్యశతకమునందు మనస్సంబోధననియమన మను
ఏడవదశకము.

---

## నిత్యానిత్యవస్తువిచారము

శ్లో. కిం వేదైః స్మృతిభిః పురాణపఠనైః శాస్త్రైర్మహావిస్తరైః
స్వర్గగ్రామకుటీనివాసఫలదైః కర్మక్రియావిభ్రమైః,
ముక్త్వైకం భవదుఃఖభారరచనావిధ్వంసకాలానలం
స్వాత్మానన్దపదప్రవేశకలనం శేషా వణిగ్వృత్తయః. 71

వ్యా.—అథ వేదాధ్యయన స్మృతిపర్యాలోచనశాస్త్రపఠనపురాణశ్రవణాదిభిర్న కోఽపి లాభః - కిం తు విచారాత్ శ్రవణమనననిదిధ్యాసాభిరాత్మానుభవ ఏవ లాభ ఇతి మత్వాజనానుద్దిశ్య బోధయతి—'కిం వేదై'రితి శ్లోకేన—కిమితి,— వేదైః ఋగ్యజుస్సామాథర్వణసంజ్ఞకైః చతుర్భిర్వేదైః, కిం కిం ప్రయోజనం? న కిమపి ప్రయోజనమిత్యర్థః. స్మృతిభిః మన్వాద్యష్టాదశస్మృతిభిరుపస్మృతిభిశ్చ, కిం ప్రయోజనం? న కిమపి

త్యర్థః. పురాణపఠనైః బ్రహ్మాండపురాణాద్యష్టాదశపురాణోపపురాణపఠనైశ్చ, న కిమపీత్యర్థః మహావిస్తరైః అతివిస్తృతైః, శాస్త్రైః తర్కవ్యాకరణాదిదర్శనైర్న కిమపీత్యర్థః. స్వర్గే సర్వపుణ్యకృన్నివాసే నాకలోకే చ - గ్రామేషు బ్రాహ్మణప్రధానవర్ణానాం నివాసేషు - కుటీషు పర్ణగృహేషు - యః నివాసః తేన ఫలదైః ఫలప్రదైః, కర్మణాం స్నానసంధ్యావన్దనోపాసన యజ్ఞాదీనాం - క్రియాభిః వ్యాపారైః - విభ్రమైశ్చ, న కిమపి ప్రయోజనమిత్యర్థః, భవాత్ జననమరణరూపసంసారాత్ - యద్దుఃఖం దారిద్ర్యభార్యాపుత్త్రాదినాశాది-తస్య-భారః అసహ్యాతిశయః - తస్య - రచనా కలనా-తస్యాః-విధ్వంసః నాశః - తస్య - కాలానలం ప్రళయాగ్నిరూపం, స్వస్య - ఆత్మానన్దః ఆత్మసుఖానుభవః-తస్య-పదం స్థానం - తస్మిన్ ప్రవేశః-తస్య కలనం - ఏవం కేవలం. ని॰ 'ఏకే ముఖ్యాన్యకేవలాః' ఇత్యమరః. ముక్త్వా విహాయ. † శేషైః ఉక్తేభ్య అన్యైః వణిగ్వృత్తయః వర్తకవ్యాపారాః జనాః ఇత్యర్థః. ఆత్మజ్ఞానం వినా ఉక్తానాం వేదాదీనామధ్యయనాదిభిరపి ఫలం నాస్తీత్యర్థః. సర్వేషాం వేదాన్తవాక్యానామ్ బ్రహ్మణి తాత్పర్యమిత్యుక్తరీత్యా బ్రహ్మజ్ఞానమేవ సంపాదనీయం న త్వితరదిత్యాశయః. శేషైర్వణిగ్వృత్తిభిరితి పాఠేన వర్తకవ్యాపారసదృశైః శేషైః ఉక్తాన్యైః న కిమపి ప్రయోజనమిత్యాశయః.

టీ. వేదైః = ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగు వేదములచేత, స్మృతిభిః = మన్వాదిపదునెనిమిది స్మృతులచేత, ఉపస్మృతులచేత, పురాణపఠనైః = బ్రహ్మాండాది పదునెనిమిది పురాణములను నుపపురాణములను చదువుటచేత, మహావిస్తరైః=మిక్కిలి విరివిగలదియగు, శాస్త్రైః = తర్కవ్యాకరణాదిశాస్త్రములచేత, స్వర్గ...ఫలదైః-స్వర్గ = స్వర్గమును, గ్రామకుటీ = పల్లెగుడిసెయందు, నివాస = కాపురమును, ఫల = ప్రయోజనమును, దైః=ఇచ్చునవియగు, కర్తక్రియావిభ్రమైః-కర్మ = స్నాన సంధ్యావంద నోపాసనయజ్ఞాదికర్మలయొక్క, క్రియా = చేతలయొక్క, విభ్రమైః = ఆడంబరములచేత, కిం = ఏమి (ప్రయోజనము లేదనుట), భవ = జననమరణరూప సంసారమువలని, దుఃఖభార=దారిద్ర్యము, భార్యాపుత్త్రాదుల మరణములు మొదలగు పెనుదుఃఖములయొక్క, రచనా = నిర్మాణముయొక్క, విధ్వంస=నశింపజేయుటయందు, కాలానలం = ప్రళయాగ్నిరూపమగు, స్వ=తనయొక్క, ఆత్మ ఆనన్ద = ఆత్మసుఖానుభవముయొక్క, పద = స్థానమునందు, ప్రవేశ = ప్రవేశించుటయొక్క, కలనం = గడనను, ఏకం = ఒక్కదానిని, ముక్త్వా = విడిచి, శేషాః = పైనచెప్పినవి తప్ప ఇతరములు, వణిగ్వృత్తయః = వర్తకుల వ్యాపారములు.

తా. శ్రుతిస్మృతిపురాణశాస్త్రాదులచేతఁగాని స్వర్గమను నూరి గుడిసెలోఁ గాఁపుర మిప్పించు జ్యోతిష్టోమాది కర్మలచేఁ గాని యేమి లాభము కలదు? సంసారదుఃఖమును మాయించు నొక్క యాత్మా నంద పదప్రవేశము తక్కఁ దక్కినవెల్లఁ గోమటి బేరములే.

ఉ. శ్రీమహితశ్రుతిస్మృతులచే బహుశాస్త్రపురాణయుక్తిచే
నేమిఫలంబు లౌకికజనప్రవృత్తికి నీ డగు నిర్జరాలయ
గ్రామకుటీనివాసఫలకర్మముచే ఫల మేమి జన్మదుః
ఖామయభేషజాక్షయమహాసుఖ మొక్కటి దక్క నన్నిటన్.

శ్లో. యతో మేరుశ్శ్రీమాన్నిపతతి యుగాన్తాగ్నివలితః
సముద్రాశ్శుష్యన్తి ప్రచురమకరగ్రాహనిలయాః,
ధరా గచ్ఛత్యన్తం ధరణిధరపాదైరపి ధృతా
శరీరే కా వార్తా కరికలభకర్ణాగ్రచపలే. 72

వ్యా.—అథాతిరిక్తస్యానిత్యత్వమేవ ప్రపఞ్చయతి—యత ఇతి.—యతో యస్మాత్కారణాత్, శ్రీమాన్ మణిహిరణ్యాదిసకలవస్తుసమృద్ధిమాన్, మేరుః మేరుగిరిరపి, యుగాన్తాగ్నినా ప్రళయకాలానలేన - వళితస్సంవేష్టితస్సన్నిపతతి, విశిష్టాగ్నిసంపర్కాన్నిలీనో భవతీత్యర్థః. తథా, ప్రచురాః ప్రభూతాః-మకరా నక్రాః - గ్రాహా జలగ్రాహాశ్చ - తేషాం - నిలయాః సమాశ్రయాస్సముద్రాస్సప్తసాగరాశ్చ. శుష్యన్తి శోషం ప్రాప్నువన్తి. తథా, ధరన్తీతి ధరాః * పచాద్యచ్-ధరణ్యాః ధరాః మహేన్ద్రాది సప్తకులాచలాస్తేషాం - పాదైః ప్రత్యన్తపర్వతైః. ని. 'పాదాః ప్రత్యన్తపర్వతా' ఇత్యమరః. ధృతా సమ్యగవష్టబ్ధా, ధరా భూమిశ్చ, అన్తం నాశం పాతాళం వా, గచ్ఛతి ప్రాప్నోతి - ఉభయత్రాపి ప్రళయాగ్నిమేళనాదేవేతి భావః. తస్మాత్ కారణాత్ * యత్తదోర్నిత్యసంబన్ధా, కరికలభస్య కరిపోతస్య-కర్ణాగ్రం కర్ణాఞ్చలం - తద్వచ్చపలే, శీర్యత ఇతి శరీరే, కా వార్తా కా కథా న కాఽపీత్యర్థః. యతోఽత్యన్తస్థిరతరాణామపి ఈదృశ్యవస్థా కిం మత క్షణభఙ్గురాణాం శరీరాణాం-'గజా యత్ర న గణ్యన్తే మశకానాం తు కా కథే'తిన్యాయాదితి భావః. సర్వేఽపి నశ్వరా ఏవ తతోఽప్యతినశ్వరం శరీరమితి తాత్పర్యమ్; కరికలభేత్యత్ర కరిశబ్దస్య విశేషప్రతిపత్తిహేతోరైవశేష్యప్రతీత్యర్థిత్వా దపౌనరుక్త్యమ్; అత ఏ 'వైకార్థం పదమప్రయోజ్య మి' త్యుక్త్వా 'కరికలభకర్ణావతంసాదిషు ప్రతిపత్తివిశేషకరేషు న దోష' ఇత్యాహ వామనః.

టీ. యత్=ఏకారణముచేత, శ్రీమాన్ = మణులు, బంగారము మొదలగు సకల వస్తుసమృద్ధిగల, మేరుః = మేరుపర్వతము-అనఁగా బంగరుకొండ, యుగా...లితః సన్-యుగాన్తాగ్ని = ప్రళయకాలపునిప్పుచే, వలితః సన్ = ఆవరింపఁబడినదై, నిపతతి = పడునో, ప్రచుర...లయాః-ప్రచుర = పెక్కు, మకర = పెద్దచేఁపలకును, గ్రాహ = మొసళ్లకును, నిలయాః = స్థానములయిన, సముద్రాః = సంద్రములు, శుష్యన్తి = ఎండిపోవునో, ధరణీధరపాదైః = కొండలఅడుగులచేత, ధృతా = పట్టుకొనఁబడినదైన, ధరా అపి=భూమియును, అన్తం = నాశమును-పాతాళమును, గచ్ఛతి=పొందునో; (ఆహేతువుచే) కరి...చపలే-కరికలభ = ఏనుఁగుపిల్లయొక్క, కర్ణ అగ్ర = చెవికొనవలె, (అట్లు చపలతగలిగి), చపలే=నిలుకడలేని, శరీరే=శరీరవిషయమున, కా వార్తా=ఏమిమాట?

తా. ప్రళయాగ్నికీలలవలన సకలసంపన్నిధాన మగుమేరువు కరఁగి కుమిలిపోవును. పెనుచేఁపలకు మొసళ్లకు నెలవు లగుసముద్రములింకిపోవును. పర్వతపుమట్టులచేత నిల్వరింపఁబడుచున్న భూమిసయితము నశించిపోవును. వీనిగతియే యిట్లుండఁగా కొదమయేనిక వీను కొనవలెనతిచపలమగు నీశరీరముమాట చెప్పవలయునా?

చ. స్థిరతరమైనమేరువు నశించు యుగాంతకృశానుకీలలన్
వరమకరాలయంబు లగువారినిధానము లెల్ల నింకు భూ
ధరములచే ధరింపఁబడు ధారుణి పోఁడిమి దప్పుఁ గావునం
గరికలభశ్రవశ్చపలకాయమునం దిఁక వార్త లేటికిన్.

శ్లో. గాత్రం సఙ్కుచితం గతిర్విగలితా భ్రష్టా చ దన్తావలి
ర్దృష్టిర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రం చ లాలాయతే,
వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో భార్యా న శుశ్రూషతే
హా! కష్టం! పురుషస్య జీర్ణవయసః పుత్త్రోఽప్యమిత్త్రాయతే. 73

వ్యా.—అథ శరీరిణో జరయా దురవస్థామాహ ద్వాభ్యాం—గాత్రమితి.—గాత్రం శరీరం, సఙ్కుచితం భుగ్నమభూదితి శేషః. గతిస్సంచారో, విగళితా సంచారశక్తిరపి నష్టేత్యర్థః. దన్తావళిర్దన్తపఙ్క్తిశ్చ, భ్రష్టా పతితా, దృష్టిశ్చక్షురిన్ద్రియం చ, నశ్యతి అర్థగ్రహణాపటుర్భవతీత్యర్థః. బధిరతా శ్రోత్రేన్ద్రియాపాటవం, వర్ధతే వృద్ధిం ప్రాప్నోతి, వక్త్రం చ, లాలా దన్తాన్తర్గతజలం-లాలేవాచరతి లాలయతే-లాలామయం భవతీత్యర్థః. ని. 'సృణికా స్యన్దినీ లాలే' త్యమరః. తథా బన్ధవ ఏవ బాన్ధవాః*స్వార్థేఽణ్ప్ర త్యయః, త ఏవ జనో బన్ధువర్గశ్చ, వాక్యం వచనం, నాద్రియతే న రోచయత ఇత్యర్థః.

కిం బహునా? భార్యాఽపి, న శుశ్రూషతే న సేవతే-యద్వా-సేవితుం, నేచ్ఛతి-సేవా దూరాపా స్తేతి భావః. అతః, జీర్ణవయసో జరావస్థాసంపన్నస్య పురుషస్య, హేతి విషాదే, కష్టం కృచ్ఛ్రం. కుతః? పుత్త్రోఽప్యాత్మసంభవోఽపి, †అమిత్త్రాయతే అమిత్త్రం శత్రుమివాచరతి-ప్రతికూలాచరణతత్పరో భవతీత్యర్థః; లాలాయత ఇత్యత్ర. * 'కర్తుః క్యఙ్సలోపశ్చే'తి క్యఙ్. అత్రతు * 'ఉపమానాదాచార' ఇతి క్యచ్-ఉభయత్రాపి * 'అకృత్సార్వధాతుక యోర్దీర్ఘ' ఇతి దీర్ఘః.

టీ. జీర్ణవయసః = ముసలితనము సంప్రాప్తించిన వయస్సుగల, పురుషస్య = పురుషునికి, గాత్రం = శరీరము, సఙ్కుచితం = ముడిచికొన్నది (అగును); గతిః=సంచారశక్తి, విగళితా = నశించినది (అగును); దన్త ఆవళిః = పలువరుస, భ్రష్టా=రాలినది; దృష్టిః= చూపు, నశ్యతి=నశించినది (అగును); బధిరతా = చెవుడు, వర్ధతే=పెరుగును; వక్త్రం = నోరు, లాలాయతే = చొంగగాఱును; బాన్ధవజనః = బంధువులసమూహము, వాక్యం= (తన)మాటను, న ఆద్రియతే=సరకు గొనరు; భార్యా=పెండ్లాము, న శుశ్రూషతే=ఉపచారము చేయదు. కావున, హాకష్టం=ఎంతకష్టము సంప్రాప్తించినది, పుత్త్రోఽపి = కొడుకు సైతము, అమిత్త్రాయతే=శత్రువువలె అగును.

తా. ముదుసలి యగువానిగతి ఒడలు ముడుతలుపడును. అడుగులు తడఁబడును. దంతములు రాలిపోవును. చూపు దప్పును. చెవుడు హెచ్చగును. నోరఁ జొంగలు కాఱును. చుట్టాలు మాట వినరు. పెండ్లము సయిత ముపచారము సేయదు. పుత్త్రుఁడు సయితము శత్రువగును. ఎంతకష్టము! ఇట్టిశరీరము నెడనా వెఱ్ఱి యభిమానము?

చ. తనువు ముడుంగుఁ బాదగతి ♦ దప్పును దంతము లూడుఁ జీఁకటుల్
కనుఁగవ వర్తిలుం జెవుడు ♦ గ్రమ్మును జొంగలు గాఱు మోమునన్
జనములు మాట చేకొనరు ♦ సన్నిధిఁ జేరదు భార్య పుత్త్రుఁడుం
గొనకొని శత్రునట్లు తిరుగుం గడుఁగష్టము వృద్ధదేహికిన్.

శ్లో. వర్ణం సితం †శిరసి వీక్ష్య శిరోరుహాణాం
స్థానం జరాపరిభవస్య తదా పుమాంసమ్,
ఆరోపితాస్థిశకలం పరిహృత్య యాన్తి
చణ్డాలకూపమివ దూరతరం తరుణ్యః. 74

వ్యా. వర్ణమితి.—తరుణ్యో యువతయః కర్త్ర్యః * 'వయసి ప్రథమ' ఇతి జీప్, శిరసి రోహన్తీతి శిరోరుహాశ్చికురాః తేషామ్ * ఇగుపధలక్షణః కప్రత్యయః. సితం వర్ణం ధావళ్యగుణం - పలితత్వమితి యావత్, † ఝుడిత్యఙ్గసా, వీక్ష్య దృష్ట్వా - ని. 'ద్రాగ్ఝడిత్యఙ్గసాహ్నా యే' త్యమరః. తదా తస్మిన్ సమయే - దర్శనసమనన్తర కాల ఏవేత్యర్థః. జరయా వార్ధకావస్థయా - యః పరిభవః అవమాన - స్తస్య - స్థాన మాస్పదం, తథా, ఆరోపితం బహిః స్ఫుటలక్ష్యత్వాదారోపిత ప్రాయమస్థిశకలం యస్య తం తథోక్తం-అన్యత్రారోపితం నిక్షిప్తం - అస్థిశకలం యస్మిన్ తం - 'ఆరోపితాస్థి శకల' మితి పాఠే - ఏకత్రారోపితప్రాయకీకసఖణ్డం, అన్యత్ర నిక్షిప్తకీకసఖణ్డ మిత్యర్థః, పుమాంసం పురుషం, చణ్డాలకూపం చణ్డాలసంబన్ధి జలాశయమివ, పరివృత్య పరిత్యజ్య, దూరతరమతివిప్రకృష్టం, యాన్తి హేయత్వాద్విహాయాన్యత్ర గచ్ఛన్తీత్యర్థః. అతః కష్టం జీర్ణవయసోఽపి జీవనమితి భావః.

టీ. తరుణ్యః = యువతులు, శిరసి = తలయందు, శిరోరుహాణాం = వెండ్రుకల యొక్క, సితం వర్ణం = తెల్లనివన్నెను, వీక్ష్య = చూచి, తదా=అప్పుడు, జరాపరిభవస్య = ముదిమిచేత యవమానమునకు, స్థానం=పాత్రమైన, పుమాంసం=పురుషుని, ఆ...శకలం- ఆరోపిత = (వెలుపలికి స్పష్టముగఁ గాన్పించుటచే) మోపఁబడిన, అస్థి=ఎముకల, శకలం = తునకలు గలదగు, చణ్డాలకూపమివ = మాల(పల్లెలోని) నూతివలె, పరివృత్య = వదలి, దూరతరం = మిక్కిలిదూరముగా, యాన్తి = పోవుదురు.

తా. గిలకచెంతఁ గట్టఁబడిన యెముకను జూడఁగనే మాలనూతి నేవగించికొని దూరముగా నేగినట్లు, జవరాండ్రు నరసినవెండ్రుకలు చూడఁగనే ముసలితనపు టేవగింపునకు నెల వగువరునికిఁ దొలఁగి పోవుదురు.

ఆ. కురుల తెలుపు చూచి ॥ కొఱగాఁడు వీఁ డని
ముసలివాని విడిచి ॥ ముదిత లెల్ల
దూరముగఁ దొలంగుదురు సాస్థిశకల మా
మాలనూతి విడిచి ॥ మలఁగుభంగి.

శ్లో. యావత్స్వస్థమిదం శరీరమరుజం యావచ్చ దూరే జరా
యావచ్చేన్ద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః,
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః?

వ్యా.—అతః దురవస్థాప్రాప్తేః పూర్వమేవ శ్రేయస్సంపాదనార్థం యత్నః కర్తవ్యః నాన్యథేతి సదృష్టాన్తమాహ—యావదితి.—యావత్ యావత్పర్యన్తం, మిద మేత, చ్ఛరీరం, స్వస్థం పీడారహితం, భవతీతి శేషః. ఏవముత్తరత్రాపి, తథా, యావత్ న విద్యతే రుజా రుగ్యస్య తత్తథోక్తమ్ - ఆరోగ్యయుక్తం భవతి - ని. 'స్త్రీ రుగ్రుజా చోపతాపో' ఇత్యమరః. యద్వా - అరుజం సత్ - స్వస్థమవికలం - భవతి, తథా, యావజ్జరా, దూరతః - దూరే భవతి - వార్ధకదశా యావత్పర్యన్తం నాక్రామతీత్యర్థః. తథా యావదిన్ద్రియశక్తిశ్చక్షురాదీన్ద్రియపాటవం చ, అప్రతిహతా అఖణ్డితా భవతి. యావదాయుషః, క్షయో నాశో, న భవతి, తావత్తావ త్పర్యన్తమేవ - తన్మధ్యకాల ఏవేత్యర్థః. వేత్తీతి విద్వాన్ - తేన విదుషా అభిజ్ఞేన * 'విదేశ్శతుర్వసు' రితి వసు ప్రత్యయః. ఆత్మనః - శ్రేయసి విషయే-మోక్షప్రాప్తావిత్యర్థః. మహాన్ ఫలజననపర్యాప్త త్వేన పూజ్యః ప్రయత్నః జ్ఞానవైరాగ్యతపస్సంపాదనోద్యోగః, కార్యః; నను కోఽయం నియమః? అవసానేఽపి ప్రయత్నస్య కర్తుం యుక్తత్వాదిత్యాశఙ్క్యావకాశాభావాన్న యుక్త ఇతి వ్యతిరేకదృష్టాన్తమాహ—భవనే గృహే, సందీప్తే అగ్నినా దహ్యమానే సతి, కూపఖననం ప్రతికూపనిర్మాణంప్రతి, ఉద్యమః ప్రయత్నః, కీదృశః కీదృగ్విధః? న యుక్త ఇత్యర్థః. అవకాశాభావాదితిభావః, గృహదాహవేళాయాం కూపఖననప్రయత్న ఇవ అవసానకాలే శ్రేయఃప్రాప్త్యర్థోద్యమోఽపి న యుజ్యత ఇతి భావః. తస్మాత్స్వస్థా వస్థాయామేవశ్రేయస్సాధనసంపాదనతత్పరేణ భవితవ్యమవశ్యం బుద్ధిమతేతి తాత్పర్యమ్.

టీ. యావత్ = ఎంతపర్యంతము, ఇదంశరీరం = ఈదేహము, అరుజం = ఆరోగ్య వంతమై, స్వస్థం = పీడలేనిదిగ (ఉండునో), యావత్ చ = ఎందాఁక, జరా = ముదిమి, దూరే=దూరముగ (ఉండునో), యావత్ చ=ఎందాఁక, ఇన్ద్రియశక్తిః=నేత్రాదీంద్రియ పాటవము, అప్రతిహతా=అఖండితమై (ఉండునో), యావత్ ఆయుషః=ఆయుస్సునకు, క్షయం = నాశము, న = లేదో, తావదేవ = అందాఁక, విదుషా = విద్వాంసునిచే, ఆత్మ శ్రేయసి = తనమేలునకై-మోక్షప్రాప్తికి, యత్నః = గొప్పయత్నము (జ్ఞానవైరాగ్య తప స్సంపాదనోద్యోగము), కార్యః=చేయఁదగినది, భవనే = గృహము, సందీప్తేసతి=దహింపఁ బడుచుండఁగా, కూపఖననంప్రతి = బావిత్రవ్వుటకు, ఉద్యమః = యత్నము, కీదృశః = ఎట్టిది ?

తా. ముదిమి యావహిల్లకమున్న, ఇంద్రియపాటవము తలుఁ గకమున్న, ఆయుస్సు క్షీణింపకమున్న ఈశరీరము స్వస్థముగా నున్న ప్పుడే విద్వాంసుఁడు మోక్షప్రాప్తికై మహాయత్నము కావింపవల

యును. సర్వము నుడిగినపిదప మోక్షమునకై యత్నపడుట యిల్లు తగులఁబడి పోవుచుండఁగాఁ జల్లార్ప నీళ్లకై నూయి త్రవ్వ మొదలిడుటవంటిది.

చ. ధృతిఁ గొని రోగముల్ జరయుఁ దేహము నొంపకముందె యింద్రియ
ప్రతిహతి లేకముందె తనప్రాణవిరామము కాకముందె పం
డితజనుఁ డాచరింపఁదగు ధీవిఁ బ్రయత్నము ముక్తికిన్ మహో
ద్ధతశిఖి నిల్లు గాలుతఱిఁ దాలిమి నూతులు త్రవ్వ టొప్పునే.

శ్లో. తపస్యన్తస్సన్తః కిమధినివసామస్సురనదీం
గుణోదారాన్దారానుత పరిచరామస్సవినయమ్,
పిబామశ్శాస్త్రౌఘానుత వివిధకావ్యామృతరసా
న్న విద్మః కిం కుర్మః కతిపయనిమేషాయుషి జనే. 76

వ్యా.—అథ తపశ్చరణాదీన్ బహూన్ కర్తవ్యతయా వికల్ప్యానన్తరమవశ్యం తప ఏవ సంపాదనీయమితి కేషాంచిన్నిశ్చయమనుసంధాయాహ తపస్యన్త ఇతి ద్వాభ్యాం—తపస్యన్త ఇతి—తపస్యన్తః తపశ్చరన్తస్సన్తః, కేవలమితి శేషః. *'కర్మణో రోమన్థతపోభ్యాం వర్తిచరోః' ఇతి క్యఙ్ప్రత్యయః. సురనదీం మన్దాకినీమ్, అధినివసామః కిం అధితిష్ఠామో వా - వైరాగ్యేణేతి భావః, కింశబ్ద ఉత్తరత్రాప్యనువర్తనీయః. * 'ఉపాన్వధ్యాఙ్వస' ఇతి సురనద్యాః కర్మత్వమ్. ఉత అథవా, వినయేనానుకూల్యేన సహితం యస్మిన్ కర్మణి తద్యథా, తథా, గుణైస్సౌభాగ్యసౌశీల్యాదిభిరుదారాన్ రమ్యాన్, దారాన్ జాయాం, పరిచరామః కిం అనుసరామో వా-సాంసారికధర్మేణేతి భావః. ని. 'భార్యా జాయాఽథ పుంభూమ్ని దారా' ఇత్యభిధానాద్దారశబ్దస్య పుంస్త్వం బహుత్వం చ. తథా, శాస్త్రౌఘాన్ శాస్త్రకలాపాన్, పిబామః కిం అద్యైవ కీర్తిప్రతిష్ఠావిజ్ఞానార్థమిత్యర్థః, * 'పాఘ్రాధ్మే' త్యాదినా పాతేః పిబాదేశః. ఉత యద్వా, వివిధాని కావ్యాని కావ్యనాటకాలంకారావివామృతరసాస్సుధాద్రవాః - అథవా - వివిధేషు కావ్యేషు యే అమృతరసాస్తాన్, పిబామః - సకలకలాకౌశలార్థమితి భావః. జనశబ్దేనాత్ర తత్సముదాయో వివక్షితః. తథా చ - జనే జనసముదాయే, కతిపయే కియన్తః-యే నిమేషాస్తావన్మాత్రకాలపరిచ్ఛిన్నమాయుర్యస్య తస్మిన్ సతీత్యర్థః. జాత్యేకవచనవివక్షాయాం తు జనేష్వస్మాసు కతిపయనిమేషాయుస్సు సత్స్విత్యర్థః. కిమ్ ఉక్తతపశ్చరణాదిషు

కిం వా కుర్మః, సర్వేషామాచరణే అవకాశాభావాదితి భావః. న విద్మః న జానీమః- నిశ్చయాభావాదితి భావః.

టీ. తపస్యన్తః = తపమాచరించుచు, సురనదీం = మందాకినియొద్ద, అధినివసామః కిం=నివసింతుమా? ఉత = లేక, సవినయం=అనుకూలతతో, గుణఉదారాన్ = సౌభాగ్య సౌశీల్యాదిగుణములచే రమ్యమైన, దారాన్ =భార్యను, పరిచారమః కిం=ఆశ్రయింతుమా? శాస్త్రౌఘాన్ = శాస్త్రకలాపములను, పిబామః కిం = (కీర్తిప్రతిష్ఠావిజ్ఞానములకొఱకు) త్రావుదుమా ? ఉత=లేక, వివిధ...రసాన్ - వివిధ=పలువిధములగు, కావ్య = కావ్యనాటకాలంకారగ్రంథములయందలి, అమృతరసాన్ = సుధాద్రవములను, పిబామః కిం= త్రాగుదుమా? (సకలశాస్త్రనిపుణత్వమున కని భావము.) జనే=జనుఁడు, కతిపయనిమేషాయుషి సతి = కొన్ని నిముసములే ఆయుస్సుగలవాఁడగుటచే, కిం కుర్మః = దేనిని చేయుదుమో, న విద్మః=ఎఱుఁగము.

తా. గంగాతీరమున వసించి తపములే చేయుదుమా? చక్కఁగా ననుకూలవతి యగు భార్యతో సౌఖ్య మనుభవింతుమా? శాస్త్రప్రవాహములఁ ద్రావుదుమా? కావ్యామృతరస మాస్వాదింతుమా? కొన్ని నిమేషములమాత్ర మగు నీయాయుష్కాలమున నేదియని కావింతుము?

మ. తపముల్ సేయుచు దేవతాతటిని చెంతన్ నిల్తుమో కాక దా
రపరత్వంబున నుందుమో వివిధశాస్త్రశ్రవ్యకావ్యామృతం
బుపభోగింతుమొ యేమి సేయను హితం బూహింపఁగాలే మని
త్యపులోకంబున మానవుల్ మితనిమేషాయుష్కులై యుండఁగన్.

శ్లో. దురారాధ్యాశ్చామీ తురగచలచిత్తాః క్షితిభుజో
వయం తు స్థూలేచ్ఛాస్సుమహతి ఫలే బద్ధమనసః,
జరా దేహం మృత్యుర్హరతి దయితం జీవితమిదం
సఖే! నాన్యచ్ఛ్రేయో జగతి విదుషోఽన్యత్ర తపసః. 77

వ్యా.—తతః కిమిత్యాశఙ్క్య తతో నిశ్చయమాహ—దురారాధ్యా ఇతి— తురగాః ఉత్తమాశ్వాః - తద్వచ్చలాని చిత్తాని యేషాం తే అస్థిరహృదయా ఇత్యర్థః. అమీ పరిదృశ్యమానాః, క్షితిభుజః రాజానః, దురారాధ్యాః ఆరాధయితుం ప్రసాదయితుమశక్యాః - ప్రసాదోన్ముఖీకరణాశక్యా ఇత్యర్థః తథా, స్థూలేచ్ఛాః అధికాశాతత్పరాః, వయం చ, సుమహతి బహుళే, ఫలే ధనే, బద్ధం మనో యేషాం

తే తథోక్తాః - బహుధనాకాఙ్క్షిణ ఇత్యర్థః. ఆకాఙ్క్షామాత్రమేవాస్మాకం న తు తే దాస్యన్తీతి భావః. తథా, జరా వార్ధకదశా, దేహం, హరతి క్షిణోతి, మృత్యురన్తకశ్చ, దయితం ప్రియతమమిదం జీవితమ్ ఇమాన్ ప్రాణానిత్యర్థః. హరతి, అతః హే సఖే. జగత్యస్మిన్ లోకే, విదుషస్తత్త్వజ్ఞస్య పుంసః, తపసో, ఽన్యత్రాన్యత్ ఇతరదిత్యర్థః, అన్యదసాధారణముత్తమం, శ్రేయః మోక్షసాధనం, నాస్తి. తతోఽన్యత్పరమం శ్రేయోన్తరం నాస్తి, అతస్సర్వథా తదేవ సంపాదనీయమితిభావః.

టీ. తురగచలచిత్తాః = గుఱ్ఱమువలె చపలమయిన మనస్సుగలవారగు, అమీ క్షితిభుజః=ఈరాజులు, దురారాధ్యాః = ప్రసన్నులగుటకష్టము; వయన్తు = మనమో, స్థూలఇచ్ఛాః=అధికాశాతత్పరులము; సుమహతి పదే = విశేషధనకాంక్షయందు, బద్ధమనసః = కట్టఁబడిన మనస్సుగలవారము, జరా = ముసలితనము, దేహం = శరీరమును, హరతి = క్షీణింపఁజేయుచున్నది; మృత్యుః=చావు, దయితం=ప్రియతమమైన, జీవితం=ప్రాణమును, హరతి=నశింపఁజేయుచున్నది; సఖే=చెలికాఁడా, జగతి = లోకములో, విదుషః = తత్త్వజ్ఞుఁడగు పురుషునకు (తెలివిగలవానికి), తపసః అన్యత్ర = తపస్సుతప్ప, అన్యత్ శ్రేయః = వేఱు మోక్షసాధనము, న = లేదు.

తా. గుఱ్ఱములవలెఁ జంచలించు చిత్తము గల రాజుల నారాధించుట బహుకష్టము. మనకా యాశలు పెద్దవి. కొండంతఫలములపై మనస్సు పాఱుచున్నది. దేహప్రాణములను జరామృత్యువులు హరింపనున్నవి కావున మిత్రమా! తపస్సుకంటె శ్రేయస్కరము విద్వాంసునకొండొకటి లేదు.

ఉ. వాజిచలస్వభావు లగుటవాగు ప్రసన్నులు గారు భూపతుల్
రాజసవృత్తి మానరు దురాశయు నెక్కుడు మాకు సొమ్ముపైఁ
దేజ మడంచు వృద్ధదశ దీకొని ప్రాణము నొంచుఁ గాలుఁడ
వ్యాజతపంబుకన్న భువి నాత్మహితం బగుకృత్య మున్నదే.

శ్లో. మానే మ్లాయిని ఖణ్డితే చ వసుని వ్యర్థం ప్రయాతేఽర్థిని
క్షీణే బన్ధుజనే గతే పరిజనే నష్టే శనైర్యౌవనే,
యుక్తం కేవలమేతదేవ సుధియాం యజ్జహ్నుకన్యాపయః
పూతగ్రావగిరీన్ద్రకన్దరతటీకుఞ్జే నివాసః క్వచిత్.

వ్యా.—అథ తపసః శ్రేయోహేతుత్వే తదాచరణస్య కిం వా యోగ్యస్థానమిత్యాశఙ్కాయామాహ—మాన ఇతి.—మానే అభిమానే మ్లాయిని భగ్నే సతి, తథా, వసుని ధనే చ, ఖణ్డితే వినష్టే సతి - ని. 'దేవభేదేఽనలే రశ్మౌ వసూ రత్నే ధనే వసుస్త్వితి విశ్వః. అత ఏవార్థిని యాచకే, వ్యర్థే అలబ్ధమనోరథత్వాన్నిరర్థకే, ప్రయాతే సతి వాఞ్ఛితార్థాలాభాద్వైముఖ్యం గతే సతీత్యర్థః. బన్ధుజనే పుత్త్రమిత్త్రాదిబన్ధుజనసమూహే, క్షీణే అన్నాద్యలాభాత్కృశే సతి, పరిజనే భృత్యవర్గే, గతే వేతనదానాభావాదన్యత్ర గతే సతి, తథా, శనైర్మన్దం, యౌవనే తారుణ్యే నష్టే గళితే సతి, అనిత్యత్వస్వాభావ్యాత్సర్వస్మిన్విపన్నే సతీత్యర్థః. సుధియాం బుద్ధిసంపన్నానామేతదేవ ఇదమేవైకం కేవలమత్యన్తమ్, యుక్తముచితం. కిమేతదిత్యత ఆహ—క్వచిత్ కస్మింశ్చిత్, జహ్నుకన్యాపయః పూతాః గఙ్గాజలపవిత్రాః - గ్రావాణః పాషాణాః - యస్మిన్ స తథోక్తో యో గిరీన్ద్రః తస్య హిమవద్గిరేః కన్దరతట్యాం గుహాబహిఃస్థల్యాం - నికుఞ్జే లతామణ్డపే తస్మిన్నివాస ఇతి యత్ తదేతద్యుక్తమితి సంబన్ధః, తస్యైవ శ్రేయస్సాధనభూతతపోయోగ్యస్థలత్వాదితి భావః. ని. 'నికుఞ్జకుఞ్జౌ వా క్లీబే లతాదిపిహితోదరే' ఇత్యమరః.

టీ. మానే=అభిమానము, మ్లాయిని=భగ్నమైనదికాఁగా, వసుని=ధనము, ఖణ్డితే చ=నష్టముకాఁగా, అర్థిని=యాచకుఁడు, వ్యర్థం=నిరర్థకముగా, ప్రయాతే = పోఁగా (కోరఁబడిన యర్థలాభము లేనివాఁడుకాఁగా,) బన్ధుజనే = బాంధుజాతము; క్షీణే = క్షీణింపఁగా, పరిజనే=భృత్యవర్గము, గతే=(వేతనములు సకాలమునకు యియ్యఁబడవని) వదలిపోఁగా, శనైః = మెల్లఁగా, యౌవనే = జవ్వనము. నష్టే = గతింపఁగా, క్వచిత్ = ఒకానొక చోట, జహ్నుకన్యా=గంగయొక్క, పయః = నీటిచేత, పూత = పవిత్రమైన, గ్రావ= తాళ్లుగల, గిరీన్ద్రి=పర్వతశ్రేష్ఠమైన హిమవంతునియొక్క, కందర = గుహయొక్క దరీ = గట్టునందలి, కుఞ్జే = పొదరింటియందు, నివాసః = వసించుట, యత్ = ఏదో, ఏతదేవ= ఇదియే, కేవలం = మిక్కిలి, సుధియాం = బుద్ధిమంతులకు, యుక్తమ్ = మంచిది.

తా. గౌరవము తగ్గును. ధనము పోవును. యాచకులు వట్టిచేతులతోఁ బోవుదురు. బంధుజనులు క్షీణింతురు. పరిజనము విడనాడును. యౌవన ముడిగిపోవును. ఈయవస్థలు సంభవించునప్పుడు బుద్ధిమంతుఁడగువాఁడు గంగాప్రవాహముచేఁ బవిత్రీకరింపఁబడిన పాషాణాలయ గుహాసమీపమున నొకపొదరింటఁ దప మాచరించుట యుక్తము.

ఉ. మానము గ్రుంగఁగా ధరము మట్టముగా నిజబాంధవాశ్రితుల్
దీనతఁ జెంది యేఁగ నతిథిప్రకరంబు నిరాశమైఁ జనన్
మానుగ జవ్వనం బరుగ మాన్యనకుం దగు జహ్నుకన్యకా
నూనతరంగపూతకలితోపలశైలనికుంజవాసముల్.

శ్లో. రమ్యాశ్చన్ద్రమరీచయ స్తృణవతీ రమ్యా వనా న్తస్థలీ
రమ్యం సాధుసమాగమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః,
కోపోపాహితబాష్పబిన్దుతరళం రమ్యం ప్రియాయా ముఖం
సర్వం రమ్యమనిత్యతాముపగతే చిత్తే న కించిత్పునః. 79

వ్యా.—అథ చిత్తస్య నిత్యానిత్యవస్తువివేకే సతి రమ్యమపి సర్వమరమ్య మేవ ప్రతిభాతీత్యాహ ద్వాభ్యామ్—రమ్యా ఇతి.—చన్ద్రమరీచయశ్చన్ద్రకిరణాఃరమ్యాః రమణీయాః - ఉద్దీపకత్వాదితి భావః. తథా, తృణవతీ శాద్వలప్రాయా, వనాన్తఃస్థలీ వనమధ్యభూమిః, రమ్యా రన్తుంయోగ్యా.'*జానపదే' త్యాదినా అకృత్రిమార్థే జీష్. తథా, సాధు సమాగమాత్ సజ్జనసహవాసాదాగతం ప్రాప్తం-యత్సుఖం, తదపి, రమ్యం కవయతి వర్ణయతీతి కవిః - తస్య కర్మ కావ్యం. * బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞ్. తస్య పఙ్క్యా-జాదివద్రూఢత్వాద్రసోల్లసితశబ్దార్థసంఘటన మర్థః. న కర్మమాత్రం-తథా చ కావ్యేషూక్తప్రకారేషు కావ్యనాటకాదిషు, కథాః శ్రవ్యవాచః ఉపాఖ్యానాని వా, రమ్యాః మనోహరాః, తథా, కోపోపాహితాః ప్రణయకలహాదిషుక్రోధవశాదుత్పన్నా - యే - బాష్పబిన్దవః అశ్రుకణాస్తైః - తరళమ్ ఆవిలం, ప్రియాయా ముఖం రమ్యమ్, అతస్సర్వమపి రమ్యముక్తరీత్యా సకలమపి మనోహరమేవ, కింతు, చిత్తే మనసి, అనిత్యతాం నిత్యానిత్యవస్తువిచారతత్పరతామిత్యర్థః. ఉపగతే సతి, కించిత్పునః కించిదపి, రమ్యం న భవతి - బ్రహ్మానన్దం వినేతి శేషః.

టీ. చన్ద్రమరీచయః = చంద్రునివెన్నెలలు, రమ్యాః=రమణీయములు; తృణవతీ= పచ్చికగల, వనాన్తఃస్థలీ = వనమధ్యభూమి, రమ్యాః = రమణీయములు; సాధుసమాగమాగతసుఖం = సజ్జనులతో సహవాసమువలన ప్రాప్తమైనసుఖము, రమ్యం = రమణీయము కావ్యేషు = కావ్యములయందును నాటకములయందును, కథాః = ఇంపైన, ఉపాఖ్యానములు, రమ్యాః = రమణీయములు; కోప...తరళం - కోప = ప్రణయకలహాదులయందు కోపవశముచే, ఉపాహిత=ఉత్పన్నమైన, బాష్పబిందు = అశ్రువులచే, తరళం=మెఱయు

చున్న, ప్రియాయాః = కాంతయొక్క, ముఖం = మొగము, రమ్యం = రమణీయము; కావున, సర్వం=సమస్తమును, రమ్యం = రమణీయము. పునః = కాని, చిత్తే=మనస్సు, అని త్యతాం = వస్తువులయొక్క నిత్యానిత్యములను, ఉపగతేసతి = ఎఱింగిన దగుచుండఁగా, కించిత్=ఏదియు, న(రమ్యమ్)=రమణీయము-మనోహరము-కాదు.

తా. పండువెన్నెలలు కనులపండువులు. పచ్చికబయళ్లు మెచ్చు గూర్చునవి. సత్సాంగత్య ముత్సాహకరము. కావ్యకథలు శ్రావ్యములు. అలుకచేఁ గనుల నీరుకార్చు కాంతావదనము సంతోషకరము. ఇవి యన్నియు మిగుల రమ్యములే. కాని వీని యనిత్యత చిత్తమున కెఱుక పడెనా యేదియు నిందు రమ్యము గాదు.

ఉ. మంచివి పండువెన్నెలలు ౹ మంచివి పుష్పవనప్రదేశముల్
మంచిది సాధుసంగమసమాగతసౌఖ్యము చాటువాక్యముల్
మంచివి మంచి దశ్రుయుతశ్యామానవతీముఖ మిాసమస్తముఙ్
మంచిది కా దనిత్య మని ౹ మానసవృత్తి నెఱుంగువారికిన్.

శ్లో. రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధిక ప్రీతయే,
కింతు భ్రాన్తపతఙ్గపక్షపవనవ్యాలోలదీపాంకుర
చ్ఛాయాచఞ్చలమాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః. 80

వ్యా.—ఉక్తమేవార్థం వివృణ్వన్నిగమయతి —రమ్యమితి.— హర్మ్యతలం ప్రాసాదోపరిప్రదేశః, వసతయే నివాసాయ, న రమ్యం కిం-రమ్యమేవేత్యర్థః. తథా, గేయం గానం * 'భవ్యగేయే' త్యాదినా కర్తరి నిపాతః తదాదిః యస్య తత్తథోక్తం - ఆదిశబ్దేన వీణావాదనాదికమపి సంగృహ్యతే * 'శేషాద్విభాషే' తి కప్ ప్రత్యయః. న శ్రావ్యం కిం శ్రోత్రసుఖావహం న కిం-శ్రావ్యమేవేత్యర్థః. తథా, ప్రాణసమాయాః ప్రాణప్రియనాయికాయాః సమాగమేన సంభోగేన-యత్సుఖం తచ్చ, అధికప్రీతయే అత్యన్తసంతోషాయ, నైవ భవతి కిం? భవత్యేవేత్యర్థః. కింతు, సన్తః వస్తువిచారతత్పరపురుషాః, సకలమపేమం-హర్మ్యతలనివాసాదికమపి, భ్రాన్తః పతనేచ్ఛయా పరిభ్రమన్-యః-పతఙ్గః శలభః-ని. 'పతఙ్గశ్శలభే భానా' వితి విశ్వః. తస్య-పక్షయోః పవనేన గరుతోః వాయునా-వ్యాలోలాః-ఉలిచఞ్చలో యో దీపాఙ్కురో దీపకలికా - తస్య - ఛాయా కాన్తిస్త

ద్వచ్చఞ్చలం తరళం నశ్వరమిత్యర్థః. ఆకలయ్యాలోచ్య, వనాన్తం వనమధ్యం, గతాః శాశ్వతబ్రహ్మానన్దసాధనతపశ్చర్యార్థమితి భావః.

టీ. రమ్యం=ఇంపగు, హర్మ్యతలం=ప్రాసాదప్రదేశము, ‡వసతయే=కాఁపురమునకు, న కిం=లేదా? గేయాదికం = గానములోనగునది, శ్రావ్యం = చెవికి సుఖావహమైనది, నకిం=కాదా? ప్రాణ...సుఖం-ప్రాణసమ=ప్రాణములతో సమానురాలగు (ప్రాణము లంత ప్రియమగు) కాంతతోడి, సమాగమ = పొందుచేసగు, సుఖం=సుఖము, అధికప్రీతయే నైవకిం=ఎక్కుడు సంతోషముకాదా? కిం తు = అయినను, సన్తః=వస్తువిచారతత్పరులగు సజ్జనులు, సకలం=ఈసమస్తమును, భ్రాన్త......చఞ్చలం-భ్రాన్త = భ్రమసిన, పతఙ్గ = మిడుతయొక్క, పక్ష = ఱెక్కలయొక్క, పవన=గాలిచే, వ్యాలోల = చలించు, దీపాఙ్కుర=దీపకలికయొక్క, ఛాయా = కాంతివలె, చఞ్చలం = నశ్వరము-అస్థిరమునుగా, ఆకలయ్య=ఎంచి, వనాన్తం = అరణ్యమధ్యమునకు, గతాః=పోయిరి-శాశ్వత బ్రహ్మానంద సాధన మగు తపమాచరింపఁబోయిరి యనుట.

తా. నివసించుటకు మేడలు బాగుండవా? చక్కని గానము శ్రావ్యము కాదా? ప్రాణసమానురాలగుజవరాలితోడి కలయిక మిగుల నిష్టము కలిగింపదా? ఇవియెల్లఁ గుతూహలము గలిగించునవియే కాని చుట్టును దిరుగు మిడతఱెక్కలగాలిచేఁ గదలుచుండు దీపపుమొగ్గవలె నస్థిరము లని యెఱిఁగి వీని నాశింపక మహనీయులు తపము కావింప నడవుల కేఁగిరి.

ఉ. సంతతముం సుఖం బొసఁగఁ ◊ జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగముం మధురఁ◊గానములుం వివరించి చూడ సం
భ్రాంతపతంగపక్షభవ◊మారుతఘూతవిధూతదీపికా
కాంతిచలంబు సర్వ మని ◊ కానల కేఁగిరి పండితోత్తముల్.

ఇది వైరాగ్యశతకమునందు నిత్యానిత్యవస్తువిచార మను
ఎనిమిదవ దశకము.

---

## —శివార్చనము—

శ్లో. †ఆసంసారం త్రిభువనమిదం చిన్వతాం తాత! తాదృ
ఙ్నైవాస్మాకం నయనపదవీం శ్రోత్రమార్గం గతో వా,
యోఽయం ధత్తే విషయకరిణీ గాఢ‡రూఢాభిమాన
క్షీబస్యాన్తఃకరణకరిణ స్సంయమాలానలీలామ్.

వ్యా.——నను వస్తువిచారప్రసక్తానుప్రసక్త్యా తపసోఽత్యన్తావశ్యకత్వముక్తం. తత్కిం విధమిత్యాశఙ్కాయాం శివార్చనవ్యతిరేకేణాన్యన్న కించిదప్యస్తీతి మనసి కృత్వేదానీం తావచ్ఛివార్చనం వర్ణయతి——తచ్చార్చనం ద్వివిధం——బాహ్యమాభ్యన్తరం చేతి. తత్రాద్యం బహూపకరణసాధ్యం బహిర్ముఖవిషయత్వాదముఖ్యం చేత్యభిప్రేత్యాదౌ తదుపేక్ష్య ముఖ్యమాభ్యన్తరపూజనప్రకారమేవాభినీయాహ——† ఆసంసారాదితి.—— అత్ర తాతేత్యాశ్చర్యశ్రవణాభిముఖీకరణార్థమాదరాతిశయద్యోతకం పృథగ్జనం ప్రతి సంబోధనవచనమ్- హే తాత జనక-ని. 'తాతస్తు జనకః పితే' త్యమరః. ఆసంసారాత్ అనాదిసంసారమారభ్యేత్యర్థః. * పదద్వయమేతత్ * వికల్పాదసమాసః ఇదం ప్రసిద్ధం, త్రయాణాం భువనానాం సమాహారస్త్రిభువనం - భువనత్రయమపి - * 'తద్ధితార్థే' త్యాదినా సమాహారసమాసే పాత్రాద్యదన్తత్వాన్న. స్త్రీత్వం,చిన్వతాం మార్గమాణానాం కర్మవశాత్తత్ర ప్రవేశలాభాదితి భావః. అథవా-చిన్వతాం పరామృశతామ్, అస్మాకం, నయనపదవీం లోచనమార్గం వా, శ్రోత్రమార్గం శ్రవణపథం వా, తాదృక్తథావిధః పుమాన్, నగతో న ప్రాప్త ఏవ - తాదృక్పుమాన్ - న శ్రుతో న దృష్టశ్చేత్యర్థః. కోఽసావిత్యత ఆహ-యోఽయం పుమాన్ ప్రతీయమానతయా భోగసాధనాని స్రక్చన్దన వనితాదీని విషయాస్త ఏవ కరిణ్యః ఇభ్యః - తాసు - గాఢోఽతిదృఢో - ‡ గూఢః అప్రకాశశ్చ-యోఽభిమానః అత్యన్తాసక్తత్వాద్గ్రహః-తేన క్షీబస్య మత్తస్య-ని, 'మత్తే శౌణ్డోత్కటక్షీబా' ఇత్యమరః. * 'క్షీబృ మద' ఇత్యస్య ధాతోరనుపసర్గాత్ * 'ఫుల్ల క్షీబకృశోల్లాఘా' ఇతి నిష్ఠాన్తో నిపాతః. అన్తఃకరణమేవ కరీ తస్య చిత్తమత్తేభస్య, సంయమే సమ్యఙ్నియమనే, ఆనాయస్య రజ్జునిర్మిత జాలస్య - ని. 'ఆనాయః పుంసి జాలం స్యా'దిత్యమరః. 'ఆలానే' తి పాఠే - ఆలానస్య బన్ధనస్తమ్భస్య - లీలాం, ధత్తే దుర్దమమనోనియమనసమర్థో భవతీత్యర్థః, తాదృగితి సంబన్ధః.

అత్రేదృక్పురుషస్య నయనశ్రోత్రపథవిషయసంబన్ధేఽప్యసంబన్ధోక్త్యా సంబన్ధే అసంబన్ధరూపాతిశయోక్తిః; తయా చ మనోనియమనస్యాత్యన్తాశక్యత్వరూపం వస్తు వ్యజ్యత ఇత్యలంకారేణ వస్తుధ్వనిః; తథా చ కేనచిద్యోగేన మనో నియమ్య తత్త్వ బ్రహ్మావబోధసాధనభూతాన్తరఙ్గశివార్చనతపోఽవశ్యం కర్తవ్యమితి గూఢోఽయమభి ప్రాయః; తథా అన్యధర్మస్యాన్యత్ర సంబన్ధాసంభవాదానాయలీలామివ లీలామిత్యౌపమ్య పర్యవసానాదసంభవద్వస్తుసంబన్ధరూపో నిదర్శనాలంకారః; స చోక్తరూపకేణాఙ్గాఙ్గి భావేన సంకీర్యతే, మన్దాక్రాన్తావృత్తమ్.

టీ. యః అయం = ఎవఁడు, విషయ... క్షీబస్య - విషయ = భోగసాధనములగు స్రక్చందనవనితాది విషయములనెడి, కరిణీ = ఆఁడుయేనుఁగులయందు, గాఢ=దృఢముగా రూఢ=నాటుకొనిన, అభిమాన = ప్రేమచేత, క్షీబ=మదించిన, అన్తఃకరణ=మనస్సనెడి, కరిణః=ఏనుఁగుయొక్క, సంయ...లీలామ్-సంయమ = బంధించుటకు, ఆలాన = కంబము యొక్క, లీలాం = విధమును, ధత్తే=ధరించునో, (హే)తాత = ఓతండ్రి, తాదృక్ = అట్టివాఁడు, ఆసంసారం = సంసార ముండుదనుక, ఇదం త్రిభువనం = ఈమూఁడులోకములను, చిన్వతాం = వెదకుచున్న, అస్మాకం=మాకు, నయనపదవీం = లోచనమార్గమునఁగాని, శ్రోత్రమార్గం వా=వీనులమార్గమునగాని, న గతః=పొందినవాఁడు కాఁడు.

తా. విషయము లనెడు నాఁడుయేనుఁగులమీఁది మరులుచే మద మెక్కి వానిపైకి దుముక నుంకించు నంతఃకరణ మనుమత్తగజమునకుఁ గట్టుకొయ్యవంటి పురుషుండు, యీయనాదిసంసారమున మూఁడులోకములను వెదకినను నాయనా! మాకు కనపడలేదు. మేము వినను లేదు.

మ. తగ సంసారము నాదినుండియును దశత్తత్కార్మసంయుక్తిము
జ్జగముం ద్రిమ్మరు మాకుఁ గానఁబడఁ డేచందంబునం గర్ణమా
ర్గగతుం డైనను గాఁడు భోగకరిణీగాఢాదరోన్మత్తచి
త్త గరిష్ఠద్విపరాజసంయమపటుస్తంభాత్మకుం డెవ్వఁడున్.

శ్లో. యదేతత్స్వచ్ఛన్దం విహరణమకార్పణ్యమశనం
సహార్యైస్సంవాసశ్శ్రుతముపశమైకవ్రతఫలమ్,
మనో మన్దస్పన్దం బహిరపి చిరస్యాపి విమృశ
న్న జానే కస్యైషా పరిణతిరుదారస్య తపసః. ౬2

వ్యా.—అథ తపఃప్రవృత్తిప్రకారమేవాహ—యదితి.—స్వచ్ఛన్దం యథేచ్ఛమ్ అపరాధీనమితి యావత్, విహరణం విహారశ్చ, న విద్యతే కార్పణ్యం దైన్యం యస్మింస్తత్తథోక్తమశనం భిక్షాన్నభోజనం కన్దమూలాద్యాహారో వా, తథా, ఆర్యైర్విజ్ఞానసంపన్నైః, సహ సంవాసస్సమాగమశ్చ, తథా ఉపశమో విషయభోగవిరతిరేవ - ఏకం ముఖ్యం - వ్రతఫలం యస్మింస్తత్తథోక్తం, శాన్తిఫలకతపశ్చరణబోధకమిత్యర్థః. శ్రుతక వేదాన్తశాస్త్రశ్రవణం చ ని. 'శ్రుతం శాస్త్రావధృతయో' రితి విశ్వః. తథా, బహిః బాహ్యదేశే మన్దస్పన్దం మన్దప్రసారమ్-అన్తర్ముఖత్వాదితి భావః. మనోఽప్యన్తఃకరణం చేతి యదేతత్సర్వం వర్తత ఇతి శేషః * 'నపుంసకమనపుంసకే

నైకవ చ్చే' త్యాదినా ఏకశేషః. * ఏషేతి విధేయప్రాధాన్యాత్ స్త్రీలిఙ్గతా. 'శైత్యం హి యత్సా ప్రకృతిర్జలస్యే' తివత్, కస్యోదారస్య మహత, స్తపసః, పరిణతిః పరిపాకో వా, న జానే న వేద్మీత్యర్థః. యద్వా - పరిణతిః పరిణామో వా న జానే - కింవా తపః ఏవంరూపేణ పరిణతం తన్న జానామీత్యర్థః, కథంభూత స్సన్నపి - చిరస్య చిరకాలమిత్యర్థః. విమృశన్ పరామృశన్నపి - ని. 'చిరాయ చిరరాత్రాయ చిరస్యా ద్యాశ్చిరార్థక' ఇత్యమరః. * విభక్తిప్రతిరూపకమవ్యయం; తచ్చ తపశ్శివపూజనమేవ - కథమన్యథాఽన్యస్యేదృక్ఫలసాధనే ఏవంవిధపరిణమనే వా సామర్థ్యం సంభవేదితి భావః.

టీ. స్వచ్ఛన్దం=యథేచ్ఛమైన, ఏతత్ విహరణమ్ = ఈత్రిప్పుట, అకార్పణ్యం = దీనత్వములేని, అశనం=ఆహారము, ఆర్యైః సహ=పెద్దలతోడ, సంవాసః = కూడిక, ఉప ...ఫలమ్ - ఉపశమ = విషయభోగేచ్ఛలయందు రక్తిమలేని శాంతి యను, ఏక=ముఖ్య మగు, ఫలం=ప్రయోజనముగలదియైనను, శ్రుతం=వినికి, బహిః = వెలుపలికి, మన్దస్పన్దం= మందప్రసారముగల, మనఃఅపి = మనస్సును, (ఇతి) యత్=అనునది ఏదో, ఏషా = ఇది, కస్య ఉదారస్య తపసః పరిణతిః = ఏమహాతపస్సునకు పరిపాకమో, చిరస్య=చిరకాలము, విమృశన్ అపి=పరామర్శించినను, న జానే=ఎఱుఁగకున్నాను.

తా. ఈస్వచ్ఛందవిహారము, నైచ్యములేని యాహారము, సత్సాంగత్యము, శాంతిప్రద మగునెఱుక, మనస్సును బాహ్యవిషయము లందుఁ బ్రసరింపఁజేయమి, ఈసర్వమును నేగొప్పతనమునకు ఫలముగా సంభవించెనో తెలిసికొలేకున్నారము.

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరియించుట దైన్యము లేనితిండియున్
నిచ్చలు సాధుసంగమును నిర్మలశాంతియు శాస్త్రబోధమున్
మచ్చిక లోనఁ బూని వెలి మట్టనిచిత్తము నాఁగ నింతయున్
వచ్చుట యేమహోన్నతతపంబుఫలంబొ యెఱుంగ నేర్తుమే.

శ్లో. జీర్ణా ఏవ మనోరథాశ్చ హృదయే యాతం చ తద్యౌవనం
హన్తాఙ్గేషు గుణాశ్చ వన్ధ్యఫలతాం యాతా గుణజ్ఞైర్వినా,
కిం యుక్తం సహసాభ్యుపైతి బలవాన్కాలః కృతాన్తోఽక్షమీ
హా! జ్ఞాతం మదనాన్తకాఙ్ఘ్రియుగళం ముక్త్వాఽస్తి నాన్యా గతిః.

వ్యా.—అథ శివచరణమేవ శరణమితి స్మరణమభినీయాహ—జీర్ణా ఇతి.—మనోరథా విషయాభిలాషాశ్చ హృదయే అన్తరఙ్గ ఏవ, జీర్ణాః నష్టాః-వాఞ్ఛామాత్రమేవ న త్వనుభూతా ఇత్యర్థః తథాఽఙ్గేషు అవయవేషు తత్తథాభూతం-కామినీసంభోగోపయుక్తమిత్యర్థః. యౌవనం, యాతం గళితం. హన్తేతి విషాదే, తథా, గుణజ్ఞా గుణగ్రాహిణస్స హృదయా ఇతి యావత్-వైర్వినా * 'పృథగ్వినే' త్యాదినా తృతీయా. గుణా విద్యావినయాదయశ్చ, వన్ధ్యఫలతాం నిష్ఫలతాం యాతా గతాః-అనుభావకాభావాన్నిరర్థకా జాతా ఇత్యర్థః. తథా, బలవాన్ బలిష్ఠః-దుర్జయ ఇత్యర్థః. కాలః కాలస్వరూప అపరావర్తఇతి యావత్. అక్షమీ అసహనశ్చ, కృతాన్తో యమస్సహసాఽభ్యుపైతి అభియుఙ్క్తే - ప్రాణాపహరణార్థమితి భావః. ని. 'కృతాన్తౌ యమసిద్ధాన్తౌ వి' త్యమరః. అతః కిం, యుక్తముచితమ్, ఈదృగ్దశాయాం కిం కర్తవ్యమిత్యర్థః. హా కష్టం-తథాఽపీద మేకం తరణసాధనమస్తీతి స్మరణమభినీయాహ.—జ్ఞాతమవగతం, కిం జ్ఞాతమిత్యత ఆహ-మదనాన్తకస్య శంభోః - అఙ్ఘ్రియుగళం పాదయుగ్మం, ముక్త్వా విహాయాన్యా, గతిశ్శరణం, నాస్తి, అతస్తదేవ శ్రయణీయమితి భావః.

టీ. మనోరథాః=అభిలాషలు, హృదయే = అంతరంగముననే, జీర్ణాః = నశించినవి. తత్ యౌవనం చ = ఆజవ్వనమును, హన్త = అయ్యో, అఙ్గేషు = అవయవములయందు, యాతం=గళితములేక అణఁగినది. గుణజ్ఞైః వినా=సహృదయములులేమి, గుణాశ్చ=విద్యావినయాదిగుణములును, వన్ధ్యఫలతాం=నిష్ఫలమును, యాతాః=పొందినవి. (అనుభావకులులేమిచే నిరర్థకములైనవి.) బలవాన్ = బలిష్ఠములును, కృతాన్తః = నాశము కావించునదియు, అక్షమీ=ఓర్పులేనిదియు, (అగు), కాలః=మృత్యువు, సహసా=వేగముగా,అభ్యుపైతి=పైకివచ్చుచున్నది, కింయుక్తం=ఏదియుచితమో, హా=ఓహో, జ్ఞాతం = తెలిసినది. మదనాన్త...యుగళం - మదనాన్తక = మన్మథునిశరీరమునకు మృత్యువైన ఈశ్వరుని యొక్క, అఙ్ఘ్రియుగళం ముక్త్వా = పాదములజంట తప్ప, అన్యా = వేఱు, గతిః = శరణము, నాస్తి = లేదు.

తా. కోరికలు మనస్సులోనే జీర్ణించినవి. యౌవనమును నవయవములలోనే యంతరించినది. గుణజ్ఞులులేక గుణములును వ్యర్థము లయినవి. కాలమా బలవంతమయినది. మృత్యువు సైఁచునదికాదు. ఇప్పుడు సేయవలసిన దేమి ? ఆ! తెలిసినది! మన్మథాంతకునిచరణముల సేవించుటకా కింక నే మున్నది?

ఉ. చిత్తమునందె కోరికలు జీర్ణము లయ్యె నశేషగాత్రముం
బాత్తినజవ్వనం బరిగె నార్యులు లేమి గుణంబులుం ఫలో
చ్ఛిత్తి వహించె నెద్ది తగుఁ జేరక మానఁడు కాలుఁ డక్కటా!
చిత్తజవైరిపాదయుగసేవనమే గతిగా నెఱింగితిన్.

శ్లో. మహేశ్వరే వా జగతామధీశ్వరే జనార్దనే వా జగదన్తరాత్మని,
న వస్తుభేదప్రతిపత్తిరస్తి మే తథాఽపి భక్తిస్తరుణేన్దుశేఖరే. ౯

వ్యా.—నను -

'యత్పాదనిస్సృతసరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్న్యధికృతేన శివః శివోఽభూత్,
ధ్యాతుర్మనశ్చ కులశైలవిసృష్టవజ్రం
ధ్యాయేచ్చిరం భగవతశ్చరణారవిన్దమ్.'

ఇత్యాదినా శివాద్యశేషదేవతాకల్యాణప్రదే అఖిలలోకారాధ్యే సంసారార్ణవ తరణయానపాత్రే భగవతశ్చరణారవిన్దే జాగ్రతి కథం శివాఙ్ఘ్రియుగళం వినాఽన్యా గతిర్నాస్తీతి ప్రలపసి ఇత్యాశఙ్క్యాహ - మహేశ్వర ఇతి.—జగతాం చతుర్దశభువనానా, మధీశ్వరేస్వామిని, మహేశ్వరే శివే వా, తథా, జగతా మన్తరాత్మని అన్తఃకరణసాక్షిణి - అన్తర్యామిణీతి వా-అథవా అన్తర్భూతాత్మని జీవాత్మస్వరూపే అవిద్యాప్రతిబిమ్బిత చైతన్యత్వేన తథాభూతత్వా దితి భావః - యద్వా - జగన్త్యన్తరాత్మని యస్య తస్మిన్ తథోక్తే - కుక్షిస్థాఖిలభువన ఇత్యర్థః, జనానర్దయతీతి జనార్దనే విష్ణౌ వా, మే మమ, వస్తుభేద ప్రతిపత్తిః అయం మహేశ్వరోఽయం జనార్దన ఇతి వస్తుగోచర భేద బుద్ధి - ర్నాస్తి-'శివాయ విష్ణురూపా యే'త్యాదినా తయోర్వస్తుతో భేదాభావా దితి భావః; తథాఽపి భేదప్రతిపత్త్యభావేఽపి, తరుణేన్దుశ్శేఖరః శిరోభూషణం యస్య తస్మిన్ శివే, భక్తి ర్భజనానురాగో,ఽస్తీతి శేషః. అత ఏవ నాన్యా గతిరిత్యుక్తమితి భావః, ఇదం చ స్వభావో దురతిక్రమ ఇతి న్యాయా దిత్యవగన్తవ్యమ్. వంశస్థవృత్తమ్ - 'జతౌ తు వంశస్థ ముదీరితంజరా వి'తి లక్షణాత్.

టీ. జగతామ్=లోకములకు, అధీశ్వరే=ప్రభువగు, మహేశ్వరేవా=హరునియందుఁగాని, జగత్ అన్తః ఆత్మని=లోకములకు అంతరాత్మ యగు అనఁగా లోపల వర్తించువాఁడగు, జనార్దనేవా = హరియందుఁగాని, మే=నాకు, వస్తుభేదప్రతిపత్తిః=వస్తువులు వేఱ నెడిభావము, (శివుఁడు వేఱు, విష్ణువు వే అను భావము.) న=లేదు. తథాపి=అయినను,

తరుణశశ్యఙ్కశేఖరే = లేఁత చంద్రుఁడు సిగపూవుగాఁగల హరునియందు, భక్తిః = భజనానురాగము.

తా. జగదీశ్వరుఁడగు మహేశ్వరునందును, జగదంతర్యామియగు జనార్దనునందును మాకు భేదబుద్ధి లేదు. ఇరువురకు నభేదమే. కాని పూపనెలదాల్పునందు భక్తి బలిసియున్నది.

తే. జగదధీశ్వరుఁ డగుమహేశ్వరునియందు
సకలజగదంతరాత్ముఁడౌ శార్ఙ్గియందు
భేదవిజ్ఞాన మెయ్యెడ లేదు మాకు
నైనఁ దరుణేందుశేఖరునందె భక్తి.

శ్లో. స్ఫురత్స్ఫారజ్యోత్స్నాధవళితతలే క్వాఽపి పులినే
సుఖాసీనాశ్శాన్తధ్వనిషు రజనీషు ద్యుసరితః,
భవాభోగోద్విగ్నాశ్శివ శివ శివేత్యుచ్చవచసః
కదా స్యామానన్దోద్గతబహుళబాష్పాప్లుతదృశః. 35

వ్యా.—అథ స్థాయినశ్శమస్యోదయవశాచ్ఛాన్తరసాభివ్యఞ్జకవాక్యాన్యాహ పఞ్చభిః—స్ఫురత్స్ఫారజ్యోత్స్నేతి:—శాన్తాః ఉపరతాః - ధ్వనయః పక్షిమృగాదితాని-యాసు తాసు తథోక్తాసు-ఏతేన చిత్తవిక్షేపహేతురాహిత్యం సూచ్యతే. రజనీషు రాత్రిషు, స్ఫురన్తీ ప్రకాశమానా-స్ఫారా ప్రవృద్ధా చ-యా జ్యోత్స్నా చన్ద్రికా-తయా-ధవళితం పాణ్డురీకృతం-తలం ప్రదేశో-యస్య తస్మిన్, క్వాఽపి కస్మింశ్చిత్, ద్యుసరితో గఙ్గాయాస్సంబన్ధిని. పులినే సైకతే, సుఖం యథా తథా-ఆసీనా ఉపవిష్టాస్సన్తః, భవాభోగాత్సంసారవిస్తారాదుద్విగ్నాః విహ్వలాః - దుఃఖజనకత్వాదితి భావః. వయమితి శేషః. అతశ్శివేత్యాది త్రివారముచ్చాని తారాణి-వచాంసి ఆక్రన్దవచనాని యేషాం తే తథోక్తాః - 'ఆర్తవచస' ఇతి పాఠే దైన్యవచనాస్సన్తః, కదా కస్మిన్వా సమయే, అన్తరభ్యన్తరే-గతాః నియమనవశాదన్తర్లీనా ఇతి యావత్-బహుళాశ్చ-యే బాష్పా ఆనన్దాశ్రూణి-తైరాకులా వ్యాకులా యా దశా అవస్థా-తాం, యాస్యామః? అన్తర్నియమితానన్దబాష్పపర్యాకులావస్థాం కదా గమిష్యామ ఇత్యర్థః.'దృశ మి,తి పాఠే బాష్పాకులా యా దృగ్దృష్టిస్తాం యాస్యామ-ఇత్యన్వయః. 'కదా స్యామానన్దోద్గతబహుళబాష్పాకులదృశ' ఇతి పాఠే-ఆనన్దాదుద్గతా ఉత్పన్నా యే బహుళ బాష్పాః తైరాకులా దృశో

యేషాం తే తథోక్తాః కదా స్యామ భవేమ? తదానీం ఖలు వయం కృతకృత్యా ఇతి భావః.

టీ. శాన్తధ్వనిషు = నెమ్మదిపొందిన సందడిగల, రజనీషు=రాత్రులయందు, స్ఫుర...తలే-స్ఫురత్ ప్రకాశించుచున్న, స్ఫారజ్యోత్స్నా= నిండువెన్నెలలచేత, ధవళిత= తెల్లనిదిగఁజేయఁబడిన, తలే = ప్రదేశముగల, ద్యుసరితః = చదలేఱుగుమందాకినియొక్క, పులినే=ఇసుకతిన్నెయందు, సుఖాసీనాః సన్తః=సుఖముగ కూర్చున్నవారమై, భవా... ద్విగ్నాః-భవ = సంసారముయొక్క, ఆభోగ = విస్తారమువలన, ఉద్విగ్నాః = విహ్వలులమైన మేము, శివశివశివ ఇతి = శివశివశివయని, ఉచ్చవచసః = బిగ్గఱ యగు పలుకుగల వారమై, కదా=ఎప్పుడు, ఆనన్దో...దృశః - ఆనన్ద=సంతోషముచే, ఉద్గత = ఉబికిన, బహుళ=మెండగు, బాష్ప=అశ్రువులచే, ఆప్లుత = అంతట తడుపఁబడిన, దృశః=కన్నులు గలవారము, స్యామ=అగుదుమో.

తా. నిశ్శబ్దముగా మాటుడిగినరేల నిండారినపండువెన్నెలలచేఁ దెల్లవాఱిన గంగానది యిసుకతిన్నియపైఁ గూరుచుండి యనంతమైన సంసారమును రోసి 'శివశివా' యని పెద్దగ సంకీర్తనము సేయుచుఁ గనులనిండ నానందాశ్రువులు రా నుండు టెప్పుడో!

శా. శాంతారావనిశీథకాలముల భా స్వజ్జ్యోత్స్నాంద్రచంద్రాతపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయో గ్యక్షోణిఁ గూర్చుండి జ
న్మాంతోద్వేగుల మైనమేము శివశి వ్యాబ్దావృత్తితో నెప్పు డ
త్యంతానందభవాశ్రుసంకులనిశా వాప్తిఁ సుఖం బుందుమో.

శ్లో. వితీర్ణే సర్వస్వే తరుణకరుణాపూర్ణ హృదయాః
స్మరన్తస్సంసారే విగుణపరిణామాం విధిగతిమ్,
వయం పుణ్యారణ్యే పరిణతశరచ్చన్ద్రకిరణాః
స్త్రియామా నేష్యామో హరచరణచిన్తైకశరణాః. 86

వ్యా.—వితీర్ణ ఇతి.—సర్వస్వే నిఖిలధనే, వితీర్ణే దత్తే - అర్థిసాత్కృతే సతి. వి. 'స్వో జ్ఞాతావాత్మని స్వం త్రిష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధన' ఇత్యమరః. తత స్తరుణా ప్రత్యగ్రా - యా కరుణా భూతదయా - తయా - పూర్ణాని పూరితాని - హృదయాని యేషాం తే తథోక్తాః, తథా, సంసారే, విధిగతిం దైవప్రవృత్తిం, విగుణపరిణామాం విషమపరిపాకామ్ - అకుశలపర్యవసాయినీమితి యావత్, స్మరన్త

స్స_న్తః మనస్యనుసందధానాస్సన్తః, వయం, పుణ్యారణ్యే తపోవనే, హరచరణచిన్తా శివపాదారవిన్దధ్యానమేవైకం ముఖ్యం-శరణం రక్షణం యేషాం తే తథోక్తా స్సన్తః, పరిణతాః పరితో వ్యాప్తాః-శరచ్చన్ద్రకిరణాశ్శారదేన్దుమయూఖా-యాసు, తా స్తథోక్తాస్త్రియామాః రాత్రీః, నేష్యామో గమయిష్యామః, కదేతి శేషః; ద్వయోః ప్రథమచరమయామార్ధయోర్దినవ్యవహారాత్ త్రయో యామా యస్యాస్సా త్రియామేతి స్వామీ.

టీ. తరుణ...హృదయాః - తరుణ = ప్రత్యగ్రమైన, కరుణా = భూతదయచే, పూర్ణ=పూరితమైన, హృదయః సన్తః=మానసముగలవారమై సర్వస్వే = (మాయొక్క) సకలధనము, వితీర్ణే=(పేదలకు) దానము చేయఁబడినదికాఁగా, సంసారే = సంసారమునందు, విధిగతిం=దైవప్రవృత్తిని, విగుణపరిణామాం = విషమపరిపాకమును, స్మరన్తః = మనస్సున తలపోయుచు, వయం=మేము, పుణ్యారణ్యే=తపోవనమున, హరచరణచిన్తా=శివపాదములధ్యానమే, ఏక=ముఖ్యమైన, శరణాః=ప్రాపుగలవారమై, పరిణతశరచ్చంద్రకిరణాః = పండివ్యాపించియుండు శరత్కాలపుచంద్రునివెన్నెలలుగల, త్రియామాః= రాత్రులను, నేష్యామః=కడచిపుచ్చుదుము.

తా. పరిపూర్ణకరుణాంతరంగమున ధనమెల్ల బీదలకు దానముఁ జేసి సంసారమునందలి దైవదుర్విలసితమును చింతించుచుఁ బుణ్యారణ్యమునఁ బండువెన్నెలలో శివపదచింతనము గావించుచు మే మెన్నఁడు రేలు గడపెదమో!

చ. కలధన మంతయుఁ౯ సెలవు సేగా నిడి నూత్నకృపాప్రపూర్ణచి
త్తుల మయి సంసృతిం గుశలసేదూరవిపాకముగాఁగ దైవముం
దలఁచుచుఁ గానలో శివపసేదస్మృతినిష్ఠులమై నయింపఁగాఁ
గలము శరత్ప్రసన్నమిహికాసేకరరమ్యములైన రాత్రులన్.

శ్లో. కదా వారాణస్యామమరతటినీరోధసి వస౯
వసానః కౌపీనం శిరసి నిదధానోఽఞ్జలిపుటమ్,
అయే! గౌరీనాథ! త్రిపురహర! శమ్భో! త్రినయన
ప్రసీదేతి క్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్. 87

వా.—కదేతి.—కదా కస్మిన్వా కాలే, వారాణస్యాం కాశ్యామమరతటినీరోధసి గఙ్గాతీరే, వస౯ తిష్ఠ౯, తథా, కౌపీనం గుహ్యాచ్ఛాదనచేలఖణ్డం వసానః ఆచ్ఛాద

యన్ - లోకవిరోధపరిహారార్థం తావన్మాత్రపరిగ్రహ ఏవ న తు పరిగ్రహాన్తరాపేక్ష ఇత్యర్థః. * 'వస ఆచ్ఛాదనే' ఇతి ధాతోశ్శానచ్. శిరస్యఞ్జలిపుటం కరసంపుటం, నిదధానస్సన్, అయే భో, గౌరీనాథ పార్వతీపతే, త్రయాణాం పురాణాం సమాహార స్త్రిపురం. * పాత్రాదిత్వాన్న ఙీప్ తస్య-హరతీతి హరః-హే త్రిపురాన్తక, శం సుఖ మస్మాద్భవతీతి శంభో, త్రినయన హే త్ర్యమ్బక * క్షుభ్నాదిత్వాన్న ణత్వమ్, ఏతదా మన్త్రణచతుష్టయం పరమేశ్వరస్య లోకసంగ్రహకారణత్వాశక్యకార్యకరణసామర్థ్యత్వ భక్తజనసుఖసంధాయకత్వాసాధారణమహిమాస్పదత్వద్యోతనార్థ మిత్యవగన్తవ్యం. ప్రసీద ప్రసన్నోభవేతి, క్రోశన్నుచ్చై రటన్, దివసాన నేకాన్, నిమిషమివ క్షణమివ, నేష్యామి. అత్ర భావి తీవ్రనరకయాతనానుచిన్తాదిభిర్విభావై ర్జనితః - కౌపీనధారణశిరోఽఞ్జలిపుట సంఘటనాదిభిరనుభావై రభివ్యక్తః-కదేతిపదసూచితేన చిన్తాఖ్యేన సంచారిభావేన చ పరి పుష్టం - స్వాత్మావమాననలక్షణో నిర్వేదస్థాయీ-శాన్తరసః పరిస్ఫురతీత్యవగన్తవ్యమ్.ఏవ ముత్తరత్రాపి యోజ్యమ్.

టీ. కదా=ఎప్పుడు, వారాణస్యాం=కాశిలో, అమరతటినీరోధసి = గంగాతీరపు టొడ్డున, వసన్=కూర్చుండి, కౌపీనం=గోఁచిని, వసానః=పెట్టుకొని, శిరసి = తలయందు, అంజలిపుటం=చేతులజోడింపును, నిదధానః=ఉంచుకొని, అయే=ఓ, గౌరీనాథ = పార్వతీశా, త్రిపురహర=త్రిపురాంతక, శమ్భో=శంకరుఁడా, త్రినయన = ముక్కంటిదేవరా, ప్రసీద=దయఁజూపుము. ఇతి=అని, క్రోశన్=బిగ్గఱగా నఱచుచు, లేక మొఱపెట్టుచు, దివసాన్=దినములను, నిమిషమివ=క్షణమునుంబోలె, నేష్యామి=కడపుదునో.

తా. ఎప్పుడు కాశిలో గంగయొడ్డున గోఁచిపెట్టుకొని కూరుచుండి యాదలఁ గేలుదోయి మోడ్చి 'ఓగౌరీనాథా! పురహరా! శంభూ! త్రినయనా! అనుగ్రహింపుము' అని మొఱయిడుచు దినములను నిమిషమువలె గడపుదునో !

ఉ. శ్రీనుతకాశియం దమర సింధువుచెంగట నిల్చి గోఁచినిం
బూని ప్రణామముద్రఁ దల మోపి "పురాంతక! పార్వతీశ! శం
భో! నిటలాక్ష! రక్ష" యని మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలానుసం
ధానత నెన్నఁ డేఁ గడపెదన్ దినముల్ నిమిషంబుకైవడిన్,

శ్లో. స్నాత్వా గాఙ్గైః పయోభిశ్శుచికుసుమఫలైరర్చయిత్వా విభో! త్వాం
ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధరకుహరగ్రావపర్యఙ్కమూలే,
ఆత్మారామః ఫలాశీ గురువచనరతస్త్వత్ప్రసాదాత్స్మరారే
దుఃఖం మోక్ష్యే కదాఽహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్.

వ్యా.—స్నాత్వేతి—గఙ్గాయా ఇమాని గాఙ్గాని * 'తస్యేద' మిత్యణ్. తైః పయోభిర్గఙ్గాజలైరిత్యర్థః. స్నాత్వా శుద్ధో భూత్వా, హే విభో శంభో, శుచిభిః శుద్ధైశ్శాస్త్రసమ్మతైరితి యావత్ - కుసుమైః, ఫలైశ్చ, త్వా మర్చయిత్వా సమారాధ్య - ఏతేన బాహ్యపూజాయా అప్యంశతః ప్రాధాన్యమస్తీతి సూచితం. ధ్యేయే ధ్యాతుం యోగ్యే వస్తుని - త్వచ్చరణారవిన్దఏవేత్యర్థః. ధ్యానం నివేశ్య ఏకాగ్రచిత్తో భూత్వేత్యర్థః. తథా, క్షితిధరకుహరే - యో గ్రావా పాషాణస్స ఏవ పర్యఙ్కః సుఖశయ్యా-తస్య మూలే, నిషణ్ణస్సన్నితి శేషః. సమాధివ్యుత్థానానన్తరం సుఖసంవేశయోగ్యతాద్యోతనార్థం గ్రావ్ణి పర్యఙ్కత్వరూపణమ్, ఆత్మన్యేవ ఆరమత ఇత్యాత్మారామో విషయాన్తరాసక్తిశూన్యస్సన్నిత్యర్థః. 'రమన్తే యోగినోఽనన్తే నిత్యానన్దే చిదాత్మనీ' తి స్మృతేః. తథా, ఫలాశీ ఫలాహారః-శరీరధారణార్థ మితి భావః. గురువచనరతః ఆచార్యోపదిష్టకర్మాచరణతత్పరస్సన్ - అహమ్ - ఇత్థం భూతతాయా ఏవ శ్రేయోహేతుత్వాదితి భావః. హే స్మరారే మదనాన్తక శంభో, త్వత్ప్రసాదాత్ త్వదనుగ్రహాత్, మకరేణ మకరాకార రేఖయా సహ వర్తతఇతి సమకరశ్చరణో యస్య తస్మిన్ తథోక్తే పుంసి మహాభాగ్యసంపన్నే పురుషే విషయే - రాజ్ఞీత్యర్థః, సేవాసముత్థం పరిచర్యాసముత్పన్నం, దుఃఖం, కదా మోక్ష్యే తథా మామనుగృహాణేత్యర్థః. పరమేశ్వరానుగ్రహం వినా శ్రేయో లాభాభావాదితి భావః. సమకరచరణస్య మహాభాగ్యసంపన్నత్వముక్తం సాముద్రికే—

'మకరో మత్స్యరేఖా చ పద్మశఙ్ఖాకృతిః పదే,
మహాధనీ మహాభోగీ దాతా దీర్ఘాయురేవ చ.' ఇతి.

టీ. గాఙ్గైః=గంగానదిసంబంధములైన, పయోభిః=నీళ్లతోఁ, స్నాత్వా = స్నానముచేసి, (హే) విభో=(ఓ)స్వామీ, త్వాం = నిన్ను, శుచికుసుమఫలైః-శుచి = శాస్త్రసమ్మతములై పవిత్రములైన, కుసుమఫలైః=పూవులతోను,పండ్లతోను, అర్చయిత్వా=ఆరాధించి, ధ్యేయే=ధ్యానింపఁదగినవస్తువునందు (నీచరణములనం దనుట), ధ్యానం = ఏకాగ్రచింతన

మును, నియోజ్య = పెట్టి, క్షితిధర = కొండయొక్క, కుమార = గుహయందలి, గ్రావ = పాషాణ మను, పర్యఙ్క = సుఖశయ్యయొక్క, మూలే = మూలను, ఆత్మారామః = ఆత్మయందే క్రీడించువాఁడను, ఫల ఆశీ = పండ్లను తినువాఁడను, (శరీరమును ధరించుటకు మాత్రమే అనుట), గురువచనరతః = ఆచార్యుఁ డుపదేశించినకర్మ నాచరించుటయందే ధ్యానముకలవాఁడనై, అహం = నేను, (హే) స్మరఅరే = ఓమదనశత్రువా! త్వత్ ప్రసాదాత్ = నీయనుగ్రహమున, సమకరచరణే = సమానములే యగు కాలుసేతులు గల (కేవలము నావంటివాఁడే యైన, లేక మకరరేఖతోఁ గూడిన పాదములు గలవాఁడై, ఈరేఖ ఎవని పాదములయం దుండునో వాఁడు మహాభాగ్యశాలి యని సాముద్రికము.) పుంసి=పురుషుని, సేవాసముత్థం = కొలుచుటవలనఁబుట్టిన, దుఃఖం=దుఃఖమును, కదా = ఎప్పుడు, మోక్ష్యే = వదలుదునో.

తా. దేవా! గంగాజలమున స్నానమాడి పవిత్రము లగుపుష్పములతోఁ బండ్లతో నిన్నుఁ బూజించి నిన్నే ధ్యానించుచు, పర్వతగుహాంతరమున నొకఱాతిపలకపై నాత్మారాముఁడనై యుండి పండ్లతో క్షున్నివారణము కావించుచు గురువాక్యతత్పరుఁడనై నీయనుగ్రహమువలన నావంటివాఁడే యగునొకనరుని సేవించి తెచ్చుకొన్న దుఃఖము నెన్నఁడు వదలించుకొందునోగదా మన్మథాంతకా!

ఉ. వేలుపుటేటఁ దోఁగి సుప ॥ విత్రఫలాదులఁ బూజచేసి ని
న్నోలి మనంబులో నిలిపి ॥ యోగ్యగుహాశిలయందు నాత్మసం
శీలుఁడ నై ఫలాశి నయి ॥ శ్రీగురువాక్యరతుండ నై మహీ
పాలకసేవనశ్రమముఁ ॥ బాసెద నెన్నఁడు మన్మథాంతకా.

శ్లో. ఏకాకీ నిస్పృహశ్శాన్తః పాణిపాత్రో దిగమ్బరః,
కదా శమ్భో! భవిష్యామి కర్మనిర్మూలనక్షమః? 89

వ్యా—ఏకాకీతి—ఏకాకీ అసహాయః - సఙ్గరహిత ఇతి యావత్. 'సఙ్గాత్సంజాయతే కామ' ఇత్యాదిసఙ్గజనితకామాదిపరమ్పరాయాః అనర్థహేతుత్వాదితి భావః. * 'ఏకాదాకినిచ్చాసహాయ' ఇత్యాకినిచ్ ప్రత్యయః కుతః? నిఃస్పృహః విషయాభిలాషశూన్యః, అత ఏవ, శాన్తః రాగాద్యనుపహతచిత్తః-శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వా, అతః పాణి రేవ పాత్రం భిక్షాపాత్రం యస్య స తథోక్తః, తథా, దిశ ఏవామ్బరాణి యస్య స తథోక్త స్స - స్నుహామితి శేషః.

హే శమ్భో కర్మణాం సంచితప్రారబ్ధానాం నిర్మూలనే సమూలవిధ్వంసనే - క్షమ స్సమర్థః, కదా భవిష్యామి? కర్మబన్ధాత్కదా మోక్ష్యే ఇత్యర్థః.

'భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః,
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.' ఇతి.

ఈశ్వరసాక్షాత్కారమన్తరా కర్మక్షయాభావాత్తదర్థం త్వం ప్రత్యక్షో భవేతి భావః.

టీ. శమ్భో = శంకరా, ఏకాకీ=అసహాయుఁడను కావుననే ఒంటరిని, లేక సంగరహితుఁడను, నిఃస్పృహః = విషయాభిలాషలేనివాఁడను కావుననే ఆసలేనివాఁడను, శాన్తః=రాగాదులచే ననుపహతచిత్తుఁడను లేక అంతరింద్రియనిగ్రహముగలవాఁడను, పాణిపాత్రః=చేయే భిక్షాపాత్రముగాఁ గలవాఁడను, దిగమ్బరః = దిక్కులేవస్త్రముగాఁ గలవాఁడను అయి, కర్మనిర్మూలనక్షమః = ప్రారబ్ధకర్మములను వేఱుతో పెల్లగించుటకు సమర్థుఁడను, కదా=ఎప్పుడు భవిష్యామి, = అగుదునో.

తా. సదాశివా! ఒంటరిని, నిష్కాముఁడను, శాంతుఁడను, దిగంబరుఁడను, అఱచేత బిచ్చమెత్తువాఁడనుగా నుండి పురాకృతకర్మమును నిర్మూలము చేయఁగలవాఁడ నెన్నఁటి కగుదునో!

తే. ఒంటి దిరుగుచుఁ గోరిక లుజ్జగించి
శాంతిఁ జేకొని పాణిభాజనుఁడ నై ది
గంబరుఁడ నై సమస్తకర్మంబు లెపుడు
మొదలుచెడఁ ద్రుంతుఁ బరమేశ! సదయహృదయ.

శ్లో. పాణిం పాత్రయతాం నిసర్గశుచినా భైక్షేణ సంతుష్యతాం
యత్ర క్వాఽపి నిషీదతాం బహుతృణం విశ్వం ముహుః పశ్యతామ్,
అత్యాగేఽపి తనోరఖణ్డపరమానన్దావబోధస్పృశా
మధ్వా కోఽపి శివప్రసాదసులభస్సంపత్స్యతే యోగినామ్. 90

వ్యా.—అథైవం భూతానాం శివప్రసాదాన్మోక్షమార్గోఽవిలమ్బేనైవ సులభో భవతీతి నిగమయతి—పాణిమితి—పాణిం కరతలమేవ - పాత్రం భోజనభాజనం కుర్వతాం పాత్రయతాం. * పాత్రశబ్దాత్తత్కరోతీతి ణ్యన్తాల్లటశ్శత్రాదేశః. నిసర్గశుచినా స్వభావపరిపూతేన, భైక్షేణ భిక్షాకదమ్బకేన, సంతుష్యతాం సంతోషం ప్రాప్నువతాం. * 'భిక్షాదిభ్యోఽణ్'-ని. 'భైక్షం భిక్షాకదమ్బక' మిత్యమరః. యత్ర -

క్వాఽపి యస్మిన్ కస్మిన్ ప్రదేశే-శ్మశానే వనే వేత్యర్థః. నిషీదతాముపవిశతాం. ముహుః పౌనఃపున్యేన, విశ్వం ప్రపఞ్చం, బహుతృణమీషదసమాప్తం తృణం-తృణకల్పమిత్యర్థః. * 'విభాషా సుపో బహుచ్పురస్తాత్తు' ఇతి బహుచ్ప్రత్యయః. * ప్రకృతేః పూర్వం భవతి - 'స్యాదిషదసమాప్తౌ తు బహుచ్ప్రకృతిలిఙ్గక' ఇతి ప్రకృతివచనాత్ప్రకృతిలిఙ్గతా. పశ్యతామాకలయతాం, తథా, తనోరత్యాగేఽపి దేహాసంబన్ధశూన్యత్వాభావేఽపి, అఖణ్డోఽపరిచ్ఛిన్నో - యః పరమానన్దో బ్రహ్మానన్ద-స్తస్యావబోధమనుభవం-స్పృశన్తీతి తథోక్తానాం-జీవన్ముక్తత్వాదితి భావః. * 'స్పృశోఽనుదకే క్విన్' నితి క్విన్ప్రత్యయః.యోగినాం ధ్యాననిష్ఠానాం శివప్రసాదేన-సులభస్సులభ్యః-కోఽప్యనిర్వాచ్యః, అధ్వా మోక్షమార్గ ఇత్యర్థః. సంపత్స్యతే సంపన్నో భవతి.

టీ. పాణిం=చేతిని, పాత్రయతాం = భోజనపాత్రగాఁ జేయువారును, నిసర్గశుచినా=స్వభావముచే పవిత్రమైన, భైక్షేణ = బిచ్చముతో, సంతుష్యతాం = తృప్తిఁ జెందువారును, యత్ర క్వాఅపి = ఏచోటనో ఒక్కెడ, నిషీదతాం=కూర్చుండువారును, ముహుః=పదేపదే, విశ్వం=ప్రపంచమును, బహుతృణం = గడ్డిపరకను సమానముగ, పశ్యతాం=చూచువారును, తనోః అత్యాగేఅపి=దేహమును వదలకున్నను, అఖణ్డపరమానన్దావబోధస్పృశామ్ = శ్రేష్ఠమగు బ్రహ్మానందముయొక్క అనుభవమును తాకుచున్నవారును (అగు), యోగినాం = యోగులకు, శివప్రసాదసులభః = శంభునిదయచే సులభముగా లభించునది, కోఽపి = అనిర్వచనీయమగు, అధ్వా=మార్గము (కైవల్యమార్గము), సంపత్స్యతే=కలుగును.

తా. అఱచేతినె భిక్షాపాత్రముగాఁ జేసికొని స్వభావపవిత్ర మగు భిక్షాన్నముతోఁ దృప్తిఁజెందుచు నెక్కడనో యొక్కెడఁ గూరుచుండి ప్రపంచము నెల్ల గడ్డిపరకసమానముగాఁ జూచుచు శరీరమును వీడకున్నను అఖండపరమానందానుభవభాగులైన యోగులకు శివప్రసాదమున మోక్షమార్గము సిద్ధించును.

చ. హితునకుఁ బాణిపాత్రునకు కనిచ్చునకున్ శుచిభైక్షమాత్రతో
హితునకు నెట్టితావున వసించెడువానికి విశ్వముం దృణ
ప్రతినిధిఁ జేయువానికిఁ బుకస్థితుఁ డయ్యు నఖండసౌఖ్యసం
గతుఁ డగుయోగి కేర్పడు నొకానొకమార్గము శంభుసత్కృపన్.

ఇది వైరాగ్యశతకమునందు శివార్చన మను
తొమ్మిదవదశకము.

---

## అవధూతచర్య

శ్లో.కౌపీనం శతఖణ్డజర్జరతరం కన్థా పునస్తాదృశీ
నైశ్చిన్త్యం నిరపేక్షభైక్షమశనం నిద్రా శ్మశానే వనే,
స్వాతన్త్ర్యేణనిరఙ్కుశం విహరణం స్వాన్తం ప్రశాన్తం సదా
స్థైర్యం యోగమహోత్సవేఽపి చ యది త్రైలోక్యరాజ్యేన కిమ్ ?

వ్యా.—శివార్చనస్య మోక్షోపయోగ్యవధూతభావఫలకత్వా 'దత్యాగేఽపి తనోరఖణ్డపరమానన్దావబోధస్పృశా' మిత్యుపక్రాన్తత్వాచ్చేదానీం తావదవధూతచర్యా మాహ—అథావధూతచర్యేతి—అవధూతో నామ బ్రహ్మాత్మైక్యానుసంధానతత్పరః విస్మృతబహిఃప్రపఞ్చః జీవన్ముక్తశబ్దవాచ్యో మలినో యోగపురుష-స్తస్య చర్యా ఆచారః - ఉచ్యత ఇతి శేషః. ఉపక్రాన్తామవధూతచర్యాం దశభిర్వర్ణయతి—కౌపీన మితి—శతఖండైరనేకశకలైః—జర్జరతరమతివిశీర్ణం, కౌపీనం గుహ్యాచ్ఛాదనచీరఖణ్డం, యది అస్తి చేదిత్యర్థః. ఏవముత్తరత్రాపి. ని. 'కౌపీనం స్యాదకార్యే చ గుహ్యాచీరప్రదేశయో రి'తి విశ్వః. తాదృశీ తథాభూతశతఖణ్డజర్జరతరై వేత్యర్థః. కన్థాపునః కన్థా చ,అస్తి యది, నైశ్చిన్త్యం విషయచిన్తారాహిత్యం చ యది. తథా నిరపేక్షమనువర్తనాపేక్షా రహితం-భైక్షమశనం భోజనం యది శ్మశానే ప్రేతభూమౌ, వనే మహారణ్యే వా నిద్రా చ యది,స్వాతన్త్ర్యేణస్వాచ్ఛన్ద్యేన, నిరఙ్కుశమప్రతిబన్ధం, విహరణం విహారశ్చ, యది సదా, ప్రశాన్తం ప్రసన్నం * 'వా దాన్తే' త్యాదినా నిపాతః. స్వాన్తం చిత్తం యది, యోగమహోత్సవే-యోగస్సమాధిరేవ మహోత్సవస్తస్మిన్, స్థైర్యం చ, యది అస్తి చేత్తర్హి, త్రైలోక్యరాజ్యేన త్రిలోకాధిపత్యేన, కిం న కిమపీత్యర్థః. తస్యైవ పరమ సౌఖ్యావహత్వాదితి భావః. * త్రయో లోకాస్త్రైలోక్యం చాతుర్వర్ణ్యాదిత్వాత్స్వార్థే ష్యఞ్.

టీ. శత...తరం-శతఖణ్డ = అనేకప్రేలికలుగా, జర్జరతరం = మిక్కిలి శిథిలమైన, కౌపీనం=గోఁచియు, తాదృశీ=అట్టిదియేయైన, కన్థాపునః = బొంతయును, నైశ్చిన్త్యం= విషయచింతారహితమును,నిరపేక్షభైక్షం=అనువర్తనాపేక్షలేని భిక్షాన్నమును, శ్మశానే= ప్రేతభూమియందుఁగాని, వనే = అరణ్యమునఁగాని, నిద్రా = నిదురించుటయు, స్వాతన్త్ర్యేణ=స్వచ్ఛందముగా, నిరఙ్కుశం=ఆటంకములేని, విహరణం=సంచారమును, సదా= ఎల్లప్పుడు, ప్రశాన్తం = ప్రసన్నమగు, స్వాన్తం=హృదయమును, యోగమహోత్సవే = సమాధియను గొప్పపండుగదినమున, స్థైర్యమపిచ = నిలుకడయును, యది (అస్తి)=ఉండె

నేని, త్రైలోక్యరాజ్యేన=స్వర్గమర్త్యపాతాళములను మూఁడులోకముల యేలుబడి, కిం = ఏల ?

తా. నూఱుప్రేలికలయిన గోఁచియును, అంతదే బొంతయును, నిశ్చింతతయును, ఒకరియపేక్ష లేని భిక్షాన్నమును, అడవినో శ్మశానమునో నిద్రయును, స్వాతంత్ర్యముతో నడ్డమాఁకలు లేని విహారమును, ఎప్పుడును బ్రసన్నమైనచిత్తమును, సమాధిసంధానమున స్థైర్యమును జేకుఱినచోఁ ద్రిలోకాధిపత్య మెందుకు ?

శా. కౌపీనంబును జీర్ణకంథయు నపేక్షాశూన్యభైక్షంబుఁ జిం
తాపాయంబు వనశ్మశానముల నిద్రావాప్తి దుర్వారస
ద్వ్యావహారంబుఁ బ్రశాంతచిత్తమును యోగారూఢియుక్ వృత్తిసం
క్షేపంబుం గలదేని యోగికిఁ ద్రిలోకీప్రాభవం బేటికిన్ ?

శ్లో. †బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం కిం లోభాయ మనస్వినః,
శఫరీస్ఫురితేనాబ్ధిః క్షుబ్ధో న ఖలు జాయతే. 92

వ్యా.—నన్వత్యన్తసౌఖ్యావహత్వేన ప్రసిద్ధం త్రైలోక్యరాజ్యం నిషిధ్య కౌపీనాదిసంపత్తేరేవోత్తమత్వం ప్రతిపాదితం, తదసత్, యతస్తస్యైవాత్యన్తప్రలోభకత్వాదిత్యాశఙ్క్య - మనస్వినస్తావదేతావదేవ నాప్రలోభికం కిం తు బ్రహ్మాణ్డమపి తత్రా కించిత్కరమేవేతి సదృష్టాన్తమాహ—బ్రహ్మాణ్డమితి—మణ్డలీమాత్రం బిమ్బమాత్రం-ఘటాదివదియత్తయా పరిచ్ఛిన్నమిత్యర్థః. 'మణ్డలీభూత మి'తి వా పాఠః. తదా అమణ్డలం మణ్డలం సంపద్యమానం మణ్డలీభూతమ్. *అభూతతద్భావే చ్విః. * 'ఊర్యాదిచ్విడాచ శ్చే'తి తి గతిసంజ్ఞాయాం *'కుగతిప్రాదయ' ఇతి సమాసః, ని. 'బిమ్బోఽస్త్రీ మణ్డలం త్రి' ష్విత్యమరః. † బ్రహ్మాణ్డం చతుర్దశభువనగర్భిత బ్రహ్మాణ్డకటాహః. మనస్వినో ధీరస్య, యోగిన ఇత్యర్థః. * ప్రశంసాయామినిః, లోభాయ చిత్తప్రలోభనాయ, కిం భవతీతి శేషః.న భవత్యేవ. కిము తదేకకోణే నిలీనం త్రైలోక్యరాజ్యమితి భావః. తత్ర దృష్టాన్తమాహ—అబ్ధిః సముద్రః శఫరీస్ఫురితేన మత్స్యవిశేషోల్లుణ్ఠనేన, క్షుబ్ధః క్షోభితః మథిత ఇతి యావత్.*'క్షుబ్ధ స్వాన్తే' త్యాదినా నిపాతః. న జాయతే ఖలు న భవతి ఖలు. ని. 'ప్రోష్ఠీ తు శఫరీ ద్వయో' రిత్యమరః. మత్స్యోల్లుణ్ఠనేనాబ్ధిక్షోభణమివ త్రైలోక్యరాజ్యేన మనస్విమనఃప్రలోభనమిత్యర్థః. అత స్తదేవాతిసౌఖ్యావహమితి భావః.

టీ. మనస్వినః = ధీరునికి, (యోగికి), బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం = బ్రహ్మాణ్డముల సమూహమెల్లను, లోభాయ కిం=మనస్సున నాసపుట్టించునా? అబ్ధిః=సముద్రము, శఫరీస్ఫురితేన=పెద్దస్త్రీజాతిమత్స్యము త్రుళ్లటచేత, క్షుబ్ధః=కలఁగినది, న జాయతే ఖలు= కాదుగదా?

తా. ఒకయాఁడుమీను దుముకులాడిన మాత్రమున సముద్రము కలఁగఁబాఱనట్లు బ్రహ్మాండమండలమెల్లను రానున్నను మనస్వియగు యోగిచిత్తము లోభపడదు.

క. మండలమాత్రం బగు బ్ర
హ్మాండము లోభకర మగునె ? యతిధీరునకున్
నిండుసముద్రము జలచర
తాండవగతిచే విలోడితము గాదుగదా?

శ్లో. మాతర్లక్ష్మి! భజస్వ కంచిదపరం మత్కాఙ్క్షిణీ మాస్మభూ
ర్భోగేషు స్పృహయాలవస్తవ వశే కా నిఃస్పృహాణామసి,
సద్యఃస్యూతపలాశపత్త్రపుటికాపాత్రే పవిత్రీకృతై
ర్భిక్షావస్తుభిరేవ సంప్రతి వయం వృత్తిం సమీహామహే. 93

వ్యా.—అథ వైరాగ్యప్రకారమాహ—మాతరితి.—మాతర్జనని, హే లక్ష్మి* 'అమ్బార్థనద్యో ర్హ్రస్వ' ఇతి హ్రస్వః. అత్ర మాతృగ్రహణమేతావన్తం కాలం త్వయా రక్షితా వయమితి భక్త్యతిశయసూచనార్థమిత్యవగన్తవ్యమ్. అపరమన్యం కంచిద్భాగ్యవన్తం పురుషం, భజస్వ సేవస్వ, మత్కాఙ్క్షిణీ మద్విషయాభిలాషిణీ, మాస్మభూర్న భవేత్యర్థః. * 'స్మోత్తరే లఙ్చ' తి చకారాదాశీరర్థే లఙ్. * 'న మాఙ్యోగ' ఇత్యడాగమప్రతిషేధః. నన్విదానీం కుత వేతద్వైరాగ్య మిత్యత ఆహః— భోగేషు స్రక్చన్దనాదివిషయానుభవేషు, స్పృహయాలవః స్పృహావన్తః పుమాంసః *'స్పృహి' త్యాదినా చురాద్యదన్తాణ్ణ్యన్తాదాలుచ్ప్రత్యయః. తవ వశే త్వదాయత్తతాయాం - వర్తన్త ఇతి శేషః. త్వదధీనా భవన్తీత్యర్థః. ని. 'వశ ఆయత్తతాయాం చే' త్యమరః. తర్హి యూయం క ఇత్యాశఙ్కాయామాహః—నిఃస్పృహాణాం భోగాభిలాషశూన్యానాం, కాఽసి కీదృగ్విధాఽసి న కాఽసీత్యర్థః. వయం చ నిః స్పృహా ఇతి భావః అతోఽస్మాన్విహాయాన్యత్ర గచ్ఛేతి సంబన్ధః. నన్వేవం చేద్యుష్మాకం కథం జీవికేత్యాశఙ్కాయామాహః-వయం,—సంప్రతీదానీం, సద్యస్తత్కాల

ఏవ * 'సద్యః పరుత్పరార్యైషమః' ఇత్యాదినా నిపాతనాత్సాధుః. స్యూతా విరచితా * కర్మణి క్తః. * 'ఛ్వోః శూడనునాసికే చే' తి ఊఠ్ యణాదేశః. పలాశపత్త్రపుటికా కింశుక వర్ణపుటికైవ-పాత్రం భిక్షాహరణోచితభాజనం-తస్మిన్, పవిత్రీకృతైః పావనీభూతై రిత్యర్థః. * అభూతతద్భావే చ్వీః. * 'అస్య చ్వౌ' ఇతీకారః. భిక్షావస్తుభిః - అన్న కబళరోపితశాకాదిభిక్షాద్రవ్యైరేవ - భిక్షాసక్తుభి'రితి పాఠేఽపి-భిక్షాసక్తువిశేషైరిత్యర్థః. వృత్తిం జీవికాం, సమీహామహే అభిలషామహే - విరక్తా భవామ ఇత్యర్థః. అతః కిమర్థం త్వమస్మాకమితి భావః.అత్ర పలాశపత్త్రపుటికాయాస్సద్యస్స్యూతత్వకథనం విశద త్వద్యోతనార్థమ్-అన్యథా భిక్షాహరణానుపయుక్తా స్యాదితి వేదితవ్యం. తథా - 'పలాశం పద్మపత్త్రం చే' త్యాదివచనాత్పవిత్రీకరణయోగ్యేషు పలాశపత్త్రేషు నిక్షిప్తసాధారణా న్నాదీనామపి పవిత్రత్వం కిముత నిసర్గశుచిభిక్షావస్తూ నామితి చాఽవగన్తవ్యమ్.

టీ. మాతఃలక్ష్మి=అమ్మా ఓలక్ష్మీ, కంచిత్ అపరం=ఎవనినైన నింకొకనిని, భజస్వ = సేవింపుము, మత్ కాఙ్క్షిణీ=నన్నుఁగోరుదానవు మాస్మభూః=కాకుము. భోగేషు=స్రక్చం దనాది విషయములయందు, స్పృహయాళవః=కోరికగలవారు, తవవశే=నీవశమై (ఉం దురు). నిఃస్పృహాణాం=భోగాభిలాష లేనివారికి, కాఅసి=ఎవ్వతెవు అవుదువు ? వయం= మేము, సంప్రతి=ఇప్పుడు, సద్య...పాత్రే-సద్యః=తత్కాలమున, స్యూత = కుట్టఁ బడిన, పలాశపత్త్ర = మోదుగాకుల, పుటికాపాత్రే = దొన్నెయను భిక్షమును గొనుట కుచితమగుపాత్రమున, పవిత్రీకృతే=పావనీభూతమైన, భిక్షావస్తుభిఃఏవ=అన్నకబళము పైనిడిన కూరలు మొదలగు ద్రవ్యములతోనే, వృత్తిం=జీవితమును, సమీహామహే-కోరు చున్నారము.

తా. అమ్మా! లక్ష్మీ నమస్కారము. నన్నుఁగోరకుము. మఱొకరి నాశించుము. భోగములఁ గోరువారు నీకు లోఁబడుదురు. కాని నిఃస్పృ హులకు నీతోఁ బని యేమి? ఎప్పటి కప్పుడు మోదుగాకు దొప్పలుగట్టు కొని తిరిపమెత్తి పవిత్రితము లయిన భిక్షావస్తువులతో మే మింక జీవ యాత్ర గడపఁదలఁచి యున్నాము.

క. అమ్మా! లక్ష్మి నమస్కా
రమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యాశ్రీరూ
పమ్మున నేలుకొను ముఖ్యశోభల మదియకదా.

శ్లో. మహీ రమ్యా శయ్యా విపులముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజనమనుకూలోఽయమనిలః,
స్ఫురద్దీపశ్చన్ద్రో విరతివనితాసఙ్గముదితః
సుఖీ శాన్తశ్శేతే మునిరతనుభూతిర్నృప ఇవ. 94

వ్యా.—అథ యోగినస్సార్వభౌమసామ్యమాహ — మహీశయ్యేతి. — పృథ్వీ భూమిః,మహాశయ్యా విశఙ్కటపర్యఙ్కః-'మహీ శయ్యా పృథ్వీ'తి పాఠే-పృథ్వీ పృథుః * 'వోతో గుణవచనా' దితి జీష్. మహీ-శయ్యా-ని. 'గోత్రా కుః పృథివీ పృథ్వీ క్ష్మాఽవనిర్మేదినీ మహీ'త్యమరః. భుజలతా బాహువల్లీ, విపులం విస్తీర్ణ, ముపధానం. ని. 'ఉపధానం తూపబర్హ మి'త్యమరః. ఆకాశం చ, వితానముల్లాభః-ని. 'అస్త్రీ వితానముల్లాభ ఇత్యమరః. అయం ప్రవర్తమానోఽనుకూలః, అనిలః పవనః, వ్యజనం తాళవృన్తక మిత్యర్థః-ని. 'వ్యజనం తాళవృన్తక' మిత్యమరః. శరచ్చన్ద్రో దీపః-శరద్గ్రహాణాం చన్ద్రస్య ప్రకాశాతిశయద్యోతనార్థం, ఇత్యేతత్సర్వమయత్నసిద్ధమపరిచ్ఛిన్నం చేత్యర్థః. ప్రసిద్ధం తు నైవం భూతమితి భావః. స్వయం, విరతిర్విరక్తిరేవ వనితా - తస్యాస్సఙ్గేన ముదిత స్సంతుష్టః, అత ఏవ, సుఖీ ఆనన్దపూర్ణః, శాన్తశ్శమశీలో, మునిః-

'నివృత్తస్సర్వతత్త్వజ్ఞః కామక్రోధవివర్జితః,
ధ్యానస్థో నిష్క్రియో దాన్తస్తుల్యకృతాకృఇచ్ఛనో మునిః.'

ఇత్యుక్తలక్షణః కశ్చిద్యోగీశ్వరః, అతనుభూతిరఖణ్డైశ్వర్యసంపన్నో, నృపస్సార్వభౌమ ఇవ, శేతే స్వపితి—నిరాతఙ్కం నిద్రాతీత్యర్థః.

రూపకసంకీర్ణోఽయ ముపమాలంకారః; తథా ఉపమానాన్నృపాదుపమేయస్య మునేరపరిచ్ఛిన్నశయ్యాదిస్సంపన్నత్వేనాధిక్యప్రతీతేర్వ్యతిరేకో వ్యజ్యతఇత్యలంకారేణాలంకారధ్వనిః.

టీ. మహీ=పృథ్వీ, రమ్యా=రమణీయమైన, శయ్యా=సెజ్జ, భుజలతా=బాహువల్లి, విపులమ్=విస్తరింపఁబడిన,ఉపధానం=దిండు, ఆకాశంచ=ఆకాసమును, వితానం=మేలుకట్టు, అనుకూలః=సుఖముగానుండు, అయం అనిలః=ఈగాలి, వ్యజనం=విసనకఱ్ఱ, చన్ద్రః=చందురుఁడు, స్ఫురత్ దీపః = వెలుఁగుచుండు దివ్వె, విరతి... ముదితః-విరతి = వైరాగ్యమును, వనితా=ప్రియురాలితోడి, సఙ్గ=కూటమిచే, ముదితః=సంతుష్టుఁడును, శాన్తః = శాన్తుఁ

డును, అగు, మునిః=యోగీశ్వరుఁడు, అతనుభూతిః = అఖణ్డైశ్వర్యముగల, నృపఇవ రాజువలె, సుఖం=సుఖముగా, శేతే=(ఆటంకరహితమగు) నిదురఁ జెందును.

తా. భూమి రమ్యమయినసెజ్జ, కై దీవయే విరివిగలతలాడ, ఆ శమే పెనుమేలుకట్టు. అనుకూలవాయువే వీవన. చంద్రుఁడే దివ్వె. రీతిని ముక్తివనితతోఁ గలయుచు మెలయుచు నానందపడుచు ము మహారాజువలె హాయిమెయిఁ బవళించును.

చ. ధరణి విశాలతల్ప ముపధానము బాహువు నింగి చందువా
సురఁటును గంధవాహముఁలు ౯ శోభనదీపము చందురుండుగా
విరతివధూమణిం గలసి ౯ వేడుక మీఱ సుఖించి శాంతుఁడై
నిరుపమలీల యోగి శయనించు మహీపతిమాళ్కి వడిన్.

శ్లో. భిక్షాశీ జనమధ్యసఙ్గరహితస్స్వాయత్తచేష్టస్సదా
హానాదానవిరక్తమార్గనిరతః కశ్చిత్తపస్వీ స్థితః,
రథ్యాకీర్ణవిశీర్ణజీర్ణవసనై రాస్యూతకన్థాధరో
నిర్మానో నిరహఙ్కృతిశ్శమసుఖాభోగైకబద్ధస్పృహః.

వ్యా.—అథ యోగిస్వరూపం నిరూపయతి—భిక్షేతి.—భిక్షామశ్నాతీతి భిక్షా భిక్షాన్నమాత్రభోజనేన శరీరధారణతత్పర ఇత్యర్థః. జనమధ్యే-సంగరహితః అసక్తివిహీన 'సఙ్గాత్సంజాయతే కామ' ఇత్యాదిస్మృతేస్తస్య నిదానత్వాదితి భావః. కింతు, సద సర్వదా, స్వాయత్తా స్వాధీనా-చేష్టా వ్యాపారో—యస్య స తథోక్తః-స్వచ్ఛన్దవిహా నిరత ఇత్యర్థః-స్వాధీనాత్మీయవ్యాపారో వా. ని. 'అధీనో నిఘ్న ఆయత్త' ఇత్యమర తథా, హానాదానయోస్త్యాగస్వీకారయోర్విరక్తః అసంకీర్ణః-యో మార్గస్తత్ర-నిరత అసక్తః-నియమేన హేయవస్తుహానో పాదేయోపాదానతత్పర ఇత్యర్థః. యద్వా-హానక ఇదం హేయమితి త్యాగః-ఆదానమిదముపాదేయమితి స్వీకారః.-హేయోపాదేయబు శూన్య ఇత్యర్థః.'నిస్త్రైగుణ్యే పథి విహరతాం కో విధిః కో నిషేధ' ఇత్యాదివచనాత్తస్య విధినిషేధాతీతత్వాదితి భావః తథా, రథ్యాయాం వీథ్యామాకీర్ణమ్ అనుపయుక్తత్వాజ్జన ర్విక్షిప్తం - కుతః? విశీర్ణం విశకలితం - తత్కుతః? జీర్ణం పురాతనం తథాభూత వసనమాచ్ఛాదనం - యస్య రథ్యాకీర్ణవిశీర్ణజీర్ణవసనః - 'చీరాణి కిం పథి న సన్తి దిశన్తి భిక్షా' మిత్యాదినా తస్య తథావిధవసనధారణస్వాభావ్యాదితి భావః. * అర

ఆదిత్వాన్మత్వర్థీయోఽచ్ప్రత్యయః. * అర్శఆదిరాకృతిగణః, యద్వా - రథ్యాయాం - కీర్ణమనాదరేణ నిక్షిప్తం-విశీర్ణం జీర్ణం చ వసనం నిజాచ్ఛాదనం యేన స తథోక్తః సంప్రాప్తం సమధిష్ఠితం - కన్థైవాసనం - యేన స తథోక్తః. చతుర్గుణితకన్థోప - ర్యుప విష్ట ఇత్యర్థః. అత ఏవ, నిర్మానోఽభిమానశూన్యః—సంసారాధ్యాసరహిత ఇత్యర్థః. నిర హంకృతిరహంకారశూన్యః తదాత్మాధ్యాసరహిత ఇత్యర్థః. శమో నామ వైరాగ్యేణ నిర్వికారచిత్తత్వం-తేన యః సుఖాభోగః ఆనన్దాఽతిశయః తత్ర ఏకం ముఖ్యం యథా తథా-బద్ధా స్పృహా యేన స తథోక్తః బ్రహ్మధ్యాననిష్ఠ ఇత్యర్థః కశ్చిత్కోఽపి, తపస్వీ మహాతపాః యోగీశ్వరః * ప్రశంసాయామినిః. స్థితః నిరాతఙ్కం వర్తత ఇత్యర్థః. రథ్యాకీర్ణేతి సంప్రాప్తేతి చ విశేషణద్వయేన బాహ్యవైరాగ్యముక్త-మన్త్యేరాన్తరవైరాగ్య మిత్యవగన్తవ్యమ్ స్వభావోక్తిరలంకారః. 'స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తువర్ణన మి'తి లక్షణాత్.

టీ. భిక్షా ఆశీ = శరీరధారణకుమాత్రము వలయు భిక్షను భుజించువాఁడును, జన...రహితః-జనమధ్య - జనులనడుమను (ఉండియు), సఙ్గరహితః = ఆసక్తివిహీనుఁడును, సదా=ఎల్లప్పుడును, స్వఆయత్తచేష్టః = తనకులోఁబడిన వ్యాపారముగలవాఁడును, హా... రతః-హాన = (నీచవస్తు వని) వదలుటయందును, ఆదాన=(ఉపాదేయ మని) స్వీకరించుట యందును, విరక్త = ప్రీతిలేని, మార్గ = నడవడియందు, నిరతః = ఆసక్తుఁడును, రథ్యా... వసనైః-రథ్యా = పెద్దవీథులయందు, కీర్ణ = పాఱవైవఁబడిన, విశీర్ణ = శిథిలమైన, జీర్ణ = ప్రాత, వసనైః = గుడ్డలతో, ఆస్యూత = అంతటఁగుట్టఁబడిన, కన్థా = బొంతను, ధరః = ధరించువాఁడును, నిర్మానః=అభిమానశూన్యుఁడును, నిర్ అహంకృతిః=అహంకారశూన్యుఁ డును, శమ...స్పృహః-శమ = వైరాగ్యమునవైనశాంతివలని, సుఖ = సుఖముయొక్క, ఆభోగ = విస్తారమున, ఏక = ముఖ్యముగా, బద్ధ = కట్టఁబడిన, స్పృహః = కోరికగల వాఁడును-బ్రహ్మధ్యాననిష్ఠయందే మనస్సుగలవాఁడనుట (అగు), తపస్వీ = యోగీశ్వరుఁడు కశ్చిత్ = ఎవఁడోయొకఁడే; స్థితః = ఉండును.

తా. భిక్షాన్నభోజనుఁడై, జనుల నడుమ నున్నను, వారిసంగతి లేక స్వేచ్ఛాప్రవర్తన గలిగి త్యజించుట గ్రహించుట యనునవి లేని మార్గముననుండి త్రోవలోఁ బడియుండిన చింపిగుడ్డప్రేలికలను బొంతఁగా గూర్చుకొని యభిమానము అహంకారములేనివాఁడై శాంత్యానందపారవశ్యమున నారూఢుఁడై యెవఁడో యోగీశ్వరుఁ డొకఁడుండును.

శా. హీనాదానవిరక్తమార్గనిరతుం గిడకు యభ్యేక్షాశి స్వా
ధీనారంభుఁడు లోకసంగదురితాతీతస్వభావుండు ర
థ్యానిక్షిప్తవిశీర్ణవస్త్రకృతకంథాసీనుఁ డాత్మాకర
థ్యానాసక్తుఁడు గానోకండు విగతాహంకారుఁ డొప్పుఁగా భువిన్.

శ్లో. చణ్డాలః కిమయం ద్విజాతిరథవా శూద్రోఽథ కిం తాపసః
కిం వా తత్త్వవివేక పేశలమతిర్యోగీశ్వరః కోఽపి కిం,
ఇత్యుత్పన్న వికల్పజల్పముఖరైరాభాష్యమాణా జనై
ర్న క్రుద్ధాః పథి నైవ తుష్టమనసో యాన్తి స్వయం యోగినః. 96

వ్యా — అథ యోగినాం మానావమానతుల్యతామాహ — చణ్డాల ఇతి. — అయం పరిదృశ్యమానశ్చణ్డాలః కిం అన్త్యజో వా, అథవేతి పక్షాన్తరే, ద్వే జాతీ శూద్రత్వ బ్రాహ్మణ్యరూపే యస్య స తథోక్తః కిం బ్రాహ్మణో వా - 'జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజ' ఇతి వచనాదితి భావః. యద్వా - ద్వే జాతీ జన్మనీ గర్భనిర్గమనసంస్కారాభ్యాం యస్య సః ద్విజాతిః - కిమ్, అథ యద్వా - శూద్రః కిం వృషలో వా కిం-వా యద్వా-తాపసః కిం తపోనిష్ఠో వా కిం, కిం వా తత్త్వవివేక, పేశలా పరమార్థపర్యాలోచనతత్పరా మతిర్యస్య స తథోక్తః కశ్చిత్కోఽపి, యోగీశ్వరః కిం ధ్యాననిష్ఠో వా, ఇత్యనేన ప్రకారేణోత్పన్నై రుదితైర్వికల్పజల్పైర్వికల్పవాక్యైర్ముఖరా వాచాలాస్తైరిత్థం భూతాని వాక్యాని వదద్భిరిత్యర్థః. జనైః, పథి మార్గే ఆభాష్యమాణా అధిక్షిప్యమాణా అపి, న క్రుద్ధాః న కోపితాః చణ్డాలత్వాద్యాక్షేపేణేతి భావః, నైవ తుష్టమనసః న సంతుష్టాన్తఃకరణాశ్చ - ద్విజాతిత్వాద్యాక్షేపేణేతి భావః. యోగినో యోగారూఢాః, స్వయం యాన్తి తూష్ణీం గచ్ఛన్తి-బ్రహ్మనిష్ఠత్వాదితి భావః. తథా చ గీతావచనం—

'న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః.
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః,
జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః.
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః.' ఇత్యాది.

టీ. అయం = కనఁబడువాఁడు, చణ్డాలఃకిం = మాలవాఁడా, అథవా = లేక, ద్విజాతిః వా=బ్రాహ్మణుఁడా,అథ=లేక, కిం శూద్రోవా=శూద్రుఁడా,తాపసః కిం వా=

తపోనిష్ఠుఁడా, తత్త్వవివేకపేశలమతిః = పరమార్థపర్యాలోచనయందు నేర్పుగల బుద్ధిమంతుఁడగు, కోఽపి = ఒకానొక, యోగీశ్వరః = మహాయోగియా, ఇతి = ఇటులని, ఉత్పన్న వికల్ప జల్పముఖరైః = పుట్టిన వికల్పపువాక్యములను ప్రేలుటచే వాచాలురగు, జనైః = మనుష్యులచేత, పథి = దారిలో, ఆభాష్యమాణాః = అధిక్షేపింపఁబడువారు, (అయ్యును), న క్రుద్ధాః = కోపపడినవారునుగాక, నైవ తుష్టమనసః=సంతసించినమనస్సు గలవారునుగాక, యోగినః=యోగీశ్వరులు, స్వయం=తమంతట, యాన్తి=పోవుదురు.

తా. వీఁడు మాలఁడా! లేక బ్రాహ్మణుఁడా! శూద్రుఁడా! తాపసుఁడా! తత్త్వవేత్త యగు యోగీశ్వరుఁడా! యని తన్నుఁ జూచి పలుపురు జనులు పలుతెఱంగులఁ జేయుభాషణమును వినుచుఁ గోపింపక సంతుష్టమనస్కుఁడై యోగి తన త్రోవను దా నేగును.

ఉ. మాలఁడొ వీఁడు విప్రకులసమ్మండనుఁడో మఱి శూద్రుఁడో తప
శ్శీలుఁడొ సిద్ధుఁడో యనుచుఁ గొందఱు జేరి వికల్పజల్పవా
చాలజనంబు లాడఁగ రోసం గుపితాత్ములు గారు సమ్మదో
ద్వేలురు గారు మిన్నక భువిన్ విహరింతురు యోగిపుంగవుల్.

శ్లో. హింసాశూన్యమయత్నలభ్యమశనం ధాత్రా మరుత్కల్పితం
వ్యాళానాం పశవస్తృణాఙ్కురభుజస్సృష్టా స్థలీశాయినః,
సంసారార్ణవలఙ్ఘనక్షమధియాం వృత్తిః కృతా సా నృణాం
యామన్వేషయతాం ప్రయాన్తి సతతం సర్వే సమాప్తిం గుణాః.

వ్యా.—అథ హింసాదిరాహిత్యవృత్తిమాహ—హింసేతి—హింసయా అన్యోపతాపకవధాదిభిః - శూన్యం రహితం, అయత్నేన యత్నం వినా - లభ్యం ప్రాప్యమ్, అశనమన్నం - ని. 'భిస్సా స్త్రీ భక్తమన్ధోఽన్న' మిత్యమరః. ధాత్రా చిత్రవిచిత్రసృష్టికర్త్రా బ్రహ్మణా వ్యాళానాం సర్పాణాం-ని. 'వ్యాళో దుష్టగజే సర్పే' ఇతి విశ్వః. మరుతా వాయునా, కల్పితం నిర్మితం, పశవః గోప్రభృతయః, తృణాఙ్కురాన్ బాలతృణాని-భుఞ్జానాః సన్తః, స్థలీశాయినః అకృత్రిమప్రదేశే శయనవన్తస్తుష్టాస్సంతుష్టాః సంసారః పుత్త్రకళత్రాది ధారావాహి రూపా సంసృతిః - స ఏవ అర్ణవః-తస్య లఙ్ఘనే అతిక్రమణే-క్షమా-ధీః యేషాం, తేషాం, నృణాం జనానాం, యథా తరణిద్వారా సముద్రం తరన్తి తథా జ్ఞానద్వారా సంసారం తరన్తీత్యర్థః. సా వృత్తిః పూర్వోక్త ప్రసిద్ధజీవనం, కృతా నిర్మితా - బ్రహ్మణేత్యర్థః. తాం వృత్తిం, అన్వేషయతాం మార్గ

మాణానాం-నిరస్తరజస్తమోజనితదోషాణాం, సర్వే గుణాః సతతం సర్వదా, సమాప్తిం నాశం, ప్రయాన్తి ప్రాప్నువన్తి.

'యో మే గర్భగతస్యాపి వృత్తిం కల్పితవాన్ప్రభుః,
శేషవృత్తివిధానాయ సుప్తః కిన్ను మృతోఽపి వా.'

ఇతి వచనరీత్యా వృత్తికల్పనే జాగరూకస్సన్ భగవాన్ వర్తత ఇతి మత్వా హింసాదిరాహిత్యేన వృత్తిం కుర్వన్ యదృచ్ఛయా సంప్రాప్తద్రవ్యేణ తుష్టస్సన్ యత్రకుత్ర వా వసన్ రజస్తమోదోషైః అలిప్తస్సన్ యోగీ సర్వదా ఆత్మానుసంధానం కుర్వన్ స్థాతవ్య ఇత్యాశయః.

టీ. వ్యాళానాం=పాములకు. ధాత్రా=బ్రహ్మచే, హింసాశూన్యం = చంపుటలేనిదియు, అయత్నలభ్యం=ప్రయత్నములేక లభ్యమగునదియు, (అగు), అశనం = అన్నము, మరుత్ = గాలి, కల్పితం = చేయఁబడినది. పశవః = గోవుమొదలగు జంతువులు, తృణ అఙ్కుర భుజః = లేఁబచ్చికను తినునవిగాను, స్థలీశాయినః = బాగుపఱచని నేలయందు పరుండునవిగాను, సృష్టాః=సృజింపఁబడినవి. సంసార అర్ణవలఙ్ఘనక్షమధియాం = పుత్త్ర కళత్త్రములతోడి సంసారసముద్రమును దాఁటుటయందు సమర్థమయినబుద్ధిగల, నృణాం= మనుజులకు, యాం=ఏ (వృత్తి), అన్వేషయతాం = వెదకువారికి, సతతం = ఎప్పుడును, గుణాఃసర్వే = సత్త్వరజస్తమోగుణకార్యములన్నియు - జననమరణాదులు, సమాప్తిం = నాశమును, ప్రయాన్తి = పొందునో, సావృత్తి = ఆజీవిక, కృతా = చేయఁబడినది.

తా. బ్రహ్మదేవుఁడు హింసకాఁకుంప నక్కఱలేక యప్రయత్నముగాఁ జేకుఱునట్టి గాలిని సర్పములకాహారము గావించెను. పశువులకు నేల పడుకగను గఱికపరక లాహారముగను గావించెను. సంసారసముద్రమును దాఁటఁజాలు బుద్ధి యుండిన నరులకును దగునాహారము నాలాటిదానిఁ జేసియే యున్నాఁడు. ఆయాహారమును జేకొనువారికి రజస్తమోగుణజనితదోషము లెల్ల నశించును.

చ. చిలువల గాలిమేపరులఁ ' జేసి తృణాంకురభోజనంబు భూ
తలశయనంబు గోవులకుఁ ' దామరచూలి విధించెఁ దత్త్వవే
శలమతులైనవారలకు ' సన్నుతవృత్తి ఘటించె దానిచేఁ
దొలఁగు రజస్తమోజనితదోషము లెల్ల భజించువారికిన్.

శ్లో. గఙ్గాతీరే హిమగిరిశిలాబద్ధపద్మాసనస్య
బ్రహ్మధ్యానాభ్యసనవిధినా యోగనిద్రాం గతస్య,

కిం తైర్భావ్యం మమ సుదివసైర్యత్ర తే నిర్విశఙ్కాః
కండూయన్తే జరఠహరిణాస్స్వాఙ్గ మఙ్గే మదీయే. 98

వా.—అథ నిర్వృతిప్రకారమాహ—గఙ్గేతి శ్లోకేన.—గఙ్గాయాః సుర నద్యాః-తీరే కూలే - ని. 'కూలం రోధశ్చ తీరం చ ప్రతీరం చ తటం త్రి' ష్విత్యమరః. తీరగ్రహణం తద్గతశీతత్వ పావిత్ర్యాదిసిద్ధ్యర్థం. హిమగిరేశ్శిలాయాః శిలాయాః పాషాణస్య ఉపరి-బద్ధం పద్మాసనం యేన తస్య, కిం చ, బ్రహ్మణః - ధ్యానముపాసనం - తస్య అభ్యసనమభ్యాసః - తస్య విధిః విధానం - తేన-ని. 'విధిర్విధానే దైవేఽపీ'త్యమరః. యోగనిద్రాం, గతస్య ప్రాప్తస్య, యోగినః మమ, తైస్సుదివసైః పుణ్యదినైః, భావ్యం కిం, యత్ర తే, జరఠహరిణాః వృద్ధకురఙ్గాః, నిర్విశఙ్కాః నిర్భీకాస్సన్తః, స్వాఙ్గం స్వశరీరం, మదీయే అఙ్గే శరీరే, కణ్డూయన్తే, తైర్భావ్యం కిమిత్యభిప్రాయః. ఏవం చ గ్రామనివాసం త్యక్త్వా గఙ్గాతీరే హిమవత్పర్వతపాషాణోపరిపద్మాసనాసనవర్తీ బ్రహ్మధ్యానాభ్యాసవిధానేన యోగనిద్రాం గతస్సన్నహం నిర్విశఙ్కైః జరఠహరిణైస్సాకం యదా స్థాస్యే, తదా మే సుదివసా జాయన్త ఇత్యభిప్రాయః.

టీ. గఙ్గాతీరే = గంగాతీరమున. హిమగిరిశిలాబద్ధపద్మాసనస్య = మంచుకొండ యొక్క శిలపై వేయఁబడిన పద్మాసనము గలవాఁడను, బ్రహ్మధ్యాన అభ్యసనవిధినా = పరబ్రహ్మముయొక్క ఉపాసనమును అభ్యాసపఱచుకొను కార్యముచేత, యోగనిద్రాం = యోగనిద్రను, గతస్య = పొందినవాఁడను, (అగు,) మమ = నాకు, తైః సుదివసైః = ఆ పుణ్యదినములు, భావ్యం కిం = కలుగునా? యత్ర = ఏ దినములందు, జరఠహరిణాః = ముసలిజింకలు, నిర్విశఙ్కాః సన్తః=భయములేనివై స్వఅఙ్గం = తమశరీరమును, మదీయే అఙ్గే = నాదేహమునందు, కణ్డూయన్తే = గీఁకుకొనునో ?

తా. గంగయొడ్డున మంచుకొండచఱియపైఁ బద్మాసనము వైచికొని నేను బ్రహ్మధ్యానాభ్యాసమున యోగనిద్రలో నుండఁగా జింకలు తమయొడలి దురద తీర్చుకొనుటకై నాదేహమును భయము లేక రాచుకొనునట్టి సుదినములు కలుగునా ?

ఉ. శ్రీసురసింధుతీరమున శీతనగోపలసీమయందుఁ బ
ద్మాసనవర్తినై శివు నుపాస్తి యొనర్చుచు యోగనిద్రచే
భాసిలుచున్న నాతనువుపైఁ దమమేనులతీఁట దీఱ న
త్రాసములై కురంగములు రాపులు సేయుట గల్గునే కదా.

శ్లో. పాణిః పాత్రం పవిత్రం భ్రమణపరిగతం భైక్షమక్షయ్యమన్నం
విస్తీర్ణం వస్త్రమాశాదశక †మపమలం తల్పమస్వల్పముర్వీ
యేషాం నిస్సఙ్గతాఙ్గీకరణపరిణతస్వాన్తసన్తోషిణస్తే
ధన్యాస్సంన్యస్తదైన్యవ్యతికరనికరాః కర్మ నిర్మూలయన్తి. 99

వ్యా.—అథ కేవలం సర్వసఙ్గపరిత్యాగత్వమాహ పాణిః పాత్రమితి శ్లోకేన—పాణిరితి—పవిత్రం పరిశుద్ధం, పాణిః హస్త ఏవ, పాత్రం భాజనం. ని. 'యోగ్యభాజనయోః పాత్ర'మిత్యమరః. భ్రమణేన సంచారేణ-పరిగతం ప్రాప్తం భైక్షం భిక్షాకదమ్బకమ్, అక్షయ్యం నాశరహితమ్, అన్నమ్ అశనమ్, ఆశానాం దిశాం-దశకం, అపమలమ్ నిర్మలం, విస్తీర్ణంవిశాలం, వస్త్రం వాసః, ఉర్వీ భూమిః, అస్వల్పం మహత్ -+అచపలమ్, అచఞ్చలం, తల్పం శయ్యా, యేషాం నిస్సఙ్గతాయాః సఙ్గరాహిత్యస్య-అఙ్గీకరణే-పరిణతం పరిపాకం గతం యత్ స్వాన్తం - తేన సంతోషిణః సంతుష్టా, స్తే ధన్యాః, సన్న్యస్తాః త్యక్తాః-దైన్యస్య వ్యతికరనికరా యై స్తే తథోక్తాస్సన్తః, కర్మ, నిర్మూలయన్తి, నాశయన్తి, ఏవం చ యత్ర కుత్ర వా వసన్ పాణిపాత్రేణ భైక్షాన్నం భుక్త్వా దిగమ్బరః ఉర్వీశయనః నిస్సఙ్గపరిణతచిత్తేన సంతుష్టస్సన్ త్యక్తదైన్యవ్యతికరనికరః ధన్యః ధారావాహికజన్మ పరమ్పరాప్రదం కర్మ నిర్మూలయతీత్యభిప్రాయః.

టీ. పాణిః=అరచేయియే, పవిత్రం = పరిశుద్ధమైన, పాత్రం = భోజనపాత్రము-కంచము, భ్రమణపరిగతం = సంచారముచేత ప్రాప్తించిన, భైక్షం = భిక్షాకదంబము, అక్షయ్యం = నాశరహితమగు - తఱుగనిది, అన్నం = ఆహారము, ఆశాదశకం = పది దిక్కులు, అపమలం విస్తీర్ణం వస్త్రం = నిర్మలినమగు విశాలవస్త్రము, ఉర్వీ = భూమి, అస్వల్పం = గొప్ప, తల్పం = సెజ్జ, యేషాం = ఎవరికో, నిస్సఙ్గతా = సంగరాహిత్యమును, అఙ్గీకరణ-కైకొనుటచేత, పరిణత = పరిపక్వమైన, స్వాన్త = మనస్సుచేత, సన్తోషిణః = తృప్తిఁజెందిన, దైన్య = దీనత్వముయొక్క, వ్యతికర = సంబంధములయొక్క, నికరాః, సన్తః = సమూహములుగలవారై, కర్మ = కర్మను, నిర్మూలయన్తి = నశింపఁజేయుదురు.

తా. అఱచేయియే భిక్షాపాత్రముగాఁ దిరిపమెత్తి దొరకినయన్నమును భుజించి దిగంబరులై, నిస్సంగులై వట్టినేల శయనించుచునుండుమహాత్ములు సంబంధములన్నియుఁ బెడబాయుటచేఁ జిత్తము పరిపక్వముకాఁగాఁ గర్మమును నిర్మూలము చేయుదురు.

ఉ. పాత్రము పాణిపంకజము భైక్షము భోజ్య మనల్పతల్ప మీ
ధాత్రి దిశాష్టకంబు పరిధాన మగుఁ భువి నేరి కాసుచా

రిత్రులసంగతాగుణధురీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశములఁ ద్రెంచి దహింతురు కర్మబీజమున్.

శ్లో. మాతర్మేదిని! తాత మారుత! సఖే! తేజః సుబన్ధో జల!
భ్రాతర్వ్యోమ! నిబద్ధ ఏష భవతామన్త్యః ప్రణామాఞ్జలిః,
యుష్మత్సఙ్గవశోపజాతసుకృతస్ఫారస్ఫురన్నిర్మల
జ్ఞానాపాస్తసమస్తమోహమహిమా లీయే పరబ్రహ్మణి. 100

వ్యా.—అథ పఞ్చభూతాని సంబోధ్యాహ—మాతరితి.—హే మాతః జనని, మేదిని వసుమతి, హే తాత జనక, మారుత వాయో, హే సఖే సుహృత్, తేజః, హేజల ఉదక, సుబన్ధో శోభనబన్ధో, హే భ్రాతః సహోదర, వ్యోమ అమ్బర, భవతాం యుష్మాకమన్త్యః చరమః, ప్రణామాఞ్జలిః నమస్కారపూర్వకాఞ్జలిః, నిబద్ధఏవ. ని. 'పాణిర్నికుబ్జః ప్రసృతి స్తౌ యుతావఞ్జలిః పుమా' నిత్యమరః. యుష్మాకం - సఙ్గస్య యోగస్య - వశేన అధీనేన - ఉపజాతం యత్సుకృతం - తేన - స్ఫారం విస్తారం-స్ఫురత్ నిర్మలం చ - యద్ జ్ఞానం - తేన - అపాస్తః దూరతస్త్యక్తః - సమస్తమోహమహిమా పుత్రమిత్రకళత్రాద్యభినివేశాజ్ఞానాతిశయస్సన్, అహం, పరే బ్రహ్మణి సచ్చిదానన్దస్వరూపిణి నిర్వికారే నిష్కళఙ్కే నిరఞ్జనే బ్రహ్మణి లీయే-ఏవం చ దారైషణవిత్తైషణపుత్రైషణరహితస్సన్ చిదానన్దస్వరూపః సన్ విదేహకైవల్యపర్యన్తం జీవన్ముక్తస్సన్ అహం వర్తే ఇత్యాశయః.

టీ. మాతర్మేదిని=ఓయమ్మాభూదేవీ, తాతమారుత=ఓతండ్రీ వాయూ, సఖే తేజః= ఓచెలికాఁడా అగ్నిదేవతా, సుబన్ధోజల = మంచిబంధువైన నీరమా, భ్రాతర్వ్యోమ = ఓయన్నాఆకసమా, భవతాం=మీకు, ఏషః=ఇదే, అన్త్యః = కడపటి, ప్రణామాఞ్జలిః నమస్కారపూర్వకమగు చేతులజోడింపు, నిబద్ధః = చేయఁబడినది. యుష్మ...మహిమా- యుష్మత్ సఙ్గ=మీకూడికయొక్క, వశ=అధీనముచే, ఉపజాత = పుట్టిన, సుకృత=పుణ్యముచేత, స్ఫార=విశేషముగ, స్ఫురత్ = వెలుఁగుచున్న, నిర్మలం=మలినములేని, జ్ఞాన = తెలివిచే, అపాస్త=తొలఁగింపఁబడిన, సమస్త=సకలమైన, మోహ = అజ్ఞానముయొక్క, మహిమాసన్ = అతిశయముగలవాఁడనై, పరబ్రహ్మణి=(నిర్వికార, నిష్కళఙ్క, నిరఞ్జనమగు) పరబ్రహ్మయందు, లీయే=ఐక్యమగుచున్నాను.

తా. అమ్మా పృథ్వీ! నాయనా మారుత!మిత్రమా అగ్నీ! చుట్టమా నీరమ! అన్నా వ్యోమమ! మీకందఱకుఁ జేదోయి మోడ్చి యిదె తుదిమ్రొక్కు కావించుచున్నాను. మీసాంగత్యము వలన నాకుఁ గలిగిన

పుణ్యమున నజ్ఞానమెల్ల నశించి యఖండజ్ఞాన ముదయించుటచేఁ బర బ్రహ్మమున లయమగుచున్నాను.

మ. జననీ మేదిని! తాత మారుత! వయస్యా వహ్ని! చుట్టంబ జీ
వనమా! సోదర తారకాపథమ! భవద్వ్యప్రేమ సంధిల్ల మీ
కొనరింతుం జరమప్రణామము భవద్యోగస్ఫురత్పుణ్యసం
జనితజ్ఞాననిరస్తమోహతతి నై సద్బ్రహ్మముం బొందెదన్.

ఉ. కూడిక చెందికొన్న తమకూరిమికీర మదెట్లు పల్కిన
న్వేడుక చేయుచందమున నీదయఁ గాంచిన నాకవిత్వ మే
జాడ వహించియున్నఁ గడు సమ్మద మే ఘటియించు నీకుఁ బె
ద్దాడపురీనివాస సిజదాసశివంకర సోమశంకరా.

శా. తారామండల కుండలీశ్వర సుధాతారామరత్నోజకాం
తారామర్త్యగజాంబుజప్రభవకాంతారామ గౌరప్రభా
దారాలంకృతవామభాగ బుధమందారాగ యోగీంద్రబృం
దారాధ్యాంఘ్రిసరోరుహద్వితయ వేదారామఖేలత్పికా.

క. సంతోషబాష్పవారిని, రంతరదృగ్జలజభర్తృహరిసంయమిరా
ట్చ్ఛంతస్వాంత నిశాంతని, శాంతోజ్జ్వల బోధదీపశరవరచాపా.

మాలిని—

ప్రణుతకుధరకన్యాఫాల సాదృశ్యహేతు
ప్రణయభర శిరస్సంప్రాపితాబ్జారిరేఖా
ప్రణవనలినపీఠోపాంతసాంతత్యసేవా
చణహరివిధిరామాచామరోద్వీజ్యమానా.

ఇది శ్రీ భర్తృహరియోగీంద్రులచే విరచితమైన సుభాషితత్రిశతియందు
వైరాగ్యశతకము సంపూర్ణము.

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్ష పాత్ర యేనుఁగులక్ష్మణకవి
రాజ విరాజ పౌత్త్రతిమ్మనార్యపుత్త్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణ
కవి నామధేయప్రణీతంబయిన సుభాషితరత్నావళీ
కావ్యంబునందు వైరాగ్యశతకంబను
తృతీయాశ్వాసము.

మహామహోపాధ్యాయ ఎలకూచి బాలసరస్వతికృత

# మల్లభూపాలీయము

# నీతిశతకము

## మూర్ఖపద్ధతి

శా. శ్రీమద్బాలసరస్వతీప్రకటలక్ష్మీహేతువై శాంతమై
యామోదావహమై నిజానుభవవేద్యంబై యనేకాదిగా
ద్యామేయప్రవిబోధరూపమహితంబై యొప్పు తేజంబు ప్రా
పై మిము న్నిరు లీవుత న్సురభిమల్లా నీతివాచస్పతీ. 1

మ. సతతంబు న్మది మత్సరాఢ్యులు పరిజ్ఞాత ల్మహీనాథు లా
తతసంపన్మదదుష్టచిత్తు లితరు ల్తర్కింప నజ్ఞానదూ
షితభావు ల్వినువార లేరి యొదల న్జీర్ణంబు లౌఁ గాక యా
ర్యతతు ల్నేర్చినసూక్తము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 2

మ. నిలుప న్వచ్చు స్వభావమూర్ఖుఁ డగువానిం గొన్ని యత్యంతము
న్నిలుప న్వచ్చు విశేషవేది యగువానిం గొల్చి యొండేని జ్ఞా
నలవాహంకృతిదుష్టుఁ డైనమనుజు న్రంజింప శక్యంబు గా
దలభాషాపతి కేనియు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 3

శా. కాలాహిం దలఁ దాల్ప వచ్చు విరిపాంకానం దరంగప్రజో
త్తాలం బైనపయోధిఁ జేతుల నె యీఁద న్వచ్చు నక్రోగ్రదం
ష్ట్రాలగ్నం బగుమానికంబు హరియింప న్వచ్చు నెట్లేని మూ
ర్ఖాళిం దెల్పఁగ రాదు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 4

మ. వసుధం గుంటెటికొమ్ము తెచ్చుకొనఁగా వచ్చుం బ్రయత్నంబున
న్వెసఁ ద్రావ న్జల మెండమావులనె యేనిం గాంచ వచ్చు న్నిజం

---

☞ నైజాము రాజ్యములోని జటప్రోలు సంస్థానాధీశ్వరులైన సురభి మల్ల భూపాలున కంకితము. కృతిపతివంశజులకు శ్రీసురభి రాజా వేంకటలక్ష్మారావు బహద్దరువా రిదివరలో ఈగ్రంథమును ప్రచురించి యుండిరి.

బిసుక న్మానియఁ బిండ వచ్చుఁ బ్రతిభాహీనాత్ముఁ డౌమూర్ఖుఁ దె
ల్ప సమర్థత్వము లే దిల న్సురభిమల్లా నీతివాచస్పతీ. 5

మ. దిరిసెంపున్విరిచేత వజ్రమణి భేదింపం దలంచు న్మద
ద్విరదేంద్రంబు మృణాళతంతువున బంధింపంగ నూహించు మా
ధురి నింపం జనుఁ దేనెచే లవణపాథోరాశికి న్మూర్ఖుఁ దె
ల్ప బుధోక్తిం బిడువాఁడు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 6

శా. స్వాయత్తంబు కడు న్హితంబు నయి మౌఢ్యం బప్రకాశంబుగాఁ
జేయన్ బ్రహ్మ సృజించినట్టివిబుధశ్రేణీసమాజంబులన్
డాయ న్మిక్కిలియుం బ్రియావహము మానం బొక్కటే భూషణం
బై యజ్ఞావళి కొప్పెడు న్సురభిమల్లా నీతివాచస్పతీ 7

మ. కరియుం బోలె మదాంధుఁ డౌచు నొరులం గైకొనక తొల్దొల్ల ము
ష్కరుఁ డొక్కొక్కఁడు తా ఘనుండ ననుఁ బ్రజ్ఞావంతు లౌధీరశే
ఖరులం జూడఁగఁ జూడఁగా వరుసఁ దద్గర్వంబు రోగంబున
ట్లురగ న్నీచుఁడుఁ దా నను న్సురభిమల్లా నీతివాచస్పతీ. 3

శా. ప్రువ్వ ల్గారుచు నీచుకంపుతఱుచున్ రోఁత్రై తఱిం బాసి పె
న్దువ్వ న్బ్రుంగినగర్దభాస్థిఁ దినుచున్ సుప్రీతమై జాగిలం
బవ్వేల్పుందొరఁ జూచి కొంకదు గృహీతార్థావమానం బొరు
ల్నవ్వ న్నీచుఁడు లోఁగునే సురభిమల్లా నీతివాచస్పతీ. 9

మ. తొలుత న్మిన్ననుండి శంభుజడలందు న్వ్రాలె నావిమ్మటన్
వలరా మేటిపయిం బడె న్మహి మరిన్ జాఱెం బొరి న్నాఱుభం
గులఁ బాథోనిధిఁ జొచ్చె గంగ యవివేకు ల్సేయునుద్యోగము
ల్పలుఁబొట్లం జనుఁజూ కడు న్సురభిమల్లా నీతి వాచస్పతీ. 10

---

## విద్వత్పద్ధతి

మ. చదువు ల్చెప్పెడు శిష్యులన్ మనుచు ప్రజ్ఞావంతు లెందేనిఁ బెం
పొదవ న్గొల్లని కమ్మఁజూపుకుఱుల ల్మున్నుం ధరాభర్తకే
కొదగా కర్థము లేక యుండిమం నుదగ్ర ల్పాండిత్యగ్రామణుల్
మది నూహింప నలంతులే సురభిమల్లా నీతివాచస్పతీ. 11

శా. ఏనాట న్జన దేరి కిచ్చిన సుఖోద్వృద్ధంబ యై యుండు ని
త్యానందం బొనరించు ముచ్చుల కశక్యం బౌ హరింప న్బ్రియం
బౌన న్విద్యయె పో మహాధనము మాన్యం బైనవిద్యాఢ్యుల్ హేఁ
డా నొంప న్దగు నల్క చే సురభిమల్లా నీతివాచస్పతీ. 12

మ. గురుశాస్త్రార్థగరిష్ఠు లైనబుధుల న్గోపింపఁగా రాదు రా
జ్యరమల్ వారికి దొడ్డు గావు తృణ మె ట్లట్లుద్యదశ్రాంతబం
ధురదానార్ద్రకపోల యైనకరికి న్దో డ్డా మృణాళంబు గా
వ్యరసాస్వాదనభోజ శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 13

శా. ఉల్లం బక్కలహంసపై గుపితమై యున్న న్వినోదింపఁగా
నిల్లా దానిసరోజినీవనమె మాయింప న్సమర్థుండు తా
నీళ్లు న్బాలును నేర్పరింపఁ గలపాండిత్యంబు మాన్పంగ లేఁ
డల్లోకేశ్వరుఁ డేమెయి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 14

మ. కమనీయం బగువిద్యభంగిఁ దమశృంగారంబు గల్పింప లే
వమలేందుద్యుతు లైనహారములు కేశాలంక్రియ ల్మజ్జనం
బు మనోజ్ఞాంగదచందనాదు లఖిలంబు న్పోవుఁ బోదెందు వా
క్యమయం బౌ తొడ వేరికి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 15

మ. చదువే రూపము గుప్త మౌధనము పూజ్యశ్రేణిపూజ్యంబు స
మ్మదము న్కీర్తియు భోగ మిచ్చు నృపసన్మానంబు గల్పించు నె
ల్ల దెస న్దోడ్పడు దైవతుల్యము సిరు ల్దా మిట్టివే యాపసుల్
చదువు ల్నేరనివారె సూ సురభిమల్లా నీతివాచస్పతీ. 16

మ. సుకవిత్వంబె ప్రభుత్వ మీరసమె ద్వేషు ల్కొండెకాఁడే మహా
హి కరం బోర్మియె జోడు విద్యయె ధనం బిష్టుండె దివ్యౌషధం
బకృతజ్ఞుం డగుజ్ఞాతియే యనల మింపౌసిగ్గె సద్భూషణం
బకరాళప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 17

మ. హితు మైత్రి న్జెడు ధూర్తత న్గురు క్షమ న్భృత్యు న్దయ న్వైరి శూ
రతఁ దక్షుఁ బుజుత న్నృపాలు నయచర్య న్దుష్టు న్బ్రీతి నా
ర్యతతి న్బ్రీతి యథార్థ్యత న్మెలపునయ్యు ల్సమ్ము లోకస్థితుల్
జత గావించుమహామహు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 18

మ. మతిజాడ్యం బడఁచున్ నిజంబు గలుపు న్మానోన్నతి న్నించు దు
ష్కృతముల్ ద్రుంచు మనః ప్రసాద మిడుఁ గీర్తిస్ఫూర్తి గావించు నీ

క్షితి నార్యుండు తదీయసంగతిమెయి న్సిద్ధించు సర్వార్థముల్
ప్రతిభానూత్నఫణీశ్వరా సురభిమల్లా నీతివాచస్పతీ. 19

మ. తులలే కెందు బ్రసిద్ధు లౌచు రససిద్ధు ల్గోవెలె విద్వత్కవీం
ద్రులు భాసిల్లుదు రమ్మహాత్ములయశస్తోమంబు లవ్విగ్రహం
బుల కెక్కాలమున న్జరామరణసంభూతవ్యథల్ లేవు శీ
లలసత్పుణ్యగుణాశ్రయా సురభిమల్లా నీతివాచస్పతీ. 20

---

## శౌర్యపద్ధతి

మ. జర నైన న్క్షుధనైన నొప్పి నయిన న్శైథిల్యసంప్రాప్తి నై
న రుజాదుర్దశలందు నైనఁ దుది నైన న్మత్తవేదండకుం
భరసైకాశనకాంక్షి యైనమృగభూపాలుండు పుల్మేయునే
యరయన్మానధనుండు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 21

మ. పసి మొక్కంత గలాదొ లేదొ క్షుధ దీర్పన్జాల కెప్పాటిదో
పసరం బెమ్ము లభించి కుక్క చెలఁగు న్బజ్జ న్మెకా లెన్నియేన్
వసియింపం గన దేమఁగుం దినఁ జను న్హార్యక్ష మా నా జనుల్
స్వసమర్థస్పృహు లౌదు రా సురభిమల్లా నీతివాచస్పతీ. 22

మ. భువిపైఁ జాగిలి తోఁక యూఁచు వదనంబున్బొట్టయు న్సారెఁ జూ
పు వెస న్బట్టెడు ముద్దకై శునక మెప్డు న్భద్రవేదండ మా
కవణం బల్లనఁ గైకొను న్బహునుతు ల్గావింపఁ దా నెంతొ సొం
పవులేఁజూపులఁ జూచుచు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 23

మ. జనుఁ డెవ్వాఁడు జనింపఁ డెల్లజనులు న్సంసారచక్రంబునన్
జననం బెత్తెడువారె కారె విను జన్మం బెవ్వఁడే నెత్తినన్
దనవంశంబు ప్రకాశ మానతఁడు జన్మం బెత్తినాతండు పా
లనసంతోషితభూజనా సురభిమల్లా నీతివాచస్పతీ. 24

మ. అలరుం గుత్తికిఁ బుణ్యశీలునకు యోగ్యస్థానముల్ రెండె సు
మ్మలరించు న్మరి రెండు నెవ్వి యనిన న్బ్రోచన్మహారణ్యమం
దలి యొండె న్ధరణీజనప్రవరచూడాసీమ యొండెం జుమీ
లలనానూతనమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 25

శా. లేరా వెండియు నేగు రార్గురుఘను ల్మింట న్గురుం డాదిగా
వాని న్మస్తకశేషుఁ డయ్యెఁ జెనక న్వాంఛింపఁ డత్యంతతే
జోరాము ల్రవిచంద్రము ల్తగుదు రంచు న్రాహు వూహించి ప
ర్వారంభంబుల మార్కొను న్సురభిమల్లా నీతివాచస్పతీ. 26

మ. భువనశ్రేణి ధరించు శేషుఁడు ఫణాభోగంబుపై శేషుఁ గూ
ర్మవరేణ్యుండు ధరించు వెన్నుపయిఁ గూర్మంబు న్వరాహంబు దా
ల్చు వరాహంబు నయత్నత న్జలధి దాల్చు న్జిత్ర చిత్రంబు లీ
యవనిం బెద్దలవర్తన ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 27

శా. నానాజ్వాలవిలోలవహ్నిరుచిసాంద్రంబైనదంభోళిచేఁ
దా నత్యంతము తండ్రి శీతగిరి సంత్రస్తాత్ముఁడై యుండఁగా
మైనాకాద్రికిఁ జెల్లునే యకట యాత్మప్రాణసంరక్ష యే
లా నక్కెన్ జలరాశిలో సురభిమల్లా నీతివాచస్పతీ. 28

మ. తనపై నయ్యరవిందబాంధవుఁడు పాదం బూనినన్ దీ యచే
తన మయ్యు న్వడిఁ జూపు మంట లిన కాంతం బౌర తేజస్వి లా
జను లేరీతి సహింతు రన్యుఁడు తిరస్కారం బొనర్పన్ విశా
లనయశ్రీజితభార్గవా సురభిమల్లా నీతివాచస్పతీ. 29

మ. ప్రకటోద్యాంతమదార్ద్రమైనకరిణీఫాలంబుపై సింహ మ
ర్భక మయ్యుం దుముకు న్స్వభావ మిది శౌర్యశ్రేణికి న్సత్వశా
క్తికిఁ బ్రాయంబులు గావు హేతువులు చర్చింప న్మదారాతిజా
లకజీమూతసమీరణా సురభిమల్లా నీతివాచస్పతీ. 30

---

## అ ర్థ ప ద్ధ తి

శా. పోవు న్జాతి యధోగతం బయి కడు న్బోవు న్సదాచారస
ద్భావం బన్వయశుద్ధి నిష్ఫల మగు న్బాహాబలశ్రీ వృథా
భావం బొందు గుణానుభావము తృణప్రాయం బగున్ నిర్ధనుం
డౌ వాఁ డెన్నిట ముఖ్యుఁడా సురభిమల్లా నీతివాచస్పతీ. 31

మ. ధని యెవ్వాఁ డగు వాఁడె సత్కులుఁడు మేధాశాలి సర్వార్థద
ర్శను డత్యుజ్జ్వలమూర్తి యప్రతిమవాగ్జాలుండు సర్వజ్ఞుఁ డౌ

ననఁగా శోభిలు నెల్లసద్గుణము లర్థైకాశ్రయంబు ల్సుమీ
యనిశశ్రీజితవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 32

మ. యతి సంగంబు కుపుత్రుఁ డిల్లు గృషి నవ్యాలోక మప్రీతి మి
త్రత లజ్జ న్సుర పుత్రుఁ గూర్మి పతి దౌర్మంత్ర్యంబు విశ్లేష మి
ష్టత దుస్సేవ బుధున్ గునీతి సిరి వెచ్చం బర్థము న్వేద బా
హ్యాత విప్రు న్జెఱుచు న్సదా సురభిమల్లా నీతివాచస్పతీ. 33

మ. సరవి న్దానము భోగమున్ మరి వినాశం బన్నయిమ్మూఁడువై
ఖరుల న్మర్త్యులు సంతరించుధనసంఘాతం బపేతం బగున్
ధరలో నాద్యము లైనరెండువిధము ల్దప్ప న్దృతీయంబె యె
ల్లరయర్థంబున కౌఁజుమీ సురభిమల్లా నీతివాచస్పతీ. 34

మ. రతుల న్బాల కళావిశేషత నిశారా జీగి నర్థాఢ్యుఁ డు
గ్రతరాస్త్రక్షతి జోడు శాణకలన న్రత్నంబు దానాతిని
స్రుతి నేనుంగు శరత్కృశాంభమున నేరు న్శోభిలున్ జూడ న
ల్పత గన్పించియుఁ బెంపుచే సురభిమల్లా నీతివాచస్పతీ. 35

మ. తొలుతం జేరెఁడువడ్ల కేఁకర దరిద్రుం డంత సంపన్నుఁ డై
యిల సర్వంబు తృణీకరించు ఘనము న్స్థానంబునుంగా గురు
త్వలఘుత్వంబులనిశ్చితంబు లగు చర్థశ్రేణి దోపించుఁ బెం
పలర న్దిష్టవిశేషము న్సురభిమల్లా నీతివాచస్పతీ. 36

మ. భువి గోధేనువుఁ జేసి భూజనముఁ గ్రేపుం జేసి పోషించుభూ
ధవుఁ డేయిష్టము నేనియు న్బిదికిన న్దద్భూమి యయ్యిష్టమున్
సవిశేషస్థితి నిచ్చుఁ గల్పలతచందాన న్ద్విషద్భూమిపా
లవనాభీలదవానలా సురభిమల్లా నీతివాచస్పతీ. 37

మ నిజము న్బొంకును గ్రౌర్యము న్బ్రియము నెంతే వెచ్చము న్విత్త సం
భజనంబు న్మరి హింసయు న్గృపయు లోభంబు న్వదాన్యత్వమున్
సృజియించు న్ధరయం దనిశ్చయగతిన్ జెన్నారు నవ్వేశ్యలీ
ల జనాధీశులనీతి శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 38

శా. త్యాగంబు న్ద్విజరక్షణంబు స్వజనత్రాణంబు సత్కీర్తియున్
భోగం బాజ్ఞయు నాఁగ నాఱుగుణముల్ పొల్పొందనేనిన్ స్థిరో
ద్యోగుం డై భజియింపఁగా వలయు లేకున్న న్వృథా గాక యే
లా గోత్రాపతిఁ గొల్వఁగా సురభిమల్లా నీతివాచస్పతీ. 39

శా. దేవుం డిచ్చినయంత గల్గు నడవి న్దేవాద్రి నైన న్సదుం
డై విత్తాఢ్యుల కేఁకర న్వలదు తోయం బిద్ధర న్గుండకున్
బావి న్ముంచినఁ గుండెఁడు న్జలధి ముంప న్బట్టెఁడున్ బుట్టునా
లావణ్యాపరమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 40

---

## దుర్జనపద్ధతి

మ. కరుణాలేశము లే దకారణమె యుగ్రం బైనకోపం బిడున్
బరనారీపరవిత్తవాంఛితము లాత్మన్ నిత్యమున్ జేయు వే
మరు విద్వజ్జనబంధుబృందము నలంపన్ జూచు నిప్పాటఁ గ
ల్లరి యేవానిగుణం బగు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 41

మ. బహువిద్యావిదుఁ డయ్యు దుష్టజనుఁ డెప్పాట న్వివర్జ్యుండు గా
ని హితుం జేసికొనం దగండు ఫణమాణిక్యోజ్జ్వలం బయ్యు న
య్యహి సంత్యాజ్యమె కాని చేకొనఁగ న్వర్ణంబె విభాస్వద్దయా
లహరీనిర్ఝరిణీశ్వరా సురభిమల్లా నీతివాచస్పతీ. 42

మ. ముని మూఢుం డను సిగ్గరి న్జడుఁ డనున్ బుణ్యవ్రతు న్దాంభికుం
డను శుద్ధుం గితవుం డనున్ స్థిరు నశక్తాత్ముం డను న్మంజువా
దిని దీనుం డను వక్తఁ బల్లదుఁ డనున్ దేజస్వి గర్వాధికుం
డనుఁ గూ రెవ్వరి మే లను న్సురభిమల్లా నీతివాచస్పతీ. 43

మ. సుమహత్త్వంబె విభూష సజ్జనతయే చుట్టంబు కొండెంబె పా
పము లుబ్ధత్వమె దుర్గుణంబు చనువే భాగ్యంబు సత్యంబె స
ద్విమలం బౌతప మాత్మశుద్ధియె మహాతీర్థంబు దుష్కీర్తియే
యమితక్లేశము దేహికి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 44

మ. తొలుత న్దీర్ఘములై పొరిం గృశములై తోఁచుం బ్రభాతంపుఁజా
యలు పోలె న్ఖలుతోడిమైత్రు లపరాహ్ణచ్ఛాయలుం బోలెఁ దొ
ల్దొలుత న్స్వల్పములై పొరి న్ఘనములై తోఁచు న్సుధీసఖ్యముల్
నలినాక్షీనవమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 45

మ. స్ఫురణ న్బాసినసజ్జనుండు ధనలుబ్ధుం డైనరాజున్ నిర
క్షరుఁ డౌరూపరి రచ్చలోఁ ఖలుఁడు నిష్కంజంబు లౌతోయముల్

కరుణత్వం బడివోవునింతె పగ లల్పజ్యోతి యౌచందురుం
డరయ న్మానసశంకవు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 45

మ. మొరకై యెప్డుఁ బ్రచండకోపుఁ డగుచుం బోనాడుభూభర్తకా
క్రూరుఁ డాత్మీయుఁ డనం గలాఁడె సముదగ్రజ్వాల మావహ్ని దు
ర్భరమై ప్రేల్చెడిపోత నైన స్పృశియింప న్గాల్చుఁ గాదే విశా
లరమావైభవవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 47

మ. శమతో నుండ భయస్థుఁ డండ్రు కినియ న్గయ్యాళివాఁ డండ్రు మా
న మిడ న్మాగ యటండ్రు వాక్పటిమఁ జెంద న్వాద రంచండ్రు పా
ర్శ్వమునన్ నిల్వ మదాంధుఁ డండ్రు కడ నిల్వ న్మేదకుం డండ్రు శ
క్యమె భూపాలకసేవ దా సురభిమల్లా నీతివాచస్పతీ. 48

మ సముఖానన్ జెడుగాడుఁ గాని యొరులన్ జాలింపఁ దుచ్ఛృంఖల
త్వమునన్ వర్తిలుఁ దొంటిపాట్లు మదిలోఁ దర్కింపఁ డొక్కింత భా
గ్యముచే నొనడుమంత్రపుంబదవిచే గర్వించు భూపాలు మ్రో
ల మనం జూతురె పండితు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 49

మ. తృణవృత్తి న్జలవృత్తి నాత్మసుఖవృత్తి న్వర్తిలంగా మృగీ
గణముం జేపల సాధుల న్మృగములు న్గైవర్తులున్ దుర్జనుల్
క్షణమాత్రంబు సహింప కేమిపనికై కారింతు రీధాత్రిఁ గీ
ర్త్యణుమాధ్యావరణోత్సుకా సురభిమల్లా నీతివాచస్పతీ. 50

## సుజనపద్ధతి

మ. దమసంపత్తి మహేశభక్తి నిజకాంతాసక్తి విద్యానుర
క్తి మహత్సంగమవాంఛ దేశికవరాంఘ్రిప్రీతి దుస్సంగమో
క్ష మనిందామయబుద్ధి యన్యగుణహర్షం బేరియం దుండు వా
రమరన్ భూమి కలంకృతు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 51

శా. ఆపత్తి న్ధృతి సంపద న్క్షమ శ్రుతి న్వ్యాసక్తి సద్గోష్ఠి వా
చాపాండిత్యము పోర విక్రమము భాస్వత్కీర్తిపై వాంఛయున్
రూపింప న్మహనీయు లౌజనుల కెందు న్లక్షణంబు ల్సుమీ
యాపూర్ణప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 52

మ. సిరి లేకైన విభూషితుండె యయి భాసిల్లున్ బుధుం డాదలన్
గురుపాదానతి కేల నీగి చెవులందు న్విన్కి వక్త్రంబునన్
స్థిరసత్యోక్తి భుజంబుల న్విజయము న్జిత్తంబున న్సన్మనో
హరసౌజన్యము గల్గిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 53

మ. కలయ న్జీవి పరాంగనాధననిరాకాంక్షత్వ మాచార్యవ
ర్యులపై భక్తివిధిప్రవర్తనము కారుణ్యంబు సత్యంబు నా
ర్తుల రక్షించుట సర్వశాస్త్రసమచిత్తుం డౌట తృష్ణాప్రవా
హాలయంబున్ సుఖమార్గము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 55

మ. నవనీలోత్పలకోమలాంబు లగుచు న్భాసిల్లు డెందంబు లా
ర్యవితానంబునకు న్సుకు ల్గలుగుచో నాపద్దశ న్పర్వతేం
ద్రవిశాలోపలనిష్ఠురంబు లగుచు న్భాసిల్లుఁ జు మ్మంఘ్రిప
ల్లవపీఠానతశాత్రవా సురభిమల్లా నీతివాచస్పతీ. 55

మ. అసువు ల్పోవుతఱి న్సఖు న్సయితము న్యాచింపఁ డాపద్దశన్
విసువం డెత్తఱిఁ బాప మన్నఁ జొరఁ డెందే సల్పు న్యాయార్జనం
బు సదాచార మొనర్చు నీచు నడుగ న్బోఁ డెందు నేర్చె న్బుధుం
డసిధారావ్రత మింతయు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 56

మ. ఒసఁగున్ గుప్తముగా గృహాగతుఁ బ్రియం బొందించు మేల్చేసి మా
నసమేతుం డగు నన్య మేలు సభల న్వ్యాఖ్యానము న్సల్పుఁ గ్రొ
వ్వెసలారండు సిరిం బరుం దెగడఁ బోఁ డెచ్చోట నేర్చె న్బుధుం
డసిధారావ్రత మింతయు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 57

మ. అడఁగు న్దోయము తప్తలోహపతితంబై పద్మినీపత్రమం
దిడిన న్ముత్తెముభంగి నుండు మణి యై యేర్పా టగు న్శుక్తిలోఁ
బడి యందే ఖలమధ్యమోత్తములకు న్బాటించు మే లిట్ల యై
యడరున్ జుమ్ము గ్రమంబుతో సురభిమల్లా నీతివాచస్పతీ. 58

మ. జనకు న్బ్రోచినవాఁడు పట్టి పతికి న్సంప్రీతి గావించునం
గన యిల్లాలు సుఖాసుఖంబుల సమాకారక్రియుం డాప్తుఁ డెం
దును బుణ్యాత్ముల కిట్టి మూఁడువహులు న్లోకంబులోఁ జేకుఱున్
హనుమత్కేతనవిక్రమా సురభిమల్లా నీతివాచస్పతీ. 59

మ. పరకార్యంబు లొనర్పఁగాఁ దనపను ల్పాటిల్లు నోర్వ న్ఖలో
త్తరు లౌమూర్ఖులపెం పరున్ బరుచరిత్రల్ మెచ్చ నాత్మీయ హా

చరితం బెన్నిక కెక్కు నమ్రు లయిన న్సర్వోన్నతత్వస్థితుల్
జరగుం దజ్ఞుల కెట్లొకో సురభిమల్లా నీతివాచస్పతీ. 60

---

## పరోపకారపద్ధతి

శా. న్యాయం బొప్ప ఫలించియుం న్మహిజము ల్నమ్రంబు లై కన్పడుం
తోయంబు న్గొనియు న్విదూరముగ నుండు న్మేఘ మత్యున్నత
శ్రీయుక్తుం డయియున్ వినమ్రతఁ బ్రవర్తిల్లున్ బుధుం డార్య లో
హా యీదృక్చరితు ల్గదా సురభిమల్లా నీతివాచస్పతీ. 61

మ. చెవికిం గుండల మొప్పు గాదు శ్రుతమే చేదమ్మికి న్గంకణం
బు విభూషార్థ్యము గాదు దానమె మహా న్పుణ్యాత్ము నెమ్మేనికిన్
ప్రవిలేపంబులు గావు సొమ్ము నుపకారప్రౌఢియే నిక్కమౌ
లవితేంద్రాతిగవైభవా సురభిమల్లా నీతివాచస్పతీ. 62

మ. జలజాతంబులు వేడెనే రవి వికాసం బొందఁగాఁ జేయఁ గ
ల్వలు ప్రార్థించెనె చందమామ యనువేలం బొప్ప రంజించు లో
కులు లంచం బిడిరే మఱి జ్జలము మేఘుం డిచ్చుఁ బుణ్యాత్మకుల్
దలఁప న్విశ్వహితక్రము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 63

మ. తమయర్థంబు త్యజించి కూర్తురు పరార్థం బుత్తముల్ మధ్యముల్
తమయర్థం బఱుకుండఁ గూర్తురు పరార్థంబుల్ పరార్థంబు స్వా
ర్థముకై త్రుంతురు మర్త్యరాక్షసులు వర్థం బల్గి యన్యార్థముల్
సమయం జేయ మనుష్యులే సురభిమల్లా నీతివాచస్పతీ. 64

మ. సమయం బైన నొసంగు మే ల్దెలుపు దోషంబుల్ నివారించు నా
చ్చెము దాఁచుం బ్రకటీకరించు గుణము ల్పేదప్పడ్డవేళ న్విడం
డు మహామిత్రు నిచంద మిట్టు లనుచు న్సూచించి రార్యోత్తముల్
సమరక్ష్మాతలఫల్గునా సురభిమల్లా నీతివాచస్పతీ. 65

మ. మును త న్గూడిననీళ్లకున్ నిజగుణంబు ల్పాలిడున్ బాలు గ్రాఁ
గు నెడ న్వాని సటించి యజ్జలము గ్రాఁగున్ దానె తన్మిత్రవా
శనము న్గన్గొని వహ్నిఁ గూలఁ జనుఁ బా ల్శాంతం బొనర్చున్ జలం
బనయం బిట్టివి సఖ్యము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 66

మ. ఒకచో వెన్నుఁడు పవ్వళించె నొకచో నున్నారు దైత్యేంద్రు లొం
డొకచో శైలచయంబు నిల్చె నొకచో నుగ్రానలంబుల్ బలా
హకము ల్వర్తిలె నెంత భారసహుఁ డాహా ధన్యుఁ డాసింధుపా
లకుఁ డైశ్వర్యపురందరా సురభిమల్లా నీతివాచస్పతీ. 67

మ. మహి సర్వంబు ధరించుకూర్మపతిజన్మం బొప్పగు న్నిందటన్
గ్రహచక్రంబు భ్రమింపఁ జేయుధ్రువుజన్మం బొప్పగున్ వైరిజా
బహవః యన్యులు వ్యర్థపక్షకు లజాండోదుంబరాంతస్థలా
న్వహజాతాంతరితక్రిము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 68

మ. అమదుండై కలుషంబు లేక దయ సత్యం బొప్ప సత్కీర్తి గ
ల్గి మహాత్సేవ యొనర్చుచు న్స్వగుణము న్గీర్తింప కాశం ద్యజిం
చి మహి న్వైరుల కైన మేలె యిడుచు న్నిష్టక్రియుండై సుశీ
లమునన్ వర్తిలు జ్ఞాని శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 69

మ. ఒరులందు న్గుణలేశ మున్న నది యోహో యంచుఁ గొండంతఁ జే
సి రహి న్జెందు మహోపకారముల రక్షించు న్జగం బెల్ల న
త్యురుపుణ్యామృతపూర్ణవాఙ్మనసకాయుం డుండు నొక్కొక్కఁడె
ల్లరలోఁ బుణ్యశరీరి దా సురభిమల్లా నీతివాచస్పతీ. 70

---

## ధైర్యపద్ధతి

మ. మును రత్నంబులు వార్ధిఁ బుట్ట మది సమ్మోదాప్తియున్ జెంద దం
తనె హాలాహల ముద్భవిల్ల సురబృందం బార్తియున్ జెంద ద
న్నినకార్యంబు సుధార్థ మాట నది జన్మింప న్జనెన్ సజ్జనుల్
పని యీడేరక పోదురే సురభిమల్లా నీతివాచస్పతీ. 7

మ. పని గా నేర దటంచుఁ బూనక వెఱం బ్రాపింతు రంతే జడుల్
పనికి న్నేకొని విఘ్నలేశము జనింప న్మధ్యము ల్వీఁగి యం
తనె చాలింతు రనేకవిఘ్నతతు లుత్పన్నంబు లైన న్ఘనుల్
పని సాధింతురు పూనిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 72

శా. నేల న్మంజులశయ్యయందు నయినన్ నిద్రించు వేడ్క న్స్వఖర
చ్చేలం జీనియుం బొంతయేని సరిగాఁ జింతించి పైఁ దాలుచు
శ్శాలీయాశన మైనఁ గూర యయినన్ భక్షించు ధీరాత్ముఁ డే
లా లోఁగున్ సరసాగ్రణీ సురభిమల్లా నీతివాచస్పతీ. 73

మ. నయశాస్త్రజ్ఞులు తిట్టనీ పొగడనీ నానాటి కైశ్వర్య మ
క్షయమై వర్తిలనీ కరం బణఁగనీ కాయంబు వోనీ తిరం
బయి భాసిల్లఁగ నీ స్వధర్మము విడ న్వాంఛింప రత్యుత్తముల్
దయమానాక్షికుశేశయా సురభిమల్లా నీతివాచస్పతీ. 74

శా. ఏపుణ్యాత్ము నలంప లేవు మహి నెందే నింద్రియార్థంబు లా
శాపాశంబులు రోషవహ్నిశిఖలుం గామాద్యగస్త్రవ్రజం
బాపుణ్యాత్ముఁడె పో జగత్త్రయ మనాయాసంబున న్గెల్చువాఁ
డాపూర్ణప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 75

శా. ధీమంతు ల్వ్యధిదుర్విపాకమున నార్తిం జెందియుఙ్ ధీరతా
సామగ్రిం ద్యజియింతురే శిఖిశిఖాజాలం బధోగామి యా
నే మర్త్యు ల్తలక్రిందుగాఁ గొనిరయేనిఙ్ భాగ్యసౌభాగ్యలీ
లామందీకృతవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 76

మ. తనసద్ధర్మముఁ దప్పకన్న గిరిమూర్ధం బెక్కి దేహంబు తు
త్తునియ ల్గా మహిఁ బడ్డ మేలె శిఖియందు న్జొచ్చిన న్మేలె పం
బినకాలాహిమొగానఁ గే లొసఁగిన న్మేలే సుమీ యాజిఖే
లనగాండీవశరాసనా సురభిమల్లా నీతివాచస్పతీ. 77

మ. ఘన మాశీలము గల్గుధీరులకు సింగంబు ల్మశప్రాయముల్
వనరాసు ల్చిఱుగాలువ ల్ఫణులు మాల్యంబు ల్మహోగ్రాగ్ని చ
ల్లనితోయంబు విషద్రవంబు సుధ శైలశ్రేష్ఠ మల్పోపలం
బనవద్యోదయభాసురా సురభిమల్లా నీతివాచస్పతీ. 78

మ. పయిపైఁ గొమ్మలుగొట్టిన న్మరి యిగుర్పఙ్ జూడమా మ్రాఁకులఙ్
క్షయము న్బొందియుఁ బెండియుఙ్ గళలు గాంచ న్జూడమా చంద్రు నెం
తయు దైవం బనుకూల మౌఁ బ్రమద మంద న్గాంతు మంచు న్ఘను
ల్భయము న్జెంద రొకప్పుడు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 79

మ. తప మక్రోధత సౌమ్యత న్సిరి మహత్వం బోర్మి ధర్మంబు ని
ష్కపటత్వంబున బల్మి మానమున శాస్త్రశ్రీ వినీతి న్ధనం
బు పవిత్రార్పణ జ్ఞానలక్ష్మి ప్రశమస్ఫూర్తి న్సమస్తంబు శీ
లపరత్వంబున శోభిలు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 80

## దైవపద్ధతి

మ. గురుఁ డాచార్యుఁడు వజ్ర మాయుధము లేఖు ల్సేన పైదిక్కు శ్రీ
హారి స్వర్లోకము పాళెపట్టు ద్విరదం బైరావతం బిట్టియ
చ్చెరు వౌసాధన ముండియు న్మఖవుఁ డాజి న్బాఱు దైవంబు లే
కరయం బౌరుష మొప్పునే సురభిమల్లా నీతివాచస్పతీ. 81

మ. అశనాపేక్షఁ గరండము న్గొఱికి డాయ న్మూషిక న్మింగి త
త్పిశితప్రాశనతృప్తమై యరిగె నెందేఁ బెట్టెలోపాము త్షు
త్కృశత న్బాసి సుఖాసుఖంబులకు నుర్వి న్దైవమే కారణం
బళధస్వచ్ఛమనోజ్ఞ. శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 82

మ. పడి యాశుక్రియ లేచుచెండుకరణి న్భంగంబుఁ బ్రాపించియున్
వడిమైఁ గార్యము చక్కఁబెట్టుకొను విద్వాంసుండు మృత్పిండమ
ట్లడఁగు న్గాని యపండితుండు పతితుం డై లేవఁగా లేఁడు త
ల్లడపా టొందుచు ధాత్రిలో సురభిమల్లా నీతివాచస్పతీ. 83

శా. ఎండల్ నెత్తి తపింప బట్టతలవాఁ డొందే నిలన్ నీడఁ గూ
ర్చుండన్ దాళకుజంబుక్రింది కరుగన్ బ్రోత్కంపమై దానియ
ప్పం డవ్వేళనె తెప్పున న్బయిఁ బడె న్బ్రాణంబు వో దుర్దశ
ల్దండం బాయునె డాగిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 84

మ. రవిశీతాంశుల కావిధుంతుదునిచే నార్తిల్లి గన్న న్భుజం
గవిహంగద్విరదేంద్రబంధనవిధు ల్గన్గొన్న విద్వజ్జనుల్
భువిలో యాచకులై చరించెడివిధంబు ల్చూడ దైవంబె చా
ల వరిష్ఠం బని తోఁచెడి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 85

మ. మహికి న్భూషణమై మహత్త్వములకు న్బట్టైనరశ్రేష్ఠునిన్
మహి నిర్మించి యనంతకాలము ఘనస్థానీఁడు లోకేశ్వరుం
డిహహా యంతకు నీతి పెంపొసఁగఁగా నేలా వృథా గాక బా
లవారిద్వాహసమద్యుతీ సురభిమల్లా నీతివాచస్పతీ. 86

మ. ఉరుతేజోనిధి హేళి చంద్రపరిభుక్తోన్ముక్త మైనట్టి యం
బరఖండంబె గ్రహించి వర్తిలుఁ బగ ల్పద్మారియు న్రేయిఁ గ్ర
మ్మఱ నేతెంచి గ్రహించుఁ దా నదియె యున్మాలిన్యము న్బాయ లే
రరయ న్వారలు సైతమున్ సురభిమల్లా నీతివాచస్పతీ. 87

మ. క్షితి మృత్యుంజయసంశ్రితుం డయి సముత్కృష్టామృతస్థాన మై
సతతం బోషధినాథుఁడై శతభిషక్సంసేవ్యుఁ డై యొప్పుచుం
డుతుషారాంశుని రాజయక్ష్మ విడ దెందుర్ దైవపాకం బన
ల్పతరం బేరికి శక్యమే సురభిమల్లా నీతివాచస్పతీ. 88

మ. అమలజ్ఞానుని వెఱ్ఱిదైవము వృథాయాసంబుచేఁ జిత్తదో
షము పొందించుట కాపద ల్సలిపిన న్సల్పంగనీ కల్పనా
శమునం దేని కలంగునా యతఁడు నిస్సారంబు లౌసత్త్వశై
లములు న్వారిధులుం బలెన్ సురభిమల్లా నీతివాచస్పతీ. 89

మ. ప్రభు వౌ దైవము మేర చేసినది దప్పన్ బాఱి హెచ్చుబ్బునే
విభవం బాధ్యులఁ జేసినంతటనె ప్రావృడ్వారిదం బెల్లచో
నభివర్షింపఁగఁ జాతకంబునకు నాల్గైదంబుబిందు ల్గదా
లభియించు న్మొగ మెత్తిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 90

---

## కర్మపద్ధతి

మ. విధిచేఁ గాని సుర ల్తమంతనె ఫలావిష్కారకు ల్గారు త
ద్విధి యన్నన్ నియతక్రియాఫలద మర్వి న్దత్ఫలం బన్నఁ గ
ర్మధురాయత్త మిటౌటఁ జేసి భజనార్హం బౌచుఁ గర్మంబె య
త్యధికం బై ప్రవిభాసిలు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 91

మ. అజు బ్రహ్మాండఘటాళి సల్ప ఘటికారాచార్యుఁ జేసె న్వృష
ధ్వజు భిక్షాటకుఁ జేసె సూర్యు భ్రమణవ్యాసంగిఁ గాఁ జేసె నం
బుజనాభున్ వివిధావతారతరళాత్ము న్జేసె నక్కర్మ మె
ల్లజనశ్రేణి కలంఘ్య మా సురభిమల్లా నీతివాచస్పతీ. 92

మ. ఘను నత్యల్పునిఁగా వివేకి జడునింగాఁ జెంత దూరంబుగాఁ
ననవద్యామృతము న్విషంబుగ సఖు న్బ్రాణాపహుంగా నొన
ర్చు నహో కర్మము దాని మాని మరి దుర్బుద్ధు ల్గుణౌఘోపలా
లనము న్గోరుదు రేలొకో సురభిమల్లా నీతివాచస్పతీ. 93

మ. శుభకర్మంబు కలంతసేపు దయిత ల్శుద్ధాంతము ల్ఛత్రముల్
సుభటౌఘం బది దీఱిన న్సకలము న్సూత్రంబు విచ్ఛిన్న మై

న భువి న్జైందినము త్తియంబులగలిక్ నానావిధం బౌను వ
ల్లభతారంజితభూజనా సురభిమల్లా నీతివాచస్పతీ. 94

మ. అగుణంబేని గుణాఢ్యమేని యొకకార్యం బెద్ది యైన న్మదిక్
ముగియ న్యోచనఁ జేసి పూనఁగఁ దగు న్బూన్కిప్రయోగోత్పాదితం
బగునేనిక్ గడగండ్లు గాక యధికం బౌచిత్తశల్యం బగుక్
లగదత్యుజ్జ్వలసద్గుణా సురభిమల్లా నీతివాచస్పతీ. 95

మ. ఘనసారంబునఁ గోద్రవావృతి యొసంగ న్రత్నభాండంబు చం
దనదారు ల్గాని తెల్కపిండి దగ వండం బైడినాగంట దు
న్ని నెఱి న్దూదికి నాట జిల్లెడులు చింతించు న్మహిం బుట్టి పు
ణ్యనిరీహుం డగువాఁడు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 96

శా. ప్రావీణ్యంబుల రావు బల్ చదువులక్ రా వన్వవాయంబులక్
రా వుర్వీశ్వరనిత్యసేవకతన న్రా వుజ్జ్వలాకారతక్
రా వేనాట ఫలించు వృక్షముగతి న్సత్కర్మ మైశ్వర్యముల్
తాపై నాటికిఁ జేకుఱు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 97

మ. మునుఁగు న్గాక పయోధిలో రిపుచయంబు న్గెల్చుఁగా కెట్టులేక్
వినువీథి న్జన నేర్చుఁ గాక కృషివాణిజ్యాదులం బొర్లు గా
క నిలింపాచల మెక్కుఁ గాక చదువు ల్కైకట్టుఁగా కెచ్చు రా
దనయం బున్నది పోదు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 98

మ. అనియందు న్వనియందు దావశిఖియం దంభోధియం దద్రిసా
నునికాయంబులయందు శత్రుతతియందు న్సుప్తు నైన న్బ్రమ
త్తుని నైన న్విషమాసనస్థు నయిన న్దోడై సుకర్మంబు పా
లనము న్జేయు జనావళి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 99

మ. భయదారణ్యము రాజధాని యగు భూభాగం బశేషంబు ర
త్నయుతంబై కనిపించు నెల్లజనులు న్సన్మిత్రులై కొల్తు రెం
తయుఁ దొల్తే నను బెట్టి పుట్టినమహాత్మశ్రేష్ఠి కిష్టార్థ మె
ల్లయెడ న్గల్గు సుఖంబున న్సురభిమల్లా నీతివాచస్పతీ. 100

నీతిశతకము సమాప్తము.

# శృంగారశతకము

## స్త్రీప్రశంస

శా. శ్రీమత్సోమవతంసపంకజభవశ్రీనాథుల న్నిత్యమున్
భామామందిరకుంభదాసుల నొనర్ప న్జాలెనే మేటిజో
దామీనాంకుఁడు వాగగోచరచరిత్రాళీపవిత్రుండు పూ
ర్ణామోదం బొనరించుత న్సురభిమల్లా మానినీమన్మథా. 1

మ. కులుకున్జిన్నియ లోరలేసొగసుఁజూడ్కు ల్కుల్కులీల ల్వగల్
పొలయల్క ల్భయము ల్విముగ్ధవచనంబుల్ వ్రీడయు న్హాసకం
దళము ల్నాఁ గలసర్వభావములచేత న్గాదె చెల్వంపుఁజె
ల్వలు లోఁజేయుదు రెల్లర న్సురభిమల్లా మానినీమన్మథా. 2

మ. బొమ లాడించుచుఁ బ్రౌఢిఁ జూచుఁజిగిచూపు ల్నిద్దపున్ముగ్ధవా
క్యము లంతంతట సిబ్బితిం దొలఁకుహాసాంకూరముల్ మందయా
నము లొయ్యారము నిల్పునంగనలకున్ సర్వాంగశృంగారమై
యమరు న్శౌర్యమునై తగు న్సురభిమల్లా మానినీమన్మథా 3

శా. సారె న్సిగ్గున వ్రాలుచు న్బెలుకుచున్ సారె న్వెఱ న్దేలుచున్
సారె న్గోపముచే బొమ ల్ముడివడ న్వర్తింపుచు న్బొల్చుత
న్వీరత్నంబులదృగ్విలాసములచే నీలాబ్జముల్ చల్లిన
ట్లై రాజిల్లుఁ జుమీ దిశ ల్సురభిమల్లా మానినీమన్మథా. 4

మ. అళుల న్మెచ్చనిసోగపెన్నెఱులు ఫుల్లాబ్జంబులన్ నవ్వుక
న్నులు దంతావళికుంభలక్ష్మి గలచన్ను ల్చంద్రు నీడౌ మొగం
బులు సత్కాంచనకాంతి తీయపలుకు ల్పొల్పొ నితంబంబు బా
లలకు న్బట్టనిసొమ్ము లౌ సురభిమల్లా మానినీమన్మథా. 5

మ. నుడువ న్బోయిన నంతయు న్సొగసె చిందు న్జూచిన న్బెళ్కులున్
బెడఁగుల్ ప్రోవగు మౌగ్ధ్యసమ్మిళితమై పెంపొందు మందస్మితం
బిడిన న్జెన్ను దలిర్చు నొయ్యఁ జన నందే నింతికి న్వింతరం
గడరున్ బ్రాయము వచ్చుచో సురభిమల్లా మానినీమన్మథా. 6

మ. విన భామామణిపల్కులు న్ననఁగొన న్భ్రేమాంచితం బైనయా
ననము న్మారొల్కని వక్త్రమారుతము నావ న్మోవియుం న్మేనఁ జే
ర్పు సుదారం బగుమే న్దలంచుకొన లేఁబ్రాయంపుటొయ్యారముల్
ఘను లావారి కభీష్టము ల్సురభిమల్లా మానినీమన్మథా. 7

మ. మొలనూల్గంటలు హస్తకంకణచయంబుల్ పాదమంజీరముల్
ఘలుఘల్లంచు మరాళపాళికి మనఃకంపం బొనర్ప న్నము
త్కళికన్ డాయుచు లేడిచూపుల వశు ల్గాఁ జేకొన న్జాలరే
లలనారత్నము లందఱు న్సురభిమల్లా మానినీమన్మథా. 8

శా. ఆసాంద్రం బగుకుంకుమ న్సరసమానంగంబుతోఁ బాదవి
న్యాసప్రస్వనరత్నహంసములతో వారాళి చన్దోయిపై
భాసిల్లంగ మెలంగునంగనలకున్ భావస్పృహా న్యాభజనుల్
దాసు ల్గా కెటుఁ బోదురే సురభిమల్లా మానినీమన్మథా. 9

మ. సుకవు ల్మాధులెపో హిహీ యబల లంచు న్నాభమల న్నారసా
రెకు వర్ణింతు రదేమి వా రబలలా దృగ్దేశమాత్రంబునన్
జకితస్వాంతులఁ జేసి రింద్రముఖులన్ సైతంబు బాహాగ్రలో
లకృపాణీనిహతాహితా సురభిమల్లా మానినీమన్మథా. 10

శా. నాకు న్జూడఁ బ్రసూనకార్ముకుఁడు కాంతాకోటికి న్భంటు సు
మ్మీ కాకున్నఁ గటాక్షసంజ్ఞలనె కామిశ్రేణి నెల్లన్ దదా
జ్ఞాకారిత్వముతో మెలంగ నిడునా సంసూచితోద్యోగుఁ డై
యాకల్పస్థిరవైభవా సురభిమల్లా మానినీమన్మథా. 11

మ. ధ్రువముక్తాశ్రయముల్ కుచంబులు ఘనశ్రుత్యంతసంవ్యాప్తి క
న్గవ స్వచ్ఛద్విజయుక్త మాస్యము కచౌఘంబుల్ సదాసంయముల్
నవలామే నిటువంటిశాంతరసవంతం బయ్యు రాగావహం
బవు టాశ్చర్యము ధారుణి న్సురభిమల్లా మానినీమన్మథా. 12

మ. అతిచిత్రం బగునిట్టికార్ముకకళాభ్యాసంబు సీమంతినీ
తతు లెచ్చోట నెఱింగిరో విశిఖబృందం బెన్నఁడు న్బట్ట రా
తత మైనట్టిగుణవ్రజంబున నె చిత్తంబుల్ విభేదింతు రె
ల్లతఱి న్గాముకకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 13

శా. భ్రూరేఖ ల్చలము ల్స్వభావచపలంబు ల్నేత్రము ల్మోవి యెం
తే రాగాస్పద మింతిచన్నుఁగవ యుద్వృత్తంబు పెల్లేచుఁబో

మారాష్ట్రస్తశుభాక్షరాళిసమమై మధ్యస్థత న్బొల్చునా
గా రెట్టేచు విచిత్రమో సురభిమల్లా మానినీమన్మథా. 14

మ. ఘనతారాగ్రహబృంద మున్న మణివర్గం బున్న దీపంబు లు
న్న నిశానాయకుఁ డున్నఁ దమ్మిచెలి యున్నన్ వెండి యే మున్న నే
మనయంబు న్ప్రియభామినీవిరహితుం డౌవానికి న్లోక మె
ల్లను బెంజీకటి గాఁగఁను న్సురభిమల్లా మానినీమన్మథా. 15

మ. కరయుగ్మంబులు పద్మరాగములు వక్త్రంబుల్ మనోహారిచం
దిరకాంతంబులు కుంతలంబులు మహానీలంబులు న్గావునన్
స్థిరుణం ద్రత్నమయంపుబొమ్మలు సుమీ తథ్యంబుగా భోజతు
ల్యరసజ్ఞత్వసువిశ్రుతా సురభిమల్లా మానినీమన్మథా. 16

మ. గురుభారంబున వర్తిలు న్పటువుఁ జన్గుబ్బల్ పదంబు ల్కనై
శ్చరభావంబున భాసిలున్ నిజము భాస్వద్భావము న్దాల్చి పా
ల్చు రహి న్వక్త్రసరోజము ల్గ్రహమయల్ సుమ్మీ వినీలాలక
ల్హారపాదాంబుజభృంగ శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 17

మ. అదిరా యెంత ఘనంబు జవ్వనిపిఱుం దౌరౌర వక్షోజముల్
వదనం బర్షురె యంచుఁ జిత్తము వృథా వాదంబుచేత న్దపిం
పదు పుణ్యంబు లొనర్చువారికి మహాభాగ్యోపభోగంబు గ
ల్గదె పుణ్యంబు లొనర్చిన న్సురభిమల్లా మానినీమన్మథా. 18

మ. కొమరుం బ్రాయపుఁజెల్వపుఁ న్బొగరు మేకొల్పు న్నటాటోపసం
భ్రమముల్ చూపుచు బొల్చు కాంతలయొయారంబు ల్వికారప్రదీ
పములై రమ్యములై మనోజు గెలిపింప న్బాటకాండ్రై సుభా
వ్యములై చిత్రములై తగు న్సురభిమల్లా మానినీమన్మథా. 19

మ. ప్రమదోద్దీకములై క్రమశ్లాఘనసౌభాగ్యంబులై ముగ్ధము
గ్ధములై ప్రేమమనోహరంబులయి కందర్పప్రకాశంబులై
యమనోవాగ్విషయంబులై సదనురాగార్ద్రంబులై పూవుబోం
డ్లమృదూక్తుల్ చెలఁగు న్నతి న్సురభిమల్లా మానినీమన్మథా. 20

---

## సంభోగవర్ణనము

శా. నాళీకాహితతీవ్రతీవ్రకరకాండశ్రేణికి న్గాటుగాఁ
గేల న్పయ్యెదకొంగు పట్టుకొని సంక్రీడించు నుద్యానభూ

సాలచ్ఛాయల నిల్చుచున్ నిలుచుచుం జంద్రాస్య యొక్కర్తు లీ
లాలావణ్యసుధాంబుధీ సురభిమల్లా మానినీమన్మథా. 21

మ. విని వీక్షించినదాఁక ముచ్చటపడు న్వీక్షించి గాఢోపగూ
హనలాభం బగుదాఁకఁ గోర్కెపడు గాఢాలింగనం బబ్బినన్
దనుమధ్యామణి మేనితోడ నిజగాత్రం బప్రభిన్నంబు సే
య నెద న్గోరు జనుం డిల న్సురభిమల్లా మానినీమన్మథా. 22

మ. మఱిఁ గాశ్మీరజగంధచర్చయు సిగం బ్రత్యగ్ర మాజాజిదం
డయుఁ బై యౌవనవంత యైనచెలియున్ భాసిల్లఁగా నాసుఖం
బ యిల న్స్వర్గము గాక మీఁద ననుశబ్దం బప్రమాణంబు సు
మ్మయశోభీరుమనస్క శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 23

మ. తొలుత న్మేకొన కింతసేపు పెనఁగు న్బోడ్తోడ నాసక్తిమై
సలుపు న్నిబ్బితి వచ్చియు న్వలపమి న్నైస్సరించి యంత న్ధృతిన్
దొలఁగించున్ బ్రియముప్పతిల్ల రతులన్సొక్కించి యొంతే మనం
బలరించుం గులకాంత మే ల్సురభిమల్లా మానినీమన్మథా. 24

మ. తళుకుం జెక్కులు చెమ్మగిల్లఁ గచబంధం బూడి వ్రేలంగఁ డొ
య్యలి పుంభావ మొనర్చి బిట్టలసి నేత్రాంభోజము ల్మోడ్చి ని
శ్చలత న్వక్షముమీఁద వ్రాలినపు డోష్ఠం బానుధన్యాత్మకుల్
దలఁప న్భాగ్యఘనుల్ సుమీ సురభిమల్లా మానినీమన్మథా. 25

మ. ప్రమదావేశనిమీలితాక్షు లగుచు న్రాత్రిందివావారితో
ద్యము లౌచు న్మరి మేర లేనితమిచేఁ దర్పించుచున్ నిండుపే
ర్మిమయి న్సొక్కుచుఁ దేల్చు కేళికలె సుమ్మీ కామినీ కామిజా
లముపాలింటికి బ్రహ్మము ల్సురభిమల్లా మానినీమన్మథా. 26

మ. జర గన్పించియు మానవు ల్మదనచేష్ట ల్మానలేకుండినన్
దరుణు ల్చన్నులు వ్రాలియు న్మదనతృష్ణ న్బాయలేకుండినన్
బరమాత్ముండె యెఱుంగు నయ్యధికబీభత్సంబు నేఁ జెల్ల రే
యరిషడ్వర్గనివారణా సురభిమల్లా మానినీమన్మథా. 27

మ. అమితాశాజలరాశిలో మునిఁగి మర్త్యశ్రేణి యర్థార్జనో
ద్యమతం గ్రుమ్మరు నర్థ మేల యొలఁ బ్రాయం బెంతయున్ జన్నవె
న్క మనోహరిణు లౌచెలు ల్పలితయుక్త ల్గాకమున్నే స్వగే
హముఁ జేరం జను నిక్కమా సురభిమల్లా మానినీమన్మథా.

మ. ఘనసమ్మోహాపదం బనేకనరకోగ్రక్లేశసంపాది రా
గనిజస్థానము జ్ఞానచంద్రజలదౌఘం బంగజన్మప్రవ
ర్ధన మాపాదితదోషరాశి కొమరుంబ్రాయంబ దుష్కార్యజా
లనిదానం బిదియే సుమీ సురభిమల్లా మానినీమన్మథా. 29

శా. శృంగారద్రుమనీరదంబు వికటక్రీడారసౌఘంబు త
న్వంగీనేత్రచకోరచంద్రుఁడు ప్రవీణాలాపరత్నాబ్ధి స
ర్వాంగశ్రీనిధి కామబంధు వెలప్రాయం బిందు ధైర్యంబు ని
ల్పంగా శక్తుఁడె యోగి యా స్సురభిమల్లా మానినీమన్మథా. 30

మ. బటువుంజన్నులు చందమామతళుకుల్ప్రస్వానకాంచీలస
త్కటిలీల ల్గలజవ్వను ల్తవులు గాఁగాఁ గాక తత్త్వజ్ఞుఁడు
త్కటరాజన్యులపంచలం బడుచు నిస్త్రాణంపుసంసారప
ర్యటన న్గీడ్పడఁ జొచ్చునే సురభిమల్లా మానినీమన్మథా. 31

మ. ప్రియమై సిద్ధనిషేవ్యమై హరవృషక్రీడాంకమై గాంగతీ
ర్థయుతంబై చలిగొండ యుండఁగనె చేర న్లేక తజ్ఞు ల్పరా
శ్రయదైన్యంబుల నుండురెల్ల మృగచంచన్నేత్ర తామించుబోం
ట్లయొయ్యారంబులఁ జిక్కి సూ సురభిమల్లా మానినీమన్మథా. 32

మ. అరవిందాక్షులు మేటిపెన్దరఁగల ట్లై యడ్డగింపంగ దు
స్తరమై యుండెడుఁ గాక చుల్కన దరించ న్రాదె సంసారసా
గర మేమాత్రపుదూరపార మిది లోకశ్రేణి చూడ న్మనో
హరసౌభాగ్యవిభాసురా సురభిమల్లా మానినీమన్మథా.

మ. మలల న్లేళ్ళకు నంది యీఁదగు శితాశ్మ చ్ఛిన్నమూలంబు లై
యొలమి న్బోళ్ళిలు దర్భపుంజములు కా దేనిన్ నఖచ్ఛిన్నముల్
తెలనాకున్మడపు ల్వధూజనుల కెంతే నంది యీయ న్దగున్
లలితాంతర్భవనంబుల న్సురభిమల్లా మానినీమన్మథా. 34

మ. గడు సౌఖ్యక్కఁడు నిత్యదూష్య లనుచు న్గంజాక్షుల న్రోయనీ
వెడవాదంబుల కేమి నామదికి భావింప న్సతి న్బోళ్ళల ని
ప్పుడమి న్గామితవస్తువు న్బరహితంబు న్బోళ్ళఁ బుణ్యంబు లే
దడర న్భోగపురందరా సురభిమల్లా మానినీమన్మథా. 35

మ. మది మాత్సర్యము మాని నిశ్చయగతి న్నాన్యు ల్విచారించి చె
ప్పుదు రిమ్మర్త్యుల కాశ్రయింపఁగ మహాభూభృన్నితంబాళి మం

చిది లే దేని వధూనితంబతలము న్నైవ్యంబు లంచున్ నిమీ
లదరాతీశ్వరవైభవా సురభిమల్లా మానినీమన్మథా. 36

మ. చలనప్రాయము స్వల్పసార మగుసంసారంబున న్బుద్ధిమం
తులకు న్రెండుగతు ల్సుమీ యుచితము ల్శంభత్ప్రబోధామృతో
జ్జ్వలసంసేచన మేని వృత్తకుచయోషామారగేహస్థలీ
లలితస్పర్శన మేనియు న్సురభిమల్లా మానినీమన్మథా. 37

మ. నియతుండై జనుఁ డాశ్రయింపఁగఁ దగు న్విశ్వాఘసంహారి యై
నయమర్త్యాపగవారిచేరువల నైనన్ హారియు న్జిత్తహా
రియు నాస్త్రీచనుదోయి నైన నివి ధాత్రి న్భూరిచేతస్సుఖో
దయసంసిద్ధికి హేతువు ల్సురభిమల్లా మానినీమన్మథా. 38

మ. విను మింక న్బనుజోలి రిత్తచదువుల్ వేయేల నీవిశ్వభూ
జనసంఘంబునకు న్మదాలసలసత్స్ముగ్ధకాంతాసుయా
వన మైన న్గమియావనం బయిన సేవాయోగ్యము ల్రెండె సు
మ్మనిశప్రాభవభాసురా సురభిమల్లా మానినీమన్మథా. 39

మ. నిజ మోహో నిజ మొక్కమాట యిదె విన్పింతు న్యథార్థంబు స
ర్వజగజ్జీవులకు న్మనోహరవయస్సంపన్న లైనట్టివా
రిజపత్రాక్షులె సుమ్ము సమ్మదము నార్తి న్జేయు పెన్హేతువుల్
భజమానార్యసురద్రుమా సురభిమల్లా మానినీమన్మథా. 40

---

## కామినీగర్హణము

మ. చనుబంతు ల్పిఱుఁదు ల్ముఖాబ్జము బొమ ల్నేత్రాకాంతియు న్గన్నుదో
యి నిరీక్షించి యశౌచపున్ప్రతిమ నెంతే నాఁడుదానిన్ నుతిం
చును సొక్కు న్రమియించు సంతసపడు న్సుజ్ఞాని నైతంబు మో
హనివేశం బవు రార శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 41

శా. హృత్తాపం బొనరించు విన్న మరి సంవీక్షించినన్ దద్దయున్
జిత్తోన్మాద మొనర్చు నంతట సమాశ్లేషంబు గావించినన్
మత్తున్సేయుం మరాళయాన ప్రియ యన్వాక్యంబు లెట్లోకొ వ
ల్లత్తేజీవ్రజఘాటికా సురభిమల్లా మానినీమన్మథా. 42

మ. అమృతంబు న్విషము న్మెలంతయె సుమీ యారెండు నెట్లన్న న
గ్రమున న్వర్తిలునంతసేపు నమృతాకారంబున న్దోఁచు ని

క్కముగా దగ్గఱఁ బాసె నేని మఱి యుగ్రంబైన క్ష్వేళంబు లీ
ల మది న్దాప మిడం జుమీ సురభిమల్లా మానినీమన్మథా. 43

మ. ప్రమదం దప్పు నొకించుకం తమృతము న్బ్రాపింప డెంతే విషం
బమర న్బోలదు శక్తిచే నమృతవర్తి న్బేర్చు నానాగతిన్
దమి లేకుండినయంతనే విమలతై దారించు నిస్సారి యై
యమితోదార గభీర శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 44

మ. గరువంబుం గపటంబు సాహసము దుష్కర్మం బవిశ్వాసమున్
దిరమావంచన సందియంబును మన స్వీఁడైన స్త్రీయంత్రమున్
నరకద్వారముఖంబు స్వర్గసుఖవిఘ్నంబు న్జగత్పాశవ
ల్లరి నెవ్వాఁడు సృజించెనో సురభిమల్లా మానినీమన్మథా. 45

మ. కవు లొత్రింతురు గాక చందురుఁడె వక్త్రం బబ్జయుగ్మంబె క
న్గవ బంగారుసలాక నై నదియె త్వఙ్మాంసాస్థిరూపంపు మే
ను వితర్కింపఁగ దుర్వివేకులు రహిన్ భోగింత్రు రే లెల్లనే
ల విమూఢాత్మకులై రొకో సురభిమల్లా మానినీమన్మథా. 46

మ. అళి స్వాభావిక మైనరాగమున నాహ్లాదింపుచు న్వారిజం
బులయందు న్భ్రమియించుచందమున నమ్మూఢుండు పంకేజనే
త్రలనై సర్గికవిభ్రమంబులకుఁ జేతః ప్రీతిఁ గావించి దా
నలరు న్దేరకుఁ దేరఁగా సురభిమల్లా మానినీమన్మథా. 47

శా. రాకాశీతమయూఖలీల నమృతప్రాయం బగున్ దొల్తనో
హో కాంతామణి మోము భూజనుల కత్యుల్లాసదం బౌచుఁ గిం
పాకత్వాజఫలంబు నై వడి విషప్రాయం బగు న్బిమ్మటన్
వ్యాళ్యాప్తాసుఖ మాచు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 48

శా. ఘోరంబై త్రివళీతరంగమయి వక్షోజస్ఫురత్కోక మై
ధీరత్వద్రుమభంజియై దగుసుగాత్రీవామ మానేట సం
సారాంభోధి మునుంగ నొల్లనిసుధీశాలుఱ ల్ప్రవేశింప రు
గ్రారిస్తోమత మోరపీ సురభిమల్లా మానినీమన్మథా. 49

మ. అభిరామంబుగఁ జూతు రొక్కని మదిన్ ధ్యానింతు రొం డొక్కనిన్
నిభృతప్రేమనివేదికస్మితముల న్వేరొక్కవిన్నాణితో
నభిభాషింతురు దుర్మతు ల్లలరువాస్య ల్వారి కెవ్వాఁడు వ
ల్లభుఁడన్ దా ననువాఁడు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 50

మ. నవలాపల్కులఁ దేనె లుండు మదిలోన న్హాలకూటంబ యుం
డు విశేషజ్ఞుఁడు దానఁ జేసియెకదా నోరూరుచు న్మోవి గ్రో
లి వెస న్వక్షము ముష్టిఘట్టనలఁ దాడించు న్సదా కేళివే
ళ విపశ్చిత్సురభూరుహా సురభిమల్లా మానినీమన్మథా. 51

శా. కన్పించు న్విషమత్వ మేర్పడి కటాక్షంబు ల్విషజ్వాలలై
తన్వాచక్కదనంబు పెన్పడగలై తన్వంగి సర్పాకృతిన్
మాన్ప న్వచ్చు స్వభావసర్పవిషము న్సన్మంత్రము లై వైద్యముల్
మాన్ప న్లే విది మూర్కొనె న్సురభిమల్లా మానినీమన్మథా. 52

మ. మరుఁ డజ్జాలరివాఁడు భూజనము లన్మత్స్యంబుల న్భాసురా
ధరమాంసగ్రథితంబు లౌ నవలతాతన్వంగు లన్గాలముల్
గరిమ న్సంసరణాబ్ధిలోఁ బఱపి యాకర్షించి రాగాగ్నిఁ బెం
పరుగ న్వేర్చు నజస్రము న్సురభిమల్లా మానినీమన్మథా. 53

మ. స్తనదుర్గంబులచే దురంత మగు కాంతాదేహకాంతారభూ
మి ననంగుం డనుదొంగ తావుకొని కామిశ్రేణిచిత్తవ్రజం
బను పాంథావళి నడ్డగించుకొని ధైర్యప్రౌఢి యన్విత్త మె
ల్లని మేహార్థములోఁ గొను న్సురభిమల్లా మానినీమన్మథా. 54

మ. చలమై వ్యాయతమై యరాళమయి భాస్వత్తేజమై భోగియై
నలుపై యొప్పెడుభామినీనయన మన్సర్పంబు మూర్కొన్న ప్రా
ణులకు న్వైద్యము లేదుగాని కల వెందు న్వైద్యము ల్తక్కు చి
ల్వలు మూర్కొన్న జనాళికి న్సురభిమల్లా మానినీమన్మథా. 55

మ. సరసీజాస్యలమేనితావియుఁ గుచస్పర్శంబు వృత్తంబు నో
ష్ఠరసంబు న్మృదుగీతము న్మరపి యాస ల్బాపి యీలోకులన్
బరమార్థంబు నెఱుంగలేనిచెడుగు ల్పంచేంద్రియంబు ల్హారీ
వారి యొప్పింపఁ దొడంగెఁగా సురభిమల్లా మానినీమన్మథా. 56

మ. అమలి న్గన్నులు ద్రిప్పఁ జేయుఁ గడు వింతౌ గాత్రభంగంబు వి
భ్రమవాక్యంబులు నెట్టుకొల్పు మదనాపస్మార మేకాంతిరూ
పము లేమంత్రము లేమహౌషధము లాపాదించిన న్మాన దు
ల్ల మలఁచు న్జనకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 57

మ. అవిటైన న్జడుఁ డైనఁ బంగయినఁ జీకైన న్మహారోగియై
న విమూఢాత్మకుఁ డైన రోఁఘుక మది న్సాకల్పలాభస్పృహన్

సువిలాసం బగు మే నొసంగు వెలయింతు లాభ్యగ్యలే జ్ఞానక
ల్పవనీవల్లికుఠారము ల్సురభిమల్లా మానినీమన్మథా. 58

మ. ప్రవిలాసాకృతిసంపద న్దరపయి న్భాసిల్లు వేశ్యాజనం
బు పలత్కామకృశానుకీల లగుచు న్బొల్పొందుచు న్విత్తముల్
నవతారుణ్యములు న్విటాళి హుతము ల్గావించిన స్జైకొనుక్
లవము న్జిక్కఁగ నీక శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 59

మ. అలరు న్గాక మనోహరంబు లయి వేశ్యావక్త్రము ల్దుర్విటా
దు లనేకు ల్చవి గ్రోలి గ్రోలి విడువ న్దూష్యంబు లైనట్టియెం
గిలిమూకు ళ్లవి యేల ముద్దుగొనఁ దర్కించు న్సలస్థానముల్
గలచారిత్రఘనుండు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 60

## సువిరక్తదుర్విరక్తవర్ణనము

శా. పంచాత్రించినగుబ్బచన్నుఁగవతో భాస్వద్వళుల్మీఁదఁ గ
న్పించ న్బొల్చునలంతిసన్నడుముతోఁ బెంపొందు లేఁబ్రాయపుక్
మించునోఁడిబెడంగుఁ జూచి మది గంపించంగ నీ కుండువాఁ
డంచద్ధైర్యఘనుం డిల న్సురభిమల్లా మానినీమన్మథా. 61

మ. చెలువ ల్సల్పువిలాసదృష్టిరచన ల్చిత్తంబులోఁ రోఁతఁగాఁ
దలఁచు న్గానలయందె గోర్కి యొసఁగు న్దా తౌల్యసమ్మోహముల్
దొలఁగించు న్దృణసన్నిభంబుగ జగత్తు న్జూచు వేఱొక్కఁ డై
యలరు న్శుద్ధవిరాగి శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 62

శా. ఏలా చూచెద రుజ్జ్వలజ్జ్వలము తౌద్రృష్టు ల్విచారించి యీ
లోలాక్షు ల్చెడుజంతువు ల్మదనభిల్లుం డేయుతీవ్రాస్త్రపుక్
జ్వాల ల్కాంతము లయ్యె మోహ ముడిగెక్ నా కేల పీండ్రింక నం
చాలోచించు విరాగి దా సురభిమల్లా మానినీమన్మథా. 63

మ. హరపాదాంబుజసక్తచిత్తు లగుసన్యాసు ల్విరికంపింతురే
తరుణు ల్నేర్పున నల్ల ముద్దు లొలుకక్ దర్శించిన న్గాకువ
ల్గురుతి న్గోవెల ప్రేలిన న్స్మరుఁడు దా గొడ్డేఱుచాపధ్వనుల్
శరమోక్షంబు నొనర్చిన న్సురభిమల్లా మానినీమన్మథా. 64

మ. హృదయంబు న్హృదయంబు సంగతము లౌ నేని న్వియోగంబుగా
దది యేదవ్వుల నుండిన న్స్మరి సమాధ్యానంబుతో నుండినక్

హృదయంబు న్మార్దయంబు భిన్నగతు లౌ నేని న్వియోగంబు సు
మ్మది ధాత్రీజనకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 65

మ. అచట న్ప్రేయసి యింతకు న్మదనబాణాపన్న యైపోయెనే
ని చనన్గాఁ బని లేదు లేక నియతి న్జీవంబుతో నున్న ము
న్నె చనంగాఁబని లే దటంచు మొయిలు న్వీక్షించి వైదేశికుం
డచలుం డై వసియించు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 66

మ. కృపయుక్ బ్రజ్ఞయు మైత్రియు న్నతులు గారే తత్సతీసంగమం
బుపయి న్లాలస లేక భంగురము లౌ పూబోండ్లపొందు ల్విమో
హాపరు ల్మెత్తురు కాలుఁ డేచుతఱిఁ దోడై కాచునే వాండ్ర చె
ల్వపుగుబ్బ ల్సనితంబము ల్సురభిమల్లా మానినీమన్మథా. 67

శా. యోగాభ్యాసతఁ జిక్కియాత్మయు మనం బుజ్జృంభ మామైత్రి చే
రాగిల్లంగఁ బోరింబోరి న్మనులకు న్రామారతిక్రీడ లే
లా గాఢస్తనసంవిమర్దనము లేలా తన్ముఖాఘ్రాణ మే
లా గేయాదిక మేల శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 68

మ. ఘన మాసూనశరాంధకారము మది న్గారొక్కన్న నీలోక మె
ల్లను నారీమయమై కనంబడు విశాలం బౌ వివేకాంజనం
బున నంతంతటఁ జూడ సాగిన జగంబు ల్బ్రహ్మరూపంబు లై
యనఘశ్రేణికిఁ గన్పడు న్సురభిమల్లా మానినీమన్మథా. 69

మ. గుములై రచ్చలలోనఁ గూడుకొని యుక్తు ల్చెప్పఁగా నేమి శా
స్త్రము లెల్లం బఠియించినట్టిచతురు ల్సైతంబు కాంతామణీ
రమణీయేక్షణముల్ పయి న్బడినమాత్ర న్రోఁత లై రు (?)
ల్లము తేతెయ్యలు సల్పఁగా సురభిమల్లా మానినీమన్మథా. 70

మ. అమతు ల్కొందఱు గొన్నిశుష్కనిగమవ్యాఖ్యానము ల్నేర్చి సం
గమ చీచీ కడు దుష్కృతం బనుచు వక్కాణించుటే కాని ర
మ్యమణిప్రాంచితకాంచికాన్వితనితంబాభోగ యాకాంత ను
ల్లములో నేమఱ కుందురో సురభిమల్లా మానినీమన్మథా. 71

మ. సకియ ల్నింద్యు లటంచు వట్టివెడనిష్ఠ ల్చాపుపాషండు లూ
రక తాము న్జెడి లాతిని న్జెఱుచుచుని ర్భాగ్యు ల్సుమీ యధ్వరా
దికపుణ్యంబుల కెల్లఁ బ్రాప్యఫలము ల్దివ్యాంగన ల్గాక స్త్రీ
లకు నింద్యత్వము గల్గునే సురభిమల్లా మానినీమన్మథా. 72

మ. మృగరాజు న్నగరాజుఁ గుంభి మరి గింభిం ద్రుంచి తూటాడున
త్వగరిష్ఠు ల్గల రింతె కాని స్మరదోర్దండావలేపం బడం
పుగుణోదగ్రుఁ డొకండు లేఁడు బలిమిన్ మోమోడ కిబ్భూమి బ
ల్మగ లెల్ల న్నినుఁ జెప్పెద న్సురభిమల్లా మానినీమన్మథా. 73

శా. ఆచారంబు జితేంద్రియత్వము విధేయత్వంబు లజ్జాగుణ
ప్రాచుర్యంబును నామనస్థము లగు న్వృత్తాంకితంబు ల్దృఢ
భ్రూచాపచ్యుతముల్ శ్రవణపథగతంబు ల్తన్విదృగ్బాణముల్
క్రాచ జ్జాగినయంతలో సురభిమల్లా మానినీమన్మథా. 77

శా. ఇత్తన్వంగులఁ గా దనం గలుగువారే తక్కొరు ల్వారు ప్రో
న్మత్తప్రేమవిహారలై పలుపుకర్మంబు త్రిలోకక్రియా
యత్తుం డైనవిధాతృఁడు న్నయితము న్వ్యావృత్తము ల్సేయ లేఁ
డాత్తాశేషసుధీజనా సురభిమల్లా మానినీమన్మథా. 75

శా. అంగంబు న్విషమాస్త్రపావకసముద్యజ్జ్వాలిక ల్గాల్చుదాఁ
కం గానంబడుఁ గాని యంతటను జీకాకై చను న్వేగ పెం
పుం గీర్తింపఁగ నాకులీనతయుం నేర్చు న్బ్రజ్ఞయు న్బంతముల్
సంగీతాగమదోహలా సురభిమల్లా మానినీమన్మథా. 76

మ. నిరయద్వారకవాటపాటనముఖాంటెం బొల్చుబల్కుంచికల్
తరుణీభ్రూలత లంచు నెంచుఘనబోధస్వాంతుఁ డొక్కొక్కఁ డి
ద్ధర సంసారులలోపలం గలఁడు శాస్త్రజ్ఞానపారీణుఁ డై
ల్లరలో సద్గతిపాత్రుఁ డై సురభిమల్లా మానినీమన్మథా. 77

మ. అతిదీనంబు విలూనవాలము వికర్ణాగ్రంబు పూయవ్రణాం
కితగాత్రంబు గళైకపాలము క్షుధాఖిన్నంబు ఖంజంబు జీ
ర్ణతమం బంధము నై నవేపి శునివెంట న్గుక్క భోగార్థమై
యతను డెవ్వరి నొంచఁడే సురభిమల్లా మానినీమన్మథా. 78

మ. సకలార్థప్రదల న్నవ్యముద్ర లగుచంచన్నేత్రల న్రోసి కూ
పాకులై తుచ్ఛఫలార్థు లౌజడులఁ బుష్పాస్త్రుండు ద్వేషించి న
గ్నకులు న్పంచశిఖు ల్జటాధరధరు ల్కాపాలికు ల్భ్రష్టు లై
యకటా క్రుమ్మఱఁ జేయఁగా సురభిమల్లా మానినీమన్మథా. 79

మ. రమణీబృందముఁ జూచి వాయుజలపర్ణగ్రాసు లాగాధిపు
త్రముఖు ల్సైతము పాలుమాలిరి పయోదధ్యాజ్యశాల్యన్నభో

గమనం గ్రొవ్వనరు ల్జితేంద్రియు లనంగాఁ జెల్లునే వింధ్యశై
లము పాథోనిధిఁ దేలునే సురభిమల్లా మానినీమన్మథా. 80

---

## ఋతువర్ణనము

మ. దయివారు ల్జిగిగాడ్పుల న్వలపు లందంబై చెలంగు న్వన
ప్రియనాదావళి పల్లవోజ్జ్వల మగు న్వృక్షాళి భామాస్యప
ద్మశ్రీ యొసంగు న్విరళశ్రమాంబుకణయుక్తి న్సర్వము న్సద్గుణో
దయత న్భాసిలు నామని న్సురభిమల్లా మానినీమన్మథా. 81

మ. విరహిశ్రేణికిఁ బ్రాణసంకటము గావించె న్వసంతంబునన్
సరసంబౌ పికభామినీవిరుతము న్మందానిలవ్రాతమున్
ధర నాపన్నులకు న్సుధారసము నైతంబు న్విషంబే కదా
యరిరాడ్గర్వవిభాళ శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 82

మ. వనదండ న్నిగఁ జుట్టి పూవుఁబొదరిండ్ల న్సత్కవు ల్గొల్వఁ జెం
త నెలంత ల్కిలికించితంబు లిడుచు న్వర్తింపఁగా వెన్నెలల్
చినుకంగాఁ బికభామిను ల్బెలఁగఁగా శృంగారమౌ చైత్ర వే
ళకు ధన్యు ల్విహరింతు రౌ సురభిమల్లా మానినీమన్మథా. 83

మ. విరహస్త్రీవిరహానలాహుతికళావిష్కారులై చూతమం
జరు లొప్పు న్పికగేహినీహితములై చైత్రంబున న్పాటలా
పరమామోదకదంబసంభృతములై ప్రశ్రాంతిఘర్మాంబువుల్
హరియించు న్ననుగాడుపు ల్సురభిమల్లా మానినీమన్మథా. 84

మ. సుదతు ల్గోవులు జేపురింప నిడుకొంచు న్గార్మి ప్రాణేశులన్
బెదరింపంగ నొసంగినట్టియలుక ల్భేదిల్ల కె ట్లుండు స
న్మదసంవర్ధనచందనద్రుమసుగంధక్లిన్న మౌచైత్రఖే
లదణీయఃపవనంబు రా సురభిమల్లా మానినీమన్మథా. 85

శా. లీలాకంపనబాలచూతసుమపాళీకేసరాళీసము
న్మీలత్సౌరభవాసితాఖిలవనానీకంబు స్యూతన్మ రం
దాలోలభ్రమరార్భటీముఖరితం బౌరా వసంతంబు రా
గాలంబం బయి భాసిలు న్సురభిమల్లా మానినీమన్మథా. 86

మ. అల గ్రీష్మర్తువునన్ సుగంధరసపూరార్ద్రార్ద్రవక్షోజ లా
నలివేణు ల్మలయానిలంబు ధవళం బౌహార్మ్యగర్భంబు వె

న్నెల ధారాగృహము ల్ప్రసూనములు సందీపింపఁ జేయు న్మరుక్
లలితోత్సేకవికారము న్సురభిమల్లా మానినీమన్మథా. 8

మ. జలకేళీశ్రమ మేగ సీధురస మాస్వాదించి సూక్ష్మాంశుకం
బులు పూదండలు దాల్చి చంద్రకిరణంబు ల్పర్వ్యసౌధంబుపైఁ
జెలువ ల్సీవిరు లేయఁ జందనరసస్నిగ్ధాంగు లై గ్రీష్మవే
ళల ధన్యు ల్విహరింతు రౌ సురభిమల్లా మానినీమన్మథా. 8

మ. అమలజ్యోత్స్నసుధావదాతశుభగేహంబు ల్ప్రియావక్త్రప
ద్మము శ్రీగంధరసంబు ఘుమ్మనువిరు ల్తద్గ్రీష్మసౌఖ్యంబు రా
గిమనఃశోభము సేయుఁ గాని ప్రవిరాగిస్వాంత మింతైన లా
ల్యము నొందింపఁగ లేవయా సురభిమల్లా మానినీమన్మథా. 8

మ. ధృతపీనోన్నతిమత్పయోధరభరశ్రీ యై నవోజ్జృంభిమా
లతికాజాతిసుగంధి యై ఘనతటిల్లాలిత్యవిస్ఫార యై
సకలోద్దీపితకామ యై యలరువర్షావేళ రంజించుఁ జె
ల్వతెఱం గేర్పడి ధన్యుల న్సురభిమల్లా మానినీమన్మథా. 9

మ. అవిరామంబుగ వర్తిలు న్గుటజనీపామోదు లౌగాడుపుల్
నవకేకివ్రజకేకలంబు లగుకాన ల్కందళచ్ఛన్న యా
భువియు న్గార్మొగు లల్లుకొన్నగగనంబు న్జి త్తడి న్ప్రాణిజా
లవికారైకపదంబు లై సురభిమల్లా మానినీమన్మథా. 9

మ. భువి దర్శించినఁ బాండుకందళచయంబు ల్దోఁచు దిఙ్మండలం
బు విలోకించిన బర్హిహాట్యరుచిరంబు లై న్నలము ల్వ్యాపడుక్
దివిఁ గన్గొన్న మొయిళ్లు గానగు నర్థి న్బాంథుఁ డిం కెందుఁ దా
నవలోకం బిడువాఁ డొకో సురభిమల్లా మానినీమన్మథా. 9

మ. మెఱుపు ల్వారె తళుక్కుమంచు మెఱయ న్మెండై పయోదధ్వనుల్
నెఱయ న్ఘుమ్మనుక న్నెగేదఁగివిరు ల్చేతోభవు న్బిల్వఁగాఁ
బఱచు న్నెమ్మిలు గూయఁగాఁ గటకటా ప్రావృడ్దినం బెంత యు
త్కఱఁ జేయు న్పథికాంగన న్సురభిమల్లా మానినీమన్మథా. 9

శా. ఏపై చీఁకటి సూది మోప నెడ యీ కేర్పడ్డవేళ న్ధ్వనుల్
చూపట్టు న్జిటిపొట్టిచిక్కుల ఘుసాళు ల్మింట వర్తిల్లఁగా
దూపించు న్జెలఁగు న్దళుక్కునఁ దటిత్తు ల్దోఁచిన న్బ్రెల్ల వె
ల్లావుస్తత్తై చరింపుచు న్సురభిమల్లా మానినీమన్మథా. 9

మ. జడి యట్టిట్టు చనంగ నీ కఱుమ నాసారంబు కేళీక్రమం
బడఁప న్సీతున కల్కివల్లభులు గాఢాశ్లేషము ల్సల్పఁ బ
ల్విడి సంక్రీడ లొనర్చుభోగినుల కుర్వి ద్దుర్దినంబు న్సుఖం
బడరించు న్సుదినంబ లై సురభిమల్లా మానినీమన్మథా. 95

మ. అమలాత్ముండు శరద్విభావరులు హర్మ్యాగ్రంబుల న్స్వాదుమ
ద్యమదోన్మత్తతఁ గొంతసేపు శయితుండై లేచి సంభోగజ
శ్రమతృష్ణ న్దయితారతిశ్లథకరాంచత్కర్కరీ స్రస్తతో
యము లాను న్శుచివారము న్సురభిమల్లా మానినీమన్మథా. 96

శా. నేపాల్మించు భుజించి లోగృహములో నిద్రించుధన్యుండు వీ
టీపూర్ణాననుఁడై కుసుంభమయశాటిచ్ఛన్నుఁడై కుంకుమా
లేపప్రోజ్జ్వలుఁ డై ప్రియాపృథుకుచాశ్లిష్టాంగుఁడై కంతుఖే
లాపర్యాసితుఁ డౌఁ జలి న్సురభిమల్లా మానినీమన్మథా. 97

మ. అనుఁగు న్జెల్వలఁ బాసిన న్గడచునే యామయామావళుల్
ఘనకుందప్రచలద్విరేఫము స్ఫురద్గంధప్రియంగువ్రజం
బును బ్రాలేయమరుద్విలోలితవనాభోగంబు లౌశీతవే
ళనిశ ల్కాలగృహోపమ ల్సురభిమల్లా మానినీమన్మథా. 98

మ. అలరుం జెక్కులు చుంబనం బిడుఁ గచవ్యాప్తంబు లాస్త్రీముఖం
బుల సీత్కార మెసంగఁ జేయు అవిక ల్పొనొత్తుచు న్గబ్బలన్
బులక ల్మించుఁ బిఱుందున న్మృదుపటంబు ల్జార్చు నూఁపున్దొడల్
చలిగాడ్పు ల్విటు లట్లయై సురభిమల్లా మానినీమన్మథా. 99

మ. వలిగాడ్పు ల్మగలు న్బలెన్ జెలులకు న్వాసోబలాకర్షణం
బులు దృఙ్మీలనము ల్తనూవిచలనంబు ల్కుంతలాలోలనం
బులు బింబాధరబాధసీత్కృతిచయంబు ల్సాంద్రరోమాంచముల్
గలుగ న్జేయు నజస్రము న్సురభిమల్లా మానినీమన్మథా. 100

మ. సతులు న్దామును వీడెము ల్సలుపుచు న్సంభోగము ల్సేయు చు
న్నతఁడె న్శైశిరరాత్రి వేగఁ జను సాంద్ర న్నిద్దలన్ బ్రోచుసం
తతఖేదంబునఁ గూర్కు పట్టక మది న్ధ్యానించు పేదయ్య కా
యతమై యొంతట వేగ దౌ సురభిమల్లా మానినీమన్మథా. 101

శృంగారశతకము సమాప్తము.

# వైరాగ్యశతకము

## తృష్ణాదూషణము

శా. శ్రీమచ్చంద్రకళాకలాపశిఖమై శ్రేయోదశాగ్రస్ఫుర
ద్ధామంబై ప్రవిలోలకామశలభాధిక్కారియై యాంతర
వ్యామోహోరుతమోహరం బగుశివాఖ్యజ్ఞానదీపంబు సొం
పై మీకు న్మహ మీవుత న్సురభిమల్లా వైదుషీభూషణా. 1

మ. సుమహారణ్యసుదూరదేశగతుఁ డౌచున్ గాకిభంగి న్దుర
న్నము లందందు భుజించుచుం దిరియుచు న్జాత్యల్పులం బెక్కుగా
లము గొల్చున్ నరుఁ డేమియుం దొరక దేలా యెప్పుడు న్బాయ దు
ల్లములోఁ బాపుఁదృష్ణ దా సురభిమల్లా వైదుషీభూషణా. 2

మ. ఇల ద్రవ్వున్ నిధివాంఛ ధాతువితతు ల్హోమింప నూఁదు న్మహీ
శులఁ గొల్చున్ నరుఁ డోడబేరము గమించు న్మాంత్రికుండైన నరేం
ద్రులభూమి న్బనుఁజీఁకటి న్గొణఁగు నెందు న్గడ్డికా నైన లే
దలరు న్వొండియుఁ దృష్ణ దా సురభిమల్లా వైదుషీభూషణా. 3

మ. తనుఁ బోనాడిన నుత్తరం బిడక యంతర్బాష్పుఁడై యూర కుం
డు నగు న్మాన్యమనస్కుఁడై ధనమదాంధు ల్మెచ్చఁ గేల్మోడ్చు భూ
జనుఁ డోహోహా వృథావిడంబ మగు తృష్ణం జేసి యేయేవిఖే
లనము ల్సల్పు నొకో యిఁక న్సురభిమల్లా వైదుషీభూషణా. 4

మ. అమతు ల్తామరపాకుమీఁదిజల మె ట్లట్లై నయారోఁతప్రా
ణముకోసంబు ధనాంధచిత్తులకడ న్సంకోచ మింతైన లే
క మహాపాతక మైనయాత్మనుతియు న్గావింతు రింకేమి సే
య మదిన్గోరరు తృష్ణచే సురభిమల్లా వైదుషీభూషణా. 5

మ. క్షమ లే కున్కని శాల్మియు న్శివపదాస్వాదంబు లేకున్కి ధ్యా
నము సంతోషము లేక యున్కి సుఖసన్యాసంబు యోగానుభా
వము లేకున్కి హిమాతపాదిసహనత్వంబుం జెడు న్యోగికృ
త్యము లయ్యు న్ఫలహీనత న్సురభిమల్లా వైదుషీభూషణా. 6

మ. తపము న్దప్తము గాదు భోగమును భుక్తం బౌట లే దాశయున్
తృపితం బైనది కాదు కాలమును జీర్ణం బౌట లే దేపు మా
ని ప్రజల్ తప్తులు భుక్తులున్ తృపితులు న్జీర్ణాంగులున్ దామె యై
యపటుత్వంబు వహింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 7

మ. మొగ మెల్ల న్వళిపూర్ణ మైనయపుడు న్మూర్ధంబు న న్జన్పనా
రగలిన్ బాండిమ యల్లుకొన్నపుడు గాత్రంబు న్జరాక్రాంత మై
మిగుల న్సత్తువ దప్పినప్పుడును భూమిన్ నిత్యకౌమార మె
ట్లగునో మర్త్యులతృష్ణకు న్సురభిమల్లా వైదుషీభూషణా. 8

మ. బహుమానస్థితి దూలె భోగసుఖ లీప్స ల్దప్పెఁ బ్రాణంబువం
టిహితశ్రేణి యొకండు లేక యరిగె న్దృష్టు ల్పొర ల్గప్పెఁ బ్ర
త్యహ మున్యష్ట్యభిలాషి యయ్యె గమనం బట్లయ్యెఁ బాపంపుమే
నహహా తృష్ణఁ దొలంగ దో సురభిమల్లా వైదుషీభూషణా. 9

మ. అగు సంసిద్ధి విమోహవార్ధిమము తృష్ణాళీతరంగంబు రా
గగురుగ్రాహము దుర్మనోరథజలాక్రాంతంబు చింతాఖ్యతీ
రగరిష్ఠంబుఁ వితర్కపక్షికము ధైర్యత్మాజభంగప్రదం
బగునాశానది దాఁటినన్ సురభిమల్లా వైదుషీభూషణా. 10

---

## విషయపరిత్యాగవిడంబనము

మ. పస సంసారమునందు లే దొకటియు న్భావించి చూడంగఁ బు
ణ్యాసముల్లాసము నార్తిదంబ యది యె ట్లన్న న్స్వకర్మంబులన్
బ్రసభప్రాప్తము లై భుజింపఁబడు దన్మాత్రంబు లాత్మేంద్రియ
వ్యసనాపాదకము ల్గదా సురభిమల్లా వైదుషీభూషణా. 11

మ. నిల కెన్నంటికి నైనఁ బోవు విషయానీకంబు దామై జనుల్
దొలఁగ న్లేరు తమంతట న్దొలఁగినన్ దోడ్తో శమానంద మ
గ్గలమై చేకుఱువేళ నవ్వియె దొలంగ న్రెంటికిం దప్పి య
ల్లలనాఁడు న్మది ఖిన్నమై సురభిమల్లా వైదుషీభూషణా. 12

మ. అనఘాత్ముం డెటువంటిదుష్కరకరుం డత్యంతము న్రోసి చెం
దినభోగంబులె సన్యసించు నిపు డేని న్దొల్త నేనిన్ బరం
బున నేని న్దమకున్ లభింపని స్పృహాభోగంబులు న్మాన లే
రనయంబు న్బుధవారు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 13

శా. ఆనందాశ్రులు గ్రోలుచు న్బులుఁగు లంకాగ్రంబులం దాఁడఁగా
ధ్యానారూఢతనుండు నద్రిగుహల న్ధన్యాత్ముఁ డౌ యోగి యా
ప్రాణాంతంబు మనోరథోపచితసౌధారామకేళీరతిన్
ధ్యానించున్ బెఱవాఁ డిల న్సురభిమల్లా వైదుషీభూషణా. 14

మ. అకటా మోహము వోదు స్థండిలశయుండై నీరసాహారపుం
బికిరం బెత్తి చతుర్థవేళ దినుచు న్వేసూఱుజీర్ణంపుఁ జే
లికల న్గట్టినబొంత గప్పుకొని జోలి న్బాసి వర్తించున
య్యకు నైతంబు జగంబున న్సురభిమల్లా వైదుషీభూషణా. 15

మ. మొగముం జీమిడిబుట్టి యిందునిక్రియం బొల్పొందునే రోఁతప
ట్లగుపూఁబోండ్లనితంబముల్ కరటికుంభాభంబులే కాచుదో
బ్బగుమల్ చన్నులు హేమకుంభములె బీభత్సం బిసీ లోకు లే
ల గరిష్ఠంబుగ నెంతురో సురభిమల్లా వైదుషీభూషణా. 16

మ. ఊమసామేన వసించునట్టి యశవుం డొక్కండు పెన్రాగి బా
ల్యమునం దుండి యసంగుఁ డౌ జనుఁ డొకం డత్యంతనీరాగుఁ డు
గ్రమనోజాహివిషార్తు లన్యు లుభయభ్రష్టుల్సుమీ యందఱున్
గ్గమనిర్ముక్తభుజాబలా సురభిమల్లా వైదుషీభూషణా. 17

మ. దుముకు న్వహ్నిశిఖాళియందు శలభస్తోమంబు మీనంబు గా
లము మ్రింగున్ మది బుద్ధి లేక మనుజుల్ తత్త్వజ్ఞులయ్యున్విషా
దమునన్ బ్రుంగుదు రింతె కాని విషయత్యాగోత్సుకు ల్గారు శ
క్యమె మోహంబు తరింపఁగా సురభిమల్లా వైదుషీభూషణా. 18

శా. ఆను దప్పి జనింప స్వాదుశిశిరం బౌవారి భక్ష్యాన్వితం
బౌ నన్నంబు దిను న్బుభుక్ష వొడమ న్స్త్ర్యమాతలినొప్పందు గా
ఢానంగానల మేర్ప నిట్టిది సుఖంబా రుక్ప్రతీకార మ
జ్ఞానీకంబు సుఖం బను న్సురభిమల్లా వైదుషీభూషణా. 19

మ. తనకు న్సంపద మెండు భార్య ఘనసౌందర్యాంగి తారుణ్య మె
న్న నవీనంబు సుతు ల్ప్రశస్తు లనుచు న్వ్యామోహి సంసారకా
ర నడంగు న్దిర మంచు భ్రాంతుఁ డయి సర్వం బధ్రువం బంచు మో
హనివృత్తిం జను జ్ఞాని దా సురభిమల్లా వైదుషీభూషణా. 20

## యాచ్ఞాదైన్యదూషణము

శా. వాపోచు న్క్షుధఁ గుంది చాల సుతు లవ్వా బువ్వ బువ్వంచు ని
ల్లాపె జీర్ణపటాపకర్షముల నుద్ఘాటింపఁగాఁ జూచి గా
కాపన్నుండు మనీషి భీతిలి పరంబౌ దేహి యన్వాక్య మే
లా పల్కుం దనపొట్టకై సురభిమల్లా వైదుషీభూషణా. 21

మ. సదుదంచద్గుణపద్మ చంద్రరుచి లజ్జానూత్నవల్లీసమూ
హదృఢోదగ్రపరశ్వధంబు కడు నుద్యన్మానవిచ్ఛేదనం
బిది పూరింపఁగ రానిబాని నరు నేయేరీతులం ద్రిప్పుఁ జా
లదు దుర్వారవిడంబమై సురభిమల్లా వైదుషీభూషణా. 22

మ. ఒకపుణ్యస్థలిఁ జేరి వస్త్రపిహితప్రోత్క్షిప్తభిక్షాకపా
లకుఁడై పావనహోమధూమపటలాప్లావంబు లౌభూసురేం
ద్రకుల శ్రేణులఁ జేరి మాధుకర మెత్త న్నేఁడె మర్త్యుండు తు
ల్యకుల న్వేఁడఁగ నేల శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 23

మ. అమరద్వీపవతీతరంగకణశీతారామము ల్తాపసో
త్తమవిద్యాధరసిద్ధసంఘరుచిరోదంచచ్ఛిలాభోగముల్
హిమవత్పర్వతభూము లేవఁటఁద బోయె న్గూటికై మర్త్యజా
లము నాసింతురు పండితు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 24

మ. ద్రుమశాఖోద్భవవల్కలప్రకర మబ్బు ల్సెచ్చెనే శైలజా
లములందున్ ఫలమూలకందజలము ల్పాడయ్యెనే కృచ్ఛ్రల
బ్ధమనాగ్విత్తమదానిలాప్తి బొమ లుత్కంపించుమన్నీలఁ గొ
ల్వ ముదం బేమి జనాళికి స్సురభిమల్లా వైదుషీభూషణా. 25

మ. ఖలులై వైభవగర్వదుర్వికృతిరోగగ్రస్తులై తూగుక్షు
ద్రుల వర్ణించి దరిద్రులైన నిల కార్యు ల్వల్కలాస్తీర్ణభూ
తలశయ్య న్ఫలమూలసేవను బ్రమోదస్ఫూర్తిఁ బ్రాపింతు ర
త్యలఘూర్వీధరవాసులై సురభిమల్లా వైదుషీభూషణా. 26

మ. అభిరామాకృతి నెల్లెడన్ నదులతోయం బుండఁగా నెప్పుడై
న భుజింపం దరుశాఖల న్ఫలము లుండంగాఁ బరుండ న్వినూ
త్నభవత్పల్లవరమ్య మాధరణి యుండంగా వగన్ విత్తవ
ల్లభులన్ గొల్వఁగ నేమొకో సురభిమల్లా వైదుషీభూషణా. 27

శా. తృష్ణాసార్థాశ్రయదుఃఖభారమున భోగస్వాదుసౌఖ్యంబులన్
నానాభంగులఁ బోయెఁగా దినము లిన్నాళ్ళుంచు లోలో నగున్
ధ్యానాంతంబులఁ ద్రొల్లి దాఁ బడిన పాట్లంతంతఁ దోఁపం బ్రబో
ధానందుండు వనస్థుఁడై సురభిమల్లా వైదుషీభూషణా. 28

మ. పరితుష్టాత్ములు వాంఛ సేయ రతిలుబ్ధస్వాంతు లౌవాండ్రకుం
బరితోషం బొనరింపఁ జాలుదురె సంపద్ధామ మా మేరుభూ
ధర మాత్రైకసమాప్తవైభవము వ్యర్థం బంచు నే నెంచెదన్
హరసేవానిరతాత్మ శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 29

శా. అక్షీణం బభయం బనల్ప మతులం బానందసంపాది యా
ర్యక్షేమంకర మప్రయత్నసులభం బద్వేషదోషం బిలన్
భిక్షాజీవిక శంభుసత్ర మది యందే జ్ఞాను లాసింతు ర
ధ్యక్షేపస్థిరవిక్రమా సురభిమల్లా వైదుషీభూషణా. 30

---

## భోగాస్థైర్యము

మ. చ్యుతిచే వంశము రాజుచే ధనము రోగౌఘంబుచే భోగసం
తతి విద్వేషులచే బలంబు జరచేత న్రూపు కార్పణ్యసం
స్థితిచే మానము చాడిచే గుణము భీతిన్ జెందు నిర్భీతికం
బతులజ్ఞానమె సుమ్ము శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 31

మ. జర తారుణ్యము దుర్జనాళి నృపు నస్థైర్యంబు శ్రీ నాశ హృ
త్పరితోషంబు ఫణు ల్వనప్రతతిఁ గాంతావిభ్రమంబు ల్ప్రశాం
తిరుచి న్దుష్టజనంబు సద్గుణవిభూతి న్సొంపఱం జేయుఁ జె
ల్లరె సాతంకము సర్వము న్సురభిమల్లా వైదుషీభూషణా. 32

శా. దేవుం డెద్ది తిరం బొనర్చె నతఁ డాధివ్యాధినానావికా
రావృత్తి న్ధృతి మాలి ప్రాణితతి నంతంత న్జర న్ముంచు ద్వా
రావష్టంభము లేక దుర్దశలు డాయ న్జేయు లక్ష్మీవిలా
సావేశంబుల కెమ్మెయి న్సురభిమల్లా వైదుషీభూషణా. 33

మ. అలరుం బ్రాయము లభ్రవంబులు తరంగాకారము ల్వైభవం
బులు ప్రాణంబులుఁ నశ్వరంబులుఁ దినంబుల్ స్వల్పము ల్కాపురం
బులు తుచ్ఛంబు లటంచు నెంచి యనయంబున్ బుణ్యసంకల్పముల్
దలఁచున్ దత్త్వవిదుండు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 34

మ. ప్రసరద్వాయుపరిప్లవాబ్ధిసలిలప్రాయంబు ప్రాణంబు మే
ఘసమూహాంతరచంచలాచలము భోగశ్రేణి తారుణ్యలా
లసలుం దుచ్ఛము లంచు నెంచి యవిలోలస్వాంతుఁ డేగు న్సధై
ర్యసమాధిస్థితసిద్ధికి స్సురభిమల్లా వైదుషీభూషణా. 35

మ. యువతీభోగకథ ల్తటిత్సమము లాయుస్సీమ కల్లోలజా
లవిలోలం బెలప్రాయము ల్నిమిషకల్పంబు ల్ధనశ్రేణు ల
ధ్రువము ల్భోగము లస్థిరంబు లనుచున్ దూషించి తజ్ఞుండు బ్ర
హ్మవిచారంబునకుం జను స్సురభిమల్లా వైదుషీభూషణా. 36

మ. ప్రసరచ్ఛోణితమాతృకుక్షితలనిర్బంధాధివాసంబు ని
ష్టసతీసంగవియోగచింతలును యోషాదూషితం బౌజరా
వ్యసనం బింతియెగా కిసీ భవమునం దాత్మ న్విచారింప స్వ
ల్పసుఖం బైన లభించునే సురభిమల్లా వైదుషీభూషణా. 37

మ. నిరతం బాయువు భగ్నకుంభసలిలానీకంబున ట్లేఁగఁగా
నరుల ట్లామయము ల్తనువ్యథలు సేయంగా వెస న్గ్రోఁగొనన్
జర దా బెబ్బులిభంగిఁ గాచుకొని యుండంగా నయో యేల సే
యరు లోకు ల్హితయత్నము ల్సురభిమల్లా వైదుషీభూషణా. 38

మ. అమితాకారము లైనభోగములు మాయాజాలముల్ తత్ప్రసం
గమె సంసారనిమిత్తభూత మిది యాకాంక్షింప కాశాతరం
గముల న్విహ్వల మైనచిత్తము సమాకర్షించి యల్లల్ల బ్ర
హ్మమునం జేర్చుట మే లగున్ సురభిమల్లా వైదుషీభూషణా. 39

మ. పరమేష్ఠిప్రముఖోన్నతు ల్తృణకణప్రాయంబు లింద్రాదిరా
జ్యతతు ల్తుచ్ఛము లంచు నెంచఁగల బ్రహ్మానంద ముజ్జృంభ మై
పరమం బై పరిపూర్ణమై యలరఁగా భావించియు న్యోగి చి
ల్లరభోగంబులు గోరునే సురభిమల్లా వైదుషీభూషణా. 40

---

## కాలమహిమ

శా. ఇంబు ల్గుఱ్ఱెడు సేనసేనపురము ల్పృథ్వీశులు న్వారియ
ర్థంబు ల్వారిసుతాప్తభృత్యబలము ల్రాజౌఘము ల్వారిభో
గంబు ల్వెంబడి మల్లమబ్బు లయి పోఁ గావింపుచుం బొల్చుకా
లం బే దైవ మవశ్యము న్సురభిమల్లా వైదుషీభూషణా. 41

మ. ఒకని న్జేయుఁ దనేకుఁగా నొకనిఁ జేయుం దా ననేకాత్ముఁ గొం
జక మాయించు ఘటించుఁ బ్రాణివితతు ల్సారె ల్వగ ల్రేయి పా
చికలు న్లోకము లెల్లఁ బాళియునుగాఁ జేకూర్చి కాలంబు ఖే
లకుఁ జొచ్చెం గితవాకృతి న్సురభిమల్లా వైదుషీభూషణా. 42

మ. గృహకృత్యంబులచే ననంవిదితమై క్షీణించి నిక్కాల మ
న్వహము న్సూర్యగతాగతక్రమవశంబై యాయు వేగు న్రుచుల్
బహుభంగు ల్సకలం బెఱింగియు జను ల్సమ్మోహకాదంబరీ
లహరి న్భ్రాంతి వహింతురా సురభిమల్లా వైదుషీభూషణా. 43

మ. ఇనుఁ డేతెంచె నినుండు గ్రుంకె బగ లయ్యె న్రాత్రి జామయ్యె రెం
డనుచున్ నిత్యముఁ బిష్టపేషణసమవ్యాపారము ల్సేయుచున్
జను లున్మాదులు గాక యీచెనఁటిసంసారంబులో నేమి మే
ల్గన వర్తించెద రీమహి న్సురభిమల్లా వైదుషీభూషణా. 44

మ. జని విచ్ఛేదన మైనశంభుచరణాబ్జధ్యానమా లేదు స్వ
ర్గనిజద్వారకవాటపాటి యగుధర్మంబా నహీ సుందరీ
స్తనసంశ్లేషకమా యభావము మహి న్జన్మింప నేలా జడుల్
జననీయౌవనఘాతుకు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 45

మ. జవరాండ్ర న్రమియింపఁ గాన రతిభాస్వచ్చంద్రికారాత్రులన్
సవిశేషం బగువిద్య నైన నసి నైన న్వైరుల న్గెల్చి ప్రా
భవ మొప్ప న్యశ మొందఁ గానరు జను ల్పాడింటిదీపంబులీ
ల వయశ్శ్రీ వృథ యై చన న్సురభిమల్లా వైదుషీభూషణా. 46

మ. అనిశంబు న్దలితంద్రు ల న్నుప లే రర్థం బుపార్జింప లే
రనవద్యం బగువిద్యచే నృపుల డాయ న్లేరు కాంతావిఖే
లనసౌఖ్యంబులు గాంచ లేరు పలుగూళ్ల న్గాతులు న్బోలె న
ల్పనరుల్ గాలము పుత్తు రా సురభిమల్లా వైదుషీభూషణా. 47

మ. తమపెద్ద ల్చన నాత్మతుల్యహితమిత్రవ్రాత మేగం గ్రమ
క్రమభంగి న్నికటానదీతటతరువ్రాతంబుచందంబునన్
దమరు న్సన్నిహితప్రణాశు లగుచు న్వర్తించువారల్ నరుల్
ప్రమదం బేక్రియఁ గాంతురో సురభిమల్లా వైదుషీభూషణా. 48

మ. శతసంవత్సర మాయు వందు నిశల న్సా మేగు బాల్యవృ
ద్ధతలం జిక్కినసాములోన సగ ముత్సన్నం బగున్ నిల్చియు

న్నతలి వ్యాధివియోగదుఃఖభయచింత ల్వెక్కు లేదీ సుఖం
బతితుచ్ఛం బగు మేనికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 49

శా. బాలుండై కొమరుం డగుం గృపణుఁడై భాగ్యోపసంపన్నుఁ డౌ
సోలుం బొందుశిరోరుహుం డయి వళీస్ఫీతాంగుఁడై పిమ్మటన్
గాలాగారమహాలిరస్కరిణి కేగం జాగు భ్రూకుంసున
ట్లై లోకంబునఁ బ్రాణి దా సురభిమల్లా వైదుషీభూషణా. 50

---

## యతినృపతిసంవాదము

మ. అతఁడైశ్వర్యమునం బ్రసిద్ధుఁడు ప్రసిద్ధాచార్యుఁడున్ నేను రా
జతఁ డే సద్గురుభక్తిసంజనితమేధాఢ్యుండ నాతం డనా
దృతిఁ గావించిన నిస్పృహుండ నగునా కే మా నటంచు న్మతిన్
యతి పాటింపఁడు భూపతి న్సురభిమల్లా వైదుషీభూషణా. 51

మ. అతఁ డర్థేశ్వరుఁ డాగమార్థపతి నే నాతండు శూరుండు వా
దితతి న్గెల్వఁగ నే ఘనుండ నతఁ డర్థిశ్లాఘ్యుఁ డే నార్యవం
దితుఁడన్ న న్దొర మెచ్చకున్న మును పే నే మెచ్చనంచు న్మదిన్
యతి నిష్కామత భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 52

మ. దొర దువ్వల్వలు దాల్చు వల్కలము దాల్తున్ నే సమానంద మి
ద్ధఱకుం బేద యన న్మహాశకుఁడె పో ధన్యుం డన న్దుష్టిభా
సురుఁడే పో మఱి యేఁ బ్రతిష్ఠుఁడ నటంచు న్మెచ్చఁ డర్థేశు బ్ర
హ్మరసాస్వాదపరుం డిల న్సురభిమల్లా వైదుషీభూషణా. 53

శా. కట్టం జీరము లుండఁగాఁ దిన ఫలౌఘం బుండఁగా శయ్యకున్
బట్టై ధారుణి యుండఁగాఁ గొలఁకులం బానోదకం బుండఁగాఁ
గట్టా వైభవమద్యపానచలితాక్షవ్రాతు లౌదుర్జనుల్
ఘట్టింప న్బుధు లోర్తురే సురభిమల్లా వైదుషీభూషణా. 54

శా. భిక్షాహారము లారగింపుచుఁ బ్రతృప్తిం బొంది యేచోద లే
కక్షీణం బగు మేదినీజనితశయ్యాసౌఖ్య లౌచు న్దిశల్
సుక్షౌమంబులుగా ధరింపుచు రహిం బ్సొంపొందుధన్యుల్ నృపా
లక్షుద్రు న్మది మెత్తురే సురభిమల్లా వైదుషీభూషణా. 55

మ. పలుసుద్దుల్ పలురజ్జులున్ బదరసల్ప ప్రజ్ఞలున్ గుబ్బచ
న్నులు గుల్కించు మెలంతలున్ సొగసుకాంద్రుల్ గూడ నానాట పా

టలవాండ్రున్ గొలి గాక రాజులకు నిష్ఠావంతు లౌ తజ్ఞు లే
ల లసద్దానశిబీశ్వరా సురభిమల్లా వైదుషీభూషణా. 56

మ. భువనం బెందఱు సేర్చి రెందఱు ప్రగల్భు లొప్పించి పో రెంద ఱా
ర్యవరు ల్గెల్చి తృణీకరించిరి ధరన్ జ్యాధీశు ల ట్లేగ నా
రౌరా యిం దొకకొన్నిపల్లెలకుఁ దా రధ్యక్షు లై యల్పు లే
ల వృథా గర్వమొనర్తురో సురభిమల్లా వైదుషీభూషణా. 57

మ. ధరణీశాయుతభుక్తముక్త మగునిద్ధాత్రీతలం బంతయున్
బరిపాలించినవారు నైతము తృణప్రాయుల్ తదంశాంశముల్
పరిపాలించునృపాధముల్ మది జుగుప్సాఖేదము ల్దక్కియే
ల రహిన్ గ్రొవ్వి చరింతురో సురభిమల్లా వైదుషీభూషణా. 58

మ. వివిధాయోధనదారుణంబుల మిథోవిద్వేషు లై తోయప
త్త్రిక్కవృతం బౌపరమాణుకూటకృతమృత్పిండంబు భోగించుచున్
ద్రవిచారు ల్దూర లీవు లిత్తు రని తత్స్వల్పార్థ మాశించు వా
రవమప్రాణులు గారొకో సురభిమల్లా వైదుషీభూషణా. 59

మ. భవుఁ డాత్మీయకపాల మాదల వహింపన్ మన్నవాగ్దేవతా
ధవుఁ డొక్కండె విభుండు త క్కొరున కాత్మప్రాణసంరక్షణ
ప్రవణు ల్నల్వురు మ్రొక్కినంతనె మదింపం జెల్లునే వాని నే
ల విభుం డండ్రు సుధీజను ల్సురభిమల్లా వైదుషీభూషణా. 60

---

## మనస్సంబోధనము

మ. పరచేతఃప్రియ మాచరించుఁ జనుచున్ ప్రశాంత మౌఁ గాని తా
నరయ న్మర్త్యుల మానసంబు విమలం బై యుండ దట్లున్నఁ జె
చ్చెర నిష్టార్థము లన్నియు న్గలుగవా చింతామణిస్తోమవ
ల్లరి చేపడ్డవిధంబున న్సురభిమల్లా వైదుషీభూషణా. 61

మ. అవు నర్థం బగుఁ గానియర్థ మది గా దామాత్రకుం జిత్త మే
ల వెతన్ జెందు నతీతభావిసరణు ల్తర్కింప కైనప్డు భో
గవితానంబు భుజించు లేనితఱి నిక్కం బూరకుండు న్బుధుఁ
డవలం దా నిఁక నేమి శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 62

మ. విషయైకస్పృహమైఁ జరింపుచు భవస్వీకారి గాకుల్ల ము
న్నిమహామాయావివర్తకం బయినస్వాత్మీభావముం జెందినన్

విషమక్లేశవిదూర మా సుఖగతి న్విశ్రాంత మా నాజిఖే
లషదాస్యప్రతిరూప శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 63

మ. విలసజ్జహ్నుసుతాతటాభిరతిమై విశ్వేశుఁ జింతింప క
త్కలిక న్సంపద లేల కోరునొకా చిత్తం బక్కటా వీచికల్
కలుము ల్బుద్బుదముల్మెఱుంగులు నరౌఘంబు ల్ఘణు ల్వహ్నికీ
లలు నమ్మం దగునా మహి న్సురభిమల్లా వైదుషీభూషణా. 64

మ. నృపతిభ్రూలతికాకుటీగణిక యాత్రి గోర కార్యుండు కా
శిపురిం జేరి వినీతకంథుఁ డగుచున్ శిష్టాత్ము లచ్చో జనుల్
కృప నర్పించినపాణిపాత్రహృతము ల్భిక్షాన్నముల్ దించు శీ
లపరుండై మెలఁగం దగున్ సురభిమల్లా వైదుషీభూషణా. 65

మ. ఎదుటన్ గాణలు వెన్కఁ జామరధరల్ హేలావయోరమ్య లౌ
సుదతు ల్క్రేవల దాక్షిణాత్యసుకవీశు ల్గొల్తు రేని న్ప్రియం
బె దగ న్మర్త్యుఁడు కాపురించఁ దగు లేదే యోగి యై యొక్కటై
లదరిం జేరికొనం దగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 66

మ. అభిరామం బగులక్ష్మి చేకుఱిన నే మాత్మీయమిత్రాళులన్
విభవోపేతులఁ జేసి శాస్త్రవరమావిస్ఫూర్తిఁ గైకొన్న నే
మి భయప్రోజ్ఝితమై మనం గలదె భూమిన్ మర్త్యసంఘంబు దు
ర్లభ మాదేహము నిత్యమై సురభిమల్లా వైదుషీభూషణా. 67

మ. మమకారంబు త్యజించి కామవికృతు ల్మాయించి సంసారక
ర్మము లెల్లన్మది రోసి యీశ్వరునిపై రాగంబు సంధించి దూ
రము లౌకానలు చేరి మానవుఁడు వైరాగ్యస్థుఁ డౌ నేని యే
ల మహేంద్రాదిపదంబులు న్సురభిమల్లా వైదుషీభూషణా. 68

మ. సకలాశావలయంబుల న్సతతసంచారంబు గావించుఁ గొం
చక నైసర్గికలోలభావమున విశ్వం బెల్ల వ్యాపించుఁ దా
నొకనాఁ డేమఱిటైన మర్త్యులమనం బూహింప దుల్లాసక
ల్పకుఁ డైనట్టిమహేశ్వరున్ సురభిమల్లా వైదుషీభూషణా. 69

మ. అమరేంద్రాదిపదంబు లన్నియు దరిద్రాపేక్ష్యముల్ వానిమీఁ
ద మనం బుంచక నిర్వివేకత ననంతం బై పరం బై ప్రకా

శమయంబై యలరారు బ్రహ్మము రహి న్వర్చింప సర్వార్థముల్
సమకూరు న్సులభంబులై సురభిమల్లా వైదుషీభూషణా. 70

## నిత్యానిత్యవస్తువిచారము

మ. అమరావాసకుటీవిహారఫల మా యాగాళి యంచు న్పురా
ణము లంచున్ స్మృతు లంచు వేద మనుచున్ శాస్త్రం బటంచున్ నరుల్
భ్రమచేఁ గోమటిబేరపున్ వగల కేలా చొత్తురే యాత్మ బ్ర
హ్మమునం జేర్పఁగ లేక శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 71

శా. కాలాంతాగ్ని సువర్ణశైలము పడంగా వారిరాసు ల్సైదం
గా లోకాశ్రయమైనధారుణి సనంగాఁ గుంజరేంద్రశ్రవో
లోలం బౌతను వెంతమాత్రము నరు ల్మోహాంధులై దీని కే
లా లోభింతు రెఱింగియు న్సురభిమల్లా వైదుషీభూషణా. 72

శా. వ్యామోహంబు వహించి వీను బధిరంబై నోరు లాలాయుతం
బై మే నానతమై రదాళి పతితంబై దృష్టి యుత్సాదితం
బై మానస్థితి భ్రష్టమై నరుఁడు పంగై యున్నఁ గైకోరు పెం
డ్లాము న్బిడ్డలు సైతము న్సురభిమల్లా వైదుషీభూషణా. 73

మ. జరఁ బ్రాపించి కరంబు పాండురశిరోజశ్మశ్రుఁడై యున్న య
న్నరు నుత్తిష్ఠగవాస్థిఖండ మగుచండాలోదపానంబువై
ఖరి దౌదవ్వుల రోసి పాయుదు రిలన్ గంజాత్ము లుద్వేల్లల
ల్లరగండాదిమహాంక శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 74

మ. జర ప్రాప్తించకమున్నె యక్షిబల ముత్పన్నంబు దాఁ గాకము
న్నె రుజల్ ముంపకమున్నె యాత్మహిత మన్వేషింప కజ్ఞుండు మం
దిరదాహం బగునప్డు శాంతివిధి కెంతే కూపముం ద్రవ్వనా
లరియ ట్లైనగుఁబాటగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 75

మ. ఇతిహాసాగమకావ్యము ల్చదువఁ బ్రొద్దేదీ మల ల్చేరి యా
దృతిమై యోగతపఃక్రియ ల్సలుపఁ బ్రొద్దేదీ యతిప్రశ్రయా
న్వితుఁడై దాతృజనంబులం గొలువఁ బ్రొద్దేదీ కటా యాయు వ
ల్పతరంబై చనుప్రాణికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 7

మ. దొర లత్యంతమదాంధకుల్ చపలచిత్తుల్ సౌఖ్యవాంఛ ల్పుదు
ర్భరము ల్దేహవిఘాతి యైనజర దుర్వారంబు కాలుండు ము
ష్కరుఁ డొం డెద్దియు లేదు మేలు విమలజ్ఞానంబుకన్నన్ నిజం
బరయం బండితకోటికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 77

మ. ధనహీనుం డయి మిత్త్ర భృత్యరహితత్వం బొంది యర్థార్థి వ
చ్చిన నీయం దగఁ దప్పి దైన్యదశల న్జైడ్పడ్డవేళ న్సుప
ర్వనదీతోయపవిత్రకుంజయుత మాప్రాలేయశైలంబు మె
ల్లనఁ జేరం దగు జ్ఞానికి న్సురభిమల్లా వైదుషీభూషణా 78

మ. హితసాంగత్యము లిందుకాంతిసుఖముల్ శృంగారకావ్యంబు లి
ష్టతమావక్త్రములు న్విలాసవనము ల్సర్వంబు నత్యంతర
మ్యతరం బయ్యు ననిత్యతామతి జనింపం దద్దయుం దా నర
మ్యతరం బై కనిపించు నా సురభిమల్లా వైదుషీభూషణా. 79

మ. ఘనహర్మ్యంబులు కామినీలలితము ల్గానాదికంబు ల్మనం
బునకు సైన్పక కాదు తజ్ఞు లనయంబు న్గీటపక్షానిల
ప్రనటద్దీపశిఖాచయంబు లనుచు న్భావించి సుష్మా గిరుల్
వనము ల్చేరుదు రర్మిలి న్సురభిమల్లా వైదుషీభూషణా. 80

---

## శివార్చనము

శా. ఏనాఁడైనను నేజగాన నయినన్ దృగ్గత్యుఁ డైనన్ శ్రుతుం
డైనం గాఁడు తథావిధుండు విషయోద్యత్కుంజరీరూఢమ
ర్మానక్షీణమనఃకరిన్ నిలుప నౌరా యెవ్వఁడో సంయమా
లానం బయ్యెడు ధారుణి న్సురభిమల్లా వైదుషీభూషణా. 81

మ. శమసంపాదిని యైనవిద్య దొరకు న్సద్గోష్ఠి గల్గు న్మనో
దమనం బబ్బు నదైన్యవృత్తియును లబ్ధం బౌ నసంగప్రచా
ర మొగిం జేకుఱు నొక్క పుణ్యఫలసంప్రాప్తిన్ నిరూపింప శ
క్యము గాదెద్దియు జ్ఞానికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 82

మ. సుగుణశ్రేణు లనన్యగోచరము లౌచు న్నిత్త క్షీణింప నిం
పగు తారుణ్య మతిక్రమింపఁ దలఁపుల్ వ్యర్థంబులై పోవ ను
గ్రగతిం గాలుఁడు చేర రా జనులకు న్గౌరీకళత్రుండె ది
క్కౌను నంచున్ దెలియం దగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 83

మ. సకలస్థావరజంగ మైకవిభుఁ డౌశంభుండు సర్వాంతరా
త్మకుఁ డౌవిష్ణుఁడు వస్తుతత్త్వము దలంపంగా నభిన్నస్వరూ
పకు లయ్యున్ మది నాదుభక్తి పరమబ్రహ్మంబు భర్గుండె యం
చకలంకస్థితి భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 84

మ. కనదిందుద్యుతిపాండురంబు లగుగంగాసైకతక్షోణులన్
ఘనసంతోషభవాశ్రులై శివ శివా కాశీపతీ యంచు ను
త్కటనినాదంబుల బిగ్గరం బలుకుచున్ గాందారిమాందారి వే
శను ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 85

మ. తుద ము ప్పోఁ గద యంచుఁ గాఁపురపుసుద్దు ల్రోసి సన్న్యస్తసం
పదులై సాత్త్వికులై వనస్థలులు సంప్రాపించి సంపూర్ణశా
రదచంద్రాతప శోభమానిశల శర్వశ్రీపదాంభోజముల్
మదిఁ జింతింతురు పండితు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 86

శా. కాశిం జేరి త్రివేణి చెంగటఁ గటీకౌపీనమాత్రాంశుకుం
డైశీర్షంబునఁ గేలు మోడ్చుకొని శర్వా శంకరా శైలజా
ధీశా యంచు వచింపుచుం గడపుఁ బ్రీతి న్వాసరంబు ల్ఘనుం
డౌశిష్టప్రవరుండు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 87

శా. గంగాతోయముల న్సుపుష్పజలసంఘాతంబున న్విశ్వభ
ర్తం గామాంతకుఁ బూజచేసి పిదప న్ధ్యానంబు గావింపుచున్
తుంగగ్రావనిషణ్ణులై యలరుధన్యుల్ దైన్యసంతాపముల్
భంగం బంద సుఖింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 88

మ. అనవద్యుండును పాణిపాత్రకృతభిక్షాహారుఁడున్ నిస్పృహుం
డును శాంతుండు దిగంబరుండు నయి ధన్యుం డొంటియై భూతలం
బున వర్తింపుచు శంకరుం దలఁపుచున్ ముక్తాత్ముఁడై కర్మజా
లనిరాసం బిడుఁ జుల్కన న్సురభిమల్లా వైదుషీభూషణా. 89

మ. ఒకచో నిల్వక పాణిపాత్రకృతనిత్యోదాత్తభిక్షాన్నుఁడై
సకలంబు న్మదిలోఁ దృణోపమముగాఁ జర్చింపుచు న్యోగిభా
వకుఁడై కాంచునఖండబోధసుఖజీవన్ముక్తి చంద్రార్ధచూ
డకృపం గాని జనింప దా సురభిమల్లా వైదుషీభూషణా. 90

## అవధూతచర్య

మ. అనిశస్వైరవిహారుఁడై సతతభిక్షాహారుఁడై శూన్యకా
ననదేశైకశయాళుఁడై శిథిలకంథాజీర్ణకౌపీనుఁడై
ఘనయోగస్థిరుఁడై ప్రశాంతుఁ డయి వేడ్కన్భర్గువిజ్ఞాని శే
ల నగారిప్రముఖోన్నతు ల్సురభిమల్లా నైదుషీభూషణా. 91

మ. అలఘుజ్ఞానసమగ్రుఁ డౌవిబుధుఁ డాహా పద్మగర్భాండమం
డలమాత్రంబున కేల నాసపడు నానాశైలసంవాస మా
జలధిశ్రేష్ఠము చేఁప గంతు లిడినన్ సంక్షోభముం జెందునే
లలనానూతనమన్మథా సురభిమల్లా నైదుషీభూషణా. 92

మ. సపరిస్ఫూతపలాశపాత్రమున భైక్షం బెత్తి తద్గ్రాసభు
క్తిపరుం డౌనవధూతశేఖరుఁడు లక్ష్మీ తల్లి యొందేని నీ
కృప వే ఱొక్కెడ నిల్పు నిస్పృహుల మాయే మొల్ల మే మొల్ల మం
చపరాగస్థితి భాసిలు న్సురభిమల్లా నైదుషీభూషణా. 93

మ. నవతల్పం బిల దివ్వె చంద్రుఁడు వితానం బాకసం బంచితం
బవురించామర మందవాత ముపబర్హం బాత్మహస్తంబు నై
సువిరక్తిం బ్రియభామఁ గూడుకొని రాజుం బోలి సద్భూతితో
నవధూతేంద్రుఁడు భాసిలు న్సురభిమల్లా నైదుషీభూషణా. 94

శా. హీనాదానవిరక్తమార్గనిరతుండై గ్రామరథ్యాచల
న్నానాచీరసులబ్ధకంథుఁ డయి శాంతస్వాంతుఁడై భిక్షుఁడై
మానాహంకృతిశూన్యుఁడై జనపతిం బ్రాపింప కాత్మేచ్ఛ బో
ధానందుం డిల గ్రుమ్మరు న్సురభిమల్లా నైదుషీభూషణా. 95

మ. జడుఁడో భిక్షుఁడొ విప్రుఁడో వృషలుఁడో జ్ఞానాఢ్యుఁడో సిద్ధుఁడో
కడవాఁడో యనుచున్ జను ల్వారిఁబోరిన్ గన్గొంచు భాషింపఁగా
నుడువం డల్గఁడు సంతసం బిడఁడు తన్నుం గానియ ట్లుర్వి న
ల్గడ యోగీంద్రుఁడు క్రుమ్మరు న్సురభిమల్లా నైదుషీభూషణా. 96

మ. సతతంబు న్శుచిగా నయత్నత నహింసాసాధ్య మాఘూసవా
యుతలి న్వేసి మహీశయాళు వగు నేణోరంగమశ్రేణియా
కృతి యోగీంద్రుఁడు దాల్చు నవ్వడువు ధాత్రి న్సర్వధర్మోత్తమం
బతులాచారధురంధరా సురభిమల్లా నైదుషీభూషణా. 97

మ. మలరాపైఁ జదలేటియొడ్డుశిలలం బద్ధాసనాసీనులై
తలఁ బాత్రేశ్వరుఁ జేర్చి యోగమయనిద్ర న్భాసిలంగా మృగం
బులు మై రాచుకొన న్తపస్వులదినంబు ల్సద్దినంబు ల్సుమీ
లలితజ్ఞానధురంధరా సురభిమల్లా వైదుషీభూషణా. 98

మ. అమలం బౌకరపాత్ర తోర మగుభిక్షాహార మస్వల్పమై
సమహీతల్ప మఖండదిక్పటము నానందంబు సేయంగ సం
గమహాదైన్యవిముక్తులై మనుఘను ల్కర్మౌఘనిర్మూలనో
ద్యములై పొల్తురు సుమ్ము శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 99

శా. అంబా మేదిని మిత్ర తేజ సహజా యభ్రింబ తండ్రీ సదా
గంగా యాప్త జలంబు యుష్మదనుషంగప్రాప్తసత్పుణ్యని
ష్ఠం బొంపొందితి మీకు మ్రొక్కెద ననుజ్ఞాతుండనా యంచు బ్ర
హ్మంబుఁ గాంచు మనీషి శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 100

వైరాగ్యశతకము సమాప్తము.

---

మల్లభూపాలీయము సంపూర్ణము

---

శ్రీధరాయ నమః

పుష్పగిరి తిమ్మకవికృత

# నీ తి శ త క ము



ఉ. శ్రీలసమానభానుశిఖిశీతమయూఖరుచు ల్గ్రమించి ది
క్కాలపదాద్యుపాధులను గాంచక నంతము లేక జ్ఞానమా
త్రాలఘుతాద్వితీయపరమాకృతి స్వానుభవైకగమ్యమై
చాలవెలుంగు శాంతమయశాశ్వతతేజముఁ గూర్చి మ్రొక్కెదన్.

## మూ ర్ఖ ప ద్ధ తి

ఉ. బోద్ధలు మత్సరోచ్చలితబుద్ధుల నూఁకొనబో రహంక్రియా
బద్ధులు గావునన్ ప్రభులు బాళిమెయి న్వినలే రబోధపు
న్బద్ధతి నున్కిఁ దక్కెనయపండితు లొల్ల రసద్విభేదస
న్నద్ధసుభాషితంబు లివి నాతనువందె యణంగుఁగా కికన్. 1

ఉ. అజ్ఞుఁడు సజ్జనోక్తు లెటులైన విను న్సులభంబుగా విశే
షజ్ఞుఁడు చెప్పినంత సరసస్థితి నూఁకొను జ్ఞానలేశదు
ష్ప్రాజ్ఞుల దుర్విదగ్ధుఁ డగుపామరుఁ డేగతిఁ జెప్పఁబోయిన
న్ప్రాజ్ఞతఁ జెందఁ డజ్ఞుఁ డని బ్రహ్మయు రంజిలసేయ నోపునే. 2

చ. మకరముకోఱ నున్నవెనుమానికమైన హరింపవచ్చు దు
ష్కకచలదూర్మిఘోష మగుసాగరమైనఁ దరింపవచ్చు త్రు
త్కుపితభోగినైనఁ బువ్వుదండవలె న్దలఁ దాల్పవచ్చుఁ బా
యక ప్రతికూలమూర్ఖహృదయం బది త్రిప్పఁగరా దొకప్పుడున్. 3

చ. ఇసుకఁ బ్రయత్నత న్పిడిచి హెచ్చుగఁ దైలముఁ గ్రాచవచ్చుఁ బె
ల్లెసగెడుదప్పి స్రుక్క మృగతృష్ణజలంబులు గ్రోలవచ్చు నల్
దెసలుఁ జరించి యొక్కపుడు దేదొఱకున్ శశపున్విషాణము
న్పొసఁగదు దుర్వివేకి యగు మూర్ఖునిచిత్తము ద్రిప్ప నేరికిన్. 4

ఉ. బాలిశుచిత్త మేజనుఁడు బల్మి సుధోక్తులఁ ద్రిప్పఁబూనువాఁ
డీలవణాబ్ధిఁ దీపుఘటియింపఁగఁ బూనును దేనెబొట్టుచే

బాలమృణాళతంతువునఁ బన్నగరాజముఁ గట్టఁబోవు వ
జ్రాలను బెజ్జముల్ నునుపఁజాలు శిరీషసుమాంతసంహతిన్. 5

చ. పరమహితంబుగాఁ దగనుపాయముగా ననిశం బధీనమై
పరఁగెడునట్టు లజ్ఞతకు బల్వగుకప్పడ మొప్పఁజేసె ము
న్నరసిజగర్భుఁ డె ట్లనిన సర్వమెఱింగినవారిరచ్చలం
దెఱుఁగనివారి కాభరణ మెంచ విశేషపుమౌన మేకదా. 6

చ. ఎపు డొకయింతగంటి నని యేనుఁగురీతి మదించి యుంటినో
యపుడె సమస్తవిత్ప్రభుఁడనైతి నటంచు మదించె నామనం
బిపు డొకయించుకించుక బుధేంద్రులచెంత నెఱింగికొంటినో
యపుడె విమూర్ఖతాత్తదురహంకృతి వీడె జ్వరంబుకై వడిన్. 7

చ. తొరఁగెడుజొల్లున న్దడిసి దుష్టపుకంపునఁ జేరరాక లోఁ
బురువులు గాఱ నంజుడుచు పోడిమిలేనినరాస్థిఁ జొక్కుచు
న్నొఱికెడుకుక్క పార్శ్వమునకు న్జను దెంచిన యింద్రుఁ గాంచిన
న్వెరయదు శంక క్షుల్లకులు పొందిన తక్కువ లెక్కసేతురే. 8

చ. సురపురినుండి శంకరునిజూటము జూటము వాసి గట్టు గ
ట్టురువడి వీడి భూమి భువినుండియు వారిధి వార్ధి నిల్వ క
య్యురగులలోకము న్వెరసియు న్మెఱసె న్మఱిగంగ గావున
న్మొఱకులు స్థానము ల్విడిచి నూఱుముఖంబుల గాసిఁ జెందరే. 1

... ... ... ... ...

---

## విద్వత్పద్ధతి

చ. సురుచిరశాస్త్రపాఠపరిశుద్ధవచస్కులు శిష్టదేయసు
స్థిరనిగమాగము ల్గడుఁ బ్రసిద్ధులు నెఘను లేన్నృపాలుచేఁ
బొరసిరొ లేమి యక్కొఱదువ భూపతిదే ఘనులైనవారి లే
మరసి పరీక్షకుండు వెలయల్పము సేసిన రత్న మల్పమే. 1

చ. కనఁబడ దెవ్వరేబలిమిఁ గైకొనవచ్చిన నిచ్చలున్ సుఖం
బెనయఁగఁ జేయు నర్థులకు నిచ్చిన హెచ్చు యుగాంతవేళలం
దును జెడ దట్టివిద్య యను నూత్నధనంబు గడించికొన్నవా
రిని సవరింపనేరని కుభృత్తులతోడ విరోధమేటికిన్. 1

చ. అధిగతవేదశాస్త్ర పరమార్థులఁ బండితులైనవారి నీ
వధిప! నిరాకరింపవల దల్పతృణోపమ నీదులక్ష్మి య

య్యధికుల నడ్డగింపఁగలదా మదవార్యసితోరుగండభా
క్కుధరనిభేభరాజములకుం బిసతంతు వదేమి యడ్డమో. 13

చ. అల కమలాసనుండు మది నల్కవహించిననేని యంచపై
లలితసరోజినీవనవిలాసనివాసము మాన్పుఁగాకఁ దా
బలియుఁడ నంచు దానిదగు పాలును నీరును నేర్పరించు నే
ర్పులఁ గల సుప్రసిద్ధయశము న్హరియించుటకు న్సమర్థుఁడే. 14

చ. జలకము గంధమున్ గుసుమచారుశిరోజములున్ భుజాంగదం
బులు శశిగౌరహారముఖభూషలు మర్త్యు నలంకరింప లే
వలర నలంకరించు విమలాంచితసంస్కృతవాణి యొక్కటే
బొలుపఱు సొమ్ములెల్లచెడిపోవును వాక్యసుభూషణం బిలన్. 15

చ. నరులకు దాచిపెట్టినధనంబును చక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్యసుఖకారిణియున్ గురుకోటికి న్మహా
గురువు విదేశబంధువును గూర్చినదైవము రాజవశ్యమున్
వెరవు సువిద్యయే ధర నవిద్యుఁడె పో పశువర్థ మిట్టిదే. 16

చ. క్షమ మది నున్న నేల కవచం బరి యేటికి క్రోధమున్న దా
యమలయ నేల చిచ్చు పరమౌషధమేల సువృత్తు గల్గ మూ
ర్ఖమనుజుఁడున్న నేల ఫణి ద్రవ్యమదేల సువిద్యయున్న సి
గ్గమఱిన సొమ్ములేల కవితాఢ్యతగల్గిన రాజ్యమేటికిన్. 17

చ. పరిజనకోటిపైఁ గరుణ బంధులపై మొగమోట మల్పులం
దరతియుఁ బ్రీతి సాధుజనులం దిలజేనియెడ న్నయంబు తెం
పరులపయిన్ బుధాళియెడ స్వార్జవమున్ గురులందు నోర్పు బి
త్తరులెడ ధూర్తతం దెలుపు ధన్యులయందె తగు న్జగద్గతుల్. 18

చ. మతిఁగల జాడ్యము జ్జెఱచు మాటల సత్యము గూర్చు మాన ము
న్నతి నెనయించుఁ బాపములు నాశమొనర్చు మనంబున న్ప్రస
న్నత గదియించు దిక్కుల ఘనంబుగఁ గీర్తులు నించు సాధుసం
గతి యిఁక నేవిశేషములు గల్గఁగఁ జేయదు మర్త్యకోటికిన్. 19

చ. చతురమతిప్రసిద్ధియు వచళపరిశుద్ధి ప్రబంధవర్ధన
స్థితికలనాసమృద్ధిరససిద్ధియుఁ గాంచి యగణ్యపుణ్యభా
గతులితగీర్తి దేహధరులై సుకవీశ్వరు లెయ్యెడ న్జరా
మృతిజనితోగ్రభీతులు వహింపక యిప్పుడు నున్నవా రిలన్. 20

## శౌర్యపద్ధతి

ఉ. ఆఁకట స్రుక్కినన్ ముదిమి నంగము జిక్కినఁ గష్టదుర్దశ
లోఁకినఁ గాంతి దక్కిన నసువ్రజము ల్చనుచున్న డస్సిన
న్వీక మదేభకుంభపదపీపిశితస్పృహఁ జెందు సింగము
త్తాకట వాడుపు ల్మెసవునా యభిమాని మృగేంద్రుఁ డయ్యెడన్. 21

ఉ. స్నాయువసాదు లల్పములు నంజుడు లేదది పంకదూష్యమా
హేయపుటస్థిఁ గుక్క భుజియింపుచు రంజిలు దాన తృప్తునుం
బాయదు ప్రాప్తజంబుకము మాని మృగేంద్రము జించు నేనుఁగున్
డాయుదు రెల్లవార లతిడస్సియు శక్తికొలంది కోరికల్. 22

చ. బలువిడి తోఁకఁ ద్రిప్పి పతిపాదము లూనుచుఁ గ్రింద వ్రాలుచు
న్వెలికిల నేలపైఁ బడుచు వేమఱు నో రుదరంబె చూపుచు
న్నెలుకురు కుక్క కొక్కకడఁ బెట్టరు ధీరతఁ జూచుచున్ మదా
వళము భుజించుఁ జాటు శతవాక్కులపెన్గవణంబు లిమ్ములన్. 23

చ. ఎడతెగ కిట్లు సంసరణ మెల్లపుడున్ బరివర్తిలంగ నే
యెడ మృతిబొంది యెవ్వఁ డుదయింపఁడు పుట్టుక కేమి యెవ్వఁడీ
పుడమి జనింపఁ దత్కులము భూరిసమున్నతిఁ జెందువానిదే
యొడలును జన్మము న్భరువు లొక్కొకచోఁ బదికోట్లు పుట్టవే. 2

ఉ. మూసరవాసనైకకుసుమస్తబకాకృతి రెండువృత్తుల
న్భాసిలు మానశాలి యగు ప్రాజ్ఞుఁ డదెట్లనఁగాఁ బురంబు దాఁ
జేసినసర్వలోకములఁ జెల్వుగ నాదలదాల్పనుండు న
య్యాసలు బాసిన స్తపసి యై వనసీమల నుండు నెమ్మదిన్. 2

చ. అలగురుభార్గవప్రభృతు లైదుగురు న్మరుఁబొంద వారిపై
నలుగక శీర్షమాత్రయుతుఁ డయ్యును జూడు విశేషవిక్రమే
చ్ఛలు గలరాహుదైత్యపతి చంద్రదినేంద్రులఁ బట్టు నిర్వర
స్థలమునఁ బర్వవేళల యశంబున కింతె మహాద్విరోధమున్. 2

చ. ఘనుఁ డహిభర్త భోగఫలకంబునఁ దాల్చు జగంబులెల్ల నా
యన నలకూర్మరాజు చరమాంగమున న్భరియించు నాగునా
థ్యుని ధరియించు ఘోణిమణి యూనుఁ దదంగభరంబ నాదృతి
న్ననధి యయారె యార్యులయుదారచరిత్రము లౌ విచిత్రముల్. 2

ఉ. అకటఁ దరిద్రి క్లేశవశుఁడై కృశియింపఁగఁ గాంచుచున్న పై
నాకసనకు న్బయోధి భువనంబులఁ గూలుట నర్హ్మమాసడిం
జేకొనుకంటె దృప్తసురశేఖరభూరిశిఖాస్ఫులింగకీ
లాకరభీకరోరుకులిశాహతిఁ జచ్చినఁ గీర్తి గల్గదే. 28

చ. కరముఁ బ్రకాశమొందురవికాంత మచేతన మయ్యుఁ జూచితే
యొరపరికంబు కోప మొకయించుక భానుఁడు పాద మూదినన్
గఱకఱిఁ జెందినట్టు లధికత్వర మండెడుఁ జండతేజమున్
బొరసినపూరుషుల్ పరులు పూని యొనర్చునవజ్ఞ లోర్తురే. 29

ఉ. సింగము గన్న యక్కొదమ చిన్నదియయ్యు నభంగవాసనా
సంగతభృంగదానఝురసంఘమలీమసగండరంగమా
తంగవిభంగభంగులకు దాఁటు బలాఢ్యులకున్ స్వభావ మీ
యంగు వయోవిశేషము పరాక్రమసంపదకున్ బ్రధానమే. 30

---

## అర్థపద్ధతి

చ. కులము రసాతలస్థలిని గూలిన మంచిగుణం బధోగతిం
బొలసిన శీల మద్రితటభూమిని జాఱె విదగ్ధమైన ద్వి
ట్కులహరశౌర్యమందుఁ బిడుగుల్ పడినన్ గడుమేల్ ధనంబె కా
వలె నది లేనిచోఁ దృణలవంబులుగా గుణకోటు లిన్నియున్. 31

ఉ. వాఁడె కులీనుఁ డుత్తముఁడు వాఁడె రసజ్ఞుఁడు వాఁడె యార్యుఁడున్
వాఁడె బహుశ్రుతుండు మఱి వాఁడె గుణాఢ్యుఁడు వాఁడె వక్తయున్
వాఁడె సురూపి యంచు ధనవంతుని నందఱు నెంతు రెంతయున్
బోఁడిమిగాన సర్వగుణముల్ గనకాశ్రయభూతము ల్గదా. 32

చ. కుమతులరోచనన్ నృపతి కూటమిచే యతి లాలనన్ సుతుం
డమహితవిద్య విప్రుఁ డసదాత్మజుచే గుల మల్పుచే సుశీ
లము త్రప హేలచేఁ గృషి యలక్ష్యతఁ జెల్మి ప్రవాసవృత్తి వి
య్యమ రతిదుర్ణయాప్తి సిరి యర్థము లీవిఁ బ్రమాదతన్ జెడున్. 33

చ. అనుపమదానభోగవిలయంబు లన న్దగు మూఁడుమార్గముల్
దనరు ధనంబునం దది యుదారమతిన్ మనుజుం డెఱింగి దా
ననుభవి గావలెన్ బుధుల కర్థుల కీవలె లేక మూలయిం
టనె పెనుకొంత్షు దాప నది దక్కుదు మూఁడవత్రోవఁ గైకొనున్. 34

ఉ. శాణవిలీఢరత్న మవిసందళితాంగజయాఢ్యుఁడున్ మద
క్షీణగజంబు నిర్జలవిశీర్ణతలసైకతశారదాపగా
శ్రేణి కళావశిష్టశశి చెల్వునిచే రతిఁ జిక్కు బాల వి
త్రాణనలీలఁ బేదగిలురాజులు మింతురు కార్శ్య మొందియున్. 35

ఉ. చేరెడుగంజికోస మొరుచెంగటి కేగుచు డస్సియున్నవాఁ
డే రమఁ జెంది పెక్కు జగమెల్లఁ దృణంబుగ నెంచు నర్థముల్
మీఱిన యందునన్ దుదను లేక యణఁగినయందున న్నరున్
జేరును బెక్కువస్థలు గృశించుట మించుట దాననేకదా. 36

చ. తడవ నిబద్ధి యొక్కపుడు దబ్బఱ యొక్కెడ నిష్ఠురోక్తు లొ
క్కెడఁ బ్రియవాద మొక్కపుడు హింస యొకప్డు దయాళుభావ మొ
క్కెడ ధనకాంక్ష యొక్కపుడు నిచ్చుట లొక్కెడ వెచ్చ మొక్కెడన్
గడన యొకప్డుగా గణికకైవడి నానృపనీతి నైకతన్. 37

చ. ఇలయనుధేనువు న్బిదుక నిచ్చ జనించిన నేని రాజ నీ
వెలమిని దూడఁ బెంచినటు లెప్పుడు లోకముఁ బ్రోవవయ్య నీ
వలన జనంబు లెస్సయయి వర్ధిలుచుండినఁ గల్పవల్లియుం
బలె సకలేప్సితార్థఫలవర్గము లీధర యీనకుండునే. 38

ఉ. భూరితరాజ్ఞకీర్తియును భూసురరక్షయుఁ బాత్రదాతయై
మీఱుట భోగమొందుటయు మిత్రులఁ బ్రోచుట నాఁగ నొప్పునీ
యాఱుగుణంబు లేనృపులయందు రహింపవొ వారి నూరకే
యారడిఁ గొల్వనేల గలదా ఫల మాశ్రితకోటి కెంతయున్. 39

చ. వనజభవుండు ము న్నొసట వ్రాసిన దెంతయొ యొంతకొంచెమో
ఘనమొ సురాద్రి నున్న మరుఘట్టముఁ జేరిన వచ్చు హెచ్చు రా
దనఘ వృథావ్యథ ల్గనకు మాఢ్యులచెంత ధరింపు ధైర్య మూ
నిన ఘటి కెచ్చునే జలము నీరధి ముంచిన నూత ముంచినన్. 40

---

## దుర్జనపద్ధతి

ఉ. కారణ మింతలే కొకరిఁ గాంచినఁ గిన్కవహించు టాత్మని
ష్కారుణికత్వ మొందు చోరుకాంతఁ దలంచుట లన్యవిత్తముల్
గోరుట బంధులు న్సుజనులు న్గను మేలు సహించకుండుటల్
క్రూరవిచారు లౌనరులకున్ మృషగాదు స్వభావసిద్ధముల్. 4

చ. లలితకళావిలాససమలంకృతుఁ డైనను దుర్జనుండు చెం
తల వసియింపఁగాఁ దగఁ డనర్హుఁడు వానిఁ ద్యజింపనే తగున్
గలితనవారుణారుణధగద్ధగితోరుఫణామణిప్రభల్
గల వని చెంతనున్న భయకంప మొనర్పదె సర్ప మేరికిన్. 42

చ. త్రప జడవృత్తి సద్వ్రతము దంభము శుద్ధత మైదుబాటు ని
ష్కృపుఁడు గురుం డబుద్ధి ప్రియరీతులు వల్కుట దైన్యవృత్తి తే
జపుఁబస గర్వమా స్థిరుఁ డశక్తుఁడు వక్త బహుప్రజల్పుఁ డం
చెపుడును నిందసేయు ఖలుఁ డేసుగుణంబిఁక వాఁడు మెచ్చునో. 43

చ. అవగుణ మేల లోభ మెనయన్ గొలలేటికి గొండెమున్న స
త్యవచన మున్న నేల తప మాత్మశుచింగన దీర్థ మేల మే
లవుసుజనత్వ మేల సుగుణాళిమహత్త్వమె చాలు సొమ్ము లే
ల విభవ మేలు విద్య ప్రబలన్ సడిఁ జెందిన మృత్యు వేటికిన్. 44

చ. పగలిటఁ గాంతిలేనిశశి పాయముదీఱినభామ పద్మినిం
దగులమి రిత్తయౌ కొలను నక్షరరూపవదాస్యమున్ ధనా
శగలప్రభుండు లేమి ననిశంబు గృశించు బుధుండు భర్తయో
లగమున నుండుసూచకుఁ డిలన్ విడఁగూడని సప్తశల్యముల్. 45

ఉ. ఆతతచండకోపదహనాక్షయరూక్షకటాక్షు లైనధా
త్రీతలనేతలందుఁ గలదే తనవారను ప్రీతి తప్పినన్
ఘాతయ సేయఁజూతు రధికత్వర మండెడువహ్ని వ్రేల్చుచో
హోత నటంచు నంటుకొన నోర్చి శీతలవృత్తిఁ జూపునే. 46

ఉ. ఊరకయున్న మూఁగ వచనోద్ధతిఁ జూపిన గొంటు చేరువన్
జేరిన దంట దవ్వుల వసించినచో ననమర్థుఁ డోర్పుతో
నోర్చికొన్న భీరుఁడు దురుక్తులు సైఁచిన జాతిహీనుఁ డం
చారడిఁ బుట్టు రాజు వశమా నృపసేవ యగమ్య మేరికిన్. 47

చ. సకలబలావళిన్ బ్రియమెసంగఁ బ్రకాశ మొనర్చి హెచ్చి పా
డికిఁ జొరలేక తామును ఘటించినదుష్టతమాధమక్రియా
ప్రకరము లన్నియున్ మఱచి భాగ్యముచే సిరిఁ జెంది సర్వమా
పకుఁ దగుదుష్టదృష్టిఁ బడి సౌఖ్యము లెవ్వరు గందు రిమ్మహిన్. 48

ఉ. హెచ్చిలు దొల్త పిమ్మట క్షయించును రేపటిపూఁటనీడ నాఁ
గుచ్చితుచెల్మి దొల్త గడుకొంచెమ యై మఱి మీఁద హెచ్చుచున్
వచ్చు వివేకిమచ్చిక ధ్రువంబుగ మాపటిపూఁటనీడ నా
నిచ్చలు నిత్తెఱం గెఱిఁగి నెయ్యము సేయఁదగు న్వివేకితోన్. 49

ఉ. నీరముఁ బూరి సంతసము నిచ్చులు జీవనమై పొసంగ నె
వ్వారికిఁ గీడు సేయకఁ బ్రవర్తిలు మీనమృగార్యులందు ని
ష్కారణవైర మూనెదరు కష్టులు దాశకిరాతసూచకుల్
వారిజగర్భుకట్టడయొ వారిదయారహితస్వభావమో. 50

---

## సుజనపద్ధతి

చ. పరగుణరీతిఁ బ్రీతి గురుపట్ల వినీతి బుధాప్తివాంఛయున్
దఱచుగ విద్యనాస్థయు స్వధర్మిణిపై రతి లోకనిందలన్
వెఱపు శివార్చ భక్తి మతి నిగ్రహశక్తియుఁ దుష్టసంగమం
దరతియుఁ గూర్చి యొప్పెడుమహాత్ములఁ గూర్చి నమస్కరించెదన్. 51

ఉ. ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పుఁ బ్రౌఢవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున న్పరాక్రమా
టోపము కీర్తి నిచ్చయుఁ గడున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్పఁ బ్ర
జ్ఞాపరు లొప్పుచుందు రివి సాజములై తమయందుఁ బొందఁగన్. 52

చ. కరమున శ్లాఘ్యదాన మెసఁగన్ దల శ్రీగురుపాదవందనం
బొరయ ముఖంబు సత్యరమఁ బూన జయాస్పదవృత్తి బాహులన్
మెఱయ మహోచ్ఛవృత్తి మది మించ శ్రుతంబు శ్రుతిద్వయిన్ దగన్
సిరులు వినా విభూషలుగఁ జేయుదు రీగుణముల్ మహామహుల్. 53

చ. ఒకరిధనంబుఁ గోర కనృతోక్తులు బల్కక వధ్యునైనఁ జం
పక తగువేళ నీవి కలమాత్రము మానక నవ్యుఁ గూర్చి ప
ల్కక గురుభక్తి వీడ కతికాంక్షల గూడక భూతమైత్రిఁ బా
యక నరుఁ డున్న మంచితెరువంచు శ్రుతుల్ స్మృతు లెంచు నెప్పుడున్. 54

ఉ. సంపదఁ గన్నవేళ గుణశాలులచిత్తము క్రూరవృత్తి వ
ర్తింపక నూత్నపల్లవశిరీషసుమోత్పలకోమలస్థితిన్
సొంపువహించు నాపదలు సోఁకినవేళ విశాలశైలని
ష్కంపతటస్థలస్ఫురదఖండశిలాకృతి కర్కశంబగున్. 55

చ. నయగతి బ్రీతి ప్రాణములు నాశిలినన్ మలినత్వ మింతలే
మియుఁ ఖలు లన్నఁ జేరమియు మిత్రుల నొచ్చియుఁ వేఁడఁబోనియు
న్కియుఁ వెతలందుఁ దాల్మియు మనీషులజాడ మెలంగుటల్ బుధా
శయములు కత్తిమీఁది పెనుసాము లివెవ్వరిచేత నేర్పిరో. 56

ఉ. ఎంతయినన్ సుగుప్తముగ నిత్తురు సజ్జను లిల్లుఁ జేరఁ బూ
జింతురు ప్రీతిఁ జేసినది సెప్పరు మేల్ సభ నెంతు రన్యుమె

ప్పింతన కుగ్గడింతు రనయింతురు శ్రీగలగర్వమంచిత
స్వాంతులు కత్తిమీఁదిపెనుసాము లివెవ్వరిచే నెఱింగిరో. 57

చ. బలువుగఁ గ్రాఁగునయ్యినముపైఁ బడుతోయకణంబు నాశిలున్
బొలుపరి తామరాకుపయి ముత్యమురూపున నిల్చుఁ గొంతసే
పల జలబిందువే యుదధియందలి శుక్తిని వ్రాలి ముత్యమై
మలయును తత్సమం బధమమధ్యమసత్తమసఖ్యముల్ క్రియల్. 58

చ. తగునడవళ్లఁ దండ్రికి ముదం బొదవించినవాఁడె పుత్త్రుఁడున్
మగనికి సంతసం బెసఁగ మక్కువఁ జూపినదే పురంధ్రి ప్రే
మ గలిగి కల్మిలేముల సమంబుగ వర్తిలువాఁడె మిత్త్రుఁ డీ
ముగురు లభింతు రచ్ఛమతి మున్ సుకృతంబు లొనర్చువారికిన్. 59

చ. ఒరులకు నమ్రులై ఘనత నొంది పరస్తుతి నాత్మసద్గుణ
స్ఫురణ వెలార్చి యన్యపనిఁ బూనియు స్వార్థములు న్వహించి ము
ష్కరులదురుక్తియుక్తు లతిశాంతినె మార్చి తదార్తికారులై
యరుదగుచర్యల న్మెలఁగు నార్యులు పూజ్యులు గారె యేరికిన్. 60

---

## పరోపకారపద్ధతి

చ. ఫలములఁ బిక్కటిల్లియును బాదపముల్ గను నమ్రభావమున్
జలధరపఙ్క్తి దవ్వుల నెసంగియు నమ్రత నిచ్చుఁ దోయముల్
గలిమిఁ జెలంగియున్ ఘనులు గర్వముఁ జెందక యుందు రింతయున్
దలఁపఁ బరోపకారు లగు ధన్యులకైన స్వభావకృత్యముల్. 61

చ. చెవు లురుకుండలద్యుతులచేతను గాదు శ్రుతి న్వెలుంగు ర
త్నవలయయుక్తి గాదు కయి దానముచేఁ జెలఁగున్ దయామతిన్
సవురగువారిదేహములు చందనకుంకుమచర్చచేతఁ గా
దవనిఁ బరోపకారమహిమాతిశయంబునఁ జాలశోభిలున్. 62

చ. జలజపరంపరన్ సురుచిసంపద నింపు నినుండు కైరవో
త్పలనికరంబుల న్గరము భాసిలఁ జేయు సుధాంశుఁ డంబుదా
వళి తనయంతఁ దాఁ గురియు వర్షము హర్షముఁ జెంద లోక మి
ట్లలఘుమతుల్ స్వయంగతపరార్థహితుల్ సుకృతుల్ దలంపఁగన్. 63

చ. ఒరులపనుల్ ఘటింతురు నిజోద్యమముల్ ద్యజియించి యుత్తముల్
పరులపనుల్ స్వకార్యములు బాయక పూనుదు రర్వి మధ్యముల్
పరహితముల్ నిజార్థరతి భగ్న మొనర్తురు మర్త్యరాక్షసుల్
పరహిత మూరకే చెఱచుపామరు లెవ్వరొ తోఁచ దాత్మకున్. 64

ఉ. పాపము సేయనీఁడు హితపద్ధతిఁ గూర్చు రహస్య మాపనుల్
దాపను జూచు సద్గుణవితానము లంద జెఱుఁగ నెంచుఁ దా
నాపద వచ్చిన న్విడువఁ డక్కఱవేళల నిచ్చుఁ దీర్చు సం
తాపము మంచిమిత్రుఁ డని తద్గుణముల్ బుధు లెంతు రెంతయున్. 65

చ. తనుఁ గలసెఞ్ జలంబు లని దానికిఁ బాల్ స్వగుణం బొసంగి వెం
టనె యది గావఁగాఁబడు నెడఞ్ జల మోర్వకఁ గాక నింకె న
య్యనుఁగువిపత్తు సైఁపక మహాగ్నిఁ బడంగఁ దొడంగెఁ బాలు గ్ర
క్కున జలమంతలోఁ గలయఁ గ్రమ్మఱ నిట్టివి సాధుమైత్రులున్. 66

ఉ. ఇందె శయించినాఁడు కమలేశ్వరుఁ డిందె వసించెఁ దద్విప
ద్బృందము లిందె చెందె శిఖరిచ్ఛటలుఞ్ శరణంబు బాడబం
బుం దగె నిందె యిందె ఘనపుష్కలముఖ్యము లున్న వద్దిరా
యెందునుఁ గాన మెంతబరు వీజలధీంద్రుని మేను బూనెడిన్. 67

ఉ. ఆతతలోకధారిచరమాంగలసత్కమఠేంద్రుఁ డొక్కఁడే
జాతుఁడు జన్మమన్న ధ్రువజన్మమె సద్గ్రహచక్రవర్తన
స్ఫీతతక్రిందమీఁద హితశీలురుగానిజడుల్ వృథాఛదా
బ్జాతభవాండభాండఫలజంతుసముల్ మృతజాతులేటికిన్. 68

ఉ. ఆస నడంపు మాను క్షమ యానకు గర్వము నాడు సత్యమే
దోసము సేయఁబోకుము బుధు ల్సుత్రోవనె పొమ్ము విద్వదు
ల్లాస మొనర్పు ముగ్రరిపులఞ్ శమియింపు వహింపు కీర్తి సం
త్రాసులఁ బ్రోవు సద్గుణము దాపు మివే కద సాధుకృత్యముల్. 69

చ. మనసులు వాక్కు లంగములు మానితపుణ్య సుధాప్రపూర్ణతం
దనర నిజోపకారు లుదితత్రిజగజ్జనులై పరు ల్భరిం
చినపరమాణుమాత్రగుణశీలము లద్రులు చేసి హర్షతో
యనిధుల నోలలాడుచు మహామహు లుందురు కొంద ఱిద్ధరన్. 70

---

## ధైర్యపద్ధతి

చ. అమరులు వార్ధిఁ ద్రచ్చునెడ నందుదయించినరత్నపాళి హ
ర్షము గన రాహాలాహలవిషంబున భీతి వహింప రాత్మన
య్యమృతముఁ గన్నదాఁక విడ రప్పని యేతెఱఁగైన ధీరస
త్తములు సునిశ్చితార్థ మవుదాఁక ప్రయత్నము మాననేర్తురే. 71

ఉ. ఊనిన నేడ విఘ్నమగునో యని నీచులు భీతిఁ గార్యమే
పూనరు మధ్యముల్ దొలుతఁ బూనియుఁ బూనక విఘ్నమైనచో

మానరు రెన్నివిఘ్నములు మాటికి వచ్చిన నెంత నొచ్చినన్
మానరు తాము పూనిన సమంచితకార్యము ధీరమానసుల్. 72

చ. ఒకయెడ భూమినే బరుఁడు నొక్కెడఁ బాన్పున నుండుఁ గూరలే
గొకయెడ మెక్కు లోఁగొను రసోదన మొక్కెడ బొంతఁ బూను పై
నొకయెడఁ గట్టు దుప్పటము లొక్కెడఁ గార్యభరార్థి కిన్ మన
స్వికిఁ గలదే సుఖాసుఖవిశేషవిధాగణనాప్రసంగముల్. 73

ఉ. నీతు లెఱుంగువారు తమనింద ఘటించిన నెంచినన్ మహా
భూతులు బాయకున్న నవి బోయిన చావపుడైనఁ గల్పసం
ఘాతవిరామకాలములఁ గల్గినఁ గల్గెడుగా కొకప్పుడున్
నీతిపథంబునం జెదర నేరరు ధైర్యరమాధురంధరుల్. 74

చ. యువతికటాక్షవీక్షణశరోద్ధతి ప్రక్కలుగా కురుక్రుధా
పవనసఖోపతాపములఁ బాకముచెందక లోభపాశము
న్దవులక దుర్వ్యథాస్పదపృథగ్విషయాశల గాసిఁ బొందకే
యవిరళపుణ్యబుద్ధిఁ దగునాతఁడు గెల్చు సమస్తలోకముల్. 75

ఉ. ఎంతదురంతచింత ఘటియించియు ధీరునియంతరంగసం
క్రాంతనితాంతధైర్యరమ గ్రాఁప నశక్యము ప్రజ్వలచ్ఛిఖా
వంతు నొకింత క్రిందుగను వంచిన వంచఁగవచ్చుఁ గాక దు
ర్దాంతతదంతరస్ఫురదుదగ్రశిఖావళి వంపఁగూడునే. 76

చ. హిమగిరితుంగశృంగమున కెక్కి తదుగ్రతటస్థలంబునన్
డుమికిన మేలు తద్విషమదుష్టశిలాహతి మేను వ్రయ్యలై
న మఱియు మేలు వ్యాళవదనంబునఁ గే లిడుకొన్న మేల్ శిఖిం
గుమిలిన మేలటంచు ననఘుల్ విడఁజాలరు శీలసంపదన్. 77

చ. జ్వలనుఁడు తోయమౌ జలధి స్వల్పపుకాలువఁ బోలు కొంచమౌ
శిలయగు కాంచనాచలము సింహము లేడి యగున్ మహోరగం
బలరులదండయౌ విషముఁ ద్రావ సుధారసమౌ జగద్ధితా
కలితసుశీల మేఘునికాయమునం దగు నట్టిమేటికిన్. 78

చ. అసదృశసద్గుణాస్పదయు నార్యము నిర్మలచిత్తయైనత
ల్లి సరిగఁజూచి లజ్జ విడలేక భరించిన సూనృతవ్రత
వ్యసనులు దీవ్రతేజులు నిజాసుచయంబయినన్ సుఖంబుగా
మసలక మాననోపుదురు మానగలేరు కృతప్రతిజ్ఞలన్. 79

చ. కలిమికి సజ్జనత్వము శూరతకుఁ బూనమి బల్మి కోర్చుట
తెలివికి విద్యయున్ వినయదృష్టి ధనాప్తికిఁ బాత్రదానమే

యలుగమి సత్తపస్యకు మహాప్రభువృత్తికిఁ దాల్మి ధార్మిక
చ్ఛలకవిభూషణంబు లగు సర్వగుణాద్యము శీలమే సుమీ. 80

---

## ——దై వ ప ద్ధ తి——

చ. గురుఁడు ప్రబోధకుం డశని ఘోరపువా లమరుల్ స్వసైనికుల్
పురి దివి దంతి యభ్రకరి పోరసహాయుఁడు దైత్యభేది యి
ట్లరుదగుబల్మి గల్గియు బలారి బలా రిపుధాటి కోడఁడే
శరణము దైవమే పురుషశక్తి వృథా యదిరోల కాల్పనే. 81

చ. అసువుల నాస గ్రుంగఁ దనువంతయుఁ బెద్ద ముడుంగ నింద్రియో
ల్లసన మణంగ నాఁకట నలంగుచు నోటన రేయి యెల్క బె
ట్టెసరఁగఁ దానపడ్డలరిడిగ్గన లోఁగొను భోగి తత్సుషన్
వెసఁ జను దైవమిచ్చు క్షయవృద్ధుల స్వస్థత నుండుఁడీ జనుల్. 82

ఉ. లేవడిఁ బొందియున్ వెతల లీనతఁ బొందియు లేచు గ్రక్కునన్
దైవబలంబునన్ బుధుఁ డుదారతఁ గందుకవృత్తి హత్తి దు
ర్భావుఁడు తద్విధంబున విపద్దశ వచ్చిన నొచ్చి నాశిలున్
లేవక మంటిముద్ద ధరణిం బడి యట్టెయణంగునై వడిన్. 83

చ. వడి నెద యెండ బట్టతలవాఁ డొకఁ డెండను నెత్తిమండ నల్
గడలను నీడచోటరసి కానక దవ్వుల తాటిచెట్టు గ
న్పడఁ జని క్రింద నిల్వ నల పండు పడన్ దల బ్రద్దలయ్యె నె
య్యెడలకుఁ జన్న దైవహతు నించుక డించక ముంచు నాపదల్. 84

చ. గజభుజగంబులం బలుఖగంబుల గట్టుట సూర్యచంద్రులన్
గజిబిజిచేసి దుర్గ్రహము క్రౌర్యమునన్ గబళించి యేచుటల్
బుజుమతు లౌమహాత్ములు దరిద్రత వేగుటఁ జూచి యయ్యయో
నిజగతి నెంతచేసె నతినిష్ఠురదైవ మటంచుఁ గుందుచున్. 85

చ. సరసగుణాద్యశేషగుణసంపద నిల్వ నిధానమా మహా
పురుషశిఖామణిన్ భువికి భూషణరాజముగా సృజించి య
త్తఱి క్షణభంగురంబుగను వాని నొనర్చినయేని యేటికే
ర్పరి విధి యాతఁ డూడిన యపండితభావము కష్ట మక్కటా. 86

చ. అతులసుధారసైకనిధియై సకలౌషధులేలునాథుఁడై
శతభిషగన్వితోద్గమనసంభృతుఁడై శివమౌళిభాగలం
కృతమణియై వెలుంగుశశి యెప్పుడు బాయఁడు రాజయక్ష్మ హా
హతవిధిపాక మేదొరలకైనను దాఁట నలంఘ్యమేకదా. 87

చ. హతవిధి యస్థులాలవరుఁ డాత్మ యనందగుమృత్తికన్ బలో
ద్ధతిఁ గొని ముద్దచేసి వ్యధ యన్ బృహచక్రముఁ జేర్చి యాపదు
న్నతఘనదండఘాతన మనంబను బల్మిఁ ద్రిప్పుచున్నవాఁ
డతఁ డికఁ నేమిసేయునొకదా చెలికాఁడ యెఱుంగ నేమియున్. 88

చ. చెడుపను లూనియే యలఁతఁ జెందెద వీయడియాస మాను మో
జడవిధి యాపదల్ బెనిచి సాధులధైర్య మడంపఁ బూనినన్
జెడ దది కల్పసంక్షయవిశీర్ణనిజక్రమపర్వతంబులో
యడఁపఁగ నింకఁ జేయఁగ నవార్యపయోధులొ యామహాత్మకుల్. 89

చ. పలివిధి యేమి యెవ్వనికిఁ బ్రాప్తమొనర్చునొ వచ్చునంతయే
యతనికి నీచసంశ్రయమహాశ్రయముల్ గుఱిగావు సర్వది
క్ప్రతతులు నిండి మేఘములు ప్రత్యహముం గుఱియంగ నేయభీ
ప్సితములు గల్గె ద్విత్రిజలబిందువులే కద చాతకాళికిన్. 90

ఉ. అంబుజబాంధవుం డహరహంబును దగ్గరివారిఁ గూడియే
యంబరఖండమాని తిరుగాడుచునుండును గ్రుంకుదాఁక న
య్యంబరఖండ మొందియె సుధాంశుఁడు ద్రిమ్మరు రాత్రులెల్ల దై
వం బె ఘటించినన్ గడవవచ్చునె దుర్గతి యెంతవారికిన్.

---

## కర్మపద్ధతి

ఉ. ఆనతిసేతునోసురల కయ్యమరుల్ హతవిధ్యధీనులే
యానిఖిలైకవంద్యుఁ డజుఁ డాతఁడు కర్మఫలప్రదుండె క
ర్మానుగుణంబు తత్ఫల మజాదులచే నగుటేమి పద్మజుం
డేనియు కర్త కాఁడు ప్రభు వింతకుఁ గర్మముగాన మ్రొక్కెదన్. 91

చ. నెఱి నజు నండభాండకృతి నేమపుఁగుమ్మరిఁ జేసె నెద్ది శ్రీ
హరిని దశావతారగహనాప్తిని సంకటపెట్టె నెద్ది శం
కరునిఁ గపాలపాణిపుటకంబున భిక్షకుఁ జొన్పె నెద్ది భా
స్కరు దివిఁ ద్రిప్పు నెద్ది యల కర్మముఁ గూర్చి నమస్కరించెదన్. 92

చ. కొఱగును సాధుగా మొఱకు కోవిదుగా నలి మిత్రుగా నగో
చరము సుగోచరంబుగ విషం బమృతంబుగఁ జేయు నెద్దియా
స్థిరతరసత్కృతిన్ భగవతిన్ భజియింపు మభీష్టసిద్ధికో
నరనుత మానితామితగుణంబుల నేల వృథాస్థఁ జెందఁగన్. 93

చ. సురుచిరకర్మమున్నపుడు సున్నపుమిద్దెలు చిన్నిపాయపుం
జెఱవలు తెల్ల నౌ గొడుగునీడల హెచ్చిలు లచ్చియున్నిరం

తరమయినట్టు లుండు నది తప్పిన నెంతయుఁ గంతుసంగరాం
తరహతతంతుమౌక్తికవితానగతిన్ విలయై పడిన్ జెడున్. 94

చ. గుణమగుణంబు నైన క్రియ గోరి యొనర్పఁగఁ బూనుపండితా
గ్రణి మునుమున్నె సేయ దగు కర్మము పాకము నిశ్చయించి ని
ర్వ్రణమతి చేయఁజెల్లు శుభవత్క్రియ లెంచక చేసినన్ దదు
ల్బణఫల మబ్బు దాఁకఁ గృతిపాకము హృద్గతినేర్చు శల్యమై. 95

చ. జననము కర్మభూమిఁ గని సత్క్రియలేనిజడుండు చందనేం
ధనముల నువ్వుపొట్టు రతనంపుఘటంబున వండువాఁడు కాం
చనహలమూని క్షోణి దివసప్రభు దూవికి దున్నువాఁడు బా
య నటికి కప్పురంపువెలు గారికచేనికిఁ బెట్టువాఁడగున్. 96

చ. సుమహితరూపమున్ గులము శుద్ధపుశీలము విద్యయున్ బ్రయ
త్నము గలరాజసేవ విదితంబులె నిక్కము పూర్వజన్మపు
ణ్యముల జనించుసంచితసమంచితభాగ్యములే ఫలించుఁ గా
లమున ఫలించువృక్షములలాగున సత్యము మర్త్యకోటికిన్. 97

చ. జలముల ముగ్గఁగాక సురశైలము పైకొనుఁగాక శత్రులన్
బెలుకుర సేయుఁగాక కృషి బేరము సేవలు సేయుఁగాక వి
ద్య లెఱుఁగుఁగాక పక్షివలె నభ్రగతిన్ జనుఁగాక యెంతగా
సిలినను రాదు రానిది గ్రహించ దవార్యము కర్మపద్ధతిన్. 98

చ. అడవులనైనఁ దోయములనైన విరోధులలోననైన మం
డెడుదవమధ్యమందయిన నీరధినైన మహాద్రినైన నె
క్కడనయినన్ బ్రమాదగతిఁ గాంచిన నిద్ర వహించినన్ భరం
పడి విషమస్థితుం డయిన ప్రాక్సుకృతంబులె బ్రోచు మర్త్యునిన్. 99

ఉ. ఘోరవనంబు పట్టణ మగున్ జనులెల్ల స్వకీయుఁ లౌదు రి
ద్ధారుణియంతయున్ ధననిధానమణీగణపూర్ణయై తగున్
భూరిలరై కసత్క్రియలు పూర్వభవంబునఁ జేసి యున్నిటం
గౌరవ మొందు ధన్యులకు గావున ధర్మము సేయఁగాఁ దగున్. 100

చ. ఉరుగుణయోగి భర్తృహరియోగి చమత్కృతి సంఘటింపఁగాఁ
గరము దనర్చు నీతిశతకం బడిబట్టి తెనుంగుబాసచేఁ
బిరమొప్పఁ జెప్పెఁ బుష్పగిరితిమ్మన చంపకమాలికాపరం
పరలు శివాంఘ్రిపూజలుగఁ బండితు లెంతయు సంతసింపఁగన్. 101

నీతిశతకము సమాప్తము.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1954